శ్రీ.

# చంపూరామాయణపీఠిక.

## కవికాలనిర్ణయము.

ఈకృతి యొనర్చినకవి కవిరాజకంఠీరవబిరుదాంకితుఁడును వాసిష్ఠగోత్రజుఁడును నగుఋగ్వేదికవి వేంకటాచలపతి. ఆశ్వాసాంతగద్యములయందు "ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకరసుధాకరుఁ" డని తన్ను వర్ణించికొనుటచే నీతనితండ్రిపేరు తిరువేంగళార్యుఁ డైనట్లు తెలియుచున్నది. మఱియు గ్రంథావతారికలోఁ దాను "తిరువేంగళార్యకవిరాజసమాశ్రయ ధన్యచిత్తవర్తనుఁ" డనియు—

"అత్తిరువేంగళార్యుని యుదారదయావిలసత్కటాక్ష సం
పత్తినుదీర్ణమైన సుకుమారవచఃప్రతిభానిరూఢి ను
ద్యత్తరగద్యపద్యచయ మాశుగతిన్ రచియింప నేర్చి"

ననియు వ్రాసికొనుటచే నీతని కవితాగురువు కూడఁ దిరువేంగళార్యుఁడైనట్లు కన్పట్టుచున్నది. ఈతిరువేంగళార్యు లిరువురు భిన్నపురుషులై యుందు రని తోఁచుచున్నది. అట్లు కానిచో గురువును వర్ణించునవసరమున నతఁడు తనతండ్రియే యని చెప్పకుండునా?

కవికాలమునునిర్ణయించుటకుఁ దగినయాధారములు కొన్నిగ్రంథమునందే యున్నవి. వానిలోఁ గృతిపతివంశావతారము ముఖ్యమైనది. ఈకృతిపతి యిప్పుడు కార్వేటినగరసంస్థాన మని వాడఁబడుచున్నదేశమున కధిపతియైన వెల్లంటి కసవరాజు. ఆదేశమునకుఁ దొండమండలము, తుండీరమండలము నని పూర్వనామములు. ఆంధ్రజైమినిభారతకృతిపతి యగుసాళువనరసింగరాజు మొదలగు సాళువరాజులు పూర్వ మాదేశమును బాలించిరి. వారిపిదప మాకరాజు వంశ్యులు రాజులైరి. ఈమాకరాజుకులములోఁ జేరిన తిరుమలరాజునకే చదలువాడ మల్లయకవిప్రణీత మైన విప్రనారాయణచరిత్ర మంకిత మైనది. కొంతకాలమునకు రాజ్యము మాకరాజువంశమునుండి దౌహిత్రభాగముగా వెల్లంటివారికి సంక్రమించినది. ఈమార్పెప్పుడు జరిగినదో స్పష్టముగాఁ దెలియదు. ప్రస్తుతగ్రంథకృతిపతి యైన సవనృపతి యీవెల్లంటివంశమువాఁడే. ఇప్పుడున్న కార్వేటినగరపు జమీందారులు కూడ నీవంశమువారే. మాకరాజువారును

వెల్లంటివారును గూడఁ బూర్వపుసాళువరాజులబిరుదములఁ దమబిరుదములుగాఁ జేసికొన్నారు.

కసవరాజువంశము గ్రంథములో నిట్లు వర్ణింపఁబడినది. కరికాళచోళుని వంశములో సింగరిరాజు పుట్టెను. సింగరిరాజునకు శ్రీరంగరాజును, శ్రీరంగరాజునకు సింగరిరాజును, సింగరిరాజునకుఁ గావేరిరాజును, గావేరిరాజునకు సింగరిరాజును, సింగరిరాజునకుఁ గావేరిరాజును, గావేరిరాజునకుఁ గసవరాజు, సింగరిరాజు, తిరువేంగళరాజు, పెరుమాళ్రాజు ననునలువురు కొడుకులు పుట్టిరి. ఈకసవరాజే కృతిపతి. కసవరాజుపిదప నేడవతరమువాఁడగుబ్రహ్మరాజు కాలమునఁ బుట్టిన [1]పద్మావతీపరిణయ మనుసంస్కృతచంపూగ్రంథ మీవంశ క్రమమును దృఢపఱుచుచున్నది. ఆగ్రంథములోఁ గసవరాజునకు మాఱు కేశవరా జనియున్నది. కసవయనునది కేశవశబ్దభవము కాఁబోలును. కసవరాజు తరువాతి తరములవారు పద్మావతీపరిణయములో నీరీతిం జెప్పఁబడినారు :—

కసవరాజు పిమ్మట నతనితమ్ముఁడైన వేంకటపెరుమాళ్రాజు రాజ్యముచేసెను. అతని యనంతర మాతని యన్నకొడుకగుబ్రహ్మరాజు రాజ్యముచేసెను. బ్రహ్మరాజుకొడుకులు కావేరిరాజు వేంకటపెరుమాళ్రాజులు. వేంకటపెరుమాళ్రాజు కొడుకు బ్రహ్మరాజు; అతని కొడుకులు కుమారువేంకటపెరుమాళ్రాజు, కావేరిరాజు, తిరుమలరాజు, సుందరకృష్ణరాజును. కుమారవేంకటపెరుమాళ్రాజుకొడుకులు [2]బ్రహ్మరాజు మొదలగువారు. ఈబ్రహ్మరాజే పద్మావతీపరిణయ కృతిపతి. కసవరాజునకు బ్రహ్మరాజునకు నడుమ నయిదుగురు రాజ్యముచేసినట్టులు దీనివలనఁ గనఁబడుచున్నది. ఈగ్రంథములోఁ గుమారవేంకటపెరుమాళ్రాజు తారణసంవత్సరచైత్రమాసములో లోకాంతరగతుఁడైనట్లును, నానంవత్సరజ్యేష్ఠమాసములో బ్రహ్మరాజు పట్టాభిషిక్తుఁడైనట్టును బ్రహ్మరాజునాజ్ఞ ననుసరించి యాగ్రంథము వికృతిసంవత్సరమునం దచ్చుపడినట్లు నున్నది. తారణసంవత్సరము 1884-వ క్రైస్తవసంవత్సరమునకును, వికృతిసంవత్సరము 1890 సంవత్సరమునకును సరిపోవును. కుమారవేంకటపెరుమాళ్రాజు సవతితమ్ముఁడగుతిరుమలరాజున కంకితమైనట్టియు, గరుడాద్రి సుబ్రహ్మణ్యవిద్వత్కవి ప్రణీతమైనట్టియు [3]శత్రుఘ్న

---

[1] ఈగ్రంథము కార్వేటినగరమునందలి శ్రీభారతీలీలాసదనముద్రాక్షరశాలలో నచ్చుపడినది.

[2] బ్రహ్మరాజునకు బొమ్మరాజని వాడుకపేరు. బ్రహ్మరాజుగారిపుత్రు లయినకుమారవేంకటపెరుమాళ్రాజు, కుమారస్వామిరాజుగార్లు ప్రస్తుతసంస్థానాధిపతులుగానున్నారు.

[3] ఈగ్రంథము బ్రాఁతప్రతి యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున నున్నది.

విజయ మీవంశక్రమమును దృఢపఱుచుచున్నది. ఈగ్రంథము ౧౭౮౬వ (రసకరిమునిశశి) శాలివాహనసంవత్సరమునకు సరియైన ప్రభవసంవత్సరమునఁ బూరింపఁబడినట్లు గ్రంథాంతమం దున్నది. ఇది క్రీ. 1864-వ సంవత్సరమునకు సరిపోవును. అప్పటికిఁ గుమారవేంకటపెరుమాళ్రాజు సజీవుఁడై యున్నట్లును, వతనికి బ్రహ్మరాజు, కుమారవిజయవీరరాఘవరాజు, కావేరిరాజు, సింగరిరాజు ననునలువురుకొడుకు లున్నట్లును జెప్పి యింకను బలువురు తనయులు కలుగుదురుగాక యనికవి యాశీర్వదించినాఁడు. క్రీ. 1884 సంవత్సరమునఁ గాలధర్మమునొందిన కుమారవేంకటపెరుమాళ్రా జీతఁడే యగుట నిస్సంశయము. ఈకుమారవేంకటపెరుమాళ్రాజు కసవరాజున కైదవతరమువాఁ డగుచున్నాఁడు. ఆచారానుసారముగాఁ దరమున కిరువదియైదుసంవత్సరములచొప్పున లెక్కించినచోఁ గసవరాజు క్రీ. 1714 సంవత్సరప్రాంతమువాఁ డగుచున్నాఁడు. స్థూలదృష్టిచే, క్రీ. 1700 సంవత్సరప్రాంతమువాఁ డనుకొందము.

వేఱొకలెక్కనుబట్టి చూచినను నించుమించుగా నీకాలమేధ్రువపడుచున్నది. ఎట్లన :—

కవిగురువైన తిరువేంగళార్యుఁడు సాళ్వతిమ్మనృపాలుఁడు, వీరవేంకటరాయశౌరి, నెలుగోటివేంకటవిభుఁడు, చెంజి వరదేంద్రుఁడు ననుప్రభువులచే గౌరవింపఁబడినట్లు గ్రంథములోనున్నది. (ఆ. ౧ ప. ౩౧.) సాళ్వతిమ్మనృపాలుఁడెవ్వఁడో తెలియదు. ఆకాలమం దాపేరుగల సుప్రసిద్ధరాజు గానరాఁడు. సామాన్యుఁడైన జమీందారుఁడై యుండనోపును. చెంజి వరదేంద్రుని కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. దీనినిబట్టి యితరుల కాలము నిర్ణయింపవలసి యున్నది. చెంజి యనునది దక్షిణార్కాటు మండలములో సుప్రసిద్ధ మైనస్థలము. ఆంగ్లేయభాషను దీనిని "జింజి" యందురు. కర్ణాటరాజ్యకాలమం దీచెంజిదేశమును గొందఱునాయకులు పాలించుచుండెడి వారు. ఆనాయకులలో నొక్కఁడగు "చెంజి వరదప్పనాయనయ్యవారు తీర్థాచరణవచ్చి శేతుదర్శనం శేశి స్వస్తిశ్రీశాలివాహనశకవర్షంబులు ౧౫౯౩ కల్యబ్దాః ౪౭౭౨ అస్మిన్ వర్తమానే వైశాఖబహుళసప్తమి స్థిరవారం యీపుణ్యక్షేత్రమైన.........మరప్రదేశం ఆకార్తికశుద్ధపౌర్ణమినాడు కొమారస్వామికి బంగారు అందలమున్ను సమర్పణశేశి తమఆరతిను యేర్పాటు శేయించినారు" అని మధురకు సమీపమందున్న సుప్రసిద్ధకుమారక్షేత్రమగు తిరుప్పరంగుండ్ర మను

గ్రామమునందలి దేవాలయములో నొక్క తెలుఁగుశాసనమును, దాని కనువాదముగా నొక యరవశాసనమును గలవుఁ. ఈశాసనములో వరదప్పనాయనితోఁ గూడ నిరువదియైదు తరములవారు పేర్కొనఁబడియున్నారు. వీరిలో వరదప్ప యనుపేరుగలవాఁ డితఁ డొక్కఁడుమాత్రమే యున్నాఁడు. తిరుమలార్యుని గౌరవించిన చెంజి వరదేంద్రుఁ డీవరదప్పనాయఁడే యనుటకు సందేహ ముండఁ గూడదని నాయభిప్రాయము. వరదప్పనాయనిశాసనసంవత్సరము క్రీ. 1671 సంవత్సరమునకు సరిపడును. ఇఁక వీరవేంకటపతిరాయశౌరి యెవ్వరో చూతము. పేరునుబట్టిచూడ నీతఁడు కర్ణాటరా జని స్పష్టమగుచున్నది. సుప్రసిద్ధుఁ డగు వీరవేంకటపతిరాయలు క్రీ. 1614 ప్రాంతమున మృతి నొందెను. 1643 ప్రాంతమున శ్రీరంగరాయలు రాజ్యమునకువచ్చి 1678 ప్రాంతమందు రాజ్యభ్రష్టుఁడై మహిసూరుదేశములో మృతినొందెను. ఈయిద్దఱురాజుల నడిమికాలమునందుఁ బలువురు రాజ్యమును గాంక్షించుటచే ఘోరమగుపోరు పుట్టి శ్రీరంగరాయలు రామరాయలు వేంకటపతిరాయలు ననువారు స్వల్పస్వల్పకాలము సింహాసనమధిష్ఠించి పదభ్రష్టు లగుచువచ్చిరి. శ్రీరంగరాయలపిదప క్రీ. 1678–1680 సంవత్సరములలో వేంకటపతిరాయలు రాజ్యముచేసినట్టులు కొన్ని [౨]శాసనములవలనఁ గనఁబడుచున్నది. ఈవేంకటపతిరాయలకాలము చెంజి వరదప్పనాయనికాలమునకు సరిపోవుచున్నది. ఈతఁడే తిరువేంగళార్యుని గౌరవించిన వీరవేంకటరాయశౌరియైనట్లు తోఁచుచున్నది. నిజముగా శ్రీరంగరాయలతోడనే కర్ణాటరాజ్యమంతరించినది. అదిమొదలు చాలకాలమువఱకు నావంశములోనివా రెవ్వరో యొక రానెగొంది సమీపదేశమునకుఁ బ్రభువులై పూర్వాధికార మంతరించినను బూర్వరాజుల బిరుదములను మాత్రము పెట్టుకొనుచుండినట్లును, గౌరవార్థముగా వారినే కర్ణాటరాజులుగా మధురనాయఁకులు మొదలగువారు భావించుచుండినట్లును శాసనములవలనఁ గన్పట్టుచున్నది. ఇఁక వెలుగోటి వేంకటవిభుఁ డెవ్వరో చూడవలసి యున్నది. బ్ర. వెల్లాల సదాశివశాస్త్రిగారు రచియించిన వెలుగోటివారి వంశచరిత్రమువలన వేంకట యనునామముగలవారు ౧౯-౨౦-౨౧ తరములలోమాత్రమే యున్నట్టులు కనఁబడుచున్నది. ౨౦-వ తరమువాఁడైన యాచ

---

౧ ఈశాసనములు రాజకీయశాసనాధికారులు 1917 సంవత్సరము లో సంపాదించిన శాసనములలో 860-861 సంఖ్యలు గలవి. వారికార్యస్థానమునఁ జూడనగు.

౨ చూ. Sewell's Lists of Antiquities Vol. II.

శూరున కెనమండ్రు కొడుకులు. వారిలో వేంకటాద్రినాయఁడు, వేంకటప్పనాయఁడు, చినవేంకటప్పనాయఁడు ననుముగ్గురు వేంకటాభిధాను లుండిరి. వీరిసోదరుఁడును రాజ్యభర్తయునైన కుమారయాచమనాయఁడు మహిసూరువారితో యుద్ధముచేసి జయమంది "అబ్దుల్‌ఫాదుషా" గారివలన బహుమానములు పొందినట్లు బ్ర. సదాశివశాస్త్రిగారు వ్రాసినారు. అబ్దుల్‌ఫాదుషా యనఁగా అబ్దుల్ కుతుబ్‌షా యను గోలకొండరాజు. ఈరాజు క్రీ. 1611 మొదలు 1672 వఱకు రాజ్యముచేసెను. ఇదియుఁ జెంజి వరదప్పనాయని కాలమునకు సరిపోవుచున్నది. యాచశూరునిసోదరులు కూడ నీకాలమువారే. వారు ముగ్గురిలో నెవ్వరో యొకరు చంపూరామాయణములోఁ జేర్కొనఁబడిన వెలుగోటి వేంకటవిభుఁడు కావలయును. ఈప్రమాణములు మూఁటినిబట్టి తిరువేంగళార్యుఁడు క్రీ. 1670—80 సంవత్సరములప్రాంతమువాఁడైనట్లు తేలినది. ఆతని శిష్యుఁడైన వేంకటాచలపతికవి క్రీ. 1700 ప్రాంతమందుఁ గృతినిర్మించుట యీకాలనిర్ణయమున కవిరోధమేకదా !

కవికాలనిర్ణయము చేయుట కింకొకయాధారము కూడఁగలదు. వేంకటాచలపతికవి దామర యక్కనృపాలుని సన్నిధికిం జని నప్పు డెవ్వరో "వరకవి గంధసింధురము వచ్చె" నటన్న "నేను గవిరాజకేసరి" నని కవి పల్కెనఁట. (చూ. ఆ. ౧ ప. ౩౮) ఈ యక్కనృపాలుఁ డెవ్వరో నిర్ణయింపవలసియున్నది. ధూర్జటి లింగకవి కృత ౧కాళహస్తిమాహాత్మ్యమువలనఁ గాళహస్తి రాజవంశమం దక్కప్పయనుపేరు గలవారు నలువురున్నట్లు తెలియవచ్చుచున్నది. వారిలో మొదటివాఁడు చెన్నపట్టనమునకుఁ బేరొసంగిన చెన్నప్పనాయని రెండవకుమారుఁడు. ఈతఁడే ఉషాపరిణయగ్రంథకర్త. ఈయక్కప్పనాయని మనుమఁడుగూడ నక్కప్పయే. ఈరెండవయక్కప్పకు, అక్కప్పయను కుమారుఁడును మనుమఁడును నమ్మక్కయను కూఁతురునుండిరి. అమ్మక్క వెలుగోటి వీరకుమారయాచమనేని భార్యయై బంగరు యాచమనేనిం గనియెనఁట. ఈబంగరు యాచమనీఁడు క్రీ. 1693-వ సంవత్సరమువఱకు సజీవుఁడైనట్లు వెలుగోటివారి వంశచరిత్రము చెప్పుచున్నది. కావున, బంగరు యాచమనేని మేనమామకుమారుఁడగు నాలుగవయక్కప్ప క్రీ. 1700 సంవత్సరప్రాంతమువాఁ డనియు వేంకటాచలపతికవికి సమకాలికుఁ డనియుఁ దేలుచున్నది. ఏవిధమునఁ జూచినను వేంకటాచల

---

౧ ఈగ్రంథము వ్రాఁతప్రతి, యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునఁ జూడనగు.

పత్రికవి క్రీ. 1700 ప్రాంతమం దుండె నని సిద్ధాంతీకరించుట కాక్షేప మేమియుఁ గనఁబడదు.

పద్మావతీపరిణయమునందుఁ గనపరాజు నుత్తరచరిత్ర మిట్లు వర్ణింపఁబడినది :—

“కనపరాజపుత్రకుండై వయసునఁ జిన్నవాఁడైనను గుణములచేఁ బెద్దయు, వేంకటేశ్వరాంశసంభూతుండు నైన వేంకటపెరుమాళ్ళరాజను చిన్నతమ్ముని రాజ్యతంత్రధురంధరుఁగా నొంచి యతనియందు రాజ్యభార ముంచి నిస్పృహుఁడై వానప్రస్థాశ్రమము నంగీకరించి భార్యతోఁ గూడ మునినికరముం జేరి వారి చెంతఁ గొండగుహయందు వసించి దుష్కరమగు తప మొనర్చుచుఁ గొంతకాలముండి యంతటఁ దనకు మోక్షకాలము సమీపించినదని యెఱింగి నిజరాజధాని యైననారాయణపురమున కేగి యందున్నకల్యాణవేంకటేశ్వరుని యాలయములో ధ్వజస్తంభముచెంత భగవత్పాదములు స్మరించుచు బ్రహ్మరంధ్రమునుండి ప్రాణమును విడిచెను.” అని. చంపూరామాయణములోఁ గనపరాజునకు సింగరిరాజు, తిరువేంగళరాజు పెరుమాళ్ళరాజు ననువారు ముగ్గురే తమ్ము లుండినట్లు చెప్పఁబడినది. పద్మావతీపరిణయములో నీతనికి, తిరుమలరాజు, వేంకటపతిరాజు, చిన్నరాజు నను మఱి ముగ్గురుతమ్ములుఁగూడ నుండిరనియు నీయార్గురిలో వేంకటపెరుమాళ్ళరాజు కడపటివాఁ డనియు నీతఁడే [౧]కార్వేటినగరమును గట్టించెననియు, నంతకుఁ బూర్వము నారాయణపురమే రాజధానిగా నుండె ననియుఁ జెప్పఁబడియున్నది.

ఈగ్రంథము ప్రతియొక్కటే అత్తిరాలలో బ్రll వెల్లాల చిన్నవేంకటసుబ్బయ్య సిద్ధాంతిగారివలన దొరకినది. దీని చివర “యతుల నారసింహ్వరాజు వ్రాసిన చంబూరామాయణం”అనియున్నది. ప్రత్యంతర మింతవఱకు దొరకలేదు. లేఖకదోషములుమాత్రము సవరించి వలసినపట్ల సంస్కృతచంపూరామాయణమునకు సరిచూచి మాకు దొరకిన ప్రతి ప్రకటించినారము.

వేంకటేశ్వరాష్టకములోనివి గ్రంథావతారికలో (పుట ౮.) ముద్రింపఁబడిన మూఁడుపద్యములుగాక మిగిలిన యైదుపద్యములు నీక్రిందఁ జేర్పఁబడినవి.

శా. పర్వేందుప్రతిబింబవక్త్రము శరత్పద్మాక్షియుగ్మంబు కీ
ర్వాణశ్లాఘ్యధనుర్గుణాసహన సూనాకారనాసోన్నతిన్

---

౧ చంపూరామాయణములోఁ గార్వేటినగరప్రశంస యుండుటచే నీమాట సత్యము కా దని తేలుచున్నది.

శర్వాదుల్కు దెలియంపలేనితటి నీసౌందర్య మెంతో గదా
కార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతామనోవల్లభా.

శా. ఆర్వేలేండ్లు తపంబుచేసి భవదీయావాసశేషాద్రిపైఁ
జెర్వంగాంచెను వేల్పుమూఁకకు మహాసేనుండు బల్నెత్తురుల్
నుర్విల్లట్టగఁ దారకాసురుని దానుగ్గాడె నీశక్తిచేఁ
గార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతామనోవల్లభా.

శా. తార్వాళంబులు వంచి చిత్తరుల వింతల్పుచ్చమైయుండఁగాఁ
దిర్విధుల్ భవదీయ సన్నిధిని ముస్తీదైన యావీథిలోఁ
దెర్వారే తిరునాళ్ల నీకు నడవన్ దృశ్యంబు గాకుండఁగాఁ
గార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతామనోవల్లభా.

శా. కుర్వేరుం దమనంబు జాతిసుమముల్ గోరంట చేమంతులున్
హార్దైవనిగ్గులు దేజు శ్రీతులసి నీకర్పించు మర్త్యుండు దా
నేర్వ(జం)బుల మాక్తికంబులను బూజించేఫలం బొందుఁగా
కార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతామనోవల్లభా.

శా. ఓర్వన్నశ్యమె యామ్య బాధ కటువై యుండన్మనుష్యుండిలం
జార్వాకోక్తుల చేతనే చెడు దురాచారంబు గావించుఁగా
శర్వర్యంకు నహస్సునందును భవచ్చారిత్రదూరాత్ముఁడై
కార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతామనోవల్లభా.

జయంతి రామయ్య.

---

## కవిత్వవిమర్శనము.

శ్రీచంద్రామాయణమును జంపువుగా సంస్కృతభాషయందు రచించినకవి భోజరాజు. ఈరాజకవి ధారానగరము రాజధానిగాఁ గల మాలవదేశమున క్రీ. శ. 1018 సం॥ మొదలుకొని 1060 వఱకు రాజ్యముచేసినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. కనుక నితఁడు క్రీ. శ. 1022 సం॥ మొదలు 1063 సం॥ వఱకు వేంగీదేశమును బాలించిన మనరాజరాజనరేంద్రునకు సమకాలికుఁడుగా నున్నాఁడు. ఇతఁడు సరస్వతీకంఠాభరణము, పాతంజలసూత్రవృత్తి మొదలగు గ్రంథములను రచించియుఁ బెక్కుపండితకవులకు నాశ్రయభూతుఁడై వారిచే బహుగ్రంథముల రచింపించియు సంస్కృతభాషను మహోన్నతికిఁ దెచ్చెను.

చంపూరచన కితఁడు మార్గదర్శి. ఇందుల కితఁడు 'గద్యానుబన్ధరసమిశ్రితపద్యసూక్తి హృద్యాహి వాద్యకలయా కలితేవ గీతి' యని గద్యముతోఁ గూడిన పద్యకావ్యము వాద్యముతోఁ బాడినగీతమువలె హృద్యమని కారణమును నిరూపించెను. ఇతఁ డీచంపూరామాయణమునం దయిదుకాండములే రచించి యే కారణమువలననో యాఱవది యగుయుద్ధకాండమును రచింపక విడువఁగా దానిని లక్ష్మణసూరి యనుకవి రచించి పూరించినవాఁడయ్యె. ఈకవిశిఖామణు లిద్దఱును రచించిన యీచంపువు మృదుమధురపదసందర్భసుందరమై చదువరుల నిర్భరరసాస్వాదపరవశులం జేయుచు సంస్కృతభాషకు వన్నెగలిగించుకావ్యములం దొకమిన్నగా నెన్నందగియున్నది.

ఇట్టి ప్రబంధమును దెనుఁగుచేసినవాఁడు కవిరాజకంఠీరవ బిరుదాంకితుఁడగు ఋగ్వేదికవి వేంకటాచలపతి.

ఇతని యాంధ్రీకరణపుఁ దెఱంగులు కొంత పరామర్శింతము. ఇతఁడు మూలమును గొన్నియెడల వేఱుగ మార్చియుఁ, గొన్నిపట్టుల లేనివి కూర్చియుఁ, గొన్నిచోట్ల నున్నవి విడిచియుఁ దెలిఁగించినను మొత్తముమీఁద మూలమున కంతగా హెచ్చును దక్కువయుఁ గాకుండ దీనిని రసవంతముగానే రచించినాఁడనవచ్చును. భాషాంతరముసేయుట యనఁగా నొకభాషలోనిపదమునకు మఱియొకభాషయందలి మాఱుపదమును మక్కీకిమక్కీగాఁ బెట్టుట గాదు. భాషలు తమతమశబ్దవాక్యస్వరూపవిశేషములంబట్టియుఁ, దన్మూలకములైనవ్యాకరణప్రక్రియలంబట్టియు, రచనయందును శైలియందును, స్వభావమునందును బరస్పరభేదము గలిగియుండును గనుక నొకభాషయందలిపదములను మఱియొకభాషలోనికిఁ బరివర్తనము చేయునప్పు డా రెండవభాషస్వభావాదుల ననుసరించి తగుకొలందిని వానిని మార్చియుఁ గూర్చియు రచించిననే యది రమణీయమై రసవంతముగా నుండును. 'బ్రహ్మాండభాండము'లను 'బమ్మగుడ్డుకుండ'లనుటగాని 'పెండ్లికొడుకు'ను 'వివాహపుత్రుఁ' డనుటగాని భాషాంతరము గాదు. దీని నెఱింగియే కవికులాదృష్టాధ్వగమనుఁ డగుశ్రీనాథుఁడు తన తెనుఁగునైషధమున 'శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబుఁ బోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పంబడిన యీభాషానైషధకావ్యం' బని వ్రాసినాఁడు. ఇఁకఁ గవి తెనుఁగునందలి మార్పులను గూర్పులను విడుపులను నుదాహరించెదము.

మార్పు:—ఇట మూలమును పెంచికాని తగ్గించి కాని మఱింత మెఱుంగు గూర్చిన మార్పులను దెలిపెదము.

మూ. సీతా పురా గగనచారిభి రప్యదృష్టా
మాభూ దియం సకలమానవనేత్రపాత్రమ్
ఇ త్యాకలయ్య నియతం పిదధే విధాతా
బాష్పోదయేన నయనాని శరీరభాజామ్. (అయోధ్యా.)

తె. మ. అజరాదుల్ పొడగాంచఁగూడని యసూర్యంపశ్య నారాముదే
వి జనానీకవిలోకభాజనము గావింపన్ మదిం గొంకి పం
కజగర్భుండు ఘటించె నాగరజలోకశ్రేణికిం జూడ్కి బా
ష్పజలాకీర్ణముగా నజాహ్వయభృతక్షాత్త్రాభిమానోన్నతిన్. (4ఆ. 52ప.)

మూలమునందుంబోలెఁ దెనుఁగున గగనచారులకును బొడగాంచరానిదని సీతకు వనవాసానర్హతను దెలుపుటకై పరమసౌభాగ్యప్రయుక్త మగుసౌకుమార్యాతిశయము చెప్పుటయేకాక యెక్కువగా 'అసూర్యంపశ్య' యనియుఁ జెప్పి యెండ కన్నెఱుంగనిది యడవి కెట్లు పోఁజాలు నని సందర్భోచిత మగుకరుణరసమును మూలముకంటె మిక్కుటముగా నిందుఁ గవి వెలివిరియించినాఁడు. రామునిదేవిని మనుష్యులు చూడ నవువుగాకుండునట్లు చేసినవిధాతకు రామునియం దింతయభిమానమేల యని యాశంక కల్పించికొని బ్రహ్మకును రాముని తాతకును గల 'యజాహ్వయ"మే హేతువుగా నిబంధించి మూలమున కెంతో మెఱుఁగు గావించినాఁడు.

మూ. యద్యస్తి కౌతుక మపూర్వమృగే మృగాక్షి
చాన్ద్రిం హరామి హరిణం నను సన్నిధేహి
యావ న్నముఞ్చసి మయా హృత మేణ మేనం
తావ ద్దధాతు తవ వక్త్రతులాం మృగాఙ్కః. (ఆరణ్య.)

తె. శా. నీకున్ వింతమృగంబుపైని దమియుం జే నేమి కాదంటినా
రాకాచంద్రున కంతరంగ మగుసారంగంబు రప్పించెదం
గైకొ మ్మాహరిణంబు నీకరమునం గన్పట్టునందాఁక శు
ద్ధాకారుం డతఁ డొందుఁగాక భవదీయాస్యైకదాస్యోన్నతిన్. (5ఆ. 81ప.)

మూలమందలి 'చాన్ద్రింహరిణ'మ్మునకంటె తెనుంగునందలి 'రాకాచంద్రున కంతరంగ మగుసారంగ' మనుట మిక్కిలిసొంపు. మూలమునఁ జంద్రుఁడు మృగాం

కమును వీడి శుద్ధుఁడై సీతాముఖముతోఁ బోలు నని యుండఁగాఁ దెనుఁగునందు శుద్ధుఁడయ్యును సీతాముఖమునకు దాస్యోన్నతినే పొందునని మిక్కిలి సారస్యము గలిగి యున్నది.

'సచివా స్తైలద్రోణ్యాం నిక్షిప్య' యన్నముక్కను

గీ. అర్హామయ్యెఁ గృతాధ్వరుం డయినయతని
దేహము తిలోత్తమోదితస్నేహమునకు
నర్హముగదా కృతాధ్వగుం డైనయతని
దేహము తిలోత్తమోదితస్నేహమునకు.

అని తెలిఁగించి శ్లిష్టార్థాంతరన్యాసానుప్రాసములతో మిక్కిలి చమత్కరించినాఁడు.

ఇట్లె మూలమున 'అస్తి ప్రశస్తా జనలోచనానా, మానన్దసన్దాయిషు కోసలేషు। అజ్ఞానముత్సారితదానవానాం, రాజ్ఞా మయోధ్యేతిపురీ రఘూణామ్' అనుశ్లోకమునకుఁ జాతుర్వర్ణ్యాదివర్ణనకలిత మగు నొకసీసపద్యమును, విశ్వామిత్రయాగసందర్భమున 'కరతలగలితపలాశసమిత్కుశాః కుశికసుతాన్తేవాసినః' యనుటకు ౨-వ యాశ్వాసమున (84, 85, 86, 87) నాలుగు పద్యములును, హనుమదాదులప్రాయోపవేశఘట్టమున 'తాస్తాఃకథాఃపరిదేవయన్త' మ్మనుటకు నయిదాఱుపద్యములను రచించి మూలముకంటెఁ దెనుఁగును రసోద్వేలము గావించినాఁడు.

కూర్పు:—ఇందు మూలములో లేనివై కేవలకవికల్పితములగువానిని వ్రాసెదము.

## వసంతవర్ణనము.

సీ. జగతీవపడఁతికిఁ జెంగావిపావడ యవనీపవోచిత యావకంబు
మాధవశ్రీకి నిమంత్రసిందూరంబు కలికానికాయతారలకు సంజ
పరభృతవాఙ్మయప్రదశాంభవీరుచి వనికావురం ధ్రికాననహరిద్ర
వనదేవతచనుంగవకుఁ గుంకుమముడంబుధారుణీరుహశైలగైరికంబు
కామినీకాముకవినోదకేలనకొలకు, సమయవర్ధకి పొదరింటిగమికిఁ గీలు
కొలిపినరుటంపుఁగెంపుజాతభుకుజోడు, బల్లగుము రెల్లకడనుద్భవిల్లెఁజిగురు.

మ. మరునంపుర్ మఱుసృష్టి ప్రమోదులయెడం బాలించుటెక్కల్ హిమా
పరిసంహారముఁ జూపి తత్త్రిపురుషీభాగాచితిం జైత్రుఁ డొం
దురజస్సత్త్వతమోగుణోన్నతు లనం దోఁచెం జిగుళ్లుం జిగు
ళ్లరకంబయ్యెడుక్రొవ్విరుల్ విరులపట్లల్ వ్రాలుభృంగంబులున్.

చ. చనను వినోదకోప మిఁక సాగవు బింకము లాలకింపుఁ డీ
మనసిజుఁ డానతిచ్చినక్రమం బిది యంచు విటీవిటాలికిం
బనుప వసంతుఁ డక్షరసమాజము వ్రాసినకాగితంబులో
యనఁ దనరెన్ సబంభరవనాంతరకాంతలతాంతబృందముల్.

ఇత్యాదులు పెక్కులుగలవు. బాలకాండమున దశరథుని యనపత్యతావిచారమును, మిథిలాపురవర్ణనమును విశ్వామిత్రకృతసీతాసౌందర్యవర్ణనమును వివాహవర్ణనమును మూలమందు లేవు.

విశేషము:—ఇందు మూలమున నుండియుఁ గవిచే విడిచిపెట్టఁబడినవానిని వ్రాసెదము. మూలమున విరాధుఁడు సీతను విడిచి రామలక్ష్మణుల నెత్తికొని పోవుసందర్భమున

'యాతు నః పదవీ సైషా యాతు న శ్వాస్య లక్ష్మణ
యాతుకామం తథైవేదం యాతు కామం సహస్యతామ్.
'అయి కబలయ మా మమూ విముఞ్చే త్యతికరుణం రుదతీ మవేక్ష్య సీతామ్
అర మరచయతా ముభా వసిభ్యాం పిశితభుజం భుజభారహీనమేనమ్.
'రక్షోవధః ప్రకృత ఇ త్యయమేవ శంసే
త్స్వర్గాయ గాయకపదం గమితో విరాధః
నాగాలయాయ వపు రస్య వదే దితీవ
శ్వభ్రే త దక్షిప దిషుప్రహతం స రామః॥' అను శ్లోకములును, శూర్పణఖ రామునిం గూర్చి—

'లావణ్యామ్బునిధే రముష్య దయితా మేనా మి మైనం జనం
కస్మా న్నాసృజ దస్మదన్వయగురో రుత్పత్తిభూః పద్మభూః
ఆస్తా మేత దరణ్యవాసరసికే హా కష్ట మస్మి న్నిమామ్
కాన్తిం కాననచన్ద్రికాసమదశాం కిం నిర్మమే నిర్మమే ॥
అన్నశ్లోకమును మఱియు నిట్లె రసవంతము లగుకొన్నిశ్లోకములను విడిచినాఁడు.

మూలమునకు సమానమైనతెనుఁగు.

మూ. శ్లో. సంక్రాన్తవర్ణాన్తరగాధిసూనో
స్సంపర్కపుణ్యాదివ రామభద్రః
క్షాత్త్రక్రమా త్పిప్పలదణ్డయోగ్యః
పలాశదణ్డాద్ధృతపాణి రాసీత్. (బాల.)

తె. గీ. కలితవర్ణాంతరుం డైనగాధిసూను
సహచరతనేమొకో నిజక్షత్త్రజాతి
కయిన పిప్పలదండ మూనియుఁ బలాశ
దండకరుఁ డయ్యె నపుడు మార్తాండకులుఁడు. (2 ఆ. 90 ప.)

మూ. శ్లో. రేఖారథాఙ్గ సరసీరుహశఙ్ఖచిహ్నే
క్షేమంకరే తవకరే జగతాం త్రయాణామ్
కాన్తారకన్దఖననం రచయేతి నూన
మాబద్ధవాన్ ప్రతిసరం భగవా న్వసిష్ఠః. (అయోధ్యా.)

తె. చ. ధరజలజాదిచిహ్నములు దావుకొనంగ జగత్త్రయీశవం
కర మగునీకరంబునకుఁ గంకణ మార్తినిదానకాననాం
తరతరుమూలకందఖననం బొనరింపు మటంచుఁ గట్టెనో
గురుఁ డగుశక్తితండ్రి రఘుకుంజర నిన్నఁటియుత్సవోన్నతిన్.

మూ. శ్లో. మహాసమరసూచకః ప్రతిదినం మనోజన్మనో
మయూరగళకాహళీకలకల స్సముజ్జృమ్భతే
పయోదమలినేదినే పరుషవిప్రయోగవ్యథాం
నరేషు వనితాసువా దధతి హన్త కే కా ఇతి. (కిష్కింధా.)

తె. పృథ్వి. చెలంగె నలుదిక్కులన్ శిఖిశిఖావళీకంఠకా
హాళీధ్వని 'వియోగితా మపి నరేషు నారీషు వా
జలాకులఘనే దినే సపది యాన్తి కేకా' యితి
చ్ఛలారభటితో మనోజరణవేగసంసూచియై.

ఇట 'వియోగితా.........కేకా' యను దానిని దెలిఁగించిన రసభంగము గాన దాని నట్లె యనుకరించి వ్రాసినాఁడు.

ఇతని కవిత్వమందు దోషములును గొన్ని గలవు. కొన్ని పూర్వాంధ్రకవుల యనుకరణములును గలవు. ఒకొక్కచోటఁ దెనుఁగు మూలమున కంటె నొకటి రెండువన్నెలు తక్కువగా నుండుటయుఁ గలదు. స్థాలీపులాకన్యాయమున నొకటియుదాహరణము.

మూ. శ్లో. వాచం నిశమ్య భగవా నథ నారదస్య
ప్రాచేతసః ప్రవచసాం ప్రథమః కవీనామ్
మాధ్యందినాయ నియమాయ మహర్షిసేవ్యాం
పుణ్యా మవాప తమసాం తమసాంనిహన్త్రీమ్

క. ఆమరమునిపల్కు విని సం,భ్రమమున వాల్మీకిసుకవి మాధ్యందినకృ
త్యమొనర్ప నరిగె సురుచిర, తమసారసకముగనవనికిఁ దమసాధునికిన్

ఇటముని మాధ్యందిననియమమునకుఁ దెనుఁగునందలి నదీవిశేషణములకంటె మూల మందలివి మిక్కిలి యుచితములు ; కథావిషయమునను నొకానొకచో మూలమునకును దెనుఁగునకు భేదము కనఁబడుచున్నది. మూలమునఁ గ్రౌంచమిథునములో నొక్కదాని నే బోయ చంపినట్లుండఁగా రెంటిని జంపినట్లు తెనుఁగుననున్నది. కొన్నిలక్షణదోషములును గలవు. మొగజా (ఆ. 3-71 మగజాయనుట సాధురూపము ) ధనువంశము (ధనుర్వంశము). కడానిబెత్తపు (కడానిబెత్తపు). ఇత్యాదులు చూపట్టుచున్నవి. 'గండపెండేరముఖపరిష్కార' (3 ఆ. 71) యని సమాసగర్భమునఁ దెనుఁగు దుష్టమయ్యెను బూర్వశాసనములందుఁ గండపెండేరము మొదలగు రాజచిహ్నాభిధాయకములు సంస్కృతసమాసములందు ఘటితములై యున్నవి. క్రతుశబ్దమునకుఁ బ్రథమైకవచనమాత్రనియత మగుటవర్ణకము సమాసమునను బహువచనమునను విభక్త్యంతములను గనుపట్టుచున్నది. రెండవయాశ్వాసమున 25-వ పద్యమున 'సూళగేరి' యనుపదము మొదట 'సురలగా' రని దిద్దంబడినను బిదపఁ గర్ణాటనిఘంటు పరిశీలనమున నాగవాసమునకు వాచక మగు 'సూళగెరి' యనుపదముగాఁ దెలిసి దిద్దంబడినది.

కవి దాక్షిణాత్యుఁడు గాన నొండు రెండుచోటుల ద్రావిడకర్ణాటపదములు పడినవి. 'చెలంగె నలుదిక్కుల' ననుపృథ్వీవృత్తమునకుఁ గవి తొమ్మిదింట యతిని వేసినాఁడు. వసుచరిత్రపీఠికను శొంఠి భద్రాద్రిరామశాస్త్రులవారు 13-వ యక్షరమును, శృంగారనైషధవ్యాఖ్యానమున వేదము వేంకటరాయశాస్త్రులవారు 14-వ యక్షరమును బృథ్వికి యతిగా వ్రాసిరి పూర్వకవిప్రయోగములందు 12-వ యక్షరము యతిగా నున్నది. కావున దీనినిబట్టి కవి యందుఁ దప్పుపట్ట రాదు.

ఇక్కడి మూలమున నందందుఁ గలశైలిని బాకమును ననుసరించియే యీయాపట్టులపద్యములను రచించినాఁడు. ఇతని కవనమున వ్యర్థపదములును బాదపూరణములును నంతగాఁ గలుగవు. స్వతంత్రప్రయోగము చాలవఱకుఁ గలదు. రసపోషణము ప్రధానముగా నున్నది. కవికి శృంగారరసము మిక్కిలి యభిమతముగా నున్నది. మొత్తమునకు శైలి మధురమై యలంకారబంధురమై యున్నది.

తంజనగరము దేవరాజసుధి,
కట్టి సాంబమూర్తిశాస్త్రి.

శ్రీరామాయనమః.

# ఒంటిమిట్ట, పోతనామాత్యుఁడు.

## మూఁడవభాగము.



ఉ. రెండుకరంబులం గవివరిష్ఠుఁడు పోతనపుణ్యకావ్యమున్,
దండిమనంబునం దనకథం, గయికొంచు ధరాతనూజత
మ్ముండును గొల్వ నేకశిల మోదము మీఱెడు నొంటిమిట్టకో
దండరఘూద్వహుండు మిము ధన్యులఁ జేయుత నెల్లవేళలన్.

మహాశయులారా!

బమ్మెరపోతరా జొంటిమిట్టవాఁడని నేను వ్రాసినవ్యాసమునకుఁ బ్రత్యుత్తరమును బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారు కార్తికమాసపుఁ బరిషత్పత్రికయందుఁ బ్రకటించిరి. వారు వ్రాసినదానికిఁ బ్రత్యుత్తరము వ్రాసి (రావుబహదర్ వీరేశలింగము పంతులవారు వీరభద్రవిజయము నుద్దేశించి నేను వ్రాసిన వ్యాసమునకుఁ బ్రత్యుత్తర మిడఁగల రనుభీతి లేనివాఁడఁ గావున)*యీవివాదమున నింతటితో శాంతిపాఠముఁ బఠింపఁ దలఁచినాఁడను. ఈవ్యాసముతో నుభయవాదములు పూర్ణముగఁ జర్చితములైనట్లు తేర్పడును గావున నిష్పక్షపాతబుద్ధు లగుమధ్యవర్తులావల నెవరివాదము బలీయమో పరిష్కరింతురుగాక.

ఓరుగంటిపక్షమున మొదటఁ జెప్పినకారణములు గాక క్రొత్తకారణము లేవియు బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారు చెప్పినవారుకారు. వాని నన్నిటిని

* ప్రౌఢసరస్వతీత్యాది సందిగ్ధవిషయములగుఱించి యెందైన నేమేని నన్నుగుఱించి వ్రాయు రేమోకాని వీరభద్రవిజయము భాగవతకర్తృకృతమని వారు సాధింపశక్తులు గారని నానమ్మకము.

ముస్నే ఖండించియున్నాఁడను. నావాదమునందు వారిప్పుడు కనఁబఱిచిన లోపములకు సమాధానము చెప్పినచో మధ్యవర్తి లేఁక బహిష్కరించుట కే యాటంక ముండదు. "ఈ వ్యాసముఁ జక్కఁగాఁ జదివినాఁడను, గాని నా యభిప్రాయము మార్చుకొనుటకుఁ దగిన కారణము లేమియు నందుఁ గానరా లేదు" అని పంతులవారు వ్రాసిరి. నా వ్యాసమున వారికిఁ జక్షురక్షరసంయోగము కలుగుట సత్యము. కొన్నిచోటుల శ్రద్ధతోఁ జదువలేదనుటకు ముందు దృష్టాంతములు చూపెదను. నిష్పక్షపాత బుద్ధులు, సత్యభాషణులు, సుభాషుసములు, విద్వాంసులు నగుమాననీయులు "You have demolished the case for Warangal" అనియు, "The arguments adduced are very convincing and well supported by facts" అనియు "దాదాపు ఇరువది యైదుసంవత్సరముల క్రింద నేను ఒంటిమిట్టఁ జూచియుంటిని. అప్పుడు నేను స్థలజ్ఞుల విచారింపఁగాఁ దాము వ్యాసమున వ్రాసినప్రకార మాయాస్థలములఁ జూపిరి. ఎదిరి యూహలకంటెను తమ యూహలు ప్రమాణబల సమన్వితములుగఁ గనఁబడుచున్నవి." అనియు "వాదప్రౌఢి గంభీరముగను నిరుత్తరముగను నున్నది. వీరభద్రవిజయమును పోతన కంటఁగట్టుట యసమంజసమని రూఢి చేసితిరి. బమ్మెరవాస్తవ్యతాభ్రాంతిని నిర్మూలముఁ జేసితిరి. కవి జీవితవిమర్శాప్రయోగమునకు మార్గోపదేశక మగు వ్యాసము వ్రాసితిరి." అనియు నా వ్యాసమునుగుఱించి వ్రాసి యున్నారు మఱికొంద ఱీవిధముగనే నాతోఁ జెప్పియున్నారు. రామయ్యపంతులవారు మధ్యవర్తిస్థాన మలంకరించియుండిన నీయభిప్రాయమే చెప్పియుందురు. వాదు లగుటచే నభిప్రాయము మార్చుకొనఁ గారణము లేమియు వారికిఁ గానరాలేదు. అది వా రాక్రమించిన స్థానదోషము గాని నాదోషముగాదు వారిదోషమును గాదు.

1. "బమ్మెర, పర్వారు, వెలిగందల యనుగ్రామము లోరుగంటికి సమీపదేశమం దున్నవి, గాన నాగృహనామములు గలకుటుంబము లాప్రాంతమందే యుండె నని యూహించుట యసమంజసము కాదని నామొదటివాదము." అని పంతులవారు వ్రాసిరి. దీనికి నేనిచ్చిన ప్రత్యుత్తరము మీరు చదివియే యున్నారు. ఇందు 'బమ్మెర' యోరుగంటియొద్ద నున్నదనుట యసత్యము. నిరాధారము. ఓరుగంటియొద్ద బొమ్మెర యున్నదిగాని బమ్మెరలేదు. బమ్మెర యెందుండినదో యాంధ్రలోకమున కింకను దెలియదు. నే నాక్షేపించిన పిమ్మటఁ గూడ బొమ్మెరకుఁ బూర్వనామము బమ్మెరయని పంతులవారు స్థాపింపఁజాలరైరి.

అట్లుండినఁగదా స్థాపించుటకు? కడపలో జరగినసభలో నిప్పుడేల్చూరనఁబడుగ్రామమే యేర్చూరని నేను జెప్పఁగా నది సరిగాదనియు లెక్కలలో నేల్చూరనియే యున్నదనియుఁ బంతులవా రాక్షేపించిరిగదా. నా వాదమున కనుకూలముగ శాసనవాక్యములు గ్రంథస్థప్రయోగములు కనఁబఱచితినిగదా? అట్టులే నేనాక్షేపించినపుడు వారివాదమున సత్యముండిన నేలప్రయోగములు కనఁబఱుపరాదు. బమ్మెరబొమ్మెరలకు మేనత్తపోలికో మేనమామపోలికో తామేల నావలె సప్రమాణముగ స్థాపింపరాదు? బమ్మెర బొమ్మెర రెండు నొకటే యనుట యోరుగంటివాదుల యూహామాత్రకల్పిత మనినఁ దప్పేమి? బొమ్మెర గ్రామజనులును దమ గ్రామమునకు బమ్మెర యనుపే రుండినట్లు చెప్పలేదు. ఈవిషయము నా రెండవ వ్యాసమునఁ జర్చించినాఁడను.

2. ,,ఈవాదమున కంతకు మూలాధార మైనబమ్మెర గ్రామమునకుఁ బ్రతిగ్రామ మాయనకుఁ బొడకట్టియుండలేదు. ఏల్చూరు వెలిగండ్లగ్రామముల కనతిదూరములో నొకబమ్మెరయో బొమ్మెరయో కనఁబడినపుడుగాని సుబ్బారావు గారియాక్షేపము విమర్శనపాత్రము గాదు." అని రామయ్యపంతులవారు వ్రాసిరి. బమ్మెర నామమునకుఁ బ్రతినామము విషయమై రావుబహాదర్ కందుకూరి వీరేశలింగము పంతులవారికిఁ బ్రత్యుత్తర మిచ్చియున్నాఁడను. ఏబకార మకారరకారము లుండునవియైనను బమ్మెరలని నేను వాదింపఁబూనినచోఁ గోడూరికి ౯ మైళ్లలో నొంటిమిట్టకు ౩౦-౩౨ మైళ్లలో నుండుబొమ్మవరమే బమ్మెర యని యు లేమ్బల యనునది జన్మాంతరములఁ గ్రమముగా లేమలవాడ, లేములవాడ వేములవాడ యైనట్టు బమ్మెర బొమ్మెర యై యావల బొమ్మరయై పిదప బొమ్మవర మయినదని వాదించియుందును. పంతులవారివలె నూహ లన్నియుఁ బరమప్రమాణము లని వాదింప నామన సొప్పదు. ఊహలూహలె. అవి సత్యము లను నెడల నాధారములు కనఁబఱుపవలయును. ఇఁకను బొమ్మెరయే బమ్మెర యని యోరుగంటివాదు లాధారము కనఁబఱుపక యూరక హఠవాదము చేసిరా బొమ్మవరమే బమ్మెర యని యొంటిమిట్టవాదులు వాదింతురు. వారివాదమునకు వారు ప్రమాణము కనఁబఱచినపుడు వీరి వాదమునకు వీరు బ్రమాణము కనఁబఱుతురు.

రామయ్యపంతులవారి యభిప్రాయప్రకారము బమ్మెరయనునది గ్రామనామముగా గ్రహించినను వారివాదమునందు బలములేదనినిరూపించితినిగదా. ఒక విధమునఁ జూడ బమ్మెర యనునది గ్రామనామము గాదని తోఁచుచున్నది.

బమ్మెర యనుశబ్దమునకు నిలుకడలేనిది, చలించునది యనియర్థము. ఇది భ్రమ శబ్దమునకుఁ దద్భవమని సీతారామాచార్యులవారు వ్రాసిరి. భ్రము-అనవస్థానే (తిరుగుట) యనుధాతువువలనఁ గలిగినది భ్రమ-కావున బమ్మెరకు నదే యర్థము. దీనికిఁ బ్రయోగములు. "ఎలదేఁటిదాఁటులకా! బమ్మెరవోవఁ బోలు తెగబారెఁడు వెంద్రుకలు"—మను. "బమ్మెరపోకతో" అని పంచతంత్రము. ఇంకను బ్రయోగములు కలవు. గ్రామ మెన్నఁటికి నిలుకడగా నుండునుగాని తిరుగుచుండదు గదా. కావున బమ్మెర యనునది గ్రామనామముగా నుండ దనుట తప్పు గాదు. మనుష్యులయింటిపేరుగా నెట్లుండఁగల దందు రేని వినుఁడు.

ఆంధ్రులయింటిపేర్లు నానాకారణములు గలవి. రామాయణము చెప్పువారు రామాయణమువారు, భారతమును జెప్పువారు భారతమువారు, పురాణము చెప్పువారు పురాణమువారు. ఇతరులచే భుజింపక స్వయముగఁ బాకముచేసికొనువారు స్వయంపాకాలవారు. సుంకరివృత్తియం దుండువారు సుంకరివారు. ఈవిధముగ నాచనవారు, పోతరాజువారు, ఏనుఁగువారు, కస్తూరివారు, చదువులవారు, పాగావారు, లోనగునింటిపేర్లు గలవు. బమ్మెరవారను పేరును నిట్లే వచ్చియుండవలయును. పోతరాజు పూర్వు లొకచోట నిలుకడలేక నానాదేశముల భ్రమించుచుండినవా రగుటచే బమ్మెరవా రైరి కాఁబోలు. దీనికి సరియైన యాంగ్లనామము Nomads. "Nomad = పశుచారోపజీవికా-అస్థిరవాస" యని ఆప్టి నిఘంటువు. పోతరాజు పశుచారోపజీవి యనియుఁ గింవదంతి కలదుగదా. కావున బమ్మెర యనునది గ్రామనామమని పొరపడి కించిత్సామ్యము గలదేనితోనో ముడిపెట్టక యీ వ్యుత్పత్తి గ్రహించుట బాగని తోఁచుచున్నది. ఇది యూహామాత్రమే. ఇది సరి కాదని పంతులవారు సప్రమాణంబుగ నిరూపింతురుగాక. ఈయూహ సరియైనను గాకున్నను నావాదమునకు హానిలేదు గాని దీని నిరాకరింపఁ జాలకపోయిరా పంతులవారివాదము సమూలము చెడినది.

3. బమ్మెర, బొమ్మెర యొకటైనను బమ్మెర పోతరాజు బమ్మెరలోనే యుండెననువాదము నమ్మరా దని నేను వ్రాసితిని. దీనిపైఁ బంతులవారు "కొంతమంది తమయింటిపేళ్లు గలయూళ్లలోనే కాఁపుర ముండవచ్చును. ఇంటిపేళ్లుగల యూళ్లలో నివాసము చేయుచున్నవారలఁ బలువుర నేనెఱుఁగుదును. అట్టివారు బొత్తిగా లేరని సుబ్బరావుగారును జెప్ప సాహసింప లేదు" అనిరి. ఎట్టి సందర్భములందు గృహనామము గ్రామనామ మొకటిగా నుండునో యాసం

దర్భముల నెల్ల నాప్రథమవ్యాసమున విశదీకరించితిని. అది సరికాదని పంతులవారు చెప్పఁజాలరు. ఇంటిపేర్లు గలయూళ్లలో నివాసము చేయు పలువురిలో నేను జెప్పినసందర్భములకు లోపడనివా రెందఱున్నారో వీరు విచారించిరా? నేను జెప్పినసందర్భములకు లోపడినవా రైనయెడల నది వీరివాదమున కెట్లుపకరించును? నేను జెప్పినసందర్భములకు లోపడక సృష్ట్యాది నేఁటివఱకు నొకగ్రామమందే యుండి యాయూరిపేరే తమగృహనామముగఁ గలవా రెందేని యుండిన నుండవచ్చునని వాదమునకై యంగీకరించెదను. ఆంధ్రదేశమునఁ గలకుటుంబముల సంఖ్య యెంత? మీఁదఁ జెప్పఁబడినట్టికుటుంబముల సంఖ్య యెంత? ఇది దానిలో నెన్నవవంతు? పదివేల కొకకుటుంబమైనఁ గలదా? ఈ ప్రశ్న నేనుమున్నే యడిగియుండ స్పష్టమైనప్రత్యుత్తరము వ్రాయక తేరమాటలు వ్రాయనేల? ఒకవేళ నున్నను సందిగ్ధవిషయములో బహుజనుల కన్వయించు సామాన్యవిధి నన్వయింపక యపవాదవిధి నన్వయింప నేమికారణము? ఇటు చేయుట లోకసమ్మతమా "శాస్త్రసమ్మతమా?" Exception is no rule. అపవాదములు విధులు గావనుట వీరెఱుంగరా? బమ్మెర యపవాదములోఁ జేరిన దనుట కేమి యాధారము? ఊహ. ఈవిషయమున వీరియూహ కేవల మసత్యమనుటకు రెండవభాగమున నాధారములు సూచించియున్నాఁడను.

4. "శ్రీరామలింగాంఘ్రి సేవావరప్రౌఢిఁ గవితాచమత్కృతు ల్గాంచువారి
నప్పలమ్మయును వీరాంబయుఁ బ్రౌఢసరస్వతికిని గన్నప్రజ్ఞవారిఁ†
శౌండిన్యగోత్రవిఖ్యాతి బమ్మెరభవ్యవంశాఢ్యులై సిరివఱలువారి
నివటూరిముక్తి నాగేశసద్గురుభక్తి నాదిమశైవులైనట్టివారిఁ
గేసకవిమల్లకవినామకీర్తిపరుల మమ్ముఁ బిలిపించి.

---

† ప్రౌఢసరస్వతిపద్దు కేసన కున్నట్టు లజ్జరపుఁ బేరయలింగకవియుఁ "ప్రౌఢసరస్వతి యను బిరుదందిన కేసనకవి (పోతనమనుమఁడు) అని" రావుబహదర్ వారును వ్రాసి యున్నారు. ప్రౌఢసరస్వతు లిరువురో యొకరో రావుబహదర్ వారే పరిష్కరింపవలయును. రావుబహదర్ వారు ముద్రించినవిధముగఁ బ్రౌఢసరస్వతికి నిరువురుభార్యలు, పెద్దభార్య అప్పలమ్మ, చిన్నభార్య వీరమ్మ. కవితాసంప్రదాయమునుబట్టిచూడ నప్పలమ్మకొడుకు కేసన, వీరమ్మకొడుకు మల్లన, యని తోఁచుచున్నది. గ్రంథమునం దెట్లున్నదో నేనెఱుఁగను. ఇరువురు నొకతెకొడుకు లయియుండినయెడల రెండవ యామెపేరుసు కేసనమల్లనలు చెప్పియుండరు. ఇంతవఱకుఁ జూడఁ బ్రౌఢసరస్వతి తండ్రి యని యప్పలమ్మ తల్లియని వీరికుమారుఁడు కేసన యని యేర్పడుచున్నది.

అని దాక్షాయణీవివాహమున నున్నట్లు రావుబహదర్ వా రనువదించియున్నారు. ఈకవులే "మత్పితామహుని బమ్మెరపోతన" యని వ్రాసియున్నారు. ఈపోతన భాగవతగ్రంథకర్త కాఁడని రెండవభాగమున సిద్ధాంతముచేసియున్నాను. బమ్మెర కేసన-బమ్మెరమల్లనలు కృష్ణామండలమువారని యందే వ్రాసియున్నాను. ఇప్పుడు రావుబహదర్ వీరేశలింగము పంతులవారు బమ్మెరకేసన-మల్లనలు బమ్మెర యందే పుట్టినను గురు జాల మహానగరము గావున నకటఁడుఁ జేరియుందురనియు, గృహనామము బమ్మెరగాఁ గలబమ్మెరకేసన-మల్లనలు బొమ్మెరప్రాంతమువారే యని పంతులవారును వ్రాయఁగలరా ? బమ్మెర యింటిపేరివారు బమ్మెరయందే యుండి రనుట తప్పనుట కిది చాలదా ? ఈవిషయము రెండవభాగమున 432-వ పుటయందు వ్రాసియుండినను దానికిఁ బ్రత్యుత్తరమీయక చర్వితచర్వణంబున వృథాకాలవాగ్వ్యయము చేయనేల ?

బమ్మెరపోతరాజు తొలుత బొమ్మెరలో నుండెనంట. గ్రంథరచనకాలమునాఁటికో యంతకుఁ గొంతముందో యేకశిలానగరము చేరె నంట, తిరిగి యవసానదశకు బొమ్మెర చేరె నంట. చేరకపోయినను గృతజ్ఞులై యాగ్రామము వా రాయనకు జ్ఞాపకముగా విగ్రహము స్థాపించి రంట. ఈయంట లన్నియు మరల నూహలు. ఊహలు. ఊహలు. ఏకశిలానగరవాసులు కృతఘ్నులై రంట యని నే నొక యంట చేర్చెదను,

ఇట్టివాదమునకుఁ బ్రత్యుత్తరము రెండవభాగమున నిచ్చియున్నాఁడను. కావునఁ జర్వితచర్వణ మేల ? ఇదంతయు నోరుగంటివాదుల యనన్యగతికము లైనయూహ లనుట నిర్వివాదము. ఏలన రామయ్యపంతులవారు తమవాదమును బలపఱుచుకొనఁ గొన్నియనుబంధములఁ బ్రకటించిరి కదా. వానియందు

---

పేరయలింగకవి తనమామపేరు ప్రౌఢసరస్వతి యనుబిరుదుగల కేసన యని యత్తపేరు అప్పమ్మయని వ్రాసినట్లు రావుబహదర్ వారు పద్యము ననువదించిరి. ఇప్పుడు అప్పలమ్మ కేసనకుఁ దల్లియా ? భార్యయా ? యనుప్రశ్న కలుగకమానదు. రావుబహదర్ వారు తమయేడుతరముల లెక్క కాపాడుకొనుటకై యిద్దఱప్పమ్మలు నిరువురు ప్రౌఢసరస్వతు లుండి రని వ్రాయుదు రేమో. దానికిఁ దగినయాధారములఁ గనఁబఱిచి యేడుతరములను స్థాపించినను "రావుబహదర్ వారి యిష్ట ప్రకార మేడుతరములుగ లెక్కించినను నిరువురు పోతనలకు నడుమ నూటేండ్లకు మించి యెడము గలదు." అని రెండవభాగమున 437-వ పుటయందు వ్రాసిన నాయభిప్రాయమునకు లోటులేదు. ఈకవులచరిత్రమం దప్పమ్మ యెవరికిఁ దల్లియగునో యెవరికిభార్యయగునో చూడవలయును. అది నా వాదమునకు సంబంధించినది కాదు. కావున నేను దర్కింపఁబనిలేదు.

శ్రీనాథుఁడు భాగవతమును గర్ణాటరాజున కంకితమిప్పింపఁగోరి బమ్మెరపోతనను జూడవచ్చినపుడు పోతరాజు భూమి దున్నుచున్నవృత్తాంతము లోనైనది బొమ్మెర యందు జరగినట్లు వ్రాయఁబడి యున్నది. దీనివలన భాగవతము బొమ్మెరలో రచింపఁబడుచుండె నని యేర్పడెనుగదా ? తమకు ననుకూలము లని తాము వ్రాయించి తెప్పించిన యనుబంధములకు విరోధముగ వీరిపుడు వాదించుట కేమి కారణము ? బొమ్మెరజనులమాట నిజమా ? రామయ్యపంతులవారు రావు బహదర్ వారు చెప్పెడుమాట నిజమా ? పరస్పరవిరుద్ధము లైన యీరెండును నసత్యములే.

5. ఈవిషయమున రామయ్యపంతులవారిని నేనొకటి ప్రార్థించెద. సత్యజిజ్ఞాసువు లైనవీరు నాప్రార్థన నంగీకరింతురుగాక. వీరు న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణులై న్యాయాధిపతిస్థాన మలంకరించి సాక్ష్యస్మృతిప్రకారము న్యాయములఁ బరిష్కరించినవారు కావున ఆ నియమములు తామీవాదమున వాదుల మనుభావమును మఱచి న్యాయాధిపతిస్థాన మలంకరించినట్లె యెంచఁ గోరెదను. అప్పుడు నేనే వాదినై వారియెదుట నిలఁబడి నావాదమున కనుకూలము లని విజ్ఞాపనపత్రికతోడఁ గొన్నిపత్రికల నర్పించితి నని యెంచఁగోరెదను. తరువాతఁ బ్రతివాది విచారణ ముగిసినపిమ్మట నేను నాసంగ్రహోపన్యాసములో నేను సమర్పించిన పత్రములకు విరోధముగను వానిలో లేనివిగను గొన్నివిషయములు చెప్పితి నని యెంచఁ గోరెదను. అప్పుడు వీరు నేనర్పించినపత్రములఁబట్టి తీర్పు చెప్పెదరా ? ప్రతివాదులు చెప్పినమాటలనుబట్టి సవరించికొని నేను నోటఁ జెప్పినమాటలనుబట్టి తీర్పుచెప్పెదరా ? ఇప్పుడు తాము వాదులైనపుడు తద్భిన్నముగ వర్తింప వీరి యంతఃకరణ మెట్లంగీకరించెను ? బమ్మెర బొమ్మెర యనుట యనుబంధముల లేనివాదము ; ఇతరాధారశూన్యము. భాగవత మోరుగంటి యందు రచింపఁబడె ననుట యనుబంధవిరుద్ధవాదము. రావుబహదర్ వారి కిచ్చిన ప్రత్యుత్తరముతో దీనిని గలిపి చదివి యీవిషయ మేకాగ్రచిత్తులై రామయ్య పంతులవా రాలోచింతురుగాక.

"ఇంటిపేరు గలవా రాపేరుగలగ్రామములోనే తరతరములుగ నుండుట యరు దని నేను జెప్పినదానికై బొమ్మెరకు నోరుగంటికి ముడిపెట్టఁగోరి పంతులవారు తొలుత బమ్మెరలో నుండి భాగవతరచనాకాలమందుఁ గాని యంతకుఁ గొంత కాలము పూర్వముగాని యేకశిలానగరమునకు వెళ్లియుండవచ్చును. కావు

ననే తాను బమ్మెరకు సంబంధించినవాఁడని కాని బమ్మెరనుండి వచ్చినవాఁడనికాని సూచించుటకై బమ్మెర యనుగృహనామము పెట్టుకొని యుండును" అని పెద్ద యుక్తి వ్రాసిరి. పంతులవారి యూహలు యుక్తు లనెడుదూదిపోగులపై బమ్మెర పోతనామాత్యుఁడే తనతల్లిదండ్రులగుఱించి "బమ్మెరకేసయలక్కసానికిన్" అని వ్రాసినప్రయోగమను మహాప్రభంజనమును బ్రయోగించెదను. దీనివలన బమ్మెరవా రనుపేరు పోతనతండ్రితాతలకాలమునుండి యున్న దనియుఁ బోతన తాను దనయింటిపేరు పోఁగొట్టుకొని యోరుగంటిలోఁ గూర్చుండి బొమ్మెర యనుమహానగరముపేరు పెట్టుకొని కీర్తిసంపాదింపఁ గాఁబోలు నాపేరు పెట్టుకొనె నను నూహ నిష్కల్మషమిథ్య యనియు స్థాపిత మయ్యెను. దీనితో నైనఁ బంతులవారు సత్యము గ్రహింతురుగాక. మహాశయులారా! కేవలోహ లెంతయనర్థకరములో చూచుఁడు? వాదాభినివేశము లిఖితప్రమాణవిరుద్ధము లగువ్రాఁతలను గూడ వ్రాయించుచున్నది. పంతులవారి ద్వితీయవ్యాసమునం దిట్టినిరాధారోహాపోహములు మఱి రెండు మూఁడు గలవు. కోదండరాముల కృపవలన వానికి నిట్టిగతియే ప్రాపించునుగాక.

రెండవయాధారము.

6. "బమ్మెరపోతరాజు చెప్పినగంగ యేది యనువిషయమున నావాదమునకు ముఖ్యాధార మోరుగంటిప్రాంత దేశమునందలి వాడుక గాని యీప్రయోగములు కావు" అని రామయ్యపంతులవారు వ్రాసిరి.

ఇప్పటి పామరజనవ్యవహారమునుబట్టి పురాణముల కర్థముఁ జెప్పుట యనర్థకహేతు వని నావాదము. దానికి వలసినన్ని దృష్టాంతముల నిచ్చితి. వానిలో నొక్కటియైన సరిగా దని పంతులవారు నిరాకరింపఁజాలకయు మరల నదే వాదము చేయుచున్నారు. అం దొక్కదానినైన వారు శుద్ధాంతఃకరణముతో నాలోచించెదరుగాక. "తల్లిన్ మదిన్నిన్ను భజింతు గంగన్" అను భాగవతపద్యము నుదాహరించి యిందు గంగయనఁగా గోదావరి యని యర్థము చెప్పెదరా? చెప్పరేని యశాస్త్రీయ పామరవాక్యము పరమప్రమాణముగ గ్రహించు టేల చెప్పరు? ఒకచోఁ బామరవాక్యము ప్రమాణ మగుట యెట్లు? రెండవచోటఁ గాకుండు టెట్లు? పోతరాజు గోలకొండదేశమువాఁ డనునూహయే గ్రహించుటకుఁ గారణ మందురేని యీవాదమే నిలువఁ గాళ్లులేకుండఁగా దానినాధారము చేసికొని యితరవిషయములు వ్రాయుట గోడలు లేనిమిద్దె కట్టుట కాదా? పోత

రాజు గోలకొండదేశమువాఁ డనునూహ యావలఁ గట్టిపెట్టి చదివెడివా రెవ్వ
రైన గంగ యనఁగా గోదావరి యని యర్థము చెప్పెదరా ? అట్లు చెప్పసాధ్య
పడదేని యిది స్వతంత్రాధారము కాఁగలదా ? బమ్మెరపోతరా జోరుగంటివాఁ
డనుటకుఁ గదా దీనిని మీరాధారముగ గ్రహించితిరి ? దాని కాధారము బమ్మెర
పోతరా జోరుగంటివాఁడను నూహయే కదా? అట్లయినచో నిందు నన్యోన్యాశ్ర
యత్వము లేదా ? యని ప్రశ్నించితిని. రామయ్యపంతులవారు ప్రత్యుత్తరము
చెప్పఁజాలరైరి. స్వవాద మనునభిమానమును విడిచి యీయొక్క విషయమును
జక్కఁగ నాలోచించిరేని తమవాదము దుర్బలము గాదు నిర్బల మని పంతుల
వారికే తోఁచఁగలదు.

7. "సజ్జనానుమతంబున గంగకుం జని" యనునది యెట్లు గ్రహణస్నా
నపక్షమున సమర్థించెద రని యడిగితిని. దానికిఁ బ్రత్యుత్తరము లేదు. "అభ్రం
కషశుభ్రసముత్తుంగభంగ యగుగంగకుం జని" యనుచో విశేషణము లెట్లు
గోదావరీపరమున సార్థకము లంటిని. దానికిఁ బ్రత్యుత్తరము లేదు కాని పోతన
యనుప్రాసప్రియుఁడు కావునఁ బ్రయోగించె ననిరి. "భంగయగు దక్షిణ
గంగకుం జని" యని వ్రాసియుండినచో ననుప్రాసనియతికి భంగము కలదా ?
సందిగ్ధదోషమున కేల పాలుపడెను ? అనుప్రాసముల నడుమ మాటలు రా
రాదా ? వ్యవహితంబులు పరిష్కృతంబులు భాగవతంబున లేవా. "రాకానిశాకా
లంబున సోమోపరాగంబు రాకఁగని" యనుచో నాయననియతికి భంగము
కలిగెనా ?

"అభ్రంకషశుభ్రసముత్తుంగ" యనునది వ్యర్థపద మని పంతులవారన
సాహసింతురా ? ఈప్రశ్నములకు నొకదానికిఁ బ్రత్యుత్తరము లేదు. "గోదా
వరి గంగయనుట లోకవ్యవహారరూఢ" మని పంతులవారనుట సరిగాదు. ఆలం
కారికమతమున రూఢి యెట్టిదో పంతులవారు మఱచిరి. భరతఖండ మందెందు
నీవాడుక లేకుండుట యటుండ నాసికాప్రాంతమందైన భద్రాచలప్రాంతమం
దైనను రాజమహేంద్రవరప్రాంతమందైన హైదరాబాదునగరమందైనను
గోదావరిని గంగయని లోకులు పిలువరు. కావున 'లోకవ్యవహార,మనునది 'లోకైక
దేశకోణకోట్యంశభాగవ్యవహార' మనవలయును. ఇట్టిది రూఢి గాదు. "సత్కవిప్ర
యోగావిరుద్ధ"మనుటయు సరిగాదు. మహాకవు లెవ్వరు సందర్భమునకుఁ బొసఁగని
సందేహదుష్టములగువాక్యములను నేయార్థములను వ్రాయ లేదు. సందర్భములను

బట్టి స్పష్టముగ గోదావరి యని యర్థమగునట్లు వ్రాసియున్నారు. సందర్భమునుబట్టి గోదావరి యని గ్రహింపరాని గంగాపదమును నేమహాకవి ప్రయోగించెను? ఆప్రయోగమేది? ఏల దానిని బంతులవా రుదాహరింపరైరి? గోలకొండదేశ కవు లెవ్వరైన నట్లు ప్రయోగించిరా?

"చంద్రగ్రహణమునకు మిక్కిలిదూరమున నున్నభాగీరథికిఁ బోవుటకంటె ననతిదూరమం దున్నగోదావరివంటి మహానదికిఁ బోవుట సామాన్యలోకాచారానుసారము. పోతరాజు భాగీరథికిఁ బోయియుండఁగూడదని నావాదము కాదు. పోయినఁ బోయి యుండవచ్చును. కాని తగినంత యాధారము లేక యంతదూరము చంద్రగ్రహణనిమిత్తమాత్రమున వెళ్లెననుట సమంజసము కాదని నామతము" అని పంతులవారు చర్వితచర్వణము చేసిరి. దీనికిఁ బ్రత్యుత్తరము నా ప్రథమవ్యాసముననే వ్రాసితిని. అయినను మరల వారితృప్తికై పిష్టపేషణము చేయవలసివచ్చి చేసెదను.

"సోమోపరాగంబు రాకఁ గని" యనుచోఁ గని యనఁగాఁ దెలిసికొని యని యర్థము. కనుధాతువు జ్ఞానార్థమునఁ బ్రయోగింపఁబడినది. ఇఁక సంవత్సరమునకో యాఱునెలలకో పుష్కరము వచ్చు నని తెలిసికొనుట యెట్టిదో యిదియు నట్టిద. గంగాయాత్ర కవియుద్దేశ్యముకాని కేవలగ్రహణస్నానము కాదు. "సజ్జనానుమతంబున" ననుప్రయోగమే కవియుద్దేశమును దెలుపుచున్నది. ఈయుద్దేశము గలవాఁడై యుత్తదినముల గంగాస్నానముచేయుటకంటె గ్రహణకాలస్నానమున నెక్కువఫలము గలదని శాస్త్రములు చెప్పుటచే నాసమయమున కక్కడఁ జేరఁబోయెను. అటుకాదేని ౧౮౦ మైళ్లు గ్రహణస్నానమునకే పోయినాఁడనుట నమ్మరానిమాట. ఈప్రకారము నేను సమాధానమిచ్చి యుండియు మరలఁ బంతులవారావిషయమే వ్రాయుట వ్యర్థశ్రమము. గంగాయాత్ర సంకల్పించినవారు సమీపకాలమునఁ బుష్కరము తటస్థించునేని యాసమయమునకు సరిగ గంగఁ జేరఁబోయినట్లే గ్రహణకాలమునకు సరిగఁ బోతన గంగఁ జేరఁబోయెనని గ్రహింపవలయును.

ఈవిధముగఁ బంతులవారియాధారములు రెండును రెండుత్రోవలు పట్టినవి. ఇఁక వీరి యాధారములబల మెట్టిదో చూతము.

బమ్మెర గ్రామనామ మనుకొనుట మొదటియూహ. బొమ్మెరయే బమ్మెర యనుకొనుట రెండవయూహ. బమ్మెర పోతరాజు బొమ్మెరలో నుండె ననుట

మూఁడనయూహ. గ్రంథము వ్రాయ బొమ్మెరఁబో స్థలములేమిని గాఁబోలు నోరు గంటికిఁ బోయె ననుట నాలవయూహ. గ్రంథము ముగియఁగానే మరల నూరికి వచ్చె ననుటయైదవయూహ. రాకుండినను నోరుగంటివారు కృతఘ్నులై యాయ నను స్మరింపమిని బొమ్మెరవా రాయనపేర బొడ్డురాయి నిలిపి రనుట యాఱవ యూహ. పోతరాజు గోలకొండవాఁ డనునూహచే గంగ యనఁగా గోదావరి యనునూహయూహపై నేడవయూహ, గంగ యనఁగా గోదావరి యని యూహిం చుటచేఁ బోతరాజు గోలకొండవాఁడనుట యెనిమిదవయూహ. ఇన్నియూహలనా ధారముగఁ గలదియోరుగంటివారివాదము. రామయ్యపంతులవారి వ్యాసమం దెచ్చటఁజూచినను "నూహించుట సమంజసముకదా" యను వాక్యములే కాని కడిగిగాలించి వెదకిన నొక్కచోటనైన వెలిగందల, ఏర్చూరుతప్ప, నిది గ్రంథస్థము ఇది ప్రత్యక్షప్రమాణము నను వాక్య మొకటయినఁ గానరాదు కదా ? ఈ వాదము నందుఁ గానవచ్చునది పంతులవారి ప్రతిభావిశేషమే. వాదకుశలులు మేధావులు నగువారు పూని పుష్పితవాక్యంబుల గంధర్వనగరంబు నిర్మించుటచే నోరుగంటి వారివాద మింతదూరము పెరిఁగినది కాని లేనియెడల నెన్నఁడో యుహ్వోనిన నెగిరిపోయి యుండును.

తాము బమ్మెరపోతరాజు వంశమువార మని నెల్లుట్లవారు చెప్పుచుండుట ప్రత్యక్షప్రమాణము గాదా యని పంతులవా రడుగవచ్చును. నిస్సందేహముగ నున్నయెడల నది ప్రమాణమే. అయినను నోరుగంటివాది యైనరావుబహదర్ కందుకూరి వీరేశలింగము పంతులవారు "శేషాద్రిరమణకవులు కృష్ణాపత్రికలో నెల్లుట్ల నారాయణకవినిగూర్చి వ్రాయునపుడును తత్పూర్వమున నెల్లుట్ల నృసింహ రావుగారినిగూర్చి వ్రాసినపుడును వారు బమ్మెరపోతరాజువంశమువారని వ్రాసి యున్నారు. ఈకథ యెంతమాత్రమును విశ్వాసార్హ మైనదికాదు" అని వ్రాసి యున్నారు. రావుబహద్దర్ వారి వ్రాఁతను నేను స్వతంత్రవిమర్శనము చేయక నమ్మఁజాలనుగావున నిప్పు డింతమాత్రము చెప్పఁగలను. నెల్లుట్లవారినిగుఱించి యోరుగంటివాదులు వారిలో వారే వాదులాడునపుడు నే నెవరివాక్యము ప్ర మాణ మని గ్రహింపఁగలను ? వారితగవు పరిష్కారమగువఱకు నది నిస్సందేహ మైనప్రమాణము గాదు కావునఁ ద్రోచివైచితిని. రావుబహద్దర్ వారి వ్రాఁత యోరుగంటివారివాదమునకుఁ బిట్టపిడుగై వారి కుండినయొకయాధారమును నాశముచేసినది.

8. నేను భాగవతసీసపద్యము నుదాహరించినపిమ్మటఁ బోతనకుఁ బ్రత్యక్షమైన దేవుఁడు కోదండరాముఁ డనుమాట సత్యమే యని యంగీకరించిరి గాని "కోదండరాముఁ డొంటిమిట్టలో మాత్రమే వెలసియుండలేదు. అనేకగ్రామములలోఁ గోదండరామస్వామియాలయములు గలవు. కావునఁ గోదండరామస్వామి యున్నంతమాత్రమున నొంటిమిట్టకోదండరామస్వామియే యని సిద్ధాంతము చేయ న్యాయ్యము కాదు." అని పంతులవారు వ్రాసిరి.

రామయ్యపంతులవారు వారిప్రథమవ్యాసములో బొమ్మెరలోని పోతరాజునుబట్టి కవి కానామము వచ్చియుండవచ్చు నని వ్రాసిరి. దానికిఁ బ్రత్యుత్తరముగ నేను బోతరాజు గ్రామగ్రామములలో నుండుటచే నేపోతరాజునుబట్టియైనఁ గవి కాపేరు వచ్చియుండవచ్చు నంటిని. అనఁగా నొంటిమిట్టలోను దత్ప్రాంత గ్రామములలోను గ్రామదేవత లుండుటయు జాతరకాలములోఁ బోతరాజు లూరేగుటయు సర్వజనవిదితము. కావున నొంటిమిట్టలోని పోతరాజునుబట్టి కవి కానామము వచ్చి యుండవచ్చు నని వ్రాసితిని. నావాక్యమునకు బదులువాక్యమును బంతులవారు వ్రాసిరిగాని దానివలనఁ దమవాదమునకుఁ గలుగులోటు విచారింపరైరి. వివాదగ్రామము లోరుగల్లు ఒంటిమిట్ట బొమ్మెర. పోతరాజునకుఁ బ్రత్యక్షమైన దేవుఁ డీగ్రామములలోని వాఁడనుట సమంజసమో దేశాంతరగ్రామాంతరవాసి యనుట సమంజసమో మీరే యాలోచింపుఁడు. ఓరుగల్లు బొమ్మెరలందుఁ గోదండరామాలయములు లేవు. ఒంటిమిట్టయం దున్నది. ఇప్పుడెచ్చటిదేవుఁడు ప్రత్యక్ష మయ్యెననుట సంభావనీయమో మీరే యోజింపుఁడు.

9. "విగ్రహములు ప్రతిష్ఠింపఁబడినక్షేత్రములపేర్లు సూచింపఁబడనియెడలఁ గృతిపతు లర్చావిగ్రహములు కా వనియే యూహింపవలయు" నని మఱియొక యాక్షేపము.

ఈయూహ సత్యము గాదనుటకు నెల్లూరిహరిహరనాథతిక్కన లేసాక్షులు. మఱియొకసాక్ష్యము భానుమతీపరిణయంబున

ఉ. శ్రీలఁ జెలంగుసత్త్వగుణశీలత నిర్మలమూర్తివయ్యు మై
నీలరుచు ల్వహించితివి నీమదిలోపలి నీలకాంతు లీ
లీలఁ బ్రకాశమయ్యెను భళీ యనుశ్రీయలిమేలుమంగ కాం
తాళమరీచి బొమ్మునను దాల్చిన వేంకటభర్తఁ గొల్చెదన్."

అని యున్నది. ఇది "వెలుగోటి రాయశౌరి" కంకితము. ఆపుస్తకమం దెక్క-

డను దిరుపతిపేరుగాని వేంకటేశ్వరాలయములుం మఱియే యూరిపేరుగాని లేదు. అలిమేలుమంగా శ్రీవేంకటేశ్వరు లర్చావిగ్రహములు కావని పంతులవా రనఁగలరా ?

10. ఒంటిమిట్ట దేవాలయములో సీతారామలక్ష్మణవిగ్రహము లున్నవ నియుఁ బోతరాజు లక్ష్మణవిగ్రహమునూట తలఁపలేదు గావున నొంటిమిట్ట దేవాలయములోని విగ్రహ మాతని (పోతన) మనస్సులో లేదనియే చెప్పవలసి యున్నది." అని మఱియొకయాక్షేపము. దీనికి సమాధానము.

రామదాసుని జెలనుండి విడిపింప రామలక్ష్మణులుమాత్రమే ప్రత్యక్ష మైరి గనుకను, భద్రాద్రి రామస్వామిదేవాలయమున సీతారామలక్ష్మణు లుం డుటచే రామదాసును రక్షించినవారు భద్రాద్రిరాములు గారని పంతులవారు చెప్పఁగలరా ?

లోకమంతయు నమ్మెడునది పంతులవారికి బ్రమాణము గాదేని "శ్రీ వాసజ్జటప్రోలీ భావుకపత్తనవిహారపటుశీలున" కంకితమీయఁబడిన చంద్రికాపరి ణయంబున

"అని యిష్టదేవతావందనంబును..........గావించి యేనొకమహాప్ర బంధనిబంధనంబున కుద్యోగించి యున్నతత్పుణ్యగాత్రంబున

సీ. పరువంపునగుంపు బలితంపు జిగిపెంపుఁ గనిరొప్పు పాణియుగ్మములతోడఁ
జెలువందునరవిందములయందములు చింద నసునొందఁ గలకన్నుఁగొనలతోడ
జగడంబు గనునంబుముగయంబు జగడంబు మేలంబు లాడునెమ్మొనితోడఁ
దులకించుబలుమించుఁదలఁకించు నెఱమించు గమిమించు హేమాంశుకంబుతోడ
మారుఁబలుమాఱుఁ గేరుమైతీరుతోడసోమునలయించు నెమ్మోముగోముతోడఁ
బరఁగుమాపాలిమదనగోపాలమూర్తి యంచితస్ఫూర్తి సాక్షాత్కరించి పలికె."

అని యున్నది దేవాలయమందుఁ గృష్ణవిగ్రహముతోడ రుక్మిణీవిగ్రహము నున్నది. ఇచ్చట రుక్మిణిపేరు కవి తలంపఁడయ్యెఁ గావునఁ గవికి సాక్షాత్కరిం చినదేవుండు జటప్రోలిమదనగోపాలమూర్తి కాదనఁ బంతులవారు సాహసిం తురా ? ఈయుక్తులు పంతులవారిప్రతిభ యత్యద్భుత మనియుఁ బొదిలోనమ్ములు క్షయించిన వనియుఁ దెలుపుచున్నవి.

11. భువనగిరికి నేకశిలానగర మనునామ మెట్లయిన నేమి పంతులవా రంగీ కరించిరి. బమ్మెరపోతరాజు సూర్యగ్రామమువాఁ డనియు, దానిని లోకమున రూఢిపఱుచుటకే యేకశిలానగర మని యాయన వ్రాసెననియు భువనగిరివాసులు చెప్పినఁ బంతులవా రేమి ప్రత్యుత్తర మిచ్చెద రని యడిగితిని. దానికిఁ బ్రత్యు త్తరము లేదు. భువనగిరికి నేకశిలానగర మనునది యిటీవల సాధింపఁబడినదఁట. ఎప్పుడు ? ఎవరిచేత ? అకటా ! నొంటిగుట్ట పుట్టిన దెపుడు ? రెంటికి నర్థములో భేదముండిన నేమికోపము ? భిన్న కారణములచే భిన్న నామములు రారాదా ? ఇవి పంతులవారు దెలుపరైరి

భువనగిరికి నేకశిలానగ రయిన కేమిసంబంధమని కడపలో సభలో నే నడిగి నపుడు భువనగిరియం దేకశైల ముండుటచే దాని కాపేరు వచ్చె నని పంతుల వారు చెప్పలేదా ? ఇప్పు డా భేదము కల దనుచున్నారు. ఆ భేద మేదియో తెలుపరైరి.

ఏకశిలానగర మనుపే రు భువనగిరికి, నోరుగంటికి, నొంటిమిట్టకుఁగూడఁ గలదని నా వాదము. ఒంటిమిట్ట కాపే రీవివాదము పుట్టకముందే పుట్టిన దనుటకై

(1) పురాణము హయగ్రీవశాస్త్రులవారి భాగవతపీఠిక.

(2) Madras Man l of Administration.

(3) స్కాందపురాణము నుండి తెనిఁగింపఁబడిన యేకశిలానగరమా హాత్మ్యము పద్యకావ్యము.

ఈమూఁడును బ్రమాణములుగ నిచ్చితిని. ఈమూఁటియందును నేను వ్రాసినట్టు లుండుట సత్యమని యంగీకరించుచు రామయ్యపంతులవారు కొన్ని యాక్షేపములు వ్రాసిరి.

అందు (1) "ఈమూఁడుగ్రంథములలో హయగ్రీవశాస్త్రిగారిపీఠికయే ప్రప్రథమము. ఇది రైన నిం టి కఱువదితొమ్మిదిసంవత్సరములకుఁ బైగాఁ బుట్టి నది. పోతరా జొంటిమిట్టనివాసియగునో కాఁడో హయగ్రీవ శాస్త్రిగారు స్వయ ముగ నెఱిఁగియుండరుగదా. ఏ కారణములంబట్టి తమ కాయభిప్రాయము గలి గెనో యాయన చెప్పియుండలేదు" అని పూర్వపక్షము. దీనికి నాప్రత్యుత్తరము. హయగ్రీవశాస్త్రులవారు బమ్మెరపోతరాజుసమకాలికు లని నేను జెప్పలేదు. వారిది సృష్టించినారని పంతులవారును జెప్ప సాహసింప లేదు. ఏ కారణములంబట్టి

యాయనకాయభిప్రాయము కలిగెనో యాయన చెప్పియుండలేదనుట సరిగాదు. వారు స్పష్టముగ "ఈవిషయమంతయు బమ్మెరపోతనామాత్యుని జన్మకర్మప్రభావాదులం దెలిపెడు వచనరూపం బగుప్రాచీనపండితజనలిఖితగ్రంథంబు రప్పించి యందుఁ దెలిపియుండెడు క్రమమున నతిసంగ్రహముగా నిందు తెలుపడమైనది" యని యిట్లు వ్రాసియే యున్నారు. ఈవాక్యమును నేను దమకుఁ గనఁబఱిచిన భాగవతమునుండి యెత్తి తమపుస్తకములో వ్రాసికొనియుండియు నిట్లు వ్రాయుటయేలొకో? వృథావాదము పెంచుటకా? ఒంటిమిట్ట వారి వాదము మఱింత బలపఱుచుటకా? దీనివలన హయగ్రీవశాస్త్రిలవారు స్వకపోలకల్పన మేదియుఁ జేయలేదనియుఁ గేవలజనశ్రుతిని నమ్మి వ్రాయలేదనియుఁ దమమనుష్యులఁ బంపి వారు వ్రాయించి తెప్పింపలేదనియుఁ బ్రాచీనపండితులు లిఖితరూపముగ వ్రాసియుంచిన దాని నాధారము చేసికొని వ్రాసిరనియు నందు బమ్మెరపోతరా జొంటిమిట్టనివాసి యని వ్రాయఁబడియున్నదనియు, శాస్త్రిలవారు భాగవత పీఠిక వ్రాయుటకుఁ జాలకాలము ముందే యీవిషయము లిఖితగ్రంథరూపంబున దేశంబున విరాజిల్లుచుండె ననియు స్పష్టపడియెను.

హయగ్రీవశాస్త్రిలవారు నిరాధారముగ వ్రాసిరని కల్పించుకొని రామయ్యపంతులవారు మఱియు నిట్లు వ్రాసిరి.

"ఆయన కడపమండలమందుఁ బుట్టినవాఁడు కాకపోయినను గొంత కాలము కార్యవశమునఁ గడపలో నివసించియుండి రని వారి బంధుకోటిలోనివా రగుచదలువాడ సుందరరామశాస్త్రిగారు చెప్పుచున్నారు. ఆకాలమం దీప్రతీతిని హయగ్రీవశాస్త్రిగారు కడపలో వినియుండవచ్చును."

హయగ్రీవశాస్త్రిలవారు తమకుఁ గలయాధారము చెప్పియుండుటచే నిదంతయు నాకాశపంచాంగమే. అయినను హయగ్రీవశాస్త్రిలవారు కడపలో వసించినారనుట కల్ల యని కొందఱు పుదూరుద్రావిడులు నాతోఁ జెప్పియున్నారు. ఈవిషయము కడపలోనే పంతులవారికిఁ జెప్పితిని.

"ఈప్రతీతిని హయగ్రీవశాస్త్రిగారు కడపలో విని యుండవచ్చు" నని పంతులవారు వ్రాయుటచే జగద్విశ్రుతప్రతీతి చిరకాలముగ నున్నట్లే పంతులవా రంగీకరించిరి. ఇట్టి దొరుగంటికిఁ గుందేటికొమ్ముకదా. బ్ర॥శ్రీ॥సుందరరామశాస్త్రిలవారిని మీ రిట్లుచెప్పుట కేమియాధార మని పంతులవా రడిగిరా? అడిగియుండినచో గుట్టు బయటఁబడి యుండును. కొండూరు శ్రీనివాసశాస్త్రిగారికి ముం

దు కడపలోఁ బుదూరు(ద్రావిడులు లేరని యనేకులు చెప్పియున్నారు. సుందర రామశాస్త్రులవారి యుత్తరమును మీరు ప్రకటించెద రేని దానికిఁ దగినప్రత్యుత్తరము నేనును బ్రకటించెదనని పంతులవారితోఁ జెప్పితిని. దానిని వారు ప్రకటింపమిచే నది విమర్శనక్షమము గాదని యేర్పడెను.

(2) Madras Manual of Administration లోని వ్రాఁతకును హయగ్రీవశాస్త్రులవారిపీఠికయే కారణమై యుండవలయునని యాక్షేపము. ఇదియుఁ బంతులవారియూహ. ఈవ్రాఁతకు శాస్త్రులగారిపీఠికయే యాధారమో లేక పీఠిక కాధార మైనవచనగ్రంథమే యాధారమో లేక మఱియేదైనఁ గలదో. ఎటుచూచినను నొంటిమిట్టపక్షపాతులచే నీగ్రంథము వ్రాయఁబడిన దని పంతులవారు చెప్పఁజాలరు. ఇట్టి దోరుగంటికి నాకాశపుష్పముకదా?

(3) ఏకశిలానగరమాహాత్మ్యములోనికథ కొంత విలక్షణముగా నున్నదని యొంటని, మిట్టని చరిత్రము వ్రాసి "దీనినిబట్టి యేకశిలానగర మనువేరు రామతీర్థముపైఁ గప్పినరాతినిబట్టి పుట్టినదిగాని యొంటిమిట్టకు భాషాంతరము గాదని తేలుచున్నది. ఈవ్యుత్పత్తి సుబ్బరావుగారి మతానుసారము గాదు" అని రామయ్యపంతులవారు వ్రాసిరి. ఒంటిమిట్టకు నేకశిలానగర మను పేరు వచ్చుటకు నే నిదివఱకుఁ జెప్పినకారణములు గాక యిది క్రొత్తది. దీనిని నేను వ్రాయమఱచితిని. నేను జేయవలసినపని పంతులవారు చేసిరిగావున వారికి నమస్కారము. ఇది నామతానుసారము గాదనుట సరిగాదు. రామతీర్థముపై మూసినది యేకశిలగదా. ఈవ్యుత్పత్తివలన నా వాదమున కేహానియు లేదు. ఒంటిమిట్టకు నేకశిలానగర మనుపేరు లేదని చెల్లదని పంతులవారివాదము. ఒంటి కొండ యొంటిబండ సిద్ధముగానున్నవి. పంతులవారి కేది సరిపడిన దానినే గ్రహింపవచ్చును.

12. "ఈగ్రంథము స్కాందపురాణము ననుసరించి రచింపఁబడినది గావునఁ బరమప్రమాణ మని సుబ్బారావుగారివాదము. స్కాందపురాణమును గవి చూచియుండలేదు. దానినిబట్టి యెవరో వ్రాసినారన్నవచనమునుబట్టి గ్రంథము రచించినాఁడఁట. స్కాందపురాణ మన దిక్కులేనిక్షేత్రమాహాత్మ్యముల కెల్ల దిక్కు. కావుననే యఱవమున "ఈపొయికందపురాణత్తిలియు మిల్ల" (ఈకల్ల స్కాందపురాణమునందును లేదు) యనుసామెత పుట్టినది." అని రామయ్యపంతులవారు స్కాందపురాణముపై దెబ్బతీసిరి. ఈవిషయమున నేను జెప్పవలసిన

దింతయే. తెనుఁగున నేకశిలానగరమాహాత్మ్య మీవాదము పుట్టుటకుముందే పుట్టి నది. ఆకవి సంస్కృతస్కాందపురాణమున నుండుదానిని తెనిఁగించెద నన్వ్రాసి యున్నాఁడు. ఆవిషయకపద్యమును ప్రథమభాగమున ననువదించితిని.

ఇఁక స్కాందపురాణము ప్రమాణగ్రంథ మగునా కాదా యనుట లోకము పరిష్కరింపవలెను. అది యప్రమాణగ్రంథ మయ్యెనేని కాశీత్యాది క్షేత్రము లన్నియు దిక్కుమాలినవే.

స్కాందపురాణములోని దగుటచే నొంటిమిట్టమాహాత్మ్యము కల్లగ్రం థమనిగదా వారివాదము. వారే వేములవాడ క్షేత్రమాహాత్మ్యములో "నా స్థలమునకు దక్షవాటి యనుసంజ్ఞకూడఁ గలదు" అని కొన్నిశ్లోకముల నుదాహ రించి యవి భవిష్యోత్తరపురాణములో నున్నట్లు వ్రాసిరి. ఈభవిష్యోత్తరపురా ణము బొంబాయిలో వేంకటేశ్వరముద్రాక్షరశాలవారు ప్రకటించియున్నారు. దీనిలో నీవేములవాడ క్షేత్రమాహాత్మ్య మేపుటయందున్నదో తెలుపఁ బంతుల వారిని బ్రార్థించుచున్నాఁడను. ఈ వేములవాడకుఁ బూర్వపూర్వతరజన్మంబుల లేములవాడయనియు లేమలవాడయనియు లేమ్బలవాడ యనియుఁ బేర్లని పం తులవారు వ్రాయుటచే వీనికి సంస్కృతనామము లైననింబవాటి, దౌర్భాగ్య వాటి, లంజకావాటి యనుపేర్లాగ్రంథమున నున్నవేమో యని వెదకి వ్యర్థప్రయ త్నుఁడనైతిని. ఈనాకష్టమును బంతులవారు పుటసంఖ్య సూచించి సఫలముఁ జేయుదురుగాక. వేములవాడ మాహాత్మ్య మాయూరిపేర్లే తెలుపుచున్నవి. పురాణకథనమేల? తొలుత లేమలవాడ, అక్కడ లంజలుండుటచే నీపేరు వచ్చె నని పంతులవారే సెలవిచ్చిరి. ఆవల "గుత్తలంజలను మరగినవారికి దుత్తేకడ పట" ననుసారంగపాణివాక్యముచొప్పున నది లేములవాడ యయ్యెను. తరు వాత నాదారిద్ర్యవాటి రుద్రవాటియై యందు వేఁపచెట్లు విశేషముగ మొల చుటచే వేములవాడ యయ్యెను. ఇట్టి వాటియఁట దక్షవాటియఁట!! మేలుమేలు ఇదిగదా స్థలభోగ మనునది. రాజేశ్వరుఁడు రాజ్యము చేయుకాలములో వాని ప్రీతికై రాజరాజేశ్వరమాహాత్మ్య మని భీమలింగ ముండుటచే గోదావరిమండల స్థదక్షవాటిపోలికగ వేశ్యావాటిని దక్షవాటిగ నెవఁడో మిథ్యావాదిసంస్కృత పండితుఁడు వ్రాసియుండవచ్చును. ఆయసత్యమును బలపఱుప భవిష్యోత్తరపురా ణములో నున్నదని రెండవయసత్య మాడెను. పంతులవారి కది పరమప్రమాణ మయ్యెను. రాజు మెచ్చినది రంభ. తాను మునిఁగినది గంగ. పంతులవారివలె

నేను బురాణదూషణముఁ జేయను. భవిష్యోత్తరపురాణములో వేములవాడ మాహాత్మ్యము లేదందును.

గోదావరిలోని దక్షారామము మాహాత్మ్యము శ్రీనాథుఁడు తెనిఁగించెను. అది స్కాందపురాణమునుండి గ్రహింపఁబడినది కావున శ్రీనాథునికృతము దబ్బఱగ్రంథమే పంతులవారియభిప్రాయప్రకార మగునుగాక. ఈవిషయమున నాకు మఱొకసందేహము. హరిద్వారమునొద్ద దక్షుఁడు యజ్ఞము చేసినస్థలమని ప్రతీతికలదు. దానిని నేను జూచియున్నాఁడను. అచ్చటివారందఱును వైదికు లందఱును నదియే నిజమైన దక్షయజ్ఞవాటి యని విశ్వసించియున్నారు.

ఈవిషయముఁ బంచమవేదమున నీశ్లోకములు గానవచ్చుచున్నవి.

> కస్యచి త్త్వథకాలస్య దక్షో నామప్రజాపతిః
> పూర్వోక్తేన విధానేన యక్ష్యమాణో న్వపద్యత
> తత స్తస్యమఖం దేవాః సర్వే శక్రపురోగమాః
> గమనాయ సమాగమ్య బుద్ధి మాపేదిరే తదా
> తే విమానై ర్మహాత్మానో జ్వలనార్కసమప్రభైః
> దేవస్యానుమతేఽ గచ్ఛ౯ గంగాద్వార మితిశ్రుతిః

గంగాద్వారమునకే హరిద్వారమనియుఁ బేరు :—దీనివలనఁ బంతుల వారి పురాణము బవిసి తెలియవచ్చెఁగదా. గంగాద్వారమన గోదావరీద్వార మని పంతులవా రనరుకదా.

ఇప్పు డీరెంటిలో నేది నిజమైనదక్షవాటిగా నుండునో పంతులవారే నిశ్చ యింప సమర్థులు. వేములవాడ దక్షవాటి యనుట పచ్చిదబ్బఱ. ఇట్టిదబ్బఱ స్కాందమందును లేదనుట యిట్టిసందర్భములనుబట్టి వచ్చినది. హిమవత్ప్రాంత మున ఋషివాటికల నడుమ గంగాతీరంబున దక్షుఁడు యజ్ఞముచేసియుండ లంజ లవాడలో నినుపగజ్జెలతల్లి తాండవమాడుచోట వేఁపచెట్లనడుమఁ జేసియుండు ననుట యెట్టిసాహసము. స్థలమాహాత్మ్యముల రహస్య మంద తాతిఁగినదియే. అద్దపుటిండ్లవసించువా రితరుల ఱాలఱువ్వరాదు.

13. “దీనినిబట్టి యేకశిలానగరమనుపేరు రామతీర్థముపైఁ గప్పినదానిని బట్టి పుట్టినదిగాని యొంటిమిట్టకు భాషాంతరము కాదు” అని పంతులవారు వ్రాసిరి. గ్రామములకు వివిధకారణములచే వివిధనామములు వచ్చు నని నా వాదము. ఆవిషయము ప్రథమభాగములో వ్రాసియున్నాను గావున నిపుడు

చర్వితచర్వణము చేయను. వెలిగందల వేములవాడకు దక్షవాటి యని పేరున్న దని పంతులవారు వ్రాసిరిగదా. లేమ్బులవాడ, లేమలవాడ, లేములవాడ, వేములవాడ, యనువానిలో దేనికి దక్షవాటి యనునది భాషాంతరమో తెలుపఁ బంతులవారిని వేఁడుచున్నాను.

14. "ఈగ్రంథములు మూఁడును ప్రస్తుతవాదము విజృంభింపకపూర్వమే పుట్టినవికావునఁ బ్రమాణములని సుబ్బరావుగారు వాదించుచున్నారు. ఈ వాదము శాస్త్రసమ్మతము కాదు" అనియు ఆయన (పోతరాజు) కీర్తిశేషుఁడైన నాలుగువందలసంవత్సరములకుఁ బైనిఁ బుట్టినపురుషుఁడావిషయము నిజమెఱిఁగియే వ్రాసెనది యెట్లు నమ్మవచ్చును" అనియుఁ బంతులవారు వ్రాసిరి.

హయగ్రీవశాస్త్రిలవారు పోతరాజునకు ౪౦౦ సంవత్సరముల కీవలఁబుట్టుట సత్యము. హయగ్రీవశాస్త్రిలవారికి ౨౦ సంవత్సరముల కీవల రామయ్యపంతులవారు పుట్టుటయు సత్యము. తమకు ముందుండిన "ప్రాచీనపండితులు" వ్రాసినదాని నాధారముచేసికొని వ్రాసినవారు హయగ్రీవశాస్త్రిలవారు. ఎవరో చెప్పినపుక్కిటిపురాణములనమ్మి ౫౦౦ సంవత్సరముల కీవలఁ బగలు లాకాశమెగఁజూచి యోరుగంటిపంచాంగము వ్రాయఁబూనినవారు పంతులవారు. ఈ రెంటిలో నేది యెక్కువవిశ్వసనీయము. ఈవాదము రాకముందు పోతన యోరుగంటి వాఁడని యెవ్వఁడైన వ్రాసియుండెనా?

15. "పోతరాజు జీవించియున్నపుడుగాని యాతఁడు గతించిన పిమ్మటఁ గొంచెముకాలమునకుఁ గాని యీగ్రంథములలో నేదైనఁ బుట్టి యుండినచోఁ బోతరాజు జన్మస్థానవిషయము గ్రంథకర్త సత్యమెఱిఁగియే వ్రాసియుండునని యూహింపవచ్చును," అని పంతులవారు వ్రాసిరి.

ఇది ప్రమాణవాక్యమగునేని యాంధ్రకవులచరిత్ర మేగతిఁ బట్టునో. మఱియొకరి ప్రశంస యేలగాని వేములవాడభీమకవికి రామయ్యపంతులవారు సమకాలికులా? పిమ్మటఁ గొంచెము కాలమువారా? పోతనకు హయగ్రీవశాస్త్రిలకు ౪౦౦ సంవత్సరము భేదముండిన భీమన్నకు రామయ్యపంతులవారికి ౭౦౦ సంవత్సరము లెడము. హయగ్రీవశాస్త్రిలవారికి లభించినట్టు ప్రాచీనపండితలిఖితగ్రంథ మేదైనఁ బంతులవారికి దొరకెనా. ఏమి యెఱిఁగి వీరు భీమకవిస్థలము నిర్దేశింప సాహసించిరి? విషయము తమకు ననుకూలమైనచో శాస్త్రసమ్మతము ప్రతికూలించినచో శాస్త్రసమ్మతము కాదు కాఁబోలు. భీమకవిని గుఱించి నేను

ప్రస్తావించుట పంతులవారివాదమునందలి యసంగతదోషము తెలుపుటకే గాని యావాదమునందు నాకభిమానము గలిగి కాదు. భీమకవివాసస్థాననిర్ణయమున నాకుఁ బట్టుదల లేదు

16. "ఒంటిమిట్టవాకుల కేకశిలానగరశబ్దము వ్యుత్పత్తియే కుదిరినది కా" దఁట. మేలుమేలు. నా వ్యాసమును బంతులవారు చక్కఁగనే పఠించిరి!!

"ఏకశిల యనునది యొంటిమిట్టకు సంస్కృతరూపమని సుబ్బరావుగారి సిద్ధాంతము." అవును. దీనిని బంతులవారు ఖండింపఁజాలరైరి. మూఁత వేయఁబడినరాతినిబట్టి వచ్చినదని పంతులవారే యంగీకరించి వ్రాసిరి. అందేమియు దోషమును జెప్పినవారు కారు.

"దేవాలయములోని సీతారామలక్ష్మణవిగ్రహములు మూఁడును నేకశిలానిర్మితము లగుటనుబట్టి యేకశిలానగరనామము గ్రామమునకుఁ గలిగిన దని మూఁడవవ్యుత్పత్తి నొకదానిని సుబ్బరావుగారు కల్పించినారు" అని పంతులవారు నాపై నొకదోషము కల్పించినారు. ఇట్లు వారు వ్రాయుటకుఁ గారణము తమవాద మంతయు ఖండితమయిన దనుమొఱమొఱచే నా వ్యాసమును నఱగొఱగాఁ జదువుటయే కాని యసత్య మాడవలయు ననుతలంపునఁ గాదని నేనెఱుఁగుదును. అటు గాకున్న "ఇది నాకల్పితము గాదు" అని నేను స్పష్టముగ వ్రాసియుండ వా రిట్లు వ్రాయుదురా? నేను వ్రాయుటకు నాలుగుసంవత్సరములకుముందు హిందూపత్రికలో మాననీయులగు దివాన్ బహదర్ కేశవపిళ్లగారు వ్రాసియుండ దానిని ననువదించితిని. అది వీరు చదివినట్టే లేదు. సత్యబలము గలయొంటిమిట్టవాదులకుఁ గల్పనలు నపోహములు చేయ నక్కఱ లేదు. నా వ్యాసమును వీరు చక్కఁగఁ జదువని కారణముచేతనే యభిప్రాయము మార్చుకొనఁ గారణము లేదని వ్రాసి చెప్పినదే చెప్పి వ్రాసినదే మరల వ్రాసి వృథావాదము పెంచిరి. అంతియగాక "సీతారామలక్ష్మణవిగ్రహములు మూఁడు నేకశిలానిర్మితము లన్నమాట సరిగాదు" అనిరి. పంతులవా రిచ్చటఁ బొరపడిరి. నా వ్యాసము చదువ నియమిత మైనదినమందు సాయంకాలమునఁ బ్రొద్దుటూరు కచ్చేరిలో సీకార్యార్థమై సత్య మారయ నొంటిమిట్టకుఁ బోయి వచ్చిన నెందలూరు న్యాయవాదులు లోనగువారు (బ్ర॥ శ్రీ॥ పరశురామరావుగారు ప్రముఖులు) తాము కోవెలలో విగ్రహములకుఁ బ్రదక్షిణించి పరిశీలించి వచ్చితి మనియు మూఁడు విగ్రహములు నేకశిలానిర్మితము లనుటకు నాధారముగ

మూఁడువిగ్రహములకు వెనుక ప్రకరణ నొకే చాల యవిచ్ఛిన్న మని తోఁపఁ జేయున ట్లున్నదనియుఁ జెప్పినపుడు పంతులవా రచ్చట లేరేమో. ఏకశిలానిర్మిత ములన మూఁడువిగ్రహములు కాలునేతులు పెనవేసికొని పోఁతబొమ్మలయందో కొన్ని పటములయందో కొన్నిరూపములు గానవచ్చువిధ మని పంతులవా రభి ప్రాయపడి రని తోఁచుచున్నది. నాయభిప్రాయ మది కాదు, విగ్రహములు మూఁడును వేఱువేఱుగాఁ గానవచ్చుచున్నను నేకశిలవలన నుత్పన్నములైనవని నాయభిప్రాయము. ఇది సత్యమో యసత్యమో యిప్పుడు పోయి పంతులవారు పరీక్షింపవచ్చును. ఈసందేహము నాకక్కడనే వారు తెలిపియుండినఁ బ్రత్యక్ష ముగఁ జూపియుందును. పోనీ, ఈవ్యుత్పత్తి తమకు సమ్మతము గాదేని నేను జెప్పినతర్కనవ్యుత్పత్తులను దాము నిరాకరింపఁజాలకుండియు "రామతీర్థముపై మూఁతవేయఁబడినరాతినిబట్టి యేకశిలానగర మనుపేరు పుట్టినది" "ఒంటిమిట్ట కేకశిలానగరమని స్థూలదృష్టిచే నర్థము చెప్పవచ్చును" అని తామేవ్రాసియు వ్యుత్పత్తి కుదిరినది కాదనుట. యేమివాదచమత్కారము !!

17. నగర మనుపే రొంటిమిట్టకుఁ జెల్లునని కొన్ని కారణములు చెప్పితిని. గ్రామ మెంతవఱకు వ్యాపించియుండినది వ్రాసితిని. రామయ్యపంతులువారు విచారించినపుడు దేవాలయమునర్చకుఁడు గ్రామ మెంతవఱకు వ్యాపించియుండు టయు ననేకులు జనులు వచ్చి పోతన నివసించియుండినచోట నుండుచెట్టునకుఁ బ్రదక్షిణించి కర్పూరపుటారతులిచ్చి యర్చించి పోవుచుండుటయుఁ జెప్పెను. గుర వయ్యగారును మఱియొక్కప్రక్కఁ 'గోటలోనిచేలు' కోటమధ్యమున నుండె నని చెప్పిరి. వీనినంతయుఁ బంతులవారు తుంగలలోఁ ద్రొక్కి "నడుమఁ గల్పింపఁ బడునామము లన్వర్థముగానే యుండు ననియు నొంటిమిట్ట పూర్వము గొప్పపట్ట ణముగా నున్నట్లు నిదర్శనములు గానరావనియు నాప్రత్యుత్తరము" అని వ్రాసిరి.

ఈవిషయమునఁ బంతులవారి నొకటి రెండుప్రశ్న లడిగెదను. వానికి వారు చెప్పెడుసమాధానములే వారికిఁ బ్రత్యుత్తరములు కాఁగలవు. "ఏకశిలా నగర మనుపేరు రామతీర్థముపైఁ గప్పినరాతినిబట్టి పుట్టినది" అని వారేవ్రాసిరి కదా ? అంతకుఁ బూర్వ మచ్చట గ్రామము లేదని యడవి యని వారే వ్రాసి రికదా ? ఇప్పుడు గ్రామము, గ్రామనామము కూడఁబుట్టినవా లేక గ్రామనా మము నసుమ వచ్చినదా ?

ఏకశిలానగర మనునది పాఱువేటకొండనుబట్టి వచ్చినదికదా. కొండ ముందా గ్రామము ముందా ?

విగ్రహములంబట్టి పేరువచ్చినదని వ్రాసితినిగదా. విగ్రహములు ముం దా గ్రామము ముందా ? పంతులవారు తామేమివ్రాసిరో దానినైన మఱియొక పరి చదువుదురుగాక!

ఇన్నిటివలనను నేకశిలానగరనామము నదుమ వచ్చినది కాదని యేర్పడెను.

పూర్వపుగ్రామము విరివి యిదివఱకే వివరించితిని. పొత్తపినాడని ప్రసిద్ధి గదా. పొత్తపి రాజస్థాన మయినట్టు చరిత్రములే చెప్పుచున్నవిగదా. ఇట్టి పొత్తపి యిప్పటియొంటిమిట్టయంత యున్నదా. హస్తినాపుర మిప్పు డెట్లున్నదో పంతులవా రెఱుఁగరా ? ఇట్టి దృష్టాంతము లెన్నికావలయును ?

18. ఓరుగంటికి నోరుగంటి యనిపే రున్న దని సాధింపఁ బంతులవారు చాల శ్రమించినారు. కాని యది ప్రస్తుతవివాదమునకు సంబంధించినది కాదు. అది యోరుగల్లయినను నోరగల్లయినను మఱియేకల్లయినను నావాదమునకు రాఁగలలాభనష్టములు లేవుకావున నాచర్చ వ్యర్థము. ఓరు శబ్దము లేదని కొంద ఱన్నందున దానికి గతి కల్పింప యత్నించితినికాని యది నావాదమును గెలిపిం చునని కాదు.

19. భోగినీదండకకృతిపతి యగుసర్వజ్ఞసింగమనీఁ డోరుగంటిప్రాంతము వాఁడు గావునఁ దత్కృతికర్త యగుపోతరాజును నాప్రాంతమువాఁడే యైయుండు ననువాదమును నాప్రత్యుత్తరమును జూచి వదలుకొనిరి.

20. జనశ్రుతిప్రమాణ మోరుగంటికి లేదని వ్రాసియుంటిని. ఓరుగంటి వారివాదము బొమ్మెరవారివాద మొకటే యని పంతులవారు బదులిడిరి. పర స్పరవిరుద్ధవిషయము లుండునీ రెండు నొకటి గాఁజాల దని యిదివఱకే వ్రాసితిని భాగవతము రెండుస్థలముల నేక కాలమున వ్రాయఁబడె ననుట యసంభావ్యము. రెండు నొకటిచేయ హనుమంతుఁడు రెండుకొండలమీఁద రెండుకాళ్లుంచిన దృష్టాంత మీకఁ జెప్పఁబడునేమో.

ఉభయగ్రామవాదము లొకటే యని పంతులవారి హస్తములు లిఖించి నను, ఆవాదమునందలి బలహీనత యెఱిఁగియుండుటచే వారిమన స్సంతతోఁ దృష్టిపడకపోవుటచే "కేవలజనశ్రుతులు ప్రబలప్రమాణములు కావనియే నా మతము" అని మఱియొకయుక్తి వ్రాసిరి. ఓరుగంటివారికి జనశ్రుతిప్రమాణ

మభావమగుటను, నెల్లుట్లవారు బమ్మెరపోతరాజువంశమువారు కారని రావు బహదర్ వారు వాదించుటచేఁ దమవాదమునకు నాధారములుగా నమ్మియుండిన తత్సంబంధజనశ్రుతులు వాక్యములు డీలుపడుటను నిట్లు వ్రాయవలసివచ్చెనుగాని వేఱుగాదు. ఇప్పటివీరిమతము తమవాదమును నేను బూర్వపక్షము చేసినతరువాత నోరుగంటిదుర్బలస్థితి యెఱిఁగిన యీవల జనించినదా? తత్పూర్వమునుండియు నున్నదా? పూర్వమునం దుండియుండుటయే నిశ్చయమయ్యెనేని బొమ్మెరలో జనశ్రుతి యున్నదని వ్రాసి దానికి నోరుగంటికి ముడిపెట్ట వ్యర్థముగ నేల శ్రమించిరి? తమ కనుకూలముగ వచ్చునది ప్రమాణము. అదియే ప్రతికూలముగ వచ్చినఁ బ్రమాణము కాదు కాఁబోలు. జనశ్రుతివిషయమునఁ బంతులవారి నిశ్చయ మేమో కవిజనాశ్రయపీఠికఁ జదివినఁ దెలియఁగలదు. అందు వేములవాడ భీమకవి గోదావరిమండలమువాఁడు గాఁడు గోలకొండదేశము వాఁడని స్థాపించునపుడు తమకుఁ గలప్రమాణముల నిట్లు పంతులవారు పేర్కొనిరి.

“ భీమకవి వెలిగందలవేములవాడగ్రామనివాసి యని యాప్రాంతమందుఁ బ్రతీతి యుండుటంబట్టియు, గ్రంథావతారికలో భీమన తనయిష్టదైవము వేములవాడ భీమేశ్వరుఁడే యని చెప్పుటంబట్టియు, వెలిగందల వేములవాడలో భీమేశ్వరాలయ ముండుటవలనను, నాఁటికిని నేఁటికిని గూడ నాప్రాంతమందు జైనులయినకోమ ట్లుండుటచేతను భీమకవి యాదేశమువాఁడే యని నిర్ణయించుట కాక్షేప ముండఁగూడ దని నాయభిప్రాయము.” ఈవాక్యములే గోదావరీమండలములోని వేములవాడపక్షపాతు లిట్లు వ్రాయవచ్చును.

“ భీమకవి దక్షారామవేములవాడగ్రామనివాసియని యీప్రాంతమందుఁ బ్రతీతియుండుటంబట్టియు, గ్రంథావతారికలో భీమన తనయిష్టదైవము వేములవాడ భీమేశ్వరుఁడే యనిచెప్పెనుగాని వెలిగందలవేములవాడలోని భీమేశ్వరుఁడని నిరూపించి చెప్పకుండుటచేతను వేములవాడసమీపమున దక్షారామమం దనాదిప్రసిద్ధభీమేశ్వరాలయ ముండుటచేతను, జైనులైనకోమట్లు పూర్వము దేశమందంతట నున్నట్లే యిచ్చటనునుండి యిప్పుడు నామావశిష్టులైరి గనుకను భీమకవి యీదేశమువాఁడే యని నిర్ణయించుట కాక్షేప ముండఁగూడదని మా యభిప్రాయము” అని వ్రాసిన వారివాదమును బంతులవారెట్లు ఖండింతురో. జైను లాంధ్రదేశమున మఱెందు లేరని పంతులవారు పొరపడిరి. అర్ణవియొద్ద

ననేకకుటుంబములేగాక జైనగ్రామములే యున్నవని తెలియవచ్చెడిని. ఒకవేళ నిప్పుడు లేకుండిన నింతకు ౭౦౦ సంవత్సరములకుముందు గోదావరిమండలమున లేరనుట యేమిన్యాయము? అది యెట్లైన పోనీ నాకేల? నాకుఁ గావలసినది జనశ్రుతివిషయమే.

భీమకవివిషయమైనజనశ్రుతి రెండువేములవాడలలో నున్నది. అట్లుండియు దక్షారామమువేములవాడ జనశ్రుతికంటె వెలిగందలవేములవాడ జనశ్రుతి కేల పంతులవారెక్కువప్రాశస్త్య మిచ్చిరో నా కూహింప రాకున్నది. ఒంటిమిట్టవారివాదమును బలహీనము చేయవలయునని కేవలజనశ్రుతి ప్రబల ప్రమాణము కాదనువారు దానినే తమ కిష్టమైనచోటఁ బ్రథమప్రబలప్రమాణముగ నెట్లు గ్రహించిరో? కేవలజనశ్రుతి నేను గ్రహింపలేదనియు దానికి సహచరముల రెంటినిమూఁటిని గ్రహించితి ననియు బంతులవారందురేని యొంటిమిట్ట వాదులును గేవలజనశ్రుతిని మీవలె మేము ప్రథమప్రమాణముగఁ గొనలేద నియు మీకు రెండుమూఁడుకారణములుండిన మాకు ౬-౭ కారణము లున్నవ నియుఁ జెప్పెదురు. (ప్రథమభాగము చూడుఁడు). 'గతానుగతికోలోకో' యనుట వేములవాడయందుమాత్ర మన్వయింపదు కాఁబోలు.

పంతులవారి ట్లిప్పుడు వ్రాయుటకుఁ గారణము గలదు. నెల్లుట్లవారు బమ్మెరపోతరాజువంశ్యుఁ డని యక్కడి నెల్లుట్లవారు చెప్పిరని పంతులవారు తమ కనుకూలముగ వ్రాసిరి. భీమకవిచరిత్ర మొకవేములవాడలోనిది మఱియొకవేముల వాడవారు విని యిది తమయూరిలో జరగిన దని చెప్పుకొనునట్లే యొంటిమిట్టలో జరగినపోతనచరిత్రము సుప్రసిద్ధమయి జగమున వ్యాపింపఁగా నది తమగ్రామమందే జరగినదని యాయన తమవంశ్యుఁడని నెల్లుట్లవారు చెప్పుకొనుట ట్లేర్పడెను. ఇప్పుడు రావుబహద్దర్ వీరేశలింగముపంతులవారు నెల్లుట్లవారు బమ్మెర పోతరాజువంశమువారు కారని వ్రాసిరి. బంధుత్వ మసత్యమైనపుడు పంతుల వారు చెప్పెడు తక్కినకథలు నసత్యములే యయ్యెను. ఆయాధారము పోయిన యెడల నోరుగంటివారివాదమున కాధారము క్రిందమన్ను మీఁదమిన్నుగా నడుమ సున్న యయ్యెను. తమవాదమునకు వచ్చిన యీమహావిపత్తు తప్పించుకొన జన శ్రుతియందు మాకు విశ్వాసము తక్కువ యని పంతులవారనిరి. నెల్లుట్లవారిది జనశ్రుతియే. కావున దానితో వారివాదము నేలపాలయ్యెను. రావుబహద్దర్

వారి వాదమును దాము ఖండించువఱకు నెల్లుట్లవారికి సంబంధించినదియు దాని ననుసరించినవియుఁ దమవాదమున కాధారములుగఁ బంతులవారు చెప్పరాదు. ఒంటిమిట్టవారి వాదమునకు వారిరువురుసమానశత్రువులే కావున ముందాసుందోప సుందయుద్ధము కానిండు.

బమ్మెరపోతరాజు బొమ్మెరయందుండె ననుట జనశ్రుతినిబట్టి యేకదా. శ్రీనాథపోతనసంభాషణము జనశ్రుతి యేకదా. నల్లుట్లవా రట్లుపోయి యివి రెండు నిట్లుపోయినచో నోరుగంటినాదులకు నొంటిబండ (ఏకశిల) మాత్రము మిగిలినది.

21. భాగవతములోఁ బ్రయోగింపఁబడిన యాంధ్రశబ్ద విశేషము లుభయగ్రామములకు సమానము లని వారివాద మఁట. వారివాదమును నేను బూర్వపక్షము చేయలేదఁట. ఎంతటిదోష మొనర్చితిని! తొలుత నది యాధారముగ లెక్కించినవారు వారే. నేనుగాను. ఉభయులకు సమానమైనది నాకెట్లు హానికరము కాఁగలదు? దానిలో నేను ఖండింపవలసిన దేమున్నది? అదట్టులుండనీ.

కొన్ని పదములు 'కోసరము' మొదలైన వీప్రాంతమందు వాడుకలో నున్నవి గోలకొండదేశములో లేవని వ్రాసితిని. దానిని బంతులవారు పూర్వపక్షము చేయకుండుటచే నాశబ్దము లాదేశమున లేవనియంగీకరించినట్టేకదా. ఈయంగీకారము వారివాదమును దుర్బలపఱిచెఁగదా.

22. కడపటిదెబ్బ కమ్మని దెబ్బయని పంతులవా రొంటిమిట్టలోని పోతరాజు విగ్రహమునుగుఱించి "పాదములయందుఁ బద్మరేఖలును, గాళ్లకు ముంజేతులకు, గొలుసులు నున్నవి. భుజకీర్తులును, మెడలోహారములును గలవు. వడగలవైష్ణవులు ధరించునట్టి నిలువుబొట్టు నుదుటనున్నది. పోతరాజు రామభక్తుఁడై నను, శివపూజాతత్పరుఁడు, వైష్ణవచిహ్నమైననిలువుబొట్టు పెట్టుకొనియె ననుటకు వీలులేదు, గొలుసులు హారము తులసి పూసలపేరు లనుకొన్నచో శివపూజ చేయుచుఁ బోతరాజు తులసిపేరులు ధరించెననుటయు సమంజసము కాదు. సువర్ణాభరణము లని యూహింపవలసినయెడల నవియుఁ బోతరాజున కనుచితము లే, కావున విగ్రహము పోతరాజుది కాదనియే చెప్పవలసియున్నది" అని వ్రాసిరి.

ఆర్యులారా! యిప్పటికి ౪౦౦ సంవత్సరములకు ముందు మనదేశములో ఛాయాగ్రాహిణీ యంత్రములు లేవు. ఈవిగ్రహములు వానినిబట్టి యథారూపముగ నిర్మింపఁబడినవి కావు. ఇప్పుడు నిర్మింపఁబడుచుండు శిలావిగ్రహము లెవరివని చెప్పెదరో వారిభార్యలు పుత్రులే యావిగ్రహములు తమభర్తలవలెఁ

దండ్రివలె లేవని చెప్పుచుండుట పంతులవా రెఱుంగరా ? ఇఁకఁ గవి యనంత
రము వారిభక్తులు వారికిఁ దోఁచినట్లు వారివారియభిప్రాయములకొలఁది నిర్మిం
చినవానికి వంక లెన్నవచ్చునా ? బొమ్మెరయం దుండుబొడ్డురాయి సాక్షాత్పోత
రాజవిగ్రహ మని పంతులవా రనఁగలరా ? రవివర్మవంటిచిత్రలేఖకుఁడు యోగి
యగుశివునకు మీసము లుంచి క్షత్రియుఁడై రాజైనరామునకు మీసము లున్న
ట్లు రామాయణములో నున్నను లక్ష్యపెట్టక చిత్రములకు లేకుండఁ జేసెను.
శివునకు మీసము పెరిఁగినపుడు గడ్డ మేల పెరుఁగలేదు ? ఇప్పటినాగరకులలోఁ
జేరి శివుఁడు ముఖక్షౌరము మాత్రము ప్రతిదినము స్వయముగఁ జేసికొనుచు
న్నాఁడా ? కాదేని యాయన క్షౌరకుని పే రేమి ? మీసములు లేకుండుటకు శ్రీ
రాముఁడు పేడివాఁడా ? ఈకారణములచే నవి శివరామచిత్రములు కావని పంతు
లవా రనఁగలరా ?

భాష్యకార్లపటము నాయొద్ద నున్నది, వారు సన్న్యాసులుకదా ? వారి
చేతుల బంగా రాభరణము లున్నవి. అటని శ్రీపెరుంబత్తూర్‌లో నుండురామా
నుజవిగ్రహము వారిది కాదని యెవరైన ననఁగలరా ? అద్వైతులుగ నుండు
ద్రావిడులు తిరుమణి శ్రీచూర్ణములు ధరించినవారిని బంతులవా రెఱుఁగరా ?
బమ్మెర పోతరాజు రామభక్తు లని పంతులవా రంగీకరించిరి. బమ్మెర పోతన
సంతతివా రార్వేలనియోగులని రావుబహదర్ వారు వ్రాసిరి. అమాత్య, రాజు,
శబ్దములనుబట్టి వీరివ్రాఁత నిజమే యని నమ్మవచ్చును. రామభక్తులైనయార్వేల
నియోగులు తిరుమణి శ్రీచూర్ణములు ధరించుట పంతులవా రెఱుఁగరా ? మత
మున శైవులుగా నున్నను పోతనపితామహులు మాతామహులు వారికాలము
నాఁటికే మనమున వైష్ణవులని తమకుమారునికిఁ గేసన్న (కేశవన్న) యనియు
కుమారికి (లక్కసాని)లక్ష్మియనియుఁ బేరులిడుటచే స్పష్టమగుచున్నది. ఇంతకు
నాయన యేమినామము పెట్టుచుండెనో యెవ్వఁ డెఱుఁగును ? ఆయనకు వెనుక
౫౦౦ సంవత్సరములకు వచ్చినపంతులవారియూహ యెంతవఱకు సరియో యేమి
యాధారము గలదని నమ్మవలయును ? ఇంతకు మీఁద నేనుజెప్పినట్టు జీవత్పు
రుషు లేదిపెట్టుకొన్నను బెట్టుకొనకున్నను వారివెనుకటివారు వారిభక్తులు తమ
తమమతానుసారముగఁ జిహ్నము లుంచుదురు. నాస్వవిషయమే నన్నెవరెవ
రేమిపేర్లఁ బిలుచునది వ్రాసియుంటినిగదా. ఒకమూర్తికే కొందఱు వడగల
నామము లుంచినఁ గొందఱు తెంగలనామము లుంచుదురు. మఱి కొందఱు

గోపిచందన ముంచుదురు. ఇంతయేల విఘ్నేశ్వరుని భాద్రపదశుద్ధచతుర్థినాఁడు పూజింతురుగదా. ఊర్ధ్వపుండ్రములు పెట్టువా రాయన కూర్ధ్వపుండ్రములు పెట్టుదురు. తిర్యక్పుండ్రములు పెట్టువారు తాము పెట్టుకొనునట్లే పెట్టుదురు. ప్రస్తుతవిషయమున బమ్మెర పోతరాజువిగ్రహము వైష్ణవు లర్చించు విష్ణ్వాలయంబున నున్నది. కావున దాని నక్కడ నుంచినవారు ద్వైతులయినను విశిష్టాద్వైతులయినను నద్వైతులయినను విష్ణుభక్తులనుట నిర్వివాదము. వీరశైవు లచ్చట నావిగ్రహము నుంచి యుందురు. బ్రతికియుండుకాలమున మహాకవు లాదరింపఁబడుట యరుదు. అందుఁ బోతనవంటిబికారి నెవఁ డాదరించును. ఆయనకవిత్వమహత్త్వము లోకమున వెలసినపిమ్మటనే యాయన చర్యలను గురించి విచారించి మహాపురుషుఁ డని యెఱిఁగి యప్పు డట్టిగౌరవము గలిగించి యుందురు. ఆకార్య మెవఁడు చేసెనో వానిముఖమున నుండునామమె యాయన ముఖమునఁ బెట్టెను. పాదతలమునఁ బద్మరేఖలు మహాపురుషలక్షణము తెలుపఁ జెక్కఁబడినవి. అర్చకుఁ డావిగ్రహము వేదాంతదేశికులది యని తనయభిప్రాయ మని చెప్పినమాట సత్యమే. క్రొత్తవాఁడును గంచివాఁడు నగుట యీయన యభిప్రాయ మేమిప్రమాణము.

ఆయన ప్రత్యేకాభిప్రాయము నమ్మినపంతులవారికి దేశమంతయు నిదిపోతరాజుది యని యనుచున్నా రని యాయనయే చెప్పినమాటయం దేల ప్రత్యయబుద్ధి లేదయ్యెను? ఆయర్చకుఁడే సోపానములమీఁద నిలఁబడి మాట్లాడునపు డావిగ్రహము వేదాంతదేశికులది కాదనుటకుఁ గారణములు కలవని చెప్పలేదా? ఆప్రస్తావనను వేఱొకప్రస్తావనచేఁ బంతులవారు మార్చలేదా? నేనది కనిపెట్టలేదని పంతులవా రనుకొనిరి కాఁబోలు. పంతులవా రాయనను జెప్పనీయకున్నఁ బోనిండు. నాకుఁ దోఁచినది నేను జెప్పెదను. పోతరాజు పేదవాఁడుగావున నాభరణధారణ మసంభవ మనికదా పంతులవారి తలంపు. "సాయంప్రాతర్భిక్షాచర్యా" యని బ్రతికిన వేదాంతదేశికు లేనాఁ డట్టిభూషణములు ధరించియుండెను? వేదాంతదేశికులు బమ్మెర పోతనకంటెను దరిద్రుఁడు—కావున నావిగ్రహము వేదాంతదేశికులవారి దనుపంతులవారి యూహయు సరిగాదు. బొమ్మెరలోని బొడ్డురాయి సాక్షాత్పోతరాజువిగ్రహమేని దానివర్ణన మేల పంతులవారు చేయరైరి. ఓరుగంటివాదులయదృష్టము కొలఁది యొంటిమిట్టవాదులు బొమ్మెరఁ జూచినవారు కారు. రెండుమార్లు నేను బ్రయాణము పెట్టుకొనినను సాగినది

కాదు. కావున నచ్చటిబండారము బయటఁబడకున్నది. విగ్రహముకాని బొడ్డు రాయికాని తుదకు గుండ్రాయికాని యాయనజ్ఞాపకచిహ్నముగ నొకటి యుంచుకొని యున్నా రనుట గ్రాహ్యము కాని పోతనకు ముఖాన మీసములు మొలచి యుండెనే విగ్రహమునకు మీసములు లేవే యనుట సరిగాదు. కన్నులు కమలము లన్నప్పుడు కన్నులు నూఱుభాగములుగఁ జీలి నడుమ గ్రుడ్డు నిట్టపొడుచుకొని వచ్చిన దని యర్థమా ? అట్లులే యిందును గుణముమాత్రము గ్రహింపవలయును.

ఓరుగంటివారిబలమును విమర్శించినట్లు లొంటిమిట్టవారిబలము విమర్శించెదను. వారి కన్నియు నూహాబలములే కదా. ఇఁక నొంటిమిట్టవారికో, ఒంటిమిట్ట యేకశిలానగర మనుట గ్రంథస్థము.

ఒంటిమిట్టయందుఁ బోతరాజుండె ననుట గ్రంథస్థము.

పోతరాజు దున్నుకొనుచున్న భూమి నిర్దేశింపఁబడి యాయనపేరనే నేఁటికిఁ బిలువఁబడుట ప్రత్యక్షము.

పోతరాజు వంశమువారిబంధువు లుండుట ప్రత్యక్షము.

పోతరాజునకుఁ బ్రత్యక్షమైనకోదండరామమూర్తి యొంటిమిట్టయందుండుట ప్రత్యక్షము.

బమ్మెర యనునింటిపేరు వంశపారంపర్యముగ వచ్చిన దనుట గ్రంథస్థము.

బమ్మెర యనునింటిపేరుగలవారు గోలకొండదేశమునకంటె భిన్నదేశము లందుండుట గ్రంథస్థము. కావున నోరుగంటివారివాదమునకంటె నొంటిమిట్టవారి వాదము బలీయ మని చెప్ప నెవరు సందేహింతురు ?

23. మహాశయులారా ! శ్రీమదేకశైలకోదండరామకరుణాకటాక్షవీక్షణ బలంబునన బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారి యాక్షేపముల కన్నిటికిఁ దగిన సమాధానములఁ జెప్పఁగలిగితిని. ఒంటిమిట్టవారి నాక్షేపించుటయందు వారు వాగ్వ్యయము చేయుచున్నారు గాని యోరుగంటికి నామమాత్రము తప్ప మఱి యే యాధారమును వ్రేలు వంచి యెంచలేకున్నారు. గోదావరివేములవాడ కా దని వెలిగందలవేములవాడను స్థాపింపఁ బంతులవారు గనఁబఱిచిన యాధారములకంటె నొంటిమిట్టవారియాధారములు బలీయము లవునో కావో వారే నిశ్చలచిత్తమున నాలోచింపఁగోరెదను. ఇంత కెక్కువ నేనిప్పుడు చెప్ప వలసిన దేమియు లేదు.

ఆర్యులారా! యీవాదములో బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారు సత్య జిజ్ఞాసువులై దిగి రనుటసత్యము. సవ్యాపసవ్యమథనంబునఁగాని వెన్న పడదని యే వారు నన్ను వాదములోనికి దింపిరి. వారు నాకు జ్యేష్ఠభ్రాతృతుల్యులు గావున గురువులు. పరశురాముని యనుమతిఁ గొని యాయనతోఁ బోరిన భీష్మునివలె నేనును యథాశక్తి వారితోఁ బోరి వారుచెప్పినవని నిర్వహించితిని. గెలుపోటములకు వారే యుత్తరవాదులు కావున వానితో నాకుఁ బనిలేదు. నా వాదము గెలిచినఁ గీర్తి వారిదే.

ద్విపద. కర్మమందే యధికారంబు నీకుఁ
కర్మఫలంబులఁ గా దీవుగోర

నన్నట్లు ఫలభాగిని నేనుగాను. నిర్వంచనముగ నాకార్యము నలిపితినని వారును బుధులును సంతసిల్లినఁ జాలును. జంకు గొంకు లేక బొంకులు టకటొంకు లాడు టాటోటుకాండ్రతో వాదించుట రోఁతగాని పంతులవారివంటివారితో నెన్నాళ్లైన వాదించుట కీర్తికరమే. సంతోషకార్యమే. "యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా" యని కలదుగదా. అయినను నీవిషయమున నిఁక వృథావాగ్వ్యయము చేయ మన సొప్పకున్నది. చెప్పవలసినవిషయములు చెప్పఁబడినవి. ఇఁక నిదమిత్థ మని నిర్ణయింప మధ్యవర్తులు సమర్థులు. కావున వ్యర్థశ్రమము చాలించి నన్నీవిషయమున మరల రంగమున కీడ్వకుండుటకై బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారిని బ్రణామపూర్వకముగఁ బ్రార్థించుచు నివృత్తి మించుచున్నాఁడను.

నావిలికోలను సుబ్బరావు.

శ్రీరస్తు.

# బమ్మెర పోతరాజు నివాసస్థానము.

పోతరాజు నివాసస్థాన మోరుగల్లా, యొంటిమిట్టా యను చర్చ యుపక్రమించినది నేను. ఓరుగంటివాదము పక్షముగా నేను వ్రాసినదానిపై బ్ర॥ వావిలికొలను సుబ్బారావుగారు ప్రత్యుత్తరము వ్రాసి యొంటిమిట్టవాదమును స్థాపింప యత్నించిరి. దానికి నే నొకసమాధానము వ్రాసి ప్రకటించితిని. అంతటితోఁ దృప్తినొందక సుబ్బారావుగా రింకొక ఖండనవ్యాస మిప్పుడు ప్రకటించిరికదా! ఉపక్రమించినవారే యుపసంహరించుట న్యాయముగావున సుబ్బరావుగారి ప్రస్తుతవ్యాసమునకు సంక్షేపముగా సమాధానము వ్రాసి యీచర్చకు శాంతి చెప్పఁ దలఁచినాఁడను. తా మిప్పుడు వ్రాసినది చాలవఱకుఁ జర్వితచర్వణమని సుబ్బరావుగారే చెప్పియున్నారు. అట్టి దానిని దిరిగి ఖండించుట పిష్టపేషణమగును గాన నట్లొనర్పక సుబ్బరావుగారి వాదఫక్కియం దున్న కొన్ని దోషములను మాత్రము సూచించి విరమించెదను.

౧. ఓరుగంటికి సమీపమం దున్న గ్రామము బొమ్మెర గాని బమ్మెర గాదు. కనుక దానినిబట్టి బమ్మెర యను నింటిపేరు పుట్టనేర దని సుబ్బరావుగారు నొక్కి నొక్కి వక్కాణించుచున్నారు. గ్రామముపేరు బమ్మెరయే యనియు బొమ్మెర యనునది గ్రామ్యోచ్చారణ మనియు నేను దొలుతనే చెప్పియున్నాఁడను. "వొచ్చెను, వొండెను," ఇత్యాదిశబ్దములయం దీవికారము కనఁబడుచున్నది గదా! సర్వజనవిదిత మైనయిట్టివిషయములో వారింతభల్లూకపుఁబట్టేల పట్టవలయునో తెలియకున్నది.

"ఇఁక బొమ్మెరయే బమ్మెరయని యోరుగంటివాదులు హఠవాదము చేసిన, బొమ్మవరమే బమ్మెరయని యొంటిమిట్టవాదులును వాదింతురు. వారివాదమునకు వారుప్రమాణము కనఁబఱచినపుడు వీరివాదమునకు వీరును బ్రమాణము కనఁబఱుతురు." అని సుబ్బరావుగారు వ్రాసినారు. దీనినిబట్టి హఠవాద మెవరిదో

బమ్మెరవాదము నిబ్లిగురఁగొట్టితి మని సంతోషించియు నెచటనైనఁ గొంచెము మిగిలిపోవు ననుభయముచేతఁ గాఁబోలు వాస్తవముగా, బమ్మెర యనునది గ్రామనామము కాదనియు భ్రమశబ్దభవ మనియుఁ "పోతరాజు పూర్వులొకచోట నిలుకడలేక నానాదేశములు భ్రమించుచుండినవా రగుటచే బమ్మెరవారైరి" రనియుఁ బోతరాజు పశుచారోపజీవిగా నుండెనన్నకింవదంతి యీ వ్యుత్పత్తిని స్థిరపఱుచుచున్న దనియు సుబ్బరావుగారొకక్రొత్తవాదమును గల్పించినారు. పోతరాజేకాక యాయన తాతముత్తాతలుగూడ "లంబాడి" జాతివారివలెఁ బసులఁ గాచుచు నూరూరు తిరిగి జీవనము చేయుచుండుటవలన బమ్మెర వారను పేరువచ్చిన దని దీనియర్థము. బమ్మెరవారివంశచరిత్రము సుబ్బరావుగారి కెట్లు తెలిసినదో! ఈచర్చ పెరిఁగినకొలఁది నిట్టి బమ్మెర (భ్రమణము) లింక నెన్ని పుట్టునో!

౨. కృతిపతులగు దేవత లర్చావిగ్రహము లనిసూచనలు లేనప్పు డాదేవత లర్చావిగ్రహములు కావనియే యూహింపవలయు నని నావాదము. "ఈయూహ సత్యము కాదనుటకు నెల్లూరు హరిహరనాథతిక్కన లేసాక్షులు" అని సుబ్బరావుగారి ఖండనము. భారతకృతిపతి యగు హరిహరనాథుఁడు నెల్లూరిలో నుండిన యర్చావిగ్రహ మనుటకుఁ దిక్కన నెల్లూరివాఁడనుటతప్ప వేఱేయాధారము లేదు. నెల్లూరిలో నిప్పు డావిగ్రహము లేదు. పూర్వమెన్నఁడు నున్నట్లు నాకుఁ దెలిసినంతవఱకు సాక్ష్యమును లేదు. రంగనాయకస్వామియాలయమునకును, బెన్నకును నడుమ నుండెడిదని యాధునికులు కొంద ఱుందురు. ఆయాలయమును జూచిన వా రెవ్వరును లేరు. చూచినవారు వ్రాసియుంచిన లేఖనములును లేవు. ఇట్టి స్థితిలో భారతకృతిపతి నెల్లూరిలో నుండిన యర్చావిగ్రహ మని యేల సిద్ధాంత పఱుపవలయునో తెలియకున్నది. హరిహరాత్మకమగుదైవతమును దిక్కనభావించికొని యుండఁగూడదా? నాచనసోముని హరిహరనాథుఁడును నెల్లూరు నివాసియే కాఁబోలును. నావాద మసత్య మనుటకు మఱియొక సాక్ష్యముగూడఁ గలదఁట. అది యేదియన:—భానుమతీపరిణయము తిరుపతి వేంకటేశ్వరున కంకిత మనియు నాపుస్తకమం దెక్కడను దిరుపతిపేరుగాని మఱి యేయూరిపేరుగాని లేదనియు, "అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరు లర్చావిగ్రహములు కావని పంతులవారనఁగలరా" యనియును సుబ్బరావుగారివాదము. సుబ్బరావుగారు కనిపట్ట లేకపోయినారుగాని భానుమతీపరిణయకృతిపతి శేషగిరీశుఁడే యని సుబ్బరావుగా రుదా

హరించినపద్యమందే యున్నది. పద్యము చివర "శ్రీయలమేలుమంగ కాంతాళమరీచి జొమ్మునను దాల్చిన వేంకటభర్తకుం గొల్చెదన్" అనియున్నది. వేంకటభర్త యనఁగా వేంకటమున కధిపతి యనియర్థము. వేంకట మనునది తిరుమలక్షేత్రమునకుం బేరు, ఆక్షేత్రమున కధిపతికాన నాదేవునకు వేంకటేశ్వరుఁడు, వేంకటభర్త, వేంకటపతి, యిత్యాదినామములు కలిగినవి. ఈక్షేత్రమున కరవములో వేంగడము, తిరువేంగడము ననియు, దేవునికిఁ దిరువేంగళనాథుఁ డనియుఁ బేళ్లు గలవు. మఱియు, నలమేలుమంగ యనుపేరు, అలర్మేలుమంగ (పుష్పముమీఁదియమ్మ) యను ద్రావిడరూపమున కపభ్రంశము. దీనికే యిటీవలఁ బద్మావతి యనుసంస్కృతరూపమును గల్పించిరి. అలమేలుమంగ యనుపేరు పురాణోక్తముకాదు. వేంకటేశ్వరుని దేవికిఁదప్ప వేఱొకదేవతకుఁ జెల్లదు. ఈరెండు హేతువులచేతను భానుమతీపరిణయకృతిపతి తిరుపతివేంకటేశ్వరుఁడే యని తేలుచుండ సుబ్బరావుగారు దీనిని దమవాదమున కాధారము చేసికొనుట వింతగా నున్నది.

3. ఒంటిమిట్ట దేవాలయములో సీతారామలక్ష్మణులు ముగ్గురి విగ్రహములు నుండఁగాఁ బోతరాజు సీతావిగ్రహమును జేర్కొనకపోవుటచేత నాకవి వర్ణించినవిగ్రహ మొంటిమిట్ట కోదండరామస్వామివిగ్రహము కాదని యూహింపవలయునని నావాద మనియు, నీవాదము సరియైనది కాదనియు, సుబ్బరావుగారు వ్రాసిరి. పోతరాజుగారిపద్యము చదివినప్పు డాయనవర్ణించిన రామవిగ్రహ మొంటిమిట్ట కోదండరామస్వామి విగ్రహమే యని తోఁపకుండదని సుబ్బరావుగారు వ్రాయుటచే నేనట్లు వ్రాయవలసివచ్చినది. నావాదమునకు బాధకములని సుబ్బరావుగా రుదాహరించిన రెండుపద్దులలో నేదియు వారి కుపకరింపదు. రామదాసును జెఱనుండి విడిపించిన రామలక్ష్మణులు రౌతువేషములతో వచ్చినారు. వారితో నప్పుడు సీతయు వచ్చుట యనుచితముగదా! చంద్రికాపరిణయకృతిపతి యగు జటప్రోలుమదనగోపాలుని వర్ణించు సీసపద్యములో రుక్మిణీవర్ణనము లేనిలోపము మఱియొక పద్యములో, "శ్రీవాసజ్జటప్రోలీభావుకపత్తనవిహారపటుశీలునకున్" అని చెప్పుటచేఁ దీరినది. భాగవతములో నెక్కడఁ జూచినను, గృతిపతి యొంటిమిట్టదేవుఁ డనుసూచనలు లేవు. ఇతరాధారము లేనపుడును విగ్రహవర్ణమును బట్టియే యూహింపవలసియున్నపుడు నావర్ణన మన్నివిధముల నొంటిమిట్ట విగ్రహమునకు సరిపోవలయును గదా! సరిపోనప్పు డాదేవుఁడే యీదేవుఁ డని యేల నమ్మవలయును? ఇదియే నావాదము.

౮. పోతరాజు గతించిన యనేకశతసంవత్సరముల కీవలఁబుట్టిన పురాణము హయగ్రీవశాస్త్రిగారు పోతరాజు నివాసస్థాన మొంటిమిట్టయని వ్రాసినవ్రాఁతను మనము ప్రమాణముగా నంగీకరింపవలసిన యావశ్యకత లేదని నేను వ్రాసిన దానికి సుబ్బరావుగారు "హయగ్రీవశాస్త్రులవారు పోతరాజునకు ౪౦౦ సంవత్సరముల కీవలఁ బుట్టుట సత్యము. హయగ్రీవశాస్త్రులవారికి ౨౦ సంవత్సరముల కీవల రామయ్యపంతులుగారు పుట్టుటయు సత్యము. (ఇది సత్యమో యసత్యమో నాకుఁ దెలియదు) తమకు ముందుండిన "ప్రాచీనపండితులు" వ్రాసినదాని నాధారము చేసికొని వ్రాసినవారు హయగ్రీవశాస్త్రులువారు ఎవరో చెప్పిన పుక్కిటిపురాణముల నమ్మి పగ లాకాశ మెగఁజూచి యోరుగంటిపంచాంగము వ్రాయఁ బూనినవారు పంతులవారు. ఈరెంటిలో నేది యెక్కువ విశ్వసనీయము? ఈవాదము రాకముందు పోతన యోరుగంటివాఁడని యెవ్వఁడైన వ్రాసియుండెనా?" యని యొకచోటను, "వేములవాడ భీమకవికి రామయ్య పంతులవారు సమకాలికులా? పిమ్మటఁ గొంచెము కాలమువారా? ఏమి యెఱిఁగి వీరు భీమకవిస్థలమునిర్దేశింప సాహసించిరి. విషయము తమకనుకూలమైనచో శాస్త్రసమ్మతము, ప్రతికూలమైనచో శాస్త్రసమ్మతము కాదు కాఁబోలు" నని మఱియొకచోటను వ్రాసినారు. నావాద మేదియో సుబ్బరావుగారు సరిగా గ్రహింప లేక పోయిరని యీవ్రాఁతయే తెలుపుచున్నది. పోతరాజు నివాసస్థానము విషయమయి కాని, యప్రస్తుతమగు వేములవాడ భీమకవి నివాసస్థానము విషయమయి కాని నేను వ్రాసినదెల్లఁ బరమప్రమాణముగా గ్రహింపవలసినదని నేను జెప్పలేదు. చెప్పినచో నది యవివేకమగును. ఆరెండువిషయములంగూర్చియు నాకు లభించిన యుభయపక్షాధారముల సంకలితముచేసి యవి విమర్శించుటవలన నాకుఁ గలిగిన యభిప్రాయముం దెలిపితిని. నాయభిప్రాయము సరియో కాదో నిర్ణయించుకొనుభారము పాఠకులయందే యున్నది. కొందఱి కది సరి యని తోఁపవచ్చును. సుబ్బరావుగారువంటివారి కది సరికాదని తోఁపవచ్చును. ఎవరికైనను నేను గనఁబఱిచిన హేతువులే యాధారము గాని నా సిద్ధాంతవాక్య మాధారముకాదు. హయగ్రీవశాస్త్రిగారివిషయమై సుబ్బరావుగారు చెప్పిన దిదికాదు. ఈచర్చపుట్టకమునుపే హయగ్రీవశాస్త్రిగారు పోతరాజు నివాసస్థాన మొంటిమిట్ట యని వ్రాసెను గావునఁ బోతరాజు నివాసస్థాన మొంటిమిట్టయే యని నమ్మవలసినది. అనఁగా హయగ్రీవశాస్త్రిగారి వ్రాఁత యాప్త

వాక్యముగా గ్రహింపఁబడవలసిన దని సుబ్బరావుగారివాదము. శాస్త్రిగారి మాట యాప్తవాక్యము కానేర దని నాప్రత్యుత్తరము. "భ్రమప్రమాదవిప్రలిప్సాకరణాపాటవరూపదోషచతుష్టయరహితుఁ" డాప్తుఁ డని శాస్త్రమర్యాద. అట్టివానిమాటయే ప్రమాణముగా గ్రహింపఁ దగినది. ప్రస్తుతవిషయములో శాస్త్రిగారు దోషచతుష్టయరహితుఁడని ప్రాజ్ఞుఁ లెవ్వరుఁ జెప్ప సాహసింపరు. "తమకు ముందుండిన ప్రాచీనపండితులు వ్రాసినదాని నాధారము చేసికొని వ్రాసినవారు హయగ్రీవశాస్త్రులవా" రని వ్రాయుటచే నాశాస్త్రులవా రాప్తులు కారని సుబ్బరావుగారే చెప్పక చెప్పుచున్నారు. అప్పుడు కానివానిమాట ప్రమాణమె ట్లగునో తెలియదు. మఱియుఁ బూర్వులు వ్రాసినదాని ననుసరించియే శాస్త్రిగారు వ్రాసినా రన్నమాట సత్యముకాదు. శాస్త్రులవారి భాగవతపీఠికలోఁ, బోతరా జేకశిలానగరమందుండె నని యున్నది. అక్కడఁ బుట్టవెట్టి పుటయుముగున నేకశిలానగర మనఁగా నొంటిమిట్ట యని వివరణరూపముగా వ్రాయఁబడియున్నది. ఈవివరణముశాస్త్రిగారిస్వకపోలకల్పితమని వేఱచెప్పనక్కఱలేదు. పూర్వగ్రంథానువాదమే యైనచోఁ బీఠికాగర్భస్థ మయియే యుండును. వాదమున కీవివరణము గూడ ననువాదమే యనికొందము. అట్లయినచో ననువాద మెన్నఁడును స్వతంత్రప్రమాణము కానేరదు. ప్రామాణ్యము మాతృకానిష్ఠముగాని యనువాదనిష్ఠముగాదు. శాస్త్రిగారిపీఠికకు మాతృక యగుగ్రంథము బయలుపడినప్పు డాగ్రంథమునకుఁ బ్రమాణలక్షణము పట్టునో పట్టదో విచారింపవలసి యుండును. ఏరీతినైనను హయగ్రీవశాస్త్రిగారి వ్రాఁతకుఁ బ్రామాణ్యము సిద్ధింపదు.

౫. ఏకశిలానగరమాహాత్మ్యము ప్రమాణముగాఁ గైకొనఁగూడ దని వ్రాయునవసరమున స్కాందపురాణమునకు లోకమునందుఁ గలయపవాదము ననువదించితిని. దాని నెత్తికొని పురాణముల నిందించితి ననియు మఱియేవేవో కొన్నివ్రాఁతలును వ్రాసి కవిజనాశ్రయపీఠికలో గోలకొండదేశమునందలి వేములవాడ దక్షవాటికయని భవిష్యోత్తరపురాణములో నున్నట్లు నేను వ్రాసినా ననియు వేములవాడ దక్షవాటిక యనుమాట పచ్చిదబ్బఱయనియు వ్రాసి యేదో కొంతగ్రంథము కల్పించినారు. వేములవాడను గుఱించి నేను వ్రాసినది యేకశిలానగరప్రశంసలో నప్రస్తుతము. అయినను వారియాక్షేపమునకు సమాధానముఁ జెప్పఁదలఁచినాఁడను, వేములవాడ దక్షవాటిక యని భవిష్యోత్తరపురా

ణములో నున్నదని కాని భవిష్యోత్తరపురాణములో నున్నదంతయు సత్యమే యని విశ్వసింపవలయు నని కాని నేను వ్రాసియుండలేదు. "దాక్షారామభీమేశ నందను(డక" అను చాటుపద్యములో స్మరింప(బడిన దాక్షారామ మేది యని విచారించు నవసరమున వేములవాడకు(గూడ దక్షవాటిక యనుసంజ్ఞ యున్నదని యాప్రాంతమువారు చెప్పుదు రనియు దానికి బలముగా భవిష్యోత్తరపురాణము లోని వని కొన్నిశ్లోకము లుదాహరింతు రనియు వ్రాసి యాశ్లోకములను జూపి నా(డను. దాక్షారామసంజ్ఞ వేములవాడ కున్నట్లు జనశ్రుతి కలదని ఋజువు చేయుటయే నాపనియై యుండెను. కాని యాజనశ్రుతి సత్యమో యసత్యమో నిర్ణయించుట కవసరము కలుగలేదు. నిజముగా వేములవాడ దక్షవాటిక యైనను గాకపోయినను, నగు ననువాడుక యుండినచో భీమకవి యావాడుక నను సరించి దాక్షారామనామముచే వేములవాడనే పేర్కొనియెనని యూహింప నొప్పునుగాన నట్లు వ్రాసితిని. దీనివలన సుబ్బరావుగారివాదమున కేమియు లాభము కలుగనేరదు.

౬. ఓరుగంటికి మొదటిపేరు ఒరగల్లనియు, గణపతిదేవు(డు రాతికోట కట్టించుటచే నోరుగల్లనుపేరు కలిగినదనియు నొక యపూర్వవాదము కల్పించి సుబ్బరావుగారు తమప్రథమవ్యాసములో నొకపుటకు పైగా గ్రంథముం బెంచినారు. నారెండవవ్యాసమం దావాదమును సప్రమాణముగా ఖండించినా(డను. దానికి బైయుత్తరము చెప్పలేక "ఇది ప్రస్తుత వివాదమునకు సంబంధించి నదికాదు. అది యోరుగల్లయినను నొరగల్లయినను మఱి యేకల్లయినను నా వాదమునకు రా(గల లాభనష్టములు లేవు కావున నాచర్చ వ్యర్థము" అని వ్రాయుచున్నారు. వ్యర్థచర్చకు దామేల తొడంగిరో! అందని పండ్లుచే(దన నిట్టిదే కా(బోలు.

సుబ్బరావుగారి వ్యాసములో నింక ననేకాంశము లున్నవి. వాని కన్నిం టికి బ్రత్యుత్తరము లిచ్చుటవలన(గాలహరణము తప్ప వేఱొండు ప్రయోజన ముండదు. కావున మానినా(డ.

కొట్టెడుపట్టులం దెంత గట్టిగా(గొట్టినను జిట్టచివరకు నేనీవాదములో సత్యజిజ్ఞాసువునైయే దిగితి ననుట సత్యమనియు నాతో నెన్నాళ్లయినను వాదిం చుట సంతోషకార్యమే యనియు మఱి యింకను గొన్ని ప్రశంసావాక్యములు వ్రాసి "నన్నీవిషయమున మరల రంగమున కీడ్వకుండుటకై బ్ర॥ శ్రీ॥ రామయ్య

పంతులవారిని ప్రమాణపూర్వకముగఁ బ్రార్థించుచున్నా"నని సుబ్బారావుగారు వ్రాసిరి. నావాదమును వదలుకొనుమని సుబ్బారావుగారి తాత్పర్యమైనట్లిందు వలనఁ దోఁచుచున్నది. ఈవాదఫల మనుభవించువాఁడను నేనుమాత్రమే నైనచో సుబ్బారావుగారంతవారు కోరినందుకు నేనట్లు చేయవలసినదే యుండును. కాని, వాదఫలము లోకాధీనమగుటచే నే వాదము వదలుకొనుటకు నాకధికారము లేదు. నేను సత్యజిజ్ఞాసువునైనచే యీవాదములోనికి దిగితి నని నొప్పుకొనినందుకు సుబ్బారావుగారికి వందనము లర్పించుచున్నాఁడను. వారును సత్యజిజ్ఞాసువులే యని నేనును దృఢముగా నమ్ముచున్నాఁడను. అభినివేశదార్ఢ్యభేదముచేతనో, యితరకారణములచేతనో మాయిరువుర వాదరీతులయందును గొంత భేదము కనఁబడవచ్చును. కొన్నియెడల నిష్ఠురోక్తులుగూడఁ బ్రయోగింపఁబడి యుండవచ్చును. అట్టిపట్టులందు, "నహినిందా" న్యాయమును బట్టింపవలయు నని నామతము. చిట్టచివరకు నిలుచునది సత్యమేగాని వాదప్రౌఢి గాదు. అట్టులే యగుఁగాక !

ఉభయపక్షముల బలాబలములు లోకమునకు విదితము లయినవి. ఇఁక నీచర్చ పెంచుట యనుచిత మని నాయభిప్రాయము.

జయంతి రామయ్య.

శ్రీరస్తు.

# విజయనగరసామ్రాజ్యాంధ్రవాఙ్మయచరిత్రము.

(పూర్వభాగము 5-వ సంపుటము 10, 11, 12 సంచికలలో ముద్రితము.)

పోతనామాత్యుఁడు తనభాగవతమున వర్ణించిన నరకాసురసంహారమును, నాచనసోమనాథుఁడు వర్ణించిన నరకాసురసంహారమును, కొన్నివిషయములఁ బోలి యున్నవి. విస్పష్ట మగుపోలికఁ జూపుపద్యములఁ గొన్నింటి నిచ్చటఁ బొందు పఱిచెద.

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందందమందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబు లై
తొరఁగం, బయ్యెదకొం గొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

ఉత్తరహరివంశము, ఆ. 1—162.

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటిమందహాసములతో, వీరంబు శృంగారమున్
జరగన్నన్నులకెంపు సొంపు పరఁగం జండాస్త్రసందోహము
న్సరసాలోకనమూహము న్నెరపుచుం జంద్రాస్య హేలాగతిన్.

(భాగవతము, దశమస్కంధము.)

నాచనసోమనాథుని కవిత్వము స్వతోజాతం బగుసాంద్రారణ్యంబువలెఁ గాక, వనపాలకృతాలవాలకలితం బై లతాగృహరమణీయం బై నానావిధపుష్ప ఫలభరితం బై సుమనోమనోజ్ఞంబుగ నున్నది. ఆంగ్లేయవాఙ్మయమందు స్పెన్సరు (Spenser) కవి రచించిన ఫెయిరీ క్వీన్ (Fairie queen) అనెడు గ్రంథ మర్వాచీనకవులకు మార్గదర్శకముగ నుండెను. ఆకారణమున స్పెన్సరు మహాకవికి 'కవీనాం కవిః' (The poet's poet) అను గొప్పపేరు వచ్చెను. అట్లే నాచనసోమనాథుఁడును గవితావైభవమును విచిత్రగతుల మిగుల వెలయింపఁజేసి

తరువాతికవుల కాదర్శకుఁ డాయెను. తత్కారణమున నీమహాకవికిని 'కవీనాం కవిః' అను బిరుదము ప్రాయికంబుగ నొసంగఁదగు.

ఉత్తరహరివంశమునందలి వచనభాగములు శ్లేషయమకాదిశబ్దాలంకారములతో నిబిడీకృతము లై బహుక్లిష్టముగా నుండును. సోమనాథునిపద్యశైలి కంటె వచనశైలియే యెక్కుడు కష్టముగా నున్నది. వచనభాగము తఱుచు యుద్ధవర్ణనలయందుఁ గన్పట్టును. అందలిశైలి సుశిక్షిత మైనతురగమువలె బహుచతురగతుల నొప్పుచున్నది. ఒకానొకచోట సమపతనఖురఘట్టనమువలె నుభయసైన్యములు సమానయానంబున దార్కొని మార్కొనుటయు, మఱి యొకపట్టున వల్గితగతిని యోధవీరులు మల్లయుద్ధంబునఁ జేరి యన్యోన్యవిజిగీషు లై మలఁగి పెనఁగి తల్లడిల్లుటయు, వేఱొకతావున సంచలితచమూనిచయంబులు పరిదేవనధ్వానంబులఁ బరిధావనం బొనర్చుటయు, నిట్లు సమరసంచారభేదంబుల నుచితశైలిగతిభేదంబుల నిరూపించుచు సర్వజ్ఞుఁ డగునిమ్మహాకవి శబ్దజాలపరంపరల సంగ్రామసంభ్రమనిర్ఘోషంబుల ననువదించెను. పైయంశములకు దృష్టాంతముల నీక్రిందఁ జూడనగు. శ్లేషయమకాదులు :—

"మఱియుం దదాశ్రయంబు వలాహకంబునుంబోలెఁ గరకాస్పదం బై కుంజరంబునుంబోలెఁ గుంభాభిరామం బై రంగస్థలంబునుంబోలె శైలూషశత రమ్యం బై యింద్రపదంబునుంబోలె నైరావతరుచిరం బై తరుణీముఖంబునుం బోలెఁ దిలకవిరాజితం బై పరమయోగిహృదయంబునుంబోలె మోక్షనిలయం బై పారావారంబునుంబోలె నమృతోత్పాదనస్థానం బై మహాభారతంబునుంబోలె శతపర్వసనాథం బై గగనంబునుంబోలె ఋక్షగణసంకీర్ణం బై కర్ణరథంబునుంబోలె శల్యాధిష్ఠితం బై ........." సమగతి :—

"ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సందడికయ్యంబునం గదిసి కరులుగరులను దేరులుదేరులను దురంగంబులుదురంగంబులను బదాతులుపదాతులనుం దలపడి సందడికయ్యం బయ్యె నయ్యెడఁ గత్తివాతియమ్ములం గత్తరించినం దుత్తుమురు లగుకత్తళంబులును ఘనగదాఘాతంబులం జిదుప లయినసీసకంబులును..............." వల్గితగతి :—

"ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు గాలువలు గట్టి గట్టిమెయిమరువులు చించియుఁ, గాయంబులు నొంచియు, మర్మంబులు గీఱియు, మహితలంబులు దూఱియు, బ్రేవులు వెలికియుఁ, బెనుమూఁకల కుఱికియు, సీసకంబులు

వగిలించియు శిరంబులు నొగిలించియుఁ, గైదువులు గఱచియుం గరవాలంబులు చఱచియు, నెత్తురులు చిమ్మియు నొసల్లు గ్రుమ్మియుఁ, జరణంబులు తొలిచియుఁ జర్మంబు లొలిచియు, బాహుదండంబులు గత్తిరించియు........"

యుద్ధవర్ణన లెంత వీరరసోద్రేకముతోఁ బొంగి పొరలుచుండునో ప్రతియాశ్వాసంబునఁ గానవచ్చును. తిక్కనసోమయాజితరువాత యుద్ధము వర్ణించుటలో నీకవియంతసమర్థుఁడు వేఱొకఁడు గానరాఁడు. భయము, ఉత్సాహము, కోపము, శౌర్యము, ఆటోపము, అహంకారము, మున్నగుభావములు యోధవీరులమనంబులవలెఁ జదువరుల మనంబులఁగూడ గజిబిజియొనర్చి సమరకౌతూహలంబుఁ బెంపొందఁజేయును.

హాస్యరసము వర్ణించుటయం దీకవి కెంతనేర్పు గలదో తెలిసికొనుటకుఁ దగినయవకాశము లీగ్రంథమునఁ గానరావు. ఒకానొకచోట మాత్రము హాస్యకరుణరసమిశ్రిత మయినభావమును గడుఁజిత్రముగ నిరూపించియున్నాఁడు. డిభకుఁడు మునిఁగి చచ్చినతనయన్న యగుహంసునికొఱకై వెతకుచు నిట్లు విలపించెనఁట :—

క. వ్రేలెడువెంట్రుక లిరుగడఁ, దూలఁగఁ దలయూఁచుఁ దొప్పతొప్పన నోరుం
గేల నడిచికొను సెలవుల, లాలలు దొరుఁగంగ నన్నలా యని యొఱలున్.

క. రాలం దల యడిచికొనుఁ, నేలంబడి పొరలు లేచు నెత్తురు లుమియుం
గేలీఁబడి రిపులు చూడఁగ, నాలుక వెఱికికొనుఁ జావుసకుఁ దన్నుకొనున్.

ఇంక శృంగారరసకవన మీకవినోటనె వినవలెను. ఔచిత్యనియమ మొకించుకయుఁ దప్పక, పేరున కైన నశ్లీలము చెంతఁ బోక, పాత్రపోషణము కడుఁబ్రశస్తముగాఁ బరిపాటించుచుఁ గ్రమక్రమోదితముగ, రసో[illegible]ఁ బ్రకటించుచుఁ దుద కుద్వేలరసాంబుధిలోఁ బాఠకుల ముంచివేయును. పాత్రోచితభాషావిషయమున నూర్వశీనరకాసురసంవాదమును జూడుఁడు :

క. పగవాఁడఁట దేవేంద్రుఁడు, మగువా ! నీ పతనికొలువు మానిసివఁట, నిం
దగవుచెడి పిలువఁ బనుచుట, మగతనమే ? యిట్టిలంజమాటలు గలవే ?

ఊర్వశి : ఉ. లంజియ నౌదు నేను విను లావున నీ వమరేంద్రుఁ గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితిగాక, చిత్త మె
ల్లం జెడియుండ రిత్తయొడలం జవిచేరునె ? చిల్కపోయినం
బంజర మేమిసేయు ? రసభంగముసంగతి లోన మెత్తురే ?

ఉ. నవ్వులమాటలో నిజమె నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీఁగెలం దెగడుమానిను లుండఁగ సంత నెన్నఁడో
జవ్వన మెుఙ్మ్కొన్నకడసారె ననుం గవయందలంచితే
పువ్వులువేస్తు కైనఁ గడివోయినవే న్మనువంగవచ్చునే!

నరకాసురుఁడు :

క. అంజెదవుగాక నను, జెం, తంజేరఁగనీక యెంత తిత్తిఁగిన మిదియా
లుం జొన్నలసరిపోవే! లంజెతనములందుఁ గోమి కెలన్ గెలువవఁటే.

నరకాసురుని మొఱటుతనమును, ఊర్వశియొక్క చాతుర్యవిలసితభావ గాంభీర్యము నెంతచమత్కారముగా వర్ణించెనో చూడుఁడు.

మఱియు నిందుధరోపాఖ్యానమునందును, ఉషానిరుద్ధీయమునందును, శృంగారాభివర్ణన ముత్తమోత్తమకవిత్వలక్షణముల నొప్పారుచున్నది. శబ్దములమాధుర్యమూ, భావగర్భితమగు ధ్వనియూ, వర్ణనలస్వభావమూ, చిత్రితరూపముల సౌందర్యమూ, రసోత్సేక మగుసర్వేంద్రియరాగసమృద్ధియూ, దేనినిఁ జూచినను బాఠకులకుఁ దనివి దీరనిశృంగారరసానుకంపన మొసఁగుచున్నవి.

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంత నా
రహరిద్రారసగౌరకేసరములన్ రంజిల్లుమాధ్వీకవా
ర్లహరీస్వేదము చూపఁ బట్టపగ లేలా యింతటన్ సిగ్గు లే
దహహా యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమాలై ముద్దరా లయ్యెడన్.

ఆ. 5 ప. 52.

ఉ. చెందొవరేకు ఫాలమునఁ జేర్చి ప్రఫుల్లపయోరుహంబుచే
నందముగా బిసావళి భుజాంతరముం గదియించి యుత్పలా
మందమరీచిమేచక చమత్కృతిచారుగళోపచార యై
సుందరి యోర్తు వచ్చె హరుచూపులకున్ హరుఁ డయ్యె నయ్యెడన్.

ఆ. 5 ప. 71.

ఉ. డెందముమీఁదఁ జెందొవకు డెప్పర మేమియు లేదు; చన్నులం
జిందదు ఘర్మవారి; చెవిఁ జేర్చినలేఁజివు రించుకంతయుం
గందదు; నాసికాగ్రమునఁ గన్నులబాష్పము లూర; వింక నీ
సుందరిఁ గావ నేరఁడు ప్రసూనశరుం డని యార్తమూర్తులై.

ఆ. 5. ప. 184.

## నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడ.

ఎఱ్ఱాప్రెగ్గడ పూర్వోత్తరభాగయుత మగుహరివంశము నంతయుఁ దెనిఁగించె ననియు, నాచనసోముఁ డందలి యుత్తరభాగమును మాత్రమే తెనిఁగించె ననియు నిదివఱకే తెలుపఁబడినది. ఈయుభయకవులును గొంచె మించుమించుగా సమకాలికు లగుటచేతను, ఒకగ్రంథమందే వారికవితావైభవమును గనఁబఱుచుటచేతను వారిగ్రంథరచనాపద్ధతులయొక్కయుఁ గవితాస్వరూపములయొక్కయు సామ్యభేదములను నిరూపించుట సందర్భోచితము.

హరివంశము భారతమున కనుబంధ మనియు నది తెనిఁగింపఁబడనిచో నాంధ్రభారతము సమగ్ర మని చెప్పుట కవకాశ ముండ దనియు నాశయముతో నెఱ్ఱాప్రెగ్గడ హరివంశమును సంపూర్ణముగాఁ దెనిఁగించి భారతామ్నాయము నాంధ్రావళికిఁ బూర్తిచేసినట్లు గాన్పించుచున్నది.

క. భారతపరాంశమని యిం, పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుంగున, ధీరోత్తమ! నిర్వహించి తెలుపుము మాకున్.

అని కృతినాయకుఁ డగుపోలయవేమారెడ్డి యెఱ్ఱాప్రెగ్గడతోఁ జెప్పెనఁట. కావున నాంధ్రభారతవిధానక్రమము ననుగమించి యాంధ్రజనుల కుపయోగించునటు లెఱ్ఱన హరివంశము రచియించె ననుట సర్వసమ్మతము. ఆంధ్రభారత రచన, సార్వజనీన మగుటకుఁ గారణము లారయ, మాతృకానువర్తనము, శైలీసుగ్రాహ్యత, రసపోషణసమౌచిత్యము, మున్నగునవి ముఖ్యములు, శబ్దాడంబరము, సమాసబాహుళ్యము, క్లిష్టాన్వయము, అలంకారసంభృతి, వీనిచే శైలికాఠిన్యమును వహించిన సామాన్యజనులకు సంప్రీతి కలుగుటెట్లు కాన గ్రంథమంతయు నాతికఠినముగాను నాతిసులభముగాను రచింపఁబడినది. ఆలాగుననే హరివంశమును బండితపామరులకు సమానాదరణము కలుగునట్లు వ్రాయఁబడినది.

నాచనసోముఁడు హరివంశముఁ బూర్తిగఁ దెనిఁగించి భారతామ్నాయమును సంపూర్ణముఁ గావించెడి తలంపునఁ దనగ్రంథమును బ్రారంభింపలేదు. తిక్కనసోమయాజిని, ఆయన రచించినభారతమును దనగ్రంథమునందుఁ బేర్కొనుటకు ముఖ్యకారణము కవిబ్రహ్మాయం దతనికిఁ గలగౌరవమే యని తోఁచుచున్నది. శంభుదాసు వ్రాసినహరివంశముఁ జూచి తానీగ్రంథము వ్రాయలేదని ప్రపంచమునకుఁ దెలుపుట వేఱొకకారణము కావచ్చును.

"ఏ, గతి రచియించిరేని సమకాలమువారల మెచ్చరేకదా !"—విజయవిలాసము.

ఇఁక ఈ రెండు గ్రంథములఁ గుఱించియు నించుక విచారించెదము; హరివంశమునందలి పూర్వభాగమున శ్రీ కృష్ణునిజననము మొదలు సాందీపునిచెంత విద్యాభ్యాసమువఱకు నీనడుమ జరిగిన బాలక్రీడలు, సాహసకృత్యములు, రాక్షససంహారములు మున్నగునవి యభివర్ణింపఁబడినవి. ఉత్తరభాగము జరాసంధుని పరాభవముతోఁ బ్రారంభమై రుక్మిణీపరిణయము, నరకాసురవధ, పారిజాతాపహరణము, మధుకైటభహిరణ్యాక్షాదిరాక్షససంహారము, శ్రీకృష్ణుని కైలాసయాత్ర, శివకేశవసమాగమము, పౌండ్రకవాసుదేవవధ, ఉషానిరుద్ధీయము, బాణాసురపరాజయము, బలిమర్దనము మొదలగుముఖ్యవిషయములతో సమాప్తినొందెను. నాచనసోముని యుత్తరభాగము ముఖ్యముగా నరకాసురవధతోఁ బ్రారంభమైనది. జరాసంధునిపరాభూతియు, రుక్మిణీపరిణయము నొకించుకమాత్రము సూచింపఁబడినవి.

సీ. కడిమి జరాసంధగంధసింధురముఁ దద్బంధుమండలితోన పాఱఁదోలె
బలియు నాగాయుతబాహు జగత్ప్రాణతనయు గదాకేలిదర్ప మడఁచె
వీఁకతోడ విరాటవీరఖేలనమున ధీరుఁ బ్రలంబద్రై తేయుఁ జంపెఁ
దెగువరాసభరూపు ధేనుకాసురుఁ బట్టి విన్నాణమున మేను విఱిచివైచె
తే. నగరపరిఖాపయఃపూరణంబు సేయ, నీరముఖమునఁ గాళిందిఁ జీరి తెచ్చె ;
మెఱసి మూఁడులోకంబుల మేటి మగలు, రాయ నేర్తురె యాదవరాముతోడ.
ఆ. 1 ప. 8.

క. అనుటయు నాజనమేజయు, జనపతి యిట్లనియె రుక్మి చచ్చిన మగుడం
జని యాదవనగరంబున, జనార్దనుం డేమిచేసె ? సౌజన్యనిధీ ! ఆ. 1 ప. 12.

మఱియుఁ బారిజాతాపహరణముంగుఱిచి సూచనయును లేదు. మధుకైటభహిరణ్యాక్షాదిదుష్టరాక్షససంహారములు బొత్తిగా విడువఁబడినవి. ఈలాగున నుభయగ్రంథంబులును బరికించినచో విషయవ్యత్యాసము విశేషముగాఁ గాన్పించును. ఇందులకుఁ గారణములు గొన్ని యూహింపవచ్చును.' సోముఁడే తన గ్రంథమున నిట్లు చెప్పియున్నాఁడు.

క. హలపాణిమహిమ చెప్పం, గలవా రెవ్వరు పురాణకథలఁ మఱియుం
దెలిసికొనుమని నేఁ జెప్పక, నిలిచినచోటులు వివేకనిర్మలబుద్ధీ. ఆ. 1. ప. 11.

కావునఁ గ్రంథమునందలి కొన్నిభాగములు పరిత్యక్తము లైనవని కవినోటనె తెలియుచున్నది. ఇట్లు కొన్నిభాగములను విడుచుటకు వాఁడుఁ జేసిన కారణము లేవన :—

1. సోముఁ డుత్తరభాగమునైనను సమగ్రముగా వ్రాయ నుద్దేశించి యుండలేదు.

2. శ్రీ కృష్ణునికృత్యములనుమాత్ర మభివర్ణింపఁదలంచి హాలపాణిచరిత్రమాఁ జెప్పవిడిచె.

3. శ్రీకృష్ణునికృత్యములయందును, రసపోషణసంవిధానమున కనువగు భాగములనుమాత్రమె స్వీకరించెను.

మఱియు నొకవిశేషము :—ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునందు హంసడిభకులసంహారమును గుఱించి సూచనయును లేదు. నాచనసోమనాథుఁ డీకథను ప్రత్యేకముగా నొకయాశ్వాసమున విపులముగ వ్రాసినాఁడు. ఈద్విగ్విధములగు గ్రహణపరిత్యాగభేదములను బరిశోధించినచో, నుభయగ్రంథములందును విషయవ్యత్యాసములు మెండుగఁ గన్పట్టును.

ఇంతియ కాదు. విషయమునం దెంతభేదమున్నదో, శైలియందు నంత భేదము కాన్పించుచున్నది. ఆంధ్రభారతము సార్వజనీనముగా వ్రాయఁబడిన ట్లెఱ్ఱాప్రెగ్గడ తనహరివంశమును రచించియుండునని తొలుదొల్తఁ జెప్పఁబడినది. అదియే నిక్కమైనచో, హరివంశమునందలి శైలి ద్రాక్షాపాకముగా నుండి, మృదుమధురరచనలతో నలరారి, సులభగ్రాహ్యముగా నుండుటకుఁ గారణము వేఱె వెదుకనక్కఱలేదు. ఎఱ్ఱనప్రణీత మగుగ్రంథ మాయన ప్రబంధమని చెప్పినను నిక్కముగఁ బురాణమే. కావునఁ బురాణశైలినె వ్రాయఁబడినది. అనఁగాఁ గించిద్భాషాజ్ఞానులకును గ్రంథముఁ జదువ నభిరుచియు గ్రహింప సౌలభ్యమును దానియం దుండవలయును. లేనియెడ లాగ్రంథము పండితాస్వాదనీయ మగును గాని జనావళికి రుచింపదు. సోమునిగ్రంథము మహాప్రబంధము. అది సమస్తజనులకును సుగ్రాహ్య మగునట్లు వ్రాయఁబడినది కాదు. ఉభయభాషాజ్ఞానమును బాగుగఁ గలిగినవారే దానిని గ్రహింపఁజాలుదురు. ఇతరుల కది దురాసదము. కావున మొదటినుండియుఁ గవిత్వపాకరీతుల నుభయకవులును వేఱువేఱుమార్గములఁ ద్రొక్కిరి.

నరకాసురుఁడు దేవలోకం బాక్రమించి యూర్వశిని రావించి యామెతోఁ జల్పినసంభాషణము నుభయగ్రంథములం జూడుఁడు.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము.

మ. వరుణుం దోలితి, నర్థపుం జదిపితి, న్వైవస్వతుం గెల్చితిన్
హరిఁ బోఁజోపితి నేన యాశ్విసుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు మెచ్చుల్మీఱ నీవింక న
న్నరవిందానన ! సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్.

చ. అనుటయు నమ్మృగాక్షి యిదియట్టిద; యంతటివాఁడ వైన నీ
పెను పసదే తలంప రిపుభేదన ! సంయమికోటి భక్తితో
నిను నిఖిలాధ్వరంబులను నిత్యసమర్చితుఁ జేసిరేని నే
నును ముదమొప్పఁ గైకొని వినూత్నవిహారరసాబ్ధిఁ దేల్చెదన్.

ఇట్లెఱ్ఱన రెండుపద్యములఁ గ్లుప్తముగా ముగించెను. దీనినే నాచనసోముఁ డిరువదియేనుపద్యముల నెంతరసవంతముగఁ బెంచి వ్రాసెనో గ్రంథముఁ జదివినఁ దెలియఁగలదు.

ఉ. ఊర్వశిఁ దోడితెమ్మనుచు నొక్కనిఁ బంపఁ బదుండ్రు పాటి సౌ
పర్వణసౌధవీథులయుపాంతములం దిరుగంగ నంతకుం
బూర్వసురేశ్వరుండు సురపుంగవుగద్దియమీఁద నుండి గం
ధర్వులపాట వించుఁ బ్రమదంబునఁ బొందుచు నున్నయత్తఱిన్

* * * *

ఉ. తోరపుఁజన్నుదోయిపయిఁ దొంగలిఱెప్పల డాఁచి చూపు నీ
హారము లేనిక్రొమ్మెఱుఁగులై నిలువం గొలు వల్లఁ జొచ్చి య
చ్చేరువకంబముం గదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారపుబొమ్మవోలె నచటం గదలించుక లేకయుండఁగన్.

ఉ. ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లను బాకశాసను
డాలములో ననుం గదిసి యంతకపాశికుబేరయుక్తుఁ డై
తోలుపులంబడెన్ సతులతోడనె డాఁగిరి దైత్యభీతు లై
పోలఁదొలంగి తేమిటికిఁ బొత్తులదానవు నీవు తొయ్యలీ.

* * * *

చ. అవు నిది వోలు వాసవుఁడు నంతకుఁడున్ వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పద మేలెదరంచు నిట్టినే
నవహితయాగభాగము లహంకృతి మైఁ గొనకున్న, నూర్వశీ!
కవకవనవ్వరే త్రిదశకాంతలు వింతలు సేయునాపనిన్.

మఱి యొకదృష్టాంతము!

శ్రీకృష్ణుని కైలాసయాత్రసందర్భమున శివకేశవు లిద్దఱు నేకత్ర ఉపవిష్టులై యొకరినొకరు ప్రస్తుతించికొని నిజైక్యమును బోధించునపు డటఁ జేరిన నిలింపగణములు వారిసిద్ధతఁ గొనియాడిరఁట. ఆభాగమునంతయు రెండుగ్రంథములఁ జదివిచూచిన నుభయకవులయొక్కయుఁ గవితాధోరణులు వ్యక్తపడఁగలవు.

సోమనాథుఁడు 'సాహిత్యరసపోషణసంవిధాన' మందెంతమిన్న యగుకవియో విదితమగును.

సీ. అభ్రింకషం బైనయాలసోతు నితఁడుద్రుంచినాఁ డితండు పెంచినాఁడు,

* * * *

రజతగిరిమీఁద హరిహరారాధనంబు.

సీ. సారసంబున లేవ నీరసంబునఁ జావఁ బద్మాసనుఁడు వీరిపాలఁగనియె

* * * *

హరిహరాత్మ నెఱింగితి మనిరి సురులు.

(నాచనసోమనాథుఁడు).

సీ. యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియు నేలోకనుతులఁ బెంపారువారు
కందర్పజనకుండు గందర్పదర్పైకదమనుండు నై లీలఁ దనరువారు

* * * *

* * * *

నెపుడుఁ గరుణతో వరదు లయ్యెదరుమాకు.

(ఎఱ్ఱాప్రెగ్గడ).

ఎఱ్ఱనరచన యీవిషయమునఁ గొంత నీరసముగా నున్నది. శివకేశవు లిద్దఱు నొకచోట సమాసీను లై దేవసంఘంబులును మునిబృందంబులు నచ్చెరువొంది వినుచుండఁ దమయద్వైతభావమును దిగంతవిశ్రుతనినాదముగా నుద్ఘోషింపఁ దత్ప్రకృతిస్వారస్యమును సముచితరసోదయముగ నభివర్ణింపమి కవితాప్రౌఢిమ కొకింత న్యూనత గల్గించుటగాదే!

వేఱొకదృష్టాంతము :—

ఇందుమతీపాఖ్యానమును, ఉషానిరుద్ధీయము నుభయగ్రంథములయందును జదివి చూడుఁడు; సోమనాథునికవిత్వము సర్వతోముఖముగ నెఱ్ఱాప్రెగడకవితకంటె రసపుష్టియందును, శబ్దచమత్కృతియందును, భావభావనావికసనమునందును నెంత ప్రౌఢతరముగా నున్నదో విస్పష్టమగును. తారతమ్యనిరూపకము లగు రెండుపద్యములమాత్ర మిట నుద్ధరించెదను :—

సీ. క్షాళితకస్తూరికము లగుకుచముల క్రేవల నఖపదశ్రీలు మెఱయ
విస్మృతాంజనచారువిభవంబు లగునేత్రముల దట్టకెంపులేముల భజింప
గళితతాంబూలరాగము లగుబింబాధరముల దంతక్షతరచన బెరయ
నాశ్లిష్టతిలకంబు లగుఫాలముల నార్ద్రాలంబంబు లగుకుంతలములు పొదువ
సన్నవలిపంపుటారులు జఘనములును, నంట నారులు జిగిమెక్కియసదుకౌను
నందు నెత్తురుకాంతి నిండార నంబు, నేక మభినవద్యుతిఁ జేసెఁ జెలువగమికి.
ఎఱ్ఱన. ఉ. హ. ఆ. 7.

సీ. అరుణారవిందంబు లని త్రొక్కనోకాని చిగురుటాకుల నింత చేరరావు
పులినంబు లని చాల బుజ్జగించెనొకాని మరుచక్రముల నింత మరిగిరావు
చక్రవాకము లని సవరించెనోకాని కరికుంభముల నింత గదియరావు
గండుమీలని చాల గారవించెనొకాని పూవుఁదూపుల నింత పొందిరావు

తే. తరఁగలాత్మీయధనములదాయలైనచరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి, తరఁగ లింతులు పైకొన్నఁదలఁకినట్లు.

ఈలాగున నుభయగ్రంథంబులయందును నేభాగములు సరిపోల్చిచూచినను సోమనాథునికవిత్వ మెఱ్ఱనార్యునిదానికంటె రసవత్తరముగను బ్రౌఢతరముగ నున్నదని చెప్పుట కొకించుకయును సందేహము కలుగలేదు. ఇట్లు సోమనాథునికవిత్వమును భూషించుట యెఱ్ఱనార్యునికబ్బమును నిరసించుటగాఁ గవితాభిమానులూహింపఁదగదు. గ్రంథవిమర్శనమందు యథార్థగుణనిరూపణము చేయక తప్పదు. హెచ్చుతగ్గులు నిర్ణయింపకతీరదు. కవితాభిమానమే గాని కేవలము కవీశ్వరాభిమాన మనుచితము, నక్రమము.

ఇంతవఱకు గ్రంథముల రెంటినిమాత్రమే విమర్శించి శయ్యాధోరణుల యందలి తారతమ్యముల నిరూపించితిని. ఇంక నిరువురుకవుల ప్రత్యేకకవితాలక్షణముల గుర్తింపఁగడంగెద. ఈవిషయము కొంతమట్టు కప్రస్తుత మైనను,

ఆంధ్రమహాకవులకవితాలక్షణనిర్ణయములయందింకను, నిశ్చితాభిప్రాయములు లేకపోవుటయుఁ, బలువురు పలువిధముల నూహించుటయు, వాదప్రతివాదములకు విశేషముగ నవకాశముండుటయు, నిత్యాదికారణములచేత, నీమహాకవుల కవిత్వము లేయేవిషయములలో నేయేలాగున నున్నవో చర్చింపసమకట్టితిని. పాఠకు లీయభ్యంతరప్రసంగమును క్షమింతురుగాక.

కాళిదాసు, భవభూతి, భారవి మొదలగుసంస్కృతమహాకవీశ్వరుల కవనధోరణులసామ్యభేదములు విస్పష్టముగాను సమగ్రముగాను దెలియవచ్చుచున్నవి. కాళిదాసుకవిత్వ మిదమిత్థమనియు, భవభూతికవిత్వమిదమిత్థ మనియు, నిర్ణయించి కాళిదా సీయీవిషయముల నెక్కుడైనచో, భవభూతి యీయీవిషయముల మిన్నయని నిర్వచింపఁబడినది. అటువంటినిర్వచనము తెలుఁగుకవీశ్వరుల గుఱించి యింకను జేయవలసియున్నది. విశేష మగుపిమర్శనయుఁ, జర్చయు, జరగినఁగాని వారివారికవితాప్రకృతి నిరుక్తికాఁజాలదు. కావున సందర్భావశ్యకత నతిక్రమించియైనను, పైనుద్దేశించినవిషయమును జర్చింపఁబూనితిని.

ఎఱ్ఱాప్రెగ్గడహరివంశమేగాక మఱి కొన్నిగ్రంథములఁగూడ రచియించెను. అందు భారతమందలి యారణ్యపర్వశేషము,. రామాయణము, నృసింహపురాణము, మున్నగునవిముఖ్యములు. నాచనసోమనాథుఁడును, వసంతసేన, యిత్యాది మఱికొన్నిగ్రంథములు వ్రాసినటులఁ గాన్పించుచున్నది. కాని వసంతసేన యందుఁ గొన్నిపద్యములుతక్క, ఇతరగ్రంథము లేవియు నింకను లభింపలేదు. లభ్యములైనవఱకు, వీరిరువురిగ్రంథములు చదువఁగా, వీరి కవితలయందుఁ గొన్నివిస్పష్టములైనలక్షణములు గాన్పించుచున్నవి.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికనాల్గవసంపుటము 9, 10, 11, సంచికలలో బ్ర॥ శ్రీ॥ రా॥ అనంతకృష్ణశర్మగారు, ఎఱ్ఱాప్రెగడ, సోమనాథులకవిత్వములను సరిచూచి తారతమ్యముల నిర్ణయించిరి. సోమనాథునికవిత్వముకంటె, నెఱ్ఱాప్రగడకవిత్వ మెక్కుడు ప్రశస్తముగా నున్నదనియుఁ గావున సోమనాథునికి నెఱ్ఱాప్రెగడకంటెఁ దక్కువస్థాన మీయఁదగిన దనియు వారిసిద్ధాంతము. "లోకో భిన్నరుచిః" అనునట్లు వారి కట్టియభిప్రాయ ముండుట సమంజసమే కాని వారు సిద్ధాంతీకరించుటలోఁ గొన్ని పొరపాట్లున్నవని నాయభిప్రాయము. ఆయన వ్రాసిన వ్యాసమును జాలవఱకు ఖండించుట కవకాశమున్నను, సుదీర్ఘ మగువ్యాసమునకు దీర్ఘతర మగుప్రత్యుత్తర మిచ్చుట కనువగుసందర్భ మిది కాదని విరమించెద.

కవిత్రయమువారును, నాచనసోముఁడును, నుత్తమకవీశ్వరులని చెప్పుట కెవ్వరును సందేహింపరు. కాని వారికంటె వీరెక్కువా ? వీరికంటె వారెక్కువా యనువాదప్రతిపాదములఁ జేయుటయందుఁ గొంత పూర్వాలోచన కావలసియున్నది. అదేదన, నొకానొకకవీశ్వరుఁ డుత్తమకవి యనిప్రసిద్ధినొందుట కాయనయందేదో మహత్తర మగువిశేష ముండినఁగాని యట్టిలోకప్రసిద్ధి రానేరదని తెలిసికొనుటయే. అటువంటి ప్రసిద్ధికిఁ గారణము లెవ్వియని నిర్ణయింపఁదగు. కావున మహాకవీశ్వరు లని యాంధ్రప్రపంచమున వేనోళ్లఁ జాటఁబడిన ఈమహానీయుల కవిత్వములయం దసన్యసామాన్యప్రాశస్త్య మెద్దియో తెలిసికొనఁ గోరుట కర్తవ్యము ; ఏవిషయములయం దెవరెవ రగ్రగణ్యులు, ఒకానొకవిషయమునం దొకరికంటె మఱియొక రధికులా ? కారా ? యనుసమాలోకనకుతూహలమున విమర్శించు టుచితము. ఈసమరసవిమర్శదృష్టిని, ప్రస్తుత మెఱ్ఱాప్రెగడసోమనాథులఁగూర్చి మాత్రము చెప్పఁబూనెదను. ఏతద్గ్రంథావకాశము నుబట్టి, విపులదృష్టాంతము లీయక నాయభిప్రాయములనుమాత్రము సంక్షేపముగ నిచట వ్రాసెదను. సోదాహరణ మగువిపులవిచారణ స్థలాంతరమునఁ జేయఁదగు.

ఉభయకవులయందలి సమానగుణములఁ గనుఁగొని తరువాత భేదముల నిర్దేశించుట కార్యక్రమము.

i. ధారాశుద్ధియం దుభయులు నొకరికొకరు తీసిపోరు. వారి కవితాప్రవాహ మనర్గళము, అతివేగము, అయత్నోపలభ్యము, ఐచ్ఛికవిహార సంపన్నము.

ii. ఉభయభాషాపాండితియం దుభయులు సమానగౌరవముఁ బొందనర్హులు.

iii. భావభావనాప్రపంచమునం దిరువురు స్వైరవిహారధీరులు.

iv. కావ్యలక్షణసంప్రదాయేత్యాది వైదగ్ధ్యమునం దిద్దఱుఁ దులఁదూఁగుదురు.

v. మఱియుఁ బురాణేతిహాసకథాపారగత్వమున నిరువురకు హెచ్చుతగ్గులు నిర్ణయింపఁబూనుట శశవిషాణాన్వేషణము.

vi ఇంతియగాక, ఉభయులు సమాననైష్ఠికసదాచారసంపన్నులు,

వేదవేదాంగవిశారదులు, సంతతభగవద్భక్తిపరాయణులు నై, వారాశ్రయిం
చిన యాస్థానముల, ననూనగౌరవాతిశయములఁ బొందియుండిరి.

సమకాలికులై యుండి యిన్నివిషయముల సమానలక్షణములు గల
వీరిరువురికి నన్యోన్యవిజిగీషయుండుట యస్వాభావికమా? ఆశ్చర్యజనకమా?
కావుననే యొకేగ్రంథము నుభయు లాంధ్రీకరింప నుద్యోగించుట చేకూరినది.

ఇంతదనుక వారిజ్ఞానవిజ్ఞానపరికరసమృద్ధిని విడఁదీసి ప్రత్యేకముగాఁ
జూచి, వా రొండొరులకుఁ దీసిపోరని నిర్ణయించితిమి. ఇటుపైని వారిపరికరనిక
రము నెట్లు కవిత్వమునందు వినియోగించిరో, వినియోగింపఁగలిగిరో, చూతము.

ఈకవిపుంగవుల కిద్దఱకుఁ గలభేదము, కర్ణార్జునులకువలె, సాధనసా
మగ్రియొక్క ప్రయోగసంసిద్ధియందుఁ బ్రాయికముగ నున్నదని నాయభిప్రా
యము. సామర్థ్యమునందు హెచ్చుతగ్గులు లేవు. మేధాశక్తియందు బంతుగొం
కులు లేవు. కాని సద్యస్స్ఫూర్తియు, పర్యాలోకనచతురతయుఁ గొంతవఱకు
వేఱైయున్నవి. వీరిద్దఱియందలి తారతమ్యము నిర్ణయించుట కిదియే ముఖ్యాంశ
మని నాకుఁ బొడకట్టినది.

ఉభయకవులు కవితాశైలియందు వేఱువేఱుమార్గములఁ ద్రొక్కినసం
గతి యెల్లరకు విశదమే. ఎఱ్ఱాప్రెగడశైలి యెక్కుడుమృదువైనదియుఁ గోమల
మైనదియు, నై యున్నది. ఆయన సామాన్యముగా వాడినశబ్దములు గీర్వాణ
మునందయినను, ఆంధ్రమునందయినను, సరళమైనవియు, సుస్వనయుతమైన
వియుఁగా నున్నవి. మృదులపదసంవిధానము, సహజకవితాధారతోఁ గలసి గగన
కల్లోలినీకలస్వనమువలె వీనులకు వింపొనరించుచుండును. ఇఁక సోమనాథుని
శైలియన్ననో యనేకవిధములఁ బరుగిడును. ఒకప్పుడు మృదుమధురశబ్దము
లతో వీనులకు, వేణుగానమువలె నుండును. మఱి యొకప్పుడు దీర్ఘ మగు
సమాసములతో నుద్దండమారుతమువలె నుద్ఘోషించును. ఇంకొకప్పుడు సప్తతం
త్రీసమ్మేళము రీతిని స్వరమాలికలతో మైమఱపుఁ బుట్టించును. ఈలాగున నే
సందర్భంబునకుఁ దగిన ట్లాసందర్భమున, నుచితగతుల నాశైలి మార్చుచునుండును.
ఈయనశబ్దజాలమునం దెక్కువపటుత్వమును, జీవమును, జవమును, నున్నట్లు

తినిఁ బ్రవాహవేగమున పొరలుచుండును. గురుతరభావము లనువదించుటకు గురుతరశబ్దములేగాని పేలవమగుపదములు వాడఁబడియుండలేదు.

ii. పదగుంభనమందు భేదమున్నట్టులు, ఛందోవృత్తసంగ్రహణమందును భేదము గాన్పించుచున్నది. సోమనాథుఁడు దఱుచుగా నుత్పలచంపకమాలలను, సీసములనుమాత్రమే వాడెను. కందములు, గీతములు నంతకంటె తక్కువగాఁ గానఁబడును. శార్దూలము లరుదు. తదితరములు నామావశిష్టములు. ఈ లాగున మాలావృత్తముల నెక్కుడుగా నుపయోగించుటకుఁ గారణమేమన నాయన రసోద్ధతికిఁ దగినశబ్దజాలమును గూర్చినట్లే ఛందస్సహాయమునుగూడఁ గైకొనెను. కావున రసప్రవాహముతో సమానముగ, శబ్దవృత్తప్రవాహము పరుగిడుచు, రసవికాసము ననుసంధింపఁజేయును. భవభూతి, మురారి, మిల్టన్, టెనిసను మొదలగుకవులను జదివినవారి కిది క్రొత్తవిషయము కాదు. ఎఱ్ఱాప్రెగ్గడ యీసాధనసంపత్తి నంత చతురతగా వాడి యుండలేదు. ఉభయులయందును రసము నైసర్గికమైనను, దానిని బోషించుటయందు సోమనాథుఁ డెక్కుడు నేర్పుఁ జూపినాఁడు.

iii. భావప్రకటనమునందు శంభుదాసుఁడు కేవలము నైసర్గికసారళ్యమునే యనుగమించెను. సామాన్యమనుజుఁ డేవిషయమునైన నెట్లూహించునో, సాధారణముగ నాయన యాలాగుననే భావముల నిర్వక్రముగాను, నిదానముగాను నూహించును. అనఁగా నాయన స్వభావముచే సుందరమగుబంగారమును సామాన్యముగ నాస్థితియందే యుంచివాడును. ఇఁక సోమనాథుఁ డన్ననో, యానైసర్గికసువర్ణమునకు మఱింత తళుకుబెళుకులు గలుగునట్లు నగిషీపనిఁ జేయును. అనఁగా సహజసువర్ణముఁబోలు తననైసర్గికభావమునకు సాహిత్యపోషణ మనెడి యొకనగిషీపనిఁ జేసియున్నాఁడు. కావున నాయన చిత్రించిన భావములు కేవలనిసర్గజన్యములయినను, గొంతచాతుర్యవిలక్షితములై యున్నవి. సహజసౌందర్యవతి యగుమానిని నవరత్నభూషితురాలయినఁ దప్పేమి? ఈకారణమున నెఱ్ఱాప్రెగడయందలి భావవిలసనము, సోమనాథునియందలి దానివలెఁ దటాలున మనసునందు గోచరింపదు. కవిత్వ మొకకళయైనచో, నైసర్గికభావమునకుఁ (Nature) దగినరసపోషణసంవిధానముఁ (art) జేయుట యొప్పేగాని తప్పుగాదు. అట్టి సంవిధానమం దగ్రగణ్యుఁడుగావుననే, సోమనాథునికి 'సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి' అని బిరుదము నిలిచియున్నది.

మఱియు, వర్ణనలవిషయమున నుభయకవులు పెఱ తెలుఁగుకవులవలెనే అనావశ్యకదైర్ఘ్యదోషమున కవకాశ మిచ్చియున్నారు. చిన్నచిన్నవర్ణనలు స్వభావోక్తములయి మనోహరముగ నున్నను, దీర్ఘవర్ణనలు కొంతదనుక భాషైక చాతుర్యమునుమాత్రమే చూపుచున్నవి.

ఈసందర్భముల నన్నిఁటినిజూడఁ గేవలము సరసకవితారచనయందు సోమనాథుఁ డెఱ్ఱాప్రెగడకంటె నెక్కుడు ప్రౌఢత్వమును, రసికత్వమును గనఁబఱిచెనని చెప్ప నొప్పుఁగాని శంభుదాసుఁ డాంధ్రవాఙ్మయమున కెక్కుడుగ్రంథముల నిచ్చి యెక్కువయుపకారమును జేసినాఁడు. గ్రంథబాహుళ్యమునందుఁ దిక్కనవలె శంభుదాసగ్రగణ్యుఁడైనను, గేవల కవితాప్రకృతియందు సోమనాథుఁ డెఱ్ఱనకంటె మిన్న యని తలంచెద. యాథార్థ్యము నాంధ్రకవితాభిజ్ఞులు నిర్ణయింతురుగాక !

నాచనసోమనాథుఁడు కన్నడభాషయందుఁ గొన్నియుద్గ్రంథముల రచియించినట్లు తెలియవచ్చుచున్నది. కన్నడగ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ జేరవుగావున, నిచ్చట వానితో నేమియుఁ బ్రసక్తిలేదు.

చేకుమళ్ల అచ్యుతరావు.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

తృతీయాశ్వాసము.

క. శ్రీదోరంతర వేద, ప్రోదితభాషావిశేషభాసురకీర్తి
శ్రీదార్ఢ్య వివిధపూజా, మోదితగిరిదుహితృకాంత! ముమ్మయశాంతా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు తల్లిదండ్రుల నూరార్చి వెడలి సుకుమారుండు నిజాంతర్గతంబున. 2

గీ. పోయె నుపదేశకాలంబు పూర్వమున నె,కడచె ధైర్యంబు జరఠవిశ్రాంతమయ్యె
శీలసంపత్తి యిఁక నేమిసేయువాఁడ, భామినీసక్తి మన్మథుబారిఁ బడితి. 3

ఉ. పంతం బోడదు ధర్మముం దగవునుం బాడిం గులంబు న్విచా
రింతు న్వేదపురాణశాస్త్రమతపారీణుండఁ గా నెట్లు క
ల్పాంతద్వాదశభానుమత్కిరణదాహక్రూరకామవ్యథా
సంతాపజ్వరవేదనాభరమునం జాకుంట సిద్ధించినన్. 4

సీ. చాండాలుతోఁబుల్కశత్వంబు గైకొను బ్రహ్మహత్య యొనర్చి బ్రాహ్మణుండు
క్రిమియై పతంగమై కీటమై జన్మించు నాసవం బాని భూమీసురుండు
క్రవ్యాదసత్త్వసర్గమున నుద్భవమందు విప్రుఁ డాచార్యునివెలఁదిఁ గవిసి
శ్యామచారుండు పిశాచమౌ బాడబుం డన్యునివిత్తంబు నపహరించి
యయిన నేమిగా వింటిలో నన్నిటికిని, సుఖము దుఃఖంబుఁ జర్చించిచూచినప్పు
డెల్లసంసారులకుఁగుందు హెచ్చు........, లేకయుండుటగందు మోలేదొ జగతి.

గీ. వామదేవుండు శుకుఁడుఁ గేవలము దక్క, ముక్తులెవ్వరు వింటిమే ముజ్జగమున.
జంతువుల కెల్ల సరియ సంసారయాత్ర, విధినిషేధంబులకుఁ జొప్పు వెదక నేల.

ఉ. ఆతంకంబున కేమికారణము బ్రాహ్మణ్యం బింతయుం జూచి యే
తాతల్గట్టినచెర్వులే శ్రుతులు బోధప్రక్రియల్ స్వల్పమే

చేతోజాతు సుపాశ్రయించెదఁ బరస్త్రీల న్వినోదించెదన్
మాతంగీపరమేశ్వరిం గొలిచెద న్మద్యంబు సేవించెదన్. 7

గీ. అష్టమావతారంబున నాదిపురుషుఁ, డచ్యుతుఁడు విశ్వకర్త యనాదినిధనుఁ
డర్జునుండును దాను నేకాంతగోష్ఠి, విశ్వమును నెఱుఁగమొ.... .... .... 8

మ. బహువేదాంతమతానుసాధితమహాబ్రహ్మోణియం చాడుదుర్
మహిమోహాంధులు గొంద ఱేని యసె బ్రహ్మం బెట్టు వా రెట్టిరో
యహహా బ్రహ్మము వారయే నులుకశయ్యం ద్రెల్లి నిద్రింతురో
జహదుత్సర్గముగాఁగఁ జేయుదురొ విష్ఠామూత్రనిర్మోక్షమున్. 9

సీ. కల్పద్రుమంబుతోఁ గామధేనువుతోడ నమృతాబ్ధినవతార మయ్యె నెద్ది
బృందారవనమధ్యమందారతరులలో హలపాణి కెద్ది ప్రత్యక్ష మయ్యెఁ
ద్రిపురాంతకుని యర్ధదేహంబునకు నెద్ది మదనసంపుల్లసంపత్తి యయ్యె
నవసుధారూపమై పవనభుగ్భువనాధిపతి కెద్ది ప్రాణంబుప్రాణ మయ్యె
నట్టి భవభేషజము నాసవామృతంబుఁ, గన్నుఁగానకశపియించెఁగాక యొకఁడు
తత్సమానము లగుపదార్థములు గలవె, భూతభావిభవత్కాలముల ధరిత్రి.

వ. అని. 11

సీ. కర్పూరరజములోఁ గలిపి కేతకిధూళి నఖిలాంగకముల నభ్యంగమాడి
జలజనాళీతంతుసందానితములైన యజ్ఞోపవీతంబు లఱుతఁదాల్చి
వారాంగనాస్తనహారవిభూషల నతిమాల్యముగఁ జే నలవరించి
కస్తూరికామిశ్రగంధసారంబున నలికంబునఁ ద్రిపుండ్ర మనువుపఱిచి
చంద్రికావేళఁ బరిపాండుసౌధవీథి, శక్తిఁబూజించి దేవీప్రసాదమధువు
పుచ్చుకొనివిప్రుఁడాకంఠపూరితముగ, వెలఁదులునుదానునప్పుడువినిమయముల.

క. వనితల కంగప్రత్యా, శనమక్షివిఘూర్ణనంబు లజ్జావిగమం
బనవస్థితి మధుపానం,బునకు సురతమునకు సదృశములు వక్రంబుల్. 13

గీ. త్రిపురకాస్వాదభవమహోద్రేకలహరి, ధరణిదేవుఁ డాయోజ మత్తావహించి
యారణాలుపఠింపంగ నాలకించి, శంబరారాతి రతిచేయి చఱచి నవ్వె. 14

సీ. ఇంటనున్నాఁడొ వాఁ డెచ్చోటనున్నాఁడొయొంటియో యెందఱే నున్నవారొ
మిన్నకున్నాఁడొ యేమేఁబల్కుచున్నాఁడొ నిద్రించినాఁడొ క న్దెఱచినాఁడొ
యాడుచునున్నాఁడొ.... .... ....గర్వించియున్నాఁడొ శోకించినాఁడొ
.... .... .... .... .... .... ....యుత్సేకించి యుల్లాసించినాఁడొ కలంగినాఁడొ

యుత్సవమొ వైభవమొ లేమిదొకలిమిదొ
పగలొ రాత్రియొ యెఱుఁగ కా బ్రాహ్మణుండు
నవమధూక ప్రసూనసంభవపుమధువు
దలము దప్పంగఁ ద్రావి మత్తా వహించి. 15

క. సుకుమారుఁ డిట్లు నానా, ప్రకరంబుల వీటిలోనఁ బడుచై తిరుగన్
సకలజనులు మొఱవెట్టిరి, యొకనాఁ డత్యాగ్రహమున నుర్వీశుసభన్. 16

క. దేవరప్రతినిధిఁగా సం, సేవింతుము యజ్ఞదత్తు సిద్ధము యతనిన్
భావింతుము తత్తనయుని, యావనసంప్రాప్తి లేనియటము న్నెల్లన్. 17

వ. అవధరింపుము సుకుమారనామధేయుం డైనమంత్రినందనుండు సౌందర్య వంతుండును గామశాస్త్రకళావిధిజ్ఞుండును నై జారచోరవిటధూర్తవర్గంబులం గూడి వేడుకకాఁడై పుణ్యస్త్రీలయిలువరుసఁ జెఱుచుచున్నవాఁ డతని వారింపను నారీజనంబుల శిక్షింపను సమర్థులము గాక యున్నార మద్దురాత్మకుని న్యాయసదృశం బైనదండంబువలన దండించునది యని విన్నవించిన మహీపాలుం డతని రప్పించి వాగ్దండనంబున దండించి పురంబును దేశంబును వెడల నడిపించిన రాజావమానితుండై యవ్వాపి కీటదేశంబునకుంబోయి యందుఁ గొన్నిదినంబులుండి హూణమండలంబునకు నేతెంచువాఁడు కాంతారమధ్యంబున నతిక్షుత్పిపాసాపరవశుండై తనలో ని ట్లని వితర్కించుచుండె. 18

ఉ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గనుపట్టె గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందెలునుం గుడువంగఁ బెట్టు ని
ర్భరకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లి యున్న దే
హరహర యెవ్వ రింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్. 19

వ. అని తనలోనం దలపోయుచుం జనిచని ముందట. 20

సీ. స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి
మణిదర్పణము నభోమణిమార్గలక్ష్మికిఁ జంద్రాతపమునకు జన్మభూమి
యర్ధేందుమకుటాట్టహాసంబునకు జోడు పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబమభ్రిముప్రభువారణమునకు నను(గు)ఁజొట్టము శారదాభ్రములకుఁ
గమఠతిమినక్రవిక్రమక్రమవిహార, చటులతరవీచికాఘటాసమదరూఢ
హంసకులసన్నినాదసంవ్యాప్తదిగ్వి, భాగ మీక్షించె నతఁడు తటాగ మెదుర

మ. వసుధానిర్జరుఁడు న్మహాసరసిలో వార్వీచులం దేలెఁ ద్రా
వె సుధాసన్నిభమైనవారిఁ దటపృథ్వీజావళిచ్ఛాయలో
వసియించెన్ లహరీసమీరణముల నధ్వశ్రాంతి పోకార్చె
న్బిసకాండంబులు మేసెఁగూర్చెఁ జలువ ల్నిర్మోకసంకాశముల్. 22

క. వరశీకరార్ద్రపుష్కర, కరుఁడై యాతండు గంధకరిరాజుక్రియం
బరిషేకాంతరమునఁ దా, సరసిరుహాకరము వెడలి చాలఁగ నొప్పెన్. 23

సీ. వైదూర్యమణిశిలాస్వచ్ఛోదకముగానఁ గౌతుకం బొనరించెఁ గన్నుఁగవకు
శిశిరసంస్పర్శవీచీమారుతముగాన నంగకంబులకు నిం పావహించెఁ
గమలకేసరరేణుగంధోల్బణముగాన ఘ్రాణేంద్రియమునకుఁ బ్రమద మొసఁగెఁ
గలహంసకులకలకలకలాయనముగా శ్రుతిసంపుటములకు సుఖమునిచ్చె
..........సలిలంబుసమ్మోదమునను జేసె, నాలుకకునప్పుడవనిబృందారకునకు
సైకతారూఢజలమానుషీకదంబ, కాంక్షితారరమయూఖంబు కమలవనము.

క. కొలనిదరివటము నీడన్, శిలతల్పమునందుఁ గొంతసేపు శయించెం
జెలువ మగువలిపెనుప్పటి, తలగడఁగాఁ జేసి సచివతనయుం డలఁతన్. 25

గీ. బహుళపక్షపాకదంబములలోనఁ, బ్రభవ మొందినయంధకారంబువోని
కొలనిదరికాననంబులోఁ గొంతప్రొద్దు, నలపువాయంగ నిద్రించె యాజ్ఞదత్తి.

గీ. డప్పిదీఱంగమధురకాండంబుఁ గ్రోలి, కడుపునిండంగఁ దూఁడుఁ దీఁగలుభుజించి
యెండవాలారునందాఁక నిండుకొలని, తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు.

చ. అపుడు విలంబమాన మయి యంబరకోణతటాంతరంబునం
దపనునిమండలంబు బెడిదం బగువేఁడిమి నొయ్య వీడ్కొనెం
గపిలములై మయూఖములు కార్తికమాసకలాపపింఛమై
త్రపుసలతాశలాటుసముదాయముచాయఁ దిరస్కరింపఁగన్. 28

గీ. అంతలో నిద్రమేల్కాంచి యువనిసురుఁడు, జిగమిషాబుద్ధి నీక్షించెఁ జిత్రభాను
నభినవోన్మేషకుటిలజిహ్వాప్రకార, లోలతారకకేక రాలోకనమున. 29

శా. కాంతారాంతరభూమిచెంత శబరగ్రామంబు పద్మాకర
ప్రాంతక్షోణితలంబునం గలుగ సంభావించె విప్రుం డెదన్
దంతిస్కంధకపోలకుంభపలలాదక్రూరకౌలేయకీ
సంతానస్ఫుటకంఠఘుర్ఘురతరధ్వాఘిష్ఠనాదంబులన్. 30

సీ. ఆదికాలమున మాయావిలాసిని యైనమురదైత్యదమనునిమూర్తివోలె
ధరణీతలంబునఁ జరియింపనేర్చిన పురుహూతమణిశిలాపుత్రివోలెఁ
గామినీరూపంబుఁ గైకొన్నశంబరారాతికాలాయసాస్త్రంబువోలె
వేడ్కకై మానుషీవిగ్రహంబు ధరించి విహరించుతొలుకారువేళవోలె
నంధతామిస్రమునను దివ్వియునుబోలె, భువనమోహనరూపవైభవములొలయ
లీల నేతెంచె నొక్కచండాలకన్య, కొలనఁ జెఱుబంతిపసుపాడఁ జెలియుఁ దాను.

శా. ఆచండాలకులప్రసూత యగుకన్యం గన్యకారత్నమున్
జూచె న్దవ్వుల యజ్ఞదత్తి విపినక్షోణీభాగంబునన్
వాచాగోచరసౌకుమార్యనవలావణ్యాన్వితం బుష్పనా
రాచుం డిక్షుశరాసనంబుఁ దనదోర్దండంబునం గూర్పఁగన్. 32

ఉ. యోగసమాధితత్పరత నున్నవిధంబునఁ బాసినట్లు మూ
ర్ఛాగమమీలితాత్ముఁ డగుచాకృతినిశ్చలదేహయష్టియై
సోగకనుంగొన ల్నుదురుచోకల కిక్కలుగాఁగ నత్తఱిన్
రాగరసాతిరేకమున బ్రాహ్మణుఁ డాదటఁ జూచె మాలెతన్. 33

సీ. అప్సరస్త్రీవోలె నకులయై యారయ యీపైదలి కన్నులపండువయ్యెఁ
జారుయావనరూపసంపన్నయై మోకవనరేఖయునుబోలెఁ బెనఁచె వేడ్కఁ
బొలఁతి ప్రావృడ్వేళవోలె నళివినీలఘనవేణియై యిది గరము మెఱసె
నిభరాజనిభయాన యిదిశరత్తువువోలెఁ బుండరీకాక్షియై పొలుపుమిగిలె
ముట్టరానిది యైనట్టిమూర్తివోలెఁ, జిత్తరువువోలె దృష్టి కచ్చెరువొనర్చె
మెలఁత మధుమాసకుసుమసమృద్ధివోలె, జాతివిరహితయయ్యు సంప్రీతినొసఁగె.

గీ. దీనిఁగల్పించె నజుఁ డభిధ్యానమునను, నాతి మునుముట్టరాకుండ నంత్యజాతి
ముట్టుటయ కల్గనేని యిమ్ముదితమేను, గందకుందునెపువ్వంబుకంటె మృదువు.

వ. అని విస్మృతనిమేషంబు గీలించి ముకుళితపక్ష్మాంచలంబును జిహ్మాతరతరళశా
రోదరంబును నగువీక్షణంబున నవ్వెలివాడప్రీడావతి నీక్షించుచు నవ్విప్రుండు
మదనశరశలాకాశంకాసంకలితహృదయుండై స్తంభితునిభంగి విలిఖితునిచం
దంబున నుత్కీర్ణునిపగిది నున్మత్తునిలాగున మూర్ఛితునిప్రకారంబునం దన్నుఁ
దానెఱుంగక నివ్వెఱపడి నిశ్చలాంగుండై యుండె నమ్మచ్చెకంటియు నలపోక
వోలె నతిస్వచ్ఛసౌభాగ్యచ్ఛాయావినిర్భర్త్సితమత్స్యకేతనుం డగునాబ్రాహ్మ
ణుఁ గనుంగొని నిజాంతరంగంబున. 36

గీ. విప్రవేషంబుఁ దాల్చినవిష్ణుఁడొక్కొ, బ్రాహ్మణుం డైనశంబరారాతియొక్కొ
బాడబాన్వయరూపసంప్రభవుఁ డైన,చందురుండొక్కొ-యితఁడతిస్వచ్ఛమూర్తి.

వ. అని యంతంతం జేరవచ్చియయ్యంత్యజాతిసీమంతిని యశేషజనపూజనీయులు బ్రాహ్మణు లని తమకులంబుపెద్దలవలన వినుటం జేసి యుఁ దానే దేనొక్క పూర్వజన్మకృతపుణ్యసంస్కారవిశేషంబుననో బాల్యంబునాఁటనుండియు రూపంబు వినయంబు దాక్షిణ్యంబు మధురాలాపకౌశలంబు నిస్సంగత ప్రశాంత మహానుభావంబు శుచిత్వంబు గౌరవంబు సద్భావంబుగుణంబులు నైసర్గికంబు లయియుండుటనో భర్గఫాలనయనకృశానుజ్వాలాజాలహేలాచుళుకితావయవుండు గానికుసుమకోదండుండునుంబోలెఁ గన్నులపండువై తప్తకాంచనవర్ణంబును గోరోచనాగౌరంబును జాంపేయకుసుమకేసరరేణుత్రసరేణువిసరప్రసంగంబును నగుదేహప్రభాప్రవాహంబున గహనషండం బశేషంబును వెలింగించువాని నుద్భిన్ననవశ్మశ్రు నభినవయౌవనోద్భాసితు షోడశవర్షదేశీయు నాదిగర్భేశ్వరు నమాత్యనందను సుకుమారుం గుమారసన్నిభుఁ దప్పకచూచి భయసంభ్రమడోలాయమానదంతతాటంకవలయం బగునట్లుగా నిబ్బరంపుగుబ్బచన్నుల బిబ్బోకంబు బాహుమూలకూలంకషంబై యీషద్విలోకనీయంబుగఁ గేలుదోయి సేవాంజలిపుటంబు లలాటంబునఁ గీలించి యయ్యగారికి నమస్కారం బని యధరకిసలయంబునకు దశనరత్నాంకురజ్యోత్స్న కుసుమస్తబకంబుగా సహకారపల్లవాస్వాదకషాయకంఠకలకంఠకామినీకోమలకుహూంకారకోలాహలకరంభితపంచమరాగప్రపంచంబునకు మించుఁ జూపు కంఠస్వరంబునం బలికిన. 38

గీ. వెలఁది మాలెతగాన దీవింపకయును, నొప్పెడిదిగాన నూరకయుండకయును
ధరణిదేవుండు గైకొనె దానిమ్రొక్కు, కేలుఁదామరతిర్యగాందోళనమున.

ఉ. శంబరవైరిసన్నిభునిఁ జారుతరోజ్జ్వలమూర్తి విప్రర
త్నంబు మహాప్రభానుప్రియనందనుని న్సుకుమారుఁ జూచి ప్రే
మంబు వహించి యుం గొమరుమాలెత గన్నుల నవ్వు దేరఁగా
సంబళి సంబళీ యళుకు సందడికిం దలమంచుఁ బల్కుచున్. 40

గీ. బ్రాహ్మణుఁడుగానలజ్జింపఁ బ్రాప్తిలేక, బాలప్రౌఢయువోలెఁ దప్పకయుచూచి
చాటువడియుండుమయ్య యీసరసిలోన, నుదకమాడెదఁగాక పిన్నదయునేను.

క. అని పలుకుచుఁ గొలనికి డిగ్గఁ, జని మాలప్రమద దాను సఖియు నొనర్చెన్
వనకేళి తరంగ లురు, స్తనభారాస్ఫాలనమున జర్జరములుగాన్. 42

చ. పడఁతి పసిండిడాలుగనుపట్టు హారిద్రముఁదీరపంకముం
గొడసి సరోవరాంబువులఁ దోఁగి పయోనిధితీరభూమికి
న్వడలి ధరాసుపర్వునకు నేత్రమహోత్సవ మయ్యె నప్పుడ
ప్పుడ కలశాబ్ధిమధ్యమునఁ బుట్టిన యాదిమలక్ష్మియో యనన్. 43

ఉ. ఆకలకంఠి కొయ్యఁ దడియార్చ్చునెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల నటఁకించి మధువ్రతమాలికాకృతిం
గైకొని యింద్రనీలమణిఖండశిలాసమలిమ్లుచంబులై
చీఁకటి గొల్పె బ్రాహ్మణునిచిత్తము పెన్నెఱిసోగవెంట్రుకల్. 44

గీ. చికురసంతతి నీరార్చి చెలువతుటిమె, సేసకొప్పాక............
చన్నుఁగవసొంపుకక్షదేశముల మెఱుఁగు,బ్రాహ్మణునియాత్మఁబల్లవింపంగఁజేయ.

గీ. దంతతాటంకచక్రమధ్యంబునందు, బాల కీలించెఁ గంకేళిపల్లవంబు
బాడబునినేయఁదలఁచుశంబరరిపునకుఁ,బ్రథమమదియనమసారబాణమయ్యె.

గీ. పూనెఁ గుచముల వెలివాడపువ్వుఁబోణి, విప్పుగలయట్టి బండిగురివెందసరముఁ
బ్రథమరాగరసోదయరక్తమైన, సచివనందనుహృదయజసంగరమున. 47

వ. అప్పుడు సుకుమారుండు నిజాంతర్గతంబున. 48

సీ. ఏలచేయండు శేషేంద్రియంబులు నాల్గు నలినగర్భుఁడు లోచనములుగాఁగ
నెట్టుగల్గె విధాత కీరూపనిర్మాణపరిమాణము లకోటిపరిమితంబు
లజుఁడు దీని సృజించి యాత్మ నువ్విళ్లూర కెట్లుండుఁ గూఁతుమోహించినాఁడు
కల్పింపఁబోలు శృంగారసర్గంబున దీని వాక్పతి యున్నది ఫలియించె
దీనినిఖిలావయవములు తీర్చి తీర్చి, చేయునపుడు ప్రయాసంబుఁ జెందుటయును
నొయ్యనొయ్యనబ్రహ్మనిట్టూర్పువుచ్చె, నదిసుమీపుష్పసమయమందానిలంబు.

వ. అని విచారించుచు విప్రుండు చండాలకులకన్యకామణి దుర్లభంబగు సౌభాగ్యంబునకు నద్భుతం బందుచు దానితో సంభాషింపఁ గోరి చేరువ నిలిచె నసంగమకన్యకారత్నంబును నతని కిట్లనియె. 50

క. ఎందుండి యరుగుదెంచితి, రెం దరిగెద రిచటనునికి కేమికతంబో
కందర్పరూపరేఖా, సౌందర్యవిలాసవిభవసర్వస్వనిధీ. 51

వ. నిన్నుం జూచి సుఖామృతంబున మునింగినచందంబున నతి. . . సముద్రంబునం దేలినవిధంబున సర్వానందంబుల కుపరిభాగంబున వర్తించుకరణి సకలమనోరథంబులకు సంకేతంబైనలాగున నాహృదయంబు నిర్వృతిం బొందియున్నయది

ఉ. క్రొన్ననవింటిజోదు నలకూబరు నైషధునిం జయంతునిం
బున్నమనాఁటిచందురునిఁ బోలినవాఁడవు రూపసంపదన్
నిన్నొకవిప్రుఁగాఁ బరిగణింపఁగవచ్చునె కల్ల గాదు మా
యన్నలయాన చూడు పులకాంకురముల్ మొలచెం గుచంబులన్. 53

గీ. అవనిసుర చింతకాయల కొజ్జగాక, యరసిచూడంగ గ్రుక్కిళ్లకొజ్జగాక
యంటరాకున్ననేమి యంతంత నిలిచి, చిత్తమలరంగ నిన్ను వీక్షింపరాదె. 54

సీ. కదళీపత్రపత్రములఁ గాసారోదకముఁ దెచ్చి పాదపద్మములు గడుగఁ
జిలుకముట్టనిఫలంబులు గోసికొనివచ్చి పరికించి యారగింపంగఁ బెట్టఁ
గాంతారకర్పూరకదళికాదళముల సరసరీతులను వీజన మొనర్ప
నధ్వఖేదమువోవ హస్తద్వయంబున నూరుకాండము లొత్తి యుపచరింప
వేడ్కయయ్యెడు వినయంబువిస్తరిల్ల, భక్తిగొనఁగఁ బ్రమోదంబు పారమేదు
నీకువిప్రోత్తమునకు నీనెలవులందుఁ, జెడ్డదుర్జాతి యది నన్నుఁ జెఱిచెఁగాని. 55

క. ఇది హూణామండలం బ, వ్వదినున్నది చెంచుపల్లె వనమధ్యమునన్
మదననిభ యీపుళిందా, స్పదంబు వెలివాడ. . . . . . . . . 56

తాళవృత్తము. కనుఁగొనవలయును దౌదవ్వుల నెడగలుగ నిలిచియైననుమాయిండ్లన్
వనమధ్యంబున విప్రోత్తమ వెలివాడవనితలకు నేత్రోత్సవమై
యనిభృతపరభృతనఖరేఖాకో. . . . . .సహకారద్రుశాఖా
ఘనఫలరసధారామృతపానోత్కంఠవివృత్తాననవటుకంబున్. 57

క. పాణచివారము కమ్మని, ప్రాణము నెఱజాణ దేవరా వినవలదా
వీణావాద్యముఁ బాటయు, వేణుస్వానంబు వేనవేల్పంగములన్. 58

వ. అని చండాలకన్య పలికిన నవ్విప్రుండు భవితవ్యతాబలంబున. 59

సీ. ఇది యసజ్జనగోష్ఠి యిది మోహవిలసితం బిది మహాపాతకం బిది యకీర్తి
యిది దుర్మదాంధత్వ మిది యాగ్రహావేశ. . . . . . . . . . . . . . .యిది కృద్దృష్టి
యిది నారకద్వార మిది ప్రమాదస్థలం బిది మౌర్ఖ్యకారణం బిది యనియతి
యిది యధర్మముత్రోవ యిది పథప్రచ్యుతి యిది యధోగతిహేతువిది యకృ
త్యమని విచారింప కవనీసురాధముండు, కలికిచండాలకన్యపైఁ గన్నువైచె
దీయతీయనివింత లేఁదేఁటినారి, శంబరారాతి మోహనాస్త్రంబు దొడిఁగి.

వ. ఏయునప్పుడు నిజాంతర్గతంబున. 61

సీ. మాంసంబు భక్షింప మనసువెట్టిననాఁడ దాక్షిణ్యగుణము విధ్వంసమయ్యె
గంజాయిఁ దినఁగ నుత్కంఠఁజేసిననాఁడ లజ్జాభిమానంబు లుజ్జగిల్లె
హాలారసముగ్రోల నభిలషించిననాఁడ సూనృతోక్తులసుద్ది చూఱఁబోయెఁ
బరకళత్రముల వెంబడఁదలంచిననాఁడ ప్రజ్ఞావిలాసంబు పదటఁగలసె
నింక నేఁటికి వంచింప నిలువునాకు, బరువె యీపాపములలోనఁ బాపమొకటి
వరుసవేయింటిమీఁద జవ్వాదికొమ్మ, తివుట జండాలకన్యకఁ గవయువాఁడ.

వ. అని పరమసాహసంబు చేసి సుకుమారుండు చండాలకన్యకం జేర వచ్చి యిట్లనియె. 63

కవిరా. సరసిజలోచన యొక్కమహామునిశాపవశంబునఁ బాణచివై
ధర జనియించినదానవు నీవిదితథ్యము కిన్నరభామినివో
గరుడపురంధ్రివొ యక్షవధూటివొ గాని జఘన్యవు గా విఁకనన్
ధరణిసురోత్తముని న్వరియింపు సుధాకరసూర్యులు సాక్షులుగాన్.

వ. సామాన్యస్త్రీజనంబుల కిట్టియమానుషలోకోచితంబు లైనసౌభాగ్యంబులుం గల్గునె మునికోపవశంబున సముజ్ఝితదివ్యశరీర లగు దేవకాంతలు శాపవశోపనీతంబైన శరీరంబు నధిష్ఠింతురు తొల్లి స్థూలశిరుండనుమహాముని త్రిభువనలలామభూత యగురంభ నేదేనియొక్కనిమిత్తంబున శపించెననియును దచ్ఛాపంబున నయ్యప్సరస బాడబరూపంబు ధరియించి మృత్తికావతియందు శతధన్వుఁడనురాజును సేవించుచుఁ బెద్దకాలంబు మర్త్యలోకంబున నుండె ననియును విందుము. 65

సీ. జలజగర్భునిమానసంబు వేదంబులు దక్షప్రజాపతి దర్పకుండు
సౌదామనీవల్లి చంద్రికాలోకంబు సప్తజిహ్వజ్వాలసప్తకంబు
రవిమయూఖములు నీరవని దుగ్ధాంభోధి మృత్యుదేవతనోరిమొఱఁగుఁబండ్లు
ముని కరిష్టాదేవికిని సంభవించినదివ్యగంధర్వజాతిద్వయంబుఁ
గారణంబులుగాఁ బుట్టినారు పదియు, నాల్గుకోట్లప్సరసలునా నాకసతులు
వారిలో నొక్కతెవు నీవు వారిజాక్షి, యేమిదుష్కృతిఁ బుట్టితో హీనజాతి.

గీ. తివుచుచున్నది భవదీయదృగ్విలాస, మెత్తుకొనిపోవుచున్నవి యింద్రియములు
వెనుక ద్రొబ్బుచునున్నాఁడు మనసిజాతుఁ, డేమిసేయుదుఁ జెప్పవే యిందువదన.

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని, కామతంత్రంబునకు సంచకర్వు గాఁగఁ
జుంబనముసేయని మోష్ఠబింబమిపుడు, గండుఁగోయిలచిగురాకుఁ గమిచినట్లు

గీ. అనుచువిప్రుండుతమకించియంటుకొనియె, సమ్మతించియుయుండెనాచంద్రవదన
శూకలాశ్వంబు నస రేఁపఁజొచ్చినప్పు, డనుమతింపదె యత్తఱి వైనబడబ. 69

వ. ధీరోదాత్తయగునమ్మత్తకాశిని చిత్తజాయత్తమయ్యును దత్తరపాటు లేక యత
నితో నిట్లనియె. 70

సీ. కలుగుచున్నవి యనేకములు వికల్పము లాడుచున్నవి యపాయంబు లెదుర
నంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు సందేహములు పెక్కు చాయవాఱె
నంకురితములయ్యె శంక లేరాళంబు విక్రుతు లెన్నేని యావిష్కరించె
శాఖోపశాఖలఁ జాఁగుచున్నది రట్టు గుటిలేక యుదయించె గోసనాస
యిన్నిటికి నోర్చి నీకోర్కి యేను దీర్తు, నింతవానికి నన్నీగు లెరవె........
యెప్పటికి నిత్తునో లేక యీశరీర, మిప్పటికిఁ జాలునో నిక్క మెఱుఁగఁజెపుమ.

గీ. మొదలఁగర్త్రిపడికూడిపిదప వాయు, నొక్కకమలాననకుడక్కియుండఁజాలఁ
డడవిఁ బెక్కుపుష్పంబులయందు వ్రాలు, చంచరీకంబుమగవాఁడుసరియసువ్వె.

ఉ. చందురుఁ డంతుచూడఁడు నిశానటిఁ బున్నమనాఁడుగూడుచోఁ
గందళితానురాగుఁడయి కానఁగవచ్చు నవోదయంబులం
జందముదప్పి మీఁదనొకచాయకువచ్చుఁ గ్రమక్రమంబునన్
సుందరిపట్టునందుఁ బురుషుండును నట్లయకాఁ దలంపుమీ. 73

వ. అనిన విని సుకుమారుండు. 74

క. మగవారల నిందింపకు, తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయుఙ్
మగవారికెగా కెందును, మగువలకుం గలదె చంద్రమండలవదనా. 75

సీ. హారునిచిచ్చుఱకంట నసమాస్త్రుఁ డీల్గిన రతిదేవి యెట్లు జీవితముఁజెందెఁ
బాండుభూపాలుండు పరలోకగతుఁడైనఁ గుంతి చావక యేమికుడువనుండెఁ
బ్రథనాంగనమున సౌభద్రుండు నచ్చిన బ్రతికె నెట్లు విరాటరాజతనయ
సింధురాజ స్తమించిన నేల దుస్సల కాషాయవస్త్రంబు గట్టుకొనియెఁ
బంక్తిరథుఁ డన్యలోకసంప్రాప్తుఁడైన, నేల కౌసల్య ప్రాణమీనెఱుఁగదయ్యెఁ
దగవు ధర్మంబు పాడి పంతంబు లెట్లు, భామలెట్లు వృథానులాపంబు లేల ?

గీ. అనినఁ జండాలకన్యక యాఁడువారి, మంచితనమును మగవారి మంచితనము
సరియ కీడని మేలని చర్చలేల ? మనకు మనయాడికలు తప్పకునికి చాలు. 77

వ. విశ్వావసుం డనుగంధర్వరాజునకు మేనక యనునప్సరసకుం బ్రభవించినప్రమ ద్వరయనుకన్యక స్థూలకేశాశ్రమవనంబునఁ బాదమర్దితం బగుపన్నగంబు గఱచినఁ బ్రపీలుప్తజీవితయగుటయు భార్గవుం డగుచ్యవనునకుఁ బౌత్రుండు ప్రమతికొడుకు రురుం డాయురర్ధంబొసంగి యయ్యంగనం బ్రతికించె నని యును, నర్జునుం డశ్వమేధాశ్వానుసారియై యాత్మజుం డగుబభ్రువాహనుని చేత నాహవాంగనంబున శరాహృతప్రాణుండైన నులూచి యనునాగకన్యక రసాతలంబుననుండి యేతెంచి యుద్గతప్రాణునిం జేసె ననియు విందుము. మంచి తనంబు లాఁడువారికి మగవారికి సరియ యద్ది యటులుండె నాపంతంబు వినుము. 78

ఉ. నాకు మనంబునిండ నొకనమ్మికసేయుము........................
గైకొనువాఁడ నిన్నునుము, కాదన కెక్కడకైన వచ్చెద
న్నీకొక టయ్యె నేని యవనీసురమన్మథ నిర్విశంకత
న్నాకము జూఱపెట్టెద ధనంజయతీవ్రశిఖాముఖంబునన్. 79

వ. అనిన విని సంతోషించి సుకుమారుండు. 80

సీ. కలహంససంపద గలకలక్రేంకారకలకలం బైనయీకొలను సాక్షి
ప్రసవసౌరభనటద్భంభరం బైనయీవలనిలతామండపంబు సాక్షి
ప్రచ్ఛాయశీతలోపరిభాగ మై (నయీ) శశికాంతమణిశిలాస్థలముసాక్షి
తరులతాగుల్మసంతతపిధానాతపవ్యవహితమైనయీవనము సాక్షి
మకరకేతనుపాదపద్మములు సాక్షి, రతిమహాదేవిజఘనభారంబు సాక్షి
సత్య మెన్నఁడు నినుఁ బాయ నమ్మతించి, కౌఁగిలింపఁగనీఁగదే కమలవదన. 81

వ. అనినఁ జండాలి కరారవిందంబులు మొగిడిచి సవినయంబును సగౌరవంబును సానురాగంబును గా నతని కిట్లనియె. 82

ఉ. నేఁడు కృతార్థులైరి జననీజనకు ల్ఫలియించెఁ బుణ్యముల్
నేఁడు పురాకృతంబు లవనీరుహమూలనివాసియైనకా
క్రేఁడిలు వేల్పుపై యొనరించె మనోరథసిద్ధిసంపదల్
నేఁడుగదా సుధారసము.........గంటి ధరాసురోత్తమా. 83

ఉత్సాహ. మలుసమర్త నంటకుండి మాలదాననగుట నేఁ
గలయ నీళ్లనాడె కడవఁ గ్రంత యంటుకొనుటకై
కొలనఁ గ్రుంకి పోవుచుండి కుసుమబాణనిభుని ని
న్నలఘు........ లోచనంబులలరఁ జూచి వలచితిన్. 84

గీ. ఏమిసేయుదు నీకు నెట్టిత్తు నన్నుఁ, బంచముని యింటఁగలిగి బీభత్సునెఱఁగి
యిచ్చగింపక యుండ నేనెట్లు నేర్తు, నధికతర మైనమన్మథాయత్తు నిన్ను. 85

వ. అనిన సుకుమారుండు చండాలకన్య కిట్లనియె. 86

శా. ఏమాసించినఁ బ్రాణరక్షకయి, యేమేఁబాపము ల్సేసినన్
భామా చెల్లుఁ బురాణసంహితలఁ జెప్పన్వింటిమే కాదె వి
శ్వామిత్రుం డెడరైనచో శునకమాంసంబున్ భుజింపండె నీ
వ్యామగ్రాహ్యకుచంబులంటి యిదె నాప్రాణంబు రక్షించెదన్. 87

వ. ఇదె యెదురసభ్రమరకులచరణ నఖశిఖాశిఖరవిశీర్యమాణ కుసుమ కేసర రేణు
త్రసరేణువిసరవిసం.........రంబులతామండపం బిదె వెనుకఁ గుటిలశుకత్రో
టికోటీవిపాటితమధురఫలరసధారాసారసమృద్ధి నాయమానాభ్యంతర ప్రదేశంబు
చూతతరువాటికాభ్యాశం బిదె కెలన మదకలమల్లికాక్షపక్షపాళీనవపవన
సంపాతకంపమానకమలకేసరపరాగధూళి విరచితాళీకసంధ్యానుబంధచకితచ
క్రవాకనీడోద్భవక్రీడానీడంబులు, సరసస్సైకతవేతసీనికుంజక్రోడంబు లిందు నీకు
నింపుపుట్టినట్టియెడ నన్ను మన్నింపు మంటకున్నదాన నని భయం బందకు
కుసుమసమయంబు గదా ఫలావాప్తికి మూలం బింకఁ గాలక్షేపంబు చేసి
తేని కందర్పుండు దర్పాతిరేకంబున భవద్భ్రూవల్లీమతల్లికిం దల్లియగునించు
వింటిబద్ద దిగిచి కొదమతుమ్మెదతెక్కగరిగట్టిన పూమిట్టకోలల హృదయం
బుద్ఘాటించి చంపుఁ జంపకకుసుమగంధీ ప్రాణంబు రక్షింపు మిదె నీకుసేవాం
జలి యని కంకణఝణత్కారంబు తోరంబుగా సుకుమారుండు నఖకిరణప
రంపరాకుసుమకుట్మలాభిరామంబు లగుకరకిసలయంబులు మోడ్చి ఫాలభాగం
బునం గీలించిన. 88

శా. వాలాయంబుగ నద్ధరాసురుఁడు దన్వాంఛించిన న్మందహా
సాలం(కారమ)నోజ్ఞమైనముఖ మొయ్యన్వాంచెఁ జండాలి య్యా
లీలాభావ మెఱింగి(యేగి)నతవల్లీకుంజమధ్యంబునం
గేలీతల్పము దీర్చెఁబో మృదులకంకేలిప్రవాలంబులన్. 89

వ. అనంతరం బధరీకృతకుసుమా(యు)ధధరరూపసంపన్నుఁ డగునవ్వసుధానిలిం
పుం డపహాసితసురసిద్ధగంధర్వవిద్యాధరలీలావిలాసినీవిలాసవతి యగునవ్వాలి
వాడచేడియం గూడి సురతసౌఖ్యం బనుభవించె నంత. 90

ఉ. కాయజవిక్రియం బడయఁగానికులంబునసంభవించి య
న్యాయమునేయునే యిటు దురాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్
మాయఁగఁదట్టి యంచు నతిమాత్రము లజ్జితుఁ డైనకైవడిం
దోయజషండబాంధవుఁ డధోముఖుఁ డయ్యె నభోఽంగనమ్మునన్. 91

గీ. గగనయానవేగంబునఁ గలమరించి, కడుపునిండఁగఁ గ్రోలిన కమలమధువుఁ
గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు, భానుబింబంబు రక్తాతపంబుఁగాసె.

శా. ప్రాలెం బశ్చిమశైలశృంగముపయిం బ్రత్యగ్రమధ్వాగమో
న్మీలత్కింశుకకోరకస్తబకకాంతిన్ భానుమన్మండలం
బాలంబించె వరుండు హస్తమున డాఁకారామలీలావతీ
భ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముం బుండ్రేక్షుకోదండమున్. 93

క. క్రుంకె విభాకరబింబము, పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్విథిం
గంకేలితరుపల్లవ, సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్. 94

గీ. పద్మినీషండములనుండి పాసిచనియెఁ, గోకమిథునంబు లత్యంతశోకపరతఁ
దోన యేతెంచె భ్రమరసందోహ మపుడు, కంఠలోహార్గళంబులకరణిమెఱయ.

వ. ఇవ్విధంబునం బ్రతీచీకర్ణపూరరక్తోత్పలంబును జక్రవాకచక్రవాళకులచక్రవర్తియు నగుమార్తాండుండు లోకాంతరంబున కవతరించినఁ గ్రమంబున నంబరతటాకపకచకమలిని సంజ మంజుమాంజిష్ఠాపరాగసౌష్ఠవంబు సంధించి కృష్ణాగురుపంకవల్లికలయుల్లాసంబు నుల్లసంబాడుచుఁ జిలుపచిలుపచీఁకటి సిద్ధవిద్యాధరనితంబినీజనంబులచెక్కుటద్దంబులతోడం జరలాడె సాంధ్యదేవార్చనాబలిపిండంబులుంబోలె గగనమండలంబున వెండితగటుఁ దెగడి క్రిక్కిఱిసి చుక్కలు వొడిచెఁ బురుహూతాంతఃపురపురంధ్రీవిలాసదర్పణంబు దర్పకునిమాటుఁబొంది చందురుం డుదయగిరిశృంగశృంగాటకంబునఁ బటికంబుగుండుచందం బొందె నప్పుడు చండాలకులవరారోహ వాహకుం డెక్కి విడిచిన వారువంబు గొదమయుంబోలె సంభోగంబునం దృప్తిచని తనివోవనికౌతుకంబున సుకుమారుఁ గౌఁగిటం జేర్చి యి ట్లనియె. 96

ఉ. అల్లదె వేఁటపల్లె యటనావల మావెలివాడ యావలన్
భల్లనిపాతమాత్రమునఁ బర్వతనిర్ఝరసింధు వావలం
దెల్లనిగోపురంబుల నతిప్రమదావహ మైనరోహిణీ
వల్లభమౌళిభామిని నివాసము........లాప్రదేశముల్. 97

గీ. ప్రతిభ సతతంబుఁ గొల్తు రాభద్రకాళి, జగతి నేఁబదియాఱుదేశముల వారు
దశదినంబులు సింహకేతనము నిలిపి, హూణభూమికి దైవ మీయుత్పలాక్షి.

వ. నీ వమ్మహాస్థానంబున వసియింపు మేను నీకు నాయావేళలఁ బరిచర్య సేయుచు వంచనబయల్పడకుండ మెలంగెద. సర్వకలావిశారదుండవై ననీకుం బ్రాకార గోపురద్వారవేదికాప్రాకారప్రఘాణకుట్టిమహట్టసౌధవీథీవిటంకంబులం గావ్య గోష్ఠీపరిహాసకథాబింబమతీభిత్తికా ప్రహేళికాభావన సుభాషితశ్రవణంబు, వారవిలాసినీదర్శనంబు, వైతాళికస్తుతిపాఠకంబు, దురోదరక్రీడ, చిత్రకర్మంబు, వీణాస్ఫాలనంబు మొదలయినవినోదంబులం బ్రొద్దుపుచ్చంగలిగెడి వెండియు.

క. వెలివాడకుఁ గడుఁ జేరువ, సెలయేటింబాడవుద్రాళ్లుఁ జిట్టేఁదులు నా
వలఁ దఱచు భద్రకాళీ, నిలయం బదిలెస్స నీకు నెలవువహింపన్. 100

గీ. ప్రొద్దు వోకుండ ముందటఁ బోదము నీవు, కాళికాస్థానమునకు నీకాలిత్రోవ
విప్రగృహమున నీవు నే విందొనర్తు, ధర్మమిషమున నింటిపెద్దలకుఁ జెప్పి.

వ. ........ చెలికత్తెయుఁ దానును వేఱొకటి తెరువున నిజనివాసంబునకుం జనిమె సుకుమారుండు చెఱువుకొమ్ముదాఁపలంబట్టుకొని విపినషండంబు నడుముగాఁ బక్కణంబునకుఁ దక్షిణంబుగా నొరసికొనిపోయి కాలిత్రోవంజని సెలయేఱు గడచి ముందట. 102

సీ. బ్రహ్మ మొక్కెడిజాలపాదంబునకుఁ గేలివసతి యైనసరోజవాటితోడ
నైంద్రవాహన మైనయైరావణగజంబు........ చేమొక్కియీఁదువులతోడ
వైష్ణవరథమైనవైనతేయునకాఁగ నిరవైనప్రాకారపరిథితోడఁ
గౌమారయానశిఖావళంబునకుఁ దాండవమాడ సొబగైనగవనితోడ
వేడ్క మాహేశ్వరం బైనవృషభరాజు, దాఁక నిల్చినకేలిభూధరముతోడ
సకలభక్తనివాసమై చాలనొప్పు, చండిభవనంబు సొత్తెంచె సచివసుతుఁడు.

మ. తనదౌ శీలము తానెఱుంగుట వెలిన్ దొదవ్వుల న్నిల్చి దు
ర్జనుఁ డాతండు లలాటభాగమున హస్తద్వంద్వము న్మోపి యొ
య్యన లోలోన నమస్కరించెఁ బటుగర్వారంభసంరంభశుం
భనిశుంభప్రథనక్రమప్రకటబాహాకేలికిం గాళికిన్. 104

ఉ. మాలెతవిందు బ్రాహ్మణకుమారుఁడు పక్కణవాసి వేణుకం
డోలమునందుఁ దెచ్చినఁగశోరితచంద్రిక నిర్ఝరాపగా
కూలమున న్భుజించి ఘనగోపురవేదిక నిద్రవోయె న
య్యాలరిబ్రాహ్మణుండు తుహినాచలకన్యకయాశ్రమంబునన్. 105

వ. మఱునాఁడు ప్రాతఃకాలంబున సిద్ధ్యురాంభఃప్రవాహంబున నవగాహనంబు చేసి కపటసంధ్యావందనంబును గృతకజపంబును సూర్యోపాస్తియు నడపి బ్రాహ్మణబ్రువుండు. 106

సీ. దంతిదంతార్గళస్తంభభారముతోడ రాజిల్లుఘనగోపురములు చూచి
గండశైలచ్ఛేదఘటితమై యొరపైన మేటికొమ్మలతోడికోట సూచి
యమృతదీధితిలోనిహరిణంబు వెఱపించు సౌధాగ్రసింహధ్వజములు చూచి
యట్టమండపముపై నభశ్రీ ముల్లేఖించు జాంబూనదత్రిశూలంబు చూచి
చమురుగా........మగుచ్ఛములుపోలె, సకలశాఖోపశాఖలసంశ్రయింపఁ
బుష్పితాశోకపాదపంబులనుజూచి, నింబములుసూచి యతఁడమృతంబుసెందె.

ఉ. కాళికదివ్యమందిరము..........................దనాళకీ
లాలరసంబు గ్రోలునభిలాషమునం జనుదెంచి యున్నవే
తాళగణంబుపోలె నతిదైర్ఘ్యముననా దివి దాఁకియున్నహిం
తాళవనంబు గన్గొని..................తమందె నాత్మలోన్. 108

ఉ. వైపయిగర్భగేహమునఁ బన్నికమీఱి వెలుంగుమాలికా
దీపశిఖాప్రరోహములు దేరఁగఁజూచి యనుస్మరించె లో
నాపృథివీసురుండు మహిషాసురమస్త.........దు
ర్గాపరమేశ్వరీపదనఖంబులడంబుల సంచరించినన్ 109

గీ. సరసవనవాటికానికుంజములయందు, జిలుకలధరోష్ఠసంపుటంబులు గదల్ప
శక్తిమంత్రాక్షరంబుల జ......, నవియవలె నున్న నద్భుతంబందె నతఁడు.

సీ. మంత్రవాదులతోడిమైత్రి సంపాదించు యంత్రవాదులఁ గలయాదరించు
సిద్ధయోగీశ్వరశ్రేణి సంసేవించు దాత....................ందనము సేయు
కదలి వశ్యాశ్చర్యకథ లెఱుంగఁగఁగోరు బిలముసాధింప నపేక్షసేయు
బహుదేశభాష లభ్యాసింప వాంఛించుశల్యతంత్రముమీఁదఁ జాఁపుమనసు
......................గఁజెన్నిధిగుద్దలించు, నింద్రజాలంబువన్నంగనిచ్చగించు
గట్టుభవనములకుసురంగములుద్రవ్వ, నేర్చికొను బ్రత్యహంబునునీచబుద్ధి.

చ. స్థితిచెడి మాంసభోజనము నేసి యసంగమవంశభామినీ
రతిఁబరతంత్రుఁడైనపుడు బ్రత్యహమున్ ధరియించుచుండు న
వ్వతితుఁడు గంగమట్టియయుఁ బ్రన్ననినున్నని నీరుకావిదో
వతులును.......................ములువంశ్యలయిండ్లభుజించుకోరికన్, 112

మాధుకరవృత్తులనుస్వయంపాకములను,సత్రభోజనములఁ బితృశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించునతఁడు, వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుట.
నీరాటనెపముగా నిర్ఝరంబుల కేగి సవిధవానీరకుంజముల నొందు
భూధరంబుల కిప్పువ్వు దే నని పోయి కందరామధ్యభాగముల నొందు
శి........కన్యసేవింప నని పోయి నక్తమాలముల నెన్నడుమ నొందుఁ
గలమసస్యక్షేత్రములకుఁ గూ ళ్లోగి మోసి శణవాటికాప్రదేశముల నొందు
నెట్లు కనుఁబ్రామిమచ్చునోయింటివారి, నెట్లు............ంటిమై నిక్క కరుగు
నతివ పగలైన మాపైన నతనితోడ, నిచ్చ నొకపారి సాగించు నిధువనంబు.
ఒక్కనాఁ డక్కనిష్ఠవర్తనుండు పక్కణశబరులం గూడి కరిక్రవ్యాదంబు గుక
....కొని ప్రత్యూషకాలంబున విపినవీథుల నీవారభసలవిఘటితసరఃకమల
షండసౌరభోద్గారభరితదిక్కూటాహంబు కరటిమార్గం బిది, విదళితసమస్తము
స్తాశకలసారంబు వరాహయూథ పథంబిది, కఠినపాషాణకోటివిభిద్యమానవల్మీక
ధూళిపాళికానిచుళితతరుపలాశంబు మహిషవర్త్మం బిది,దూర్వాప్రవాళచర్వ
ణాహారిచందనపరిపాండురంబుహారిణమార్గంబిది కటుదీర్ఘఘుర్ఘురవ్యాఘ్రక్రోశంబుక
ర్కరేటుకులకులాయస్థానం బిదె........కహారవంబు, దాత్యూహవ్యూహ
ప్రదేశంబు ననుచు నాఖేటకౌతుకంబున నాఖేలనక్రీడావిహారంబులఁ గృశుం
డై, ప్రాణిహింస యొనర్చుచు వెండియు. 115

పాపకర్ముండు కాంతారపథమునందు, నదరిపాటున నొంటిబ్రాహ్మణుల మొత్తి
యపహరించినవిత్త మన్యాయపరత, నంత్యజస్త్రీయుఁ దాను ననుభవించు.
ఇవ్విధంబున సుకుమారుఁడీలువుడిగి, మాలచిగురాకుఁబోఁడితో మనువుమనఁగ
వచ్చె నొయ్యన మధుమాసవాసరములు, వాసితాశోకసంఫుల్ల కేసరములు.
కామినీగండూష కాదంబరీధారఁ బులకించె నారామభూమిఁ బొగడ
చివురాకు చవిచూచి చవిచూచి యెలిఁగించెఁబంచమస్వరమునఁ బరభృతంబు
సంఫుల్లకోరక స్తబకోచితం బైన కొరవిపై భ్రమియించెఁ గొదమతేఁటి
పరిపక్వసహకారఫలరసాస్వాదన ముదమునం గీరంబు చదువఁదొణఁగె
విటవిటీసముదయములు వివిధవిధుల, నుపవనక్రీడ సల్పిరి యుబ్బుమిగిలి
యఖిలజనులకుసంతోషమావహించె, మాసరములైన మధుమాసవాసరములు.
ఇట్లు సకలజనమనోహరంబులగుమధుమాసవాసరంబులనప్పాపిష్ఠుఁడు చండాల
కన్యకం దగిలి యొం డెఱుంగక లజ్జ యుజ్జగించి మానం బూనంబుచేసి

కులంబు పదటం గలిపి శీలంబు పరిత్యజించి దిట్టకూళయై కన్నుగానక కావ
రంబెత్తి తిరుగుచుండఁ గర్ణాకర్ణి నతనిదుశ్చారిత్రంబు లెల్ల విని యకటా డ
కటా డ నాడికొనం దొణంగి రంత నెంతేనియుఁ దేటతెల్లం బైనతనిదు
ర్వర్తనంబు ప్రసంగించి ప్రకాశంబుగా నాడుచుండి రంత. 119

క. క్రూరాత్ముఁ డితఁ డనంగాఁ, జోరుం డితఁ డనఁగ నితఁ డశుద్ధుం డన దు
శ్చారుఁ డితం డనఁగా సుకు, మారున కపకీర్తి హూణమండలిఁ బ్రబలెన్.

వ. అంత నొక్కనాఁ డతండును నదియును బాతాళపంకకలుషం బగుమహాజల
ధిపూరంబునుం బోలె నంధకారంబు తోరంబై దిక్కులఁ బిక్కటిల్ల బహుళ
పక్షంబునాఁటి రాత్రి కాళికాగోష్ఠంబు కెలన జీర్ణోద్యానంబునందు నక్త
మాలతరుషండంబులోఁ దారు కల్పించిన సంకేతస్థలంబునఁ దృణకుటీరంబునఁ
గోద్రవపలాలపర్యంకంబున మదిరామదోద్రేకసంభవంబైనమదనావేశంబున
మనోభవకరకీరాకారంబులనుంబోలె సీత్కారంబులవలనను బంచబాణమా
లిక్యకంకణక్వణితం బగు నప్పుడు.... 121

చ. కువలయపత్రనేత్రకనుఁగొల్కులయం దుదయించె బాష్పబిం
దువులు ధరాసురుండు తనుఁ దోడ్కొనిపోక యుపేక్షసేయ న
న్నపదరవిందచక్రమిథునంబు లసహ్యవశాంగజాగ్నిచే
రవులుకొనంగఁ బుట్టిన నిరంతరధూమము సోఁకియో యనన్. 122

గీ. చాను హృదయంబుమీఁదహస్తంబువైచె
నతఁడు తనుఁబాసి యేగునో యనెడుభీతి
నుల్లమునయందు వసియించియున్నతన్ను
వెడలి పోకుండ నడ్డుపెట్టెడివిధమున. 123



వ. అనంతరంబ యాచాండాలి యతని కిట్లనియె. 124

గీ. ఎట్టు వేగింతు సంసార మిచటనుండి, యేల నినుఁబాసియొంటినాకిచటనుండఁ
గలుగనిమ్ము పెక్కండ్రుబంధులునునాకు, బంధువు గలండె నాకు నీపాటివాఁడు.

శా. ఇచ్చోట న్మధుపానగోష్ఠి సురతం బిచ్చోట సంగీతకం
బిచ్చోటం బరిపాటి నీకలకలం బిచ్చో మనోజోదయం ?
బిచ్చోనంచు భవద్వియోగమునఁ దా నెవ్వారి కిం బ్రీతిగాఁ
జచ్చున్ మన్మథవేదనానలమునం జండాలి విప్రోత్తమా. 126

మ. కరవీరప్రసవచ్ఛదారుణరజఃకాషాయవస్త్రంబుతో
శరతూలచ్ఛవియజ్ఞసూత్రములతో జాంబూనదస్యూతిత
స్ఫురమృత్స్నానిటలోర్ధ్వపుండ్రకముతో సాటోపచ్ఛత్రబ్రహ్మతోఁ
దరహా నిన్ను మహాత్మ రేపకడ సందర్శించినం జాలదే ! 127

ఉ. ధీరత వూని నీవు పరదేశము వోవఁగ నేను రాక యా
యూరనె యుంటినే ద్విజకులోత్తమ నిత్యముఁ గాళికాగృహ

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

సన్నిద్ధజాశ్వాసములలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నిమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె మిన్న. ౫ ఆశ్వాసములు. ౭౪ పుటలు. సవిమర్శమైన ౧౪ పుటలపీఠిక. వెల రు. ౦-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భాష సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౦-౧౨-౦.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము.

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవివిరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదములు లచ్చుటచ్చుటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రు. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఎ., బి.ఎల్. గారిచే రచింపఁబడిన సవిమర్శపీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౦-౨-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టీ. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Guru. 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల రు. ౦-౩-౦.

# చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతి కవిప్రణీతము.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము. కార్వేటినగరసంస్థానమునం దుద్భవిల్లినది. ఇంతవఱ కిట్టి భాషాంతరగ్రంథము భోజచంపువునకు లేదు, కావుననే యన్ని విధముల ముఖ్యమైనది, కవితాచమత్కృతులెల్ల నీగ్రంథమందే కానఁగును. ఎనిమిది యాశ్వాసములు. 146 పుటలు రాయలుసైజు, 16 పుటల పీఠిక. ఇంగ్లీషు క్యాలికో బైండు. ముద్రింపఁబడినవి స్వల్పప్రతులు. అయినను వెల రు. 1-0-0 మాత్రమే. భాషాభిమానులు శీఘ్రముగా నొక్కొక్కప్రతిని దెప్పించుకొనుట మంచిది.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 2/7 హారిస్ రోడ్డు, పుదుపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.

శ్రీ.

# చంపూరామాయణపీఠిక.

## కవికాలనిర్ణయము.

ఈకృతి యొనర్చినకవి కవిరాజకంఠీరవబిరుదాంకితుఁడును వాసిష్ఠగోత్రజుఁడును నగుఋగ్వేదికవి వేంకటాచలపతి. ఆశ్వాసాంతగద్యములయందు "ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకరసుధాకరుఁ" డని తన్ను వర్ణించికొనుటచే నీతనితండ్రిపేరు తిరువేంగళార్యుఁ డైనట్లు తెలియుచున్నది. మఱియు గ్రంథావతారికలోఁ దాను "తిరువేంగళార్యకవిరాజసమాశ్రయ ధన్యచిత్తవర్తనుఁ" డనియు—

"అత్తిరువేంగళార్యుని యుదారదయావిలసత్కటాక్ష సం
పత్తినుదీర్ణమైన సుకుమారవచఃప్రతిభానిరూఢి ను
ద్వృత్తరగద్యపద్యచయ మాశుగతిన్ రచియింప నేర్చి"

ననియు వ్రాసికొనుటచే నీతని కవితాగురువు కూడఁ దిరువేంగళార్యుఁడైనట్లు కన్పట్టుచున్నది. ఈతిరువేంగళార్యు లిరువురు భిన్నపురుషులై యుందు రని తోఁచుచున్నది. అట్లు కానిచో గురువును వర్ణించునవసరమున నతఁడు తనతండ్రియే యని చెప్పకుండునా?

కవి కాలమునునిర్ణయించుటకుఁ దగినయాధారములు కొన్ని గ్రంథమునందే యున్నవి. వానిలోఁ గృతిపతివంశావతారము ముఖ్యమైనది. ఈకృతిపతి యిప్పుడు కార్వేటినగరసంస్థాన మని వాడఁబడుచున్న దేశమున కధిపతియైన వెల్లంటి కసవరాజు. ఆ దేశమునకుఁ దొండమండలము, తుండీరమండలము నని పూర్వనామములు. ఆంధ్రజైమినిభారతకృతిపతి యగుసాళువనరసింగరాజు మొదలగు సాళువరాజులు పూర్వ మా దేశమును బాలించిరి. వారిపిదప మాకరాజువంశ్యులు రాజులైరి. ఈమాకరాజుకులములోఁ జేరిన తిరుమలరాజునకే చదలువాడ మల్లయకవిప్రణీత మైన విప్రనారాయణచరిత్ర మంకిత మైనది. కొంతకాలమునకు రాజ్యము మాకరాజువంశమునుండి దౌహిత్రభాగముగా వెల్లంటివారికి సంక్రమించినది. ఈమా ర్పెప్పుడు జరిగినదో స్పష్టముగాఁ దెలియదు. ప్రస్తుతగ్రంథకృతిపతి యైనకసవనృపతి యీవెల్లంటివంశమువాఁడే. ఇప్పుడున్న కార్వేటినగరపు జమీందారులు కూడ నీవంశమువారే. మాకరాజువారును

19

వెల్లంటివారును గూడఁ బూర్వపుసాళువరాజులబిరుదములఁ దమబిరుదములుగాఁ జేసికొన్నారు.

కసవరాజువంశము గ్రంథములో నిట్లు వర్ణింపఁబడినది. కరికాళచోళుని వంశములో సింగరిరాజు పుట్టెను. సింగరిరాజునకు శ్రీరంగరాజును, శ్రీరంగరాజునకు సింగరిరాజును, సింగరిరాజునకుఁ గావేరిరాజును, గావేరిరాజునకు సింగరిరాజును, సింగరిరాజునకుఁ గావేరిరాజును, గావేరిరాజునకుఁ గసవరాజు, సింగరిరాజు, తిరువేంగళరాజు, పెరుమాళ్రాజు ననునలువురు కొడుకులు పుట్టిరి. ఈకసవరాజే కృతిపతి. కసవరాజుపిదప నేడవతరమువాఁడగుబ్రహ్మరాజు కాలమునఁ బుట్టిన [1]పద్మావతీపరిణయ మనుసంస్కృతచంపూగ్రంథ మీవంశక్రమమును దృఢపఱుచుచున్నది. ఆగ్రంథములోఁ గసవరాజునకు మాఱు కేశవరా జనియున్నది. కసవయనునది కేశవశబ్దభవము కాఁబోలును. కసవరాజు తరువాతి తరములవారు పద్మావతీపరిణయములో నీరీతిం జెప్పఁబడినారు:—

కసవరాజు పిమ్మట నతనితమ్ముఁడైన వేంకటపెరుమాళ్రాజు రాజ్యము చేసెను. అతని యనంతర మాతని యన్నకొడు కగుబ్రహ్మరాజు రాజ్యముచేసెను. బ్రహ్మరాజుకొడుకులు కావేరిరాజు వేంకటపెరుమాళ్రాజులు. వేంకటపెరుమాళ్రాజు కొడుకు బ్రహ్మరాజు; అతని కొడుకులు కుమారువేంకట పెరుమాళ్రాజు, కావేరిరాజు, తిరుమలరాజు, సుందరకృష్ణరాజును. కుమారవేంకటపెరుమాళ్రాజుకొడుకులు [2]బ్రహ్మరాజు మొదలగువారు. ఈబ్రహ్మరాజే పద్మావతీపరిణయ కృతిపతి. కసవరాజునకు బ్రహ్మరాజునకు నడుమ నయిదుగురు రాజ్యముచేసినట్టులు దీనివలనఁ గనఁబడుచున్నది. ఈగ్రంథములోఁ గుమారవేంకటపెరుమాళ్రాజు తారణసంవత్సరచైత్రమాసములో లోకాంతరగతుఁడైనట్లును, నాసంవత్సరజ్యేష్ఠమాసములో బ్రహ్మరాజు పట్టాభిషిక్తుఁడైనట్టును బ్రహ్మరాజునాజ్ఞ ననుసరించి యాగ్రంథము వికృతిసంవత్సరమునం దచ్చుపడినట్లు నున్నది. తారణసంవత్సరము 1884-వ క్రైస్తవసంవత్సరమునకును, వికృతిసంవత్సరము 1890 సంవత్సరమునకును సరిపోవును. కుమారవేంకటపెరుమాళ్రాజు సవతితమ్ముఁడగుతిరుమలరాజున కంకితమైనట్టియు, గరుడాద్రి సుబ్రహ్మణ్యవిద్వత్కవి ప్రణీత మైనట్టియు [3]శ్రుతుష్ను

[1] ఈగ్రంథము కార్వేటినగరమునందలి శ్రీభారతీలీలాసదనముద్రాక్షరశాలలో నచ్చుపడినది.

[2] బ్రహ్మరాజునకు బొమ్మరాజని వాడుకపేరు. బ్రహ్మరాజుగారిపుత్త్రు లయినకుమారవేంకటపెరుమాళ్రాజు, కుమారస్వామిరాజుగార్లు ప్రస్తుతసంస్థానాధిపతులుగానున్నారు.

[3] ఈగ్రంథము వ్రాఁతప్రతి యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున నున్నది.

విజయ మీవంశక్రమమును దృఢపఱుచుచున్నది. ఈగ్రంథము ౧౭౮౬ వ (రసకరిమునిశశి) శాలివాహనసంవత్సరమునకు సరియైన ప్రభవసంవత్సరమునఁ బూరింపఁబడినట్లు గ్రంథాంతమం దున్నది. ఇది క్రీ. 1864-వ సంవత్సరమునకు సరి పోవును. అప్పటికిఁ గుమారవేంకటపెరుమాళ్రాజు సజీవుఁడై యున్నట్లును, నతనికి బ్రహ్మరాజు, కుమారవిజయవీరరాఘవరాజు, కావేరిరాజు, సింగరిరాజు ననునలు వురుకొడుకు లున్నట్లును జెప్పి యింకను బలువురు తనయులు కలుగుదురుగాక యనికవి యాశీర్వదించినాఁడు. క్రీ. 1884 సంవత్సరమునఁ గాలధర్మమునొందిన కుమారవేంకటపెరుమాళ్రా జీతఁడే యగుట నిస్సంశయము. ఈకుమారవేంకట పెరుమాళ్రాజు కసవరాజున కైదవతరమువాఁ డగుచున్నాఁడు. ఆచారానుసార ముగాఁ దరమున కిరువదియైదుసంవత్సరములచొప్పున లెక్కించినచోఁ గసవరాజు క్రీ. 1714 సంవత్సరప్రాంతమువాఁ డగుచున్నాఁడు. స్థూలదృష్టిచే, క్రీ. 1700 సంవత్సరప్రాంతమువాఁ డనుకొందము.

వేఱొకలెక్కనుబట్టి చూచినను నించుమించుగా నీకాలమేధ్రువపడుచు న్నది. ఎట్లన:—

కవిగురువైన తిరువేంగళార్యుఁడు సాళ్వతిమ్మనృపాలుఁడు, వీరవేంకటరాయ శౌరి, వెలుగోటివేంకటవిభుఁడు, చెంజి వరదేంద్రుఁడు ననుప్రభువులచే గౌర వింపఁబడినట్లు గ్రంథములోనున్నది. (ఆ. ౧ ప. ౩౧.) సాళ్వతిమ్మనృపాలుఁ డెవ్వఁడో తెలియదు. ఆకాలమం దాపేరుగల సుప్రసిద్ధరాజు గానరాఁడు. సామాన్యుఁ డైనజమీందారుఁడై యుండనోవును. చెంజి వరదేంద్రుని కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. దీనినిబట్టి యితరుల కాలము నిర్ణయింపవలసి యున్నది. చెంజి యనునది దక్షిణార్కాటు మండలములో సుప్రసిద్ధ మైనస్థలము. ఆంగ్లేయభాషను దీనిని "జింజి" యందురు. కర్ణాటరాజ్యకాలమం దీచెంజిదేశమును గొందఱునాయఁకులు పాలించుచుండెడి వారు. ఆనాయఁకులలో నొక్కఁడగు "చెంజి వరదప్పనాయనయ్యవారు తీర్థాచ రణవచ్చి శేతుదర్శనం శేశి స్వస్తిశ్రీశాలివాహనశకవర్షంబులు ౧౫౯౩ కల్యబ్దాః ౪౭౭౨ అస్మిన్ వర్తమానే వైశాఖబహుళసప్తమి స్థిరవారం యీపుణ్యక్షేత్ర మైన.........మరప్రదేశం ఆకార్తికశుద్ధపౌర్ణమినాడు కౌమారస్వామికి బం గారు అందలమున్ను సమర్పణశేశి తమఆరతిను యేర్పాటు శేయించినారు" అని మధురకు సమీపమందున్న సుప్రసిద్ధకుమారక్షేత్రమగు తిరుప్పరంగుండ్ర మను

గ్రామమునందలి దేవాలయములో నొక్క తెలుఁగుశాసనమును, దాని కనువాదముగా నొక యరవశాసనమును గలవు౧. ఈశాసనములో వరదప్పనాయనితోఁ గూడ నిరువదియైదు తరములవారు పేర్కొనఁబడియున్నారు. వీరిలో వరదప్ప యనుపేరుగలవాఁ డీతఁ డొక్కఁడుమాత్రమే యున్నాఁడు. తిరుమలార్యుని గౌరవించిన చెంజి వరదేంద్రుఁ డీవరదప్పనాయఁడే యనుటకు సందేహ ముండఁ గూడదని నాయభిప్రాయము. వరదప్పనాయనిశాసనసంవత్సరము క్రీ. 1671 సంవత్సరమునకు సరిపడును. ఇఁక వీరవేంకటపతిరాయశౌరి యెవ్వరో చూతము. పేరునుబట్టిచూడ నీతఁడు కర్ణాటరా జని స్పష్టమగుచున్నది. సుప్రసిద్ధుఁ డగు వీరవేంకటపతిరాయలు క్రీ. 1614 ప్రాంతమున మృతి నొందెను. 1643 ప్రాంతమున శ్రీరంగరాయలు రాజ్యమునకువచ్చి 1678 ప్రాంతమందు రాజ్యభ్రష్టుఁడై మహిసూరుదేశములో మృతినొందెను. ఈయిద్దఱురాజుల నడిమికాలమునందుఁ బలువురు రాజ్యమును గాంక్షించుటచే ఘోరమగుపోరు పుట్టె. శ్రీరంగరాయలు రామరాయలు వేంకటపతిరాయలు ననువారు స్వల్పస్వల్పకాలము సింహాసన మధిష్ఠించి పదభ్రష్టు లగుచువచ్చిరి. శ్రీరంగరాయలపిదప క్రీ. 1678–1680 సంవత్సరములలో వేంకటపతిరాయలు రాజ్యముచేసినట్టులు కొన్ని౨శాసనములవలనఁ గనఁబడుచున్నది. ఈవేంకటపతిరాయలకాలము చెంజి వరదప్పనాయనికాలమునకు సరిపోవుచున్నది. ఈతఁడే తిరువేంగళార్యుని గౌరవించిన వీరవేంకటరాయశౌరియైనట్లు తోఁచుచున్నది. నిజముగా శ్రీరంగరాయలతోడనే కర్ణాటరాజ్యమంతమైనది. అదిమొదలు చాలకాలమువఱకు నావంశములోనివా రెవ్వరో యొక రానెగొంది సమీపదేశమునకుఁ బ్రభువులై పూర్వాధికార మంతరించినను బూర్వరాజుల బిరుదములను మాత్రము పెట్టుకొనుచుండినట్లును, గౌరవార్థముగా వారినే కర్ణాటరాజులుగా మధురనాయఁకులు మొదలగువారు భావించుచుండినట్లును శాసనములవలనఁ గన్పట్టుచున్నది. ఇఁక వెలుగోటి వేంకటవిభుఁ డెవ్వరో చూడవలసి యున్నది. బ్ర. వెల్లాల సదాశివశాస్త్రిగారు రచియించిన వెలుగోటివారి వంశచరిత్రమువలన వేంకట యనునామముగలవారు ౧౯-౨౦-౨౧ తరములలోమాత్రమే యున్నట్టులు కనఁబడుచున్నది. ౨౦-వ తరమువాఁడైన యాచ

---

౧ ఈశాసనములు రాజకీయశాసనాధికారులు 1917 సంవత్సరములో సంపాదించిన శాసనములలో 860-861 సంఖ్యలు గలవి. వారికార్యస్థానమునఁ జూడనగు.

౨ చూ. Sewell's Lists of Antiquities Vol. II.

శూరున కైనసుంద్రు కొడుకులు. వారిలో వేంకటాద్రినాయఁడు, వేంకటప్పనాయఁడు, చినవేంకటప్పనాయఁడు ననుముగ్గురు వేంకటాభిధాను లుండిరి. వీరిసోదరుఁడును రాజ్యభర్తయునైన కుమారయాచమనాయఁడు మహిసూరువారితో యుద్ధముచేసి జయమంది "అబ్దుల్ ఫాదుషా" గారివలన బహుమానములు పొందినట్లు బ్ర. సదాశివశాస్త్రిగారు వ్రాసినారు. అబ్దుల్ ఫాదుషా యనఁగా అబ్దుల్ కుతుబ్ షా యను గోలకొండరాజు. ఈరాజు క్రీ. 1611 మొదలు 1672 వఱకు రాజ్యముచేసెను. ఇదియుఁ జెంజి వరదప్పనాయనికాలమునకు సరిపోవుచున్నది. యాచశూరునిసోదరులు కూడ నీకాలమువారే. వారు ముగ్గురిలో నెవ్వరో యొకరు చంపూరామాయణములోఁ జేర్కొనఁబడిన వెలుగోటి వేంకటవిభుఁడు కావలయును. ఈప్రమాణములు మూఁటినిబట్టి తిరువేంగళార్యుఁడు క్రీ. 1670—80 సంవత్సరములప్రాంతమువాఁడైనట్లు తేలినది. ఆతని శిష్యుఁడైన వేంకటాచలపతికవి క్రీ. 1700 ప్రాంతమందుఁ గృతినిర్మించుట యీకాలనిర్ణయమున కవిరోధమేకదా !

కవికాలనిర్ణయము చేయుట కింకొకయాధారము కూడఁగలదు. వేంకటాచలపతికవి దామర యక్కనృపాలుని సన్నిధికిం జని నప్పు డెవ్వరో "వరకవిగంధసింధురము వచ్చె" నటన్న "నేను గవిరాజకేసరి" నని కవి పల్కెనఁట. (చూ. ఆ. ౧ ప. ౩౮) ఈ యక్కనృపాలుఁ డెవ్వరో నిర్ణయింపవలసియున్నది. ధూర్జటి లింగకవి కృత ౧కాళహస్తిమాహాత్మ్యమువలనఁ గాళహస్తి రాజవంశమం దక్కప్పయనుపేరు గలవారు నలువురున్నట్లు తెలియవచ్చుచున్నది. వారిలో మొదటివాఁడు చెన్నపట్టనమునకుఁ బేరొసంగిన చెన్నప్పనాయని రెండవకుమారుఁడు. ఈతఁడే ఉషాపరిణయగ్రంథకర్త. ఈయక్కప్పనాయని మనుమఁడుఁగూడ నక్కప్పయే. ఈ రెండవయక్కప్పకు, అక్కప్పయను కుమారుఁడును మనుమఁడును నమ్మక్కయను గూఁతురునుండిరి. అమ్మక్క వెలుగోటి వీరకుమారయాచమనేని భార్యయై బంగరు యాచమనేనిం గనియెనఁట. ఈబంగరు యాచమనీఁడు క్రీ. 1693-వ సంవత్సరమువఱకు సజీవుఁడైనట్లు వెలుగోటివారి వంశచరిత్రము చెప్పుచున్నది. కావున, బంగరు యాచమనేని మేనమామకుమారుఁడగు నాలుగవయక్కప్ప క్రీ. 1700 సంవత్సరప్రాంతమువాఁ డనియు వేంకటాచలపతి కవికి సమకాలికుఁ డనియుఁ దేలుచున్నది. ఏవిధమునఁ జూచినను వేంకటాచల

౧ ఈగ్రంథము వ్రాఁతప్రతి, యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునఁ జూడనగు,

పత్రికవి క్రీ. 1700 ప్రాంతనుం దుండె నని సిద్ధాంతీకరించుట కాక్షేప మేమియుం గనంబడదు.

పద్మావతీపరిణయమునందుం గసవరాజు నుత్తరచరిత్ర మిట్లు వర్ణింపం బడినది :—

"కసవరాజపుత్రకుండై వయసునం జిన్నవాండైనను గుణములచేం బెద్దయు, వేంకటేశ్వరాంశసంభూతుండునైన వేంకటపెరుమాళ్ళ్రాజను చిన్నతమ్ముని రాజ్యతంత్రధురంధరుంగా నెంచి యతనియందు రాజ్యభార ముంచి నిస్పృహుండై వానప్రస్థాశ్రమము నంగీకరించి భార్యతోం గూడ మునినికరముం జేరి వారి చెంతం గొండగుహయందు వసించి దుష్కరమగు తప మొనర్చుచుం గొంతకాల ముండి యంతటం దనకు మోక్షకాలము సమీపించినదని యెఱింగి నిజరాజధాని యైననారాయణపురమునకేగి యందున్నకల్యాణవేంకటేశ్వరుని యాలయములో ధ్వజస్తంభముచెంత భగవత్పాదములు స్మరించుచు బ్రహ్మరంధ్రమునుండి ప్రాణమును విడిచెను." అని. చంపూరామాయణములోం గసవరాజునకు సింగరిరాజు, తిరువేంగళరాజు పెరుమాళ్ళ్రాజు ననువారు ముగ్గురే తమ్ము లుండినట్లు చెప్పంబడినది. పద్మావతీపరిణయములో నీతనికి, తిరుమలరాజు, వేంకటపతిరాజు, చిన్నరాజునను మఱి ముగ్గురుతమ్ములుంగూడ నుండిరనియు నీయార్గురిలో వేంకటపెరుమాళ్ళ్రాజు కడపటివాం డనియు నీతండే ౧కార్వేటినగరమును గట్టించెననియు, నంతకుం బూర్వము నారాయణపురమే రాజధానిగా నుండె ననియుం జెప్పంబడియున్నది.

ఈగ్రంథము ప్రతియొక్కటే అత్తిరాలలో బ్ర॥ వెల్లాల చిన్నవేంకటసుబ్బయ్య సిద్ధాంతిగారివలన దొరకినది. దీని చివర "యతుల నారసింహ్వరాజు వ్రాసిన చంబూరామాయణం" అనియున్నది. ప్రత్యంతర మింతవఱకు దొరకలేదు. లేఖనదోషములుమాత్రము సవరించి వలసినపట్ల సంస్కృతచంపూరామాయణమునకు సరిచూచి మాకు దొరకిన ప్రతి ప్రకటించినారము.

వేంకటేశ్వరాష్టకములోనివి గ్రంథావతారికలో (పుట ౮.) ముద్రింపంబడిన మూండుపద్యములుగాక మిగిలిన యైదుపద్యములు నీక్రిందం జేర్పంబడినవి.

శా. పర్వేందు ప్రతిబింబవక్త్రిము శరత్పద్మాక్షియుగ్మంబు కీ
రార్వశ్లాఘ్యధనుర్గుణాసహాన సూనాకారనాసోన్నతిక

---

౧ చంపూరామాయణములోం గార్వేటినగరప్రశంస యుండుటచే నీమాట సత్యము కా దని తేలుచున్నది.

శర్వాదుల్కు తెలియంపలేనితటి నీసౌందర్య మెంతో గదా
కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా. ఆర్వేలేండ్లు తపంబుచేసి భవదీయావాస శేషాద్రిపైఁ
జెర్వంగాంచెను వేల్పుమూఁకకు మహాసేనుండు బల్నెత్తురుల్
నుర్వుల్గట్టఁగఁ దారకాసురుని దానుగ్గాడె నీశక్తిచేఁ
గార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా. తార్వాళంబులు వంచి చిత్తరుల వింతల్మెచ్చుపైయుండఁగాఁ
దిర్వీథుల్ భవదీయ సన్నిధిని ముస్తాదైన యావీథిలోఁ
దెర్వారే తిరునాళ్ల నీకు నడవళ్ దృశ్యంబు గాకుండఁగాఁ
గార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా. కుర్వేరుం దమనంబు జాతిసుమముల్ గోరంట చేమంతులున్
హార్వైనిగ్గులు దేఱు శ్రీతులసి నీకర్పించు మర్త్యుండు దా
నేర్వ్రజంబుల మాత్తికంబులను బూజించేఫలం బొందుఁగా
కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా. ఓర్వన్నక్యమె యామ్యబాధ కటువై యుండన్మనుష్యుండిలం
జార్వాకోక్తులచేతనే చెడు దురాచారంబు గావించుఁగా
శర్వర్యంకు సహస్సనందును భవచ్చారిత్రదూరాత్ముఁడై
కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

జయంతి రామయ్య.

---

## కవిత్వవిమర్శనము.

శ్రీమద్రామాయణమును జంపువుగా సంస్కృతభాషయందు రచించినకవి భోజరాజు. ఈరాజకవి ధారానగరము రాజధానిగాఁ గల మాలవదేశమున క్రీ. శ. 1018 సం॥ మొదలుకొని 1060 వఱకు రాజ్యముచేసినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. కనుక నితఁడు క్రీ. శ. 1022 సం॥ మొదలు 1063 సం॥ వఱకు వేంగీదేశమును బాలించిన మనరాజరాజనరేంద్రునకు సమకాలికుఁడుగా నున్నాఁడు. ఇతఁడు సరస్వతీకంఠాభరణము, పాతంజలసూత్రవృత్తి మొదలగు గ్రంథములను రచించియుఁ బెక్కుపండితకవులకు నాశ్రయభూతుఁడై వారిచే బహుగ్రంథముల రచింపించియు సంస్కృతభాషను మహోన్నతికిఁ దెచ్చెను.

చంపూరచన కితఁడు మార్గదర్శి. ఇందుల కితఁడు 'గద్యానుబద్ధరసమిశ్రితపద్యసూక్తిర్హృద్యాహి వాద్యకలయాకలితేవగీతి' యని గద్యముతోఁగూడిన పద్యకావ్యము వాద్యముతోఁ బాడినగీతమువలె హృద్యమని కారణమును నిరూపించెను. ఇతఁ డీచంపూరామాయణమునం దయిదుకాండములే రచించి యేకారణమువలననో యాఱవది యగుయుద్ధకాండమును రచింపక విడువఁగా దానిని లక్ష్మణసూరి యనుకవి రచించి పూరించినవాఁడయ్యె. ఈకవిశిఖామణు లిద్దఱును రచించిన యీచంపువు మృదుమధురపదసందర్భసుందరమై చదువరుల నిర్భరరసాస్వాదపరవశులం జేయుచు సంస్కృతభాషకు వన్నెగలిగించుకావ్యములం దొకమిన్నగా నెన్నందగియున్నది.

ఇట్టి ప్రబంధమును దెనుఁగుచేసినవాఁడు కవిరాజకంఠీరవ బిరుదాంకితుఁడగుబుగ్వేదికవి వేంకటాచలపతి.

ఇతని యాంధ్రీకరణపుఁ దెఱంగులు కొంత పరామర్శింతము. ఇతఁడు మూలమును గొన్నియెడల వేఱుగ మార్చియుఁ, గొన్నిపట్టుల లేనివి గూర్చియుఁ, గొన్నిచోట్ల నున్నవి విడిచియుఁ దెలిఁగించినను మొత్తముమీఁద మూలమునకంతగా హెచ్చును దక్కువయుఁ గాకుండ దీనిని రసవంతముగానే రచించినాఁడనవచ్చును. భాషాంతరము సేయుట యనఁగా నొకభాషలోనిపదమునకు మఱియొకభాషయందలి మాఱుపదమును మక్కికిమక్కిగాఁ బెట్టుట గాదు. భాషలు తమతమశబ్దవాక్యస్వరూపవిశేషములంబట్టియుఁ, దన్మూలకములైనవ్యాకరణప్రక్రియలంబట్టియు, రచనయందును శైలియందును, స్వభావమునందును బరస్పరభేదము గలిగియుండును గనుక నొకభాషయందలిపదములను మఱొకభాషలోనికిఁ బరివర్తనము చేయునప్పు డారెండవభాషస్వభావాదుల ననుసరించి తగుకొలందిని వానిని మార్చియుఁ గూర్చియు రచించిననే యవి రమణీయమై రసవంతముగా నుండును. 'బ్రహ్మాండభాండము'లను 'బమ్మగుడ్డుకుండ'లనుటగాని 'పెండ్లికొడుకు'ను 'వివాహపుత్త్రుఁ' డనుటగాని భాషాంతరము గాదు. దీని నెఱింగియే కవికులాదృష్టాధ్వగమనుఁ డగుశ్రీనాథుఁడు తనతెనుఁగునైషధమున 'శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబుఁ బోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పంబడిన యీభాషానైషధకావ్యం' బని వ్రాసినాఁడు. ఇఁకఁ గవి తెనుంగునందలి మార్పులను గూర్పులను విడుపులను నుదాహరించెదము.

మార్పు:—ఇట మూలమును బెంచికొని త్యజించి కొని మఱింత మెఱుంగు గూర్చిన మార్పులను దెలిపెదము.

మూ. సీతా పురా గగనచారిభి రప్యదృష్టా
మా భూ దియం సకలమానవనేత్రపాత్రమ్
ఇత్యాకలయ్య నియతం పిదధే విధాతా
బాష్పోదయేన నయనాని శరీరభాజామ్. (అయోధ్యా.)

తె. మ. అజరాదుల్ పొడగాంచఁగూడని యసూర్యంపశ్య నారాముదే
వి జనానీకవిలోకభాజనము గావింపన్ మదిం గొంకి పం
కజగర్భుండు ఘటించె నాగరకలోకశ్రేణికిం జూడ్కి బా
ష్పజలాకీర్ణముగా నజాహ్వయభృతభ్రాత్రాభిమానోన్నతిన్. (4ఆ. 52ప.)

మూలమునందుంబోలెఁ దెనుఁగున గగనచారులకును బొడగాంచరానిదని సీతకు వనవాసానర్హతను దెలుపుటకై పరమసౌభాగ్యప్రయుక్త మగుసౌకుమార్యాతిశయము చెప్పుటయేకాక యెక్కువగా 'అసూర్యంపశ్య'యనియుఁ జెప్పి యెండ కన్నెఱుంగనిది యడవి కెట్లు పోఁజాలు నని సందర్భోచిత మగుకరుణరసమును మూలముకంటె మిక్కుటముగా నిందుఁ గవి వెలివిరియించినాఁడు. రాముని దేవిని మనుష్యులు చూడ ననువుగాకుండునట్లు చేసినవిధాతకు రామునియం దింతయభిమానమేల యని యాశంక కల్పించికొని బ్రహ్మకును రాముని తాతకును గల 'యజాహ్వయ'మే హేతువుగా నిబంధించి మూలమున కెంతో మెఱుఁగు గావించినాఁడు.

మూ. యద్యస్తి కౌతుక మపూర్వమృగే మృగాక్షి
చాన్ద్రిం హరామి హరిణం నను సన్నిధేహి
యావ న్నముఞ్చసి మయా హృత మేణ మేనం
తావ ద్దధాతు తవ వక్త్రతులాం మృగాఙ్కః. (ఆరణ్య.)

తె. శా. నీకున్ వింతమృగంబుపైని దమియుం కే నేమి కాదంటినా
రాకాచంద్రున కంతరంగ మగుసారంగంబు రప్పించెదం
గైకొ మ్మాహరిణంబు నీకరమునం గన్పట్టునందాఁక శు
ద్ధాకారుం డతఁ డొందుఁగాక భవదీయాస్యైకదాస్యోన్నతిన్. (5ఆ. 81ప.)

మూలమందలి 'చాన్ద్రింహరిణ'మ్మునకంటె తెనుంగునందలి 'రాకాచంద్రున కంతరంగ మగుసారంగ' మనుట మిక్కిలిసొంపు. మూలమునఁ జంద్రుఁడు మృగాం

కముకు వీడి శుద్ధుండై సీతాముఖముతోం బోలు నని యుండంగాం దెనుంగునందు శుద్ధుండయ్యును సీతాముఖమునకు దాస్యోన్నతినే పొందు నని మిక్కిలి సారస్యము గలిగి యున్నది.

'సచివా స్తైలద్రోణ్యాం నిక్షిప్య' యన్నముక్కను

గీ. అర్ణ్వమయ్యెం గృతాధ్వరుం డయినయతని
దేహము తిలోత్తమోదితస్నేహమునకు
పర్ణ్వముగదా కృతాధ్వరుం డైనయతని
దేహము తిలోత్తమోదితస్నేహమునకు.

అని తెలిఁగించి శ్లిష్టార్థాంతరన్యాసానుప్రాసములతో మిక్కిలి చమత్కరించినాఁడు.

ఇట్లే మూలమున 'అస్తి ప్రశస్తా జనలోచనానా, మానన్దసన్దాయిషు కోసలేషు। ఆజ్ఞాసముత్సారితదానవానాం, రాజ్ఞా మయోధ్యేతిపురీ రఘూణామ్' అనుశ్లోకమునకుఁ జాతుర్వర్ణ్యాదివర్ణనకలిత మగు నొకసీసపద్యమును, విశ్వామిత్ర యాగసందర్భమున 'కరతలగలితపలాశసమిత్కుశాః కుశికసుతాస్తేవాసినః' యనుటకు ౨౦వ యాశ్వాసమున (84, 85, 86, 87) నాలుగు పద్యములును, హనుమదాదులప్రాయోపవేశఘట్టమున 'తాస్తాః కథాః పరిదేవయన్త' మ్మనుటకు నయిదాఱుపద్యములను రచించి మూలముకంటెఁ దెనుఁగును రసోద్వేలము గావించినాఁడు.

కూర్పు:—ఇందు మూలములో లేనివై కేవలకవికల్పితములగువానిని వ్రాసెదము.

వసంతవర్ణనము.

సీ. జిగిలీవపడఁతికిఁ జెంగావిపావడ యవనీపదోచిత యావకంబు
మాధవశ్రీకి నిమంత్రసిందూరంబు కలికానికాయతారలకు సంజ
పరభృతవాఙ్మయప్రదశాంభవీరుచి వనికాపురంధ్రికాననహరిద్ర
వనదేవతచనుంగవకుఁ గుంకుమముడంబు ధారుణీరుహశైలగైరికంబు
కామినీకాముకవినోదకలనకొలను, సమయవర్ధకి పొదరింటిగమికిఁ గీలు
కొలిపినరుటంపుఁగెంపుటాతళుకుజోడు, బిల్లగుము రెల్లకడనుద్భవిల్లెఁ జిగురు.

మరునంపుఁ మఱుసృష్టి మ్రాఁకులయెడం బాలించుటెక్కఁ హిమో
పరిసంహారముఁ జూపి తత్త్రిపురుషీభాగాచితిం జైత్రుఁ డొం
దురజస్సత్త్వతమోగుణోన్నతులనం దోఁచెం జిగుళ్లుం జిగు
ళ్లరకంబయ్యెడుక్రొవ్విరుల్ విరులపట్లం వ్రాలుభృంగంబులున్.

చ. చనను వినోదకోప మిడక సాగవు బింకము లాలకింపు డీ
మనసిజు డానతిచ్చినక్రమం బిది యంచు విటీవిటాలికిం
బనుప వసంతుం డక్షరసమాజము వ్రాసినకాగితంబులో
యన దనరెం సబంభరవనాంతరకాంతల కొంతబృందముల్.

ఇత్యాదులు పెక్కులుగలవు. బాలకాండమున దశరథుని యనపత్యతా విచారమును, మిథిలాపురవర్ణనమును విశ్వామిత్రకృతసీతాసౌందర్యవర్ణనమును వివాహవర్ణనమును మూలమందు లేవు.

విడుపు:—ఇందు మూలమున నుండియుం గవిచే విడిచిపెట్టంబడినవానిని వ్రాసెదము. మూలమున విరాధుఁడు సీతను విడిచి రామలక్ష్మణుల నెత్తికొని పోవుసందర్భమున

'యాతునః పదవీ సైషా యాతు న శ్చాస్య లక్ష్మణ
యాతుకామం తయై వేదం యాతు కామం నహన్యతామ్.
'అయి కబలయ మా మమూ విముఞ్చే త్యతికరుణం రుదతీ మవేక్ష్య సీతామ్
అర మరచయతా ముభా వసిభ్యాం పిశితభుజం భుజభారహీనమేనమ్.
'రక్షోవధః ప్రకృత ఇ త్యయమేవ శంసే
త్స్వర్గాయ గాయకపదం గమితో విరాధః
నాగాలయాయ వపు రస్య వదే దితీవ
శ్వభ్రే త దక్షిప దిషుప్రహతం స రామః॥' అను శ్లోకములును, శూర్పణఖ రామునిం గూర్చి—

'లావణ్యామ్బునిధే రముష్య దయితా మేనా మి వైనం జనం
కస్మా న్మాసృజ దస్మదన్వయగురో రుత్పత్తిభూః పద్మభూః
అస్తా మేత దరణ్యవాసరసికే హా కష్ట మస్మి న్నిమామ్
కాన్తిం కావనచన్ద్రికాసమదశాం కిం నిర్మమే నిర్మమే ॥
అన్నశ్లోకమును మఱియు నిట్లె రసవంతము లగుకొన్నిశ్లోకములను విడిచినాఁడు.

మూలమునకు సమాన మైన తెనుఁగు.

మూ. శ్లో. సంక్రాన్త వర్ణాన్తరగాధినూనో
స్సంపర్కపుణ్యాదివ రామభద్రః
తూత్రైక్రమా త్పిప్పలదణ్డయోగ్యః
పలాశదణ్డాదృతపాణి రాసీత్. (బాల.)

తె. గీ. కలితవర్ణాంతరుం డైనగాధిసూను
సహచరతనే మొకో నిజపుత్త్రిజాతి
కయిన పిప్పలదండ మూనియుఁ బలాశ
దండకరుఁ డయ్యె నపుడు మార్తాండకులుఁడు. (2 ఆ. 90 ప.)

మూ. శ్లో. రేఖారథాఙ్గ సరసీరుహశఙ్ఖచిహ్నౌ
క్షేమంకరే తవకరే జగతాం త్రయాణామ్
కాన్తారకన్దఖననం రచయేతి నూన
మాబద్ధవాన్ ప్రతిసరం భగవా న్వసిష్ఠః. (అయోధ్యా.)

తె. చ. ధరజలజాదిచిహ్నములు దావుకొనంగ జగత్త్రయీశవం
కర మగునీకరంబునకుఁ గంకణ మార్తినిదానకాననాం
తరతరుమూలకందఖననం బొనరింపు మటంచుఁ గట్టెనో
గురుఁ డగుశక్తితండ్రి రఘుకుంజర నిన్నుఁటియుత్సవోన్నతిన్.

మూ. శ్లో. మహాసమరసూచకః ప్రతిదినం మనోజన్మనో
మయూరగళకాహళీకలకల స్సముజ్జృమ్భతే
పయోదమలినేదినే పరుషవిప్రయోగవ్యథాం
నరేషు వనితాసువా దధతి హన్త కేకా ఇతి. (కిష్కింధా.)

తె. పృథ్వి. చెలంగె నలుదిక్కులన్ శిఖిశిఖావళీకంఠకా
హళీధ్వని ‘ వియోగితామపి నరేషు నారీషువా
జలాకులఘనే దినే సపది యాన్తి కేకా ’ యితి
చ్ఛలారభటితో మనోజరణవేగసంసూచియై.

ఇట ‘ వియోగితా.........కేకా ’ యను దానిసి దెలిఁగించిన రసభంగము గాన దాని నట్లె యనుకరించి వ్రాసినాఁడు.

ఇతని కవిత్వమందు దోషములును గొన్ని గలవు. కొన్ని పూర్వాంధ్రకవుల యనుకరణములును గలవు. ఒకొకకచోటఁ దెనుఁగు మూలమున కంటె నొకటి రెండువన్నెలు తక్కువగా నుండుటయుఁ గలదు. స్థాలీపులాకన్యాయమున నొకటియుదాహరణము.

మూ. శ్లో. వాచం నిశమ్య భగవా నథ నారదస్య
ప్రాచేతసః ప్రవచసాం ప్రథమః కవీనామ్
మాధ్యందినాయ నియమాయ మహర్షిసేవ్యాం
పుణ్యా మవాప తమసాం తమసానిహన్త్రీమ్

క. అమరమునిపల్కు విని సంభ్రమమున వాల్మీకిసుకవి మాధ్యందినకృ
త్యమొనర్ప నరిగె సురుచిర తమసానదికిఁ దపసికి దమసాధునికిన్

ఇటుముని మాధ్యందిననియమమునకుఁ దెనుఁగువారలి నదీవిశేషణములొసంగె మూల మందలివి మిక్కిలి యుచితములు; కథావిషయమునను నొకానొకచో మూలము నకును దెనుఁగునకు భేదము కనఁబడుచున్నది. మూలమునఁ గ్రౌంచమిథున ములో నొకఁడాని నే బోయ చంపినట్లుండఁగా రెంటిని జంపినట్లు తెనుఁగునను న్నది. కొన్నిలక్షణలోపములును గలవు. మొగడా (ఆ. ౩-౭౧ మొగడాయనుట సాధు రూపము) ధనువంశము (ధనుర్వంశము). కడాని బెత్తపు (కడానిబెత్తపు). ఇత్యా దులు గానవచ్చుచున్నవి. 'గండపెండేరముఖపరిష్కారః' (౩ ఆ. 71) యను సమాస గర్భమునఁ దెనుఁగు దుష్టమయ్యును బూర్వశాసనములందుఁ గండపెండేరము మొదలగు రాజచిహ్నాభిధాయకములు సంస్కృతసమాసములందు ఘటితములై యున్నవి. కూఁతుశబ్దమునకుఁ బ్రథమైకవచనమాత్రనియత మగుటనర్ణకము సమాసమునను బహువచనమునను విభక్త్యంతములను గనుపట్టుచున్నది. రెం డవయాశ్వాసమున 25-వ పద్యమున 'సూళగేరి' యనుపదము మొదట 'సురల గా' రని దిద్దంబడినను బిదపఁ గర్ణాటనిఘంటు పరిశీలనమున నాగవాసమునకు వాచక మగు 'సూళగెరి' యనుపదముగాఁ దెలిసి దిద్దంబడినది.

కవి దాక్షిణాత్యుఁడు గాన నొండు రెండుచోటుల ద్రావిడకర్ణాటపదములు పడినవి. 'చెలంగె నలుదిక్కుల' ననుపృథ్వీవృత్తమునకుఁ గవి తొమ్మిదింట యతిని వేసినాఁడు. వసుచరిత్రపీఠికను శ్రీశాంతి భద్రాద్రిరామశాస్త్రిలవారు 13-వ యక్షరమును, శృంగారనైషధవ్యాఖ్యానమున వేదము వేంకటరాయశాస్త్రిల వారు 14-వ యక్షరమును బృథ్వికి యతిగా వ్రాసిరి. పూర్వకవిప్రయోగములందు 12-వ యక్షరము యతిగా నున్నది. కావున దీనినిబట్టి కవి యందుఁ దప్పుపట్ట రాదు.

ఇక్కవి మూలమున నందందుఁ గలశైలిని బాకమును ననుసరించియే యాయాపట్టులపద్యములను రచించినాఁడు. ఇతని కవనమున వ్యర్థపదములును బాదపూరణములును నంతగాఁ గలుగవు. స్వతంత్రప్రయోగము చాలవఱకుఁ గలదు. రసపోషణము ప్రధానముగా నున్నది. కవికి శృంగారరసము మిక్కిలి యభిమతముగా నున్నది. మొత్తమునకు శైలి మధురమై యలంకారబంధుర మై యున్నది.

తంజనగరము దేవరాజసుధి,
కట్టి సాంబమూర్తిశాస్త్రి.

శ్రీరామాయనమః.

# ఒంటిమిట్ట, పోతనామాత్యుఁడు.

## మూఁడవభాగము.



ఉ. రెండుకరంబులం గవివరిష్ఠుఁడు పోతనపుణ్యకావ్యము౯,
దండిమనంబునం దనకథం, గయికొంచు ధరాతనూజత
మ్ముండును గొల్వ నేకశిల మోదము మీఱెడు నొంటిమిట్టలో
దండరఘూద్వహుండు మిము ధన్యులఁ జేయుత నెల్లవేళల౯.

మహాశయులారా!

బమ్మెరపోతరా జొంటిమిట్టవాఁడని నేను వ్రాసినవ్యాసమునకుఁ బ్రత్యుత్తరమును బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారు కార్తికమాసపుఁ బరిషత్పత్రికయందుఁ బ్రకటించిరి. వారు వ్రాసినదానికిఁ బ్రత్యుత్తరము వ్రాసి (రావుబహదర్ వీరేశలింగము పంతులవారు వీరభద్రవిజయము నుద్దేశించి నేను వ్రాసిన వ్యాసమునకుఁ బ్రత్యుత్తర మిడఁగల రనుభీతి లేనివాఁడఁ గావున)*యీవివాదమునకింతటితో శాంతిపాఠముఁ బఠింపఁ దలఁచినాఁడను. ఈవ్యాసముతో నుభయవాదములు పూర్ణముగఁ జర్చితములైనట్టు లేర్పడును గావున నిష్పక్షపాతబుద్ధులగుమధ్యవర్తు లావల నెవరివాదము బలీయమో పరిష్కరింతురుగాక.

ఓరుగంటిపక్షమున మొదటఁ జెప్పినకారణములు గాక క్రొత్తకారణములేవియు బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారు చెప్పినవారుకారు. వాని నన్నిటిని

* ప్రౌఢసరస్వతీత్యాది సందిగ్ధవిషయములగుఱించి యెందైన నేమేని నన్నుగుఱించి వ్రాయుదురేమోకాని వీరభద్రవిజయము భాగవతకర్తృకృతమని వారు సాధింపశక్తులు గారని నానమ్మకము.

మున్నే ఖండించియున్నాఁడను. నావాదమునందు వా రిప్పుడు కనఁబఱిచిన లోపములకు సమాధానము చెప్పినచో మధ్యవర్తి లేకఁ బరిష్కరించుట కే యాటంక ముండదు. "ఈ వ్యాసముఁ జక్కఁగాఁ జదివినాఁడను, గాని నా యభిప్రాయము మార్చుకొనుటకుఁ దగిన కారణము లేమియు నందుఁ గానరా లేదు" అని పంతులవారు వ్రాసిరి. నా వ్యాసమున వారికిఁ బత్యుత్తరసం యోగము కలుగుట సత్యము. కొన్నిచోటుల శ్రోత్రములకుఁ బనున లేదనుటకు ముందు దృష్టాంతములు చూపెదను. నిష్పక్షపాత బుద్ధులు, సత్యభాషణులు, సుభాషిత ములు, విద్వాంసులు నగుమాననీయులు "You have demolished the case for Warangal" అనియు, "The arguments adduced are very convincing and well supported by facts" అనియు "దాదాపు ఇరువది యైదుసంవత్సరములక్రింద నేను ఒంటిమిట్టఁ జూచియుంటిని. అప్పుడు నేను స్థలజ్ఞుల విచారింపఁగాఁ దాము వ్యాసమున వ్రాసినప్రకార మాయాస్థలములఁ జూపిరి. ఎదిరి యూహలకంటెను తమ యూహలు ప్రమాణబల సమన్విత ములుగఁ గనఁబడుచున్నవి." అనియు "వాదప్రౌఢి గంభీరముగను నిరుత్తరము గను నున్నది. వీరభద్రవిజయమును పోతన కంటఁగట్టుట యసమంజసమని రూఢి చేసితిరి. బమ్మెరవాస్తవ్యతాభ్రాంతిని నిర్మూలముఁ జేసితిరి. కవి జీవితవిమర్శ ప్రయోగమునకు మార్గోపదేశక మగు వ్యాసము వ్రాసితిరి." అనియు నా వ్యాసమునుగుఱించి వ్రాసి యున్నారు మఱికొంద ఱీవిధముగనే నాతోఁ జెప్పియున్నారు. రామయ్యపంతులవారు మధ్యవర్తిస్థాన మలంకరించియుండిన నీయభిప్రాయమే చెప్పియుందురు. వాదు లగుటచే నభిప్రాయము మార్చుకొనఁ గారణము లేమియు వారికిఁ గానరాలేదు. అది వా రాక్రమించిన స్థానదోషము గాని నాదోషముగాను వారిదోషమును గాదు.

1. "బమ్మెర, పర్వ్వారు, వెలిగందల యనుగ్రామము లోరుగంటికి సమీ పదేశమం దున్నవి, గాన నాగృహనామములు గలకుటుంబము లాప్రాంత మందే యుండెనని యూహించుట యసమంజసము కాదని నామొదటివాదము." అని పంతులవారు వ్రాసిరి. దీనికి నేనిచ్చిన ప్రత్యుత్తరము మీరు చదివియే యున్నారు. ఇందు 'బమ్మెర' యోరుగంటియొద్ద నున్నదనుట యసత్యము. నిరాధారము. ఓరుగంటియొద్ద బొమ్మెర యున్నదిగాని బమ్మెరలేదు. బమ్మెర యెం దుండినదో యాంధ్రలోకమున కింకను దెలియదు. నే నాక్షేపించిన పిమ్మటఁ గూడ బొమ్మెరకుఁ బూర్వనామము బమ్మెరయని పంతులవారు స్థాపింప జాలరైరి.

అట్లుండెఁగదా స్థాపించుటకు? కడపలో జరిగినసభలో నిప్పుడేల్పూరనఁబడుగ్రామమే యేల్పూరని నేను జెప్పఁగా నది సరిగాదనియు లెక్కలలో నేల్పూరనియే యున్నదనియుఁ బంతులవారాక్షేపించిరిగదా. నావాదమున కనుకూలముగ శాసనవాక్యములు గ్రంథస్థప్రయోగములు కనఁబఱచితినిగదా? అట్టులే నేనాక్షేపించినపుడు వారివాదమున సత్యముండిన నేలప్రయోగములు కనఁబఱుపరాదు. బమ్మెరబొమ్మెరలకు మేనత్తపోలికో మేనమామపోలికో తామేల నావలె సప్రమాణముగ స్థాపింపరాదు? బమ్మెర బొమ్మెర రెండు నొకటే యనుట యోరుగంటివాకుల యూహామాత్రకల్పిత మనినఁ దప్పేమి? బొమ్మెర గ్రామజనులును దమగ్రామమునకు బమ్మెర యనుపే రుండినట్టు చెప్పలేదు. ఈవిషయము నారెండవ వ్యాసమునఁ జర్చించినాఁడను.

2. “ఈవాదమున కంతకు మూలాధార మైనబమ్మెర గ్రామమునకుఁ బ్రతిగ్రామ మాయనకుఁ బొడకట్టియుండలేదు. ఏల్పూరు వెలిగండ్లగ్రామముల కనతిదూరములో నొకబమ్మెరయో బొమ్మెరయో కనఁబడినపుడుగాని సుబ్బారావుగారియాక్షేపము విమర్శనపాత్రము గాదు.” అని రామయ్యపంతులవారు వ్రాసిరి. బమ్మెర నామమునకుఁ బ్రతినామము విషయమై రావుబహదర్ కందుకూరి వీరేశలింగము పంతులవారికిఁ బ్రత్యుత్తర మిచ్చియున్నాఁడను. ఏబకార మకారరకారము లుండునవియైనను బమ్మెరలని నేను వాదింపఁబూనినచోఁ గోడూరికి ౯ మైళ్లలో నొంటిమిట్టకు ౩౦-౩౫ మైళ్లలో నుండుబొమ్మవరమే బమ్మెర యనియు లేమ్బల యనునది జన్మాంతరములఁ గ్రమముగా లేమలవాడ, లేములవాడ వేములవాడ యైనట్టు బమ్మెర బొమ్మెర యై యావల బొమ్మరయై పిదప బొమ్మవరమయినదని వాదించియుందును. పంతులవారివలె నూహ లన్నియుఁ బరమప్రమాణము లని వాదింప నామన సొప్పదు. ఊహలూహలె. అవి సత్యము లనునెడల నాధారములు కనఁబఱుపవలయును. ఇఁకను బొమ్మెరయే బమ్మెర యని యోరుగంటివాదు లాధారము కనఁబఱుపక యూరక హఠవాదము చేసిరా బొమ్మవరమే బమ్మెర యని యొంటిమిట్టవాదులు వాదింతురు. వారివాదమునకు వారు ప్రమాణము కనఁబఱచినపుడు వీరి వాదమునకు వీరు బ్రమాణము కనఁబఱుతురు.

రామయ్యపంతులవారి యభిప్రాయప్రకారము బమ్మెరయనునది గ్రామనామముగా గ్రహించినను వారివాదమునందు బలములేదనినిరూపించితినిగదా. ఒకవిధమునఁ జూడ బమ్మెర యనునది గ్రామనామము గాదని తోఁచుచున్నది.

బమ్మెర యనుశబ్దమునకు నిలుకడలేనిది, చలించునది యనియర్థము. ఇది భ్రమ
శబ్దమునకుఁ దద్భవమని సీతారామాచార్యులవారు వ్రాసిరి. భ్రము-అనవ
స్థానే (తిరుగుట) యనుధాతువువలనఁ గలిగినది భ్రమ-కావున బమ్మెరకు నదే
యర్థము. దీనికిఁ బ్రయోగములు. "ఎలదేఁటిదాఁటులకా। బమ్మెరవోవఁ దోలు
తెగబారెఁడు వెండ్రుకలు"—మను. "బమ్మెరపోకతో" అని పంచతంత్రము. ఇం
కను బ్రయోగములు కలవు. గ్రామ మెన్నఁటికి నిలుకడగా నుండునుగాని తిరుగు
చుండదు గదా. కావున బమ్మెర యనునది గ్రామనామముగా నుండ దనుట
తప్పు గాదు. మనుష్యులయింటిపేరుగా నెట్లుండఁగల దందు రేని వినుఁడు.

ఆంధ్రులయింటిపేర్లు నానాకారణములు గలవి. రామాయణము చెప్పు
వారు రామాయణమువారు, భారతమును జెప్పువారు భారతమువారు, పురాణము
చెప్పువారు పురాణమువారు. ఇతరులచే భుజింపక స్వయముగఁ బాకముచేసికొను
వారు స్వయంపాకాలవారు. సుంకరివృత్తియం దుండువారు సుంకరివారు. ఈవిధ
ముగ నాచనవారు, పోతరాజువారు, ఏనుఁగువారు, కస్తూరివారు, చదువులవారు,
పాగావారు, లోనగునింటిపేర్లు గలవు. బమ్మెర వారనుపేరును నిట్లే వచ్చియుండవల
యును. పోతరాజు పూర్వు లొకచోట నిలుకడలేక నానాదేశముల భ్రమించు
చుండినవా రగుటచే బమ్మెరవా రైరి కాఁబోలు. దీనికి సరియైన యాంగ్లనామము
Nomads. "Nomad = పశుచారోపజీవి-అస్థిరవాస" యని ఆప్టి నిఘంటువు.
పోతరాజు పశుచారోపజీవి యనియుఁ గింవదంతి కలదుగదా. కావున బమ్మెర యను
నది గ్రామనామమని పొరపడి కించిత్సామ్యము గలదేనితోనో ముడిపెట్టక యీ
వ్యుత్పత్తి గ్రహించుట బాగని తోఁచుచున్నది. ఇది యూహామాత్రమే. ఇది
సరి కాదని పంతులవారు సప్రమాణంబుగ నిరూపింతురుగాక. ఈయూహ సరియై
నను గాకున్నను నావాదమునకు హానిలేదు గాని దీని నిరాకరింపఁ జాలకపో
యిరా పంతులవారివాదము సమూలము చెడినది.

3. బమ్మెర, బొమ్మెర యొకటైనను బమ్మెర పోతరాజు బమ్మెరలోనే యుండె
నను వాదము నమ్మరా దని నేను వ్రాసితిని. దీనిపైఁ బంతులవారు "కొంతమంది
తమయింటిపేళ్లు గలయూళ్లలో నేకాఁపుర ముండవచ్చును. ఇంటిపేళ్లుగల యూ
ళ్లలో నివాసము చేయుచున్నవారలఁ బలువుర నే నెఱుఁగుదును. అట్టి
వారు బొత్తిగా లే రని సుబ్బరావుగారును జెప్ప సాహసింప లేదు" అనిరి. ఎట్టి
సందర్భములందు గృహనామము గ్రామనామ మొకటిగా నుండునో యాసం

దర్భముల నెల్ల నాప్రథమవ్యాసమున విశదీకరించితిని. అది సరికా దని పంతులవారు చెప్పఁజాలరు. ఇంటిపేర్లు గలయూళ్లలో నివాసము చేయు పలువురిలో నేను జెప్పినసందర్భములకు లోపడనివా రెందఱున్నారో వీరు విచారించిరా? నేను జెప్పినసందర్భములకు లోపడినవా రైనయెడల నది వీరివాదమున కెట్లుపకరించును? నేను జెప్పినసందర్భములకు లోపడక సృష్ట్యాది నేఁటివఱకు నొకగ్రామమందే యుండి యాయూరిపేరే తమగృహనామముగఁ గలవా రెందేని యుండిన నుండవచ్చు నని వాదమునకై యంగీకరించెదను. ఆంధ్రదేశమునఁ గలకుటుంబముల సంఖ్య యెంత? మీఁదఁ జెప్పఁబడినట్టికుటుంబముల సంఖ్య యెంత? ఇది దానిలో నెన్నవవంతు? పదివేల కొకకుటుంబమైనఁ గలదా? ఈ ప్రశ్న నేనుమున్నే యడిగియుండ స్పష్టమైనప్రత్యుత్తరము వ్రాయక తేరమాటలు వ్రాయనేల? ఒకవేళ నున్నను సందిగ్ధవిషయములో బహుజనుల కన్వయించు సామాన్యవిధి నన్వయింపక యపవాదవిధి నన్వయింప నేమికారణము? ఇటు చేయుట లోకసమ్మతమా "శాస్త్రసమ్మతమా?" Exception is no rule. అపవాదములు విధులు గావనుట వీరెఱుంగరా? బమ్మెర యపవాదములోఁ జేరిన దనుట కేమి యాధారము? ఊహ. ఈవిషయమున వీరియూహ కేవల మసత్యమనుటకు రెండవభాగమున నాధారములు సూచించియున్నాఁడను.

4. "శ్రీరామలింగాంఘ్రి సేవావరప్రౌఢిఁ గవితాచమత్కృతు ల్గాంచువారి
నప్పలమ్మయును వీరాంబయుఁ బ్రౌఢసరస్వతికిని గన్నప్రజ్ఞవారిఁ†
గౌండిన్యగోత్రవిఖ్యాతి బమ్మెరభవ్యవంశాఢ్యులై సిరివఱలువారి
నివటూరిముక్తి నాగేశసద్గురుభక్తి నాదిమశైవులైనట్టివారిఁ
గేసకవిమల్లకవి నామకీర్తిపరుల మమ్ముఁ బిలిపించి.

† ప్రౌఢసరస్వతిపద్దు కేసన కున్నట్టు లజ్జరపుఁ బేరయలింగకవియుఁ "ప్రౌఢసరస్వతి యను బిరుదందిన కేసనకవి (పోతనమనుమఁడు) అని" రావుబహదర్ వారును వ్రాసి యున్నారు. ప్రౌఢసరస్వతు లిరువురో యొకరో రావుబహదర్ వారే పరిష్కరింపవలయును. రావుబహదర్ వారు ముద్రించినవిధముగఁ బ్రౌఢసరస్వతికి నిరువురుభార్యలు, పెద్దభార్య అప్పలమ్మ, చిన్నభార్య వీరమ్మ. కవితాసంప్రదాయమునుబట్టిచూడ నప్పలమ్మకొడుకు కేసన, వీరమ్మకొడుకు మల్లన, యని తోఁచుచున్నది. గ్రంథమునం దెట్లున్నదో నేనెఱుఁగను. ఇరువురు నొకతెకొడుకు లయియుండినయెడల రెండవ యామె పేరును కేసనమల్లనలు చెప్పియుండరు. ఇంతవఱకుఁ జూడఁ బ్రౌఢసరస్వతి తండ్రి యని యప్పలమ్మ తల్లి యని వీరికుమారుఁడు కేసన యని యేర్పడుచున్నది.

అని దాక్షాయణీవివాహమున నున్నట్లు రావుబహాదర్ వా రనువదించియున్నారు. ఈకవులే " మత్పితామహుని బమ్మెరపోతన " యని వ్రాసియున్నారు. ఈపోతన భాగవతగ్రంథకర్త కాఁడని రెండవభాగమున సిద్ధాంతముచేసియున్నాను. బమ్మెర కేసన-బమ్మెరమల్లనలు కృష్ణామండలమువారని యందే వ్రాసియున్నాను. ఇప్పుడు రావుబహాదర్ వీరేశలింగము పంతులవారు బమ్మెరకేసన-మల్లనలు బమ్మెర యందే పుట్టినను గురు జాల మహానగరము గావున నచటికిఁ జేరియుండురనియు, గృహనామము బమ్మెరగాఁ గలబమ్మెరకేసన-మల్లనలు బొమ్మెరప్రాంతమువారే యని పంతులవారును వ్రాయఁగలరా ? బమ్మెర యింటిపేరివారు బమ్మెరయందే యుండి రనుట తప్పనుట కిది చాలదా ? ఈవిషయము రెండవభాగమున 432-వ పుటయందు వ్రాసియుండినను దానికిఁ బ్రత్యుత్తరమీయక చర్వితచర్వణంబున వృథాకాలవ్యాసఙ్గ్యము చేయనేల ?

బమ్మెరపోతరాజు తొలుత బొమ్మెరలో నుండెనంట. గ్రంథరచనకాల మునాఁటికో యంతకుఁ గొంతముందో యేకశిలానగరము చేరె నంట, తిరిగి యవసానదశకు బొమ్మెర చేరె నంట. చేరకపోయినను గృతజ్ఞులై యాగ్రామము వా రాయనకు జ్ఞాపకముగా విగ్రహము స్థాపించి రంట. ఈయంట లన్నియు మరల నూహాలు, ఊహాలు, ఊహాలు. ఏకశిలానగరవాసులు కృతఘ్నులైరంట యని నే నొక యంట చేర్చెదను,

ఇట్టివాదమునకుఁ బ్రత్యుత్తరము రెండవభాగమున నిచ్చియున్నాఁడను. కావునఁ జర్వితచర్వణ మేల ? ఇదంతయు నోరుగంటివాదుల యనన్యగతికము లైనయూహ లనుట నిర్వివాదము. ఏలన రామయ్యపంతులవారు తమవాద మును బలపఱుచుకొనఁ గొన్నియనుబంధములఁ బ్రకటించిరి కదా. వానియందు

పేరయలింగకవి తనమామపేరు ప్రౌఢసరస్వతి యనుబిరుదుగల కేసన యని యత్తపేరు అప్పమ్మయని వ్రాసినట్లు రావుబహాదర్ వారు పద్యము ననువదించిరి. ఇప్పుడు అప్పలమ్మ కేసనకుఁ దల్లియా ? భార్యయా ? యనుప్రశ్న కలుగకమానదు. రావుబహాదర్ వారు తమయేడుతరముల లెక్క కాపాడుకొనుటకై యిద్దఱప్పమ్మలు నిరువురు ప్రౌఢసరస్వతు లుండి రని వ్రాయుదు రేమో దానికిఁ దగినయాధారములఁ గనఁబఱిచి యేడుతరములను స్థాపించినను " రావుబహాదర్ వారి యిష్ట ప్రకార మేడుతరములుగ లెక్కించినను నిరువురు పోతనలకు నడుమ నూఱేండ్లకు మించి యెడము గలదు." అని రెండవభాగమున 437-వ పుటయందు వ్రాసిన నాయభిప్రాయమునకు లోటులేదు. ఈకవులచరిత్రమం దప్పమ్మ యెవరికిఁ దల్లియగునో యెవరికిభార్యయగునో చూడవలయును. అది నా వాదమునకు సంబంధించినది కాదు. కావున నేను దర్కింపఁబనిలేదు.

శ్రీనాథుఁడు భాగవతమును గర్ణాటరాజున కంకితమిప్పింపఁగోరి బమ్మెరపోతనను జూడవచ్చినపుడు పోతరాజు భూమి దున్నుచున్నవృత్తాంతము లోనైనది బొమ్మెర యందు జరగినట్లు వ్రాయఁబడి యున్నది. దీనివలన భాగవతము బొమ్మెరలో రచింపఁబడుచుండె నని యేర్పడెనుగదా? తమకు ననుకూలము లని తాము వ్రాయించి తెప్పించిన యనుబంధములకు విరోధముగ వీ రిపుడు వాదించుట కేమి కారణము? బొమ్మెరజనులమాట నిజమా? రామయ్యపంతులవారు రావు బహాదర్ వారు చెప్పెడుమాట నిజమా? పరస్పరవిరుద్ధము లైన యీ రెండును నసత్యము లే.

5. ఈవిషయమున రామయ్యపంతులవారిని నేనొకటి ప్రార్థించెద. సత్య జిజ్ఞాసువు లైనవీరు నాప్రార్థన మంగీకరింతురుగాక. వీరు న్యాయవాదిపరీక్ష యం దుత్తీర్ణులై న్యాయాధిపతిస్థాన మలంకరించి సాక్ష్యస్మృతిప్రకారము న్యాయములఁ బరిష్కరించినవారు కావున ర నిమిషములు తామీవాదమున వాదుల మనుభావమును మఱచి న్యాయాధిపతిస్థాన మలంకరించినట్లే యెంచఁ గోరెదను. అప్పుడు నేనే వాదినై వారియెదుట నిలఁబడి నావాదమున కనుకూలము లని విజ్ఞాపనపత్రికతోడఁ గొన్నిపత్రికల నర్పించితి నని యెంచఁగోరెదను. తరువాతఁ బ్రతివాది విచారణ ముగిసినపిమ్మట నేను నాసంగ్రహోపన్యాసములో నేను సమర్పించిన పత్రములకు విరోధముగను వానిలో లేనివిగను గొన్నివిషయములు చెప్పితి నని యెంచఁ గోరెదను. అప్పుడు వీరు నేనర్పించినపత్రములఁబట్టి తీర్పు చెప్పుదురా? ప్రతివాదులు చెప్పినమాటలనుబట్టి సవరించికొని నేను నోటఁ జెప్పినమాటలనుబట్టి తీర్పుచెప్పెదరా? ఇప్పుడు తాము వాదులైనపుడు తద్భిన్నముగ వర్తింప వీరి యంతఃకరణ మెట్లంగీకరించెను? బమ్మెర బొమ్మెర యనుట యనుబంధముల లేనివాదము; ఇతరాధారశూన్యము. భాగవత మోరుగంటి యందు రచింపఁబడె ననుట యనుబంధవిరుద్ధవాదము. రావుబహాదర్ వారి కిచ్చిన ప్రత్యుత్తరముతో దీనిని గలిపి చదివి యీవిషయ మేకాగ్రచిత్తులై రామయ్య పంతులవా రాలోచింతురుగాక.

ఇంటిపేరు గలవా రాపేరుగలగ్రామములోనే తరతరములుగ నుండుట యరు దని నేను జెప్పినదానికై బొమ్మెరకు నోరుగంటికి ముడిపెట్టఁగోరి పంతుల వారు తొలుత బమ్మెరలో నుండి భాగవతరచనాకాలమందుఁ గాని యంతకుఁ గొంతకాలము పూర్వముగాని యేకశిలానగరమునకు వెళ్లియుండవచ్చును. కావు

ననే తాను బమ్మెరకు సంబంధించినవాఁడని కాని బమ్మెరనుండి వచ్చినవాఁడనికాని సూచించుటకై బమ్మెర యనుగృహనామము పెట్టుకొని యుండును" అని పెద్ద యుక్తి వ్రాసిరి. పంతులవారి యూహాలు యుక్తు లనెడుదూదిపోగులపై బమ్మెర పోతనామాత్యుఁడే తనతల్లిదండ్రులగుఱించి "బమ్మెర కేసయలక్కసానికిన్" అని వ్రాసినప్రయోగమను మహాప్రభంజనమును బ్రయోగించెదను. దీనివలన బమ్మెరవా రనుపేరు పోతనతండ్రితాతలకాలమునుండి యున్న దనియుఁ బోతన తాను దనయింటిపేరు పోఁగొట్టుకొని యోరుగంటిలోఁ గూర్చుండి బొమ్మెర యనుమహానగరముపేరు పెట్టుకొని కీర్తిసంపాదింపఁ గాఁబోలు నాపేరు పెట్టుకొనె నను నూహ నిష్కల్మషమిథ్య యనియు స్థాపిత మయ్యెను. దీనితో నైనఁ బంతులవారు సత్యము గ్రహింతురుగాక. మహాశయులారా! కేవలోహ లెంతయనర్థకరములో చూడుఁడు? వాదాభినివేశము లిఖితప్రమాణవిరుద్ధము లగువ్రాఁతలను గూడ వ్రాయించుచున్నది. పంతులవారి ద్వితీయవ్యాసమునం దిట్టినిరాధారోహాపోహములు మఱి రెండు మూఁడు గలవు. కోదండరాముల కృపవలన వానికి నిట్టిగతియే ప్రాపించును గాక.

### రెండవయాధారము.

6. "బమ్మెరపోతరాజు చెప్పినగంగ యేది యనువిషయమున నావాదమునకు ముఖ్యాధార మోరుగంటిప్రాంత దేశమునందలి వాడుక గాని యీప్రయోగములు కావు" అని రామయ్యపంతులవారు వ్రాసిరి.

ఇప్పటి పామరజనవ్యవహారమునుబట్టి పురాణముల కర్థముఁ జెప్పుట యనర్థకహేతు వని నావాదము. దానికి వలసినన్ని దృష్టాంతముల నిచ్చితి. వానిలో నొక్కటియైన సరిగా దని పంతులవారు నిరాకరింపఁజాలకయు మరల నదే వాదము చేయుచున్నారు. అం దొక్కదానినైన వారు శుద్ధాంతఃకరణముతో నాలోచించెదరుగాక. "తల్లిన్ మదిన్నిన్ను భజింతు గంగన్" అను భాగవతపద్యము నుదాహరించి యిందు గంగయనఁగా గోదావరి యని యర్థము చెప్పెదరా? చెప్పరేని యశాస్త్రీయ పామరవాక్యము పరమప్రమాణముగ గ్రహించు వీ రేల చెప్పరు? ఒకచోఁ బామరవాక్యము ప్రమాణ మగుట యెట్లు? రెండవచోటఁ గాకుండు టెట్లు? పోతరాజు గోలకొండదేశమువాఁ డనునూహయే గ్రహించుటకుఁ గారణ మందు రేని యావాదమే నిలువఁ గాళ్లులేకుండఁగా దానినాధారము చేసికొని యితరవిషయములు వ్రాయుట గోడలు లేనిమిద్దె కట్టుట కాదా? పోత

రాజు గోలకొండదేశమువాఁ డనునూహా యావలఁ గట్టిపెట్టి చదివెడివా రెవ్వ రైన గంగ యనఁగా గోదావరి యని యర్థము చెప్పెదరా ? అట్లు చెప్పసాధ్య పడదేని యిది స్వతంత్త్రాధారము కాఁగలదా ? బమ్మెరపోతరా జోరుగంటివాఁ డనుటకుఁ గదా దీనిని మీరాధారముగ గ్రహించితిరి ? దాని కాధారము బమ్మెర పోతరా జోరుగంటివాఁడను నూహాయే కదా? అట్లయినచో నిందు నన్యోన్యాశ్ర యత్వము లేదా ? యని ప్రశ్నించితిని. రామయ్యపంతులవారు ప్రత్యుత్తరము చెప్పఁజాలరైరి. స్వవాద మనునభిమానమును విడిచి యీయుక్తివిషయమును జక్కఁగ నాలోచించిరేని తమవాదము దుర్బలము గాదు నిర్బల మని పంతుల వారికే తోఁపఁగలదు.

7. “సజ్జనానుమతంబున గంగకుం జని” యనునది యెట్లు గ్రహణస్థా నపక్షమున సమర్థించెద రని యడిగితిని. దానికిఁ బ్రత్యుత్తరము లేదు. “అభ్రంకషశుభ్రసముత్తుంగభంగ యగుగంగకుం జని” యనుచో విశేషణము లెట్లు గోదావరీపరమున సార్థకము లంటిని. దానికిఁ బ్రత్యుత్తరము లేదు కాని పోతన యనుప్రాసప్రియుఁడు కావునఁ బ్రయోగించె ననిరి. “భంగయగు దక్షిణ గంగకుం జని” యని వ్రాసియుండినచో ననుప్రాసనియతికి భంగము కలదా ? సందిగ్ధదోషమున కేల పాలుపడెను ? అనుప్రాసముల నడుమ మాటలు రా రాదా ? వ్యవహితంబులు పరశ్శతంబులు భాగవతంబున లేవా. “రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకఁగని” యనుచో నాయననియతికి భంగము కలిగెనా ?

“అభ్రంకషశుభ్రసముత్తుంగ” యనునది వ్యర్థపద మని పంతులవారన సాహసింతురా ? ఈప్రశ్నములకు నొకదానికిఁ బ్రత్యుత్తరము లేదు. “గోదావరి గంగయనుట లోకవ్యవహారరూఢ” మని పంతులవారనుట సరిగాదు. ఆలంకారికమతమున రూఢి యెట్టిదో పంతులవారు మఱచిరి. భరతఖండ మందెందు నీవాడుక లేకుండుట యటుండ నాసికాప్రాంతమందైన భద్రాచలప్రాంతమందైనను రాజమహేంద్రవరప్రాంతమందైన హైదరాబాదునగరమందైనను గోదావరిని గంగయని లోకులు పిలువరు. కావున ‘లోకవ్యవహార,మనునది ‘లోకైకదేశకోణకోట్యంశభాగవ్యవహార’ మనవలయును. ఇట్టిది రూఢి గాదు. “సత్కవిప్రయోగావిరుద్ధ”మనుటయు సరిగాదు. మహాకవు లెవ్వరు సందర్భమునకుఁ బొసఁగని సందేహదుష్టములగువాక్యములను నేయార్థములను వ్రాయ లేదు. సందర్భములను

బట్టి స్పష్టముగ గోదావరి యని యర్థమగునట్లు వ్రాసియున్నారు. సందర్భమునుబట్టి గోదావరి యని గ్రహింపరాని గంగాపదమును నేమహాకవి ప్రయోగించెను? ఆప్రయోగమేది? ఏల దానిని బంతులవా రుదాహరింపరైరి? గోలకొండదేశ కవు లెవ్వరైన నట్లు ప్రయోగించిరా?

"చంద్రగ్రహణమునకు మిక్కిలిదూరమున నున్నభాగీరథికిఁ బోవుటకంటె ననతిదూరమం దున్నగోదావరివంటి మహానదికిఁ బోవుట సామాన్యలోకాచారానుసారము. పోతరాజు భాగీరథికిఁ బోయియుండఁగూడదని నావాదము కాదు. పోయినఁ బోయి యుండవచ్చును. కాని తగినంత యాధారము లేక యంతదూరము చంద్రగ్రహణనిమిత్తమాత్రమున వెళ్లెననుట సమంజసము కాదని నామతము" అని పంతులవారు చర్విత చర్వణము చేసిరి. దీనికిఁ బ్రత్యుత్తరము నా ప్రథమవ్యాసముననే వ్రాసితిని. అయినను మరల వారితృప్తికై పిష్టపేషణము చేయవలసివచ్చి చేసెదను.

"సోమోపరాగంబురాకఁగని" యనుచోఁ గని యనఁగాఁ దెలిసికొని యని యర్థము. కనుధాతువు జ్ఞానార్థమునఁ బ్రయోగింపఁబడినది. ఇఁక సంవత్సరమునకో యాఱునెలలకో పుష్కరము వచ్చు నని తెలిసికొనుట యెట్టిదో యిదియు నట్టిద. గంగాయాత్ర కవియుద్దేశ్యముకాని కేవలగ్రహణస్నానము కాదు. "సజ్జనానుమతంబున" ననుప్రయోగమే కవియుద్దేశమును దెలుపుచున్నది. ఈయుద్దేశము గలవాఁడై యుత్తదినముల గంగాస్నానముచేయుటకంటె గ్రహణకాలస్నానమున నెక్కుడుఫలము గలదని శాస్త్రములు చెప్పుటచే నాసమయమున కక్కడఁ జేరఁబోయెను. అటుకాదేని ౧౨౦౦ మైళ్లు గ్రహణస్నానమునకే పోయినాఁడనుట నమ్మరానిమాట. ఈప్రకారము నేను సమాధానమిచ్చి యుండియు మరలఁ బంతులవారావిషయమే వ్రాయుట వ్యర్థశ్రమము. గంగాయాత్ర సంకల్పించినవారు సమీపకాలమునఁ బుష్కరము తటస్థించునేని యాసమయమునకు సరిగ గంగఁ జేరఁబోయినట్లే గ్రహణకాలమునకు సరిగఁ బోతన గంగఁ జేరఁబోయెనని గ్రహింపవలయును.

ఈవిధముగఁ బంతులవారియాధారములు రెండును రెండుత్రోవలు పట్టినవి. ఇఁక వీరి యాధారములబల మెట్టిదో చూతము.

బమ్మెర గ్రామనామ మనుకొనుట మొదటియూహ. బొమ్మెరయే బమ్మెర యనుకొనుట రెండవయూహ. బమ్మెర పోతరాజు బొమ్మెరలో నుండె ననుట

మూఁడవయూహ. గ్రంథము వ్రాయ బొమ్మెరలో స్థలములేమిని గాఁబోలు నోరు గంటికిఁ బోయె ననుట నాలవయూహ. గ్రంథము ముగియఁగానే మరల నూరికి వచ్చె ననుటయైదవయూహ. రాకుండినను నోరుగంటివారు కృతఘ్నులై యాయ నను స్మరింపమిని బొమ్మెరవా రాయనపేర బొడ్డురాయి నిలిపి రనుట యాఱవ యూహ. పోతరాజు గోలకొండవాఁ డనునూహచే గంగ యనఁగా గోదావరి యనునూహయూహపై నేడవయూహ, గంగ యనఁగా గోదావరి యని యూహిం చుటచేఁ బోతరాజు గోలకొండ వాఁడనుట యెనిమిదవయూహ. ఇన్నియూహలనా ధారముగఁ గలదియోరుగంటివారివాదము. రామయ్యపంతులవారి వ్యాసమం దెచ్చటఁజూచినను "నూహించుట సమంజసముకదా"యను వాక్యములే కాని కడిగిగాలించి వెదకిన నొక్కచోటనైన వెలిగందల, ఏర్చూరుతప్ప, నిదిగ్రంథస్థము ఇది ప్రత్యక్షప్రమాణము నను వాక్య మొకటయినఁ గానరాదు కదా ? ఈవాదము నందుఁ గానవచ్చునది పంతులవారి ప్రతిభావిశేషమే. వాదకుశలులు మేధావులు నగువారు పూని పుష్పితవాక్యంబుల గంధర్వనగరంబు నిర్మించుటచే నోరుగంటి వారివాద మింతదూరము పెరిఁగినది కాని లేనియెడల నెన్నఁడో యుహ్వెనిన నెగిరిపోయి యుండును.

తాము బమ్మెరపోతరాజు వంశమువార మని నెల్లుట్లవారు చెప్పుచుండుట ప్రత్యక్షప్రమాణము గాదా యని పంతులవా రడుగవచ్చును. నిస్సందేహముగ నున్న యెడల నది ప్రమాణమే. అయినను నోరుగంటివాది యైనరావుబహదర్ కందుకూరి వీరేశలింగము పంతులవారు "శేషాద్రిరమణకవులు కృష్ణాపత్రికలో నెల్లుట్ల నారాయణకవినిగూర్చి వ్రాయునపుడును తత్పూర్వమున నెల్లుట్ల నృసింహ రావుగారినిగూర్చి వ్రాసినపుడును వారు బమ్మెరపోతరాజువంశమువారని వ్రాసి యున్నారు. ఈకథ యెంతమాత్రమును విశ్వాసార్హ మైనదికాదు" అని వ్రాసి యున్నారు. రావుబహద్దర్ వారి వ్రాఁతను నేను స్వతంత్రవిమర్శనము చేయక నమ్మఁజాలనుగావున నిప్పు డింతమాత్రము చెప్పఁగలను. నెల్లుట్లవారినిగుఱించి యోరుగంటివాదులు వారిలో వారే వాదులాడునపుడు నే నెవరివాక్యము ప్ర మాణ మని గ్రహింపఁగలను ? వారితగవు పరిష్కారమగువఱ కది నిస్సందేహ మైనప్రమాణము గాదు కావునఁ ద్రోచివైచితిని. రావుబహద్దర్ వారి వ్రాఁత యోరుగంటివారివాదమునకుఁ బిట్టపిడుగై వారి కుండినయొకయాధారమును నాశముచేసినది.

8. నేను భాగవతసీసపద్యము నుదాహరించినపిమ్మటఁ బోతనకుఁ బ్రత్యక్షమైనదేవుఁడు కోదండరాముఁ డనుమాట సత్యమే యని యంగీకరించిరి గాని "కోదండరాముఁ డొంటిమిట్టలో మాత్రమే వెలసియుండలేదు. అనేకగ్రామములలోఁ గోదండరామస్వామియాలయములు గలవు. కావునఁ గోదండరామస్వామి యున్నంతమాత్రమున నొంటిమిట్టకోదండరామస్వామియే యని సిద్ధాంతము చేయ న్యాయ్యము కాదు." అని పంతులవారు వ్రాసిరి.

రామయ్యపంతులవారు వారిప్రథమవ్యాసములో బొమ్మెరలోని పోతరాజునుబట్టి కవి కానామము వచ్చియుండవచ్చు నని వ్రాసిరి. దానికిఁ బ్రత్యుత్తరముగ నేను బోతరాజు గ్రామగ్రామములో నుండుటచే నేపోతరాజునుబట్టియైనఁ గవి కాపేరు వచ్చియుండవచ్చు నంటిని. అనఁగా నొంటిమిట్టలోను దక్షిణాంధ్రగ్రామములలోను గ్రామదేవత లుండుటయు జాతరకాలములోఁ బోతరాజు లూరేఁగుటయు సర్వజనవిదితము. కావున నొంటిమిట్టలోని పోతరాజునుబట్టి కవి కానామము వచ్చి యుండవచ్చు నని వ్రాసితిని. నావాక్యమునకు బదులువాక్యమును బంతులవారు వ్రాసిరిగాని దానివలనఁ దమవాదమునకుఁ గలుగులోటు విచారింపరైరి. వివాదగ్రామము లోరుగల్లు ఒంటిమిట్ట బొమ్మెర. పోతరాజునకుఁ బ్రత్యక్షమైనదేవుఁ డీగ్రామములలోని వాఁడనుట సమంజసమో దేశాంతరగ్రామాంతరవాసి యనుట సమంజసమో మీరే యాలోచింపుఁడు. ఓరుగల్లు బొమ్మెరలందుఁ గోదండరామాలయములు లేవు. ఒంటిమిట్టయం దున్నది. ఇప్పు డెచ్చటిదేవుఁడు ప్రత్యక్ష మయ్యెననుట సంభావనీయమో మీరే యోజింపుఁడు.

9. "విగ్రహములు ప్రతిష్ఠింపఁబడినక్షేత్రములపేర్లు సూచింపఁబడని యెడలఁ గృతిపతు లర్చావిగ్రహములు కా వనియే యూహింపవలయు" నని మఱియొక యాక్షేపము.

ఈయూహ సత్యము గాదనుటకు నెల్లూరిహరిహరనాథతిక్కన లేసాక్షులు. మఱియొకసాక్ష్యము భానుమతీపరిణయంబున

ఉ. శ్రీలఁ జెలంగుసత్త్వగుణశీలత నిర్మలమూర్తివయ్యు మై
నీలరుచు లవహించితివి నీమదిలోపలి నీలకాంతు లీ
లీలఁ బ్రకాశమయ్యెను భళీ యనుశ్రీయలిమేలుమంగ కాం
తాళమరీచి యొమ్మునను దాల్చిన వేంకటభర్తఁ గొల్చెదన్."

అని యున్నది. ఇది "వెలుగోటి రాయశౌరి" కంకితము. ఆపుస్తకమం దెక్క-

డను దిరుపతిపేరుగాని వేంకటేశ్వరాలయములుండు మఱియే యూరిపేరుగాని లేదు. అలిమేలుమంగా శ్రీవేంకటేశ్వరు లర్చావిగ్రహములు కావని పంతులవారనఁగలరా ?

10. ఒంటిమిట్ట దేవాలయములో సీతారామలక్ష్మణవిగ్రహము లున్నవనియుఁ బోతరాజు లక్ష్మణవిగ్రహముమాట తలపెట్టలేదు గావున నొంటిమిట్ట దేవాలయములోని విగ్రహ మాతని (పోతన) మనస్సులో లేదనియే చెప్పవలసియున్నది." అని మఱియొక యాక్షేపము. దీనికి నాసమాధానము.

రామదాసుని జెఱనుండి విడిపింప రామలక్ష్మణులుమాత్రమే ప్రత్యక్షమైరి గనుకను, భద్రాద్రి రామస్వామిదేవాలయమున సీతారామలక్ష్మణు లుండుటచే రామదాసును రక్షించినవారు భద్రాద్రివాసులు గారని పంతులవారు చెప్పఁగలరా ?

లోక మంతయు నమ్మెడునిది పంతులవారికిఁ బ్రమాణము గాదేని "శ్రీవాసజ్జటప్రోలీ భావుకపత్తనవిహారపటుశీలున" కంకిత మీయఁబడిన చంద్రికాపరిణయంబున

"అని యిష్టదేవతావందనంబును............గావించి యేనొక్క మహాప్రబంధనిబంధనంబున కుద్యోగించి యున్నతత్పూర్వరాత్రంబున

సీ. పరువంపునసగుంపు బలితంపు జిగిపెంపుఁ గనియొప్పు పాణియుగ్మములతోడఁ
జెలువందునరవిందములయందములు చింద నసువొందఁ గలకన్నుఁగొనలతోడ
జగడంబు గనునంబుముగయంబు జగడంబు మేలంబు లాడునెమ్మేనితోడఁ
దులకించుబలుమించుఁదలఁకించుసెఱమించుగమిమించు హేమాంశుకంబుతోడ
మారుఁబలుమాఱుఁ గేరుమైతీరుతోడ సోమునలయించునెమ్మోముగోముతోడఁ
బరఁగుమాపాలిమదనగోపాలమూర్తి యంచితస్ఫూర్తి సాక్షాత్కరించిపలికె."

అని యున్నది దేవాలయమందుఁ గృష్ణవిగ్రహముతోడ రుక్మిణీవిగ్రహము నున్నది. ఇచ్చట రుక్మిణిపేరు కవి తలంపఁడయ్యెఁ గావునఁ గవికి సాక్షాత్కరించినదేవుండు జటప్రోలిమదనగోపాలమూర్తి కాదనఁ బంతులవారు సాహసింతురా ? ఈయుక్తులు పంతులవారిప్రతిభ యత్యద్భుత మనియుఁ బాదిలోనమ్మలు తుయించిన వనియుఁ దెలుపుచున్నవి.

11. భువనగిరికి నేకశిలానగర మనునామ మెట్లయిన నేమి పంతులవా రంగీకరించిరి. బమ్మెరపోతరాజు మాఁగ్రామమువాఁ డనియు, దానిని లోకమున రూఢిపఱుచుటకే యేకశిలానగర మని యాయన వ్రాసెననియు భువనగిరివాసులు చెప్పినఁ బంతులవా రేమి ప్రత్యుత్తర మిచ్చెద రని యడిగితిని. దానికిఁ బ్రత్యుత్తరము లేదు. భువనగిరికి నేకశిలానగర మనునది యిటీవల సాధింపఁబడినదఁట. ఎప్పుడు? ఎవరిచేత? అకఁడ నొంటిగుట్ట పుట్టిన దెపుడు? రెంటికి నర్థములో భేదముండిన నేమిదోషము? భిన్నకారణములచే భిన్ననామములు రారాదా? ఇవి పంతులవారు దెలుపరైరి.

భువనగిరికి నేకశిలానగరమున కేమిసంబంధమని కడపలో సభలో నేనడిగినపుడు భువనగిరియం దేకశైల ముండుటచే దాని కాపేరు వచ్చె నని పంతులవారు చెప్పలేదా? ఇప్పు డర్థభేదము కల దనుచున్నారు. ఆభేద మేదియో తెలుపరైరి.

ఏకశిలానగర మనుపేరు భువనగిరికి, నోరుగంటికి, నొంటిమిట్టకుఁగూడఁ గలదని నావాదము. ఒంటిమిట్ట కాపే రీవివాదము పుట్టకముందే పుట్టిన దనుటకై

(1) పురాణము హయగ్రీవశాస్త్రిలవారిభాగవతపీఠిక.

(2) Madras Manual of Administration.

(3) స్కాందపురాణము నుండి తెనిఁగింపఁబడిన యేకశిలానగరమాహాత్మ్యము పద్యకావ్యము.

ఈమూఁడును బ్రమాణములుగ నిచ్చితిని. ఈమూఁటియందును నేను వ్రాసినట్లు లుండుట సత్యమని యంగీకరించుచు రామయ్యపంతులవారు కొన్ని యాక్షేపములు వ్రాసిరి.

అందు (1) "ఈమూఁడుగ్రంథములలో హయగ్రీవశాస్త్రిగారిపీఠికయే ప్రప్రథమము. ఇది యైన నిప్పటి కఱువదితొమ్మిదిసంవత్సరములకుఁ బైగాఁ బుట్టినది. పోతరా జొంటిమిట్టనివాసియగునో కాఁడో హయగ్రీవ శాస్త్రిగారు స్వయముగ నెఱిఁగియుండరుగదా. ఏకారణములంబట్టి తమ కాయభిప్రాయము గలిగెనో యాయన చెప్పియుండలేదు" అని పూర్వపక్షము. దీనికి నాప్రత్యుత్తరము. హయగ్రీవశాస్త్రిలవారు బమ్మెరపోతరాజుసమకాలికు లని నేను జెప్పలేదు. వారిది సృష్టించినారని పంతులవారును జెప్పసాహసింప లేదు. ఏకారణములంబట్టి

యాయనకాయభిప్రాయము కలిగెనో యాయన చెప్పియుండలేదనుట సరిగాదు. వారు స్పష్టముగ "ఈవిషయమంతయు బమ్మెరపోతనామాత్యుని జన్మకర్మప్రభావాదులం దెలిపెడు వచనరూపం బగుప్రాచీనపండితజనలిఖితగ్రంథంబు రప్పించి యందుఁ దెలిపియుండెడు క్రమమున నతిసంగ్రహముగా నిందు తెలుపఁబడినది" యని యిట్లు వ్రాసియే యున్నారు. ఈవాక్యమును నేను దమకుఁ గనఁబఱిచిన భాగవతమునుండి యెత్తి తమపుస్తకములో వ్రాసికొనియుండియు నిట్లు వ్రాయుటయేలొకో? వృథావాదము పెంచుటకా? ఒంటిమిట్ట వారి వాదము మఱింత బలపఱుచుటకా? దీనివలన హయగ్రీవశాస్త్రిలవారు స్వకపోలకల్పన మేదియుఁ జేయలేదనియుఁ గేవలజనశ్రుతిని నమ్మి వ్రాయలేదనియుఁ దమమనుష్యులఁ బంపి వారు వ్రాయించి తెప్పింపలేదనియుఁ బ్రాచీనపండితులు లిఖితరూపముగ వ్రాసియుంచిన దాని నాధారము చేసికొని వ్రాసిరనియు నందు బమ్మెరపోతరాజొంటిమిట్టనివాసి యని వ్రాయఁబడియున్నదనియు, శాస్త్రిలవారు భాగవతపీఠిక వ్రాయుటకుఁ జాలకాలము ముందే యీవిషయము లిఖితగ్రంథరూపంబున దేశంబున విరాజిల్లుచుండె ననియు స్పష్టపడియెను.

హయగ్రీవశాస్త్రిలవారు నిరాధారముగ వ్రాసిరని కల్పించుకొని రామయ్యపంతులవారు మఱియు నిట్లు వ్రాసిరి.

"ఆయన కడపమండలమందుఁ బుట్టినవాఁడు కాకపోయినను గొంతకాలము కార్యవశమునఁ గడపలో నివసించియుండి రని వారి బంధుకోటిలోనివారగుచదలువాడ సుందరరామశాస్త్రిగారు చెప్పుచున్నారు. ఆకాలమం దీప్రతీతిని హయగ్రీవశాస్త్రిగారు కడపలో వినియుండవచ్చును."

హయగ్రీవశాస్త్రిలవారు తమకుఁ గలయాధారము చెప్పియుండుటచే నిదంతయు నాకాశపంచాంగమే. అయినను హయగ్రీవశాస్త్రిలవారు కడపలో వసించినారనుట కల్ల యని కొందఱు పుదూరుద్రావిడులు నాతోఁ జెప్పియున్నారు. ఈవిషయము కడపలోనే పంతులవారికిఁ జెప్పితిని.

" ఈప్రతీతిని హయగ్రీవశాస్త్రిగారు కడపలో విని యుండవచ్చు" నని పంతులవారు వ్రాయుటచే జగద్విశ్రుతప్రతీతి చిరకాలముగ నున్నట్టే పంతులవారంగీకరించిరి. ఇట్టి దోరుగంటికిఁ గుందేటికొమ్ముకదా. బ్ర॥శ్రీ॥సుందరరామశాస్త్రిలవారిని మీ రిట్లుచెప్పుట కేమియాధార మని పంతులవా రడిగిరా? అడిగియుండినచో గుట్టు బయటఁబడి యుండును. కొందూరు శ్రీనివాసశాస్త్రిగారికి ముం

దు కడపలోఁ బుదూరుద్రావిడులు లేరని యనేకులు చెప్పియున్నారు. సుందర రామశాస్త్రులవారి యుత్తరమును మీరు ప్రకటించెదరేని దానికిఁ దగినప్రత్యుత్తరము నేనును బ్రకటించెదనని పంతులవారితోఁ జెప్పితిని. దానిని వారు ప్రకటింపమిచే నది విమర్శనక్షమము గాదని యేర్పడెను.

(2) Madras Manual of Administration లోని వ్రాఁతకును హయగ్రీవశాస్త్రులవారిపీఠికయే కారణమై యుండవలయునని యాక్షేపము. ఇదియుఁ బంతులవారియూహ. ఈవ్రాఁతకు శాస్త్రులగారిపీఠికయే యాధారమో లేక పీఠిక కాధారమైనవచనగ్రంథమే యాధారమో లేక మఱియేదైనఁ గలదో. ఎటుచూచినను నొంటిమిట్టపక్షపాతులచే నీగ్రంథము వ్రాయఁబడిన దని పంతులవారు చెప్పఁజాలరు. ఇట్టి దోసుగంటికి నా కాశపుష్పముకదా ?

(3) ఏకశిలానగరమాహాత్మ్యములోనికథ కొంత విలక్షణముగా నున్న దని యొంటని, మిట్టని చరిత్రము వ్రాసి "దీనినిబట్టి యేకశిలానగర మనుపేరు రామతీర్థముపైఁ గప్పినరాతినిబట్టి పుట్టినదిగాని యొంటిమిట్టకు భాషాంతరము గాదని తేలుచున్నది. ఈవ్యుత్పత్తి సుబ్బరావుగారి మతానుసారము గాదు" అని రామయ్యపంతులవారు వ్రాసిరి. ఒంటిమిట్టకు నేకశిలానగర మను పేరు వచ్చుటకు నే నిదివఱకుఁ జెప్పినకారణములు గాక యిది క్రొత్తది. దీనిని నేను వ్రాయమఱచితిని. నేను జేయవలసినపని పంతులవారు చేసిరిగావున వారికి నమస్కారము. ఇది నామతానుసారము గాదనుట సరిగాదు. రామతీర్థముపై మూసినది యేకశిలగదా. ఈవ్యుత్పత్తివలన నావాదమున కేహానియులేదు. ఒంటిమిట్టకు నేకశిలానగర మనుపేరు లేదని చెల్లదని పంతులవారివాదము. ఒంటికొండ యొంటిబండ సిద్ధముగానున్నవి. పంతులవారి కేది సరిపడిన దానినే గ్రహింపవచ్చును.

12. "ఈగ్రంథము స్కాందపురాణము ననుసరించి రచింపఁబడినది గావునఁ బరమప్రమాణ మని సుబ్బారావుగారివాదము. స్కాందపురాణమును గవి చూచియుండలేదు. దానినిబట్టి యెవరో వ్రాసినారన్నవచనమునుబట్టి గ్రంథము రచించినాఁడఁట. స్కాందపురాణ మన దిక్కులేనిక్షేత్రమాహాత్మ్యముల కెల్ల దిక్కు. కావుననే యఱవమున "ఈపాయికందపురాణ త్తిలియు మిల్ల" (ఈకల్ల స్కాందపురాణమునందును లేదు) యనుసామెత పుట్టినది." అని రామయ్యపంతులవారు స్కాందపురాణముపై దెబ్బతీసిరి. ఈవిషయమున నేను జెప్పవలసిన

దింతయే. తెనుఁగున నేకశిలానగరమాహాత్మ్య మీవాదము పుట్టుటకుముందే పుట్టినది. ఆకవి సంస్కృతస్కాందపురాణమున నుండుదానిని దెనిఁగించెద నని వ్రాసియున్నాఁడు. ఆవిషయకపద్యమును ప్రథమభాగమున ననువదించితిని.

ఇఁక స్కాందపురాణము ప్రమాణగ్రంథ మగునా కాదా యనుట లోకము పరిష్కరింపవలెను. అది యప్రమాణగ్రంథ మయ్యెనేని కాశీత్యాది క్షేత్రము లన్నియు దిక్కుమాలినవే.

స్కాందపురాణములోని దగుటచే నొంటిమిట్ట మాహాత్మ్యము కల్లగ్రంథమనిగదా వారివాదము. వారే వేములవాడ క్షేత్రమాహాత్మ్యములో "నా స్థలమునకు దక్షవాటి యనుసంజ్ఞ కూడఁ గలదు" అని కొన్నిశ్లోకముల నుదాహరించి యవి భవిష్యోత్తరపురాణములో నున్నట్లు వ్రాసిరి. ఈభవిష్యోత్తరపురాణము బొంబాయిలో వేంకటేశ్వరముద్రాక్షరశాలవారు ప్రకటించియున్నారు. దీనిలో నీవేములవాడ క్షేత్రమాహాత్మ్య మేపుటయందున్నదో తెలుపఁ బంతుల వారిని బ్రార్థించుచున్నాఁడను. ఈ వేములవాడకుఁ బూర్వపూర్వతరజన్మంబుల లేములవాడయనియు లేమలవాడయనియు లేమ్బలవాడ యనియుఁ బేర్లని పంతులవారు వ్రాయుటచే వీనికి సంస్కృతనామము లైననింబవాటి, దౌర్భాగ్యవాటి, లంజికావాటి యనుపేర్లా గ్రంథమున నున్న వేమో యని వెదకి వ్యర్థప్రయత్నుఁడనైతిని. ఈనాకష్టమును బంతులవారు పుటసంఖ్య సూచించి సఫలముఁ జేయుదురుగాక. వేములవాడ మాహాత్మ్య మాయూరిపేర్లే తెలుపుచున్నవి. పురాణకథనమేల ? తొలుత లేమలవాడ, అక్కడ లంజలుండుటచే నీపేరు వచ్చెనని పంతులవారే సెలవిచ్చిరి. ఆవల "గుత్తలంజలను మరగినవారికి దుత్తేకడపట" ననుసారంగపాణివాక్యముచొప్పున నది లేములవాడ యయ్యెను. తరువాత నాదారిద్ర్యవాటి రుద్రవాటియై యందు వేఁపచెట్లు విశేషముగ మొలచుటచే వేములవాడ యయ్యెను. ఇట్టి వాటియఁట దక్షవాటియఁట!! మేలుమేలు ఇదిగదా స్థలభోగ మనునది. రాజేశ్వరుఁడు రాజ్యము చేయుకాలములో వాని ప్రీతికై రాజరాజేశ్వరమాహాత్మ్య మని భీమలింగ ముండుటచే గోదావరిమండలస్థదక్షవాటిపోలికగ వేశ్యావాటిని దక్షవాటిగ నెవఁడో మిథ్యావాదిసంస్కృతపండితుఁడు వ్రాసియుండవచ్చును. ఆయసత్యమును బలపఱుప భవిష్యోత్తరపురాణములో నున్నదని రెండవయసత్య మాడెను. పంతులవారి కది పరమప్రమాణమయ్యెను. రాజు మెచ్చినది రంభ. తాను మునిఁగినది గంగ. పంతులవారివలె

నేను బురాణదూషణముఁ జేయను. భవిష్యోత్తరపురాణములో వేములవాడ మాహాత్మ్యము లేదందును.

గోదావరిలోని దక్షారామము మాహాత్మ్యము శ్రీనాథుఁడు తెనిఁగించెను. అది స్కాందపురాణమునుండి గ్రహింపఁబడినది కావున శ్రీనాథునికృతము దబ్బఱగ్రంథమే పంతులవారియభిప్రాయప్రకార మగునుగాక. ఈవిషయమున నాకు మఱొకసందేహము. హరిద్వారమునొద్ద దక్షుఁడు యజ్ఞము చేసినస్థలమని ప్రతీతికలదు. దానిని నేను జూచియున్నాఁడను. అచ్చటివారందఱును వైదికులందఱును నదియే నిజమైన దక్షయజ్ఞవాటి యని విశ్వసించియున్నారు.

ఈవిషయముఁ బంచమవేదమున నీశ్లోకములు గానవచ్చుచున్నవి.

> కస్యచి త్త్వథకాలస్య దక్షో నామప్రజాపతిః
> పూర్వోక్తేన విధానేన యక్ష్యమాణో న్వపద్యత
> తత స్తస్యమఖం దేవాః సర్వే శక్రపురోగమాః
> గమనాయ సమాగమ్య బుద్ధి మాపేదిరే తదా
> తే విమానై ర్మహాత్మానో జ్వలనార్కసమప్రభైః
> దేవస్యానుమ తేఽ గచ్ఛ న్గంగాద్వార మితిశ్రుతిః

గంగాద్వారమునకే హరిద్వారమనియుఁ బేరు:—దీనివలనఁ బంతులవారి పురాణము బవిసి తెలియవచ్చెఁగదా. గంగాద్వారమున గోదావరీద్వారమని పంతులవా రనరుకదా.

ఇప్పు డీరెంటిలో నేది నిజమైనదక్షవాటిగా నుండునో పంతులవారే నిశ్చయింప సమర్థులు. వేములవాడ దక్షవాటి యనుట పచ్చిదబ్బఱ. ఇట్టిదబ్బఱ స్కాందమందును లేదనుట యిట్టిసందర్భములనుబట్టి వచ్చినది. హిమవత్ప్రాంతమున ఋషివాటికల నడుమ గంగాతీరంబున దక్షుఁడు యజ్ఞముచేసియుండ లంజలవాడలో నిసుపగజ్జెలతల్లి తాండవమాడుచోట వేఁపచెట్లనడుమఁ జేసియుండు ననుట మెట్టిసాహసము. స్థలమాహాత్మ్యముల రహస్య మంద తెలిసింగినదియే. అద్దపుటిండ్లవసించునా రితరుల జూలఱువ్వరాదు.

13. "దీనినిబట్టి యేకశిలానగరమనుపేరు రామతీర్థముపైఁ గప్పినదానిని బట్టి పుట్టినదిగాని యొంటిమిట్టకు భాషాంతరము కాదు" అని పంతులవారు వ్రాసిరి. గ్రామములకు వివిధకారణములచే వివిధనామములు వచ్చు నని నా వాదము. ఆవిషయము ప్రథమభాగములో వ్రాసియున్నాను గావున నిపుడు

చర్విత చర్వణము చేయను. వెలిగందల వేములవాడను దక్షవాటి యని పేరున్న దని పంతులవారు వ్రాసిరిగదా. లేమ్బులవాడ, లేమలవాడ, లేములవాడ, వేములవాడ, యనువానిలో దేనికి దక్షవాటి యనునది భాషాంతర మో తెలుపఁ బంతులవారిని వేఁడుచున్నాను.

14. "ఈగ్రంథములు మూఁడును బ్రస్తుతవాదము విజృంభింపక పూర్వమే పుట్టినవి కావునఁ బ్రమాణములని సుబ్బరావుగారు వాదించుచున్నారు. ఈ వాదము శాస్త్రసమ్మతము కాదు" అనియు ఆయన (పోతరాజు) కీర్తిశేషుఁ డైన నాలుగువందలసంవత్సరములకుఁ బైనిఁ బుట్టినపురుషుఁ డావిషయము నిజమెఱిఁగియే వ్రాసెనని యెట్లు నమ్మవచ్చును" అనియుఁ బంతులవారు వ్రాసిరి.

హయగ్రీవశాస్త్రిలవారు పోతరాజునకు ౮౦ సంవత్సరముల కీవలఁ బుట్టుట సత్యము. హయగ్రీవశాస్త్రిలవారికి ౨౦ సంవత్సరముల కీవల రామయ్య పంతులవారు పుట్టుటయు సత్యము. తమకు ముందుండిన "ప్రాచీనపండితులు" వ్రాసినదాని నాధారముచేసికొని వ్రాసినవారు హయగ్రీవశాస్త్రిలవారు. ఎవరో చెప్పినపుక్కిటిపురాణములనమ్మి ౫౦౦ సంవత్సరముల కీవలఁ బగ లాకాశమెగఁ జూచి యోరుగంటిపంచాంగము వ్రాయఁబూనినవారు పంతులవారు. ఈ రెంటిలో నేది యెక్కువవిశ్వసనీయము. ఈవాదము రాకముందు పోతన యోరుగంటివాఁడని యెవ్వఁడైన వ్రాసియుండెనా?

15. "పోతరాజు జీవించియున్నపుడుగాని యాతఁడు గతించిన పిమ్మటఁ గొంచెముకాలమునకుఁ గాని యీగ్రంథములలో నేదైనఁ బుట్టి యుండినచోఁ బోతరాజు జన్మస్థానవిషయము గ్రంథకర్త సత్యమెఱిఁగియే వ్రాసియుండునని యూహింపవచ్చును." అని పంతులవారు వ్రాసిరి.

ఇది ప్రమాణవాక్యమగునేని యాంధ్రకవులచరిత్ర మేగతిఁ బట్టునో. మఱియొకరి ప్రశంస యేలగాని వేములవాడభీమకవికి రామయ్యపంతులవారు సమకాలికులా? పిమ్మటఁ గొంచెము కాలమువారా? పోతనకు హయగ్రీవశాస్త్రులకు ౮౦ సంవత్సరము భేదముండిన భీమన్నకు రామయ్యపంతులవారికి ౭౦౦ సంవత్సరము లెడము. హయగ్రీవశాస్త్రిలవారికి లభించినట్లు ప్రాచీనపండితలిఖిత గ్రంథ మేదైనఁ బంతులవారికి దొరకెనా. ఏమి యెఱిఁగి వీరు భీమకవిస్థలము నిర్దేశింప సాహసించిరి? విషయము తమకు ననుకూలమైనచో శాస్త్రసమ్మతము ప్రతికూలించినచో శాస్త్రసమ్మతము కాదు కాఁబోలు. భీమకవిని గుఱించి నేను

ప్రస్తావించుట పంతులవారివాదమునందలి యసంగతదోషము తెలుపుటకే గాని యావాదమునందు నాకభిమానము గలిగి కాదు. భీమకవివాసస్థాననిర్ణయమున నాకుఁ బట్టుదల లేదు

16. "ఒంటిమిట్టవాకుల కేకశిలానగరశబ్దము వ్యుత్పత్తియే కుదిరినది కా" దఁట. మేలుమేలు. నావ్యాసమును బంతులవారు చక్కఁగనే పఠించిరి! !

"ఏకశిల యనునది యొంటిమిట్టకు సంస్కృతరూపమని సుబ్బరావుగారి సిద్ధాంతము." అవును. దీనిని బంతులవారు ఖండింపఁజాలరైరి. మూఁత వేయఁబడినరాతినిబట్టి వచ్చినదని పంతులవారే యంగీకరించి వ్రాసిరి. అందేమియు దోషమును జెప్పినవారుకారు.

"దేవాలయములోని సీతారామలక్ష్మణవిగ్రహములు మూఁడును నేకశిలానిర్మితము లగుటనుబట్టి యేకశిలానగరనామము గ్రామమునకుఁ గలిగిన దని మూఁడవవ్యుత్పత్తి నొకదానిని సుబ్బరావుగారు కల్పించినారు" అని పంతులవారు నాపై నొకదోషము కల్పించినారు. ఇట్లు వారు వ్రాయుటకుఁ గారణము తమవాద మంతయు ఖండితమయిన దనుమొఱమొఱచే నావ్యాసమును నఱిగొఱిగాఁ జదువుటయే కాని యసత్య మాడవలయు ననుతలంపునఁ గాదని నేనెఱుఁగుదును. అటు గాకున్న "ఇది నాకల్పితము గాదు" అని నేను స్పష్టముగ వ్రాసియుండ వా రిట్లు వ్రాయుదురా ? నేను వ్రాయుటకు నాలుగుసంవత్సరములకుముందు హిందూపత్రికలో మాననీయులగు దివాన్ బహదర్ కేశవపిళ్లగారు వ్రాసియుండ దానిని ననువదించితిని. అది వీరు చదివినట్లే లేదు. సత్యబలము గలయొంటిమిట్టవాదులకుఁ గల్పనలు నపోహములు చేయ నక్కఱలేదు. నావ్యాసమును వీరు చక్కఁగఁ జదువని కారణముచేతనే యభిప్రాయము మార్చుకొనఁ గారణము లేదని వ్రాసి చెప్పినదే చెప్పి వ్రాసినదే మరల వ్రాసి వృథావాదము పెంచిరి. అంతియగాక "సీతారామలక్ష్మణవిగ్రహములు మూఁడు నేకశిలానిర్మితము లన్నమాట సరిగాదు" అనిరి. పంతులవా రిచ్చటఁ బొరపడిరి. నావ్యాసము చదువ నియమిత మైనదినమందు సాయంకాలమునఁ బ్రొద్దుటూరు కచ్చేరిలో నీకార్యార్థమై సత్య మారయ నొంటిమిట్టకుఁ బోయి వచ్చిన నెందలూరు న్యాయవాదులు లోనగువారు (బ్ర॥ శ్రీ॥ పరశురామరావుగారు ప్రముఖులు) తాము కోవెలలో విగ్రహములకుఁ బ్రదక్షిణించి పరిశీలించి వచ్చితి మనియు మూఁడు విగ్రహములు నేకశిలానిర్మితము లనుటకు నాధారముగ

మూఁడువిగ్రహములకు వెనుక ప్రక్కన నొకే చాఱ యవిచ్ఛిన్న మని తోఁపఁ జేయున ట్లున్నదనియుఁ జెప్పినపుడు పంతులవా రచ్చట లేరేమో. ఏకశిలానిర్మితములన మూఁడువిగ్రహములు కాలుసేతులు పెనవేసికొని పోఁతబొమ్మలయందో కొన్నిపటములయందో కొన్నిరూపములు గానవచ్చువిధ మని పంతులవా రభిప్రాయపడి రని తోఁచుచున్నది. నాయభిప్రాయ మది కాదు. విగ్రహములు మూఁడును వేఱువేఱుగాఁ గానవచ్చుచున్నను నేకశిలవలన నుత్పన్నములైనవని నాయభిప్రాయము. ఇది సత్యమో యసత్యమో యిప్పుడు పోయి పంతులవారు పరీక్షింపవచ్చును. ఈసందేహము నాకక్కడనే వారు తెలిపియుండినఁ బ్రత్యక్షముగఁ జూపియుందును. పోనీ, ఈవ్యుత్పత్తి తమకు సమ్మతము గాదేని నేను జెప్పినతక్కినవ్యుత్పత్తులను దాము నిరాకరింపఁజాలకుండియు "రామతీర్థముపై మూఁతవేయఁబడినరాతినిబట్టి యేకశిలానగర మనుపేరు పుట్టినది" "ఒంటిమిట్ట కేకశిలానగరమని స్థూలదృష్టిచే నర్థము చెప్పవచ్చును" అని తామేవ్రాసియు వ్యుత్పత్తి కుదిరినది కాదనుట యేమివాదచమత్కారము!!

17. నగర మనుపే రొంటిమిట్టకుఁ జెల్లునని కొన్ని కారణములు చెప్పితిని. గ్రామ మెంతవఱకు వ్యాపించియుండినది వ్రాసితిని. రామయ్యపంతులువారు విచారించినపుడు దేవాలయమునర్చకుఁడు గ్రామ మెంతవఱకు వ్యాపించియుండుటయు ననేకులు జనులు వచ్చి పోతన నివసించియుండినచోట నుండుచెట్టునకుఁ బ్రదక్షిణించి కర్పూరపుటారతులిచ్చి యర్చించి పోవుచుండుటయుఁ జెప్పెను. గురవయ్యగారును మఱియొక్కప్రక్కఁ 'గోటలోనిచేలు' కోటమధ్యమున నుండె నని చెప్పిరి. వీనినంతయుఁ బంతులవారు తుంగలలోఁ ద్రొక్కి "నడుమఁ గల్పింపఁబడునామము లన్వర్థముగానే యుండు ననియు నొంటిమిట్ట పూర్వము గొప్పపట్టణముగా నున్నట్లు నిదర్శనములు గానరావనియు నాప్రత్యుత్తరము" అని వ్రాసిరి.

ఈవిషయమునఁ బంతులవారి నొకటి రెండుప్రశ్న లడిగెదను. వానికి వారు చెప్పెడుసమాధానములే వారికిఁ బ్రత్యుత్తరములు కాఁగలవు. "ఏకశిలానగర మనుపేరు రామతీర్థముపైఁ గప్పినరాతినిబట్టి పుట్టినది" అని వారేవ్రాసిరి కదా? అంతకుఁ బూర్వ మచ్చట గ్రామము లేదని యడవి యని వారే వ్రాసిరి కదా? ఇప్పుడు గ్రామము, గ్రామనామము కూడఁబుట్టినవా లేక గ్రామనామము నడుమ వచ్చినదా?

ఏకశిలానగర మనునది పాఱువేటకొండనుబట్టి వచ్చినదికదా. కొండ ముందా గ్రామము ముందా ?

విగ్రహములంబట్టి పేరువచ్చినదని వ్రాసితినిగదా. విగ్రహములు ముందా గ్రామము ముందా ? పంతులవారు తామేమివ్రాసిరో దానినైన మఱియొకపరి చదువుదురుగాక!

ఇన్నివిధములనను నేకశిలానగరనామము నసుమ వచ్చినది కాదని యేర్పడెను.

పూర్వపుగ్రామము వివరిం యిదివఱకే వివరించితిని. పొత్తపినాడని ప్రసిద్ధిగదా. పొత్తపి రాజస్థాన మయినట్టు చరిత్రములే చెప్పుచున్నవిగదా. ఇట్టి పొత్తపి యిప్పటియొంటిమిట్టయంత యున్నదా. హస్తినాపుర మిప్పు డెట్లున్నదో పంతులవా రెఱుఁగరా ? ఇట్టి దృష్టాంతము లెన్నికావలయును ?

18. ఓరుగంటికి నోరుగంటి యనిపే రున్న దని సాధింపఁ బంతులవారు చాల శ్రమించినారు. కాని యది ప్రస్తుతవివాదమునకు సంబంధించినది కాదు. అది యోరుగల్లయినను నోరగల్లయినను మఱియేకల్లయినను నావాదమునకు రాఁగలలాభనష్టములు లేవుకావున నాచర్చ వ్యర్థము. ఓరు శబ్దము లేదని కొంద అన్నందున దానికి గతి కల్పింప యత్నించితినికాని యది నావాదమును గెలిపించునని కాదు.

19. భోగినీదండకకృతిపతి యగుసర్వజ్ఞసింగమనీఁ డోరుగంటిప్రాంతము వాఁడు గావునఁ దత్కృతికర్త యగుపోతరాజును నాప్రాంతము వాఁడే యైయుండు ననువాదమును నాప్రత్యుత్తరమును జూచి వదలుకొనిరి.

20. జనశ్రుతిప్రమాణ మోరుగంటికి లేదని వ్రాసియుంటిని. ఓరుగంటి వారివాద్గము బొమ్మెరవారివాద మొకటే యని పంతులవారు బదులిడిరి. పరస్పరవిరుద్ధవిషయము లుండునీరెండు నొకటి గాఁజాల దని యిదివఱకే వ్రాసితిని భాగవతము రెండుస్థలముల నేక కాలమున వ్రాయఁబడె ననుట యసంభావ్యము. రెండు నొకటిచేయ హనుమంతుఁడు రెండుకొండలమీఁద రెండుకాళ్లుంచిన దృష్టాంత మిఁకఁ జెప్పఁబడునేమో.

ఉభయగ్రామవాదము లొకటే యని పంతులవారి హస్తములు లిఖించినను, ఆవాదమునందలి బలహీనత యెఱిఁగియుండుటచే వారిమన స్సంతతోఁ దృప్తిపడకపోవుటచే "కేవలజనశ్రుతులు ప్రబలప్రమాణములు కావనియే నా మతము" అని మఱియొకయుక్తి వ్రాసిరి. ఓరుగంటివారికి జనశ్రుతిప్రమాణ

మభావమగుటను, నెల్లుట్లవారు బమ్మెరపోతరాజువంశమువారు కారని రావు బహాదర్ వారు వాదించుటచేఁ దమవాదమునకు నాధారములుగా నమ్మియుండిన తత్సంబంధజనశ్రుతులు వాక్యములు డీలుపడుటను నిట్లు వ్రాయవలసివచ్చెనుగాని వేఱుగాదు. ఇప్పటివీరిమతము తమవాదమును నేను బూర్వపక్షముచేసినతరు వాత నోరుగంటిదుర్బలస్థితి యెఱిఁగిన యీవల జనించినదా? తత్పూర్వమునుం డియు నున్నదా? పూర్వమునం దుండియుండుటయే నిశ్చయమయ్యె నేని బొమ్మెరలో జనశ్రుతి యున్నదని వ్రాసి దానికి నోరుగంటికి ముడిపెట్ట వ్యర్థముగ నేల శ్రమించిరి? తమ కనుకూలముగ వచ్చునది ప్రమాణము. అదియే ప్రతికూలముగ వచ్చినఁ బ్రమాణము కాదు కాఁబోలు. జనశ్రుతివిషయమునఁ బంతులవారి నిశ్చయ మేమో కవిజనాశ్రయపీఠికఁ జదివినఁ దెలియఁగలదు. అందు వేములవాడ భీమకవి గోదావరిమండలమువాఁడు గాఁడు గోలకొండదేశము వాఁడని స్థాపించు నపుడు తమకుఁ గల ప్రమాణముల నిట్లు పంతులవారు పేర్కొనిరి.

"భీమకవి వెలిగందలవేములవాడగ్రామనివాసి యని యాప్రాంతమందుఁ ప్రతీతి యుండుటంబట్టియు, గ్రంథావతారికలో భీమన తనయిష్టదైవము వేములవాడ భీమేశ్వరుఁడే యని చెప్పుటంబట్టియు, వెలిగందల వేములవాడలో భీమేశ్వరాలయ ముండుటవలనను, నాఁటికిని నేఁటికిని గూడ నాప్రాంతమందు జైనులయినకోమ ట్లుండుటచేతను భీమకవి యాదేశమువాఁడే యని నిర్ణయించుట కాక్షేప ముండఁగూడ దని నాయభిప్రాయము." ఈవాక్యములే గోదావరీమండలములోని వేములవాడపక్షపాతు లిట్లు వ్రాయవచ్చును.

"భీమకవి దక్షారామవేములవాడగ్రామనివాసియని యాప్రాంతమందుఁ బ్రతీతియుండుటంబట్టియు, గ్రంథావతారికలో భీమన తనయిష్టదైవము వేములవాడ భీమేశ్వరుఁడే యనిచెప్పెనుగాని వెలిగందల వేములవాడలోని భీమేశ్వరుఁడని నిరూపించి చెప్పకుండుటచేతను వేములవాడసమీపమున దక్షారామమం దనాదిప్రసిద్ధభీమేశ్వరాలయ ముండుటచేతను, జైనులైనకోమట్లు పూర్వము దేశమందంతట నున్నట్లే యిచ్చటనునుండి యిప్పుడు నామావశిష్టులైరి గనుకను భీమకవి యీదేశమువాఁడే యని నిర్ణయించుట కాక్షేప ముండఁగూడదని మా యభిప్రాయము" అని వ్రాసిన వారివాదమును బంతులవారెట్లు ఖండింతురో. జైను లాంధ్రదేశమున మఱెందు లేరని పంతులవారు పొరపడిరి. ఆరణియొద్ద

ననేకకుటుంబములేగాక జైనగ్రామములే యున్నవని తెలియవచ్చెడిని. ఒకవేళ నిప్పుడు లేకుండిన నింతకు 200 సంవత్సరములకుముందు గోదావరిమండలమున లేరనుట యేమిన్యాయము? అది యెట్లైన పోనీ నాకేల? నాకుఁ గావలసినది జనశ్రుతివిషయమే.

భీమకవివిషయ మైనజనశ్రుతి రెండు వేములవాడలలో నున్నది. అట్లుండియు దక్షారామము వేములవాడ జనశ్రుతికంటె వెలిగందలవేములవాడ జనశ్రుతి కేల పంతులవా రెక్కువప్రాశస్త్య మిచ్చిరో నా కూహింప రాకున్నది. ఒంటిమిట్టవారివాదమును బలహీనము చేయవలయునని కేవలజనశ్రుతి ప్రబల ప్రమాణము కాదనువారు దానినే తమ కిష్టమైనచోటఁ బ్రథమప్రబలప్రమాణముగ నెట్లు గ్రహించిరో? కేవలజనశ్రుతి నేను గ్రహింపలేదనియు దానికి సహాచరముల రెంటినిమూఁటిని గ్రహించితి ననియు బంతులవారందు రేని యొంటిమిట్ట వాదులును గేవలజనశ్రుతిని మీవలె మేము ప్రథమప్రమాణముగఁ గొనలేదనియు మీకు రెండుమూఁడుకారణములుండిన మాకు ౬-౭ కారణము లున్నవనియుఁ జెప్పుదురు. (ప్రథమభాగము చూడుఁడు). 'గతానుగతికోలోకో' యనుట వేములవాడయందుమాత్ర మన్వయింపదు గాఁబోలు.

పంతులవారి ట్లిప్పుడు వ్రాయుటకుఁ గారణము గలదు. నెల్లుట్లవారు బమ్మెరపోతరాజువంశ్యుఁ డని యక్కడి నెల్లుట్లవారు చెప్పిరని పంతులవారు తమ కనుకూలముగ వ్రాసిరి. భీమకవిచరిత్ర మొక వేములవాడలోనిది మఱియొక వేములవాడవారు విని యిది తమయూరిలో జరగినదని చెప్పుకొనునట్లే యొంటిమిట్టలో జరగినపోతనచరిత్రము సుప్రసిద్ధమయి జగమున వ్యాపింపఁగా నది తమగ్రామమందే జరగినదని యాయన తమవంశ్యుఁడని నెల్లుట్లవారు చెప్పుకొనున ట్లేర్పడెను. ఇప్పుడు రావుబహద్దర్ వీరేశలింగముపంతులవారు నెల్లుట్లవారు బమ్మెర పోతరాజువంశమువారు కారని వ్రాసిరి. బంధుత్వ మసత్య మైనపుడు పంతుల వారు చెప్పెడు తక్కినకథలు నసత్యములే యయ్యెను. ఆయాధారము పోయిన యెడల నోరుగంటివారివాదమున కాధారము క్రిందమన్ను మీఁదమిన్ను, నడుమ సున్న యయ్యెను. తమవాదమునకు వచ్చిన యీమహావిపత్తు తప్పించుకొన జనశ్రుతియందు మాకు విశ్వాసము తక్కువ యని పంతులవారనిరి. నెల్లుట్లవారిది జనశ్రుతియే కావున దానితో వారివాదము నేలపాలయ్యెను. రావుబహద్దర్

వారి వాదమును దాము ఖండించువఱకు నెల్లుట్లవారికి సంబంధించినదియు దాని ననుసరించినవియుఁ దమవాదమున కాధారములుగఁ బంతులవారు చెప్పరాదు. ఒంటిమిట్టవారివాదమునకు వారిరువురుసమానశత్రువులేకావున ముందాసుందోప సుందయుద్ధము కానిండు.

బమ్మెరపోతరాజు బొమ్మెరయందుండె ననుట జనశ్రుతినిబట్టియే కదా. శ్రీనాథపోతనసంభాషణము జనశ్రుతియే కదా. నల్లుట్లవా రట్లుపోయి యివి రెండు నిట్లుపోయినచో నోరుగంటివాదులకు నొంటిబండ (ఏకశిల) మాత్రము మిగిలినది.

21. భాగవతములోఁ బ్రయోగింపఁబడిన యాంధ్రశబ్ద విశేషము లుభయగ్రామములకు సమానము లని వారివాద మఁట. వారివాదమును నేను బూర్వపక్షము చేయలేదఁట. ఎంతటిదోష మొనర్చితిని! తొలుత నది యాధారముగ లెక్కించినవారు వారే. నేనుగాను. ఉభయులకు సమానమైనది నాకెట్లు హానికరము కాఁగలగు? దానిలో నేను ఖండింపవలసినదేమున్నది? అదట్లుండనీ.

కొన్ని పదములు ‘కోసరము’ మొదలైన వీప్రాంతమందు వాడుకలో నున్నవి గోలకొండదేశములో లేవని వ్రాసితిని. దానిని బంతులవారు పూర్వపక్షము చేయకుండుటచే నాశబ్దము లాదేశమున లేవనియంగీకరించినట్లేకదా. ఈయంగీకారము వారివాదమును దుర్బలపఱిచెఁగదా.

22. కడపటిదెబ్బ కమ్మని దెబ్బయని పంతులవా రొంటిమిట్టలోని పోతరాజు విగ్రహమునుగుఱించి “పాదములయందుఁ బద్మరేఖలును, గాళ్లకు ముంజేతులకు, గొలుసులు నున్నవి. భుజకీర్తులును, మెడలోహారములును గలవు. వడగలవైష్ణవులు ధరించునట్టి నిలువుబొట్టు నుదుటనున్నది. పోతరాజు రామభక్తుఁడైనను, శివపూజాతత్పరుఁడు, వైష్ణవచిహ్నమైననిలువుబొట్టు పెట్టుకొనియె ననుటకు వీలులేదు. గొలుసులు హారము తులసి పూసలపేరు లనుకొన్నచో శివపూజ చేయుచుఁ బోతరాజు తులసిపేరులు ధరించెననుటయు సమంజసము కాదు. సువర్ణాభరణము లని యూహింపవలసినయెడల నవియుఁ బోతరాజున కనుచితములే. కావున విగ్రహము పోతరాజుది కాదనియే చెప్పవలసియున్నది” అని వ్రాసిరి.

ఆర్యులారా! యిప్పటికి ౪౦౦ సంవత్సరములకు ముందు మనదేశములో ఛాయాగ్రాహిణీ యంత్రములు లేవు. ఈవిగ్రహములు వానినిబట్టి యథారూపముగ నిర్మింపఁబడినవి కావు. ఇప్పుడు నిర్మింపఁబడుచుండు శిలావిగ్రహము లెవరివని చెప్పెదరో వారిభార్యలు పుత్రులే యావిగ్రహములు తమభర్తలవలెఁ

దండ్రివలె లేవని చెప్పుచుండుట పంతులవా రెఱుంగరా ? ఇఁకఁ గవి యనంత రము వారిభక్తులు వారికిఁ దోఁచినట్లు వారి వారియభిప్రాయములకొలఁది నిర్మించినవానికి వంక లెన్నవచ్చునా ? బొమ్మెరయం దుండుబొడ్డురాయి సాక్షాత్పోత రాజవిగ్రహ మని పంతులవా రనఁగలరా ? రవివర్మవంటిచిత్రలేఖకుఁడు యోగి యగుశివునకు మీసము లుంచి క్షత్రియుఁడై రాజైనరామునకు మీసము లున్న ట్టు రామాయణములో నున్నను లక్ష్యపెట్టక చిత్రములకు లేకుండఁ జేసెను. శివునకు మీసము పెరిఁగినపుడు గడ్డ మేల పెరుఁగలేదు ? ఇప్పటినాగరకులలోఁ జేరి శివుఁడు ముఖక్షౌరము మాత్రము ప్రతిదినము స్వయముగఁ జేసికొనుచు న్నాఁడా ? కాదేని యాయన క్షౌరకునిపే రేమి ? మీసములు లేకుండుటకు శ్రీ రాముఁడు పేడివాఁడా ? ఈకారణములచే నవి శివరామచిత్రములు కావని పంతు లవా రనఁగలరా ?

భాష్యకార్లపటము నాయొద్ద నున్నది, వారు సన్న్యాసులుకదా ? వారి చేతుల బంగా రాభరణము లున్నవి. అటని శ్రీపెరుంబత్తూర్‌లో నుండురామా నుజవిగ్రహము వారిది కాదని యెవరైన ననఁగలరా ? అద్వైతులుగ నుండు ద్రావిడులు తిరుమణి శ్రీచూర్ణములు ధరించినవారిని బంతులవా రెఱుఁగరా? బమ్మెర పోతరాజు రామభక్తు లని పంతులవా రంగీకరించిరి. బమ్మెర పోతన సంతతివా రార్వేలనియోగులని రావుబహదర్ వారు వ్రాసిరి. అమాత్య, రాజు, శబ్దములనుబట్టి వీరివ్రాఁత నిజమే యని నమ్మవచ్చును. రామభక్తులైనయార్వేల నియోగులు తిరుమణి శ్రీచూర్ణములు ధరించుట పంతులవా రెఱుఁగరా ? మత మున శైవులుగా నున్నను పోతనపితామహులు మాతామహులు వారికాలము నాఁటికే మనమున వైష్ణవులని తమకుమారునికిఁ గేసన్న (కేశవన్న) యనియు కుమారికి (లక్కసాని)లక్ష్మియనియుఁ బేరులిడుటచే స్పష్టమగుచున్నది. ఇంతకు నాయన యేమినామము పెట్టుచుండెనో యెవ్వఁ డెఱుఁగును ? ఆయనకు వెనుక ౫౦౦ సంవత్సరములకు వచ్చినపంతులవారియూహ యెంతవఱకు సరియో యేమి యాధారము గలదని నమ్మవలయును ? ఇంతకు మీఁద నేనుజెప్పినట్టు జీవత్పు రుషు లేదిపెట్టుకొన్నను బెట్టుకొనకున్నను వారివెనుకటివారు వారిభక్తులు తమ తమమతానుసారముగఁ జిహ్నము లుంచుదురు. నాస్వవిషయమే నన్నివరెవ రేమిపేర్లఁ బిలుచునది వ్రాసియుంటినిగదా. ఒకమూర్తికే కొందఱు వడగల నామము లుంచినఁ గొందఱు తెంగలనామము లుంచుదురు. మఱి కొందఱు

గోపిచందన ముంచుదురు. ఇంతయేల విఘ్నేశ్వరుని భాద్రపదశుద్ధచతుర్థినాఁడు పూజింతురుగదా. ఊర్ధ్వపుండ్రములు పెట్టువా రాయన కూర్ధ్వపుండ్రములు పెట్టుదురు. తిర్యక్పుండ్రములు పెట్టువారు తాము పెట్టుకొనునట్లే పెట్టుదురు. ప్రస్తుతవిషయమున బమ్మెర పోతరాజువిగ్రహము వైష్ణవు లర్చించు విష్ణ్వాలయంబున నున్నది. కావున దాని నక్కడ నుంచినవారు ద్వైతులయినను విశిష్టాద్వైతులయినను నద్వైతులయినను విష్ణుభక్తులనుట నిర్వివాదము. వీరశైవు లచ్చట నావిగ్రహము నుంచి యుండరు. బ్రతికియుండుకాలమున మహాకవు లాదరింపఁబడుట యరుదు. అందుఁ బోతనవంటిబికారి నెవఁ డాదరించును. ఆయనకవిత్వమహత్త్వము లోకమున వెలసినపిమ్మటనే యాయన చర్యలను గుఱించి విచారించి మహాపురుషుఁ డని యెఱిఁగి యప్పు డట్టిగౌరవము గలిగించి యుందురు. ఆకార్య మెవఁడు చేసెనో వానిముఖమున నుండునామమె యాయన ముఖముఁ బెట్టెను. పాదతలముఁ బద్మరేఖలు మహాపురుషలక్షణము తెలుపఁ జెక్కఁబడినవి. అర్చకుఁ డావిగ్రహము వేదాంతదేశికులది యని తనయభిప్రాయ మని చెప్పినమాట సత్యమే. క్రొత్తవాఁడును గంచివాఁడు నగుట యీయన యభిప్రాయ మేమిప్రమాణము.

ఆయన ప్రత్యేకాభిప్రాయము నమ్మినపంతులవారికి క్లేశమంతయు నిదిపోతరాజుది యని యనుచున్నా రని యాయనయే చెప్పినమాటయం దేల ప్రత్యయబుద్ధి లేదయ్యెను? ఆయర్చకుఁడే సోపానములమీఁద నిలఁబడి మాట్లాడునపు డావిగ్రహము వేదాంతదేశికులది కాదనుటకుఁ గారణములు కలవని చెప్పలేదా? ఆప్రస్తావనను వేఱొకప్రస్తావనచే బంతులవారు మార్చలేదా? నేనది కనిపెట్టలేదని పంతులవా రనుకొనిరి కాఁబోలు. పంతులవా రాయనను జెప్పనీయకున్నఁ బోనిండు. నాకుఁ దోఁచినది నేను జెప్పెదను. పోతరాజు పేద వాఁడుగావున నాభరణధారణ మసంభవ మనికదా పంతులవారి తలంపు. "సాయంప్రాతర్భిక్షాచర్యా" యని బ్రతికిన వేదాంతదేశికు లేనాఁ డట్టిభూషణములు ధరించియుండెను? వేదాంతదేశికులు బమ్మెర పోతనకంటెను దరిద్రుఁడు—కావున నావిగ్రహము వేదాంతదేశికులవారి దనుపంతులవారి యూహయు సరిగాదు. బొమ్మెరలోని బొడ్డురాయి సాక్షాత్పోతరాజువిగ్రహమేని దానివర్ణన మేల పంతులవారు చేయరైరి. ఓరుగంటివాదులయదృష్టము కొలఁది యెంటిమిట్టవాదులు బొమ్మెరఁ జూచినవారు కారు. రెండుమార్లు నేను బ్రయాణము పెట్టుకొనినను సాగినది

కాదు. కావున నచ్చటిబండారము బయటఁబడకున్నది. విగ్రహముకాని బొమ్మ రాయికాని తుదకు గుండ్రాయికాని యాయనజ్ఞాపకచిహ్నముగ నొకటి యుంచుకొని యున్నారనుట గ్రాహ్యము కాని పోతనకు ముఖాన మీసములు మొలచి యుండెనే విగ్రహమునకు మీసములు లేవే యనుట సరిగాదు. కన్నులు కమలము లన్నప్పుడు కన్నులు నూఱుభాగములుగఁ జీలి నడుమ గ్రుడ్లు నిట్టపొడుచుకొని వచ్చిన దని యర్థమా? అట్లే యిందును గుణముమాత్రము గ్రహింపవలయును.

ఓరుగంటివారిబలమును విమర్శించినట్లు లొంటిమిట్టవారిబలము విమర్శించెదను. వారి కన్నియు నూహాబలములే కదా. ఇఁక నొంటిమిట్టవారికో, ఒంటిమిట్ట యేకశిలానగర మనుట గ్రంథస్థము.

ఒంటిమిట్టయందుఁ బోతరాజుండె ననుట గ్రంథస్థము.

పోతరాజు దున్నుకొనుచున్నభూమి నిర్దేశింపఁబడి యాయనపేరనే నేఁటికిఁ బిలువఁబడుట ప్రత్యక్షము.

పోతరాజు వంశమువారిబంధువు లుండుట ప్రత్యక్షము.

పోతరాజునకుఁ బ్రత్యక్షమైనకోదండరామమూర్తి యొంటిమిట్టయందుండుట ప్రత్యక్షము.

బమ్మెర యనునింటిపేరు వంశపారంపర్యముగ వచ్చిన దనుట గ్రంథస్థము.

బమ్మెర యనునింటిపేరుగలవారు గోలకొండదేశమునకంటె భిన్నదేశము లందుండుట గ్రంథస్థము. కావున నోరుగంటివారివాదమునకంటె నొంటిమిట్టవారి వాదము బలీయ మని చెప్ప నెవరు సందేహింతురు?

23. మహాశయులారా! శ్రీమదేకశైలకోదండరామకరుణాకటాక్షవీక్షణ బలంబునన బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారి యాక్షేపముల కన్నిటికిఁ దగిన సమాధానములఁ జెప్పఁగలిగితిని. ఒంటిమిట్టవారి నాక్షేపించుటయందు వారు వాగ్వ్యయము చేయుచున్నారు గాని యోరుగంటికి నామమాత్రము తప్ప మఱి యే యాధారమును బ్రేలు వంచి యెంచలేకున్నారు. గోదావరివేములవాడ కా దని వెలిగందలవేములవాడను స్థాపింపఁ బంతులవారు గనఁబఱిచిన యాధారములకంటె నొంటిమిట్టవారియాధారములు బలీయము లవునో కావో వారే నిశ్చలచిత్తమున నాలోచింపఁగోరెదను. ఇంత కెక్కువ నేనిప్పుడు చెప్పవలసిన దేమియు లేదు.

ఆర్యులారా! యీవాదములో బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారు సత్య జిజ్ఞాసువులై దిగి రనుటసత్యము. సవ్యాపసవ్యమథనంబునఁగాని వెన్న పడదని యే వారు నన్ను వాదములోనికి దింపిరి. వారు నాకు జ్యేష్ఠభాతృతుల్యులు గావున గురువులు. పరశురాముని యనుమతిఁ గొని యాయనతోఁ బోరిన భీష్ము నివలె నేనును యథాశక్తి వారితోఁ బోరి వారు చెప్పినపని నిర్వహించితిని. గెలు పోటములకు వారే యుత్తరవాదులు కావున వానితో నాకుఁ బనిలేదు. నా వాదము గెలిచినఁ గీర్తి వారిదే.

ద్విపద. కర్మమందే యధికారంబు నీకుఁ
కర్మఫలంబులఁ గా దీవుగోర

నన్నట్లు ఫలభాగిని నేనుగాను. నిర్వంచనముగ నాకార్యము సలిపితినని వారును బుధులును సంతసిల్లినఁ జాలును. జంకు గొంకు లేక బొంకులు టకటొంకు లాడు టాటోటుకాండ్రతో వాదించుట రోఁతగాని పంతులవారివంటివారితో నెన్నాళ్లైన వాదించుట కీర్తికరమే. సంతోషకార్యమే. "యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా" యని కలదుగదా. అయినను నీవిషయమున నిఁక వృథావాగ్వ్యయము చేయ మన సొప్పకున్నది. చెప్పవలసినవిషయములు చెప్పఁబడినవి. ఇఁక నిదమిత్థ మని నిర్ణయింప మధ్యవర్తులు సమర్థులు. కావున వ్యర్థశ్రమము చాలించి నన్నీవిషయమున మరల రంగమున కీడ్వకుండుటకై బ్ర॥ శ్రీ॥ రామయ్యపంతులవారిని బ్రణామపూర్వకముగఁ బ్రార్థించుచు నిష్క్రమించుచున్నాఁడను.

వావిలికొలను సుబ్బరావు.

శ్రీరస్తు.

# బమ్మెర పోతరాజు నివాసస్థానము.

పోతరాజు నివాసస్థాన మోరుగల్లా, యొంటిమిట్టా యను చర్చ యుపక్ర మించినది నేను. ఓరుగంటివాదము పక్షముగా నేను వ్రాసినదానిపై బ్ర॥ వావిలికొలను సుబ్బారావుగారు ప్రత్యుత్తరము వ్రాసి యొంటిమిట్టవాదమును స్థాపింప యత్నించిరి. దానికి నే నొకసమాధానము వ్రాసి ప్రకటించితిని. అంతటితోఁ దృప్తినొందక సుబ్బారావుగారింకొక ఖండనవ్యాస మిప్పుడు ప్రకటించిరికదా! ఉపక్రమించిన నారే యుపసంహరించుట న్యాయముగావున సుబ్బరావుగారి ప్రస్తుతవ్యాసమునకు సంక్షేపముగా సమాధానము వ్రాసి యీచర్చకు శాంతి చెప్పఁ దలఁచినాఁడను. తా మిప్పుడు వ్రాసినది చాలవఱకుఁ జర్వితచర్వణమని సుబ్బరావుగారే చెప్పియున్నారు. అట్టి దానిని దిరిగి ఖండించుట పిష్టపేషణమగును గాన నట్లొనర్పక సుబ్బరావుగారి వాదఫక్కియం దున్న కొన్ని దోషములను మాత్రము సూచించి విరమించెదను.

౧. ఓరుగంటికి సమీపమం దున్న గ్రామము బొమ్మెర గాని బమ్మెర గాదు. కనుక దానినిబట్టి బమ్మెర యను ఇంటిపేరు పుట్టనేర దని సుబ్బరావుగారు నొక్కి నొక్కి వక్కాణించుచున్నారు. గ్రామముపేరు బమ్మెరయే యనియు బొమ్మెర యనునది గ్రామ్యోచ్చారణ మనియు నేను దొలుతనే చెప్పియున్నాఁడను. "వొచ్చెను, వొండెను," ఇత్యాదిశబ్దములయం దీవికారము కనఁబడుచున్నది గదా! సర్వజనవిదిత మైనయిట్టివిషయములో వారింతభల్లూకపుఁబట్టేలపట్టవల యునో తెలియకున్నది.

"ఇఁక బొమ్మెరయే బమ్మెరయని యోరుగంటివాదులు హఠవాదము చేసిన, బొమ్మవరమే బమ్మెరయని యొంటిమిట్టవాదులును వాదింతురు. వారివాదమునకు వారుప్రమాణము కనఁబఱిచినపుడు వీరివాదమునకు వీరును బ్రమాణము కనఁబఱుతురు." అని సుబ్బరావుగారు వ్రాసినారు. దీనినిబట్టి హఠవాద మెవరిదో పాఠకులు గ్రహింతురు గాక!

బమ్మెరవాదము నిట్లుగుఱుగొట్టితి మని సంతోషించియు నెచటనైనఁ గొంచెము మిగిలిపోవు ననుభయముచేతఁ గాఁబోలు వాస్తవముగా, బమ్మెర యనునది గ్రామనామము కాదనియు భ్రమశబ్దభవ మనియుఁ "బోతరాజు పూర్వులొకచోట నిలుకడలేక నానాదేశములు భ్రమించుచుండినవా రగుటచే బమ్మెరవారైరనియుఁ బోతరాజు పశుచారోపజీవిగా నుండెనన్నకింవదంతి యీ వ్యుత్పత్తిని స్థిరపఱుచుచున్న దనియు సుబ్బరావుగా రొకక్రొత్తవాదమును గల్పించినారు. పోతరాజేకాక యాయన తాతముత్తాతలుగూడ "లంబాడి" జాతివారివలెఁ బసులఁ గాచుచు నూరూరు తిరిగి జీవనము చేయుచుండుటవలన బమ్మెరవారను పేరువచ్చిన దని దీనియర్థము. బమ్మెరవారివంశచరిత్రము సుబ్బరావుగారికెట్లు తెలిసినదో! ఈచర్చ పెరిఁగినకొలఁది నిట్టి బమ్మెర (భ్రమణము) లింక నెన్ని పుట్టునో!

౨. కృతిపతులగు దేవత లర్చావిగ్రహము లనిసూచనలు లేనప్పుడా దేవత లర్చావిగ్రహములు కావనియే యూహింపవలయు నని నావాదము. "ఈయూహ సత్యము కాదనుటకు నెల్లూరు హరిహరనాథతిక్కన లేసాక్షులు" అని సుబ్బరావుగారి ఖండనము. భారతకృతిపతి యగు హరిహరనాథుఁడు నెల్లూరిలో నుండిన యర్చావిగ్రహ మనుటకుఁ దిక్కన నెల్లూరివాఁడనుటతప్ప వేఱేయాధారము లేదు. నెల్లూరిలో నిప్పు డావిగ్రహము లేదు. పూర్వమెన్నఁడు నున్నట్లు నాకుఁ దెలిసినంతవఱకు సాక్ష్యమును లేదు. రంగనాయకస్వామియాలయమునకును, బెన్నకును నడుమ నుండెడిదని యాధునికులు కొందఱుందురు. ఆయాలయమును జూచినవా రెవ్వరును లేరు. చూచినవారు వ్రాసియుంచిన లేఖనములును లేవు. ఇట్టి స్థితిలో భారతకృతిపతి నెల్లూరిలో నుండిన యర్చావిగ్రహ మని యేల సిద్ధాంతపఱుపవలయునో తెలియకున్నది. హరిహరాత్మకమగుదైవతమును దిక్కనభావించికొని యుండఁగూడదా? నాచనసోముని హరిహరనాథుఁడును నెల్లూరు నివాసియే కాఁబోలును. నావాద మసత్య మనుటకు మఱియొక సాక్ష్యముగూడఁ గలదఁట. అది యేదియన:—భానుమతీపరిణయము తిరుపతివేంకటేశ్వరున కంకితమనియు నాపుస్తకమం దెక్కడను దిరుపతిపేరుగాని మఱి యేయూరిపేరుగాని లేదనియు, "అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరు లర్చావిగ్రహములు కావని పంతులవారనఁగలరా" యనియును సుబ్బరావుగారివాదము. సుబ్బరావుగారు కనిపట్టలేకపోయినారుగాని భానుమతీపరిణయకృతిపతి శేషగిరీశుఁడే యని సుబ్బరావుగా రుదా

హరించినపద్యమందే యున్నది. పద్యము చివర "శ్రీయలమేలుమంగకాంతాళయ
రీతి బొమ్మనను దాల్చిన వేంకటభర్తం గొల్చెదన్" అనియున్నది. వేంకటభర్త
యనఁగా వేంకటమున కధిపతి యనియర్థము. వేంకట మనునది తిరుమలక్షేత్ర
మునకుఁ బేరు, ఆక్షేత్రమున కధిపతికాన నాదేవునకు వేంకటేశ్వరుఁడు, వేంకట
భర్త, వేంకటపతి, యిత్యాదినామములు కలిగినవి. ఈక్షేత్రమున కరవములో
వేంగడము, తిరువేంగడము ననియు, దేవునికిఁ దిరువేంగళనాథుఁ డనియుఁ బేళ్లు
గలవు. మఱియు, నలమేలుమంగ యనుపేరు, అలర్మేలుమంగ (పుష్పము
మీఁదియమ్మ) యను ద్రావిడరూపమున కపభ్రంశము. దీనికే యిటీవలఁ బద్మా
వతి యనుసంస్కృతరూపమును గల్పించిరి. అలమేలుమంగ యనుపేరు పురాణో
క్తముకాదు. వేంకటేశ్వరుని దేవికిఁదప్ప వేఱొకదేవతకుఁ జెల్లదు. ఈరెండు
హేతువులచేతను భానుమతీపరిణయకృతిపతి తిరుపతివేంకటేశ్వరుఁడే యని
తేలుచుండ సుబ్బరావుగారు దీనిని దమవాదమున కాధారము చేసికొనుట విం
తగా నున్నది.

3. ఒంటిమిట్ట దేవాలయములో సీతారామలక్ష్మణులు ముగ్గురి విగ్రహ
ములు నుండఁగాఁ బోతరాజు సీతావిగ్రహమును జేర్పనకపోవుటచేత నాకవి
వర్ణించినవిగ్రహ మొంటిమిట్ట కోదండరామస్వామివిగ్రహము కాదని యూహిం
పవలయునని నావాద మనియు, నీవాదము సరియైనది కాదనియు, సుబ్బరావు
గారు వ్రాసిరి. పోతరాజుగారిపద్యము చదివినప్పు డాయనవర్ణించిన రామవిగ్ర
హ మొంటిమిట్ట కోదండరామస్వామి విగ్రహమే యని తోఁపకుండదని సుబ్బరావు
గారు వ్రాయుటచే నేనట్లు వ్రాయవలసివచ్చినది. నావాదమునకు బాధకములని
సుబ్బరావుగా రుదాహరించిన రెండుపద్యములలో నేదియు వారి కుపకరింపదు.
రామదాసును జెఱనుండి విడిపించిన రామలక్ష్మణులు రౌతువేషములతో వచ్చి
నారు. వారితో నప్పుడు సీతయు వచ్చుట యనుచితముగదా! చంద్రికాపరిణయ
కృతిపతి యగు జటప్రోలుమదనగోపాలుని వర్ణించు సీసపద్యములో రుక్మిణీవర్ణ
నము లేనిలోపము మఱియొక పద్యములో, "శ్రీవాసజటప్రోలీభావుకపత్తన
విహారపటుశీలునకున్" అని చెప్పుటచేఁ దీరినది. భాగవతములో నెక్కడఁ
జూచినను, గృతిపతి యొంటిమిట్టదేవుఁ డనుసూచనలు లేవు. ఇతరాధారము లేన
ప్పుడును విగ్రహవర్ణమును బట్టియే యూహింపవలసియున్నపుడు నావర్ణన మన్ని
విధముల నొంటిమిట్ట విగ్రహమునకు సరిపోవలయును గదా! సరిపోనప్పు డా
దేవుఁడే యీదేవుఁ డని యేల నమ్మవలయును? ఇదియే నావాదము.

౮. పోతరాజు గతించిన యనేకశతసంవత్సరముల కీవలఁబుట్టిన పురాణము హయగ్రీవశాస్త్రిగారు పోతరాజు నివాసస్థాన మొంటిమిట్టయని వ్రాసినవ్రాఁతను మనము ప్రమాణముగా నంగీకరింపవలసిన యావశ్యకత లేదని నేను వ్రాసిన దానికి సుబ్బరావుగారు "హయగ్రీవశాస్త్రులవారు పోతరాజునకు ౪౦౦ సంవత్సరముల కీవలఁ బుట్టుట సత్యము. హయగ్రీవశాస్త్రులవారికి ౨౦౦ సంవత్సరముల కీవల రామయ్యపంతులుగారు పుట్టుటయు సత్యము. (ఇది సత్యమో యసత్యమో నాకుఁ దెలియదు) తమకు ముందుండిన "ప్రాచీనపండితులు" వ్రాసినదాని నాధారము చేసికొని వ్రాసినవారు హయగ్రీవశాస్త్రులువారు ఎవరో చెప్పిన పుక్కిటిపురాణముల నమ్మి పగ లాకాశ మెగఁజూచి యోరుగంటిపంచాంగము వ్రాయఁ బూనినవారు పంతులవారు. ఈరెంటిలో నేది యెక్కువ విశ్వసనీయము? ఈవాదము రాకముందు పోతన యోరుగంటివాఁ డని యెవ్వఁడైన వ్రాసియుండెనా?" యని యొకచోటను, "వేములవాడ భీమకవికి రామయ్య పంతులవారు సమకాలికులా? పిమ్మటఁ గొంచెముకాలమువారా? ఏమి యెఱిఁగి వీరు భీమకవిస్థలమును నిర్దేశింప సాహసించిరి. విషయము తమకనుకూలమైనచో శాస్త్రసమ్మతము, ప్రతికూలమైనచో శాస్త్రసమ్మతము కాదు కాఁబోలు" నని మఱియొకచోటను వ్రాసినారు. నావాద మేదియో సుబ్బరావుగారు సరిగా గ్రహింప లేక పోయిరని యీవ్రాఁతయే తెలుపుచున్నది. పోతరాజు నివాసస్థానము విషయమయికాని, యప్రస్తుతమగు వేములవాడ భీమకవి నివాసస్థానము విషయమయి కాని నేను వ్రాసినదెల్లఁ బరమప్రమాణముగా గ్రహింపవలసినదని నేను జెప్పలేదు. చెప్పినచో నది యవివేకమగును. ఆరెండువిషయములంగూర్చియు నాకు లభించిన యుభయపక్షాధారముల సంకలితముచేసి యవి విమర్శించుటవలన నాకుఁ గలిగిన యభిప్రాయముం దెలిపితిని. నాయభిప్రాయము సరియో కాదో నిర్ణయించుకొనుభారము పాఠకులయందే యున్నది. కొందఱికది సరి యని తోఁపవచ్చును. సుబ్బరావుగారువంటివారి కది సరికాదని తోఁపవచ్చును. ఎవరికైనను నేను గనఁబఱిచిన హేతువులే యాధారము గాని నా సిద్ధాంతవాక్య మాధారముకాదు. హయగ్రీవశాస్త్రిగారివిషయమై సుబ్బరావుగారు చెప్పిన దిదికాదు. ఈచర్చపుట్టకమునుపే హయగ్రీవశాస్త్రిగారు పోతరాజు నివాసస్థాన మొంటిమిట్ట యని వ్రాసెను గావునఁ బోతరాజు నివాసస్థాన మొంటిమిట్టయే యని నమ్మవలసినది. అనఁగా హయగ్రీవశాస్త్రిగారి వ్రాఁత యాప్త

వాక్యముగా గ్రహింపఁబడవలసిన దని సుబ్బరావుగారివాదము. శాస్త్రిగారి మాట యాప్తవాక్యము కానేర దని నాప్రత్యుత్తరము. "భ్రమప్రమాదవిప్రలిప్సాకరణాపాటవరూపదోషచతుష్టయరహితుఁ" డాప్తుఁ డని శాస్త్రమర్యాద. అట్టివానిమాటయే ప్రమాణముగా గ్రహింపఁ దగినది. ప్రస్తుతవిషయములో శాస్త్రిగా రాదోషచతుష్టయరహితుఁడని ప్రాజ్ఞుఁ లెవ్వరుఁ జెప్ప సాహసింపరు. "తమకు ముందుండిన ప్రాచీనపండితులు వ్రాసినదాని నాధారము చేసికొని వ్రాసినవారు హయగ్రీవశాస్త్రులవా" రని వ్రాయుటచే నాశాస్త్రులవా రాప్తులు కారని సుబ్బరావుగారే చెప్పక చెప్పుచున్నారు. ఆప్తుఁడు కానివానిమాట ప్రమాణమె ట్లగునో తెలియదు. మఱియుఁ బూర్వులు వ్రాసినదాని ననుసరించియే శాస్త్రిగారు వ్రాసినా రన్నమాట సత్యముకాదు. శాస్త్రులవారి భాగవతపీఠికలోఁ, బోతరా జేకశిలానగరమందుండె నని యున్నది. అక్కడఁ బుష్పవ్వెట్టి పుటయనుగున నేకశిలానగర మనఁగా నొంటిమిట్ట యని వివరణరూపముగా వ్రాయఁబడియున్నది. ఈవివరణముశాస్త్రిగారిస్వకపోలకల్పితమని వేఱచెప్పనక్కఱలేదు. పూర్వగ్రంథానువాదమే తైనచోఁ బీఠికాగర్భస్థ మయియే యుండును. వాదమున కీవివరణము గూడ ననువాదమే యనికొందము. అట్లయినచో ననువాద మెన్నఁడును స్వతంత్రప్రమాణము కానేరదు. ప్రామాణ్యము మాతృకానిష్ఠముగాని యనువాదనిష్ఠముగాదు. శాస్త్రిగారిపీఠికకు మాతృక యగుగ్రంథము బయలుపడినప్పు డాగ్రంథమునకుఁ బ్రమాణలక్షణము పట్టునో పట్టదో విచారింపవలసి యుండును. ఏరీతినైనను హయగ్రీవశాస్త్రిగారి వ్రాఁతకుఁ బ్రామాణ్యము సిద్ధింపదు.

౫. ఏకశిలానగరమాహాత్మ్యము ప్రమాణముగాఁ గైకొనఁగూడ దని వ్రాయునవసరమున స్కాందపురాణమునకు లోకమునందుఁ గలయపవాదము ననువదించితిని. దాని నెత్తికొని పురాణముల నిందించితి ననియు మఱియేవేవో కొన్నివ్రాఁతలును వ్రాసి కవిజనాశ్రయపీఠికలో గోలకొండదేశమునందలి వేములవాడ దక్షవాటికయని భవిష్యోత్తరపురాణములో నున్నట్లు నేను వ్రాసినా ననియు వేములవాడ దక్షవాటిక యనుమాట పచ్చిదబ్బఱయనియు వ్రాసి యేదో కొంతగ్రంథము కల్పించినారు. వేములవాడను గుఱించి నేను వ్రాసినది యేకశిలానగరప్రశంసలో నప్రస్తుతము. అయినను వారియాక్షేపమునకు సమాధానముఁ జెప్పఁదలఁచినాఁడను, వేములవాడ దక్షవాటిక యని భవిష్యోత్తరపురా

ణములో నున్నదని కాని భవిష్యోత్తరపురాణములో నున్నదంతయు సత్యమే యని విశ్వసింపవలయు నని కాని నేను వ్రాసియుండలేదు. “దాక్షారామభీమేశ నందనుఁడ” అను చాటుపద్యములో స్మరింపఁబడిన దాక్షారామ మేది యని విచారించు నవసరమున వేములవాడకుఁగూడ దక్షవాటిక యనుసంజ్ఞ యున్నదని యాప్రాంతమువారు చెప్పుదు రనియు దానికి బలముగా భవిష్యోత్తరపురాణము లోని వని కొన్నిశ్లోకము లుదాహరింతు రనియు వ్రాసి యాశ్లోకములను జూపి నాఁడను. దాక్షారామసంజ్ఞ వేములవాడ కున్నట్లు జనశ్రుతి కలదని ఋజువు చేయుటయే నాపనియై యుండెను. కాని యాజనశ్రుతి సత్యమో యసత్యమో నిర్ణయించుట కవసరము కలుగలేదు. నిజముగా వేములవాడ దక్షవాటిక యైనను గాకపోయినను, నగు ననువాడుక యుండినచో భీమకవి యావాడుక నను సరించి దాక్షారామనామముచే వేములవాడనే పేర్కొనియెనని యూహింప నొప్పునుగాన నట్లు వ్రాసితిని. దీనివలన సుబ్బరావుగారివాదమున కేమియు లాభము కలుగనేరదు.

౬. ఓరుగంటికి మొదటిపేరు ఒరగల్లనియు, గణపతిదేవుఁడు రాతికోట కట్టించుటచే నోరుగల్లనుపేరు కలిగినదనియు నొక యపూర్వవాదము కల్పించి సుబ్బరావుగారు తమప్రథమవ్యాసములో నొకపుటకుఁ బైఁగా గ్రంథముం బెంచినారు. నారెండవవ్యాసమం దావాదమును సప్రమాణముగా ఖండించినాఁడను. దానికిఁ బ్రత్యుత్తరము చెప్పలేక “ఇది ప్రస్తుత వివాదమునకు సంబంధించి నదికాదు. అది యోరుగల్లయినను నొరగల్లయినను మఱి యేకల్లయినను నా వాదమునకు రాఁగల లాభనష్టములు లేవు కావున నాచర్చ వ్యర్థము” అని వ్రాయుచున్నారు. వ్యర్థచర్చకుఁ దామేల తొడంగిరో! ‘అందని పండ్లుచేఁ దన నిట్టిదే కాఁబోలు.

సుబ్బరావుగారి వ్యాసములో నింక ననేకాంశము లున్నవి. వాని కన్నింటికిఁ బ్రత్యుత్తరము లిచ్చుటవలనఁ గాలహరణము తప్ప వేఱొండు ప్రయోజన ముండదు. కావున మానినాఁడ.

కొట్టెదుపట్టులం దెంత గట్టిగాఁ గొట్టినను జిట్టచివరకు నేనీవాదములో సత్యజిజ్ఞాసువునైయే దిగితి ననుట సత్యమనియు నాతో నెన్నాళ్లయినను వాదించుట సంతోషకార్యమే యనియు మఱి యింకను గొన్ని ప్రశంసావాక్యములు వ్రాసి “నన్నీవిషయమున మరల రంగమునకీడ్వకుండుటకై బ్ర॥ శ్రీ॥ రామయ్య

పంతులవారిని ప్రమాణపూర్వకముగఁ బ్రార్థించుచున్నా"నని సుబ్బరావుగారు వ్రాసిరి. నావాదమును వదలుకొనుమని సుబ్బరావుగారి తాత్పర్యమైన ట్లిందువలనఁ దోఁచుచున్నది. ఈవాదఫల మనుభవించువాఁడను నేనుమాత్రమే యైనచో సుబ్బరావుగారంతవారు కోరినందుకు నేనట్లు చేయవలసినదే యుండును. కాని, వాదఫలము లోకాధీనమగుటచే వాదము వదలుకొనుటకు నాకధికారము లేదు. నేను సత్యజిజ్ఞాసువునైనయే యీవాదములోనికి దిగితి నని కొంప్పికొనినందుకు సుబ్బరావుగారికి వందనము లర్పించుచున్నాఁడను. వారును సత్యజిజ్ఞాసువులే యని నేనును దృఢముగా నమ్ముచున్నాఁడను. అభినివేశదార్ఢ్యభేదముచేతనో, యితరకారణములచేతనో మాయిరువుర వాదరీతులయందును గొంత భేదము కనఁబడవచ్చును, కొన్నియెడల నిష్ఠురోక్తులుగూడఁ బ్రయోగింపఁబడి యుండవచ్చును. అట్టిపట్టులందు, "నహినిందా" న్యాయమును బట్టింపవలయు నని నామతము. చిట్టచివరకు నిలుచునది సత్యమేగాని వాదప్రౌఢి గాదు. అట్టులే యగుఁగాక !

ఉభయపక్షముల బలాబలములు లోకమునకు విదితము లయినవి. ఇఁక నీచర్చ పెంచుట యనుచిత మని నాయభిప్రాయము.

జయంతి రామయ్య.

శ్రీరస్తు.

# విజయనగరసామ్రాజ్యాంధ్రవాఙ్మయచరిత్రము.

(పూర్వభాగము 5-వ సంపుటము 10, 11, 12 సంచికలలో ముద్రితము.)

పోతనామాత్యుఁడు తనభాగవతమున వర్ణించిన నరకాసురసంహారమును, నాచనసోమనాథుఁడు వర్ణించిన నరకాసురసంహారమును, గొన్నివిషయములఁ బోలి యున్నవి. విస్పష్ట మగుపోలికఁ జూపుపద్యములఁ గొన్నింటి నిచ్చటఁ బొందు పఱిచెద.

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబు లై
తొరఁగం, బయ్యెదకొం గొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

ఉత్తరహరివంశము, ఆ. 1—162.

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటిమందహాసములతో, వీరంబు శృంగారమున్
జరగన్నన్నుల కెంపు సొంపు పరఁగం జండాస్త్రసందోహము
న్సరసాలోకనమూహము న్నెరపుచుం జంద్రాస్య హేలాగతిన్.

(భాగవతము, దశమస్కంధము.)

నాచనసోమనాథుని కవిత్వము స్వతోజాతం బగుసాంద్రారణ్యంబువలెఁ గాక, వనపాలకృతాలవాలకలితం బై లతాగృహరమణీయం బై నానావిధపుష్ప ఫలభరితం బై సుమనోమనోజ్ఞంబుగ నున్నది. ఆంగ్లేయవాఙ్మయమందు స్పెన్సరు (Spenser) కవి రచించిన ఫెయిరీ క్వీన్ (Fairie queen) అనెడు గ్రంథ మర్వాచీనకవులకు మార్గదర్శకముగ నుండెను. ఆకారణమున స్పెన్సరు మహాకవికి 'కవీనాం కవిః' (The poet's poet) అను గొప్పపేరు వచ్చెను. అట్లే నాచ నసోమనాథుఁడును గవితావైభవమును విచిత్రగతుల మిగుల వెలయింపఁజేసి

తరువాతికవుల కాదర్శకుఁ డాయెను తత్కారణమున నీమహాకవికిని 'కవీనాం కవిః' అను బిరుదము ప్రాయికంబుగ నొసంగఁదగు.

ఉత్తరహరివంశమునందలి వచనభాగములు శ్లేషయమకాదిశబ్దాలంకారములతో నిబిడీకృతము లై బహుక్లిష్టముగా నుండును. సోమనాథునిపద్యశైలి కంటె వచనశైలియే యెక్కుడు కష్టముగా నున్నది. వచనభాగము తఱుచు యుద్ధవర్ణనలయందుఁ గన్పట్టును. అందలిశైలి సుశిక్షిత మైనతురగమువలె బహుచతురగతుల నొప్పుచున్నది. ఒకానొకచోట సముపతనఖురఘట్టనమువలె నుభయసైన్యములు సమానయానంబున దాఁకొని మాఁకొనుటయు, మఱి యొకపట్టున వల్గితగతిని యోధవీరులు మల్లయుద్ధంబునఁ జేరి యన్యోన్యవిజిగీషు లై మలఁగి పెనఁగి తల్లడిల్లుటయు, వేఱొకచో త్వరిత సంచలితచమూనిచయంబులు పరిదేవనధ్వానంబులఁ బరిధావనం బొనర్చుటయు, నిట్లు సమరసంచారభేదంబుల నుచితశైలిగతిభేదంబుల నిరూపించుచు సర్వజ్ఞుఁ డగునిమ్మహాకవి శబ్దజాలపరంపరల సంగ్రామసంభ్రమనిర్ఘోషంబుల ననువదించెను. పైయంశములకు దృష్టాంతముల నీక్రిందఁ జూడనగు. శ్లేషయమకాదులు :—

"మఱియుం దదాశ్రయంబు వలాహకంబునుంబోలెఁ గరకాన్పదం బై కుంజరంబునుంబోలెఁ గుంభాభిరామం బై రంగస్థలంబునుంబోలె శైలూషశతరమ్యం బై యింద్రపదంబునుంబోలె నైరావతరుచిరం బై తరుణీముఖంబునుం బోలెఁ దిలకవిరాజితం బై పరమయోగిహృదయంబునుంబోలె మోక్షనిలయం బై పారావారంబునుంబోలె నమృతోత్పాదనస్థానం బై మహాభారతంబునుంబోలె శతపర్వసనాథం బై గగనంబునుంబోలె ఋక్షగణసంకీర్ణం బై కర్ణరథంబునుంబోలె శల్యాధిష్ఠితం బై ........" సమగతి :—

"ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సందడికయ్యంబునం గడిసి కరులుగరులను దేరులుదేరులను దురంగంబులుదురంగంబులను బదాతులుపదాతులనుం దలపడి సందడికయ్యం బయ్యె నయ్యెడఁ గత్తివాతియమ్ములం గత్తరించి నం దుత్తమురు లగుకత్తళంబులును ఘనగదాఘాతంబులం జిద్రుప లయినసీసకంబులును............" వల్గితగతి :—

"ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు గాలువలు గట్టి గట్టిమెయిమురువులు చించియుఁ, గాయంబులు నొంచియు, మర్మంబులు గీఱియు, మహితలంబులు దూఱియు, బ్రేవులు వెలికిఁ దీసియుఁ, బెనుమూఁకల కుఱికియు, సీసకంబులు

వగిలించియు శిరంబులు నొగిలించియుఁ, గైదువులు గఱచియుం గరవాలంబులు చఱచియు, నెత్తురులు చిమ్మియు నొసళ్లు గ్రుమ్మియుఁ, జరణంబులు తొలిచియుఁ జర్మంబు లొలిచియు, బాహుదండంబులు గత్తరించియు........"

యుద్ధవర్ణన లెంత వీరరసోద్రేకముతోఁ బొంగి పొరలుచుండునో ప్రతియాశ్వాసంబునఁ గానవచ్చును. తిక్కనసోమయాజితరువాత యుద్ధము వర్ణించుటలో నీకవియంతసమర్థుఁడు వేఱొకఁడు గానరాఁడు. భయము, ఉత్సాహము, కోపము, శౌర్యము, ఆటోపము, అహంకారము, మున్నగుభావములు యోధవీరులమనంబులవలెఁ జదువరుల మనంబులఁగూడ గజిబిజియొనర్చి సమరకౌతూహలంబుఁ బెంపొందఁజేయును.

హాస్యరసము వర్ణించుటయం దీకవి కెంతనేర్పు గలదో తెలిసికొనుటకుఁ దగినయవకాశము లీగ్రంథమునఁ గానరావు. ఒకానొకచోట మాత్రము హాస్యకరుణరసమిశ్రిత మయినభావమును గడుఁజిత్రముగ నిరూపించియున్నాఁడు. డిభకుఁడు మునిఁగి చచ్చినతనయన్న యగుహంసునికొఱకై వెతకుచు నిట్లు విలపించెనఁట :—

క. వ్రేలెడు వెంద్రుక లిరుగడఁ, దూలఁగఁ దలయూఁచుఁ దొప్పతొప్పన నోరుం
గేల నడిచికొను సెలవుల, లాలలు దొరుఁగంగ నన్నలా యని యెలుఁగున్.

క. రాలం దల యడిచికొనుఁ, నేలంబడి పొరలు లేచు నెత్తురు లుమియుం
గేలిఁబడి రిపులు చూడఁగ, నాలుక వెఱికికొనుఁ జావునకుఁ దన్నుకొనున్.

ఇంక శృంగారరసకవన మీకవినోట నె వినవలెను. ఔచిత్యనియమ మొకించుకయుఁ దప్పక, పేరున కైన నశ్లీలము చెంతఁ బోక, పాత్రపోషణము కడుఁబ్రశస్తముగాఁ బరిపాటించుచుఁ గ్రమక్రమోదితముగ, రసోద్ధతిఁ బ్రకటించుచుఁ దుద కుద్వేలరసాంబుధిలోఁ బాఠకుల ముంచివేయును. పాత్రోచితభాషావిషయమున నూర్వశీనరకాసురసంవాదమును జూడుఁడు :

క. పగవాఁడఁట దేవేంద్రుఁడు, మగువా! నీ పతనికొలువు మానిసివఁట, నిం
దగవుచెడి పిలువఁ బనుచుట, మగతనమే? యిట్టిలంజమాటలు గలవే?

ఊర్వశి : ఉ. లంజియ నౌదు నేను విను లావున నీ వమరేంద్రుఁ గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితిగాక, చిత్త మె
ల్లం జెడియుండ రిత్తయొడలం జవిచేరునె? చిల్కపోయినం
బంజర మేమిసేయు? రసభంగముసంగతి లోన మెత్తురే!

ఉ. నవ్వులమాటలో నిజమొ నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీఁగెలం దెగడుమానిను లుండఁగ నంత నెన్నఁడో
జవ్వన మస్మఁగొన్న కడసారె ననుం గనఁ దలంచితే
పువ్వులు వేఁడు కైనఁ గడిఁబోయిన వేన్ముకు వంగవచ్చునే ?

నరకాసురుఁడు :

క. అంజెదవుగాక నను( జెం, తంజేరఁగనీక యెంత తఱిఁగిన మిఱియా
లుం జొన్నలసరిపోవే ! యంజెతనములందుఁ గొమిగెలన్ గెలువవఁటే.

నరకాసురుని మొఱటుతనమును, ఊర్వశియొక్క చాతుర్యవిలసితభావ గాంభీర్యము నెంతచమత్కారముగా వర్ణించెనో చూడుఁడు.

మఱియు నిందుధరోపాఖ్యానమునందును, ఉషానిరుద్ధీయమునందును, శృంగారాభివర్ణన ముత్తమోత్తమకవిత్వలక్షణముల నొప్పారుచున్నది. శబ్దములమాధుర్యమూ, భావగర్భితమగు ధ్వనియూ, వర్ణనలస్వభావమూ, చిత్రితరూపముల సౌందర్యమూ, రసోత్సేక మగుసర్వేంద్రియరాగసమృద్ధియూ, దేనినిఁ జూచినను బాఠకులకుఁ దనివి దీరనిశృంగారరసానుకంపన మొసఁగుచున్నవి.

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంత సా
రహరిద్రారసగౌరకేసరములన్ రంజిల్లుమాధ్వీకవా
ర్లహరీస్వేదము చూపఁ బట్టపగ లేలా యింతటన్ సిగ్గు లే
దహహా యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమాలై ముద్దరా లయ్యెడన్.

ఆ. 5 ప. 52.

ఉ. చెందొవరేకు ఫాలమునఁ జేర్చి ప్రఫుల్లపయోరుహంబుచే
నందముగా బిసావళి భుజాంతరముం గదియించి యుత్పలా
మందమరీచిమేచక చమత్కృతిచారుగళోపచార యై
సుందరి యోర్తు వచ్చె హరుచూపులకున్ హరుఁ డయ్యె నయ్యెడన్.

ఆ. 5 ప. 71.

ఉ. డెందమునిండఁ జెందొవకు డెప్పర మేమియు లేదు ; చన్నులం
జిందదు ఘర్మవారి ; చెవిఁ జేర్చినలేఁజివు రించుకంతయుం
గందదు ; నాసికాగ్రమునఁ గన్నులబాష్పము లూర ; వింక నీ
సుందరిఁ గావ నేరఁడు ప్రసూనశరుం డని యార్తమూర్తులై.

ఆ. 5. ప. 184.

## నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడ.

ఎఱ్ఱాప్రెగ్గడ పూర్వోత్తరభాగయుత మగుహరివంశము నంతయుఁ దెనిఁగించె ననియు, నాచనసోముఁ డందలి యుత్తరభాగమును మాత్రమే తెనిఁగించె ననియు నిదివఱకే తెలుపఁబడినది. ఈయుభయకవులును గొంచె మించుమించుగా సమకాలికు లగుటచేతను, ఒకగ్రంథమందే వారికవితావైభవమును గనఁబఱుచుటచేతను వారిగ్రంథరచనాపద్ధతులయొక్కయుఁ గవితాస్వరూపములయొక్కయు సామ్యభేదములను నిరూపించుట సందర్భోచితము.

హరివంశము భారతమున కనుబంధ మనియు నది తెనిఁగింపఁబడనిచో నాంధ్రభారతము నసమగ్ర మని చెప్పుట కవకాశ ముండ దనియు నాశయముతో నెఱ్ఱాప్రెగ్గడ హరివంశమును సంపూర్ణముగాఁ దెనిఁగించి భారతామ్నాయము నాంధ్రావళికిఁ బూర్తిచేసినట్లు గాన్పించుచున్నది.

క. భారతపరాంశమని యిం, పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుంగున, ధీరోత్తమ ! నిర్వహించి తెలుపుము మాకున్.

అని కృతినాయకుఁ డగుపోలయవేమారెడ్డి యెఱ్ఱాప్రెగ్గడతోఁ జెప్పెనఁట. కావున నాంధ్రభారతవిధానక్రమము ననుగమించి యాంధ్రజనుల కుపయోగించునటు లెఱ్ఱన హరివంశము రచియించె ననుట సర్వసమ్మతము. ఆంధ్రభారత రచన, సార్వజనీన మగుటకుఁ గారణము లారయ, మాతృకానువర్తనము, శైలిసుగ్రాహ్యత, రసపోషణసమాచిత్యము, మున్నగునవి ముఖ్యములు, శబ్దాడంబరము, సమాసబాహుళ్యము, క్లిష్టాన్వయము, అలంకారసంభృతి, వీనిచే శైలికాఠిన్యమును వహించిన సామాన్యజనులకు సంప్రీతి కలుగుటెట్లు కాన గ్రంథమంతయు నాతికఠినముగాను నాతిసులభముగాను రచింపఁబడినది. అలాగుననే హరివంశమును బండితపామరులకు సమానాదరణము కలుగునట్లు వ్రాయఁబడినది.

నాచనసోముఁడు హరివంశముఁ బూర్తిగఁ దెనిఁగించి భారతామ్నాయమును సంపూర్ణముఁ గావించెడి తలంపునఁ దనగ్రంథమును బ్రారంభింపలేదు. తిక్కనసోమయాజిని, ఆయన రచించినభారతమును దనగ్రంథమునందుఁ జేర్కొనుటకు ముఖ్యకారణము కవిబ్రహ్మయం దతనికిఁ గలగౌరవమే యని తోఁచుచున్నది. శంభుదాసు వ్రాసినహరివంశముఁ జూచి తానీగ్రంథము వ్రాయలేదని ప్రపంచమునకుఁ దెలుపుట వేఱొకకారణము కావచ్చును.

"ఏ, గతి రచియించిరేని సమకాలమువారల మెచ్చ రేకదా!"—విజయవిలాసము.

ఇఁక నీ యిరువురిగ్రంథములఁ గుఱించియు నించుక విచారించెదము; హరివంశమునందలి పూర్వభాగమున శ్రీకృష్ణునిజననము మొదలు సాందీపునిచెంత విద్యాభ్యాసమువఱకు నీనడుమ జరిగిన బాలక్రీడలు, సాహసకృత్యములు, రాక్షససంహారములు మున్నగునవి యభివర్ణింపఁబడినవి. ఉత్తరభాగము జరాసంధుని పరాభవముతోఁ బ్రారంభమై రుక్మిణీపరిణయము, నరకాసురవధ, పారిజాతాపహరణము, మధుకైటభహిరణ్యాక్షాదిరాక్షససంహారము, శ్రీకృష్ణుని కైలాసయాత్ర, శివకేశవసమాగమము, పౌండ్రకవాసుదేవవధ, ఉషానిరుద్ధీయము, బాణాసురపరాజయము, బలిమర్దనము మొదలగుముఖ్యవిషయములతో సమాప్తినొందెను. నాచనసోముని యుత్తరభాగము ముఖ్యముగా నరకాసురవధతోఁ బ్రారంభమైనది. జరాసంధునిపరాభూతియు, రుక్మిణీపరిణయము నొకించుకమాత్రము సూచింపఁబడినవి.

సీ. కడిమి జరాసంధగంధసింధురముఁ దద్బంధుముండలితోన పాఱఁదోలె
బలిమి నాగాయుతబాహు జగత్ప్రాణతనయు గదాకేలిదర్ప మడఁచె
కీచకతోడ విరాటవీరఖేలనమున ధీరుఁ బ్రలంబదైతేయుఁ జంపెఁ
దెగువరాసభరూపు ధేనుకాసురుఁ బట్టి విన్నాణమున మేను విఱిచివైచె

తే. నగరపరిఖాపయఃపూరణంబు సేయ, సీరముఖమునఁ గాళిందిఁ జీరి తెచ్చె;
మెఱసి మూఁడులోకంబులమేటి మగలు, రాయనేర్తురె యాదవరాముతోడ.

ఆ. 1 ప. 8.

క. అనుటయు నాజనమేజయ, జనపతి యిట్లనియె రుక్మి చచ్చిన మగుడం
జని యాదవనగరంబున, జనార్దనుం డేమిచేసె? సౌజన్యనిధీ! ఆ. 1 ప. 12.

మఱియుఁ బారిజాతాపహరణముంగూర్చి సూచనయును లేదు. మధుకైటభహిరణ్యాక్షాదిదుష్టరాక్షససంహారములు బొత్తిగా విడువఁబడినవి. ఈలాగున నుభయగ్రంథంబులును బరికించినచో విషయవ్యత్యాసము విశేషముగాఁ గాన్పించును. ఇందులకుఁ గారణములు గొన్ని యూహింపవచ్చును.' సోముఁడే తన గ్రంథమున నిట్లు చెప్పియున్నాఁడు.

క. హలపాణిమహిమ చెప్పం, గలవా రెవ్వరు పురాణకథలన్ మఱియుం
దెలిసికొనుము నేఁ జెప్పక, నిలిచినచోటులు వివేకనిర్మలబుద్ధిన్. ఆ. 1. ప. 11.

కావునఁ గ్రంథమునందలి కొన్నిభాగములు పరిత్యక్తము లైనవని కవినోటనె తెలియుచున్నది. ఇట్లు కొన్నిభాగములను విడుచుటకు నాతఁడు దోఁచినకారణము లేవన :—

1. సోముఁ డుత్తరభాగమునైనను సమగ్రముగా వ్రాయ నుద్దేశించి యుండలేదు.

2. శ్రీ కృష్ణునికృత్యములనుమాత్ర మభివర్ణింపఁదలంచి హలపాణిమహిమఁ జెప్పవిడిచె.

3. శ్రీకృష్ణునికృత్యములయందును, రసపోషణసంవిధానమున కనువగు భాగములనుమాత్రమె స్వీకరించెను.

మఱియు నొకవిశేషము :—ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునందు హంసడిభకులసంహారమును గుఱించి సూచనయును లేదు. నాచనసోమనాథుఁ డీకథను బ్రత్యేకముగా నొకయాశ్వాసమున విపులముగ వ్రాసినాఁడు. ఈదృగ్విధములగుగ్రహణపరిత్యాగభేదములను బరిశోధించినచో, నుభయగ్రంథములందును విషయవ్యత్యాసములు మెండుగఁ గన్పట్టును.

ఇంతియ కాదు. విషయమునం దెంతభేదమున్నదో, శైలియందు నంత భేదము కాన్పించుచున్నది. ఆంధ్రభారతము సార్వజనీనముగా వ్రాయఁబడిన ట్లెఱ్ఱాప్రెగ్గడ తనహరివంశమును రచించియుండునని తొలుదొల్తఁ జెప్పఁబడినది. అదియే నిక్కమైనచో, హరివంశమునందలిశైలి ద్రాక్షాపాకముగా నుండి, మృదుమధురరచనలతో నలరారి, సులభగ్రాహ్యముగా నుండుటకుఁ గారణము వేఱ వెదుకనక్కఱలేదు. ఎఱ్ఱనప్రణీత మగుగ్రంథ మాయన ప్రబంధమని చెప్పినను నిక్కముగఁ బురాణమే. కావునఁ బురాణశైలినె వ్రాయఁబడినది. అనఁగాఁ గించిద్భాషాజ్ఞానులకును గ్రంథముఁ జదువ నభిరుచియు గ్రహింప సౌలభ్యమును దానియం దుండవలయును. లేనియెడ లాగ్రంథము పండితాస్వాదనీయ మగును గాని జనావళికి రుచింపదు. సోమునిగ్రంథము మహాప్రబంధము. అది సమస్తజనులకును సుగ్రాహ్య మగునట్లు వ్రాయఁబడినది కాదు. ఉభయభాషాజ్ఞానమును బాగుగఁ గలిగినవారే దానిని గ్రహింపఁజాలుదురు. ఇతరుల కది దురాసదము. కావున మొదటినుండియుఁ గవిత్వపాకరీతుల నుభయకవులును

నరకాసురుఁడు దేవలోకం బాక్రమించి యూర్వశిని రావించి యామెతోఁ జల్పినసంభాషణము నుభయగ్రంథములం జూడుఁడు.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము.

మ. వరుణుం దోలితి, నర్థపుం జదిపితి, నైరృతస్వామిన్ గెల్చితిన్
హరిఁ బోఁ జోఁపితి చేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు మెచ్చుల్మీఱ నీశుండ న
న్నరవిందానన! సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్.

చ. అనుటయు నమ్మృగాక్షి యిదియట్టిద; యంతటివాఁడ వైన నీ
వెను పసదే తలంప రిపుభేదన! సంయమికోటి భక్తితో
నిను నిఖిలాధ్వరంబులను నిత్యసమర్చితుఁ జేసి కేని నే
నును ముదమొప్పఁ గైకొని వినూత్నవిహారరసాబ్ధిఁ దేల్చెదన్.

ఇట్లెఱ్ఱన రెండుపద్యములఁ గ్లుప్తముగా ముగించెను. దీనినే నాచనసోముఁ డిరువదియేడుపద్యముల నెంతరసవంతముగఁ బెంచి వ్రాసెనో గ్రంథముఁ జదివినఁ దెలియఁగలదు.

ఉ. ఊర్వశిఁ దోడితెమ్మనుచు నొక్కనిఁ బంపఁ బదుండ్రు పాటి సౌ
పర్వణసౌధవీథులయుపాంతములం దిరుగంగ నంతకుం
బూర్వసురేశ్వరుండు సురపుంగవుగద్దియమీఁద నుండి గం
ధర్వులపాట వించుఁ బ్రమదంబునఁ బొందుచు నున్నయత్తఱిన్

* * * *

ఉ. తోరపుఁజన్నుదోయిపయిఁ దొంగలిఱెప్పల దాఁచి చూపు నీ
హారము లేనిక్రొమ్మెఱుఁగులై నిలువం గొలు వల్లఁ జొచ్చి య
చ్చేరువకంబముం గదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారపుబొమ్మవోలె నచటం గదలించుక లేకయుండఁగన్.

ఉ. ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లను బాకశాసను
డాలములో ననుం గదిసి యంతకపాశికుబేరయుక్తుఁడై
తోలుపులంబడెన్ సతులతోడనె డాఁగిరి దైత్యభీతులై
పోలఁదొలంగితేమిటికిఁ బొత్తులదానవు నీవు తొయ్యలీ,

* * * *

చ. అవు నిది వోలు వాసవుఁడా నంతకుఁడుఁ వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పద మేలెదరంచు నిట్టినే
నవహితయాగభాగము లహంకృతి మైఁ గొనకున్న, నూర్వశీ!
కవకవనవ్వరే త్రిదశకాంతలు వింతలు సేయునాపనిన్.

మఱి యొకదృష్టాంతము!

శ్రీకృష్ణుని కైలాసయాత్రసందర్భమున శివకేశవు లిద్దఱు నేకత్ర ఉపవిష్టులై యొకరినొకరు ప్రస్తుతించికొని నిజైక్యమును బోధించునవు డటఁ జేరిన నిలింప గణములు వారిసిద్ధిఁ గొనియాడిరఁట. ఆభాగమునంతయు రెండుగ్రంథములఁ జదివిచూచిన నుభయకవులయొక్కయుఁ గవితాధోరణులు వ్యక్తపడఁగలవు.

సోమనాథుఁడు 'సాహిత్యరసపోషణసంవిధాన' మం దెంతమిన్న యగుకవి యో విదితమగును.

సీ. అభ్రంకషం బైనయాలపోతు నితండుత్రుంచినాఁ డీతండు పెంచినాఁడు,

* * * *

రజతగిరిమీఁద హరిహరారాధనంబు.

సీ. సారసంబున లేవ నీరసంబునఁ జావఁ బద్మాసనుఁడు వీరిపాలఁగనియె

* * * *

హరిహరాత్మ నెఱింగితి మనిరి సురులు.

(నాచనసోమనాథుఁడు).

సీ. యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియు నేలోకనుతులఁ బెంపారువారు
కందర్పజనకుండు గందర్పదర్పైకదమనుండు నై లీలఁ దనరువారు

* * * *

* * * *

నెపుడుఁ గరుణతో వరదు లయ్యెదరుమాకు.

(ఎఱ్ఱాప్రెగ్గడ).

ఎఱ్ఱనరచన యీవిషయమునఁ గొంత నీరసముగా నున్నది. శివకేశవు లిద్దఱు నొకచోట సమాసీను లై దేవసంఘంబులును మునిబృందంబులు నచ్చెరువొంది వినుచుండఁ దమయద్వైతభావమును దిగంతవిశ్రుతనినాదముగా నుద్ఘోషింపఁ దత్ప్రకృతిస్వారస్యమును సముచితరసోదయముగ నభివర్ణింపమి కవితాప్రౌఢిమ కొకింత న్యూనత గల్గించుటగాదే!

వే ఱొకదృష్టాంతము :—

ఇందుధరోపాఖ్యానమును, ఉషానిరుద్ధీయము నుభయగ్రంథములయం దును జదివి చూడుఁడు; సోమనాథునికవిత్వము సర్వతోముఖముగ నెఱ్ఱాప్రె గడకవితకంటె రసపుష్టియందును, శబ్దచమత్కృతియందును, భావభావనావికసన మునందును నెంత ప్రౌఢతరముగా నున్నదో విస్పష్టమగును. తారతమ్యనిరూప కము లగురెండుపద్యములమాత్ర మిట నుద్ధరించెదను :—

సీ. తూలితకస్తూరికము లగుకుచముల క్రేవల నఖపదశ్రీలు మెఱయ
విసృతాంజనచారువిభవంబు లగునేత్రముల దట్టకెంపులేముల భజింప
గళితతాంబూలరాగము లగుబింబాధరముల దంతక్షతరచన బెరయ
నాక్షిప్తతిలకంబు లగుఫాలముల నార్ద్రిలంబంబు లగుకుంతలములు పొదువ
సన్నవలిపంపుటారులు జఘనములును, నంట నారులు జిగిమెక్కియసరకొను
నందు నెత్తురుకాంతి నింజార నంబు, సేక మభినవద్యుతిఁ జేసెఁ జెలువగమికి.

ఎఱ్ఱన. ఉ. హ. ఆ. 7.

సీ. అరుణారవిందంబు లని క్రొమ్మొక్కెనోకాని చిగురుటాకుల నింత చేరరావు
పులినంబు లని చాల బుజ్జగించెనోకాని మరుచక్రముల నింత మరిగిరావు
చక్రవాకము లని సవరించెనోకాని కరికుంభముల నింత గదియరావు
గండుమీలని చాల గారవించెనోకాని పూవుఁదూపుల నింత పొందిరావు

తే. తరఁగలాత్మీయధనములదాయలైనచరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి, తరఁగ లింతులు పైకొన్నఁదలఁకినట్లు.

ఈలాగున నుభయగ్రంథంబులయందును నేభాగములు సరిపోల్చిచూచినను సోమ నాథునికవిత్వ మెఱ్ఱనార్యునిదానికంటె రసవత్తరముగను ప్రౌఢతరముగ నున్నదని చెప్పుట కొకించుకయును సందేహము కలుగలేదు. ఇట్లు సోమనాథునికవిత్వ మును భూషించుట యెఱ్ఱనార్యునికబ్బమును నిరసించుటగాఁ గవితాభిమాను లూహింపఁదగదు. గ్రంథవిమర్శనమందు యథార్థగుణనిరూపణము చేయక తప్పదు. హెచ్చుతగ్గులు నిర్ణయింపకతీరదు. కవితాభిమానమే గాని కేవలము కవీశ్వరాభిమాన మనుచితము, నక్రమము.

ఇంతవఱకు గ్రంథముల రెంటినిమాత్రమే విమర్శించి శయ్యాధోరణుల యందలి తారతమ్యముల నిరూపించితిని. ఇంక నిరువురుకవుల ప్రత్యేకకవితా లక్షణముల గుర్తింపఁగడంగెద. ఈవిషయము కొంతమట్టు కప్రస్తుత మైనను,

ఆంధ్రమహాకవులకవికాలలక్షణనిర్ణయములయం దింకను, నిశ్చితాభిప్రాయములు లేకపోవుటయుఁ, బలువురు పలువిధముల నూహించుటయు, వాదప్రతివాదములకు విశేషముగ నవకాశముండుటయు, నిత్యాదికారణములచేత, నీమహాకవుల కవిత్వము లేయేవిషయములలో నేయేలాగున నున్నవో చర్చింపనమకట్టితిని. పాఠకు లీయభ్యంతరప్రసంగమును క్షమింతురుగాక.

కాళిదాసు, భవభూతి, భారవి మొదలగుసంస్కృతమహాకవీశ్వరుల కవనధోరణులసామ్యభేదములు విస్పష్టముగాను సమగ్రముగాను దెలియవచ్చుచున్నవి. కాళిదాసుకవిత్వ మిదమిత్థమనియు, భవభూతికవిత్వమిదమిత్థ మనియు, నిర్ణయించి కాళిదా సీయాయీవిషయముల నెక్కుడైనచో, భవభూతి యీయా విషయముల మిన్నయని నిర్వచింపఁబడినది. అటువంటినిర్వచనము తెలుఁగుకవీశ్వరుల గుఱించి యింకను జేయువలసియున్నది. విశేష మగువిమర్శనయుఁ, జర్చయు, జరగినఁగాని వారివారికవితాప్రకృతి నిరుక్తికాఁజాలదు. కావున సందర్భావశ్యకత నతిక్రమించియైనను, పైనుద్దేశించినవిషయమును జర్చింపఁబూనితిని.

ఎఱ్ఱాప్రెగ్గడహరివంశమేగాక మఱి కొన్నిగ్రంథములఁగూడ రచియించెను. అందు భారతమందలి యారణ్యపర్వశేషము, రామాయణము, నృసింహపురాణము, మున్నగునవిముఖ్యములు. నాచనసోమనాథుఁడును, వసంతసేన, యిత్యాది మఱికొన్నిగ్రంథములు వ్రాసినటులఁ గాన్పించుచున్నది. కాని వసంతసేనయందుఁ గొన్నిపద్యములుతక్క, ఇతరగ్రంథము లేవియు నింకను లభింపలేదు. లభ్యములైనవఱకు, వీరిరువురిగ్రంథములు చదువఁగా, వీరి కవితలయందుఁ గొన్నివిస్పష్టములైనలక్షణములు గాన్పించుచున్నవి.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికనాల్గవసంపుటము 9, 10, 11, సంచికలలో బ్ర॥ శ్రీ॥ రా॥ అనంతకృష్ణశర్మగారు, ఎఱ్ఱాప్రెగడ, సోమనాథులకవిత్వములను సరిచూచి తారతమ్యముల నిర్ణయించిరి. సోమనాథునికవిత్వముకంటె, నెఱ్ఱాప్రగడకవిత్వ మెక్కుడు ప్రశస్తముగా నున్నదనియుఁ గావున సోమనాథునికి నెఱ్ఱాప్రెగడకంటెఁ దక్కువస్థాన మీయఁదగిన దనియు వారిసిద్ధాంతము. "లోకో భిన్నరుచిః" అనునట్లు వారి కట్టియభిప్రాయ ముండుట సమంజసమే కాని వారు సిద్ధాంతీకరించుటలోఁ గొన్ని పొరపాట్లున్నవని నాయభిప్రాయము. ఆయన వ్రాసినవ్యాసమును జాలవఱకు ఖండించుట కవకాశమున్నను, సుదీర్ఘ మగువ్యాసమునకు దీర్ఘతర మగుప్రత్యుత్తర మిచ్చుట కనువగుసందర్భ మిది కాదని విరమించెద.

కవిత్రయమువారును, నాచనసోముఁడును, నుత్తమకవీశ్వరులని చెప్పుట కెవ్వరును సందేహింపరు. కాని వారికంటె వీరెక్కువా? వీరికంటె వారెక్కువా యనువాదప్రతివాదములఁ జేయుటయందుఁ గొంత పూర్వాలోచన కావలసియున్నది. అదేదన, నొకానొకకవీశ్వరుఁ డుత్తమకవి యనిప్రసిద్ధినొందుట కాయనయందేదో మహత్తర మగువిశేష ముండినఁగాని యట్టిలోకప్రసిద్ధి రానేరదని తెలిసికొనుటయే. అటువంటి ప్రసిద్ధికిఁ గారణము లెవ్వియని నిర్ణయింపఁదగు. కావున మహాకవీశ్వరు లని యాంధ్రప్రపంచమున వేనోళ్లఁ జాటఁబడిన ఈమహానీయుల కవిత్వములయం దనన్యసామాన్యప్రాశస్త్య మెద్దియో తెలిసికొనఁ గోరుట కర్తవ్యము; ఏవిషయములయం దెవరెవ రగ్రగణ్యులు, ఒకానొకవిషయమునం దొకరికంటె మఱియొక రధికులా? కారా? యనుసమాలోకనకుతూహలమున విమర్శించు టుచితము. ఈసమరసవిమర్శదృష్టిని, ప్రస్తుత మెఱ్ఱాప్రెగడసోమనాథులఁగూర్చి మాత్రము చెప్పఁబూనెదను. ఏతద్గ్రంథావకాశమునుబట్టి, విపులదృష్టాంతము లీయక నాయభిప్రాయములనుమాత్రము సంక్షేపముగ నిచట వ్రాసెదను. సోదాహరణ మగువిపులవిచారణ స్థలాంతరమునఁ జేయఁదగు.

ఉభయకవులయందలి సమానగుణములఁ గనుఁగొని తరువాత భేదముల నిర్దేశించుట కార్యక్రమము.

i. ధారాశుద్ధియం దుభయులు నొకరికొకరు తీసిపోరు. వారి కవితాప్రవాహ మనర్గళము, అతివేగము, అయత్నోపలభ్యము, ఐచ్ఛికవిహారసంపన్నము.

ii. ఉభయభాషాపాండితియం దుభయులు సమానగౌరవముఁ బొందనర్హులు.

iii. భావభావనాప్రపంచమునం దిరువురు స్వైరవిహారధీరులు.

iv. కావ్యలక్షణసంప్రదాయేత్యాది వైదగ్ధ్యమునం దిద్దఱుఁ దులఁదూఁగుదురు.

v. మఱియుఁ బురాణేతిహాసకథాపారగత్వమున నిరువురకు హెచ్చుతగ్గులు నిర్ణయింపఁబూనుట శశవిషాణాన్వేషణము.

vi ఇంతియగాక, ఉభయులు సమాననైష్ఠికసదాచారసంపన్నులు,

వేదవేదాంగవిశారదులు, సంతతభగవద్భక్తి పరాయణులు నై, వారాశ్రయించిన యాస్థానముల, ననూనగౌరవాతిశయముల బొందియుండిరి.

సమకాలికులై యుండి యిన్నివిషయముల సమానలక్షణములు గల వీరిరువురికి నన్యోన్యవిజిగీషయుండుట యస్వాభావికమా? ఆశ్చర్యజనకమా? కావుననే యొకేగ్రంథము నుభయు లాంధ్రీకరింప నుద్యోగించుట చేకూరినది.

ఇంతదనుక వారిజ్ఞానవిజ్ఞానపరికరసమృద్ధిని విడదీసి ప్రత్యేకముగాఁ జూచి, వా రొండొరులకుఁ దీసిపోరని నిర్ణయించితిమి. ఇటుపైని వారీపరికరనికరము నెట్లు కవిత్వమునందు వినియోగించిరో, వినియోగింపఁగలిగిరో, చూతము.

ఈకవిపుంగవుల కిద్దఱకుఁ గలభేదము, కర్ణార్జునులకువలె, సాధనసామగ్రియొక్క ప్రయోగసంసిద్ధియందుఁ బ్రాయికముగ నున్నదని నాయభిప్రాయము. సామర్థ్యమునందు హెచ్చుతగ్గులు లేవు. మేధాశక్తియందు జంకుగొంకులు లేవు. కాని సద్యస్స్ఫూర్తియు, పద్యాలోకనచతురతయుఁ గొంతవఱకు వేఱైయున్నవి. వీరిద్దఱియందలి తారతమ్యము నిర్ణయించుట కిదియే ముఖ్యాంశమని నాకుఁ బొడకట్టినది.

ఉభయకవులు కవితాశైలియందు వేఱువేఱుమార్గములఁ ద్రొక్కినసంగతి యెల్లరకు విశదమే. ఎఱ్ఱాప్రెగడశైలి యెక్కుడుమృదువైనదియుఁ గోమలమైనదియు, నై యున్నది. ఆయన సామాన్యముగా వాడినశబ్దములు గీర్వాణమునందయినను, ఆంధ్రమునందయినను, సరళమైనవియు, సుస్వనయుతమైనవియుఁగా నున్నవి. మృదులపదసంవిధానము, సహజకవితాధారతోఁ గలసి గగనకల్లోలినీకలస్వనమువలె వీనులకు విందొనరించుచుండును. ఇఁక సోమనాథుని శైలియన్ననో యనేకవిధములఁ బరుగిడును. ఒకప్పుడు మృదుమధురశబ్దములతో వీనులకు, వేణుగానమువలె నుండును. మఱి యొకప్పుడు దీర్ఘ మగు సమాసములతో నుద్దండమారుతమువలె నుద్ఘోషించును. ఇంకొకప్పుడు సప్తతంత్రీసమ్మేళము రీతిని స్వరమాలికలతో మైమఱపుఁ బుట్టించును. ఈలాగుననే సందర్భంబునకుఁ దగిన ట్లాసందర్భమున, నుచితగతుల నాశైలి మార్చుచునుండును. ఈయనశబ్దజాలమునం దెక్కువపటుత్వమును, జీవమును, జవమును, నున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. శబ్దములు స్వభావసిద్ధముగనే తత్తద్రసముల కనువగురీ

తినిఁ బ్రవాహవేగమున దొరలుచుండును. గురుతరభావము లనువదించుటకు గురుతరశబ్దములేగాని పేలవమగు పదములు వాడఁబడియుండలేదు.

ii. పదగుంభనమందు భేదమున్నట్టులు, ఛందోవృత్తసంగ్రహణమందును భేదము గాన్పించుచున్నది. సోమనాథుఁడు దఱుచుగా నుత్పలచంపకమాలలను, సీసములనుమాత్రమే వాడెను. కందములు, గీతములు నంతకంటె సకృత్తుగాఁ గానఁబడును. శార్దూలము లరుదు. తదితరములు నామావశిష్టములు. ఈ లాగున మాలావృత్తముల నెక్కుడుగా నుపయోగించుటకుఁ గారణమేమన నాయన రసోద్ధతికిఁ దగినశబ్దజాలమును గూర్చినట్లే ఛందస్సహాయమునుగూడఁ గైకొనెను. కావున రసప్రవాహముతో సమానముగ, శబ్దవృత్తప్రవాహము పరుగిడుచు, రసవికాసము నినుమడింపఁజేయును. భవభూతి, మురారి, మిల్టన్, టెనిసను మొదలగుకవులను జదివినవారికిది క్రొత్తవిషయము కాదు. ఎఱ్ఱాప్రెగ్గడ యీసాధనసంపత్తి నంత చతురతగా వాడి యుండలేదు. ఉభయులయందును రసము నైసర్గికమైనను, దానిని బోషించుటయందు సోమనాథుఁ డెక్కుడు నేర్పుఁ జూపినాఁడు.

iii. భావప్రకటనమునందు శంభుదాసుఁడు కేవలము నైసర్గికసారళ్యమునే యనుగమించెను. సామాన్యమనుజుఁ డేవిషయమునైన నెట్లూహించునో, సాధారణముగ నాయన యాలాగుననే భావముల నిర్వక్రముగాను, నిదానముగాను నూహించును. అనఁగా నాయన స్వభావముచే సుందర మగుబంగారమును సామాన్యముగ నాస్థితియందే యుంచివాఁడును. ఇఁక సోమనాథుఁ డన్ననో, యానైసర్గికసువర్ణమునకు మఱింత తళుకుబెళుకులు గలుగునట్లు నగిషీపనిఁ జేయును. అనఁగా సహజసువర్ణముఁబోలు తననైసర్గికభావమునకు సాహిత్యపోషణ మనెడి యొకనగిషీపనిఁ జేసియున్నాఁడు. కావున నాయన చిత్రించిన భావములు కేవలనిసర్గజన్యములయినను, గొంతచాతుర్యవిలక్షితములై యున్నవి. సహజసౌందర్యవతి యగుమానిని నవరత్నభూషితురాలయినఁ దప్పేమి? ఈకారణమున నెఱ్ఱాప్రెగడయందలి భావవిలసనము, సోమనాథునియందలి దానివలెఁ దటాలున మనసునందు గోచరింపదు. కవిత్వ మొకకళయైనచో, నైసర్గికభావమునకుఁ (Nature) దగినరసపోషణసంవిధానముఁ (art) జేయుట యొప్పేగాని తప్పు గాదు. అట్టి సంవిధానమం దగ్రగణ్యుఁడుగావుననే, సోమనాథునికి 'సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి' అని బిరుదము నిలిచియున్నది.

మఱియు, వర్ణనలవిషయమున నుభయకవులు పెఱ తెలుఁగుకవులవలెనే అనావశ్యకదైర్ఘ్యదోషమున కవకాశ మిచ్చియున్నారు. చిన్నచిన్న వర్ణనలు స్వభావోక్తములయి మనోహరముగ నున్నను, దీర్ఘవర్ణనలు కొంతదనుక భాషైక చాతుర్యమునుమాత్రమే చూపుచున్నవి.

ఈసందర్భముల నన్నిఁటినిజూడఁ గేవలము సరసకవితారచనయందు సోమనాథుఁ డెఱ్ఱాప్రెగడకంటె నెక్కుడు ప్రౌఢత్వమును, రసికత్వమును గనఁబఱిచెనని చెప్ప నొప్పుఁగాని శంభుదాసుఁ డాంధ్రవాఙ్మయమున కెక్కుడుగ్రంథముల నిచ్చి యెక్కువయుపకారమును జేసినాఁడు. గ్రంథబాహుళ్యమునందుఁ దిక్కనవలె శంభుదాసగ్రగణ్యుఁడైనను, గేవల కవితాప్రకృతియందు సోమనాథుఁ డెఱ్ఱనకంటె మిన్న యని తలంచెద. యాథార్థ్యము నాంధ్రకవితాభిజ్ఞులు నిర్ణయింతురుగాక !

నాచనసోమనాథుఁడు కన్నడభాషయందుఁ గొన్నియుద్గ్రంథముల రచియించినట్లు తెలియవచ్చుచున్నది. కన్నడగ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ జేరవుగావున, నిచ్చట వానితో నేమియుఁ బ్రసక్తి లేదు.

చేకుమళ్ల అచ్యుతరావు.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీదోరంతర వేద, ప్రోదితభాషావిశేషభాసురకీర్తి
శ్రీదార్ఢ్య వివిధపూజా, మోదితగిరిసుహితృకాంత! ముమ్మయకాంతా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు తల్లిదండ్రుల నూరార్చి వెడలి సుకుమారుండు నిజాంతర్గతంబున. 2

గీ. పోయె నుపదేశకాలంబు పూర్వమునను, కడచె ధైర్యంబు జఠరవిశ్రాంతమయ్యె
శీలసంపత్తి యిఁక నేమిసేయువాఁడ, భామినీసక్తి మన్మథుబారిఁ బడితి. 3

ఉ. పంతం బోడదు ధర్మముం దగవునుం బాడిం గులంబు న్విచా
రింతు న్వేదపురాణశాస్త్రమతపారీణుండఁ గానెట్లు క
ల్పాంతద్వాదశభానుమత్కిరణదాహక్రూరకామవ్యథా
సంతాపజ్వరవేదనాభరమునం జాకుంట సిద్ధించినన్. 4

సీ. చాండాలుతోఁబుల్కశత్వంబు గైకొను బ్రహ్మహత్య యొనర్చి బ్రాహ్మణుండు
క్రిమియై పతంగమై కీటమై జన్మించు నాసవం బాని భూమీసురుండు
క్రవ్యాదసత్త్వసర్గమున నుద్భవమందు విప్రుఁ డాచార్యుని వెలఁదిఁ గవిసి
శ్యామచారుండు పిశాచమై బాడబుం డన్యునివిత్తంబు నపహరించి
యయిన నేమిగా వింటిలో నన్నిటికిని, సుఖము దుఃఖంబుఁ జర్చించిచూచినప్పు
డెల్లసంసారులకుఁగుందు హెచ్చు........, లేకయుండుటగందు మో లేదొ జగతి.

గీ. వామదేవుండు శుకుఁడుఁ గేవలము దక్క, ముక్తులెవ్వరు వింటిమే ముజ్జగమున,
జంతువుల కెల్ల సరియ సంసారయాత్ర, విధినిషేధంబులకుఁ జొప్ప వెదకనేల.

ఉ. ఆతంకంబున కేమికారణము బ్రాహ్మణ్యం బింతయుం జూచి యే
తాతల్గట్టినచెర్వులే శ్రుతులు బోధప్రక్రియల్ స్వల్పమే

చేతోజాతు నుపాశ్రయించెదఁ బరస్త్రీల న్వినోదించెదన్
మాతంగీపరమేశ్వరిం గొలిచెద న్మద్యంబు సేవించెదన్. 7

గీ. అష్టమావతారంబున నాదిపురుషుఁ, డచ్యుతుఁడు విశ్వకర్త యనాదినిధనుఁ
డర్జునుండును దాను నేకాంతగోష్ఠి, విశ్వమును నెఱుఁగమె.... .... .... 8

మ. బహువేదాంతమతానుసాధితమహాబ్రహ్మాణియం చాడుదుర్
మహిమోహాంధులు గొంద ఱేని యాలె బ్రహ్మం బెట్టు వా రెట్టిరో
యహహా బ్రహ్మము వారయే నులుకళయ్యం ద్రెల్లి నిద్రింతురో
జహదుత్సర్గముగాఁగఁ జేయుదురొ విష్ఠామూత్రనిర్మోక్షమున్. 9

సీ. కల్పద్రుమంబుతోఁ గామధేనువుతోడ నమృతాబ్ధినవతార మయ్యె నెద్ది
బృందారవనమధ్యమందారతరులలో హలపాణి కెద్ది ప్రత్యక్ష మయ్యెఁ
ద్రిపురాంతకుని యర్ధదేహంబునకు నెద్ది మదనసంఫుల్లసంపత్తి యయ్యె
నవసుధారూపమై పవనభుగ్భువనాధిపతి కెద్ది ప్రాణంబుప్రాణ మయ్యె
నట్టి భవభేషజము నాసవామృతంబుఁ, గన్నుఁగానకళపియించెఁగాక యొకఁడు
తత్సమానము లగుపదార్థములు గలవె, భూతభావిభవత్కాలముల ధరిత్రి.

వ. అని. 11

సీ. కర్పూరరజములోఁ గలిపి కేతకిధూళి నఖిలాంగకముల నభ్యంగమాడి
జలజనాళీతంతుసందానితములైన యజ్ఞోపవీతంబు లఱుతఁదాల్చి
వారాంగనాస్తనహారవిభూషల నక్షమాల్యముగఁ జే నలవరించి
కస్తూరికామిశ్రగంధసారంబున నలికంబునఁ ద్రిపుండ్ర మనువుపఱిచి
చంద్రికావేళఁ బరిపాండుసౌధవీథి, శక్తిఁబూజించి దేవీప్రసాదమధువు
పుచ్చుకొనివిప్రుఁడాకంఠపూరితముగ, వెలఁదులునుదానునప్పుడువినిమయముల.

క. వనితల కంగప్రభా, ళనమక్షివిఘూర్ణనంబు లజ్జావిగమం
బనవస్థితి మధుపానం,బునకు సురతమునకు సదృశములు వక్రంబుల్. 13

గీ. త్రిసరకాస్వాదభవమహోద్రేకలహరి, ధరణిదేవుఁ డాయోజ మత్తావహించి
యారణాలుపఠింపంగ నాలకించి, శంబరారాతి రతిచేయి చఱచి నవ్వె. 14

సీ. ఇంటనున్నాఁడొ వాఁ డెచ్చోటనున్నాఁడొయొంటియో యెంద ఱేనున్నవారొ
మిన్నకున్నాఁడొ యేమేఁబల్కుచున్నాఁడొ నిద్రించినాఁడొ క న్దెఱచినాఁడొ
యాడుచునున్నాఁడొ.... .... ....గర్వించియున్నాఁడొ శోకించినాఁడొ
.... .... .... .... .... .... ....యుత్సేకించి యుల్లాసించినాఁడొ కలంగినాఁడొ

యుత్సవమొ వైభవమొ లేమిదో కలిమిదో
పగలో రాత్రియొ యెఱుఁగఁడా బ్రాహ్మణుండు
నవమధూక ప్రసూనసంభవపుమధువు
దలము దప్పంగఁ ద్రావి మత్తావహించి. 15

క. సుకుమారుఁ డిట్లు నానా, ప్రకరంబుల పీటిలోనఁ బడుపై తిరుగన్
సకలజనులు మొఱవెట్టిరి, యొకనాఁ డత్యాగ్రహమున నుర్వీశుసభన్. 16

క. దేవరప్రతినిధిఁగా సం, సేవింతుము యజ్ఞదత్తు సిద్ధము యతనిన్
భావింతుము తత్తనయుని, యావనసంప్రాప్తి లేనియటము న్నెల్లన్. 17

వ. అవధరింపుము సుకుమారనామధేయుం డైనమంత్రినందనుండు సౌందర్య వంతుండును గామశాస్త్రకళావిధిజ్ఞుండును నై జారచోరవిటధూర్తవర్గంబులం గూడి వేడుకకాఁడై పుణ్యస్త్రీలయిలువరుసఁ జెఱుచుచున్నవాఁ డతని వారింపను నారీజనంబుల శిక్షింపను సమర్థులము గాక యున్నార మద్దురాత్మకుని న్యాయసదృశం బైనదండంబువలన దండించునది యని విన్నవించిన మహీపాలుం డతని రప్పించి వాగ్దండనంబున దండించి పురంబును దేశంబును వెడల నడిపించిన రాజావమానితుండై యప్పాపి కీటదేశంబునకుం బోయి యందుఁ గొన్నిదినంబులుండి హూణమండలంబునకు నేతెంచువాఁడు కాంతారమధ్యంబున నతిక్షుత్పిపాసాపరవశుండై తనలో నిట్లని వితర్కించుచుండె. 18

ఉ. ఆరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గనుపట్ట గిన్నెలోఁ
జెరుఁగును వంటకంబు వడపిం దెలునుం గుడువంగఁ బెట్టు ని
ర్భరకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లి యున్న దే
హరహర యెవ్వ రింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్. 19

వ. అని తనలోనం దలపోయుచుం జనిచని ముందట. 20

సీ. స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి
మణిదర్పణము నభోమణిమార్గలక్ష్మికిఁ జంద్రాతపమునకు జన్మభూమి
యర్ధేందుమకుటాట్టహాసంబునకు జోడు పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబమభ్రముప్రభుహారణమునకు నసుఁగుఁజుట్టము శారదాభ్రములకుఁ
గమఠతిమినక్రవిక్రమక్రమవిహార, చటులతరవీచికాఘటాసమదరూఢ
హంసకులసన్నినాదసంవ్యాప్తదిగ్వి, భాగ మీక్షించె నతఁడు తడాగ మెదుర

మ. వసుధానిర్జరుఁడు న్మహాసరసిలో వార్వీచులం దేలెఁ ద్రా
వె సుధాసన్నిభమైనవారిఁ దటపృథ్వీజావళిచ్ఛాయలో
వసియించెన్ లహరీసమీరములు నధ్వశ్రాంతి పోకార్చె
న్బిసకాండంబులు మేనఁగూర్చెఁ జలువ ల్నిర్మోకసంకాశముల్. 22

క. వరశీకరార్ద్రపుష్కర, కరుఁడై యాతండు గంధకరిరాజుక్రియం
బరిషేకాంతరమునఁ దా, సరసిరుహాకరము వెడలి చాలఁగ నొప్పెన్. 23

సీ. వైదూర్యమణిశిలాస్వచ్ఛోదకముగానఁ గౌతుకం బొనరించెఁ గన్నుఁగవకు
శిశిరసంస్పర్శవీచిమారుతముగాన సంగకంబులకు నిం పావహించెఁ
గమలకేసరరేణుగంధోల్బణముగాన ఘ్రాణేంద్రియమునకుఁ బ్రమద మొసఁగెఁ
గలహంసకులకలకలకలాయనముగా శ్రుతిసంపుటములకు సుఖమునిచ్చె
.........సలిలంబుసమ్మోదమునను జేసె, నాలుకకునప్పుడవనిబృందారకునకు
సైకతారూఢజలమానుషీకదంబ, కాంక్షితారమయూఖంబు కమలవనము.

క. కొలనిదరివటము నీడన్, శిలతల్పమునందుఁ గొంతసేపు శయించెం
జెలువ మగువలిపెనుప్పటి, తలగడఁగాఁ జేసి సచివతనయుం డలఁతన్. 25

గీ. బహుళపత్త్రపాకదంబములలోనఁ, బ్రభవ మొందినయంధకారంబువోని
కొలనిదరికాననంబులోఁ గొంతప్రొద్దు, నలపువాయంగ నిద్రించె యాజ్ఞదత్తి.

గీ. డప్పిదీఱంగమధురకాండంబుఁ గ్రోలి, కడుపునిండంగఁ దూఁడుఁ దీఁగలుభుజించి
యెండవాలారునందాఁక నిందుకొలని, తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు.

చ. అపుడు విలంబమాన మయి యంబరకోణతటాంతరంబునం
దపనునిమండలంబు బెడిదం బగువేఁడిమి నొయ్య వీడ్కొనెం
గపిలములై మయూఖములు కార్తికమాసకలాపపింఛమై
త్రపునలతాశలాటుసముదాయముచాయఁ దిరస్కరింపఁగన్. 28

గీ. అంతలో నిద్రమేల్కాంచి యువనిసురుఁడు, జిగమిషాబుద్ధి నీక్షించెఁ జిత్రభాను
నభినవోన్మేషకుటిలజిహ్వాప్రకార, లోలతారకకేకరాలోకనమున. 29

శా. కాంతారాంతరభూమిచెంత శబరగ్రామంబు పద్మాకర
ప్రాంతక్షోణితలంబునం గలుగ సంభావించె విప్రుం డెదన్
దంతిస్కంధకపోలకుంభపలలాదక్రూరకౌలేయకీ
సంతానస్ఫుటకంఠఘుర్ఘురతరద్రాఘిష్ఠనాదంబులన్. 30

సీ. ఆదికాలమున మాయావిలాసిని యైనమురదైత్యదమనునిమూర్తిఁబోలె
ధరణీతలంబునఁ జరియింపనేర్చిన పురుహూతమణిశిలాపుత్త్రిఁబోలెఁ
గామినీరూపంబుఁ గైకొన్నశంబరారాతికాలాయసాస్త్రంబుఁబోలె
వేడ్కనై మానుషీవిగ్రహంబు ధరించి విహరించుతొలుకారువేళవోలె
నంధతామిస్రమునునవిద్యయునుబోలె, భువనమోహనరూపవైభవములొలయ
లీల నేతెంచె నొక్కచండాలకన్యక లలనఁ జిఱుబంతిపసుపాడఁ జెలియఁ దాను.

శా. ఆచండాలకులప్రసూత యగుకన్యం గన్యకారత్నముం
జూచె న్దవ్వుల యాజ్ఞదత్తి విపినక్షోణీవిభాగంబునన్
వాచాగోచరసౌకుమార్యనవలావణ్యాన్వితం బుష్పనా
రాచుం డిక్షుశరాసనంబుఁ దనదోర్దండంబునం గూర్పఁగన్. 32

ఉ. యోగసమాధితత్పరత నున్నవిధంబునఁ బాసినట్లు మూ
ర్ఛాగమమీలితాత్ముఁ డగుచాకృతినిశ్చలదేహయష్టియై
సోగకనుంగొన ల్నుదురుచొక్కుల కిక్కలుగాఁగ నత్తఱిన్
రాగరసాతిరేకమున బ్రాహ్మణుఁ డాదటఁ జూచె మాలెతన్. 33

సీ. అప్సరస్స్త్రీవోలె నకులయై యూర యీపైదలి కన్నులపండువయ్యెఁ
జారుయౌవనరూపసంపన్నయై మోకవనరేఖయునుబోలెఁ బెనఁచె వేడ్కఁ
బొలఁతి ప్రావృడ్వేళవోలె నళివినీలఘనవేణియై యిది గరము మెఱసె
నిభరాజనిభయాన యిదిశరదృతువువోలెఁ బుండరీకాక్షియై పొలుపుమిగిలె
ముట్టరానిది యైనట్టిమూర్తివోలెఁ, జిత్తరువువోలె దృష్టికచ్చెరువొనర్చె
మెలఁత మధుమాసకుసుమసమృద్ధివోలె, జాతివిరహితయయ్యుసంప్రీతినొసఁగె.

గీ. దీనిఁగల్పించె నజుఁ డభిధ్యానమునను, నాతి మునుముట్టరాకుండ నంత్యజాతి
ముట్టుటయ కల్గెనేని యిమ్ముదితమేను, గందకుందునెపుష్పంబుకంటె మృదువు.

వ. అని విస్మృతనిమేషంబు గీలించి ముకుళితపక్ష్మాంచలంబును జిహ్మేతరతరళశా
రోదరంబును నగువీక్షణంబున నవ్వెలివాడప్రీడావతి నీక్షించుచు నవ్విప్రుండు
మదనశరశలాకాశంకాసంకలితహృదయుండై స్తంభితునిభంగి విలిఖితునిచం
దంబున నుత్కీర్ణునిపగిది నున్మత్తునిలాగున మూర్ఛితునిప్రకారంబునం దన్నుఁ
దా నెఱుంగక నిశ్చేష్టపడి నిశ్చలాంగుండై యుండె నప్పుచ్చకంటియు నలవోక
వోలె నతిస్వచ్ఛసౌభాగ్యచ్ఛాయావినిర్భర్త్సితమత్స్యకేతనుం డగునాబ్రాహ్మ
ణుఁ గనుంగొని నిజాంతరంగంబున. 36

గీ. విప్రవేషంబుఁ దాల్చినవిష్ణుఁడొక్కొ, బ్రాహ్మణుం డైనశంబరారాతియొక్కొ
బాడబాన్వయరూపసంప్రభవుఁడైన,చందురుండొక్కొ-యితఁడతిస్వచ్ఛమూర్తి.

వ. అని యంతంతం జేరవచ్చియయ్యంత్యజాతిసీమంతిని యశేషజనపూజనీయులు బ్రాహ్మణు లని తమకులంబుపెద్దలవలన వినుటం జేసి యుఁ దానే దేనొక్క పూర్వజన్మకృతపుణ్యసంస్కారవిశేషంబుననో బాల్యంబునాఁటనుండియు రూపంబు వినయంబు దాక్షిణ్యంబు మధురాలాపకౌశలంబు నిస్సంగత ప్రశాంత మహానుభావంబు శుచిత్వంబు గౌరవంబు సద్భావంబుగుణంబులు నైసర్గికంబు లయియుండుటనో భర్గఫాలనయనకృశానుజ్వాలాజాలహేలాచుళుకితావయవుండు గానికుసుమకోదండుండునుంబోలెఁ గన్నులపండువై తప్తకాంచనవర్ణంబును గోరోచనాగౌరంబును జాంపేయకుసుమకేసరరేణుత్రసరేణువిసరప్రసంగంబును నగుదేహప్రభాప్రవాహంబున గహనషండం బశేషంబును వెలింగించువాని నుద్భిన్ననవశ్మశ్రు నభినవయావనోద్భాసితు షోడశవర్షదేశీయు నాదిగర్భేశ్వరు నమాత్యనందను సుకుమారుం గుమారసన్నిభుఁ దప్పకచూచి భయసంభ్రమడోలాయమానదంతతాటంకవలయం బగుననట్లుగా నిబ్బరంపుగుబ్బచన్నుల బిబ్బోకంబు బాహుమూలకూలంకషంబై యీషద్విలోకనీయంబుగఁ గేలుదోయి సేవాంజలిపుటంబు లలాటంబునఁ గీలించి యయ్యగారికి నమస్కారం బని యధరకిసలయంబునకు దశనరత్నాంకురజ్యోత్స్న కుసుమస్తబకంబుగా సహకారపల్లవాస్వాదకషాయకంఠకలకంఠకామినీకోమలకుహూంకారకోలాహలకరంభితపంచమరాగప్రపంచంబునకు మించుఁ జూపు కంఠస్వరంబునం బలికిన. 38

గీ. వెలఁది మాలెతగాన దీవింపకయును, నొప్పెడిదిగాన నూరకయుండకయును
ధరణిదేవుండు గైకొనె దాని మ్రొక్కు, కేలుఁదామర తిర్యగాందోళనమున.

ఉ. శంబరవైరిసన్నిభునిఁ జారుతరోజ్జ్వలమూర్తి విప్రర
త్నంబు మహాప్రధానుప్రియనందనుని న్సుకుమారుఁ జూచి ప్రే
మంబు వహించి యుం గొమరుమాలెత గన్నుల నవ్వు దేరఁగా
సంబళి సంబళీ యళుకు సందడికిం దలమంచుఁ బల్కుచున్. 40

గీ. బ్రాహ్మణుఁడుగానలజ్జింపఁ బ్రాప్తిలేక, బాలప్రౌఢయువోలెఁ దప్పకయచూచి
చాటువడియుండుమయ్య యీసరసిలోన, నుదకమాడెదఁగాక పిన్నదియు నేను.

క. అని పలుకుచుఁ గొలనికి డిగఁ, జని మాలప్రమద దాను సఖియు నొనర్చెన్
వనకేళి తరంగ లురు, స్తనభారాస్ఫాలనమున జర్జరములుగాన్. 42

చ. పడఁతి పసిండిడాలుగనుపట్టు హరిద్రముఁదీరపంకముం
దొడసి సరోవరాంబువునఁ దోఁగి పయోనిధితీరభూమికి
న్వెడలి ధరాసుపర్వునకు నేత్రమహోత్సవ మయ్యె నప్పు డ
ప్పుడ కలశాబ్ధిమధ్యమునఁ బుట్టిన యాదిమలక్ష్మియో యనన్. 43

ఉ. ఆకలకంఠి కొయ్యఁ దడియార్చునెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల నటించి మధువ్రతమాలికాకృతిం
గైకొని యింద్రనీలమణిఖండశిలాసమలిమ్లుచంబులై
చీఁకటి గొల్పె బ్రాహ్మణునిచిత్తము పెన్నెఱిసోగవెంట్రుకల్. 44

గీ. చికురసంతతి నీరార్చి చెలువతుడిచె, సేసకొప్పాక...........
చన్నుఁగవసొంపుకక్షదేశముల మెఱుఁగు, బ్రాహ్మణునియాత్మఁ బల్లవింపంగఁ జేయు.

గీ. దంతతాటంకచక్రమధ్యంబునందు, బాల కీలించెఁ గంకేళిపల్లవంబు
బాడబుని నేయఁదలఁచు శంబరరిపునకుఁ, బ్రథమమదియనమసారబాణమయ్యె.

గీ. పూనెఁ గుచముల వెలి వాడపువ్వుఁబోణి, విప్పఁగలయట్టి బండిగురివెందసరముఁ
బ్రథమరాగరసోదయరక్తమైన, సచివనందనుహృదయజసంగరమున. 47

వ. అప్పుడు సుకుమారుండు నిజాంతర్గతంబున. 48

సీ. ఏలచేయండు శేషేంద్రియంబులు నాల్గు నలినగర్భుఁడు లోచనములుగాఁగ
నెట్టుగల్గె విధాత కీరూపనిర్మాణపరిమాణము లకోటిపరిమితంబు
లజుఁడు దీని సృజించి యాత్మ నువ్విళ్లూర కెట్లుండుఁ గూఁతు మోహించినాఁడు
కల్పింపఁబోలు శృంగారసర్గంబున దీని వాక్పతి యున్నది ఫలియించె
దీనినిఖిలావయవములు తీర్చి తీర్చి, చేయునపుడు ప్రయాసంబుఁ జెందుటయును
నొయ్యనొయ్యన బ్రహ్మనిట్టూర్పువుచ్చె, నదినుమీఁపుష్పసమయమందానిలంబు.

వ. అని విచారించుచు విప్రుండు చండాలకులకన్యకామణి దుర్లభంబగు సౌభా
గ్యంబునకు నద్భుతం బందుచు దానితో సంభాషింపఁ గోరి చేరువ నిలిచి
నసంగమకన్యకారత్నంబును నతని కిట్లనియె. 50

క. ఎందుండి యరుగుదెంచితి, రెం దరిగెద రిచ్చటనునికి కేమికతంబో
కందర్పరూపరేఖా, సౌందర్యవిలాసవిభవసర్వస్వనిధీ. 51

వ. నిన్నుం జూచి సుధామృతంబున మునింగినచందంబున నతి... సముద్రంబునం దేలినవిధంబున సర్వానందంబుల కుపరిభాగంబున వర్తించుకరణి సకలమనోరథంబులకు సంకేతంబైనలాగున నాహృదయంబు నిర్వృతిం బొందియున్నయది

ఉ. క్రొన్ననవింటిజోదు నలకూబరు నైషధునిం జయంతునిం
బున్నమనాటిచందురునిఁ బోలినవాఁడవు రూపసంపదన్
నిన్నొకవిప్రుఁగాఁ బరిగణింపఁగవచ్చునె కల్ల గాదు మా
యన్నలయాన చూడు పులకాంకురముల్ మొలచెం గుచంబులన్. 53

గీ. అవనిసుర చింతకాయల కాజ్ఞ గాక, యరసినూడంగ గుకిఱ్ల కాజ్ఞ గలదె
యంటరాకున్న నేమి యంతంత నిలిచి, చిత్తమలరంగ నిన్ను వీక్షింపరాదె. 54

సీ. కమలినీపత్రపత్రములఁ గాసారోదకముఁ దెచ్చి పాదపద్మములు గడుగఁ
జిలుకముట్టనిఫలంబులు గోసికొనివచ్చి పరికించి యారగింపంగఁ బెట్టఁ
గాంతారకర్పూరకదళికాదళముల సరసరీతులను వీజన మొనర్ప
నధ్వఖేదముపోవ హస్తద్వయంబున నూరుకాండము లొత్తి యుపచరింప
వేడ్కయయ్యెడు వినయంబువిస్తరిల్ల, భక్తిగొనఁగఁ బ్రమోదంబు పారమేదు
నీకువిప్రోత్తమునకు నీనెలవులందుఁ, జెడ్డదుర్జాతి యది నన్నుఁ జెఱిచెఁగాని. 55

క. ఇది హూణామండలం బ, వ్వదినున్నది చెంచుపల్లె వనమధ్యమునన్
మదననిభ యీపుళిందా, స్పదంబువెలివాడ......... 56

తాళవృత్తము. కనుఁగొనవలయునుదౌదవ్వులనెడగలుగనిలిచియైననుమాయిండ్లన్
వనమధ్యంబున విప్రోత్తమ వెలివాడవనితలకు నేత్రోత్సవమై
యనిభృతపరభృతనఖరేఖాకో......సహకారద్రుశాఖా
ఘనఫలరసధారామృతపానోత్కంఠవివృత్తాననవటుకంబున్. 57

క. పాణచివారము కమ్మని, ప్రాణము నెఱిజాణ దేవరా వినవలదా
వీణావాద్యముఁ బాటయు, వేణుస్వానంబు వేనవేల్చందములన్. 58

వ. అని చండాలకన్య పలికిన నవ్విప్రుండు భవితవ్యతాబలంబున. 59

సీ. ఇది యసజ్జనగోష్ఠి యిది మోహవిలసితం బిది మహాపాతకం బిది యకీర్తి
యిది దుర్మదాంధత్వ మిది యాగ్రహవేళ...............యిది కృదృష్టి
యిది నారకద్వార మిది ప్రమాదస్థలం బిది మార్గక్షయకారణం బిది యనియతి
యిది యధర్మముత్రోవ యిది పథప్రచ్యుతి యిది యధోగతిహేతువిది యకృ
త్యమని విచారింప కవనీసురాధముండు, కలికిచండాలకన్యపైఁ గన్నువైచె
దీయుభీయనివింట లేదేటినారి, శంబరారాతి మోహనాస్త్రంబుఁ దొడిగి

వ. ఏయునప్పుడు నిజాంతర్గతంబున. 61

సీ. మాంసంబు భక్షింప మనసువెట్టిననాఁడె బ్రాహ్మణ్యగుణము విధ్వంసమయ్యె
గంజాయిఁ దినఁగ నుత్కంఠఁ జేసిననాఁడె లజ్జాభిమానంబు లుజ్జగిల్లె
హాలారసముఁ గ్రోల నభిలషించిననాఁడె సూనృతోక్తులసుద్ది మాటిఁబోయెఁ
బరకళత్రముల వెంబడఁ దలంచిననాఁడె ప్రజ్ఞావిలాసంబు పదటఁ గలసె
నింక నేఁటికి వంచింప నిలువునాకు, జరుపె యీపాపములలోనఁ బాపమొకటి
వరుసవేయింటిమీఁద జన్నాదికోమ్ము, తివుట జండాలకన్యకఁ గవయువాఁడ.

వ. అని పరమసాహసంబు చేసి సుకుమారుండు చండాలకన్యకం జేర వచ్చి యిట్లనియె. 63

కవిరా. సరసిజలోచన యెక్కమహామునిశాపవశంబునఁ బాణచివై
ధర జనియించినదానవు నీవిదితథ్యము కిన్నరభామినివో
గరుడపురంధ్రివో యక్షవధూటివో గాని జఘన్యవు గావికనన్
ధరణిసురోత్తముని న్వరియింపు సుధాకరసూర్యులు సాక్షులుగాన్.

వ. సామాన్యస్త్రీజనంబుల కిట్టియమానుషలోకోచితంబులైనసౌభాగ్యంబులుం గల్గునె మునికోపవశంబున సముజ్ఝితదివ్యశరీర లగు దేవకాంతలు శాపవశోపనీతంబైన శరీరంబు నధిష్ఠింతురు తొల్లి స్థూలశిరుండనుమహాముని త్రిభువనలలామభూతయగురంభ నేదేనియొక్కనిమిత్తంబున శపించెననియును దచ్ఛాపంబున నయ్యప్సరస బాడబరూపంబు ధరియించి మృత్తికావతియందు శతధన్వుఁ డనురాజును సేవించుచుఁ బెద్దకాలంబు మర్త్యలోకంబున నుండె ననియును విందుము. 65

సీ. జలజగర్భునిమానసంబు వేదంబులు దక్షప్రజాపతి దర్పకుండు
సౌదామనీవల్లి చంద్రికాలోకంబు సప్తజిహ్వజ్వాలసప్తకంబు
రవిమయూఖములు నీరవని దుగ్ధాంభోధి మృత్యుదేవత నోరిమెఱుఁగుఁబండ్లు
ముని కరిష్టాదేవికిని సంభవించినదివ్యగంధర్వజాతిద్వయంబుఁ
గారణంబులుగాఁ బుట్టినారు పదియు, నాల్గుకోట్లప్సరసలు నా నాకసతులు
వారిలో నొక్కతెవు నీవు వారిజాక్షి, యేమిదుష్కృతిఁ బుట్టితో హీనజాతి.

గీ. తివుచుచున్నది భవదీయదృగ్విలాస, మెత్తుకొనిపోవుచున్నవి యింద్రియములు
వెనుక ద్రొబ్బుచునున్నాఁడు మనసిజాతుఁ, డేమిసేయుదుఁ జెప్పవే యిందువదన.

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని, కామతంత్రంబునకు సంచకర్వ గాఁగఁ
జుంబనముసేయని యోష్ఠబింబమిపుడు, గండుఁగోయిలచిగురాకుఁ గమిచినట్లు

గీ. అనుచువిప్రుండుతమకించియంటుకొనియె, సమ్మతించియుయుండెనాచంద్రవదన
శూకలాశ్వంబు నస రేఁపఁజొచ్చినప్పు, డనుమతింపదె యుత్తళు వైనబడబ. 69

వ. ధీరోదాత్తయగునమ్మత్తకాశిని చిత్తజాయత్తయయ్యును దత్తరపాటు లేక యత
నితో నిట్లనియె. 70

సీ. కలుగుచున్నవి యనేకములు వికల్పము లాడుచున్నవి యపాయంబు లెదుర
నంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు సందేహములు పెక్కు చాయవాఱె
నంకురితములయ్యె శంక లేరాళంబు వికృతు లెన్నేని యూవిమఱించె
శాఖోపశాఖలఁ జాఁగుచున్నది రట్టు గుటిలేక యుదయించె గోసనాస
యిన్నిటికి నోర్చి నీకోర్కె యేను దీర్తు, నింతవానికి నన్నిగు బెరవె.........
యెప్పటికి నిత్తునో లేక యీశరీర, మిప్పటికిఁ జాలునో నిక్క మెఱుఁగఁజెపుమ.

గీ. మొదలఁగఱ్ఱిపడికూడిపిదపవాయు, నొక్కకమలాననకుడక్కియుండఁజాలఁ
డడవిఁ బెకుఱుపుష్పంబులయందు వ్రాలు, చంచరీకంబుమగవాఁడుసరియుసువ్వె.

ఉ. చందురుఁ డంతుచూడఁడు నిశానటిఁ బున్నమనాఁడుగూడుచోఁ
గందళితానురాగుఁడయి కానఁగవచ్చు నవోదయంబులం
జందముదప్పి మీఁదనొకచాయకువచ్చుఁ గ్రమక్రమంబునన్
సుందరిపట్టునందుఁ బురుషుండును నట్లయకాఁ దలంపుమీ. 73

వ. అనిన విని సుకుమారుండు. 74

క. మగవారల నిందింపకు, తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయున్
మగవారికెగా కెందును, మగువలకుం గలదె చంద్రమండలవదనా. 75

సీ. హరునిచిచ్చుకంట నసమాస్త్రుఁ డీల్గిన రతిదేవి యెట్లు జీవితముఁ జెందెఁ
బాండుభూపాలుండు పరలోకగతుఁడైనఁ గుంతి చావక యేమికుడువనుండెఁ
బ్రథనాంగనమున సౌభద్రుండు సచ్చిన బ్రతికె నెట్లు విరాటరాజతనయ
సింధురాజ స్తమించిన నేల దుస్సల కాషాయవస్త్రంబు గట్టుకొనియెఁ
బంక్తిరథుఁ డన్యలోకసంప్రాప్తుఁడైన, నేల కౌసల్య ప్రాణమీనెఱుఁగదయ్యెఁ
దగవు ధర్మంబు పాడి పంతంబు లెట్లు, భామలెట్లు వృథానులాపంబు లేల ?

గీ. అనినఁ జండాలకన్యక యాఁడువారి, మంచితనమును మగవారి మంచితనము
సరియ కీడని మేలని చర్చలేల ? మనకు మనయాడికలు తప్పకునికి చాలు. 77

వ. విశ్వావసుం డనుగంధర్వరాజునకు మేనక యనునప్సరసకుం బ్రభవించినప్రమ ద్వరయనుకన్యక స్థూలకేశాశ్రమవనంబునఁ బాదమర్దితం బగుపన్నగంబు గఱచినఁ బ్రభిలుప్తజీవితయగుటయు భార్గవుం డగుచ్యవనునకుఁ బౌత్రుండు ప్రమతికొడుకు రురుం డాయురర్ధంబొసంగి యయ్యంగనం బ్రతికించె నని యును, నర్జునుం డశ్వమేధాశ్వానుసారియై యాత్మజుం డగుబభ్రువాహనుని చేత నాహవాంగనంబున శరాహృతప్రాణుండైన నులూచి యనునాగకన్యక రసాతలంబుననుండి యేతెంచి యుద్గతప్రాణునిం జేసె ననియు విందుము. మంచి తనంబు లాఁడువారికి మగవారికి సరియ యద్ది యటులుండె నావంతంబు వినుము. 78

ఉ. నాకు మనంబునిండ నొకనమ్మికసేయుము..........................
గైకొనువాఁడ నిన్ననుము, కాదన కెక్కడకైన వచ్చెద
న్నీకొకటయ్యెనేని యవనీసురమన్మథ నిర్విశంకత
న్నాకముఁ జూఱపెట్టెద ధనంజయతీవ్రశిఖాముఖంబునన్. 79

వ. అనిన విని సంతోషించి సుకుమారుండు. 80

సీ. కలహంససంపద గలకలక్రేంకారకలకలం బైనయీకొలను సాక్షి
ప్రసవసౌరభనటద్బంభరం బైనయీవలనిలతామండపంబు సాక్షి
ప్రచ్ఛాయశీతలోపరిభాగ మై (నయీ) శశికాంతమణిశిలాస్థలముసాక్షి
తరులతాగుల్మసంతతపిధానాతపవ్యవహితమైనయీవనము సాక్షి
మకరకేతనుపాదపద్మములు సాక్షి, రతిమహాదేవిజఘనభారంబు సాక్షి
సత్య మెన్నఁడు నినుఁ బాయ నమ్మతించి, కౌఁగిలింపఁగనీఁగదే కమలవదన. 81

వ. అనినఁ జండాలి కరారవిందంబులు మొగిడిచి సవినయంబును సగౌరవంబును సానురాగంబును గా నతని కిట్లనియె. 82

ఉ. నేఁడు కృతార్థులైరి జననీజనకు ల్ఫలియించెఁ బుణ్యముల్
నేఁడు పురాకృతంబు లవనీరుహమూలనివాసినైనకా
ఱేఁడిలు వేలుపై యొనరించె మనోరథసిద్ధిసంపదల్
నేఁడుగదా సుధారసము.........గంటి ధరాసురోత్తమా. 83

ఉత్సాహ. మలుసమర్త నంటకుండి మాలదాననగుట నేఁ
గలయ నీళ్లనాడి కడవఁ గ్రంత యంటుకొనుటకై
కొలనఁ గ్రుంకి పోవుచుండి కుసుమబాణనిభుని ని
న్నలఘు........, లోచనంబులలరఁ జూచి వలచితిన్. 84

గీ. ఏమిసేయుదు నీకు నెట్టిత్తు నన్నుఁ, బంచముని యింటఁగలిగి బీభత్సునెత్తిఁగి
యిచ్ఛగింపకయుండ నేనెట్లు నేర్తు, నధికతర మైనమన్మథాయత్తు నిన్ను. 85

వ. అనిన సుకుమారుండు చండాలకన్య కిట్లనియె. 86

శా. ఏమాసించినఁ బ్రాణరక్షకయి, యేమేఁబాపము ల్సేసినన్
భామా చెల్లుఁ బురాణసంహితలఁ జెప్పన్విందుమే కాదె వి
శ్వామిత్రుం డెడరైనచో శునకమాంసంబున్ భుజింపండె నీ
వ్యామగ్రాహ్యకుచంబులంటి యిదె నాప్రాణంబు రక్షించెదన్. 87

వ. ఇదె యెదురసభ్రమరకులచరణ నఖశిఖాశిఖరవిశీర్యమాణ కుసుమకేసరరేణు త్రసరేణువిసరవిసం……తంబులతామండపం బిదె వెనుకఁ గుటిలశుకత్రోటికోటీవిపాటితమధురఫలరసధారాసారదుర్దినాయమానాభ్యంతర ప్రదేశంబు చూతతరువాటికాభ్యాశం బిదె కెలన మదకలమల్లికాక్షపక్షపాళీనవపవన సంపాతకంపమానకమలకేసరపరాగధూళి విరచితాళీకసంధ్యానుబంధచకితచక్రవాకనీడోద్భవక్రీడానీడంబులు, సరస్సైకతవేతసీనికుంజక్రోడంబు లిందు నీకు నింపుపుట్టినట్టియెడ నన్ను మన్నింపు మంటకున్నదాన నని భయం బందకు కుసుమసమయంబు గదా ఫలావాప్తికి మూలం బింకఁ గాలక్షేపంబు చేసితేని కందర్పుండు దర్పాతిరేకంబున భవద్భ్రూవల్లీమతల్లికిం దల్లియగునించు వింటిబద్ద దిగిచి కొందమతుమ్మెదతెక్కగరిగట్టిన పూమిట్టకోలల హృదయం బుద్ఘాటించి చంపుఁ జంపకకుసుమగంధీ ప్రాణంబు రక్షింపు మిదె నీకుసేవాంజలి యని కంకణఝణత్కారంబు తోరంబుగా సుకుమారుండు నఖకిరణపరంపరాకుసుమకుట్మలాభిరామంబు లగుకరకిసలయంబులు మోడ్చి ఫాలభాగంబునం గీలించిన. 88

శా. వాలాయంబుగ నద్ధరాసురుఁడు దన్వాంఛించిన న్మందహా
సాలం(కారమ)నోజ్ఞమైనముఖ మొయ్యన్వాంచెఁ జండాలి యా
లీలాభావ మెఱింగి(యేగి)నతవల్లీకుంజమధ్యంబునం
గేలీతల్పము దీర్చెఁబో మృదులకంకేళీప్రవాలంబులన్. 89

వ. అనంతరం బధరీకృతకుసుమా(యు)ధధరరూపసంపన్నుఁ డగునవ్వసుధానిలింపుం డపహాసితసురసిద్ధగంధర్వవిద్యాధరలీలావిలాసినీవిలాసవతి యగునవ్వాలి వాడచేడియం గూడి సురతసౌఖ్యం బనుభవించె నంత. 90

ఉ. కాయజకేళికిం బడయఁగానికులంబునసంభవించి య
న్యాయముసేయునే యిటు మహాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్
మాయఁగఁదట్టి యంచు నతిమాత్రము లజ్జితుఁ డైనకైవడిం
దోయజషండబాంధవుఁ డధోముఖుఁ డయ్యె నభోంగనమ్మునన్. 91

గీ. గగనయానవేగంబునఁ గలఁచి, కమలపుండంబునఁ గ్రోలిన కమలమధువుఁ
గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు, భానుబింబంబు రక్తాతపంబుఁగాసె.

శా. ప్రాలెం బశ్చిమశైలశృంగమునయిః ప్రత్యగ్రమధ్వాగమో
న్మీలత్కింశుకకోరకస్తబకకాంతిన్ భానుమన్మండలం
బాలంబించె మరుండు హస్తమున దాక్షారామలీలావతీ
భ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముం బుండ్రేక్షుకోదండమున్. 93

క. క్రుంకె విభాకరబింబము, పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్దిశిం
గంకేళితరుపల్లవ, సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్. 94

గీ. పద్మినీషండములనుండి పాసిచనియెఁ, గోకమిథునంబు లత్యంతశోకపరతఁ
దోన యేతెంచె భ్రమరసందోహ మపుడు, కంఠలోహార్గళంబులకరణి మెఱయ.

వ. ఇవ్విధంబునం బ్రతీచీకర్ణపూరరక్తోత్పలంబును జక్రవాకచక్రవాళకులచక్రవ
ర్తియు నగుమార్తాండుండు లోకాంతరంబున కవతరించినఁ గ్రమంబున నంబర
తటాకపికచకమలిని సంజ మంజుమంజిష్ఠాపరాగసౌష్ఠవంబు సంధించి కృష్ణా
గురుపంకవల్లికలయుల్లాసంబు నుల్లసంబాడుచుఁ జిలుపచిలుపచీఁకటి సిద్ధవి
ద్యాధరనితంబినీజనంబులచెక్కుటద్దంబులతోడం జరలాడె సాంధ్యదేవార్చనా
బలిపిండంబులుంబోలె గగనమండలంబున వెండితగటుఁ దెగడి క్రిక్కిఱిసి చు
క్కలు వొడిచెఁ బురుహూతాంతఃపురపురంధ్రీవిలాసదర్పణంబు దర్పకునిమా
టుఁబొంది చందురుం డుదయగిరిశృంగశృంగాటకంబునఁ బటికంబుగుండుచం
దం బొందె నవ్వేళ చండాలకులవరారోహ వాహకుం డెక్కి విడిచిన వారువంబు
గొదమయుంబోలె సంభోగంబునం దృప్తిచని తనివోవనికౌతుకంబున సుకు
మారుఁ గౌఁగిటం జేర్చి యి ట్లనియె. 96

ఉ. అల్లదె వేఁటపల్లె యటనావల మాలెవాడ యావలన్
భల్లనిపాతమాత్రమునఁ బర్వతనిర్ఝరసింధు వావలం
దెల్లనిగోపురంబుల నతిప్రమదావహ మైనరోహిణీ
వల్లభమౌళిభామిని నివాసము........లాప్రదేశముల్. 97

గీ. ప్రతిభ సతతంబుఁ గొల్తు రాభద్రకాళి, జగతి నేఁబదియాఱుదేశముల వారు
దశదినంబులు సింహకేతనము నిలిపి, హూణభూమికి దైవ మీయుత్పలాక్షి.

వ. నీ వమ్మహాస్థానంబున వసియింపు మేను నీకు నాయావేళలఁ బరిచర్య సేయుచు వంచనబయల్పడకుండ మెలంగెద. సర్వకలావిశారదుండవై ననీకుం బ్రాకార గోపురద్వారవేదికాప్రాకారప్రఘాణకుట్టిమహట్టసౌధవీథీవిటంకంబులం గావ్య గోష్ఠీపరిహాసకథాబింధుమతీభిత్తికా ప్రహేళికాభావన సుభాషితశ్రవణంబు, వారవిలాసినీదర్శనంబు, వైతాళికస్తుతిపాఠకంబు, దురోదరక్రీడ, చిత్రకర్మంబు, వీణాస్ఫాలనంబు మొదలయినవినోదంబులం బ్రొద్దుపుచ్చంగలిగెడి వెండియు.

క. వెలివాడకుఁ గడుఁ జేరువ, సెలయేటింబాడవుట్రాల్లఁ జట్టేఁదులు నా
వలఁ దఱచు భద్రకాళీ, నిలయం బదిలెస్స నీకు నెలవువహింపన్. 100

గీ. ప్రొద్దు వోకుండ ముందటఁ బొదమ నీవు, కాళికాస్థానమునకు నీకాలిత్రోవ
విప్రగృహమున నీకు నే విందొనర్తు, ధర్మమిమ్మున నింటిపెద్దలకుఁ జెప్పి.

వ. ........చెలికత్తెయుఁ దాను వేఱొకతెరువున నిజనివాసంబునకుం జనియె సుకుమారుండు చెఱువుకొమ్ముదాఁపలంబట్టుకొని విపినషండంబు నడుముగాఁ బక్కణంబునకుఁ దక్షిణంబుగా నొరసికొనిపోయి కాలిత్రోవంజని సెలయేఱు గడచి ముందట. 102

సీ. బ్రహ్మ యెక్కెడిజాలపాదంబునకుఁ గేలివసతి యైనసరోజవాటితోడ
నైంద్రవాహన మైనయైరావణగజంబు........చేమొక్కయీఁదువులతోడ
వైష్ణవరథమైనవైనతేయునకాఁగ నిరవైనప్రాకారపరిధితోడఁ
గౌమారయానశిఖావళంబునకుఁ దాండవమాడ సొబగైనగవనితోడ
వేడ్క మాహేశ్వరం బైనవృషభరాజు, దాఁక నిల్చినకేలిభూధరముతోడ
సకలభక్తనివాసమై చాలనొప్పు, చండిభవనంబు సొత్తెంచె సచివసుతుఁడు.

మ. తనదౌ శీలము తానెఱుంగుట వెలిన్ దౌదవ్వుల న్నిల్చి దు
ర్జనుఁ డాతండు లలాటభాగమున హస్తద్వంద్వము న్మోపి యొ
య్యన లోలోన నమస్కరించెఁ బటుగర్వారంభసంరంభశుం
భనిశుంభప్రథనక్రమప్రకటబాహాకేలికిం గాళికిన్. 104

ఉ. మాలెతవిందు బ్రాహ్మణకుమారుఁడు పక్కణవాసి వేణుకం
డోలమునందుఁ దెచ్చినఁగతొరితచంద్రిక నిర్ఘురాపగా
కూలమున న్భుజించి ఘనగోపురవేదిక నిద్రవోయె న
య్యాలరిబ్రాహ్మణుండు తుహినాచలకన్యకయాశ్రమంబునన్. 105

వ. మఱునాఁడు ప్రాతఃకాలంబున సిద్ధ్వరాంభఃప్రవాహంబున నవగాహనంబు చేసి కపటసంధ్యావందనంబును కృతకజపంబును సూర్యోపాస్తియు నడపి బ్రాహ్మణబ్రువుండు. 106

సీ. దంతిదంతార్గళస్తంభభారముతోడ రాజిల్లుఘనగోపురములు చూచి
గండశైలచ్ఛేదఘటితమై యొరపైన మేటికొమ్మలతోడికోట చూచి
యమృతదీధితిలోనివహరిణంబు వెఱపించు సౌధాగ్రసింహధ్వజములు చూచి
యట్టమండపముపై నభశ్రీ ముల్లేఖించు జాంబూనదత్రిశూలంబు చూచి
చముకుగా.......మగుచ్ఛములుబోలె, సకలశాఖోపశాఖలసంశ్రయింపఁ
బుష్పితాశోకపాదపంబులనుజూచి, నింబములుసూచి యతఁడమ్భుతంబుసెందె.

ఉ. కాళికదివ్యమందిరము.....................దనాళికీ
లాలరసంబు గ్రోలునభిలాషమునం జనుదెంచి యున్నవే
తాళగణంబువోలె నతిదైర్ఘ్యమునన్ దివి దాఁకియున్నహిం
తాళవనంబు గన్గొని..............తమందె నాత్మలోన్. 108

ఉ. వైపయిగర్భగేహమునఁ బన్నికమీఱి వెలుంగుమాలికా
దీపశిఖాప్రరోహములు దేరఁగఁజూచి యనుస్మరించె లో
నాపృథివీసురుండు మహిషాసురమస్త.........దు
ర్గాపరమేశ్వరీపదనఖంబులడంబుల సంచరించినన్ 109

గీ. సరసవనవాటికానికుంజములయందు, జిలుకలధరోష్ఠసంపుటంబులు గదల్ప
శక్తిమంత్రాక్షరంబుల జ......, నవియవలె నున్న నద్భుతంబందె నతఁడు.

సీ. మంత్రవాదులతోడిమైత్రి సంపాదించు యంత్రవాదులఁ గలయాదరించు
సిద్ధయోగీశ్వరశ్రేణి సంసేవించు దాత....................ందనముసేయు
కదలి వశ్యాశ్చర్యకథ లెఱుంగఁగఁగోరు బిలముసాధింప నపేక్షసేయు
బహుదేశభాష లభ్యాసింప వాంఛించుశల్యతంత్రముమీఁదఁ జాఁపుమనసు
....................గఁబెన్నిధిగుద్దలించు, నింద్రజాలంబువన్నంగనిచ్ఛగించు
గట్టుభవనములకుసురంగములుద్రవ్వ, నేర్చికొనుబ్రత్యహంబునునీచబుద్ధి.

చ. స్థితిచెడి మాంసభోజనముసేసి యసంగమవంశభామినీ
రతిఁబరతంత్రుఁడై సపుడుఁ బ్రత్యహముర్ ధరియించుచుండు న
ప్పతితుఁడు గంగమట్టియయుఁ బన్నసినున్నని నీరుకావిదో
వతులును.........................ములువంశ్యులయిండ్లభుజించుకోరికన్. 112

గీ. మాధుకరవృత్తులనుస్వయంపాకములను,సత్రభోజనములఁ బిత్ర్యశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించునతఁడు, వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుట.

సీ. నీరాటనెపముగా నిర్ఝరంబుల కేగి సవిధవానీరకుంజముల నొందు
భూధరంబుల కిప్పవువ్వదే నని పోయి కందరామధ్యభాగముల నొందు
శి........కన్యసేవింప నని పోయి నక్తమాలముల నెన్నడుము నొందుఁ
గలమసస్యక్షేత్రములకుఁ గూ ల్లొగి మోసి శణవాటికాప్రదేశముల నొందు
నెట్లు కనుఁబ్రాహ్మమచ్చునోయింటివారి, నెట్లు............ంటిమై నిక్క కరుగు
నతివ పగలైన మాపైన నతనితోడ, నిచ్చ నొకసారి సాగించు నిధువనంబు.

వ. ఒకర్నాఁ డకర్నిష్ఠవర్తనుండు పక్కణశబరులం గూడి కరిక్రవ్యాదంబు గుక
....కొని ప్రత్యూషకాలంబున విపినవీథుల నీవారభసలవిఘటితసరఃకమల
మండసౌరభోద్గారభరితదిక్కటాహంబు కరటిమార్గం బిది, విదళితసమస్తము
స్తాశకలసారంబు వరాహయూథ పథంబిది, కఠినపాషాణకోటివిభిద్యమానవల్మీక
ధూళిపాళికానిచుళితతరుపలాశంబు మహిషవర్త్మం బిది,దూర్వాప్రవాళచర్వ
ణహారిచందనపరిపాండురంబుహరిణమార్గంబిది కటుదీర్ఘఘుర్ఘురవ్యాక్రోశంబుక
ర్కరేటుకులకులాయస్థానం బిదె........కహరవంబు, దాత్యూహవ్యూహ
ప్రదేశంబు ననుచు నాఖేటకౌతుకంబున నాఖేలనక్రీడావిహారంబులఁ గృశుం
డై, ప్రాణిహింస యొనర్చుచు వెండియు. 115

గీ. పాపకర్ముండు కాంతారపథమునందు, నదరిపాటున నొంటిబ్రాహ్మణుల మొత్తి
యపహరించినవిత్త మన్యాయపరత, నంత్యజస్త్రీయుఁ దానును ననుభవించు.

గీ. ఇవ్విధంబున సుకుమారుఁడీలువుడిగి, మాలచిగురాకుఁబోఁడితో మనువుమనఁగ
వచ్చె నొయ్యన మధుమాసవాసరములు, వాసితాశోకసంఫుల్లకేసరములు.

సీ. కామినీగండూష కాదంబరీధారఁ బులకించె నారామభూమిఁ బొగడ
చివురాకు చవిచూచి చవిచూచి యెలుఁగించెఁబంచమస్వరమునఁ బరభృతంబు
సంఫుల్లకోరకస్తబకోచితం బైన కొరవిపై భ్రమయించెఁ గొదమతేఁటి
పరిపక్వసహకారఫలరసాస్వాదన ముదమునం గీరంబు చదువఁదొణఁగె
విటవిటీనముదయములు వివిధవిధుల, నుపవనక్రీడ సల్పిరి యుబ్బుమిగిలి
యఖిలజనులకుసంతోషమావహించె, మాసరముసైనమధుమాసవాసరములు.

వ. ఇట్లు సకలజనమనోహరంబులగుమధుమాసవాసరంబులనప్పాపిష్ఠుఁడు చండాల
కన్యకం దగిలి యొం డెఱుంగక లజ్జ యుజ్జగించి మానం బూనంబుచేసి

# చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతి కవిప్రణీతము.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము. కార్వేటినగరసంస్థానమునం దుద్భవిల్లినది. ఇంతవఱ కిట్టి భాషాంతరగ్రంథము భోజచంపువునకు లేదు, కావుననే యన్నివిధముల ముఖ్యమైనది. కవితాచమత్కృతులెల్ల నీగ్రంథమందే కాననగును.ఎనిమిది యాశ్వాసములు. 148 పుటలు రాయలుసైజు, 16 పుటల పీఠిక. ఇంగ్లీషు క్యాలికో బైండు. ముద్రింపఁబడినవి స్వల్పప్రతులు. అయినను వెల రు. 1-0-0 మాత్రమే. భాషాభిమానులు శీఘ్రముగా నొక్కొక్కప్రతిని దెప్పించుకొనుట మంచిది.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 2/7 హారిస్ రోడ్డు, పుదుపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడెను.

చందా సం॥ కు రు. 3—0—0.　　　　విడిసంచిక రు. 0—8—0

సంపుటము 7.　　కాళయుక్తి సంవత్సరము. ఆశ్వయుజ కార్తిక మాసములు.　　సంచిక. 4.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక.

# ఇంద్రకీలపర్వతము

## మీఁది రెండుచాలుక్యశాసనములు.

ఈశాసనములు బెజవాడకుఁ జేరి పశ్చిమమున నున్నయింద్రకీల మను పర్వతముమీఁద నున్నవి. ఒకటి గోవిందమఠ మను స్థలముసమీపమునఁ బడియున్న రాతిమీఁదను రెండవది కొండ నెత్తిమీఁద స్థాపింపఁబడియున్న శిలాస్తంభముమీఁదను జెక్కఁబడియున్నవి. మొదటిదానికి క యనియు, రెండవదానికి చ యనియు సంజ్ఞ లుంచి వానిని వేఱువేఱు గా విమర్శించెదను.

క.

ఈశాసనమునకు శాసనాధికారులు తీయించిన ప్రతిబింబమును బట్టి మూలమును నిరూపించితిని.[1] లిపిస్వరూపము పాఠకులకుఁ జక్కఁగాఁ దెలియుటకై శాసనప్రతిబింబము గూడ ముద్రింపఁబడును. ఈశాసనపులిపి సర్వవిధముల యుద్ధమల్లుని బెజవాడశాసనపులిపిని భో లి యున్నది[2]. కావున నీ రెండు శాసనములు నించుమించుగా నేకకాలమందే పుట్టినవని నిశ్చయింపవచ్చును. శాసనమందు సంస్కృతాంధ్రములు రెండును బ్రయోగింపఁబడినవి. తప్పులు గలవు.

విష్ణువర్ధనమహారాజు రాజ్యకాలము పదియేడవసంవత్సరంబున విక్రమాదిత్యునితనయుఁ డగుశ్రీవిష్ణువర్ధనుని ప్రసాదముచేత చట్టప యనునతఁడు ఇంద్రకీలపర్వతమునకు పార్థేశ్వరుని బ్రతిష్ఠించెననిశాసనములోని విషయము. పేరును బట్టియు సర్వలోకాశ్రయుఁ డనుబిరుదును బట్టియు విష్ణువర్ధనమహారాజు చాలుక్యవంశమువాఁ డని స్పష్ట మగుచున్నది. ఆలయప్రతిష్ఠ బెజవాడయందగుటచేత రాజు పూర్వచాళుక్యవంశ్యుఁ డనికూడ స్థిరపడుచున్నది. పూర్వచాళుక్యరాజులలో విక్రమాదిత్యుఁ డనుపేరు గలవా రిద్దఱు మాత్రమే కనఁబడుచున్నారు :—13-వ తరమువాఁ డగు గుణగవిజయాదిత్యునితమ్ముఁడును, 14-వ

1. శాసనాధికారులు ఆ 1917-వ సంవత్సరములో సంపాదించిన శిలాశాసనములలో నిది 833 వది.

2. చూ : ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. 6.

తరమువాఁ డయిన ప్రథమచాలుక్యభీముని తండ్రియు నయినవిక్రమాదిత్యుఁ డొకఁడును, 18-వ తరమువాఁ డగువిక్రమాదిత్యుఁ డొకఁడును. ఈ రెండవ విక్రమార్కునకుఁ గొడుకున్నట్లు గాని యాకొడుకు రాజ్యము చేసినట్లు గాని ప్రమాణములు లేవు. కావునఁ బ్రస్తుతశాసనములోఁ బేర్కొనఁబడిన విక్రమాదిత్యుఁడు మొదటి విక్రమాదిత్యుఁడే యని యూహింపవలసియున్నది. ఈవిక్రమాదిత్యుని కొడుకు ప్రథమచాలుక్యభీముఁ డగును. ఈతఁడే శాసనములో సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారా జని పేర్కొనఁబడినవాఁడు. సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన యనునవి చాలుక్యరాజుల బిరుదులు. ఈచాలుక్యభీమునినాఁటి యొకరాగిశాసనములో నితని పేరు "సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజపరమేశ్వర పరమబ్రహ్మణ్యః చాలుక్యభీమనామా" యని యున్నది[3]. ఆశాసనమందే భీమరాజు 814-వ శకవత్సరమునఁ బట్టాభిషిక్తుఁ డయిన ట్లున్నది. కాఁబట్టి పార్థేశ్వరప్రతిష్ఠ 831-వ శకసంవత్సరమం దయియుండవలయును. ఇది క్రీ. 909-వ సంవత్సరమునకు సరిపోవును. ఈశాసనపులిపియు యుద్ధమల్లుని శాసనపులిపియు నేకవిధముగా నుండుటవలన నిదివఱలో నేను జేసిన యుద్ధమల్లశాసనకాలనిర్ణయ మీశాసనమువలన దృఢపడుచున్నది.

అర్జునుఁడు శివునిగూర్చి తపముచేసి పాశుపతాస్త్రమును బడసినచోటు బెజవాడే యని యీశాసనము సూచించుచున్నది. ఈవిషయము రెండవశాసనము విమర్శించునపుడు చర్చింపఁబడును.

శాసనములోఁ గొన్ని తెలుఁగుపదములకు విశేషరూపములు కనఁబడుచున్నవి. "సంవత్సరంబుళ్" అనుచో ళకార మొకవిశేషము "పదిఏడగునేణ్ట" పదిఏ డనునప్పుడు విసంధి పొరపా టని తోఁచుచున్నది. "పదియేడగు" ననఁగాఁ బదునేడవ యని యర్థము. అగు ననునది యగుధాతువు తద్ధర్మార్థకవిశేషణము. తొలుత నీవిశేషణమే పూరణార్థమందుఁ బ్రయోగింపఁబడి కాలక్రమమున "అవ" యనుప్రత్యయముగా మాఱిన ట్లగపడుచున్నది. ఆంధ్రభారతాది పర్వప్రారంభమునం దాయాపర్వములయందలి విషయముల వివరించు నవసరమున

1. శోభిల్లంగా। నెనిమిదియగుపర్వం బిది। యనఁ బరఁగున్

3. చూ. Report of the Government Epigraphist for 1918, page 107.

2. శ్రీ । పర్వంబు పదునొకం డగు । పర్వమునా వెలయు.

అని యీప్రకారముగాఁ బ్రయోగములు కనఁబడుచున్నవి. అన్యస్థలములందు "అగు"నకు మాఱు "అవ" యే కనఁబడుచున్నది. పూర్వప్రతులలో "అగు" నని యే యుండఁగా 'సంస్కర్త' లాపాఠము తప్పని యెంచి యాధునికాచారానుసారముగా దానిని "అవ"గా మార్చి, యట్లు మార్చుట కవకాశము లేదని తోఁచినపట్టులమాత్రము పూర్వప్రయోగ ముంచినట్లు తోఁచుచున్నది. ఈ ప్రకారముగా నన్నయభట్టకృతభారతభాగమునం దనేకము లగుమార్పులు కలిగి యుండవచ్చు నని నాయూహ. అనేకప్రాచీనప్రతులనుబట్టి విమర్శించినఁ గాని సరి యయిన పాఠములు తేలవు. ఆంధ్రభాష కంతకు మూలాధార మనఁదగు భారతము విషయములో నీపని తప్పక జరుగఁదగినదే.

"ఏణ్ట"—సానునాసిక మగుసీపదము, ఏఁడుశబ్దము సార్ధబిందుక మని స్పష్టపఱుచుచున్నది.

మూలము.

1. స్వస్తి సర్వలోకాశ్రయ
2. శ్రీవిష్ణువర్ద్ధనమహారాజుల
3. ప్రవర్ద్ధమానవిజయా1రాజ్యసంవత్స
4. రంబుళ్2పదిఏడగు3నేణ్టవిక్రమా
5. దిత్యతనయశ్రీవిష్ణువర్ద్ధనప్రసాదాచ4
6. ట్టపాథేన యిన్ద్రికీల5ప్రతిష్టితః6పార్త్థేశ్వరః7
7. సామాన్యోయంధర్మ్మసేతుఃనృపాణాంకాలేకాలే
8. పాలనియో8భవద్భిః సర్వ్వానేతాన్భావినఃపా
9. ర్త్థి9వేన్ద్రాన్ భూయోభూయోయాచతేరామ
10. భద్రా10 । శ్రీజల్పేయం శీఘ్రలిఖితం॥

---

1. విజయస్త్యేయని చదువునది.
2. రంబుల్ ,,
3. పదియేడగు ,,
4. ప్రసాదాచ్చ ,,
5. ఇన్ద్రకీలే ,,
6. ప్రతిష్ఠితః అని చదువునది.
7. పార్త్థేశ్వరః ,,
8. పాలనీయో ,,
9. పార్త్థివేన్ద్రాన్ ,,
10. భద్రః ,,

చ.

ఈశాసన మింద్రకీలపర్వతశిఖరమందు స్థాపింపఁబడియున్న శిలాస్తంభము రెండుప్రక్కలయడుగుభాగమునఁ జెక్కఁబడి యున్నది. స్తంభము నాలుగు ప్రక్కలను, అర్జునుఁడు తపస్సుచేసి శివునివలనఁ బాశుపతాస్త్రము పొందినకథ చిత్రరూపముగా లిఖింపఁబడినది. శాసనము సంస్కృతమయము. శాసనపులిపి క్ర శాసనపులిపిని బోలి యున్నది. ఆరంభమున నర్జునుని నామములు పది యు నుదాహరింపఁబడినవి. తరువాత విష్ణుసాహాయ్యముచేత నర్జునుఁ డింద్ర కీలపర్వతమందు మహేంద్రునిగూర్చి తపస్సుచేసి యాయింద్రుని యుపదేశంబున మహేశ్వరు నారాధించి సంప్రీతుఁడైన యాశివునివలనఁ బాశుపతాస్త్రమును బడసె ననియు, నింద్రకీలపర్వత మర్జునున కొకయక్షుఁడు చూపె ననియు, నా యక్షుఁడే కలియుగమున పెచ్చెవాడలో కలియమబోయుని కొడు కయిన త్రికో టిబోయుఁడుగా జన్మించె ననియు, నా త్రికోటిబోయుఁడు పూర్వజన్మజ్ఞానము కలిగినవాఁడై యర్జును తపోవృత్తాంతము కలారూపముగా లిఖింపఁబడిన యొక స్తంభము నింద్రకీలపర్వతమందు స్థాపించె ననియుఁ జెప్పఁబడియున్నది. ఈయితి వృత్తము భారతములోని కథకు సరిపోవుచున్నది. యక్షుని ప్రస్తావనముమాత్రము భారతములో లేదు గాని భారవికృత కిరాతార్జునీయమున నున్నది. త్రికోటిబోయుని ప్రశంసార్థ మిందు గ్రహింపఁబడినది. ఇంద్రకీలపర్వతము హిమాలయమున కుత్తర భాగమున నున్నట్లు భారతములో నున్నది. బెజవాడపర్వతమే యాపర్వత మయి నట్లు జనశ్రుతి బెజవాడప్రాంతమునం దున్నది. ఈశాసనపులిపి క్ర శాసనపులిపిని బోలియుండుటంబట్టి యీశాసనము కూడ నిప్పటికి వేయిసంవత్సరముల పయి నాఁటి దని యు, నప్పటికిఁ గూడ నీజనశ్రుతి యుండె నని యుఁ దేలుచున్నది. క్ర శాసనముకూడ నీవాడుకను సూచించుచున్నది.

బెజవాడ యనునది సామాన్యముగా జనులు వాడునట్టి పేరు. ఈపేరే యుద్ధమల్లుని శాసనములోఁ గూడనున్నది. ప్రస్తుతశాసనమం దు "పెచ్చెవాడ" యను రూపము కనుపట్టుచున్నది. బీజవాడ, విజయవాడ, విజయవాటిక యను నామములు శాసనాంతరములఁ గన్పట్టుచున్నవి. విజయవాడ, విజయవా టిక యనునవి యర్జునుని పేళ్లలో నొక టయిన విజయశబ్దమువలనఁ బుట్టినట్లు కనఁబడుచున్నవి. ఇదియే మొదటిపేరుగా నుండి, దానివలన బెజవాడ యనియు, దానివలన పెచ్చెవాడ యనియుఁ బేళ్లు పుట్టెనో, లేక మొదటిపేరు పెచ్చెవాడ యని యుండి దానివలన బెజవాడయని పుట్టి యది పండితులచే సంస్కరింపఁబడి విజయవాడ, విజయవాటిక యయ్యెనో, యదియునుంగాక పెచ్చెవాడ యనునది

వ్రాఁతపొరపాటునఁ గలిగిన లోపమో, ఉచ్చారణ భేదమో నిర్ణయించుటకుఁ జాలినన్ని యాధారము లింతవఱకు లభింపలేదు.

జయంతి రామయ్య.

చ.

మూలము.

(ఉత్తరపు వైపు.)

1. అర్జున (ః) ఫల్గుణ (ః) పార్థ (ః) కిరీటి[1] శ్వేతవాహ
2. నః [2]వీభత్సు విశ్వ-జయ (ః) కృష్ణః సవ్యసాచీ ధనం
3. జయః॥ స్వస్తి|(శూ)య తేఖలు ద్వైతవనే పాణ్డవా
4. న్ దృష్ట్వాతత్పశుపా(తే)న వ్యగ్రోర్జున ఇన్ద్రకీలమ్ గత్వా
5. వి(ష్ణు)సా(హాయ్యతో) తపసా మహేన్ద్ర మారాధ్య తదుప
6. దే(శాత్) మహేశ్వర మారాధయతః పా(శు)పాతాస్త్ర[3]
7. ర్థమ్మాతిగహన మిన్ద్రకీలమయం యతః ప్రాప
8. యామ్యతి[4] త్వామిత్యాదిష్టావానితి॥ సచయతః శాపా
9. ంతరాత్కాలో పెచ్చె(వా)డ(క)లియమబోయిపుత్రః
10. త్రి(కో)టిబోయినామా ధార్మ్మికః ప్రాదు(రభూ)
11. (ద్య)శ్చకర్ణ-ఇవ(బ)లపరాక్రమోపేతోవదా
12. న్యశ్చ మాతలిరివ సర్వ-కార్య్య-కుశల(ః)(స్వా)
13. మిభక్తశ్చ హనూమానివ విది(త)జన్మాంత
14. (రా)వ(తారో)స్యకులో[7] త్తమచరితశ్చసః[8] పూ

(దక్షిణపువైపు)

15. ర్వ-మర్జునమైత్ర్యార్జ(న్మా)ంతర వేదీ తత్పా
16. శుపతాస్త్రావాప్తి కల్యాణ్ధాన మిన్ద్రకీలే
17. (స్వ)యశోనిధిమివ స్వకులాభివృద్ధయే
18. స్తంభమాస్థాపయత్ । ఇన్ద్రకీలో గిరి
19. య్యా-వ ద్యావచ్చే యమ్ మహానదీత్రి
20. (కో)ట్టి బోయుధమ్మో-యమ్ స్థేయాన్తావద్భవేది
21. హా॥ విజాయా[10]చాయ్య-స్యలిఖితమ్॥

---

1. కిరీటీ యని యుండవలయును.
2. బీభత్సు ,,
3. పాశుపతాస్త్రా ,,
4. ప్రాపయిష్యతి ,,
5. త్యాదిష్టవానితి ,,
6. భక్తశ్చ యని యుండవలయును.
7. జన్మాంతరావతారస్స్వకులో ,,
8. స ,,
9. స్థితాంస్తావత్ ,,
10. విజయాచార్య ,,

ఓం

శ్రీపరమాత్మనేనమః

# అమృత కలశి.

## విజ్ఞాపనము

ఈయమృతకలశియందు సాహిత్యవిషయమున నాకుఁ గల యభిప్రాయములను గొన్నిటిని సూచించియున్నాఁడను. ఇట్టిపనికి గద్యమంత యెక్కువగాఁ బద్య మనుకూలింప దని నాకుఁ దెలియును. కాని, ఆర్నోల్డ్, కార్లైల్, హాజ్లిట్ మున్నగు నాంగ్లేయకావ్యమీమాంసకులమార్గము ననుసరించి మనయాంధ్రభాషలోఁగూడఁ గొన్ని వ్యాసములను వ్రాయవలెనన్న నాకోరిక నెఱవేఱుటకుఁ జాలినంతయవకాశము లభింపకుండుటచేతను గడుపులోని యూహాలు కడుపులోనే జీర్ణమయిపోవు నన్నభయముపుట్టుటచేతను ఇట్టిరచనకుఁ గడఁగినాఁడను. జీర్ణమయి పోయినంతమాత్రమున లోకమున కింతలో సంభవించెడి ప్రమాద మేదియు లేదుగాని శ్రీయుతరవీంద్రనాథఠాకురు మున్నగుమహాకవులు బైలుదేఱిన యీకాలమందు మనయాంధ్రకవితకుఁగూడఁ ద్వరలోనే క్రొత్తశక మారంభము కాఁగలదేమో యని యాశతో నెదురుచూచెడిసాహిత్యపరులయాశ లడుగంటు నట్లుగా మనవారిలోఁ బెక్కుచోట్లఁ గవులను గూర్చియుఁ గవిత్వములను గూర్చియు సామాన్యవిశేషభేదముల నంతగాఁ బాటింపనివింతరుచులును విపరీతాభిప్రాయములును వెల్లడియై వ్యాపించుచుండుటచే నట్టివానిని గొంతవఱకు మార్పఁ బ్రయత్నించుట ధర్మ మని నే నీపద్యములను రచించినాఁడను. ఇందలి నాయభిప్రాయములలోఁ గొన్ని నాకొక్కనికే కలిగినవి కావు. నాకన్న బహువిధముల సమర్థులగుపండితులును ప్రాణవిద్యాధికులును నప్పుడప్పుడు ప్రసంగవశమున నాయభిప్రాయములనే నేఁటికాలపుఁ గొందఱకవులవిషయమునను గొన్ని కవిత్వములవిషయమునను వ్యక్తీకరించియున్నారు. అట్టివారి కీచిన్నికావ్యములోనిభావము లింపుగా నుండఁ గల వని నానమ్మిక. పైత్యతత్త్వములకుఁ బాలుపడవందు రేమో కాని భిన్నాభిప్రాయులైన యితరులకైనను విరసముగా నుండఁగూడదనియే నాయెన్నిక.

కృతికర్త.

రాజమహేంద్రవరము.

శ్లో. నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి. మమ్మటభట్టు.

మ. తలలో నాలుకవోలె నీవు మెలఁగం దా సృష్టిఁ గావింపఁ గా
వలనయ్యెం జతురాస్యుఁ డయ్యును మొదల్పంజాలునే నోరు నీ
యలఘుప్రేరణశక్తిలేక యిసుమంతైనన్ సమస్తాత్మచి
త్కళవై యొప్పెడిదేవి నీకిదె నమస్కారంబు వాగీశ్వరీ. ౧

శా. ఆరోగ్యంబు సెడెం గుటుంబభరణాయాసంబు హెచ్చెన్ సుదు
ర్వారుల్ పైయధికారులైరి మఱి సేవాముక్తిభాగ్యంబునున్
దూరస్థం బగుజీవితంబు వెగటై తోఁచున్ మఱేమన్న ని
న్నారాధింతునటన్న యాశ యొకటే యాలంబమై నిల్చెడున్. ౨

శా. పేదల్ పేదఱికంపుఁబెన్వెతలకున్ బెగ్గిల్లి యొక్కింతసే
పాదల్ మానఁగఁ దప్పఁద్రావి వడియుం ద్రళ్లే మహాసంస్మృతి
ప్రాదుర్భూతవిషాదఖేదములకుం బాల్పడ్డనాడెందమున్
నీదివ్యామృత మాని చొక్కి మఱచున్ విశ్వంబు వాగీశ్వరీ. ౩

శా. అన్నంబేటికిఁ బానమేటి కమృతాహారంబు చేకూరఁగాఁ
గన్నుల్ మోడ్పఁగఁ బారవశ్యమున నింకన్నిద్ర యంచేల న
ర్వోన్నత్యంబు ఘటిల్ల భావజగతిన్ బాహ్యప్రపంచం బిఁకే
లెన్నన్ భేదము యోగికిం గవికిఁ దా నింతేనియున్ లేదహో. ౪

శా. కోరన్ మువ్వలు పోఁగు లుంగరములుం గోరన్ దుకూలంబులుం
గోరన్ మేడలు మిద్దెమాడుగులునుం గోరన్ హయాందోళికల్
కోరం దగ్గది యేదియో నరుల కీక్షోణీస్థలిం దాని వే
మాఱుం గోరుదు దేవి నిన్గొలువఁగం బ్రాపించునానందమున్. ౫

ఉ. అత్తకు నీకు వైర మని యాఱడిసేయుదు రజ్ఞులయ్యయో
విత్తముఁ గూర్పఁజాలుబలువిద్దియ లుండఁగ నెన్నియో రసా
యత్తమతిన్ మధువ్రతము లంబురుహాకరముంబలెం గవుల్
మెత్తురు సత్కవిత్వమునె మిక్కిలియున్ గతకాంచనస్పృహన్ ౬

క. వనదేవతాప్రసాదము, నను బదముల నొయ్యనిడ వనము తెర్వున రా
మునిసతికిఁ దోఁగె ముందులు, నన లయ్యెను గండ్లు నట్లె నాకవిత నాగిన్, ౭

క. ప్రేమాదికములు తొలఁగి య,సామాన్యము లగును దేవి సామాన్యములున్
సామాన్యమగును నీదుకృ,పామహిమ ఘుణాక్షరముగ భావింపఁజుమీ. ౯

ఆ. వె. మెచ్చి వసుకవీంద్రు మెచ్చరేని యతండు,మెచ్చుకవిత సరసు లిచ్చ నదియ
పూర్వసరసత యగుఁ బొరయునే దేవి నా,ముదము వైపరీత్య మది కతముగ.

మ. వినతుం డై తనవిద్దె వేఁడుచిఱుతన్ ప్రేల్వట్టిదిద్దించుఁగా
దనఁడుం జేయఁడు శక్తివంచన మసూయం జెంది యట్లాట నె
ట్లానరించున్ గురుధర్మకోవిదుఁడె యయ్యున్ సత్కృపామోదియ
య్యును ద్రోణుం డిఁక సుబ్బరాయకవితో నొప్పారఁగా సఖ్యమున్. ౧౦

మ. కవితాతత్త్వవిశారదుండగుటకై కాశీనవద్వీపవా
సవృథాయాసములేల పూర్వభవసంస్కారంబు వాణీప్రసా
దవిశేషంబును గల్గ మూఁగయు వసంతశ్రీసమారంభవే
ళ వనీపాళిఁ బికంబువోలె మధురాలాపంబుఁ గావించెడున్. ౧౧

మ. కవనం బన్నను గాఁజువ్వెఁ గొని తేఁ గానంత గంగాజలం
బవునే పెద్దల కెల్ల దాహశమనంబై మోలలాడంగఁ ద
చ్ఛివమూర్ధోపరిఖేలదంబరధునీదివ్యప్రవాహంబులన్
భువిఁ బాఱింపవలెన్ భగీరథతపఃపుణ్యంబునన్ గణ్యుఁడై. ౧౨

క. కలుగుదురుగాని కవులిలఁ,గలిగింపంబడరటంద్రు ఖండాంతరవా
సులు ప్రాగ్భవకృతవిశ్వా,సులుగాకయుఁ బలుకుటెట్లు చోద్యముకాదే. ౧౩

క. కవిహృదయ మన్యహృదయం,బువిధంబునఁ బద్మకోశమున కెనయగుఁ గా
ని విశేషమున్న ఘటనం,బవుపుడిసిలియట్లు నిండఁబట్టుం గడలిన్. ౧౪

క. కనుదెఱచి మూసెనేనియు,ఘనుఁడగుకవి ముజ్జగంబుఁ గట్టివయిచు వా
మనమూర్తిపదత్రయికన్నను బలవత్తరము భావనాదృష్టి యహో. ౧౫

క. పువులవయిఁ జేఁటివోలెం,దవిలెడుఁ దా నెపుడు వాసనాప్రేరితమై
కవిమనను మధురవస్తుల,భువి సుమహితవృత్తుల కిది పోలునుగాదే. ౧౬

క. ఉన్నది లేనట్లుగ మఱి, యున్నట్లుగ లేనిదాని నొగిఁ జెప్పి కవుల్
కన్నులుగా వీనుంగవ,పన్నుదు రౌరౌర మాయపన్నాగంబుల్. ౧౭

ఆ. వె. శిల్పినిపుణుఁ డైనచిత్రకారుం డెట్లు,సూక్ష్మములను జూపు స్థూలములను
బోధకవియు నట్లె ప్రకటించు భావంబు,పూవు దెచ్చి ముక్కుపొంతనిడఁడు

గీ. పెదవిఁ గదలింపకుండ నవ్వినయాలంతి
నగవు కనుదోయిఁ గ్రేవల నిగిడి మొగము
దమ్మి వికసింపఁజేయుచందమున మెఱసి
ప్రౌఢకవివాక్కు హృదయంబు నలరఁజేయు. ౧౯

క. చెప్పఁడు కవి భువి నితరులు, చెప్పెడుక్రియ మఱుఁగు విడిచి చిత్రం బేదో
గుప్పిట నిడి యూరించును, జెప్పికొనెడిదాఁకఁ దండ్రి శిశువులనుబలెన్. ౨౦

గీ. నవరసామోద మేదురం బవుచు వివిధ
పాకరీతుల నొప్పుకావ్యము సువర్ణ
పాత్రికలయందుఁ గవి మహాభాగ్యశాలి
యమృత మస్తని యిడును మృష్టాన్నమట్లు. ౨౧

క. నోరికొలఁదు లాడఁడు కవి, మేరువుఁ దృణముగఁ దృణంబు మేరువు గాఁగన్
సార మసార మసారము, సారము గావించు శక్తిసామర్థ్యములన్. ౨౨

శా. రమ్మన్నన్ వెస రావు రావలదనన్ రాకుండఁగాఁబోవు ర
మ్యమ్ముల్ కైతలకుం గళాకళలు వేళావేళలుం గల్గు సం
ద్రమ్మం బొందెడిపాటుపోట్లకుబలెన్ సంగీతసాహిత్యమా
ర్గమ్ములోన్ యివి స్వస్థచిత్తులకుఁ దక్కం ద్రొక్కఁగారాని వౌ. ౨౩

ఆ. వె. చీమ చిటుకురన్నఁ జీకాకుఁ జెందెడు, నెదుట భేరి మ్రోయ నెఱుఁగకుండు
సున్నితంబుగాదు సూడ మ్రోడనరాదు, కవిమనంబు తెఱఁగుకపియెఱుఁగు.

ఆ. వె. కాఱుమబ్బు గ్రమ్ముకటికిచీఁకటిరాత్రి
త్రోవ తెన్ను గనక త్రొక్కులాడి
యట్టె మెఱపుమెఱసి యర్థమెల్ల స్ఫురింపఁ
బాంథుఁడట్లు కవియుఁ బ్రమద మొందు. ౨౫

ఉ. ఆవిరదృశ్యరూపమున సర్వమతప్తమహార్ణవోద్గతం
బై వినువీథిఁ జల్లగ నవాంబుదరూపము నొందునట్లుగా
నేవొ యసంగతార్థము లనేకముగా హృదిఁ దోఁచి భావముల్
వే విపులత్వ మొందెడు వివేకసమీక్ష్యతరమ్యమూర్తులై. ౨౬

మ. తొలుతన్ సన్ననినూలుపోఁగువలెఁ బ్రాదుర్భూతమై సాఁగి యా
వల నంతంత స్వభావమైత్రి నెఱపం బ్రాపించు నెల్లం గడున్

బలుపుం జెంది యతిక్రమించి విషమావస్థల్ ప్రశాంతిన్ సమ
స్థలిఁ జాఱుం గవిరమ్యమానసరసస్సంభూతగంగౌఘముల్. ౨౭

క. అది యిది వ్రాయుం డనుచు సు,హృద్దు లెంతయు వేఁడుచుందు రిది వ్రాయుదు లే
నిది వ్రాయు టశక్యంబు,న్నది వ్రాసిన మెచ్చ రింక నగు మానమె మేల్. ౨౮

క. తుడిచెను ముత్తెము లన్నియు, విడిచెను మఱి నత్తగుల్లపిం డెల్లను జా
ఱుఁడు మేటిధీవరుఁడె యగు, నడఁచెనె రత్నాకరాఖ్య నంభోనిధికిన్. ౨౯

ఉ. చెప్పెడిదేమి క్రొత్తగను జెప్పెడిచొప్పులె క్రొత్తగా కిలం
జెప్పఁ గలట్టివాఁ డెపుడు జీవదశాపరిణామతత్త్వమే
చెప్పెడుఁగాని వేఱొకటి చెప్పఁగనేరఁడు నేర్పునేనియుం
దప్పక వాని నెన్నఁదగుఁ దాఁ దననీడను దాఁటుజాణఁగాన్. 30

ఆ. వె. క్రొత్తత్రోవఁ ద్రొక్కి క్రొత్తసీమలఁ జూపి, క్రొత్తచవులఁ దేల్చి చిత్తములకుఁ
గ్రొత్తవికసనంబుఁ గూర్పనియ్యాకైత, సెప్పి యేమి యింకఁ జెప్ప కేమి. ౩౧

గీ. పాడినదె పాడెదేని మున్ పాడినట్టి, వారికన్నను సొగసుగాఁ బాడవలయుఁ
బాడలేకున్న నగుదురు ప్రాఁచిపండ్లు, దాసరీ యంచు నిను గేలిసేసి జనులు.

గీ. పరమపురుషార్థ మంచు నువ్రాసినదియె, వ్రాయఁ దలఁచినఁ దప్పులే దేయెడలను
రామకోటులు వ్రాసి శ్రీరామపాద, పద్మసన్నిధి నిడమె సద్భక్తి మ్రొక్కి. 33

* * * *

శా. పద్యం బల్లుటయే కవిత్వమని సంభావించు సాహిత్యస
ద్విద్యాగంధదరిద్రు లెంచ నరులే పెంజీఁకటిం గానలో
ఖద్యోతంబులఁ జూచి నిప్పలనుచుం గ్రాఁగం జలిం బ్రీతిమై
నుద్యోగించెడి వెఱ్ఱివానరులుగా నూహించి చూడం గదున్. ౩౪

క. వసుచరితమొ మనుచరితమొ, కసిగాట్లుగఁ గొఱికి లేచి గబ్బునఁ ద్రేఁపన్
రసహీనులు కవనవుఁజే, ర్పొనఁగించెదరా యజీర్ణపుంద్రేఁపులకున్. ౩౫

ఉ. తియ్యనినీరు కొబ్బరియుఁ దేపకుఁ ద్రావ భుజింప నబ్బునం
చొయ్యనఁ గోశముం దెఱచి యోపికమైఁ బరికించి చూడఁగా
నయ్యయొ పేదకొంపవలె నజ్ఞమనంబును బోలె శూన్యమై
దయ్యవుఁగాయ యయ్యెను వృథాశ్రమ మిచ్చుచు నేమి సెప్పుదున్. ౩౬

ఆ. వె. లెంక తొఱ్ఱ దక్క నింకేమి లే కొక్క, మాఱు చప్పరించి పాఱవేయు
బుడుతమావిపండ్లపోలికఁ దుచ్ఛంపుఁ, గృతిశతంబు లేమి తృప్తి నేయు. ౩౭

గీ. విఱువవిఱుగకకోఱుకంగఁగోఱుకునవకరమలనమలఁగఁజెప్పునైనారసాఁగి
నోరునొప్పించుకవనంపుథోరణులకు, మ్రొక్కుముసుపాకపుజిలిబికీలకును.

క. భాసుర మగురసము రసా, భాసము నను రెంటివస్త్రవాసియుఁ గనకే
చేసినకవనము బంగరు, పూసినరవణంబువోలె మోసముఁ జెప్పున్. ౩౯

గీ. చిన్నిబోగంపుఁబిల్ల గజ్జయను గట్టి యభినయించెడి శృంగారమట్లు కవియు
ననుభవములేక వర్ణించునట్టిదియును,రసికహృదయంబులకుఁ గాదు రంజకంబు.

క. భావమునకుఁ దగుపద్దము, గావలెఁ గాఁజేసి కుంభగతదీప మగున్
జీవున కుపాధి దొడ్డది, యైవెలయక సుప్రకాశ మబ్బదుగాదే. ౪౦

* * * *

మ. ప్రతిపద్యంబు రసాస్పదంబుగ రచింపన్ శక్తి లేదేని పం
డితులుం బామరులుం జెలంగి పొగడన్ లేవేని నేర్పల్ పురా
కృత మింతే యని చింతనొందఁ దగ దింకేమన్నఁ బ్రాజ్ఞుండు సం
స్కృతకావ్యామృతపానమత్తమతియై క్రీడించు టొప్పంగదున్. ౪౧

ఆ. వె. ప్రాణి యూర్పుఁబుచ్చు భావంబు వెలిఁబుచ్చు,మాటనైననొండుపాటనైన
నుల్లముల్లసిల్లనూరకుండఁడుతీయు, మూఁగయయినఁ గూనురాగ మొకటి.

మ. తన కానందముఁ గూర్చుతందనములం దా మెచ్చుకోఁ జెల్లెడుం
దన కీర్తైనజనంబు మెచ్చఁదగు లేదా లొచ్చువారేనియుం
దనకుం బెక్కుమడుంగు లుత్తములు తత్త్వజ్ఞుల్ ప్రశంసింప లే
దని దూపిల్లుచుఁ దాల్మిఁ బోవిడిచినన్ హాస్యాస్పదుం డయ్యెడున్. ౪౪

క. రసవంత మేని కావ్యము, రసికులు తమయంత మెచ్చి ప్రాపుదు రెలమిన్
భసలములు పారిజాత, ప్రసవంబులమీఁద వచ్చి వ్రాలుట గనమే. ౪౫

మ. పుటలన్ లెక్కిడి గొప్ప చెప్పికొనెడున్ మూఢాత్ముఁ డొక్కండు సం
పుటముల్ దొంతరవెట్టి సంతసమునం బొంగున్ మఱొక్కండు దా
ఘటికం జెప్పితి నేకధారగ శతగ్రంథంబు నంచున్ సము
త్కటమోదంబును బొందు వేఱొకఁడు చిత్రం బల్పసంతోషముల్. ౪౬

క. ధృతరాష్ట్రునిసుతశతకము, వితమునఁ దమకృతులు భీమవిక్రతులయి క్షితిన్
బ్రతుకుసెడి యుంటఁ జూచిన, కృతికర్తలు కావుటెట్లు మృతజీవులిఁకన్. ౪౭

క. నిలుకడయె వలయునేర్మి, నిలుకడయే వలయుఁ గృతికి నిమిషార్థములో
పల నిండిపొంగిపారలెడి, సెలయే ఱడఁగెడు నడఁగునె జీవనది యికన్. ౪౮

క. తొలువొల్లటితమకృతులను, వెలయింపరు కవులు పేసఁబెంపు నడఁచు నం
చెలమావియంటుతోఁటల, తొలిపూఁతలఁ ద్రుంచివేయుదు రగద కృషికుల్.

ఆ. వె. క్రొత్తసొమ్ము వెట్టికొని పెండ్లికేగునం
దాఁక నిలువలేని తరుణులట్లు
అల్లి చపలు లొకటి యపుడె యచ్చిడి యొరుల్
మెచ్చుకున్నఁ జిన్నఁబుచ్చుకొంద్రు. ౫౦

* * * *

శా. బిడ్డం దొట్టినిఁబెట్టి యూఁచుటకునై పేరంటముం జెప్పఁగన్
దొడ్డమ్మల్ పదిమందిచేరి నిసువుం బోలంగ నీక్షించి యా
బిడ్డం డొప్పును నోరు చిన్న కడుపే పెద్దంచు నేమేమొ పే
ర్లిడ్డం దల్లియుఁ బ్రోడవోలె నవి మీదృగ్దోష మంచు న్నగున్. ౫౧

ఉ. విద్దెలపేర్మి చాలనికవిత్వమునం బొడసూపు దోసముల్
దిద్దికొనంగఁ దెల్పినసుధీమణి వంద్యుఁడుగాక నింద్యుఁడే
యద్దముఁ జూచి నేర్పు మెఱయన్ సవరించుకొనంగ నొప్పగున్
ముద్దతెఱంగుసూవె మఱి మూతిముడుంచుక దానిఁ ద్రోయుటల్. ౫౨

గీ. కురులనెగదువ్వఁగాటుకమఱికఁదుడువ, బొట్టుసవరింపమెడసొమ్ము మట్టుపఱుపఁ
దోడుపడుఁగానియద్దంబుదోడుపడునె,కోలమొగమునుగావింపగుండ్రమొగము

శా. స్థాలిత్యంబుల కెంపు సంస్కరణముల్ సాధ్యంబు లౌఁగాని యు
స్థూలస్థూలపదార్థతత్త్వవికృతిం దీర్పంగరా దేరికిం
బోలుం గస్తురిబొట్టువంకరను సంపూర్ణంబుగా దిద్ద నే
లీలం గోలమొగంబు గుండ్రముగఁ గల్పింపంగ శక్యంబగున్. ౫౪

ఆ. వె. తెలిసి యొకఁడు మెచ్చఁ దలద్రిప్పు నింకొక్కఁ,డద్దిసూచిగంగిరెద్దువోలెఁ
దాతమృతిని వినుచుఁ దల్లి గొల్లనఁ దల్లి, యేడ్పు నూచి బిడ్డఁ డేడ్చునట్లు. ౫౫

గీ. పందివలె నోట ఘుర్ఘురింపంగ నొక్కఁ, డచ్చముగఁబందియేయని మెచ్చిరతని
నింకొకఁడు పందిపిల్లనె చంకడాఁచి, దానిఁ గూయింప మెచ్చ రద్దాని జనులు.

క. లోకులు పూజితపూజకు, లే కావునఁ గ్రొత్త మెచ్చ రిఁకఁ బ్రాఁతయు రోఁ
తైతె కొనంబడు వీరల, వాకులకున్ లేదు శుద్ధిబద్ధము నెంచన్. ౫౬

గీ. పెట్టినను బెండ్లి యందురు పెట్టకున్న, నింకొకటి యందురొకయింత శంక లేక
తోరణంబులు ద్రెంతు రాదుండగంపుఁ, గవుల సందులకైన మెచ్చవలెఁజుండి.

క. తప్పన్న మీఁదఁ బడుదురు, ద్రుప్పులు పల్లింత్రు చెవుల ద్రుప్పు లటుండన్
జప్పునఁ జేపట్టుచుఁ దమ, ద్రుప్పుంగాలముల వారి ద్రోవఁ జనరేఁడీ. ౫౯

*　　　*　　　*　　　*

మ. పరమానందరసానుభూతికయి ప్రాప్తం బైనయోగంబు దో
మ్మరివిద్దెల్ ప్రకటింపఁ బాల్పడినసామర్థ్యం గవిత్వంబు కొం
దఱనోళ్లం బడి యాశుధార లవధానంబుల్ మొదల్గల్గుచో
స్వైరసాకారవికారముల్ గని స్వకీయాన్నత్యముల్ వీడెదుర్. ౬౦

ఆ. వె. ఉప్పువేయనొక్కఁ డుడుకఁ బెట్టనొకండు, కలియఁబెట్టనొకనొకండునడుము
నోరుదెఱచి సభను గూరుచున్నజనంబు, చప్పరించుఁ జేతు లప్పళించు. ౬౧

ఆ. వె. పట్టిలక్కపిడత లట్టట్టు ప్రాయిమీఁదఁ, బెట్టినట్టి పెట్టి పెట్టుటకును
నేది మొదవపన్న నిది యన్న మిది పప్పు, టంచు బిడ్డలాడునాట లివ్వి.

క. పిల్లకవు లనెడియల్లరి, పిల్లకవుల్ సేరి రచ్చ పెనుమదువులసాం
పెల్లఁ జెడఁగొట్టుకొనఁ గం, పిల్లెడు సుమనోగణంబు పెల్లగువికృతిన్. ౬౩.

ఆ. వె. తిట్టుఁబోతుకవులు బట్టురాచకవులు, పిల్లకవులు కవలపిల్లకవులు
కనుపకలపుఁగవులు నినుపగంటపుఁగవుల్, బాలకవులు నుగ్గుఁబాలకవులు. ౬౪

క. ఊరూరఁ గవులె యందఱు, నోరూరఁగఁ జవులువుట్ట నొడివెడివారల్
నూఱుగురలోఁ బదుంద్రును, బేరుకొనం గానఁబడరు పేరొందనుబలెన్. ౬౫

క. తుమ్మినఁ దగ్గినఁ గవనము, గుమ్మమునకు మామిడాకు గ్రుచ్చినఁ గవనం
బిమ్మెసెడు పేదవిప్రుక, తమ్మునబలెఁ గ్రొత్తకుండఁ దడుప భయమ్మా. ౬౬

గీ. కాఱుచొకయ్యెఁ గవనంబు కాగితంబు
మిగులఁ గఱవయ్యెఁ గవు లెట్లు మిడుకువారొ
యనదగేస్తులకొంపచూరాకు లూడఁ
బీఁకి పాకంబు లిడకుంద్రుగాక యింక. ౬౭

గీ. వారు పీ రిడుపదకముల్ బాసికములు, శాలువులజోళ్లు రమ్యవేషములుగాఁగ
శృంగములు మొల్చునీకవిపుంగవు లహహా, ఱంకెలిడుదురు రచ్చ లలంకరించి.

*　　　*　　　*　　　*

ఆ. వె. తల్లిబిడ్డకెట్లొ తలమెట్లొ నాల్కకు, నట్లె సంస్కృతమును నాంధ్రమునకు
సాంస్కృతికముగానిసాహిత్యమాంధ్రిన, నేలవిడుచుసాముఁబోలియుండు.

ఆ. వె. సంస్కృతాంధ్రపురాణసాహిత్యములు మూఁడు, సరసకవికి సమతసాఁగనేని
వానికపిత పట్టఁబగ్గాలు లేకము, జగము నుద్ధవడిని జంగగొనెడు. ౨౦

ఆ. వె. అనుట తగదుగాని యల్లసర్వజ్ఞుఁడుం, జూపలేఁడు వాని కోపలేఁడు
మూఁడుకన్నులున్నమ్మెనవాలున్న, మూఁడుజగము లేలుమూర్తియైన.

చ. చదివినవారికంటె సరసంబుగఁ గూరుప నేర్తు రంతగాఁ
జదువనివారె మించి సహజప్రతిభన్ విను శాస్త్రి మేమిటం
గొదవడకుండఁ బాడినను గూర్చునె కోమలగాత్రమాధురిం
బొదలినగాలిపాటఁ గలభూరిసుఖంబును గాయకుం డిలన్. ౨౧

* * * *

ఉ. అంగడిదోసెలట్లు తెగనమ్మెడియల్లరినాటకంబులం
బొంగుచుఁ గొండ్రు నీరసులు ముట్టరు మూర్ఖున రన్యులైనవా
రెంగిలివంటపుట్టిమెతు కేనియతప్రతుఁ డిచ్ఛగించెడున్
సంగతభక్తభావమున సామిప్రసాదమె కోరుఁగా కిఁకన్. ౨౩

గీ. కడుపులోఁ బెట్టుకొనలేముగదయివన్ని, యింటిలోఁ బెట్టుద మటన్న నెలుకబాధ
యేమిసేయుదుమయ్య యిం కీవిచిత్ర, నాటకంబుల బిడ్డలయాట కిత్తు. ౨౪

ఆ. వె. మూరపాడుగెకాని పోఁగుచిక్కన లేదు, కట్టికొన్న గుట్టు బట్టబైలు
పిడత గట్టికాని పెరుఁగు పల్చన నేఁటి, కవితలందు నేటికవిత లివ్వి. ౨౫

ఆ. వె. హాస్యరచన లనుచు నవహాస్యములు వ్రాసి, వింతనవ్వుగొలిపి సంతసింత్రు
వెక్కిరింపఁ బోయి వెనుకఁ బడుటచేతఁ ప్రౌఢులకును దెత్తు రలఁతినగవు.

గీ. మృదుత దప్పినహాస్యంబు మేలుగాదు, మృదుతనొప్పిన సరసులు మెచ్చికొండ్రు
ముడ్డి గిల్లినఁ గెవ్వని బిడ్డ యాడ్చు, బుగ్గ గిలిగింప నగుఁ జిన్నిబోసినవ్వ. ౨౬

* * * *

క. ఒకబాసలోనిరస మిం, కొకబాసకు నిండఁ దివియ నుంకించుకవుల్
తికమకలువడరె టెంకా, యకు లోనయి చేతులాడనట్టికవులె యై. ౨౭

గీ. త్రాగనేరనిపిల్లి బోరగిలఁ ద్రోసి, నేలపాలైనపాలఁ గొన్నింటి నాకు
నట్లు కొందఱు మూలంబు నందలిరస, మెల్లఁగొనలేకయల్పసంతృప్తిఁగంద్రు.

క. పాలగుదురు నగుఁబాట్లకు, మూలార్థముఁ గాన కేదొ ముడిపెట్టుకవుల్
నేలఁ బడ నన్న మంతయు, బోలియఁ దల చిక్కుశ్వానములఁ బోలి యహహా.

క. తాత్త్వికకవులకవిత్వపుఁ, దత్త్వము వారలకెగాని తదితరులకు లా
కేత్వంబ యిద్ది వారిక, పిత్వముసొంపా మఱి తత్త్వవిత్త్వముపెంపో. ౨౮

ఆ. వె. దొరలభావములను దొరలకోకిలతోఁ
సరిగఁ గొనుచుఁ దెలుఁగుదొరల మంత్రు
తెలుపు నలుపుఁ జేయఁ దెలియవియ్యాయింగ్లీ
షుపండితులవిశేష బుద్ధి.

ఉ. నన్నయతిక్కనాదికవినాథులు మున్ను మహాపురాణముల్
చెన్నుగ నాంధ్రిభాగలికిఁ జెప్పినదొడ్డులు చేతఁగాక యం
దున్నది సాఁగఁ గొట్టుటయె యొప్పనుకేవలపద్యకారులన్
మిన్నతనంపుసొంపుఁ బని నేరనిపోన్నరు లే యనందగున్. ౬౩

క. నన్నయకుఁ దెలుఁగుఁ దిక్కన, కెన్నంగా సంస్కృతంబు నీరెంటను బో
తన్నకుఁ దెలియవు దెలియును, వన్నియు నా కనుచుఁ దలఁచునజ్ఞుల నగరే.

క. కొందఱకుఁ దెలుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు నింకం
గొందఱకుఁ రెండు గుణమగు, నందఱ కన్నియు గుణంబులగుట గలుగునే.

* * * *

ఉ. తియ్యనిద్రాక్షపండ్లకును దీటయి తేనెయరంటిపండ్లకున్
వియ్యములై రసాలములనెయ్యములై మఱి జంటిపాలకుం
దియ్యములై యొసంగుమన తెన్గులు వీనులవిందు సేయ న
క్కయ్యముదంబునం బ్రదుకఁగల్గుదు మన్నము నీళ్లు లేకయే. ౬౪

ఆ. వె. ఇట్టియాంధ్రిభాష నట్టిట్టు గావించి, పెంపు పేరు సెప్పి పేరుఁ బెంపు
నింపు సొంపు నన్ని యెడలించి సడలింపఁ, జూచుచున్నవారు చోద్యముగను.

క. గ్రామ్యగ్రాంథికభాషా, సామ్యపరిష్కృతికి రచ్చపట్టెక్కి కవుల్
రమ్యేతరవృత్తిం గొని, భూమ్యాకాశముల మాఱుమ్రోయింతు రయో. ౬౬

గీ. ఎత్తు తగ్గించి మఱికొంత యిరవు సేయఁ, గోటగోడలు పగులంగఁగొట్టి నేల
మట్టమొనరింతు రావలఁ గట్టలేరు, రక్షకము లేక కలుగు నరాజకంబు. ౬౭

గీ. ఎత్తు తఱిగిన గొప్పదై యొసఁగు భాష, యంత్రము కాని చూడరు పల్చనగుట వెనుక
గుల్లసొమ్మట్లు పైగొప్ప వెల్లడించు, మేలిమై మెఱఁ దిరుగుట మేలుగాదె.

ఆ. వె. ఎదుగుఁబొదుగు లేనియెండుకొయ్యమతంబు, వారివలెను బలుకువాఁడఁగాను
సరసకవులచేతఁ బెరిఁగి యింపును సొంపు, నింపవలయు భాష తెంపు లేక. ౬౮

జనమంచి వేంకటరామయ్య.

శుభమస్తు.

# వర్ణోత్పత్తి.

పరమేశ్వరునిచే సృజింపఁబడినప్రాణికోటిలో మనుష్యులు శ్రేష్ఠులని యెల్లరును నంగీకరించినయంశమే. నిద్రాహారభయాదులు సమములైనను వీరికి శ్రేష్ఠత జ్ఞానాధిక్యమువలనఁ గలిగినది. ఈవిశేషజ్ఞానము లేనిచో నితరజంతువులకంటె వీరియం దాధిక్య మున్న దనుట కవకాశ ముండదు. కాన వీరికి శ్రేష్ఠతను గలుగఁజేసినది జ్ఞానమే. ఈజ్ఞానతారతమ్యమునుబట్టి వీరిలోఁగూడఁ దరతమభావ మేర్పడుచున్నది. ఏమనుజుఁడైన నుత్తమతను బొందవలయునన్న నెక్కుడు జ్ఞానమును సంపాదింపవలయును. జ్ఞానసంపత్తికి "ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము" అని నాలుగుసాధనములు గల వని కొందఱువిద్వాంసులు నిరూపించిరి. మఱి కొందఱు "అర్థాపత్తి, అనుపలబ్ధి" అను మఱి రెండింటినిగూడ నొప్పుకొనిరి. ఈసాధనము లన్నిటిలోను విద్వాంసులయుపదేశము వలన బుద్ధి వికసించినయెడల ననుమానాదులు విశేషజ్ఞానసంపద కుపయోగించును గాని లేనిచో నుపయోగింపవు. కావున నాయుపదేశరూప మగుశబ్దము ప్రధాన మని చెప్పవచ్చును. ఆశబ్దము వర్ణసముదాయరూపము. (ఇచట వర్ణసముదాయమే శబ్ద మని కొందఱును నతిరిక్తమని మఱికొందఱును విప్రతిపన్నులగుచున్నారు. అయినను వర్ణమునుగాని వర్ణస్థానీయములు గా మఱికొన్నిటిని గాని యందఱు నంగీకరించియేయున్నారు. అవర్ణస్థానీయములకుఁగూడ వర్ణములని పేరిడినచో నందఱును వర్ణముల నంగీకరించినవారే యగుదురు.) ఈవర్ణపరిశుద్ధి, శబ్దపరిశుద్ధికిఁ గారణము. వర్ణపరిశుద్ధి లేనిచో శబ్దము పరిశుద్ధము కానేరదు. అపరిశుద్ధ మగుశబ్ద మభిమతార్థమును బోధింపక విపరీతార్థమును బోధించునుగనుక నుపదేష్టల కనభిప్రేతమగువర్ణజ్ఞానము బోద్ధలకుఁ గలుగును. కావున నాయుపదేశము నిష్ఫలమగుటయేకాక విపరీతఫలమును బుట్టించును. అది యెటులనఁగా, గుఱ్ఱమును గొని రమ్మనుతాత్పర్యముతో "అశ్వ మానయ" అనువాక్యమును బ్రయోగింపవలసియుండగా నావాక్యమందలిశవర్ణ మపరిశుద్ధమై సకారమునుఁబోలి యుచ్చరింపబడెనేని బోద్ధకు "అస్వమానయ" అని శ్రుతిగోచరమై

ర్థనుని గొనిరమ్మను నర్థము స్ఫురించును. అప్పు డతఁడు గుఱ్ఱమును దీసికొనిరాక ర్థనుని దీసికొనివచ్చును. అపుడు వక్తృతాత్పర్యార్థసిద్ధి కాలేదుగదా. దీనికి శ్రవ ణముయొక్క యపరిశుద్ధియే కారణము. కావున వర్ణములపారిశుద్ధ్యమును సంపా దింపవలయును. ఆపారిశుద్ధ్యము వర్ణములయుత్పత్తిసామగ్రిని దెలిసికొని యుచ్చ రించునపుడు తప్పక సిద్ధించును. ఈసామగ్రిని దెలిసికొనని వారు గూడ శుద్ధము గనే యుచ్చరింతురు. కాని యొకానొకపుడైన నచట భ్రమ కవకాశ ముం డును. కనుక నట్టిభ్రమ లేకుండుటకై వర్ణోత్పత్తిసామగ్రి విమర్శింపఁదగి యున్నది. ఇట్టిభ్రమ కవకాశ మున్నపుడు తన్నివృత్తికై వకారబకారముల కును, శకారసకారషకారములకును, భేదమును దెలుపుటకు దంత్యోష్ఠ్యమనియు నోష్ఠ్యమనియుఁ దాలవ్యమనియు దంత్యమనియు మూర్ధన్యమనియు వ్రాయుట గ్రంథకారసమయసిద్ధమై యున్నది. కావున వర్ణోత్పత్తిసామగ్రిని నిరూపించుట యావశ్యకము.*

మఱియు నీసామగ్రిని గుఱ్ఱించిన మఱియొకలాభము కలదు. మాట లాడువారిపై గుణ్యమువలన వర్ణములు మార్పునొందును. అట్లు మార్పునొం దునని "దైవీవాగ్వ్యవకీర్ణేయ మశక్తై రభిధాతృభిః" అనుకారికచే భర్తృ హారి వాక్యపదీయమునందు వక్కాణించెను. అటులు మార్పు నొందునపు డా శబ్ద మసాధు వనఁబడును. అట్టియసాధుశబ్దము నుచ్చరించునపుడు ప్రాజ్ఞులు సాధుశబ్దమును స్మరించి యర్థమును దెలిసికొందురు. ఎటు లనఁగా:—బాలుఁ డవ్యక్తముగ శబ్దము నుచ్చరించునపుడు వ్యక్తశబ్దమును స్మరించియే పెద్ద లర్థ మును దెలిసికొందురు. ఈయంశమును "అంబాంబేతి యదాబాలశ్శిక్షమాణోఽ పభాషతే అవ్యక్తం తద్విదాం తేన వ్యక్తే భవతి నిశ్చయః" అను కారికచే భర్తృహారి స్పష్టపఱిచెను. ఇది యనుభవసిద్ధము. కొన్నియసాధుశబ్దములు పారంపర్యమునఁ బ్రసిద్ధినొందెను. అచట సాధుశబ్దస్మృతి లేకయే యసాధుశబ్ద ములవలననే యర్థబోధ కలుగును. ఇట్టివే యొకభాషలో నసాధువు లనిపించు

* కొందఱు వర్ణములు నిత్యము లనునభిప్రాయమును గలిగియున్నారు. వారియభిప్రాయము నొప్పున వర్ణముల కుత్పత్తియే లేనపుడు సామగ్రి యుండదు. అయినను నుత్పత్తి లేదనవా రభి వ్యక్తి నంగీకరించెదరు. ఆయభివ్యక్తి కుత్పత్తివాదుల యుత్పత్తిసామగ్రియే సామగ్రియై యున్నది. కావున సామగ్రీభేదము లేనందున నాసామగ్రి యిట నిరూపింపఁబడును.

కొనినను మఱియొకభాషగా మాఱి యచట సాధువు లనిపించుకొనుచున్నవి. ఈయంశమును "పారంపర్యా దపభ్రంశా విగుణే ష్వభిధాతృషు। ప్రసిద్ధి మాగతా యేతు తేషాం సాధు రవాచకః" అనుకారికచే భర్తృహరి స్పష్టపఱిచెను. సంస్కృతవికారము లగుప్రాకృతపదములును దద్భవాంధ్రపదములును నిట్టివే యయియున్నవి. ఈమార్పు లనియతములుగాక చాలవఱకు నియతముగానే యుండును. ఈనియమమునకుఁ గారణమేమనఁగా—ఆయావర్ణములకుండుసామగ్రి వికలమగునపుడు వక్త దానికి దగ్గఱగానున్నసామగ్రి నుపయోగించునుగాని దూరమగుసామగ్రి నుపయోగింపఁడు. కావున నొకవర్ణముయొక్క-యుచ్చారణసామగ్రి వికలమైనపుడు సామగ్రిచే దాని కేవర్ణము సన్నికృష్టమో యదియే యుచ్చరింపఁబడునుగాని మఱొకటి యుచ్చరింపఁబడదు. జకారయకారములసామగ్రి చాలదగ్గఱదియగుటచేత యకార ముచ్చరింపఁబడువోట జకారముచ్చరింపఁబడుచున్నది. ఆర్య-అజ్జ, కార్య-కజ్జ, యామ-జాము. ఈసామగ్రీసాన్నిధ్యమునుబట్టియే యుత్తరదేశమున యకారజకారముల కుచ్చారణభేద మగపడదు. ఇటులే వకారబకారములకును శషసలకును విశేషభేద మగపడదు. మధ్యదేశమున ఋకారోచ్చారణమునకును రేఫోకారోచ్చారణమునకును విశేషభేదము కనఁబడదు. ఇటులే దక్షిణదేశమున ఋకారమును రేఫేకారములను బోలి యుచ్చరించెదరు. దీనినిబట్టియే కృష్ణమూర్తి క్రిష్ణమూర్తి యాయెను. ఇటులే థకారధకారోచ్చారణములో విశేషభేదము కనఁబడదు. ఈసాంకర్యమును గమనించుటకు వర్ణోత్పత్తిసామగ్రి ముఖ్యముగాఁ దెలియఁదగినది. దీనిని దెలిసికొనిన, నేభాషలోనిశబ్ద మేభాషలోని కెటులుమాఱినదో సులభముగాఁ దెలిసికొనవచ్చును. దీనివలన శబ్దవ్యుత్పత్తులు సుజ్ఞేయము లగును. వానివలన శబ్దశక్తి విస్పష్ట మగును. కావున వర్ణోత్పత్తి నిరూపింపఁదగిన దని యెంచి నామిత్రులు చేసినయాజ్ఞను మీఱలేక దానిని నిరూపింప సామర్థ్యము నాకు లేకున్నను

> గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళావివేశ్వరః।
> శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥

అనుసూక్తిని నమ్మి నా కున్నజ్ఞానము కొలఁది నిరూపింప సాహసించితిని. నాసాహసమును విద్వాంసులు మన్నించెదరుగాక.

శ్వాసకోశములనుండి గాలి పైకి వెడలుటయుఁ, బైనుండి గాలి లోపలికిఁ బ్రవేశించుటయు సహజమై యున్నది. ఈపద్ధతి ప్రాణులజీవనమునకును నారోగ్యమునకును సాధనముగ భగవంతునిచేత నేర్పఱుపఁబడినది. అందుఁ బైకి వెడలు గాలికి "నిశ్వాస" మనియు లోపలికిఁ బ్రవేశించుగాలికి "ఉచ్ఛ్వాస మనియుఁ బేళ్లు. మనుష్యునకు నికర్షము నఁగా, సంకోచమును గలుగఁ జేయు శ్వాసము గాలి కావున దానికి నిశ్వాస మని పేరు కలిగెను. ఉత్కర్షము నఁగా ఉచ్చభావమును గలుగఁజేయుగాలి కావున దాని కుచ్ఛ్వాస మని పేరు. ఈనిశ్వాసము పైకి వెడలుటకు ముఖమార్గము, నాసామార్గము నని రెండుమార్గములు గలవు. అందు నాసామార్గమున వెడలినది యారోగ్యసాధన మగును. ముఖమార్గమున వెడలినది యట్టి యారోగ్యసాధనము కాదు. ఈయుచ్ఛ్వాసనిశ్వాసములు పురుషేచ్ఛ యక్కఱలేకయే సుషుప్తికాలమునందుఁ గూడ నుండును. ఈనిశ్వాసమే వర్ణోచ్చారణేచ్ఛాసహాకృత మగునపుడు వర్ణోత్పత్తికిఁ బ్రధానకారణ మగును. (ఉచ్ఛ్వాసమువలనఁ గూడ నొకప్పుడు వర్ణోత్పత్తి గావచ్చును గాని యవి యుత్పన్నము లగువర్ణములు పశ్యంతీరూపమునుఁ దాల్చి యితరులకు శ్రుతిగోచరము కానేరవు. కావున నవి ప్రకృతమున విచారణీయములు కావు, కావున నిశ్వాసరూపవాయువే వర్ణోత్పత్తికి ముఖ్యసాధన మని చెప్పితిని.) ఈనిశ్వాసవాయువువలననే యన్నివర్ణములును బుట్టును. అయినను శ్వాసకోశము మొదలుకొని యోష్ఠములవఱకు నుండునవయవవిశేషముల సంయోగవిశేషములవలన నీవర్ణవిభాగము సిద్ధించును. ఆభేదము లిటుఁ జూపఁబడును. ఏదేని యొకయర్థమును బోధింప నిచ్ఛ కలిగినపు డాయర్థమునకు నుపస్థాపక మగుశబ్దము నుచ్చరింపవలె ననునిచ్ఛ మనంబునఁ గలుగును. అట్టి యిచ్ఛతోఁ గూడినమనస్సు జాఠరాగ్నిని బ్రేరణ చేయును. అగ్నిప్రేరణమువలన బయలుదేఱిన నిశ్వాసవాయు వురోభాగమునందు సంచరించుచు మంద్ర మనుపేరుగల స్వరమును బుట్టించును. దీనినే ప్రాతస్సవనమునందు యాజ్ఞికు లుపయోగింతురు. కంఠమునందు సంచరించునపుడు మధ్యమ మనుపేరుగల స్వరమును బుట్టించును. దీనినే మాధ్యందినసవనమునందుపయోగింతురు. శిరమునందు సంచరించి తారస్వరమును బుట్టించును. ఇదియే యాజ్ఞికులచే సాయంసవనమున వాడఁబడును. నిశ్వాసవాయువు వేగాఖ్యసంస్కారయుక్తమై మూర్ధపర్యన్తము వెళ్లి యచ్చటినుండి మరలినపుడు గళవివర

ద్వారమున నాస్యములోనికిఁ బ్రవేశించి యాస్యాన్తర్గతము లగుభిన్నస్థానములతో సంయుక్తమై యాయావర్ణములఁ బుట్టించును. ఈయంశము "ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనోయుంక్తే వివక్షయా। మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్॥ మారుత స్తూరసి చరన్ మన్ద్రం జనయతి స్వరమ్। ప్రాతస్సవనయోగ్యంత చ్ఛందోగాయత్ర మాశ్రితమ్। కంఠే మాధ్యందినయుగం మధ్యమం త్రైష్టుభానుగమ్। తారం తార్తీయసవనం శీర్షణ్యం జాగతానుగమ్। సోదీర్ణో మూర్ధ్న్యభిహతో వక్త్రమాపద్య మారుతః। వర్ణాన్ జనయతే తేషాం విభాగః పంచధాస్మృతః॥ అని పాణినీయశిక్షయందు స్పష్టపఱుపఁబడినది. ఈ నిశ్వాసవాయువు గళవివరమార్గమున వెళ్లునపు డుచ్చరింపఁదలఁచిన వర్ణముల ననుసరించి యొకప్పుడు గళవివరమునకు సంకోచమును, మఱియొకప్పుడు వికాసమును, మఱియొకప్పుడు సంకోచవికాసములకు మధ్యావస్థయుఁ గలుగును. సంకోచము గలుగునపుడు సంకుచిత మగుగళద్వారమునుండి వెడలు నిశ్వాసము నాదరూపమును బొందును. ఈనాదమె యచ్చులకు, వర్గతృతీయపంచమవర్ణములకు, యరలవలకు ననుస్వారమునకును గారణమైనది. ఈనాద మీషన్నాద మని శిక్షలో వాడఁబడినది. గళవివరమునకు మధ్యావస్థ గలిగినపుడు వెడలిన నిశ్వాసము హాకారరూపమును బొందును. ఇదియే నాద మని పాణినిశిక్షలోఁ జెప్పఁబడినది. ఈహాకారధ్వనియే హాకారమునకును, వర్గచతుర్థవర్ణములకును గారణభూతమైనది. గళవివరము వికాసమును బొందినపుడు వెడలిన నిశ్వాసము శ్వాసరూపమగును. ఈశ్వాసముగూడ నీషచ్ఛ్వాస మనియు, శ్వాస మనియు రెండుతెఱంగుల వాడఁబడినది. శ్వాసము ప్రకృష్ట మైనపుడు శ్వాస మనియు, నప్రకృష్టమైనపుడు "ఈషచ్ఛ్వాస" మనియు నెఱుంగునది. అందు వర్గప్రథమములకు నీషచ్ఛ్వాసము నిమిత్తము. వర్గద్వితీయవర్ణములకును, శషసలకును, జిహ్వామూలీయోపధ్మానీయవిసర్గములకును శ్వాసము నిమిత్తకారణము. దీనినిబట్టి వర్ణములను నాదవంతములు, నీషన్నాదవంతములు, నీషచ్ఛ్వాసములు, శ్వాసవంతములు నని నాలుగుతెరగతులుగా విభజింపవచ్చును. ఇందు నీషన్నాదములు నీషచ్ఛ్వాసములు నుపాదానకారణ వాయ్వల్పతను బట్టి యల్పప్రాణములనియు, నాదశ్వాసజన్యము లుపాదానకారణవాయుమహత్త్వమునుబట్టి మహాప్రాణము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. ఈయంశము లన్నియు "సంవృతే కంఠే నాదః క్రియతే।వివృతే శ్వాసః।మధ్యే హాకారః।తావర్ణప్రకృతయః।నాదో

నుప్రదానం స్వరఘోషవత్సు । హకారో హచతుర్థేషు । అఘోషేషు శ్వాసః । భూయాన్ ప్రథమేభ్యోన్యేషు," అను తైత్తిరీయప్రాతిశాఖ్య ద్వితీయాధ్యాయమునందలి 4, 5, 6, 7, 8, 9, 10, 11 సూత్రములవలనను, "అమోనునాసికానహ్రౌ నాదినో హఝషః స్మృతాః । ఈషన్నాదాయణో జశశ్చ శ్వాసినస్తు ఖఫాదయః । ఈషచ్ఛ్వాసాం శ్చరోవిద్యా ద్గోర్ధా మైతః త్ప్రచక్షతే।" అనుపాణినీయశిక్షవలనను, దేటపడినది. ఇటీవల వైయాకరణు లవాంతరభేదముల విడిచి నాదవంతములను నీషన్నాదములను నాదము లనియు, నీషచ్ఛ్వాసములను శ్వాసములను శ్వాసము లనియు వ్యవహరించిరి. ఇంకమీఁద నీవ్యాసమునందుఁ గూడ నటులే వ్యవహరింపఁబడును. నాదధ్వని పుట్టునపుడు గళవివరము సంకోచమును బొంది యుండుటచేత నాదజన్యములు సంవారము లనియు, నాదధ్వని విశేషరూపఘోషధ్వని పుట్టుటచేత నవి ఘోషములు లేక ఘోషవంతము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. శ్వాసోపాదానకవర్ణములు శ్వాసజన్యము లగుటచేత శ్వాసము లనియు, నావర్ణము లుచ్చరింపఁబడునపుడు ఘోష మల్పమగుటచేత నల్పఘోషములు లేక యఘోషము లనియు శ్వాసము పుట్టునపుడు గళవివరము వికాసము నొందుటచేత వివారము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. మఱియు నేవర్ణముల నుచ్చరించునపుడు ప్రాణవాయు వల్పముగ నుండునో యవి యల్పప్రాణము లనియు నేవర్ణము లుచ్చరింపఁబడినపుడు ప్రాణవాయువు మహత్త్వమునొందునో యవి మహాప్రాణము లనియు వ్యవహరింపఁబడినవి. పైని జెప్పినవిధమునఁ బ్రతివర్ణము నాలుగునామములు గలదై యున్నది. ఉదాహరణము :—క-అనునది, శ్వాసము-అఘోషము-వివారము-అల్పప్రాణము. ఖ-అనునది శ్వాసము-అఘోషము-వివారము-మహాప్రాణము. గ-అనునది నాదము-ఘోషము-సంవారము-అల్పప్రాణము. ఘ-అనునది నాదము-ఘోషము-సంవారము-మహాప్రాణము. ఇటులే ప్రతివర్ణమును గుఱ్చి తెలియఁదగినది. ఈయంశము సంగ్రహముగా సిద్ధాన్తకౌముదియందు "ఖయాం యమాః ఖయ≍క≍పౌ విసర్గ శ్శరఏవచ । ఏతే శ్వాసానుప్రదానా అఘోషాశ్చ వివృణ్వతే ॥ కంఠ మన్యేతు ఘోషాః స్యుః సంవృతా నాదభాగినః । అయుగ్మా వర్గయమగా యణ శ్చాల్పాసవ స్స్మృతాః ॥" అను కారికలచేఁ దెలుపఁబడినది. పైని జెప్పినవిధమున మొత్తముపైని వర్ణము లెనిమిది ప్రయత్నముల నపేక్షించును. ఈయెనిమిదిప్రయత్నములను బాహ్యప్రయత్న

ము లని మహాభాష్యమునందు వ్యవహరించిరి. తత్తద్వర్ణోత్పత్తి కనుకూల మగు కాకలము (కొండనాలుక) మొదలుగ నోష్ఠపర్యంతము నున్నస్థానములతోఁ గూడియున్న యాస్యమునకు బహిర్దేశమునందు (కాకలమున కధోభాగమునందు) గళవివరవికాసము మొదలగు నాయాకార్యముల నీప్రయత్నములు పుట్టించుట చేతను, నాప్రయత్నోత్పత్తిప్రదేశము పైనిజెప్పిన యాస్యబాహ్య మగుటచేతను, నీప్రయత్నములకు బాహ్యము లని యన్వర్థనామము గలిగెను. ఇటు లెనిమిది బాహ్యప్రయత్నములు వర్ణోత్పత్తికిఁ గారణములై యున్నవి. "ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము" అని మఱిమూఁడు బాహ్యప్రయత్నము లున్నట్లు సిద్ధాన్తకౌముదియందుఁ జెప్పఁబడినది. కాని వీనికి బాహ్యప్రయత్న మనుపేరు సార్థకము గానేరదు. ఇవి బాహ్యప్రయత్నములఁ బోలి సవర్ణసంజ్ఞలో నుపయోగింపక యాన్తరతమ్యపరీక్షలో నుపయోగించుటచేత బాహ్యప్రయత్నసాదృశ్యమును బట్టి వీనికిఁ గౌణముగా బాహ్యప్రయత్నము లని పేరు వచ్చినది గాని వీని కానామము ముఖ్యము కాదు. ఈయంశము శబ్దేందుశేఖరమున "ఉదాత్తాదిజనకయత్న స్యాభ్యన్తరకార్యకరత్వేపి ఉదాత్తాదిశబ్దై ర్వినా చోదితానాం తేషామనజుదాత్త ఇత్యనేనావివక్షా బోధనాత్ సవర్ణసంజ్ఞానుపయుక్తత్వాన్తరతమ్యపరీక్షోపయుక్తత్వరూపసాదృశ్యేన బాహ్యేషు గణనమ్" అనుగ్రంథముచే స్పష్టపఱుపఁబడినది. పాశ్చాత్యపండితులు వ్రాసినరీతినిబట్టి చూడ వీనికిని బాహ్య మనుపేరు ముఖ్య మనియే స్పష్ట మగును. ఈసందర్భమునఁ బైయంశములను గుఱించి పాశ్చాత్యపండితుల యభిప్రాయములను సంగ్రహముగ వివరించెదను. ఉచ్ఛ్వాసమునందు మనచే లోపలికిఁ దీసికొనఁబడిన వాయువు నిశ్వాసమునందుఁ బైకి వెడలును. ఆవెడలునపు డనేకద్వారములలోఁ బ్రవేశించి వెడలును. మొదట వాయుమార్గము Larynx (లేరింక్స్) న బయలువెడలును. ఆమార్గమధ్యమునందు నర్ధచంద్రాకారము లగురెండుచర్మములు Vocal cards (వోకల్ కార్డ్స్) గలవు. ఆరెండుచర్మములు వాయుమార్గపార్శ్వభాగములతో సంయుక్తములై యున్నవి. ఈరెండుచర్మములు వికాసము నొందినపుడు వాయుమార్గము నిరోధింపఁబడును. వికాసము నొందనపుడు క్రిందుగాఁ బడి వాయుమార్గపార్శ్వభాగములయం దణఁగి యుండును. అపుడు వాయుమార్గమును నిరోధింపవు. అవి వికాసమును బొందినపుడు మధ్యకుఁ జిఱిఁగియున్న మృదంగచర్మము యొక్క సమాన మగు ఖండములఁ బోలి యుండును. నిశ్వాసము, ఈరెండు

చర్మములమధ్యమునుండి యూర్ధ్వమునుగా వెళ్లును. ఈవాయుమార్గమునకుఁ బైభాగమునం దొకమాంసఖండము Epiglottis (ఎపిగ్లాటిస్) కలదు. ఆమాంసఖండము మనమాహారమును భుజించునపుడీవాయుమార్గమును గప్పివేయును. అటులు గప్పనియెడల మనము భుజించినయాహార మీవాయుమార్గమునఁ బోయినచో మన కపాయము వాటిల్లును. ఇతరకాలములయందుఁ బైకి వెళ్లి యాహారమార్గమును మూయును. ఈద్వారము నతిక్రమించి నిశ్వాస మొకపేటికను బోలిన వివరము Pharynx (ఫేరింక్సు) నందుఁ బ్రవేశించును. ఈవివరము క్రిందిభాగమున వాయుమార్గముతోడను నాహారమార్గముతోడను సంబంధము కలిగియున్నది. పైభాగమున నాసికతోను ముఖముతోను సంబంధము కలిగియున్నది. ఈపేటికాకార మగువివరమునకుఁ బైభాగమున ముఖనాసికారంధ్రములు రెండును గ్రిందుభాగమున నాహారమార్గములు రెండును నుండుటచే నొకవిధమైనచతుష్పథమువలె నుండును. ఈవివరమున కుపరిభాగమునందు ముఖనాసికామార్గములఁ గప్పుటకు Uvula (ఉవ్యుల) అనుపేరుగల మాంసఖండము గలదు. ఈమాంసఖండము పైభాగమునకు వెళ్లునపుడు నాసామార్గమును, గ్రిందుగా వెళ్లునపుడు ముఖమార్గమును గప్పును. కేవలోచ్ఛ్వాసనిశ్వాసములు వెళ్లునపు డీమాంసఖండము తటస్థముగా నుండును. పేటికాకారవివరమునందుఁ బ్రవేశించిన నిశ్వాసము ముఖనాసామార్గములలో నెద్దానిమూలమున నైన వెళ్లఁగలదు. పేటికను విడిచి ముఖమార్గమున నిశ్వాసము వెడలునపుడు నిరను నాసికవర్ణము లుచ్చరింపఁబడును. ముఖమార్గములోఁ గ్రిందిభాగమున జిహ్వామూలము, దానిపైని మృదుతాలువు, దానిపైని జిహ్వామధ్యభాగమును గఠినతాలువును, దరువాత దంతపంక్తియును, దరువాత నోష్ఠములును గలవు. ఈయవయవములు తమవ్యాపారములయందు వ్యావృతములైనపు డాయావర్ణములు పుట్టును. అది యెటులన, వర్ణోచ్చారణేచ్ఛ పుట్టినతోడనే నిశ్వాసము శ్వాసకోశములనుండి బయలుదేఱి వాయుమార్గములోఁ బ్రవేశించును. ఈమార్గమునందే నిశ్వాసము శ్వాసనాదభేదము నొందును. శ్వాసప్రయత్నజవర్ణము నుచ్చరింప నిచ్ఛగించునపుడు పూర్వోక్తచర్మములు (Vocal cards వోకల్ కార్డ్సు) వాయుమార్గమును నిరోధింపక క్రిందికిఁ బడి వాయుమార్గపార్శ్వభాగముల నంటియుండి యుదాసీనములై యుండును. ఆచర్మములమధ్యమునుండి నిశ్వాసము ప్రతిబద్ధమై మార్పునొందక యూర్ధ్వముగా వెళ్లును. అపు డది శ్వాసరూప

ముగనే యుండును. నాదప్రయత్నజవర్ణము నుచ్చరింప నిచ్ఛగించినపు డీచర్మ ములు వికాసమునొంది వాయుమార్గమును నిరోధించును. అపు డూర్ధ్వముగాఁ బోవుచున్న నిశ్వాసము స్వబలమువలనఁ జర్మములను బైకి నెత్తి పైకిఁ బోవును. అపుడు నిశ్వాసమునకుఁ జర్మములతోఁ గలిగిన యభిఘాతమువలన నాదము పుట్టును. ఈవిధమునఁ జర్మములు క్రిందఁ బడుటచేతను, మీఁది కుత్క్షిప్తము లగుటచేతను, శ్వాసనాదభేదము కలుగును. ఈచర్మము లుత్క్షిప్తము లగు నపుడు చర్మాగ్రములయందుఁ గంపము కలుగును. ఈకంపముల సంఖ్యయొక్క న్యూనాధికభావమువలన నుదాత్తాదిస్వరభేదము కలుగును. తరువాత పేటికా కారవివరమును నిశ్వాసము ప్రవేశించువఱకును మఱియొకభేదము కలుగదు. అచ్చటినుండి ముఖనాసికామార్గములను వెళ్లునపుడే తత్తద్వర్ణవిభాగము కలు గును. అపుడు ముఖనాసారంధ్రములకు పిధాయక మగుమాంసఖండము వలన ననునాసికనిరనునాసికభేదము కలుగును. అది యెట్లు లన, నీమాంసఖండము నాసామార్గముకప్పి ముఖమార్గమున వర్ణోచ్చారణానుకూలనిశ్వాసమును వెళ్లు నటులు చేయునపుడు నిరనునాసికవర్ణములును, నాసామార్గమును గప్పక తాట స్థ్యము నొందుటచేత రెండుమార్గములనుండియు వర్ణోచ్చారణానుకూలనిశ్వాస మును వెళ్లునటులు చేయునపు డనునాసికవర్ణములును బుట్టును. ఈపాశ్చాత్య పండితులయభిప్రాయమునకును, మనప్రాచీనులయభిప్రాయమునకును విశేషభేద మున్నటులు గాన్పింపదు. పాశ్చాత్త్యులు చెప్పిన శ్వాసనాదభేదజనక మగుచర్మ ములయధఃపతనవికాసములును మనవారు చెప్పినగళవివరసంకోచవికాసములును నభిన్నము లని చెప్పవచ్చును. మనవారు శ్వాసనాదములలో నవాన్తరభేద ములఁ జెప్పిరి. పాశ్చాత్త్యులు చెప్పలేదు. ఈయవస్థయందు మనవారు చెప్పిన ఘోషాఘోషములును పాశ్చాతులు చెప్పలేదు. మనవారుకూడ నిది స్వరూప కీర్తనమేకాని దీనివలన విశేషోపయోగమేమియు లేదనియు వక్కాణించిరి. కావున నీయంశములలో వీరి కభిప్రాయభేదము లేదనియే చెప్పవచ్చును. ఉదాత్తాది జనకయత్న మాభ్యంతరముకాని బాహ్యము కాదనియు నచట బాహ్యవ్యవహా రము సాదృశ్యమూలకము కావున గౌణ మనియు మనవారి యభిప్రాయము. శ్వాసనాదభేదనిమిత్తము లగుచర్మముల కంపములసంఖ్యయొక్క న్యూనాధిక భావము "ఉదాత్తాది" జనక మని పాశ్చాత్త్యులయభిప్రాయము. వీరి యభిప్రా యముచొప్పునఁ జర్మకంపము కాకలమున కధఃప్రదేశమం దుత్పన్న మగుటచేత

నదియు శ్వాసనాదములకైతె నాస్యబాహ్యమగుటచేత నచటను బాహ్యావ్యవహారము ముఖ్య మనియే చెప్పవచ్చును. అనునాసిక్యజనకయత్న మాస్యాంతర్గత మని మనవారిలోఁ గొందఱయభిప్రాయము. ఆస్యబాహ్యమనియే బహుసమ్మతము. ఈమతమే భాష్యసమ్మత మని భాష్యప్రదీపోద్యోతమునందు నిరూపింపఁబడినది. పాశ్చాత్యపండితులు ముఖనాసికామార్గమును గప్పెడిమాంసఖండము (Uvula కొండ్యాలు) యొక్క తాటస్థ్యమే యనునాసిక్యనిమిత్త మనిచెప్పిరి. ఈతాటస్థ్య మాస్యబహిర్దేశస్థ మగుటచేత వీరియభిప్రాయముకూడ భాష్యసమ్మత మగు మనవారియభిప్రాయముతో నేకీభవించుచున్నది. శ్వాసకోశములనుండి బయలు దేఱినగాలి వేగముగా మూర్ధపర్యంతము వెళ్లి యచ్చటినుండి మరలి వచ్చునపుడు శ్వాసనాదభేదములను బుట్టించు నని మనవారియభిప్రాయము. శ్వాసకోశము నుండి వెడలి మూర్ధపర్యంతము వెళ్లకముందు వాయుమార్గమునందే శ్వాసనాద భేదము పుట్టు నని పాశ్చాత్యపండితుల యభిప్రాయము. ఇచటఁ బాశ్చాత్యుల యభిప్రాయమె సరియైన దని తోఁచుచున్నది. ఏలయన:—మనవారి యభిప్రాయముచొప్పున మొదట మూర్ధపర్యంతము గాలి వెళ్లి మరలునపుడు మూర్ధసన్నికృష్ట మగునాసాద్వారమునకుఁ బోకుండుటకుఁ గారణము కాన్పింపదు. అటులు పోయిన ననునాసికనిరనునాసికవిభాగము సిద్ధింపదు. మఱియు మూర్ధపర్యంతము వెళ్లినగాలి మరలి పేటికాకారవివరమునకు వచ్చునపుడు ముఖనాసికాద్వారములు సన్నికృష్టములుకావున నటులు ప్రసరించినచోఁ బేటికాకారవివరమున కధోభాగమున నున్న వాయుమార్గమునందుఁ గల్గెడుశ్వాసనాదవిభాగమున కవకాశ ముండదు. కావున నిటఁ బాశ్చాత్యులరీతియె సమంజసమని యన వచ్చును. ఇట్లు పేటికాకార మగువివరమునుండి ముఖమునందు నిశ్వాసము ప్రవేశించి ముఖాంతర్గతములగునాయాయవయవములతో సంయుక్తమగునపు డాయాసంయుక్తస్థానములభేదమునుబట్టి వర్ణభేద మేర్పడును. ఆస్థానములు "ఉరము, కంఠము, శిరస్సు, జిహ్వామూలము, దంతములు, నాసిక, ఓష్ఠములు, తాలువు." అని యెనిమిదివిధములని "అష్టౌస్థానాని వర్ణానా మురః కంఠః శిర స్తథా। జిహ్వామూలంచ దంతాశ్చ నాసికోష్ఠౌచ తాలుచ॥" అను పాణిని శిక్షావచనమువలన స్పష్టమగుచున్నది. పైస్థానములలో నొకస్థానమందుఁగాని రెండుస్థానములందుఁ గాని వాయుసంయోగమువలన వర్ణోత్పత్తి యగును. "ఏకారైకారౌకారౌకారములు, జ, ఝ, ణ, న, మ, లు వకారము" అను నీవర్ణములు ద్విస్థానకములు,

మిగిలినవి యేకస్థానకములు. వర్ణముల నుచ్చరించునపుడు జిహ్వాగ్రోపాగ్రమధ్య మూలాదులు తత్తత్ స్థానములను స్పృశించును. ఆస్పర్శణము "గాఢస్పర్శము, మధ్యస్పర్శము, అల్పస్పర్శము" అని మూఁడువిధములై యున్నది. ఈస్పర్శమును గలుగఁజేయు ప్రయత్నములు స్పృష్టము (గాఢస్పర్శజనకము) ఈషత్ స్పృష్టము (మధ్యస్పర్శజనకము) ఈషద్వివృతము (అల్పస్పర్శజనకము)" అని మూఁడువిధములై యున్నవి. వీని నాభ్యంతరప్రయత్నము లందురు. ఈమూఁడుప్రయత్నములు వ్యంజనములకు నిమిత్తములు. అచ్చు లుచ్చరింపఁబడునపు డీమూఁడువిధములైనస్పర్శములు నుండవు. కావున నవి యస్పృష్టములు లేక వివృతములు నని వ్యవహరింపఁబడుచున్నవి. వీని కనుకూల మగునాభ్యంతరప్రయత్నముకూడ వివృత మనఁబడును. ఈస్పర్శాదులు ముఖాంతర్గతము లగుతత్తత్ స్థానములయం దుత్పన్నములగుటచేత నీప్రయత్నములకు నాభ్యంతరములని నామము వచ్చినది. హల్లులు స్పర్శములనియు నంతస్థములనియు నూష్మములనియు మూఁడుతెరగతులుగా నున్నవి. అందు స్పర్శములు "కవర్గము, చవర్గము, టవర్గము, తవర్గము, పవర్గము" అని యైదువిధములుగా విభజింపఁబడినవి. ఇందు హల్లులవిభాగమాభ్యంతరప్రయత్నమునుబట్టియు, స్పర్శములలోని యవాంతరవిభాగము స్థానసంబంధమును బట్టియు నేర్పడినది. ఇట్టి స్థానసంబంధ మితరవర్ణములకు నయితమున్నను వానికి స్పృష్టప్రయత్నము లేనందున నీవర్గవిభాగములోనికి రావు. ఏకస్థానము నేకప్రయత్నమును గలవర్ణము లొకవర్గములోఁ జేరును. యకారము చవర్గీయములతో స్థానైక్యము కలదైనను బ్రయత్నము వేఱగుటచేతఁ జవర్గములోఁ జేరదు. ఇటులే కకారము ప్రయత్నైక్యముకలదైనను స్థానభేదముండుటచేతఁ జవర్గములోఁ జేరదు. ఈవర్గములయొక్క క్రమము తత్తద్వర్గీయస్థానములయొక్క స్థితిక్రమమునుబట్టి యేర్పడినది. ముఖమునందు "జిహ్వామూలము, తాలువు, మూర్ధము, దంతములు, ఓష్ఠములు" వరుసగా నున్నందున నాయాస్థానములయం దుత్పన్నములగువర్గములకుఁ గ్రమము మాతృకాపాఠమున నేర్పడినది. మాతృకాపాఠమున నీవర్గములతరువాత నంతస్థములు పఠింపఁబడుచున్నవి, స్పర్శములకును (కకారాది మకారాంతవర్ణములకును) నూష్మములకు (శషసాదులకును) మధ్యమునఁ బఠింపఁబడుటచేత వీని కంతస్థములనుపేరు వచ్చినది. ఇవి మధ్యస్పర్శము లేక యీషత్ స్పర్శము కలవగుటచేత వీనికి మధ్యమునఁ బాఠము వచ్చినది. తరువాత నల్పస్పర్శములు లేక యీషద్వివృతము లగునూష్మముల

పాఠము చేయఁబడినది. ఈరీతిని స్పర్శాంతస్థోష్మములక్రమ మేర్పడినది. యరల వలకు నంతస్థములని నామము కలుగుటకుఁ బాశ్చాత్యపండితులు వేఱొకకారణ మును జెప్పెదరు. "ఇ, ఉ, ఋ, ఌ" ఈయచ్చులు "య వ ర ల" లుగ మార్పు నొందుటయు యవరలలు "ఇ, ఉ, ఋ, ఌ"గ మార్పు నొందుటయు సంస్కృతభాషయం దగపడుచున్నందున "యరలవ"లు అచ్‌ధర్మములు హల్‌ధర్మములుఁ గలవి, అట్లు రెంటికిని మధ్యస్థము లగుటచే నంతస్థము లనిపేరు వచ్చినదని వారు చెప్పెదరు. ఈకారణమునుబట్టి వీని కీనామము వచ్చినచోఁ దుల్యన్యాయమున "ఇ, ఉ, ఋ, ఌ" వర్ణములకుఁ గూడ నీనామము రావలసియున్నదని సందేహము పొడముచున్నది. వర్గములలోనివర్ణముల కెట్లీక్రమము వచ్చెనందు రేని వినుండు. ప్రతివర్గములోను నీషచ్ఛ్వాసములు మొదటను దరువాత శ్వాసము లును దరువాత నీషన్నాదజములును దరువాత నాదజములును నీవిధమున వర్గ ప్రథమద్వితీయతృతీయచతుర్థముల క్రమ మేర్పడినది. వర్గపంచమమం దాను నాసిక్య మనునొకధర్మము నాదజము లగు వీని కుండుటచేత వీనికీ చుదిని బాత మేర్పడినది. అంతస్థములలో నన్నియు నాదజము లగుటచేత స్థానక్రమముచే తనే క్రమమేర్పడినది. ఊష్మములలోఁ (జిహ్వామూలీయ శషసోపధ్మానీయ హకార ములలో) గూడ నాదజ మగుహకారమునకుఁ జరమపాఠము గలిగెను. మిగిలిన శ్వాసజములలో స్థానక్రమముచేతఁ గ్రమ మేర్పడినది. ఈవిధమున మాతృకాపాఠమున హల్లులకుఁ గ్రమము సహేతుకమై యున్నది. పైనిఁ జెప్పినవిధమున శ్వాసజములకుఁ బ్రథమపాఠము న్నాదజముల కనంతరపాఠమును సిద్ధమైయుండఁగా నాదజము లగునచ్చులకుఁ బ్రథమపాఠ మెట్లు ఘటించు నని శంకింపఁగూడదు. అచ్చులు స్వతంత్రములు. హల్లు లస్వతంత్రములు. హల్సాహాయ్యములేక యచ్చుల నుచ్చరింపవచ్చును. అచ్ సాహాయ్యములేక హల్లుల నుచ్చరింపశక్యము కాదు. "నపున రన్తరేణాచం వ్యంజన స్యోచ్చారణ మపి భవతి" అను భాష్యఫక్కికచేత నీయంశము స్పష్టపఱుపఁబడినది. మఱియు "అనుస్వారో వ్యంజనం చాక్షరాంగమ్" అను ఋక్ప్రాతిశాఖ్యవలన హల్లు లంగము లనియు నచ్చు లంగు లనియుఁ బ్రతిపాదింపఁబడినందునఁ బ్రధానము లగునచ్చులకుఁ బ్రథమ పాఠము యుక్తము. అందు—అకారేకారోకారములకు స్థానక్రమమునుబట్టి క్రమము వచ్చినది. ఋకారఌకారస్థానము లికారోకారస్థానముల మధ్యమున నున్నను నీరెండువర్ణములు రేఫలకారరూపావయవఘటితములగుటచే ననన్తర

పాఠ మాదరింపఁబడెను. ఆరెంటిలోను స్థానక్రమముచేతనే క్రమ మేర్పడినది, ఏకారాదులు నాలుగు సంధ్యక్షరములు కావునఁ జరమపాఠ మాదృతమైనది. వానిలోని క్రమము గూడ స్థానక్రమమునుబట్టి వచ్చినదే. ఋకారఌకారములు హల్సంపృక్తములు, ఏ, ఐ, ఓ, ఔలు అచ్ సంపృక్తములు, గావున వీనికిఁ బ్రథమపాఠము యుక్త మని శంకింపఁగూడదు. అచ్చుల కాభ్యంతరప్రయత్నము వివృతము. ఈవివృతము మూఁడువిధములు. వివృతము, వివృతతరము, వివృతతమము. అందు "అ, ఇ, ఉ, ఋ, ఌ" వర్ణములు వివృతము లగుటచే వీనికి సహపాఠ మాదరింపఁబడినది. పిమ్మట, నకారేకారజన్యములు, తరువాత నకారోకారజన్యములు, ఈవిధమున నచ్చులలోఁ గ్రమ మేర్పడినది. అనుస్వారవిసర్గము లచ్ధర్మమును హల్ధర్మమును గలవగుటచే నచ్చులకును హల్లులకును మధ్యమునఁ బాఠము వచ్చినది. జిహ్వామూలీయోపధ్మానీయములు కూడ నిట్టివే యని మఱి కొందఱు చెప్పెదరు. ఈవిధమునఁ బాఠక్రమ మేర్పడినది. ఇఁక నేయే వర్ణమున కెయ్యది స్థానమో యెద్ది యాభ్యంతరప్రయత్నమో యని నిరూపింపఁబడును.

కవర్గము—దీనికి జిహ్వామూలము స్థానము "అకుహవిసర్జనీయానాం కంఠః" అనుసిద్ధాన్తకౌముదీగ్రంథమునుబట్టి దీనికిఁ గంఠము స్థానమైనటులు గాన్పించునుగాని యచటఁ (కవర్గము విషయము) గంఠ మనఁగా; జిహ్వామూలమనియే యర్థము" ఇట్లు శేఖరమునందు నిరూపింపఁబడినది. "జిహ్వామూలేతు కుః ప్రోక్తః" అనుశిక్షావచనమును "ఋకారలౄకారావథషష్ఠఊష్మాజిహ్వామూలీయాః ప్రథమశ్చవర్గః" అనుఋక్ప్రాతిశాఖ్యమును నిందులకుఁ బ్రమాణములు. తైత్తిరీయప్రాతిశాఖ్యమున దీనికి హనుమూలము స్థానమనియు జిహ్వామూలము కరణమనియు "హనుమూలే జిహ్వామూలేన కవర్గేస్పర్శయతి" యనుసూత్రమునఁజెప్పఁబడినది. ఇతరులు స్థానమని చెప్పినజిహ్వామూలమును వీరు కరణమనిరి. ఇది విశేషభేదము కాదు. పాశ్చాత్త్యులు జిహ్వామూలమ్మృదుతాలు సంయోగమువలన నీవర్గ ముత్పన్న మగు నని చెప్పిరి, ఈమృదుతాలువునే హనుమూల మనినచోఁ బాశ్చాత్త్యులయభిప్రాయమునకుఁ బ్రాతిశాఖ్యములకును భేద మేమియు నుండదు. ఈవర్గాగముల నుచ్చరించునపుడు స్థానకరణములకు దృఢస్పర్శము కలుగునుగావున నేతద్వర్గాగములకు స్పృష్టప్రయత్నము. ఈయంశ మన్నివర్గములగుఱించియు నెఱుంగునది. ఇందుఁ జరమవర్ణ ముచ్చరించునపుడు నాసికాద్వారముకూడ వివృ

తమగును. అందువలన దీనికి నాసికకూడ స్థానమైనది. ఈవర్ణముునకు నాసిక కూడ స్థాన మని "నాసిక్యా నాసిక్యయమానుస్వారాః" అనుసూత్రము బోధించుచున్నది. ఈయంశ మన్నివర్గములలోని చరమవర్ణముల గుఱించియు నెఱుంగునది.

చవర్గము—ఈవర్గము నుచ్చరించునపుడు జిహ్వామధ్యము తాలువును స్పృశింపవలెను. అనఁగాఁ దాలువు స్థానము. జిహ్వామధ్యము కరణము. "తాలౌజిహ్వామధ్యేన చవర్గే" అనుసూత్ర మీయంశమును బోధించుచున్నది. కఠినతాలు జిహ్వామధ్యసంయోగమువలనఁ జవర్గ ముత్పన్న మగు నని పాశ్చాత్యపండితులు చెప్పిరి. ఈకఠినతాలువునే మనవారు తాలు వని రనినచో నభిప్రాయభేద మేమియు నుండదు.

టవర్గము—ఈవర్గ ముచ్చరించునపుడు జిహ్వాగ్రమును మడంచి యధోభాగముచే మూర్ధము ను (అనఁగా ముఖవివరోపరిభాగమును), స్పృశింపవలయును. కావున మూర్ధము స్థానము, ప్రతివేష్టితజిహ్వాగ్రము కరణము. అని తాత్పర్యము. జిహ్వాగ్రేణ ప్రతివేష్ట్య మూర్ధని టవర్గే" అనుసూత్ర మీయంశమును జెప్పుచున్నది. పాశ్చాత్యపండితులు గోళాకార మగుకఠినతాలువుతో జిహ్వాగ్రమునకు సంయోగము కలుగునపు డీవర్గ ముచ్చరింపఁబడు నని చెప్పిరి. మనవారు మూర్ధ మని చెప్పినస్థానమునే వీరు గోళాకార కఠినతాలు వనిరి, కావున నభిప్రాయభేదము లేదు. మనవారు జిహ్వాగ్రప్రతివేష్టనము నధికముగాఁ జెప్పిరి. ఇది యనుభవసిద్ధము.

తవర్గము—ఈవర్గము జిహ్వాగ్రముచేత దంతమూలములు స్పృశింపఁబడునపుడు పుట్టును. అనఁగా దంతమూలములు స్థానము. జిహ్వాగ్రము కరణము, పాశ్చాత్యులుకూడ నిటులే చెప్పిరి.

పవర్గము—ఈవర్గ మోష్ఠద్వయసంయోగమువలనఁ బుట్టును. ముందటివానిలో "యత్రస్పర్శనం తత్ స్థానం, యేన స్పర్శయతి తత్కరణం" అను సూత్రములచే స్థానకరణవిభాగము చేయవచ్చును. ఇచట నటులు చేయుట కవకాశము లేదు. అయినను బూర్వవర్గములస్థానకరణముల కుత్తరాధరభావమున్నందునఁ దత్సామ్యమునుబట్టి యుత్తరోష్ఠము స్థాన మనియు నధరోష్ఠము కరణ మనియుఁ దెలియఁదగినది. ఈయంశము ప్రాతిశాఖ్యవ్యాఖ్యయందు స్పష్టముగ నున్నది. పాశ్చాత్యపండితుల కిచటఁగూడ నభిప్రాయభేదము లేదు.

పాశ్చాత్యపండితులు స్థానకరణసంయోగానంతరమందు విభాగ ముండవలయునని చెప్పిరి. మనవారు చెప్పలేదు. ఇచ్చట నుచ్చారయితల యనుభవమె ప్రమాణము. సజాతీయవర్ణసంయుక్తత త్తద్వర్ణోచ్చారణస్థలమునందుఁ బూర్వ వర్ణోచ్చారణమున విభాగ మున్నటులు గాన్పింపదు. కావున విభాగమునకు నిమిత్తము సందిగ్ధముగ నున్నది.

అంతస్థములు—యకార ముచ్చరింపఁబడునపుడు జిహ్వామధ్యాంతములతోఁ దాలువును స్పృశింపవలయును. "తాలౌ జిహ్వామధ్యాంతాభ్యాం యకారే" అనుసూత్రముచే నీయంశము చెప్పఁబడెను. చవర్గమునకు జిహ్వామధ్య స్పర్శ ముండును. యకారమునకు జిహ్వాంతస్పర్శముకూడ నుండును. మఱియు, చవర్గము నుచ్చరించునపుడు స్థానకరణములకు దృఢస్పర్శ ముండును. యకారోచ్చారణమున మధ్యస్పర్శ ముండును. పాశ్చాత్యులు జిహ్వాంతము కరణ మని యంగీకరింపరు. మఱియు స్థానకరణములకు స్పర్శముండదు. సాన్నిధ్యమాత్రము కలుగునని చెప్పుదురు. చవర్గమునుబోలి దృఢస్పర్శము లేకున్నను శిథిలస్పర్శ ముండుట యనుభవసిద్ధ మగుచున్నది. రేఫ ముచ్చరింపఁబడునపుడు జిహ్వాగ్ర మధ్యభాగము, దంతమూలముల యూర్ధ్వభాగమును స్పృశింపవలెను. ఈ భాగమునకు "బర్స్వము" అని పేరు. ఇదియె ఋకారమునకుస్థానము. ఈవిషయము "రేఫేజిహ్వాగ్రమధ్యేన ప్రత్యగ్దంతమూలేభ్యః" అనుసూత్రముచేఁ దెలుపఁబడెను. పాశ్చాత్యులు టవర్గస్థానమే దీనికి స్థానమనిరిగాని టవర్గస్థానమునకును, తవర్గస్థానమునకును మధ్యభాగము దీనికి స్థాన మని మనవారి యభిప్రాయము. ఇదియె యనుభవమునకు సరిపోవుచున్నది. దీనికి మధ్యస్పర్శమె యుండును. జిహ్వాగ్రమునకుఁ గంపము కలుగునని పాశ్చాత్యులయభిప్రాయము.

లకారము—ఇది దంతమూలములయందు జిహ్వాగ్రమధ్యభాగపు స్పర్శముకలిగినపుడు పుట్టును. తవర్గరేఫలస్థానములకుమధ్యభాగము దీనికి స్థానము. "దంతమూలేషుచ లకారే" అనుసూత్రముచేత నీయంశము దెలుపఁబడినది. తవర్గమునకుఁ గలుగుస్పర్శముకంటె దీనియందు స్పర్శ మల్పము కావుననే దీని నీషత్స్పృష్ట మనిచెప్పి యంతస్థములలో మనవారు పరిగణించిరి. పాశ్చాత్యపండితులు తవర్గస్థానమే దీనికిని స్థానమనిరి. మఱియు నిచట దృఢస్పర్శమే కలుగు ననిరి. చవర్గయకారశకారములకు స్థాన మొకటియైనను స్పర్శమును గుఱించి దృఢమధ్యాల్పత్వతారతమ్య మెటు లున్నదో యటులే తవర్గలకార

సకారములయెడలఁ గూడఁ దారతమ్య మనుభవసిద్ధము. కావున లకారవిషయ మగుసర్వము మధ్యస్పృష్టమని చెప్పవలసియున్నది. ఈయంశము ననుభవముచేత నిరూపింతురుగాక.

వకారము—ఇది దంతములచేత నధరోష్ఠము స్పృశింపఁబడునపు డుద్భ వించును. ఊష్మములు—జిహ్వామూలీయశకారషకారసకారోపధ్మానీయములు క్రమముగ కవర్గాది స్థానజములు. వీనిలో స్పర్శ మత్యల్పముగ నుండును. కావున వీని నీషద్వివృతము లనిరి. వీనిస్థానములను “స్పర్శస్థానేషు ఊష్మాణ అనుపూర్వ్యేణ” అను సూత్రము బోధించినది.

హకారము—ఇయ్యది కంఠస్థానజన్యము, ఉరస్థానజన్యముకూడ నగును. ఈయంశము “హకారం పంచమైర్యుక్త మంతస్థాభిశ్చ సంయుతం। ఉరస్యం తం విజానీయాత్ కంఠ్య మాహు రసంయుతం” అనుశిక్షావచనమువలన స్పష్ట మగును. మఱియు హకారమున కేయచ్చుపరంబుగ నుండునో యాయచ్చు యొక్క మొదటిభాగమున కేదిస్థానమో యదియె హకారమునకు స్థాన మని కొందఱయభిప్రాయము. ఈయభిప్రాయముచొప్పున నెచ్చట నెద్ది స్థానమో యచ్చులస్థాననిరూపణమువలనఁ దెలియును. ఈయూష్మముల నుచ్చరించునపుడు కరణము లగుజిహ్వాదులమధ్యభాగము వివృతముగ నుండునుగావున నివి యీష ద్వివృతము లనఁబడుచున్నవి. విసర్జనీయమునకుఁ గంఠము స్థానమని కొందఱును బూర్వాచ్చున కెద్దిస్థానమో యదియె స్థాన మని మఱికొందఱును జెప్పెదరు. ఈయభిప్రాయమె “అయోగవాహా విజ్ఞేయా ఆశ్రయస్థానభాగినః” అనుశిక్షా వచనముచేఁ జూపఁబడినది.

అనుస్వారమునకు నాసిక స్థానము. “అనుస్వారోత్తమా అనునాసికాః” అనుసూత్ర మీయంశమును దెలుపును.

## అచ్చులు.

ఇందకారేకారోకారము లసంకీర్ణములు. ఋకారౡకారములు రేఫల కారసంపృక్తములు. ‘ఏ, ఐ’ అనునీరెండును ‘అకారేకారసంధినిష్పన్నములు. “ఓ, ఔ” ఈరెండును అకారోకారసంధినిష్పన్నములు. కావున నీనాల్గింటికి సంధ్యక్షరము లని పేరు. “ఐ, ఔ” ఈరెండక్షరములలోను బూర్వోత్తరభాగ ములు వేఱువేఱుగ వినిపించుచున్నవి. కావున నివి సంధ్యక్షరము లనఁదగినవి. “ఏ, ఓ” ఈరెండక్షరములలో నటులు భాగము లున్నటు లగపడదు. కావున

నివి సంధ్యక్షరములు కావు. అకారేకారోకారములఁ బోలి యసంకీర్ణాక్షరములె యని పాశ్చాత్త్యులు చెప్పెదరు. "ఏ, ఓ, వర్ణములలోనుండెడి "అకారభాగము" సంవృతము "ఐ, ఔ" వర్ణములలోని అకారభాగము వివృతము. అందువలన "ఏ, ఐ, ఓ, ఔ" అనువర్ణముల యుచ్చారణములో భేదము కలిగెను, గాని "ఏ, ఓ" వర్ణములలో అకారభాగము లేదనరాదు. ఏకారమున కచ్చుపరంబగు నపుడు "అయ్" అనువికారము వచ్చుచున్నది. ఇందు "ఏకారములో" నుండెడి అకారభాగమునుబట్టి అకారమును ఇకారభాగమునుబట్టి "య"కారమును జేరి "అయ్" అని రూపము చేరినది. ఇటులే ఓకారమునకు "అవ్" అని వికారము వచ్చుచున్నది. ఇచటఁ గూడ "అ, ఉ" అను వర్ణభాగములంబట్టియే క్రమముగ అవ్ అను వికారము కలిగినది. ఇట్టివికారమున కనురూపమైన ప్రకృతి వర్ణద్వయఘటితమయియె యుండవలయును. మఱియు వేదమునందుఁ గొన్నిచోట్ల "అగ్నే" అనుదానికి బదులుగా అగ్న 3 ఇ అనియు "పటో" అనుదానికి బదులుగా "పట 3 ఉ" అనియు "అగ్నే ఆశా" అనుచోట సంధిలో "అగ్నా 3 యాశా" యనియు "పటోఉదకం" అనుదానికి బదులుగా "పటా 3 వుదకం" అనియుఁ బ్రయోగములు గాన్పించుచున్నవి. ఈప్రయోగములలో "ఏ, ఓ" వర్ణములలోని ఇకారోకారములు తద్రూపముగాను యకారవకారరూపముగను విడఁదీయఁబడి అకారభాగ మధికకాలముగ మార్పు నొందినటులు స్పష్టమగుచున్నది. దీనినిబట్టిచూడ నివియు సంధ్యక్షరములనుట యుక్తమని తోఁచుచున్నది. శుక్లయజుఃప్రాతిశాఖ్యమునందు "ఏకారము" ఇకారసమానస్థానక మనియు "ఓకారము" ఉకారసమానస్థానకమనియుఁ జెప్పఁబడెను. ఐకారౌకారములలో మొదటి యర్ధమాత్ర కంఠస్థానక మనియు మిగిలినభాగములు తాలోష్ఠస్థానికము లనియు దానినిబట్టి విశద మగుచున్నది. దీనినిబట్టి "ఐ, ఔ" వర్ణములలో భాగము లున్నటులును "ఏ, ఓ" వర్ణములలో లేనట్లును దోఁచునుగాని ఏ, ఓ వర్ణములలోనిభాగము లుత్తరభాగోపమర్దముచేత స్ఫుటముగ శ్రుతిగోచరము కాలేదని చెప్పుటయె సమంజసము. పాణినీయశిక్షలో "ఏ, ఓ" వర్ణములకుఁగూడ "ఏ ఐ తుకంఠతాలవ్యా వో ఔ కంఠోష్ఠజౌస్మృతౌ" అను కారికచేఁ గంఠతాలు కంఠోష్ఠస్థానములె బోధింపఁబడినవి. వీనికిం గంఠస్థానమకారభాగము ననుసరించి వచ్చినది యని తెలియునది. మఱియు "అకారార్ధమైకారౌకారయోరాదిః" "ఇకారోద్యర్ధః పూర్వస్య శేషః" "ఉకార స్తూత్త

రస్య" అనుసూత్రములచేత నైకారౌకారములకు విభాగము చెప్పఁబడుటచేత నైకా
రౌకారములవిషయమై యీభేదము లేనటు లగపడును. అయినను "యద్య
ప్యైకారాదీనాం చతుర్ణాం సంధ్యక్షరాణా మేవం ద్విస్వరాత్మకత్వం సమా
నం। తథాపి ఏదోతోః ప్రశ్లిష్టావయవత్వా త్స్విరికారాన్తర మేవోక్తం" అని
వైదికాభరణమునందు సమాధాన మీయఁబడినది. దీనినిబట్టిచూడఁ "ఏ. ఓ"
వర్ణములు ప్రశ్లిష్టావయవములు "ఐ. ఔ" అనువర్ణములు విశ్లిష్టావయవములు
ననునిదియె భేదముగాని వేఱుభేదము లేదని స్పష్ట మగుచున్నది. పై యంశము
లనుబట్టి వీనికి సంధ్యక్షరత్వము యుక్తమో యయుక్తమో విద్వాంసులు నిరూ
పించెదరుగాక.

అకారము:—ఇది హ్రస్వము, దీర్ఘము, ప్లుతము, అని కాలభేదములచేత
మూఁడువిధములు. ఈమూఁడింటికిఁ గంఠము స్థానము. హనువులు-అనఁగా సృక్వి
లు స్థానమని ప్రాతిశాఖ్యయందుఁ జెప్పఁబడినది. ఓష్ఠములు కరణములు. అం దకార
ముచ్చరింపఁబడునపుడు స్థానకరణములు సంవృతములగును. ఆకారాను లుచ్చరింపఁ
బడునపుడు వివృతములగును, ఉత్తరదేశమునందుఁ దప్ప మిగిలినదేశములం దకా
రము వివృతముగానే యుచ్చరింపఁబడుచున్నది. ఇకారము పూర్వోక్తవిధమున
మూఁడువిధములు. దీనికిఁ దాలువు స్థానమైయున్నది. జిహ్వామధ్యము కరణము.
వివృతము ప్రయత్నము. ఉకారము పై రీతిని మూఁడువిధములై యున్నది. దీనికుత్త
రోష్ఠము స్థానమైయున్నది. అధరోష్ఠము కరణము. వివృతము ప్రయత్నము. వీని
నుచ్చరించునపు డోష్ఠములు దీర్ఘములై వర్తులము లగును. ఋకారము—ఇదియు
మూఁడువిధములు. దీనికి మూర్ధము (అనఁగా-టవర్గస్థానమె)స్థానమని కొందఱియభి
ప్రాయము. జిహ్వామూలము స్థానమని మఱికొందఱయభిప్రాయము వర్త్స్యము,
(అనఁగాదంతపంక్తికూర్ధ్వభాగమందున్న రేఫకు స్థానభూతమైనయున్నతప్రదేశము)
ఋకారమునకు స్థానమని మఱికొందఱు చెప్పుదురు. ఈమూఁడంశములును వేఱు
వేఱు ప్రాతిశాఖ్యలలోఁ జెప్పఁబడియున్నవి. ఆయాశాఖలయందలి యుచ్చారణ
భేదముచేత నీమతభేదము కలిగినటులు దోఁచుచున్నది. ప్రకృతకాలమందు మూఁ
డవమతమె యనుభవమునకు సరిపడియున్నది. వివృతము ప్రయత్నము. ౡకారము-
దీనికి దంతమూలములు స్థానమని కొందఱును జిహ్వామూలమని మఱికొందఱును
బర్త్స్యములు స్థానమని మఱికొందఱును జెప్పుదురు. ఇచట మూఁడవమతమె యను
భవసిద్ధము. వివృతము ప్రయత్నము. ఏకారము—ఇది దీర్ఘమనియుఁ బ్లుతమనియు

రెండువిధములు. కొన్నిశాఖలలో హ్రస్వమును గలదు. "సుజాతే" అనుటకు బదులుగా "సుజాతె" అని హ్రస్వము నుచ్చరింతురు. తెనుఁగులో హ్రస్వము సుప్రసిద్ధము. దీనికిఁ దాలువు స్థానమని కొందఱును గంఠతాలువులు రెండును స్థానములని మఱికొందఱును హనువులు తాలువులును స్థానములని మఱికొందఱును జెప్పెదరు. ఓష్ఠములు జిహ్వామధ్యమును గరణములు. ఓకారము నుచ్చరించునప్పటి కంటె నోష్ఠములు విప్రకృష్టములుగా నుండును. జిహ్వామధ్యాంతముల చేత "నుత్తర జంభ్యములు" (అనఁగా హనుమూలప్రాంత దేశములు) స్పృశింపఁబడును. దీనికి వివృతతరప్రయత్నము. ఐకారము—ఇది యకారేకారములస్థానములు కలదై యున్నది. దీనికి వివృతతమప్రయత్నము. దీనికి హ్రస్వము లేదు. ఓకారము—ఇది కంఠోష్ఠస్థానము. తైత్తిరీయప్రాతిశాఖ్యమునఁ గంఠస్థానకము లన్నియుఁ గంఠసన్నిహితహనుభాగస్థానకములుగాఁ జేర్కొనఁబడినవి. దీనినుచ్చరించునపుడు హనువులు మిగులవ్యస్తములు కావు. ఓష్ఠము లేకారము నుచ్చరించునప్పటికంటె సన్నికృష్టములుగా నుండును. ఇదివివృతతరప్రయత్నముకలది. ఔకారము—కంఠోష్ఠస్థానకము. ఈస్థానము లకారోకారసమభివ్యాహారమువలనఁ గలిగినవి. దీనికి వివృతతమము ప్రయత్నము.

ఈవిధముగ వర్ణములకు స్థానములు కరణములు ప్రయత్నములు సంగ్రహముగఁ జూపఁబడినవి. వీనినుచ్చరించునపుడు ముఖాద్యవయవములలో ననేక వ్యాపారములు కలుగు నని ప్రాతిశాఖ్యలవలన శిక్షలవలనఁ గూడ స్పష్టమగును. గ్రంథవిస్తరభయముచేత నాయవాంతర భేదములు విడిచితిని. తెనుఁగుభాషలో నీవర్ణములలోఁ జేరనివి దంత్యచజలునర్ధానుస్వారమునుగలవు. ఈచజలకు దంతములు స్థానమని యాంధ్రవైయాకరణులయభిప్రాయము. అందు "చకారము" శ్వాసజము,జకారము నాదజము. వీని కాంధ్రవైయాకరణు లంగీకరించిన కారణసామగ్రినిబట్టిచూడ "తదల" కుండెడిసామగ్రిని బోలినసామగ్రి యున్నందున "తద" లనఁదగి యుండును గాని "చజ" లనఁదగి యుండవు. వ్యవహారమున "చజ" లనియె ప్రసిద్ధము. ఉచ్చారణమునఁగూడ "చజ"లకు సన్నికృష్టములై వినఁబడునుగాని తదలకు సన్నికృష్టములై వినఁబడలేదు. కావున వీని కీదంత్యవ్యవహార మెటులు వచ్చె నని యాలోచింపవలసియున్నది. చజ లని వ్యవహరించుటచేతఁ దాలవ్యశజల కుండుసామగ్రి యంతయు దీని కున్న దనియె నిశ్చయింపవచ్చును. ఆసామగ్రి యంతయు నుండఁగా దంతసన్నికృష్ట దేశమునందు జిహ్వా

పాంత్యస్పర్శము కలుగునపు డీవర్ణము లుచ్చరింపఁబడును. ఇట్టులు సామగ్రీసాంక ర్యమువలన నూతనవర్ణములు పుట్టవచ్చును. అట్టివి కొన్ని ద్రవిడభాషలలో నగ పడుచున్నవి. కాలక్రమమున నీచజల నుచ్చరించుటలోఁ గొంతమార్పు కలిగి తాలుస్థానమునకు దూరమై దంతస్థానమునకు సన్నికృష్ట మాయెను. ఈసన్ని కర్షమునుబట్టి దంత్యచకారమునకుఁ జిహ్నముగాఁ దకారసకారసంయోగచిహ్న మును వ్రాయ మొదలిడిరి. ఈయంశము ప్రాచీనలిపిమార్గమును బాగుగఁ బరిశీ లించినవారందఱును గమనించియే యుందురు. ఈవర్ణముల కిట్టిమా ర్పెట్టులు గల్గె నని యూహింపవలసియున్నది. ఓష్ఠవ్యాపార మెక్కుడుగాఁ గలవర్ణములు అనఁగా "ఉ ఊ ఒ ఓ" అనువర్ణములు తాలవ్యము లగుచజలకుఁ బరమగు నపుడు పరమందున్నవర్ణములస్థానమును నీతాలుస్థానమును విప్రకృష్టము లగుట చేత నతిసన్నిహితముగా నుచ్చరించునపుడు రెంటికి మధ్యనుండుస్థానసంబంధము చేత నివి కొంచెముగా మార్పునొంది యుండును. అకారము నుచ్చరించునపుడు గూడ నోష్ఠవ్యాపార మావశ్యక మని తైత్తిరీయప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియు న్నందున నచ్చటఁగూడ నోష్ఠ్యసంబంధమే వీనిని దంత్యములుగాఁ జేయుచున్న దని యూహింపవచ్చును. "ఇ, ఈ, ఏ, ఐ"లు తాలవ్యములు కావున నవి పర మగునపుడు తాలవ్యచజలను మార్పును బొందింపఁజాలవు. కావున నచట నెపు డును దంత్యము లుండవు. అనుస్వారము మాత్రాకాలము కల దని ప్రాతిశా ఖ్యల యభిప్రాయము. ఆంధ్రభాషలో దానియుచ్చారణకాలము తగ్గుటచేత నీ యర్ధానుస్వార మేర్పడినది. కాలక్రమమున మిగుల నవిలంబోచ్చారణము వాడు కలోనికి రాఁగాఁ దదుచ్చారణకాల మంతరించి దానియందుండెడి యానునాసి క్యము పూర్వాచ్చునందు సంక్రమించినది. ప్రకృతకాలమున నర్ధానుస్వార ముండుచోట 'బూర్వా చ్చనునాసికగా నుచ్చరింపఁబడుచున్నది. మఱియు శకటరేఫ మొకటి యాంధ్రభాషయందుఁ గలదు. రేఫ ముచ్చరించునపుడు జిహ్వాగ్రమునందుఁ గంపము కలుగునని యీవఱకుఁ జెప్పియుంటిని. రేఫద్విత్వ మున్నచోట నాకంప మధికమగుటచే నచ్చటిరేఫ మలఘుత్వము నొందును. ఆయుచ్చారణాభ్యాసమునుబట్టి యెచ్చట రేఫము నుచ్చరించుతఱి జిహ్వాగ్రకంప మధికముగ నుండునో యచట నలఘుత్వము కలుగుచుండును. ఈవిధమున నతిరిక్తవర్ణము లుత్పన్నమైన ట్లూహింపవచ్చును. ఇఁక నీసామగ్రీసాన్నిధ్యబల మున వచ్చినమార్పులను గొన్నిటిని జూపి నా వ్యాసమును ముగించెదను. స్పర్శ

ములలో నాదజములకు శ్వాసజములు పరమగునపుడు పరవర్ణబలమున నీనాదజములు శ్వాసజములుగ మాఱును. ఆమార్పునొందుటలో మహాప్రాణ మైనవర్ణము మఱొకమహాప్రాణముతోఁ గలసియుండదు. కావున నల్పప్రాణ మగుశ్వాసజముగ మాఱును. ఇట్టి మార్పునె "ఖరిచ" అనుసూత్రముచేఁ బాణినియు నిరూపించెను. ఇటులే శ్వాసజములకు నాదజములు పర మగునపుడు పరవర్ణబలమువలన నీశ్వాసజము నాదజముగ మాఱును. అదియు నల్పప్రాణమై యుండును. ఈమార్పునె "ఝలాంజశ్ ఝశి" అనుసూత్రముచే నిరూపించెను. ఇట్టి వికారము కలిగినపుడు ప్రకృతియొక్క స్థానాదులబలమువలనఁ దత్తద్వర్గీయములే వికృతులుగా నుండును. ఉదాహరణము :—నాదజ మగుగకారమునకు శ్వాసజ మగువర్ణము పర మగునపుడు గకారమునకు స్థానమునుబట్టి సన్నికృష్ట మగుకకారము వచ్చును. కకారఖకారములకు నాదజము లగువర్ణములు పరమగునపుడు నాదజమగుగకారము వచ్చును. వీనిలో శ్వాసాదిబాహ్యప్రయత్నములకే మార్పుగాని స్థానాదులు మాఱవు. మఱియుఁ బదాన్తవర్గములకుఁ బంచమవర్ణము పరమగునపుడు పరమగు ననునాసికబలమునఁ బూర్వ మనునాసికముగ మాఱును. ఈమార్పు "యరోనునాసికేఽనునాసికో వా" అనుసూత్రముచే నిరూపింపఁబడినది. ఉదాహరణము :—"వాక్ + మయ = వాఙ్మయ" "ఏతద్ + మమ = ఏతన్మమ." వర్గములోని మొదటి నాలుగువర్ణములకు హకారము పర మగునపుడు పూర్వవర్ణపు స్థానబలమువలన హకారము తద్వర్గీయముగ మాఱును. ఈమార్పు స్థానాదులలోనేగాని బాహ్యప్రయత్నములలో లేదు. బాహ్యప్రయత్నములు వర్గచతుర్థములకు హకారమునకును సమానమగుటచేత వర్గచతుర్థముగ మాఱును. ఉదాహరణము :—"వాగ్ఘరిః, తద్ధితమ్" అను మొదలగునవి. అనుస్వారమునకు వర్గము పరమగునపుడు వర్గగముగ మాఱును. అపుడనుస్వారమునందలి యానునాసిక్యధర్మము సంక్రమించుటచేతఁ బంచమవర్ణముగ మాఱును. ఉదాహరణము :—"ఘటఙ్కరోతి, తండులమ్పచతి." అను మొదలగునవి. యవలలు పరమగునపు డనునాసిక యవలలుగ మాఱును. "సయ్యన్తా, యల్లోకమ్" అను మొదలగునవి యుదాహరణములు. తవర్గము తాలవ్యము లగుచవర్గములతో సంయుక్త మగునపుడు తాలవ్యముగ (నసఁగ, చవర్గముగ) మాఱును. ఇచ్చట స్థానమునకు మాత్రము మార్పు గలుగును. ఉదాహరణము :—తచ్చిత్, తజ్జానాతి, యాచ్ఞా.' ప్రకృతకాలమున "యాచ్న"

అని మార్పు లేకయే యుచ్చరింపఁబడుచున్నది. తవర్గమునకు టవర్గముతో సంయోగ ముండినపుడు టవర్గముగ మాఱును. ఉదాహరణము :—“తట్టీకా” మొదలగునవి. ఇందులకుఁ గరణభూత జిహ్వాకృతిసామ్యము ప్రయోజకము. కవర్గము, చవర్గమును బరస్పరము ప్రాయికముగ వికారము నొందును. ఇందు స్థానసన్నికర్షము నిమిత్తము. విసర్గము ప్రాయికముగ శ్వాసజము పర మగునపుడు తత్సమానోష్మముగమాఱును. జిహ్వామూలీయము శ్వాసజము పరమగునపుడు జిహ్వామూలీయముగను,తాలవ్యశ్వాసజములు పరమగునపుడు తాలవ్యోష్మమగు శకారముగను నిటులు మూర్ధన్యదంత్యోష్ఠ్యశ్వాసజములు పరములగునపుడు తత్తదూష్మముగను మాఱును ఉదాహరణము :—“రామః కరోతి, రామశ్చినోతి, రామష్టీకతే, రామస్తిష్ఠతి, రామఃపచతి, రామశ్చరణ్యాః, రామస్సుజనః” అను మొదలగువి. దీనికిఁ బరవర్ణబలమె ప్రయోజకము. ఇట్టి మార్పు లనేకములు న్నట్లు రుజువుచేయవచ్చును. అచ్చులలో రెండచ్చులను వ్యస్తముగ (నవ్యవహిత ముగ) నుచ్చరించుట కష్టము. అపు డాయచ్చులు రెండునుగాని లేక పూర్వా చ్చుగాని మార్పు నొందును. అట్టి మార్పు తత్తద్వర్ణసామగ్రి ననుసరించియె యుండును. అచ్ సంధ్యుదాహరణములను జూచిన నీయంశము వ్యక్త మగును. సంకీర్ణవర్ణములకు మార్పుకలిగినపు డావర్ణములకుఁ బృథక్కృతి కలుగును. ఈ మార్పు లన్నిటికిఁ దత్తద్వర్ణముల కారణసామగ్రీసన్నికర్షణమె నిమిత్తము గాని వేఱొకటి కానేరదు. వర్ణోత్పత్తిసామగ్రిని బాగుగఁ బరిశీలించినవా రీమార్పును బాగుగ గమనింపఁగలరు. ఇట్టి మార్పులను బట్టియె ప్రాకృతభాష లన్నియుఁ బుట్టినట్లు ప్రాకృతవ్యాకరణజ్ఞులకు గోచర మగును. తెలుఁగుభాషలోఁగూడ నిట్టిమార్పులు కలవు. నాదజ మగుద్రుతముయొక్క బలమున శ్వాసజము లగు పరుషములు నాదజము లగుసరళములుగా మాఱుచున్నవి.

రెండచ్చులు కలిపి యుచ్చరించుట కష్టమగుటచేత నచ్చులకు సంధి యేర్పడినది. తెలుఁగుభాషలో, ‘పరాచ్చు’నకే ప్రాబల్యము కలిగి పరరూపసంధియే తఱుచుగఁ గాన్పించుచున్నది. కొన్నిచోట్లఁ బూర్వరూపసంధికూడఁ గలదు గాని, యవి రెండుపదములుగ విభజింపఁబడక యొకపదముగనే రూఢి నొందినస్థలములై యున్నవి. అచటఁ బూర్వపదార్థము విధేయముగా భాసి ల్లును. విధేయము ప్రధాన మగుట సహజము. ప్రధానభూతార్థబోధక మగు పదమును, దృఢముగ నుచ్చరించుట సమంజస మగుటచేత, నందలిచరమాచ్చు

నకుఁ బ్రాబల్యము కలిగిన దని యూహింపవచ్చును. ఇటులనేకాచ్చుల నవ్యవహితముగ నుచ్చరించుతఱి, మీఁదఁ జెప్పినకష్టమును బరిహరించుటకై యొకయాగమ మేర్పడినది. ఆయాగమము నిరర్థకమగుటచేత, లఘుతరమైన హల్లుండుట యుక్తము. లఘుతరములు 'యవ'లు రెండు మాత్ర మున్నట్లు శాకటాయనుఁడు చెప్పియున్నాఁడు. కావున 'యకారవకారములె, యాగమములుగ నుండుట కర్హములు. వానిలో "పరవర్ణ" బలమునుబట్టి పరవర్ణాదిభాగసస్థానకము గాని, సన్నికృష్టస్థానకము గాని, యుండుట స్వభావము. ఇకారము పరమగు నవుడు సస్థానకయకార మాగమ మాయెను. అకారము పర మగునపు డకారస్థానభూతకంఠసన్నికృష్టతాల స్థానక మగుయకారమె యాగమ మాయెను. సంధ్యక్షరములలోఁగూడ నకారము పూర్వభాగ మగుటచేత నవియు నకారమునుబోలి యకారమునె యాగమముగ సంపాదించినవి. ఈయచ్చుల సాదృశ్యమునుబట్టి, 'ఉ'వర్ణము పరమగునపుడు గూడ, యకారమె యాగమమైనచోఁ బ్రక్రియాలాఘవము (వేఱగు నాగమము నంగీకరింపకపోవుట) సంభవించు నని యంతటను 'యకారమె' యాగమముగా నంగీకరింపఁబడినది. ఈప్రక్రియాలాఘవమును బాటింపకపోవుటచేత వాడుకలో 'మావూరు' మొదలగుస్థలములలో 'వ'కారమె యాగమమైనట్లు తోఁచుచున్నది. సంస్కృతప్రాకృతాంధ్రభాషలలో నిట్టిమార్పులు సహేతుకములని చాలవఱకు రుజువు చేయవచ్చును. గ్రంథవిస్తరభయమున విరమించితిని. ఈవ్యాసమునఁ గొన్నిదోషము లుండిన నుండవచ్చును. పండితులు వానిని బరికింపక గుణము లున్నవో వానినిమాత్రము గ్రహించి నన్ను మన్నింతురుగాక.

తాతా సుబ్బరాయశాస్త్రి.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీతరుణీసితవిలసన. జాతశివాహ్వానభక్తిసంపద్గురువి
ఖ్యాతనుతకీర్తిసితజీ, మూతసితాఖిలదిగంత ముష్మయశాంతా. 1

గీ. అకథకుఁడు శౌనకాదు లైనమహాము, నీంద్రులకుఁ బ్రియమున నిట్టులనియె
నట్లు భూమి విడిచి యరుగవలయు నింక, ననుచు మాటలాడునవసరమున. 2

క. తెలతెలవాఱుచువచ్చెం, బలపలనయ్యెం బయోదపథమునఁ దారల్
కలకలవింకలకోమల, కలకలములు చెలఁగెఁ గాళికావిపినమునన్. 3

సీ. సంభోగపరిభిన్నశబరసీమంతినీస్వేదవార్బిందువిచ్ఛేదకారి
విఘటమానాంభోజవిపినషండమధూళిపరిమళాసారసంపర్కసురభి
సమదకాంతారకాసరయూథసమ్మర్దసంభూతడిండీరశకలవాహి
లలితలుంగలవంగలవలీమతల్లికాలాస్యోపదేశలీలాగురుండు
యామినీశేషతుహినధారానుషంగ, జడిమభరమందచతురసంచారకారి
యల్లనల్లనఁబొలుపారునడపినదమఁ, గాల్యసంధ్యానుగంధుండు గంధవహుఁడు.

ఉ. క్షోణిరుహాగ్రభాగముల జోకలుగట్టి వనీశిఖావళ
శ్రేణులు తాండవంబు లొనరింపఁగ మంద్రగభీరభంగి శ
ర్వాణిగృహంబులోనిబలివైభవలీలకు మ్రోసెఁ గంచుని
స్సాణము మాటిమాటి కనుశబ్దములీనఁగ గోపురంబునన్. 5

శా. నిష్ఠానంపద నర్ఘ్యపాణు లగుచు న్విప్రు ల్ప్రశంసింప మం
జిష్ఠారాగము మండలంబున నధిష్ఠింప న్నిలింపాధిభూ
కాష్ఠామధ్యమునందుఁదోఁచెను శతాంగప్రష్ఠసర్పద్విషద్
జ్యేష్ఠుం డప్పుడు నిష్ఠురప్రసరబంహిష్ఠద్యుతిశ్రేష్ఠతన్. 6

వ. ఆదివసంబున. 7

ఉ. జాతరచేసె బ్రాహ్మణుఁడు చండికిఁ గమ్మనిపిండివంటతో
నేతులతోడ మజ్జికడ నిర్మలినాన్నముతో రసావళీ

చూతఫలాదితోడ వరసూపముతోఁ జిఱువాలతోడుతన్
గీతులతోడ నప్పుడకనిష్ఠతరం బగునిష్ఠ పెంపునన్. 8

వ. నాఁటిరాత్రి నిశాసమయంబునఁ గాలకంఠకంఠమూలకాకోలవిషమషీకళంక చ్ఛాయానముల్లాసంబు నుల్లసంబాధునిబిడాంధకారంబున నన్నెలవుగదలి చండాలియుం దానును సుకుమారుండు దుర్గమాటవీవిషయంబు హూణదేశంబు గడచి ప్రతిదినప్రయాణంబుల నెడనెడం బక్కణ...... 9

గీ. గ్రామఘోషంబు పురివాడబ్రహ్మలోక
ము..... మమొగనాల మోక్షమునకు
దూషితం బయ్యె సంసర్గదోషకలన
సంటుముట్టునఁ గలుషితంబయ్యె నాఁడు. 10

క. తనయుల నిద్దఱ నిరువురు, తనయులనుం గాంచి కాలధర్మము నొందెన్
వనజాస్య గట్టివయసునఁ, దనయుఁడు పరలోకవిధులు తల్లికిఁ జేసెన్. 11

గీ. ఏమిచెప్పంగనఱువదియేండ్లవయసు, ముసలిసుకుమారుఁడేకాంతమునరమించెఁ
గూఁతులిద్దఱుబొమలపైఁగురులుప్రాలు, నంతమాత్రపుఁజిన్నప్రాయంబువారి.

వ. అంతం గొంతకాలంబునకు వానిదుశ్చేష్టితంబు లెఱింగి బ్రాహ్మణులు వాని బహిష్కరించి యూరువెడలనడిచి యారూఢపతితుం డైనవానిసంసర్గంబునం బుట్టినదోషంబు బుద్ధిపూర్వకంబు గాదు కావునఁ గొంద ఱుపవసించియుఁ గొంద ఱుత్తప్తకృచ్ఛ్రంబు లనుసరించియుఁ గొందఱు కృచ్ఛ్రాతికృచ్ఛ్రంబులు నడిపియుఁ గొందఱు చాంద్రాయణంబు లాచరించియుఁ గొందఱు........

సీ. ..................శాంతిశలలకు యమదూతలకు నభిధ్వాంతరములు
ప్రతిబింబములు కాళరాత్రియామములకుఁ బుత్రసంతానంబు భూతములకు
నశుభకర్మముల కన్వాదేశములు మహానిశాపాతురములకు సంగడీలు
కలికాలమునకు డగ్గఱినచుట్టంబులు ధూమకేతువులకుఁ దోడునీడ
లంధకారంబునకు విందు లనఁగ గిరుల
యందు వర్తించుచెంచుల నాశ్రయించి
మనువుమనెఁ గూఁతులునుదాను మహిసురుండు
కొంతకాలంబు మనములోఁ గుత్సలేక. 14

క. ఎనుబదియేఁడులవార్ధక, మునఁ బ్రాక్తనశక్తి యుడిగిపో దాతనికిం
దినియెడిది పెద్దమాంసము, కొనియెడి దిది కల్లు మనసుక్రొవ్వెట్టుడుగున్.

గీ. కాంచె నిద్దఱు సుతుల నక్కామినులకు
వావివర్ణంబు మాలి నవదర యతఁడు
శాస్త్రములఁ జెప్పఁబడినదోషంబు లెన్ని
యన్నియును జేసె నాతఁ డేమనఁగఁగలదు. 16

వ. అంత. 17

క. హేమంతము శరదాగమ, సామంతము తుహినకరవిసంజ్ఞితశబరీ
సీమంతము మదనబల, శ్రీమంతము డాసె భువనసీమాంతంబై. 18

మ. బలుసు ల్పండెను దొండముక్కువడియెం బ్రాసంగుఁజే ల్పోకమో
కలపూఁబాళలతావిఁ గ్రోలి పొరలెం గాబేరదిగ్వాయువుల్
ఫలినీవల్లిమతల్లివల్లరులపైఁ బైపై నలివ్రాతముల్
పొలసె న్మంచులు రాలె రాత్రికరణీఫూత్కారవార్బిందువుల్. 19

చ. కలమవనాళికాకణిశకంటకకోటులచేతఁ జూడ్కికిం
పలవడిచె న్ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణీ
సలిలమువాడి పండినయజాంగలసీమము లెన్ని యన్నిటం
దల మగుసీతువేర్మి గరుదాల్చినభావము ప్రస్ఫుటంబుగన్. 20

క. కలవింకకలకలాకుల, వలభీగర్భములు సౌధవాటములు పురం
బులయందుఁ దుహినవేళలఁ, జలి గులగులకూయునట్టిచందం బొందెన్. 21

క. పెనుజలి గడగడ వణఁకుచు, వనదేవత దంతవీణ వాయించెనొకో
యన మోకప్రేంకసంబుల, ననగుత్తుల మొఱసె నలిగణము విపినములన్.

ఉ. బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబులన్ హత్తి మో
దంబార న్మృదుకేలిశయ్యల శుభాంతర్గర్భగేహంబులం
దాంబూలీదళభాగపూరితముఖుల్ ధన్యాత్మకు ల్పితకా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగలీలావధిన్. 23

సీ. ధనదశుద్ధాంతకాంతాపయోధరభారసంవ్యానపల్లవస్రంసనములు
కైలాసగిరికూటకల్పద్రుమాటవీకుసుమగుచ్ఛరజోవగుంఠనములు
చంద్రభాగాసరిత్సలిలవీచీఘటాప్రేంఖోలికాకేళిరింఖణములు
రాధాపురీహర్మ్యరత్నహేమగవాక్షసంవేశనక్రియాసౌష్ఠవములు
వలనుగాఁజంపకారణ్యవాటిఁ దఱిసి, కాశి యొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాఁగెను సపాదలక్షశైల, కటకబంధుఁ డుదగ్దిశాగంధవహుఁడు.

గీ. చలి ప్రవేశించు నాగులచవితినాఁడు, మెఱయు వేసవి రథసప్తమీదినమున
నచ్చసీతు ప్రవేశించుఁ బెచ్చుపెరిఁగి, మార్గశిరపౌషమాసాలమధ్యవేళ. 25

గీ. ఇనుఁడు కోదండరాశిమీఁదెక్కువేళ
నిక్షుకోదండవల్లి యెక్కిడు మరుండు
సమదవేదండసమమహాసత్త్వుఁ డయ్యు
జనుఁడు కోదండమునుబోలెఁ దనువు వంచు. 26

గీ. ఇండ్ల మొదలను నీరెండ నీడికలను, ననుఁగుఁదమ్ముఁడు నన్నయు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము,గాఁచు చోటికి మకరసంక్రాన్తివేళ.

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి దుష్కరశుష్కగహనావళీదావదహనజిహ్వ
కుక్కుటేశ్వరవరకుండి పీఠాపురి శంకాతమస్కాండచండదీప్తి
దక్షవాటంబు సప్తర్షిగోదావరి కలిదోషపాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయుపురిగ్రమోల దురితాహిసంఘాతగరుడమూర్తి
యున్నిటను దీర్థమాడంగ నేగుదెంతు, రఖిలమునులు ప్రభాతసంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండరాశిఁబాసి, మకరమున కేగుదేరంగ మాఘవేళ.

మ. పతివోయెం దుహినంబు పండె వరి యిప్పల్పూసె శైలంబులన్
గఱిగట్టె న్వలరాజు తేఁటియొఱకం గాండప్రకాండంబులం
జఱపించె న్గ్రిహరాజు మాఠరకుని జక్రాద్రికూటంబునం
దతిఁ గౌబేరదిగంతరిక్షపథయాత్రాజైత్రతుత్తుంభమున్. 29

వ. వెండియుం జకోరలోచనల కుచమండలంబునకుఁ గర్పూరఖండక్షోదంబుల మేదించిన చందనానులేపనై పథ్యం బపథ్యం బయ్యె. రథ్యవేగంబున ననూరుసారథిరథంబు ప్రతివిఘట్టనక్షుణ్ణనక్షత్రక్షోదపాళీచుళుకితోర్ధ్వాండభిత్తియై యుత్తరాయణంబు గైకొని కులూదశాశోదరీకపోలముకురబింబంబులం బ్రతిబింబించె. సవ్యాపసవ్యక్రమంబునం జక్రమిథునంబుల నెట్టుకొని బిట్టేసి యేసి విసిగి నిల్చి మనోభవుండు నిగిడించిననిట్టూర్పునుంబోలె నిశాసమయంబుల నిండువెన్నెలలోనం జిన్నిచిన్ని నులివేఁడివడ పొడచూపె. కేదారక్షేత్రంబులం గలమగోపిక లొడికంబుగా దంచిన నిద్దంబు లగుదుద్దుగడుబ్రాసంగుఁబ్రాలు సద్యోమార్జనావశంబున నతిస్నిగ్ధంబులై కర్ణాటదేశతాటంకినీ దశనవజ్రాంకురంబులకాంతిసంపదఁ దలంచె. నీహారవ్యపాయంబున నిర్మలంబులై బహుళపక్షప్రదోషంబులయందుం దారకంబులు, విక చక్షుము

దకోరకంబులు కెలంకులఁ గొలంకులలోనం బ్రతిబింబించి మదకలకలహంస
త్రోటీకోటీవిఖండితమృణాలదండఖండంబులభావంబు భజించె. హృదయో
త్కంఠాతిరేకంబునఁ గంఠమూలకఠోరకాలకూటవిషమషీకళంకపంకచ్ఛా
యాచ్ఛటాకుండు భువనరక్షాదాక్షిణ్యుండు దాక్షారామభీమేశ్వరుండు దక్షి
ణజలధివేలావలయితంబు లగులవంగలవలీమతల్లికాకుడుంగక్రోడంబులఁ గ్రీ
డించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగి వెడలె. వలవలనిముంచుఁ
దుప్పరమునుజడిందడిసిజడనుపడి వ్రేకలగుపోఁకపూఁబాళలపరిమళంబులఁ
బుక్కిలించియుమియుచుఁ, బకరణంబులలోన నల్లనల్లన పొలుపారు నడవిక
రువలి యసమసమవిషమకుసుమఫలక్రీడామతల్లికల మల్లుపెనంగి డస్సినభి
ల్లపల్లవాధరల గల్లఫలకంబులఁ గ్రొత్తయుదయించు చెమటచిత్తడి యు
డిపె. కాశీశ్రీశైలకుంభఘోణశోణార్క కాంచీకాంచనసభాకాళహస్తికురుక్షే
త్రాదిపుణ్యస్థానంబులంగూపవాపీతటాకకుండికాప్రస్రవణస్రోతస్వినులం బ్ర
త్యూషకాలంబులం బరమర్షిసార్థంబు తీర్థంబాడె నివ్విధంబున మాఘమాస
వాసరంబులు వసంతసమయసామంతంబులు జరగుచుండ నాచండాలాదిమను
ష్యులకు భుక్తిముక్తులు ప్రసాదింపంజాలి మాహేశ్వరులకు మహోత్సవంబు
పాశుపతులకుం బ్రీతి కాలాముఖుల కవలంబంబు మునులకు మనికి జటాధా
రుల కాధారంబు పరివ్రాట్టులకుఁ బట్టుఁగొమ్మ వేదాంతులకు సంతోషం బాగ
మికులకు భాగధేయంబు మాంత్రికులకు మనువు తాంత్రికులకుఁ దావలంబు
పౌరాణికులకుఁ బ్రాణ ముపనిషత్తుల కుపాయంబు ముముక్షులకు రక్ష శం
భునకు విస్రంభస్థానంబు శాంభవికి హృదయోత్కంఠయు హేరంబునకుఁ
బ్రియంబు తండువునకుఁ బండువు కుమారస్వామికిం బ్రేమాస్పదంబు భృంగి
రిటికిం దంగేటిజున్ను దురితతరుషండఖండనంబునకు గండగొడ్డలి యఘపటల
తిమిరసముదాయహిమఘృణిసంతానంబు సంతాపశాంతికి భాగీరథీప్రవా
హంబు శివరాత్రిపుణ్యకాలం బేతెంచిన. 30

సీ. ఆవణిక్పదమున కనతిదూరంబున గవ్యూతియెడ నుదక్పశ్చిమమునఁ
బర్వతోపత్యకాపర్యంతతటమున సికతాతినిర్మలక్షేత్రసీమ
మాలూరతరుషండమధ్యభాగంబునం బ్రస్రవణాపగాపార్శ్వభూమిఁ
గుసుమవాటికలలోఁ గువలయాంభోరుహాకుముదమండితమైన కొలనితోడఁ

గోటతో గోపురములతో గుట్టుమట్టు, మండపంబులతో మహామహిమనొప్పు
నాదిమధ్యాంతనాగేశ మనఁగ నొక్క, పుణ్యతీర్థంబు త్రైలోక్యపూజితంబు.

గీ. అందు శేషప్రతిష్ఠితుం డమృతదివ్య, లింగమంగళమూర్తి ఖట్వాంగపాణి
యర్ధశశిమౌళి నాగేశ్వరాహ్వయుండు,ప్రతివసించు ననేకకల్పములనుండి. 32

వ. ఆశివరాత్రిపుణ్యకాలంబున. 33

సీ. శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి దరి నొనర్చిరి మూఁడుతర్పణములు
ధరియించి రంబునిర్ధౌతవస్త్రంబుల నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం దొనరించి రంశుమంతున కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి యభ్యాగతులకు సర్వాణాలు నడిపి
రవనిసురులెల్ల నాగేశ్వరాలయమున, కేగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు
.........నాల్గుజాలుఁ బూజ, నాదిసంకల్పమొనరించి రభవుప్రమోాల. 34

గీ. ఆదరంబున సమ్మార్జనానులేప, ధూపపటువాసనలు తైలదీపములును
సంఘటించిరి వివిధసంస్కారవిధుల, బ్రాహ్మణులు సర్వులైనట్టి పౌరజనులు.

సీ. కాంస్యతోరణమాలికలు సంఘటించిరి ప్రాసాదగోపురాభ్యంతరముల
రంభాతరుస్తంభసంభారములు సముత్పాటించి రొగిఁ బ్రతిద్వారమునను
బూజోపకరణపాత్రీజాత మఖిలంబు సంస్కరించిరి భస్మసలిలశుద్ధిఁ
గరమొప్పు వృషభపుంగవకేతనంబులు నిలువంగఁ బెట్టిరి వలభులందుఁ
గమలనీలోత్పలంబులుఁ గర్ణికార, మాలతీకుందములు హేమమరువకములు
మల్లికాకింశుకము లపామార్గవకుళ, పాటలంబులుఁ గూర్చి రపారములుగ. 36

గీ. అపుడు సుకుమారకాహ్వయుం డదరునజ్జ, నేగుదెంచెను నాగేశ్వరేశుగుడికిఁ
బుష్పవాటికలోఁగమ్మపువులఁగోసి,పొలఁతులకునిద్దఱకుఁగొంచుఁబోవఁదలఁచి.

క. కుడిచేతమాంసఖండము, లెడ కేలను మద్యరససహితమగు కంచుం
గుడుకయు ధరించి మదమున, వడవణఁకులు గొనుచు నతఁడు వచ్చె న్గుడికిన్.

వ. జన్మాంతరస్థుండుబోలె రూపాంతరగతుండుబోలె నావిష్టుండుబోలె భూతాధి
ష్ఠితుండుబోలె గ్రహగృహీతుండుబోలె నున్మత్తుండునుంబోలె మదిరామదాతి
రేకంబునఁ దన్నుఁ దా నెఱుంగక పరిసరలతాకంటకానుషజ్యమానాంశుకో
త్తరీయుండును నజ్ఞాతసమవిషమపదవీభాగవిన్యాసప్రస్ఖలితపాదద్వయుండును
నై పలితపాండురంబు లగుశిరోరుహంబులు విరిసి వీఁపునం బడ నొయ్యొ
నొయ్యన యేతెంచి నిర్లజ్జుండును నిస్నేహుండు న్నశంసుండును నగునక్క

ర్యచండాలుండు గర్భగోళంబునకుఁ జక్కం గ్రిందుర నిలిచి ర_క్తకమలదళచ్ఛా యంబు లగుకన్నులు దెఱచి విఘూర్ణమానతారకం బైన హికారాలోకనం బున నలవోకయుంబోలె నిర్మలస్ఫటికమండపాధ్యాసీనుండును నమృతమయ జ్యోతిర్లింగమూర్తియు ముక్తాఫలధవళకాంతియుఁ ద్రిభువనవందితచరణుం డును జరాచరగురుండును నగునాగేశ్వరుని దర్శించి యమ్మహాదేవుమౌళి కపాలమాలికామండనఖండేందుశకలంబులకు గంగాప్రవాహడిండీరఖండంబు లకు నుష్ణీషఫణిఫణాఫలకంబులకుఁ జెలికారంబు సేయంజాలి పాంచజన్యస హోదరంబు లన దుగ్ధాంబురాశి హృదయంబు లనఁ జంద్రికాశరణంబు లన నంగజాట్టహాసంబు ఛేదంబులన మెంతుకొని యున్నపుండరీకంబుల పూజ గనుంగొని వెండియు. 39

చాయన భోగిరాట్కటకసన్నిధిదీపితదీపమాలికా
చ్ఛాయఁ బురశ్రీప్రదేశమునఁ జాగిన నిర్ఝరవాహినీమహా
తోయముసావి చీరమొగఁ ద్రోచి చొరంగఁ దలంచె నెంతలోఁ
తోయని కొంకి కొంకి పతితుం డతఁ డాసవపానవిక్రియన్. 40

పవనవశమునఁ గేతకీప్రసవధూళి, యంగమున హ_త్తియుండంగ నాతఁ డపుడు
విమలభస్మసముద్ధూళన మొనరించి, పాశుపతదీక్షఁ గైకొన్న భంగి నుండె.

కలఁగఁగఁబాత్తె నాతని యఘంబులు పంచహృషీకసంభవం
బులు బహుకాలసంకలితము ల్దవవహ్ని చిటాచిటధ్వనిం
గలఁగఁగఁబోఊ పత్తులప్రకారమునం దొలుజాముపూజకై
బలుపటహమ్ము తమ్మనుచు భర్గుని గేహమునందు మ్రోసినన్. 42

ఆశివరాత్రిపుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపించువారును నితిహాసం బులు చేయువారును బంచాక్షరీపంచబ్రహ్మాదిమంత్రంబులు జపించువారును నీలకంఠస్తోత్రంబులు పఠించువారును బ్రాణాయామంబు లనుసంధించువా రును బ్రత్యాహారంబులు నడుపువారును బ్రదక్షిణంబులు సేయువారును భస్మోద్ధూళనంబు లొనర్చువారును దురోదరంబుల వినోదించువారును నష్టావ ధానంబులఁ గ్రీడించువారును వీణలాస్ఫాలించువారును గావ్యగోష్ఠి సలుపు వారును బరిహాసం బాదరించువారును, బిందుమతి యభ్యసించువారును బ్రహేళికలు భావించువారును నాడువారునుం బాడువారును మేషకుక్కు టకరేటులావుకకపింజలయుద్ధంబులు వీక్షించువారును గుబ్జవామనకిరాతబర్బ

రజరతమూకజనవికారంబు లవలోకించువారు నై జాగరంబులు సలుపుచునుం డిరి సుకుమారుండును నొక్కించుక యన్నుం దేజెకొని వారిం జూచుచుండె నప్పుడు శివగంగానిర్ఝరజలతరంగశీకరజాలజనితజడిమంబులు నందిరోమంథ ఫేనబిందువాహములుం గుమారశిఖికలాపవిధూననక్రియాలలితంబులుఁ బశుపతి జటాబద్ధవాసుకినిపీతశేషంబులు హేరంబగండమండలనిష్యందమానదాన ధారాకలుషగంధలహరీపాణింధమంబులు భృంగిరిటినికుంభకుంభోదరప్రముఖ నిఖిలగణపరిష దుద్ధూళితభసితధూళికావికిరంబులు మాతృకాశ్రవణావతంసక ల్హారకోరకప్రేంఖోళనప్రక్రియాసమభిహారానుమేయావతరణంబులు మహిసా క్షిగుగ్గులుధూపధూమకంబులు మాలూరకిసలయామోదమేదురంబులు నగు మహాదేవనిశామారుతంబు లతనిమీఁదఁ బొలుపారి పాతకంబులు మూల రాల్చె నట్టిసమయంబున. **43**

గీ. అర్ధరాత్రంబుదాఁక నయ్యధమవృత్తి, శివనిశావైభవంబు నీక్షించి తనియఁ దానకమునకు నది యాదిగా నతండు, విడిచెఁ దొల్లింటి నీచవృత్తిబుద్ధి. **44**

వ. అంతఁ గొంతకాలంబునకు. **45**

క. కుక్కలలో శబరులలోఁ, గక్కెర చిమ్మటలలోనఁ గార్కొ ళులలోఁ బక్కణముగుడిసె నడుమను, గుక్కిపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. **46**

క. శ్రీనాగేశ్వరశంభు, స్థానంబున గిరిశరాత్రి జాగరణంబుం దానుండి కనుంగొన్నక, తానను విగతాఘుఁడై యతఁడు మృతిఁ బొందెన్.

సీ. క్రిమికంఠకుహరమార్గమున కడ్డము దొట్టి పెద్దయేంచియు బాధపెట్టకుండ శ్లేష్మ ముద్రేకించి సెలవి రంధ్రిమువాయ మెఱసి నుచ్చిళ్లు గ్రమ్మింపకుండ దృగ్గోళకంబులు దిరుగంగ దృష్టియు నంధకారంబులో నణఁగకుండ నెఱిదప్పి యుచ్ఛ్వాసనిశ్వాసపవమానపరివాహగతు లోటువడకయుండఁ బరమయోగీశ్వరుఁడువోలె బ్రహ్మరంధ్రి, వీథిఁబ్రాణంబువిడిచెనవ్విప్రకులుఁడు పుణ్యశివరాత్రినలవోకవోలె నైన, నురగధరుచెంత జాగరం బుండెఁగాన. **48**

వ. ఆకాలంబునఁ గాలకింకరులు మృత్యుదేవతాసహితులై ముసలముద్గరతోమ రాదిప్రహారణంబులతో......అతనిలింగశరీరంబు వరుణపాశంబుల బంధించి కొనిపోవఁ గణంగిన నవ్వేళ శివదూతలు శివాజ్ఞావశంబున శూలాంకుశగదా భిందిపాలపరిఘపరశ్వధ.........చ్చి దవ్వుల నాకాశమార్గంబున. **49**

గీ. ఓరి యమునిదూతలార యీబ్రాహ్మణుఁ, గరుణ మాలి యేల కట్టినారు
విడుఁడు శివునియాన మృడునాజ్ఞ దాఁటమీ, రాజు......గ్గరాముదించి 50

మాలిని. విడుఁడు విడుఁడు వీనిన్ విప్రునిన్ భాగ్యవంతున్
మృడుఁడు కరుణతోడ న్మిక్కిలిం గారవించెన్
జనుల కొరుల కేలా సంభవించున్ యథార్థం
బడర మహిమ్న......పాలవంబుల్. 51

గీ. అన్నదాన తపస్స్వానృతాదులైన, పుణ్యకర్మం బొనర్చిన పురుషునందు
నెట్లు సంతోషమందు నర్ధేందుమౌళి, యట్టిసంతోష మితనియం దావహించె.

వ. అనిన యమకింకరులు శంకరకింకరుల కిట్లనిరి. 53

సీ. ఏకార్యమునకయి యెచ్చోటి కరిగెద రరుగుఁడు మీరు మహాత్ములార
యితనిక్లేశము చూచి యతికృపాపరతమై పు......రింపఁ బూనినారె
హరుకింకరుల మన్న నాశ్చర్య మయ్యెడు సదసద్వివేకంబు చాలకునికి
భవభక్తులకు నడ్డపడుట ధర్మము మాకు నేమేల పట్టుదు మీశుభక్తు
నితఁడు కలుద్రాగె నంకాడె నెఱచిఁ దినియె
నిలిచిమూత్రించెఁ జండాలలలనఁగూడెఁ
గూఁతు రమియించెఁ దెరువాటుగొట్టెఁ బ్రజలఁ
జెంచురాజుల సేవించెఁ జెఱిచెఁ గులము. 54

సీ. కేలుదో యెత్తి మ్రొక్కెనె పాశుపతులకు శరణార్థి ననియెనే జంగములకు
ఫాలభాగమునందు భస్మంబు పూసెనే యఱుతఁ దాల్చెనె రుద్రాక్షపూస
శివమంత్ర ముచ్చరించెనె జిహ్వ నేత్రపొద్దు నరిగెనే యెన్నఁడే నభవుగుడికి
వళియించెనే మహాప్రమథచారిత్రంబు తిరిగెనే మృషుపుణ్యతీర్థములకు
దానములు పెక్కుఁజేసినదాన గాని, కాలగళుభక్తియావంతఁ గలిగెనేని
యడ్డపడి ధర్మమౌఁగాక యనఘులార, యర్హమే యీదురాత్మున కడ్డపడఁగ.

ఉ. ఎట్టుగ నేగుదెంచితిరి యిందుకళాధరభృత్యులార యీ
చెట్ట దురాత్ముని న్హరుని చెంతకునుం గొనిపోవువారలై
యెట్టొకొ శంకరుం డొకని నెవ్వనినేఁ గొనితేరఁ బంపినం
బట్టఁగవచ్చినారొ తడఁబాటున వీని మతిభ్రమంబునన్. 56

సీ. అనిహేతువులును దృష్టాంతంబులును జూపి యమ......యవనినురుని,
నూరకయుండె మృత్యువు నోర్గదల్పక భవునిచే మును పడ్డపాటుఁ దలఁచి

వరుణపాశములచే వ్యథితచేతస్కుఁడై సుకుమారుఁ డెంతేని స్రుక్కుచుండె
నెమరుసనాఁడఁ దోణంగిరి..........తారు పంచినవారు తడయుటయును
గాలయాపనమునకు నిగ్రహముఁబూని, శంభుకింకరు లపుడవష్టంభ మెసఁగ
నౌడుగఱచుచు నప్పు డేకాంతమునిండి, సమధికం బైనసాహసోత్సాహవృత్తి.

ఉ. చిత్తరి దండిమాట లిటు ప్రేలెద రే యమరాజుసేవకుల్
చిత్తజవైరియాజ్ఞ యొకచీరికిఁ గైకొన కంచు నుద్ధతి
నిత్తిని వారినిం గదిసి నిర్భరభూరిభుజాబలంబునన్
మొత్తిరి యుక్కుబాహువులు మోడిచి పట్టి వృషాంక కింకరుల్. 58

క. కడవసములఁ బ్రహరించిరి, యడిఁచిరి లాతముల మొత్తి రహివలయములం
బిడికిళ్లను ఘట్టించిరి, తడఁబడ మృదుభటులు దండధరుకింకరులన్. 59

వ. ఇట్లు మొత్తువడి యమకింకరులు శంకరకింకరులకుం బ్రతిఘటింపక సుకుమారుని బరివేష్టించి యమలోకంబున కభిముఖులై యతనిం గొనిపోవం దొణంగి రప్పుడు రుద్రాక్షమాలికావక్షస్థ్సలుండును జంద్రార్థకృత శేఖరుండును భస్మోద్ధూళితలాలితాంగుఁడును ద్రిలోచనుండును నతిప్రమాణకాయుండును నగునీలలోహితప్రమథుండు కాలాంబుదధ్వానగంభీరం బైనకంఠస్వరంబున నిట్లనియె. 60

సీ. పడసె నెవ్వనికృప బ్రహ్మ బ్రహ్మత్వంబు విష్ణుండు విష్ణుత్వవిభవమంబు
నీరేడుజగములు నెవ్వనికుక్షిలో నొక్కఁ డొక్కంటితో నొరయుచుండు
నంధకేభజలంధరాదిదానవకోటిఁ గ్రాఁగించె నెవ్వానికంటిమంట
యామ్నాయశాఖాసహస్రంబు లెవ్వని నాసికారంధ్రనిశ్వాసధార
యమ్మహాదేవుపలెంకల మైనమేము, భర్తయానతి నిర్వహింపంగఁ దలఁప
మమ్ముఁ జీరికిఁ గైకొక మదముపేర్మి, నెట్టుకొనిపోయెదరు విప్రు నెఱయఁగట్టి.

ఉ. బుద్ధియ కల్గె నేని కొనిపోకుఁడు ధర్మము సూక్ష్మ మీయనం 61
బద్ధము లైనన్యాయములఁ బంతము వచ్చునె మేము దెంపుమై
యుద్ధము సేయఁజాలకయ యోహరిసాహరి నెంతచెప్పిన
న్నిద్ధరణీతలామరుని నీరు చలంబున మీకుఁ దక్కునే. 62

గీ. ఎంత చెప్పిన విన రేమి యీకుమారు,హరునియాజ్ఞయ బలవంత మల్ప మెట్టు
ఛాక నొవ్వక మీరు మా కాఁకఁ జెడక, యుద్ధరామరుమాకిప్పుడిచ్చుటొప్పు.

క. నావుడును యమునిదూతలు, భావభవారాతిప్రమథవర్గముతోడన్
సేవకధర్మము తగవును, లావును బంతంబు దృఢబలంబును మెఱయన్. 64

వ. ఇట్లని పలికిరి. 65

క. చత్తుము చెఱఁబడుదుము కడు,నొత్తుదు మీచేత నెట్టునుం దగవు మముం
బుత్తెంచినపతిసన్నిధి,నుత్తర మెట్లిత్తు మాజ్ఞ యుపహతిఁబొందన్.

సీ. చర్చించి చూడఁగా చంద్రార్ధమౌళికి యమరాజు నిజభృత్యుఁడో నో కాఁడొ
యభవుఁ డిచ్చినయట్టియధికారమూఁగాదొ యముఁడుగూర్చున్నధర్మాసనంబు
త్రిపురాసురాంతకుదివ్యదేహము గాదొ వేదస్మృతులు తత్త్వవిధిఁ దలంప
శిష్టరక్షయు దుష్టశిక్షయు శూలికి................దొ యాత్మలోన
నవకరము లెన్ని యన్నియునాచరించెఁ, బాపియగుచీనినరకకూపమునఁద్రోచి
బాధపెట్టంగవలసినపట్టునందుఁ, బంతమే విడఁడంట యోప్రమథులార. 67

ఉ. చచ్చిన నేమి మూర్ఛ........నేమి ప్రహారవేదన
న్నొచ్చిన నేమి పండ్లు చెవి నోరు కరాంగుళనేత్రగోళముల్
ముచ్చిన నేమి పట్టపతి మొక్కలిబంధనశాలలోనికిన్
వచ్చిన నేమి భృత్యునకు నచ్చినయేలికయాజ్ఞ పట్టునన్. 68

గీ. తగవు ధర్మంబు పాడి పంతంబు దెలిసి,
యనుపుఁ డీబ్రాహ్మణుని బాధ లనుభవింప
నొండె; దురమున మమ్ము మృత్యువు జయించి,
విప్రుఁ గొనిపొండు మాటలు వేయునేల. 69

క. మీకును మీపతియానతి, మాకును మాభర్తయాజ్ఞ మన్నింపఁదగున్
వేకావవాక్యములు వెడ, వాకొట్ల బల్బజంబు వలవదు నేయన్. 70

క. అని యమునిభటులు పలికిన, విని శంకరభటులు తద్వివేకంబునకున్
మనమున సంతోషించియు, మనసిజహరుశాసనమును మన్నించుటకై. 71

సీ. పొడికచ్చడములపైఁ బులితోలునునుఁ జేలు కటిభాగమునఁ గాసెకట్టు గట్టి
యభినవంబైనరుద్రాక్షయొడ్డాణంబు నాభిచక్రములోనుగా ధరించి
ప్రిదిలి జాఱక యుండఁ బెనుబాఁపపోఁగులు శ్రవణభాగమునందు సంతరించి
యల్లిబిల్లిగ జటావల్లీమతల్లులు గూర్చి పెంపొందఁ గీల్కొప్పు వెట్టి [కడ
భసితధూళి శరీర మభ్యంగమార్చి,యుద్ధపిడిఁ బాదిమదయోధు లొక్కఁడొకఁ
యాయుధంబులు ధరియించి యట్టహాస,డమరుకధ్వానసింహానాదములతోడ.

శా. ఆటోపారభటీసముద్భటతరాహంకారబాహాధను
ర్జ్యాటంకారరవంబు లంబుజభవాండాభ్యంతరంబుల్ సమా
స్ఫోటింపంగ లలాటలోచనభుజిష్యు ల్దండభృద్భృత్యులన్
ఘాటీసంభ్రమలీలఁ దాఁకిరి వడిన్ ఘారాధరాధ్వంబునన్. 73

సీ. ద్రాఘిష్ఠకఠినదంష్ట్రాదండసంఘట్టకటుఘోరకిటకిటాత్కార మగుచుఁ
జటులఝంఝామరుజ్జృంభాపరంపరాసన్నిభఘ్రాణనిశ్వాస మగుచు
సకలతారకచక్రవిభ్రాన్తిభీషణస్ఫారచక్షుర్ద్వయీభయద మగుచు
నిటలవీథివిటంకనిర్భరభ్రూకుటీనటనక్రియాటోపపటిమ మగుచుఁ
గాలమృత్యువు శాణచక్రమునఁ బట్టి, చికిలిచేసిన యడిదంబుచేతఁ దాల్చి
జేగురించిన మొగముతోఁ జిత్రజారి, ప్రమథవర్గంబుఁదాఁకెనాగ్రహ మెలర్ప.

వ. ............ ....తవణిడమరువురవరమునినదముతవణించుచుఁ దచ్చటులతమా
మీకడంబరవిష్కంభము కాషాకటాహముల నుద్ఘాటింప దినకరకరచ్ఛా
యాచ్ఛేదాధిగమమున ధగద్ధగితము లగుని స్త్రింశకుఠారాద్యాయుధదీప్తులు
రణలక్ష్మినివాళింపంగ నపుడు విద్యాధరపన్నగయక్షగరుడగంధర్వాదులు
మది నాహ్లాదింపంగ సురముని కుంచె యాడింపంగ నిలింపపథంబున భవుని
లెంకలు శమనకింకరులును బాహాస్తంభవిజృంభణ మప్రతిహతముగ నొం
డొరువులఁ దాఁకిన భండనంబు ఘోరం బయ్యె. 75

క. శంకరభటులును నంతక, కింకరులు మిథఃప్రహారకీలాలఘటా
పంకిలతను లయి కుసుమిత, కంకేళితరులభంగిఁ గనుపట్టి రనిన్. 76

వ. అప్పుడు కింకరులయం దొకఁడు రయంబున యమునిసన్నిధికిం జని యతని కిట్లనియె.

సీ. దేవ దేవరయాజ్ఞ ధృతి నేముదలఁబూనిమృత్యుతోఁ గూడి భూమిస్థలికినిఁ
జని వణిక్పథ మనుఘనపట్టనమునకు ననతిదూరమున శైలాంతరమున
నడవిలో నేకమృగవ్యాధసంకీర్ణమునఁ గుష్ఠామయంబునఁ గుతిలపడఁగఁ
జెడిపెకూఁతురు కాళ్లకడనుండి యేడ్వంగఁ బంచత్వమొందినపాపకర్ము
బ్రహ్మబంధుని సుకుమారుఁ బట్టి తేఁగ, నభవుదూతలురానీకయాఁగినారు
మాకు వారికి దుర మయ్యె నాకసమున, నెఱుఁగఁజెప్పంగ వచ్చితి నిత్తెఱంగు.

వ. అనిన విని కృతాంతుండు సమధికక్రోధావేశవివశస్వాంతుండై యులుంబరుం డను సేనాని రావించి యతనితో నిట్లనియె. 79

గీ. చనుములుం బరవృషభలాంఛనుని లెంక, లాంగినా రంతమును వాంఛ్రజనాక సమున
నొక్కపాపాత్ముం గొనిరాంగ నుద్ధవిడిచి. చేసి నాజటాధారుల నెగిచి రమ్ము.

క. గబ్బున నెదిరించిన నొక, దెబ్బ గొనుచు........నెనుక ద్రిజగముల నొకల్
తబ్బిబ్బుగ జంగములకుం, బబ్బంబులు నెట్టు ముష్టిపరిఘష్టినలన. 81

గీ. వ్యాధులష్టోత్తరశతంబు వచ్చుంగాక, తోడనే తెంచుంగాక మృత్యువులు నూఱు
పంపినారము ముచ్చాడిభటులంగూర్చి, కాలమృత్యువు గాలుము శంకరుని హితుల.

వ. అని పల్కిన వల్లె యని యులుంబరుండు వివిధవ్యాధిమృత్యుపరివృతుండై కదలి యుద్ధవిడిం దూర్యంబులు మొరయ ప్రమథానీకంబుం దాంకి శస్త్రజాలంబు నిగిడ్చి పేర్చి పూర్చగం గోపించి పంచవదనభటులు కుటిలభ్రూభంగభీషణంబు లగు మొగంబులు జేవుఱింప నట్టహాసంబు చేసి య....డమరుడిండిమ ఢమఢమధ్వానంబుతోం గినాశకింకరుల ముసలభిందిపాలతోమరమండలాగ్రత్రిశూలపట్టసంబులం బ్రహరించిన విచ్ఛిన్నబాహూరుచరణవక్షః (ఫలక) లలాటకృకాటులై విచ్చియు నొచ్చియుం జచ్చియుం దెరలియుం బొరలియుం దోంగియు డాంగియుం గ్రుస్సియు డస్సియుం గందియుం గుందియుం దారియు....గ్రొగ్గియుం డగ్గియు నలసియు సొలసియుం బికాపికలై దికొక్కమొగంబులై యూరుసారులై గురియై బండబండై భండనంబు విడిచి వలయ....బారి వెలవెలం....కృతాంతుని సన్నిధికిం బోయిరి. ఇట జటాధారులు సుకుమారుని బంధనంబు లూడ్చియు నతని మున్నిడుకొని హాహాన్నాశంపుంగ రాచూరి చాయలం బట్టుచు వింటి తెరువునం జనరి. అప్పు డా సుకుమారుండు పుణ్యశివరాత్రివ్రతాలోకనప్రభావంబున. 83

శా ఖవృత్తము. దౌదవ్వులం గాంచెం గైలాసము తరుణేందు(కళా)ధరునినివాసము
(ద్వా)దశహారి...స్థానస్థపుటితధవళచ్ఛాయాచ్ఛేదవిలాసము
ధుత్రివమండల....నంతాధిష్ఠూలశృంగశృంగాటకవిహార
త్ఖచరగరుడగంధర్వప్రమదాస్తోమవిహితలీలాపరిహాసము
నవలేపాటోపసముద్భటవిఘ్నాధిపదీర్ఘవిషాణప్రఘణ
వ్యాఘట్టనపారద....మయప్రస్థతటధ్వనివిసరము
నవిహితహూహూముద్రానిగదవ్యాఖ్యాతశోకలతోవల్లవ
యాథాత్మ్యవిజిత్వరనీహారాద్రిసుతాచరణాబ్జన్యాసము. 84

సీ. కామధుగ్ధేనుసంఘాతంబుతొట్టులు, గాంచెఁ గాంచెను రత్నకందరములు
కాంచెఁ గల్పకవాటికాసహస్రంబులు, సిద్ధరసాపగాశ్రేణిఁ గాంచె
బహుహిరణ్మయమహాప్రాకారములు గాంచె, నమరిన.......ధములు గాంచెఁ
బ్రబలచింతామణీస్పర్శవేధులఁగాంచె,నానావిమానరత్నములు గాంచె
హావభావవిలాసరేఖావిశేష, హారిమూర్తుల రుద్రకన్యకలఁ గాంచె
......నిపోవనర్ధేందుమాళిఁ, గాంచె సుకుమారుఁ డంబికాకాంతుశివుని. 85

వ. కాంచి దండప్రణామంబులుచేసి చేతులుమోడ్చి ఓమ్నమశ్శంకరాయ, శశాంకమూర్ధాలంకారాయాంధకపురంధ్రీసీరంధ్రస్తనకుంభసముత్తంభితకస్తూరికాస్థానకముద్రాద్రోహిబాహార్గళస్తంభాయ, జంభారిప్రముఖనిఖిలదేవతాకోటిహాటకకిరీటకోటీవిటంకసంవాసితమందారమాలికామరంద బిందునిష్యందధారాధౌతచరణారవిందాయ, జలంధరాసురకంధరాపీఠికాపఘట్టనక్రియాగరిష్ఠనిష్ఠురతాశశ్వద్విభంగఖట్వాంగపాణయే, పశ్యల్లలాటాయ, మదనమదగదాగదంకారాయ సంధ్యానటాయ, కరకలితడమరుతాంకార, బృంహితబ్రహ్మాండమండలాయ, చండికాధిపతయే, నిరస్తసమస్తోపాధికాయ, సచ్చిదానందస్వరూపాయ, స్వమహామహిమప్రతిష్ఠాయ, నిరుపాధికనిరవధికనిర్ణిరోధనిరవగ్రహాభిసంధినిర్భరకృపాసంపత్సంపూర్ణమేధసే, వృషాంకమాలికాభరణాయ, సముద్దండపుండరీకక్రవ్యాదకృత్తికంథాధుకంధరస్కంధభాగాయ,భగవతే నమస్తే; ధన్యోఽస్మి ! కృతపుణ్యోఽస్మి !! నమస్తే. అనిపలికి వెండియు. 86

విషమవృత్తము. జయజయశంకరజయజయపురహర
జయజయ..............గుణమణిగణాలయ
జయజయతుహినక్ష్మాధరకన్యాసహచర
జయజయశాక్వరవరశుభకేతన
జయజయమందరకందరకంథర
సంక్షుభితమహాక్షీరోదన్వజ్జఠర....రశజలన
గిరీశా నకల్మాషిశితి కంధరా. 87

వ. అనియనేకప్రకారంబులం బ్రస్తుతించిన సుకుమారుమీఁదఁ గరుణాకటాక్షవీక్షణంబు లొలయించుచు విరూపాక్షుం డతనికిఁ గామగమనంబును హేమకింకిణీమాలికానినాదంబును రుద్రకన్యాసహస్రసంకులంబును నగుదివ్యవిమానంబొసంగి ప్రమథత్వంబు కృపచేసె. పుణ్యవంతుల భాగ్యంబునకుం గొల్ల

గలదే, యింక నెయ్యది........యడుగుండని సూతుండు నైమిశారణ్యనివాసు లగుమహామునులకు సవినయంబును సస్నేహంబును సగౌరవంబునుగా విన్న వించిన. 88

గీ. పరమమునులుసూతవ్యాససంభవునిసూతు,
భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ
భటులుప్రమథులచేభంగపడుటఁజూచి,
చిన్నఁబోయి యముండేమిచేసెఁ జెప్పుమ*

మ. కరుణాసాగర శైవశాస్త్రకలనాగాంభీర్యశౌర్యోన్నతా
తరుణీమన్మథ రాజపూజితకళాధర్మక్రియాసంస్తుతా
వరనీతిప్రతిభావిశేషకలనా వాగీశసంకాశ శ్రీ
తరుణీనాథమనోజ్ఞరూపవిలసత్కావ్యార్థసంబోధనా. 90

క. ధర్మార్థాలయవరగుణ, నిర్మాణవిశేషవిభవనిరుపమకార్యా
కర్మోత్కటబహుగుణవృత, నిర్మలసుజ్ఞానచతురనిశ్చితధైర్యా. 91

మాలి. శతధృతిధృతదివ్యాసారనిర్మాణరూపా, సతతసుఖవినోదాసామగానప్రమోదా
వితతకవివరేణ్యావీరశైవాగ్రగణ్యా, యతులఫలవివేకాహర్షనైర్మల్యపాకా.

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకల
విద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బైనశివరాత్రి
మాహాత్మ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

* ఈగ్రంథ మింతతో సమాప్తమనియే తోఁచుచున్నది.

శ్రీ

# పాండవాజ్ఞాతవాసవత్సరవ్యాప్తినిర్ణయము.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రమహాభారత పీఠిక (వాకిళ్లవారిచే సంప్రోత్తింపఁబడిన A critical Introduction to Andhra Maha. bharatamu) యందు, తిక్కనయాంధ్రీకరణమునుగూర్చిన యుదాహరణములలో నొకటిగా నీయజ్ఞాతవాసవత్సరవ్యాప్తిసందర్భముదాహరించి, కొంతవఱకుఁ జర్చించి యందు మూలమును నీలకంఠభట్టాచార్యునివ్యాఖ్యానమును దిక్కనార్యుని తెలుఁగుపద్యమును వ్రాసి పైవిషయములో నివి పరస్పరసందర్భము లేకయున్న వనియు, ఈసందేహము లోకము విమర్శించుఁగాక యనియు వ్రాసి విడిచిరి.

శాస్త్రిగారును నేనును, ప్రస్తుత మనంతపురమందు రాజకీయకళా శాలలో నుపాధ్యాయులముగా నుండుటచేతఁ బ్రస్తావవశమునఁ బైవిషయము వారు నాకుఁ జదివి వినిపింపఁగా, విషయము జ్యోతిశ్శాస్త్రసంబద్ధ మగుటచే నేను గొంత కృషిచేసి చూచెదనని చెప్పి, మూలవ్యాఖ్యానాంధ్రీకరణములకుఁ బరస్పర విరోధ మేమియును లేదని, నాచేతనైనంతకొలఁదిని విమర్శింపఁబూనితిని. ఇందలి లోటుపాట్లను బెద్దలు మన్నింపఁగోరుచున్నాను.

చదవరులసౌకర్యముకొఱకు మూలము నిక్రింద వ్రాయుచున్నాను.

భీష్మః॥ *కళాః కాష్ఠాశ్చ యుజ్యంతే ముహూర్తాశ్చ దినానిచ।
అర్ధమాసాశ్చ మాసాశ్చ నక్షత్రాణి గ్రహాస్తథా ॥ ౧.
ఋతవశ్చాపి యుజ్యంతే తథా సంవత్సరా అపి।
ఏవం కాలవిభాగేన కాలచక్రం ప్రవర్తతే ॥ ౨.

---

* [వ్యాఖ్యానము :—జ్యోతిషాం నక్షత్రాణాం వ్యతిక్రమాత్-సూర్యేణ చంద్రేణ చ లంఘనాత్. అత్ర చతుర్వింశత్యా పక్షైశ్చాంద్రసంవత్సరః చతుష్పంచాశదధికశతత్రయదినాత్మకః-పంచ షష్ట్యుత్తరత్రిశతదినాని, పంచదశఘటికాః ఏకత్రింశద్వినాడ్యః. త్రింశవక్షరాణి, సౌరసంవత్సర మానం - షష్ట్యధికశతత్రయదినాత్మక స్సావనసంవత్సరః తత్ర - ప్రతిజ్ఞానిర్వహణాదిప్రాయశ్చిత్తక్రియా స్సావనమానేనైవ నిర్వర్త్యాః - న సౌరమానేన - నాపి చాంద్రమానేన - తథేతి శాస్త్రనిశ్చయాత్ - తథాహి ॥ శ్లో॥ ఆయుర్దాయవిభాగశ్చ ప్రాయశ్చిత్తక్రియాశ్చ హి। సావనేనైవ కర్తవ్యా గార్గ్యస్య వచనం తథా॥ ఇత్యుక్తత్వాత్ - యథా సౌరచాంద్రమానయో రాంతరాళిక స్సావన

తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాం చ వ్యతిక్రమాత్ ।
పంచమే పంచమే వర్షే ద్వౌ మాసా వుపజాయతః ॥ ౩.
ఏషా మభ్యధికా మాసాః పంచచ ద్వాదశ క్షపాః ।
త్రయోదశానాం వర్షాణా మితి మే వర్తతే మతిః ॥ ౪.
సర్వం యథావ చ్చరితం యద్య దేభిః ప్రతిశ్రుతమ్ ।
ఏవమేవ ధ్రువం జ్ఞాత్వా తతో బీభత్సు రాగతః ॥ ౫.

(1) సీ॥ "రెండవయేట నొక్కొం డధికమాస మి ట్లెక్కినయన్నెల లెల్లఁ గూర్చి,
కొనఁ బదుమూఁడు హాయనములు తప్పక నిన్నఁటితోడనె నిండె నింత
యెఱిఁగియె తమపూన్కి యెల్లనుదీర్చితి, మని పాడుసూపె నర్జునుఁడు నేఁడు."

విరాటపర్వము. ౪ ఆశ్వాసము. 232 పద్యము.

ఈతిక్కనార్యునిపద్యమునుగుఱించి శాస్త్రిగారిట్లు వ్రాసిరి "...13 సౌర సంవత్సరములును నాఁటికిఁ (ఉత్తరగోగ్రహణమునాఁటికి) బూర్వదినముతో నిండినట్లు కనబడుచుండుటంబట్టి యీవ్యాఖ్యాన మాధారముగానో మఱియెట్లో తిక్కనార్యుఁడు 'నిన్నఁటితోడనె నిండె' ననుచునూఁదిపలికి సౌరమానమునఁ గాల నిర్ణయ మొనరించినట్లు కనఁబడుచున్నది." వ్యాఖ్యానమందు 13 సౌరాబ్దములును 'నిన్నఁటితో' నిండినట్లు గానరాదు, అందుచేత నది యాధారము గానేరదు. వ్యాసకృతమహాభారతమందలిపూర్వసందర్భములనుబట్టి యీభావమును గ్రహించి తిక్కన తెలుఁగుచేయుటలో వ్యక్తపఱిచెను. తిక్కనభావము సరియైనదని యీ క్రిందిపద్యములవలన స్పష్టముకాఁగలదు.

ఆంధ్రమహాభారతమందలి విరాటపర్వతృతీయాశ్వాసములో 107వ పద్యమందుఁ గృపాచార్యుఁ డిట్లు చెప్పెను.

ఉ. "వారలు పూనినట్లు వనవాసము సల్పిరి వీరు వేచి త
మ్మారయఁగా బయల్పడనియట్లుగ నుండెడు వత్సరంబును

---

స్సౌరమానేనసాకం సమీక్రియతే - తదా సౌరమాసగతావృద్ధి స్తత్ర లభ్యతే - తథైవ - సౌర చంద్రమానయో ర్విషయేఽపి - సామరస్యే క్రియమాణే త్రయోదశసు సౌరసంవత్సరేషుగతేషు పంచ చాంద్రమాసాః కించి దభ్యధికద్వాదశదినా న్యధికాని భవంతీతిజ్ఞేయం. ఏవ మేవ క్రమేణ సావనమానుసారోధేన గణనాయాం క్రియమాణాయాం - త్రయోదశ సౌరసంవత్సరపరిపూర్తేః-సపాదాష్టషష్టి దినేభ్యః పూర్వమేవ త్రయోదశ సావనసంవత్సరాణాం పరిపూర్తి స్సమగ్రతయా జాయతే. తస్మాద్యథావ చ్చరిత మిత్యాదినా - పాండవై ర్యథాప్రతిజ్ఞ మాచరిత మిత్యుక్తమ్.]

జ్జేరువచేరువ ల్గడచే............................"

దీనికి వ్యాసభారతమందలి మూలము.

"నివృత్తసమయాః పార్థా మహాత్మానో మహాబలాః."

ఆసందర్భమందే చివరను 131వ, పద్య మిట్లున్నది.

ఆ. "పాండురాజసుతులు పాంచాలియు నుదమ్ము, నోరులెఱుంగకుండ దిరుగవలయు

దుష్కరంపుటేడు దుది నేరఁబాటె నె,వ్వరును దీని దలఁపవలను లేర."

దీనికి మూలము.

"తతస్త్రయోదశ స్యాంతే తస్యవర్షస్య భారత

సుశర్మణా గృహీతం త ద్గోధనం తరసా బహు."

ఇంకను నొకసందర్భము. దక్షిణగోగ్రహణమందు విరాటుఁడు సుశర్మచేఁ గట్టఁబడియున్నసందర్భములో ధర్మరాజు భీమునితో నిట్లనును.

క. "తరువు వెసఁ బెఱికికొని నీ,వురవడిమైఁ గవిసి తేని నుభయబలము న,

చ్చెరువందుచుఁ జూచి వృకో,దరుఁడవగుట యెఱుఁగనున్న తద్విధ మేలా."

మూలము.

"మా భీమసాహసం కార్షీ స్తిష్ఠ త్వేష వనస్పతిః ।

మా త్వాం వృక్షేణ కర్మాణి కుర్వాణ మతిమానుషమ్ ॥

జనా స్సమవబుధ్యేర న్భీమోఽయ మితి భారత ।

అన్య దే వాయుధం కించిత్ ప్రతిపద్యస్వ మానుషమ్ ॥

దీనివలన దక్షిణగోగ్రహణమునాఁటికి సమయపూర్తి కానటులు స్పష్టము. మఱునాఁ డుత్తరగోగ్రహణమందు అర్జునుఁడు తన్నుత్తరునకెఱింగించుకొనెను. ఆసమయమందే భీష్మలవారును సమయాబ్దములు నిండెనని నిష్కర్షచేయుటచేత నిన్నఁటితోడన నిండెననుట సమంజసమే. ఈయభిప్రాయమే కన్నడభారతమందుఁగూడ నీసందర్భమున నిట్లు చెప్పఁబడియున్నది.

"మగనె, కేళ్గెరై దువరుష కె, మిగువువెరడేమాసమాసా

దిగళనవరనుభవిసిదరు హదిమూరువత్సరవ

మిగువవధిబుధరరియె నిన్ననహగలు నిన్నదు పాండుతనయరు

పొగువొడిందిన దినసవవరదు కంద కేళెంద ॥

(నిన్నఁటిదినము నీది ఈదినమువారిది యని తాత్పర్యము).

పూర్వార్ధమందు 10సం॥ లకు అధికమాసములు 26 అని చెప్పియుండుట చేత భాషాంతరీకరణము మూలమునకు విరుద్ధమని తెలియనగుచున్నది.

(2) "పదుమూఁడు హాయనములుతప్పక నిన్నఁటితోఁడనె నిండె" ననుచో హాయన మన, సావనసంవత్సరమా, సౌరసంవత్సరమాయనికొంతశంకించికొని రెండింటికిని రెండుసందర్భములను శాస్త్రిగారు చూపించియున్నారు. మూలమందు లేనిసావనసంవత్సరమును నొకదానిని వ్యాఖ్యానకర్త గార్గ్యవచనమాధారముగాఁ దనవ్యాఖ్యానమందుఁ జొప్పించినాఁడు. కాని యీవిషయ మెంతమాత్రమును మూలమందు భావింపఁబడలేదని నాయభిప్రాయము. కానఁ బ్రస్తుత మాచర్చ యనవసరము.

శాస్త్రిగారిపీఠికలో నిట్లున్నది. "మూలములోనీ 13 సంవత్సరములలోను 5 మాసముల 12 దినము లధికముగా వచ్చినవనియుండుటచే నవి చాంద్రమానాబ్దము లగుటంబట్టి క్రిందిపట్టికప్రకార మప్పటికి సౌరాబ్దములు పదుమూఁడు నిండుటకు 13 దినములు తక్కువయయినట్లు తెలియుచున్నది. ఎట్లనఁగా.

| | | | | ది ఘ |
|---|---|---|---|---|
| 13 సౌరాబ్దములకు దినములు | ... | ... | ... | 4748.15 |
| 13 చాంద్రాబ్దములకు 4602<br>5 మా. 12 ది. కు 159½ | ... | ... | ... | 4761-30 |

దీనింబట్టి భీష్ముఁడు చేసినకాలనిర్ణయమునాఁటికే 13 సౌరాబ్దములు నిండె నందుమా? ఈ 13సం॥లో మా. 5 ది. 12 లధికముగా వచ్చినవని చెప్పెడిమాట యువిరుద్ధ మగును" ఇందులకు సమాధానము మూలమునందే స్పష్టపఱుపఁబడియున్నది. "తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్ । పంచమేపంచమే వర్షే ద్వౌమాసా వుపజాయతః॥ దీనిభావము. సూర్యచంద్రులు నక్షత్రములను దాఁటుటలోఁ గలుగుహెచ్చు 5 సంవత్సరములలోను 2 మాసములు. అనఁగా 5 సంవత్సరములు సౌరమానము, 5 సంవత్సరముల చాంద్రమానముకంటె 2 మాసము లధికమని. దీనినిబట్టిచూడఁగా భారతకర్తకాలమునాఁడు సౌరచాంద్రమానములయొక్క సర్దుబాటిట్టిది యని స్పష్టము. ఈ 5 సంవత్సరములకాలమునకును యుగమని పేరు (వేదాంగజ్యోతిషమందు) అప్పటి

గణితపద్ధతినిబట్టి ఈయుగము 62 చాంద్రామాసములకు సమానము. ఒకచాంద్ర మాస మనఁగా ది. 29 గడి. 31 వి. గ. 50 అక్ష. $7\frac{1}{2}$.*

62 చాంద్రమాసము లనఁగా 1830·90 దినములు (ది. 1830 గంట 21 ని. 30 సె, 56) ఇది 5 సౌరసంవత్సరములకు సరియని మూలము వ్యక్తపఱుచు చున్నది కనుక నొకసౌరాబ్ద మనఁగా 366.2 దినములు (ది. 366 గం. 4 ని. 18 సె. 11) అని మూలమునుబట్టి మనము గ్రహింపవలసియున్నది. ఇది 365·25 దినములకంటె (వ్యాఖ్యాత సూర్యసిద్ధాంతమునుబట్టి ఇచ్చినగడువు కంటె) రమారమి యొకదిన మధికమని స్పష్టము. అందుచేత సౌరసంవత్సరము నకు మూలముప్రకారము మన యొకదినము వృద్ధి గట్టుకొనవలసియుండఁగా శాస్త్రిగారు సూర్యసిద్ధాంతప్రకారము లెక్కగట్టియున్నారు. అందుచేతనే 13 సంవత్సరములకును 13 దినములు శాస్త్రిగారికిఁ దక్కువవచ్చినవి.

కాని యీసందర్భమున సౌరసంవత్సరమునకు $365\frac{1}{4}$ దినములగుట సార్వకాలికసత్యమైయుండఁగా నపుడుమాత్ర మొకదిన మధికముగా నెట్లుగలుగు నని సంశయము గలుగకమానదు. నిజమే, కాని దీని కిట్లు సమాధాన మరయఁ దగును. ‘ఎన్నిసంవత్సరముల కొకయధిమాసము వచ్చునండీ’యని మనమిప్పుడు సిద్ధాంతులను బ్రశ్నించిన ‘మూఁడేండ్ల కొకసారి’ యని వారు సాధారణముగాఁ బ్రత్యుత్తర మిత్తురు. మనము దీనినే సిద్ధాంతముగాఁ దీసికొందుము. ఏమని? 3 సౌరసంవత్సరములు 37 చాంద్రమాసములకు సరియని. పైని జెప్పినప్రకారము 37 చంద్రమాసములును 1092·6 దినములకు సరి. అందుచేత ఒకసౌర సంవత్సరము $\frac{1092·6}{3}$=364·2 దినములకు సరియని తేలుచున్నది. ఈగడువు 365·25 దినములకంటె రమారమి ఒకదినము తక్కువగదా? కనుక 3 సంవత్సరములకు 1 మాస మధికమనునది లెక్కసౌకర్యముకొఱకుఁ జెప్పెడిమాటగాని సరియైనది గాదు. అట్లుచెప్పుటచేత 18 సంవత్సరములు గడచుసరికి, చాంద్రసంవత్సరాది సౌరసంవత్సరాదికంటె రమారమి 18 దినములు ముందగును. ఒకసౌరసంవత్స

* దీనిగడవునకును పాశ్చాత్యులశాస్త్రసమ్మతమైనదానికిని వ్యత్యాసము లేదనియే చెప్పవచ్చును. మనవారు చాంద్రమానమును తిథుల గట్టుటకై యుపయోగించుచు, అందు ఈషద్భేదముకూడ రాకుండుటకై శ్రమపడి, అంతటిచిరకాలమునందుఁగూడ, ఈచాంద్రమానపుగడువును ఏహెచ్చు తగ్గును లేకుండఁగట్టియున్నారు. చంద్రగతియందలి ప్రాముఖ్యము వారికి అట్టిదియై యుండెడిది. ధర్మకర్మములకుఁ జాంద్రమానము ముఖ్యాధారముగ నుండుటచే లెక్కయందు వారి కంతదీక్ష యుండెను.

రము చాంద్రసంవత్సరముకంటె సుమారు 11 దినము లధికమగుటచేత 19 సౌర సంవత్సరములు పూర్తియగునాఁటికి 19 చాంద్రసంవత్సరములు పూర్తియై(18+11) సుమారు 29 రోజు లగును. కనుకనే 19వ యేఁటఁగూడ నొకయధికమాసము వేసికొని 19 సౌరసంవత్సరములకు 7 అధికమాసములని రెండులెక్కలను సరి చూచుకొనుచున్నారు. ఈలాగుననే సులభముగాఁ బ్రజలకుఁ దెలియుటకుఁ గాను 5 సంవత్సరములకు 2 అధికమాసము లని నాఁటివారు లెక్క ఉజ్జాయింపుగాఁ జెప్పెడివారుకయు, అట్లే పంచాంగములు గణించువారుకయు నుండ వచ్చును, మూలమందలిలెక్కప్రకారము 30 సంవత్సరము లగునాఁటికిఁ జాంద్రమానమందు రమారమి 30 దినము లధికమగును గనుక 6వ యుగాంత మందు ఒకయధికమాసము వారు తగ్గించుకొని రెండుమానములకును లెక్క సరిచూచుకొనియే యుండియుందురు. అనఁగా 30 సౌరసంవత్సరములకు 11 అధిక మాసములే చూచికొనియుండియుందురు. ఇది బహుకాలమునాఁటి అధికమాస గణనపద్ధతి. ఇదియే వేదాంగజ్యోతిషపద్ధతి. దీనినిగుఱించి దివానుబహద్దరు స్వామికణ్ణుపిళ్లగారు విపులముగా వ్రాసియేయున్నారు. ఆసక్తిగలవారలను 'The Vedanga Jyotish—Examples of Yuga, Cycle and Exeligmos' The Vedanga Jyotish Calendar.' అనురెండువిషయములగుఱించినభాగములను జూ డుఁడని ప్రార్థించుచు ఈవిషయమును నిలుపుచున్నాను.

కనుక 'పంచమేపంచమేవర్షే...'యను మూలమునుబట్టి పాండవులసమ యకాలమందు 6 మా. 12 ది. లధికముగాఁ దప్పకవచ్చియున్నవి. కావున పాం డవాజ్ఞాతవత్సరవ్యాప్తినిగూర్చి సంశయ మక్కఱలేదు.

(3) మఱియు శాస్త్రిగారు "పంచమేపంచమేవర్షే......'యను దానిని వ్యాఖ్యాతయుఁ దిక్కనార్యుఁడుఁగూడ గ్రహించినట్లు కానరాదు" అని వ్రాసి యున్నారు. వ్యాఖ్యాత గ్రహించినాఁడని నాయభిప్రాయము. ఏలయన సావన మానము సౌరచాంద్రమానముల అంతరాళిక మనిచెప్పి, చాంద్రమానమున సంవత్సరము (స్థూలమున) 354 దినము లనియును, సావనసంవత్సరము 360 దినములనియును జెప్పుటచే సౌరమానము + 360 = $\frac{354+366}{2}$ గనుకనే అంత రాళికముననంవత్సరము 366 దినములని గూఢముగాఁ జెప్పియే యున్నాఁడు. ఇదియంతయు స్థూలదృష్టి నిచ్చినలెక్క. (సరిగా గణించినచో) 13 సంవత్సర ములు గతించునాఁటికి 5 మా. 1½ది.లు చాంద్రమానమున హెచ్చువచ్చునని తెలిసికొనఁదగినదిగా వ్రాసివిడిచినాఁడు. కావున వ్యాఖ్యాత యంత విస్పష్టముగా వ్రాయలేదుగాని గ్రహించెననుటకు సందియములేదు. "రెండవయేఁట నొకఱెం డధిమాసము" అని మూలములోను వ్యాఖ్యానములోను, లేనివిషయ

మేల తిక్కన వ్రాసియున్నాఁడని యాలోచింపఁదగియున్నది. దీనికి సమాధానము నాకుఁ దెలిసినంతవఱకు వ్రాయుచున్నాను. మూఁడు సంవత్సరములకు సాధారణముగా నొకయధికమాస మనెడు తనకాలపులెక్కను 5 సంవత్సరములకు రెండధిమాసములను మూలమందలి లెక్కతో సమన్వయించుకొనుటకై యిట్లు వ్రాసియుండవచ్చును. పాండవులరణ్యావాసమునకు బయలుదేరినది యొక సంవత్సరాంత్యభాగ మనుకొని మఱునటిసంవత్సరమందు అధికమాసమనుకొనినఁ గాని రెండింటికిని సమన్వయము గాదుగనుక తిక్కన దీనిగురించి యాలోచన చేసియే యుండవచ్చును. కాని మూలము ననుసరించి 5 మా. 12 ది లధిక మెట్లువచ్చునో యది యాంధ్రీకరణమందు స్పష్టపఱుప లేదు. ఇంతమాత్రమున మూలముయొక్క యర్థమును గ్రహించియుండలేదని మన మెట్లు చెప్పనగును. పై రెండువిషయములకు సమన్వయముచేయుపద్ధతికి నుదాహరణ మొకదానిని సూచించుచున్నాను. పాండవులు ప్రభవసంవత్సరమాఘశుక్లమం దరణ్యమునకు పయనమై రనుకొని యీక్రిందిపట్టికను వ్రాసితిని.

| సంఖ్య | వత్సరముపేరు. | అధిక మాసము. | పాండవుల సమయకాలపోయనములు. |
|---|---|---|---|
| 1 | ప్రభవ ... | లేదు. | ఆంగిరసమాఘ శుక్లమునకు 5 ఏండ్లసమయకాలము పూర్తియగును. అందు రెండధికమాసములును వచ్చినవి. |
| 2 | విభవ ... | జ్యేష్ఠము. | |
| 3 | శుక్ల ... | లేదు. | |
| 4 | ప్రమోదూత ... | ,, | |
| 5 | ప్రజోత్పత్తి ... | ఆషాఢము. | |
| 6 | ఆంగిరస ... | లేదు. | |
| 7 | శ్రీముఖ .. | ,, | ఈశ్వర, మాఘశుక్లమునకు 10యవ సమయాబ్దము నిండును. ఈ 5 సంవత్సరములలోను గూడ రెం డధికమాసములు వచ్చినవి. |
| 8 | భావ ... | శ్రావణము. | |
| 9 | యువ ... | లేదు. | |
| 10 | ధాత ... | ,, | |
| 11 | ఈశ్వర ... | భాద్రపదము. | |
| 12 | బహుధాన్య ... | లేదు. | విక్రమ, శుక్లములో 13 సమయాబ్దములును నిండను. ఈ మూఁడేండ్లలో నొకయధికమాసమున్ను వచ్చినది. మొత్తమున. 5 అధికమాసములు వచ్చినవి. అధికదినములను సూచింపలేదు. |
| 13 | ప్రమాది ... | ,, | |
| 14 | విక్రమ ... | ఆశ్వీజము. | |

విస్సా. అప్పారావు,

అనంతపురము.

గూర్చుండనియమించి కస్తూరి గంధపరిమళతాంబూలంబు లొసంగి శ్రీమత్ప్రితాపవీరరుద్రుండు వారలతో నిట్లనియె. వింటిరే మొన్నటిఆశ్చర్యంబు. దేవునిపై బందిపోటుబడిరి. ఈ రేయి విప్రునిపై బందిపోటుబడిరి. రాజ్యం అనాయకంబుగా నున్నది. ఇందులకార్యంబు తెరం గెరిగింపుడనుటయు వారలందరు ఏకగ్రీవంబుగా నిలచి చెయ్యెత్తి యిట్లనిరి. నీవు సాక్షాత్తు రుద్రుండవుగాని మనుష్యమాత్రుండవు గావు. నీ వేరీతిచేసిన అదియు మాకు సమ్మతం బనిన ఆరాజు విచారించి గణపతిమహారాజు నానావర్ణంబులవారికి నాయకత్వం బిచ్చుటంజేసి బహునాయకం బైయున్నది గనుక మొక్కపోయెను. ఇందుకు తగిన యుత్తమజాతులువారు గాని నాయకత్వంబులకు అర్హులు గారని రా జిట్లనియె. వెల్మలును మానధనులును విశ్వాసపరులును నీతివివేకసంపన్నులును గాంభీర్యసముద్రులును వివేకదక్షులును పాపభీతులును స్వామివిహితోపచారులును నగుసముద్రులును పద్మనాయకులును వారలకు నాయకత్వంబులకే తగుదు రని శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు ఎరుంగంబల్కిన సభాసదులు రాజునడవడివివేకంబులకు ఎంతయుఁ గొనియాడి యిట్లు మాకు సమ్మతంబు చేయుమనుటయు. ఆప్రతాప వీరరుద్రుండు పద్మనాయంకులను భట్లు శివదేవరాజు మల్లికార్జునరాజు వీరదేవ రాజు విశ్వదేవరాజు మొదలైనభట్లు రాజులు పిలిపించి వారికి వీరికి సమానబహుమానాలు ప్రమాణోక్తిగా పంక్తిని గూర్చుండేనిర్ణయం చేసిఅదివరకు ఇచ్చిన భాగములో మీకుసగము భాగము అని యిచ్చి అప్పుడు శ్రీమత్ప్రతాపవీర రుద్రుండును భట్లురాజులును పద్మనాయంకులును ఒక్కపంక్తిగూర్చుండి భోజనంబులు చేసి బహుమానించిఅందుకు నాయకత్వంబునకు అర్హులుగా ఏర్పరిచి ఒకొక్కకొత్తడంబునకు ఒక్కొక్కరిని సర్వలక్షణసంపన్నునిగా ఏర్పరిచి వారలకు ధనకనకవస్తువాహనాందోళికలను చీనిచీనాంబరంబు లొసంగి మరియు ఛత్రచామరంబులును ఆలవట్టంబులును సాహసకృత్యంబు లగుబిరుదు లొసంగి డెబ్బదియేడుగోత్రంబుల డెబ్బదియేడుగురను ఇట్లు బహుమానంబుజేసి వారలకు

ఏకశిలానగరంబునకు శిలాప్రాకారంబు వారలకు డెబ్బదియేడుకొత్తడంబు లుం డుంటం జేసి వారిబంధువులను పద్మనాయంకులం జేసి పుట్టకోటకొత్తడంబుల నుం డంజేసె మరియు డెబ్బదియేడుగురునాయకులకును తనరాజ్యంబులో ఒక్క భాగము పంచియిచ్చి ఒక్కభాగంబు బంధువులకును, ఒక్కభాగంబు తమమూల బలంబులకును, ఒసంగి ఒక్కభాగంబు విప్రులకొసంగి తనవశం బైనతనరాజ్యంబు తనభండారంబునకు చెల్లం జేసి రాజ్యంబున చోరబాధాదికంబులు లేకుండునట్లుగా మహామహిమతో పాలింపుచుండె. సప్తసంతానంబులు దరియించి హేమాద్రి కల్పోక్తప్రకారంబున సకలదానంబులును జేసి ప్రతివర్షంబున పన్నెండుతులాభారం బులు తూగి కోటిసువర్ణంబులు దానంబుసేయుచు దిగ్విజయంబుసేయుటకు సకల సేనల రావించి ప్రయాణభేరి వేయించి మొదట కటకవల్లభునిపై గదలి వాని సాధించి వానిసుతునికి పట్టంబుగట్టి యెప్పటియట్ల మూడుకోట్లసువర్ణటంకంబులు అప్పనంబులుగైకొని సేనాయుక్తముగా తనవెంట రానియమించి దక్షిణాభిము ఖుండై సముద్రతీరంబునకున్ జని గోదావరి యుత్తరించి రామేశ్వరముపర్యంతము గలపురంబులు తనవశంబుజేసికొని రెండువెయిల ఓడల రావించి అందుకు తగిన వర్తకుల నియమించి నానాదేశంబులకు వ్యవహారంబుచేయం బనిచి అందుల ద్రవ్యంబు తనభండారంబునకు రాజేసి రామేశ్వరునిసేవించి అచ్చట పెక్కుదానం బులుచేసి నాల్గుతులాభారంబులు తూగి తామ్రపర్ణిని ఉన్నసమయంబున విజయ నగరంబునుండి వీరనృసింహరాయులు అమూల్యాభరణచీనిచీనారంబులు కాను కగా తెచ్చి సమర్పించిన సంతోషించి యతనిగారవించిన. ఆనరపతిరాయలగు తనమేనల్లుడగు నృసింహరాయల దళవాయింజేసి పన్నెండులక్షలపదాతి వర్గం బులు కానుకగా బట్టిన సంతోషించి రాయలు విజయనగరమునకుం జనుటయు.

ఆప్రతాపరుద్రుండు ఆడుమండలం బేలుముకుందాదేవిని నోడించి యెను భయినాల్గులక్షలసువర్ణనిష్కంబులు అప్పనంబులుగొని తనవెంటరా నియమించి కొంకణతెంకణమలయాలబాహ్లీకదేశాధీశులం గెలిచి వారివారిచే పదిలక్షలు అప్పనంబులుగైకొని వారిని తనవెంటరా నియమించి పశ్చిమదేశాధీశులం గెలిచి వారిని తనఆజ్ఞకు లోనుజేసికొని యాభయిలక్షలసువర్ణ నిష్కంబులు అప్పనం బులు పుచ్చుకొని వారు మూడులక్షలగుర్రంబులతో తన్నుగొలువ సౌరాష్ట్ర దేశాధీశ్వరుల నోడించి వారిచే అప్పనంబులుగొని మరియు తక్కినరాజుల గెల్చుచు వారిని తనఆజ్ఞకు లోనుజేసుకొని వారి సేనాయుక్తంబుగా తనవెంటరమ్మనుటయు.

అంతట పూర్వదక్షిణపశ్చిమభూములు తనఆజ్ఞకు లోనుజేసుకొని ఢిల్లీశ్వరుండు తనకెదురుగా బంపినకానుకలు గైకొని సంతోషించి భాగీరథీస్నానంబు జేసి గంగాయమునానరస్వతీసంగమంబున కృతస్నానుండై పెక్కుదానంబులు చేసి యెనిమిదితులాభారంబులు తూగి ప్రయాగకేతెంచి ఆప్పట్టణంబు తనవశంబు చేసుకొని ఆపురంబునం గలమాధవదేవునివైభవంబున కాపురంబిచ్చి సేవించి యంతట కాశికిం జని మణికర్ణికయందు మునింగి విశ్వనాథుని సేవించి కాశీనగరంబు విశ్వనాథున కొసంగి అచ్చట పన్నెండుతులాపురుషంబులు తూగి కోటిసువర్ణంబులు దానంబులు చేసి ఉన్నంత నిజభుజపాలితంబు లైనదుర్గంబుల కొలది యెరింగించెద.

అటతాళిసహస్రచక్రకోలాధీశ్వరబిరుదును, శుద్ధసువర్ణసింహాసనబిరుదును, సాధించి మరియు గయకుం జని యాసుల్తానుచే పూజితుండై అచట భూసురులజనంబులచేతను పితృపితామహప్రపితామహులకును మాతామహులకును విహితకృత్యంబులు చేయించి మగుడ వింధ్యానగరంబుదాటి గోదావరి త్రికూటంబునకు ప్రవేశించి యచట విధ్యుక్తప్రకారంబుగా పన్నెండుక్రతువులు చేయించి కాళేశ్వరంబున కేతెంచి ముక్తీశ్వరు దర్శించి పన్నెండుతులాభారంబులు తూగి కోటిసువర్ణంబులు దానంబులుచేసి రెండువేయిలవిప్రులకు పెండ్లి చేసి వెయ్యిశివాలయంబులు కట్టించి యేనూరులక్ష్మీనారాయణగోపాలనిలయంబులును ప్రతిష్ఠచేసి యేకశిలానగరంబునకు ఈశాన్యభాగంబున ప్రతాపగిరి యను దుర్గంబు గట్టించి అక్కడ కొన్ని దేవాలయంబులు కట్టించి అంతట మాద్గల్యంబునకు వచ్చి యగ్గుండంబున స్నానంబుచేసి రామేశ్వరు నారాధించి ఉన్నతంబుగా గుడియు గట్టి మరియును పాఖాలసీమలో ఒక్కతటాకంబు గట్టి నలుబయి గ్రామంబులు రామేశ్వరున కొసంగి యెనిమిదితులాభారంబులు తూగి కోటిసువర్ణంబులు దానంబులు చేసి యేకశిలానగరంబునకు వచ్చుసమయంబున తనతమ్ముండైన అన్నమదేవుండు రాజ్యభారంబు పన్నెండువర్షంబులు పాలించి ప్రతాపరుద్రునకు యోజనవిస్తారంబుగా ఎదురేగి దండప్రణామంబులు చేసి ముకుళితహస్తుండైన. తమ్మునింజూచి కౌంగిలించుకొని. కుశలంబడిగి పురజనంబుల గారవించి సంతోషచిత్తుండై పురంబుప్రవేశించి శంభులింగంబును నారాధించి.

తదనంతరంబున సింహాసనాసీనుండై కూర్చుండి తనవెంటవచ్చిన నానాదేశంబులవారికి బహుమానంబులు చేసి నిజనివాసంబులకు బనిచి అంతః

పురంబునకుఁ జని తనతల్లి యైనయమ్మక్కమహాదేవికి సాష్టాంగదండప్రణామం బులుచేసి ఆయమ్మచేత దీవెనలు గైకొని భోజనశాల కేతెంచి మజ్జనభోజనాదులు దీర్చి సుఖసుప్తుండై యున్నయెడ. మహాధర్మంబులచేత చాతుర్వర్ణంబులు చేయు చుండ. అంత విశాలాక్షిలోలాక్షియందు విరూపాక్షుండు వీరభద్రుండు నను నిద్దరుతనయుల గాంచుటయు. ఇంద్రవైభవంబున మహామహిమతో రాజ్యంబు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు పాలింపుచుండు ఏకశిలానగరంబు నలకాపురీ సమా నంబయియుండె.

ఈనగరంబునం గలనానావర్ణసంఖ్య చెప్పెద. వేదవేదాంగపారాయణు లగు విప్రగృహంబులు పద్దెనిమిదివేయిలు. రాజుద్వారంబున పనులుదీర్చుగణ కులయిండ్లు నాల్గువేయిలు. రణరంగచతురు లైనక్షత్రియులనికేతనంబులు పదు నాల్గువేయిలు. సకలసామగ్రివస్తువులు గలవైశ్యగృహంబులు నలుబయివేలు. ఇంనుకు ప్రసద్ధులు కోటికి పడగెత్తినవైశ్యులు యేనూటడెబ్బయితొమ్మిదియిండ్ల వారు. నాల్గవజాతిశూద్రులు కాపుఇండ్లు ఇరువయివెయిలు. పద్మనాయకులు డెబ్బయియేమగురు. పాచకులయిండ్లు వెయ్యినేనూరును. మరియు అష్టాదశ వర్ణంబులవారి గృహంబులును పంచలోహప్రముఖ గృహంబులును రెండలక్షల యాభయివేలయిండ్లు. అనవరతసంపూర్ణం బైనగొల్లయిండ్లు పన్నెండువెయిలు. కుమ్మరయిండ్లును మూడులక్షల నిజగృహంబులు. గాండ్లతెల్కలయిండ్లు పద మూడువెయిలనేనూరును. నిజశాలయిండ్లు పద్దెనిమిదివెయిలనేనూరు. ముద్దకమ్మర యిండ్లు పదివెయిలయేనూరును. మహేశ్వరయిండ్లు నలుభయివెయిలఆరునూర్లును. గాండ్లయిండ్లు ఎనిమిదివేయిలమున్నూరును. చిత్తారవ్రాసేయిండ్లు రెండువెయిలయే నూరును ఉప్పరయిండ్లు ముప్పయివెయిల ఆరునూర్లును. చిప్పమేరయిండ్లు పది హేనువెయిలు. మేరయిండ్లు దాసమయ్యమేదరప్రసాదకు లైనయిండ్లు పన్నెండువె యిలు. రుద్రజియ్య మొదలైనశివవిప్రులయిండ్లు ముప్పయివెయిల ఆరునూర్లును. బుక్కయిండ్లు ముప్పయివెయిల ఆరునూర్లును. పెరికెకరణయిండ్లు పదహారువెయిలు. బలిజసదనంబులయిండ్లు నాల్గువెయిలు. ముచ్చయిండ్లు పదమూడువెయిలు. తెన్గు ఇండ్లు ఆరువెయిలనన్నూరును. బేస్తయిండ్లు ముప్పయిరెండువెయిలు. మేదర యిండ్లు నాల్గువెయిలు. రజకులయిండ్లు ఆరువెయిలు. క్షౌరకులయిండ్లు నలుభయి వెయిలు. నడుమనడుమ ఆరణ్యవస్తువాహనశోభితం బైనచిల్లరవైశ్యగృహంబులు ఆరువెయిలు. ప్రవాసు లైనవారికి వండిపెట్టే అలీకర్కగృహంబులు ఆరువెయిలు.

సంగరయిండ్లు ఆరువేలయేనూరును. మరి యితరపరిచారకగృహంబులు లెక్కయెన్న కొలదిగాదు. శివాలయంబులు అయిదువేలయేనూరును. విష్ణుస్థానంబులు నాల్గువేయిలయేనూరును. దుర్గ, మహాలక్ష్మి, భద్రకాళి, వైష్ణవి, వారాహి, చండిక, మహిషాసురమర్దిని, విజయ, భ్రమరాంబ, వీరుమొదలైన దేవీభవనంబులు వెయ్యినేనూరును. వినాయకవీరభద్రనిలయంబులు రెండువెయిలు. మైలారుదేవరభైరవులు, ఊరిశక్తులు పదినూర్లును ఇండ్లు ప్రసిద్ధస్థానాలు. భేరీ, యేనూటయేబదియును. నిషాణంబులు రెండువెయిలనేనూరును. ఇతరమహాపంచమహాశబ్దాలు మొఱయుచుండును. గుళ్లమీఁదపసిడికుండలు అయిదువెయిలనేనూరును. దేవస్థానంబులదీపాలకు తైలంబు దినంబును కొలపాటి యరువయియెదుపుట్లును. నగిరిలో దీపాలకును నిత్యబ్రాహ్మణులసంతర్పణలకును ఘనసారశ్రీచందనపరిమళద్రవ్య అక్షతదక్షిణతాంబూలాదులకును నిత్యంబును పదివెయిలవరహాలును. నగరిలో భాగీరథీజలంబులను గౌతమీజలంబులను శ్రీశంభులింగంబును సాహస్రబిల్వదళపూజయు, వాసనపుష్పంబులును పూజించి, నిత్యమును మహానైవేద్యంబు. యోజనవిస్తారం బైనపురంబునకు నానావస్తుశోభితంబైనఅంగళ్లు మున్నూరును. పిన్నఅంగళ్లు మూడువెయిలమున్నూరును. గూడెంబులు రెండువెయిలయేనూరును. ఇట్లు ఇంద్రపురంబుసమానం బైనయేకశిలానగరంబున కధీశ్వరుం డైనకాకతిరుద్రుని గొల్చియున్ననానా దేశాధిపతులు అనుసరింతురు. పద్మనాయకులు డెబ్బయియేడుగురును. మల్లికార్జునభట్లు, మల్లికార్జున, త్రిపురాంతక, మహాదేవ, విరూపాక్ష, నారాయణ, వాసుదేవ, జనార్దన, పద్మనాభ, రామకృష్ణ, బ్రహ్మవిద్యాంసులు మొదలయినవారు బంగారుపల్లకీలు ఎక్కి చనుదెంచువారు నూటయేబదియును. సకలకథాప్రవీణులయినపరిహాసకులు వరదరామనాథుండును, లోకబాచయ్య మొదలయినవారును ఎనమండ్రును; శంకరరాజు నారాయణరాజు, కేదారరాజు, రామరాజు మొదలైనసాహసవిక్రమార్కులు ఉత్తమక్షత్రియులు ఏనూరును, దివ్యకాంతలం బోలిన నవరత్నఖచిత మైనపాల్కి లెక్కి చనుదెంచువారాంగన కొలువుకు చనుదెంచువారు, శ్రీగిరిమల్లికార్జును, కాళేశ్వరగంగు, జలరుహనేత్రి, చిత్తారుప్రమితె, బింబోష్ఠ, కంబుకంఠి, హంసయాన, పల్లవాధరి, హరిమధ్య, చకోరాక్షి, వీరుమొదలయిన కొలువుస్త్రీలు ఇన్నూరును; మరియు నాట్యంబునేయు బిరుదుపాత్రలు భరతకళ, అంబాదేవి, సర్వమంగళ, చక్రవర్తి, చిలుకపలుకులత్రిపురారి, గొరెంకపలుకుల

నాసుదేవి, కోకిలస్వరకమలాక్షి, చిత్తరిచూపులపద్మాక్షి, వీరు మొదలైన పాత్రలు ఎన్మిదినూర్లును. భాస్కరుడు మొదలయిన కవీశ్వరులు ఇన్నూరును; గుండంభట్లు, ప్రతాపభట్లు, బ్రహ్మంభట్లు, నారాయణభట్లు, శంకరభట్లు, పురందరభట్లు, యజ్ఞంభట్లు, వామనభట్లు, మహేశ్వరభట్లు మొదలైనవేదవేదాంగపారాయణాంగు లగురాజపురోహితులు నూర్గురును; వందిమాగధస్తోత్రపాఠకులు మున్నూరును; మరియు నానాదుర్గాధీశ్వరు లయినదేశాధిపతులు పద్మనాయకులు మదగజంబులపై నెక్కి మౌక్తికచ్ఛత్రచామరంబులు విలసిల్లుచు బిరుదుటెక్కెంబులును బిరుదుకాహళంబులును వరభటభయంకరార్భటంబులును పరభూపతులకు భయంకరం బగునట్లుగా సకలసేనాసమేతులైనవారును; శ్రీరంగమదేవుండును, రాయసముద్రదేవుండును, పెనుకూచిరుద్రమదేవుండును, నిడదవోలుచంద్రాదేవుండును, ఇందులూరి అన్నమదేవుండును; వీరలకు పెద్దనాయకుల జెప్పెద. విశ్వనాథుని రామువెంక, ఝూట్టినాథుని రామువెంక, గోగులవారి మల్లువెంక, కోడూరి రామువెంక, వీరు మొదలయినవెంకు నాయంకులు మూడులక్షలపదాతివర్గంబులతో పురంబులు కూడెంబులు గాచుచుండేటి పెద్దతలారియగు నిశ్శంకువల్లభుండును; మరియు నానాదేశాధిపతులును, రాయబారులును, గజంబులపెద్ద అయిన మహాంకాళిదొరయును; అశ్వంబులకు పెద్దయయిన సాహిణిమారయ్యయును; నవలక్షధనుర్ధలకు పెద్దయయిన కొలిపాక సిద్దయ్యయును; మనుబోతులకు పల్లాలుగట్టువారు మున్నూరును; నానావిద్యలవారు కొలువుసేయంగాను. పైడిబెత్తంబులవారు బారసూకుచు వెండికుప్పెలవారు, పైడికుప్పెలవారు పైడిఝల్లులవారు వెండిగొడుగులవారు, అయిదువేయిలు గలిగి పేరోలగంబున గూర్చుండి దేశాధిపతులవిన్నపంబు లంగీకరింపుచు రాయబారులమనవులు పాలించుచు రాజ్యపరిపాలనంబు సేయుచు, దేవదేవుండును శశిభాంకుండును మల్లికార్జునుండును శంభుదేవుండును పాలకుర్తిసూరపదేవుండును వీరు మొదలయినప్రధానవర్గంబుతో ముచ్చటాడుసమయంబున, ఈశ్వరస్థానంబుల దేవస్థానంబుల దుర్గగణపతివీరభద్రస్థానంబుల గల్గుఅధికారులు పచ్చలపల్లకీ లెక్కివచ్చి దేవతానైవేద్యంబు చెల్లెనన వాక్యంబువినియును సింహాసనంబుడిగ్గి అంతఃపురంబునకుఁ జని భోజనశాల కేతెంచి తనబంధువులును తానును దేశాధిపతులును తనతమ్ముం డైన అన్నమదేవుండును డెబ్బదియేడుగురు పద్మనాయంకులును వందిమాగధస్తోత్రపాఠకులును ఒక్కపంక్తిగా గూర్చుండి షడ్ర

సోపేతంబైన నానావిధపదార్థంబులను వెయ్యిన్నేనూటిశిరోహాడా భోజనంబులు చేసి సుగంధంబులగు జలంబుల కరంబులు కడిగి కర్పూరవీడియంబులు సకలజనంబుల కొసంగి వారలందరిని అనిపె. ఒక్కరమ్యహర్మ్యంబున తూగుటుయ్యాలపై నిలిచి సేవకజనంబులు పాదంబులొత్తుచుండ దాసదాసీజనంబులు మూడువేల యేనూరును గలిగియుండె. అంతట ప్రతాపరుద్రుండు లులాయ వ్యాఘ్ర భల్లూక గజ యుద్ధంబులును, ఝెట్టిమల్లుల పెనంగులాటలును, సరసకావ్యనాటకాలంకార బహుశబ్దశాస్త్రాధికారంబులవారు హాస్యవచోవిశారదులైనవారి పరిహాస వాక్యంబులును పుణ్యకథాశ్రవణంబులును నానాంగనానృత్యగీతవినోదంబులును ఇవి యాదిగాగలచిత్రవినోదంబుల ప్రొద్దుపుచ్చుచు సాయంకాలం బగుటయు; నగరువెళ్ళివచ్చుసమయంబున కాకతిరుద్రునకు అవసరంబులకు వచ్చుకర దీపికలు మూడువెయిలయేనూరును నాల్గుదిక్కుల గొల్చిరా నిజపరివారసమేతుండై స్వయంభుమూర్తి యగుజ్యోతిర్మయం బగుశ్రీశంభులింగంబునగరికిం జని శంభులీలావిలాసంబులు సదువుచు ప్రదక్షిణత్రయంబు గావించి శంభులింగంబునకు సాష్టాంగదండప్రణామంబులు చేసి కొనియాడుచు ఒక్కయామంబు ఆరాధించి యచటవారు నగరికేతెంచి సకలజనంబులను జీతంబులకు బనిచి పెద్దతలారి యగు నిశ్శంకవల్లభుండు పరివారసమేతంబుగా రెండుగడియలు కొలువుచేసి తదనతంరంబసమస్తజనంబుల నిజనివాసంబుల కనిచి తానును అభ్యంతరవర్తియయ్యె.

ఇట్లు రాజ్యభోగంబు లింద్రవైభవంబులుగా ననుభవింపుచు శ్రీభవానీశంకరపూజయు శ్రీలక్ష్మీనారాయణపూజయు, దేవబ్రాహ్మణపూజయు నిత్యంబు జేయుచు. మరియు ననేకతటాక నారికేళ చూత తింత్రిణీ కపిత్థ జంబూక కదళీ బిల్వ వననిర్మాణంబులును అగణ్యపుణ్యంబులను సలుపుచున్నంత శ్రీమత్ప్రతాప వీరరుద్రునకు జెల్లినభూములు. ఉత్తరదేశంబునకు భాగీరథీయమునలు, పూర్వ దక్షిణపశ్చిమంబులకు సముద్రంబును మేరయు తనయాజ్ఞకు చెల్లుచుండె, చక్రవర్తియునై పదిహేడో రాజునై రాజ్యంబేలుచుండె. అందులఅప్పనంబులు ఇచ్చు దేశంబులు. కటకవల్లభుండు లోనుగాగలచిల్లరరాజులు ప్రతివర్షంబును ఇచ్చు అప్పనంబులు ఇరువయినాల్గుకోట్లు. తనభూమిపాలితంబైనరాజ్యంబువలన వచ్చు ధనంబు ఇరువయికోట్లు. ఇవిగాక అగ్రహారంబులు బ్రాహ్మణులకు చెల్లుచుండె నాల్గువెయిలు. దేవతావైభవంబులకు రెండువెయిలగ్రామంబులు చెల్లుచుండె. ఇదిగాక తనభండారంబునకు వచ్చుచుండునట్లు నాలుగుకోట్లు.

ప్రతివర్షంబు తులాపురుషంబులకు మూడుకోట్లయేబయిలక్షలు. నిత్య వైభవంబునకు పరిమళగంధ కర్పూర కాశ్మీర, జవాజి, పరిమళంబులకు, పంక్తి భోజనంబులకు, నగరిదీపాలకును, నానాదేశంబులనుండివచ్చు విద్యార్థులకును పంచిపెట్టినద్రవ్యంబు ప్రతివర్షంబును మూడుకోట్లఅరువయిలక్షల యిరువయి వేలు. నగరు గాచునిశ్శంకవల్లభునకు జీతము ప్రతివర్షమును భటసహితంబుగా ఎనుభయియెనిమిదిలక్షలయరువయివేలు. అన్నసత్రంబులగణుతి ఒక్కొకసత్రంబునకు వేయింటికొప్పున నూరుసత్రంబులు ద్విజులకు ఏడాదికి ఒక్కకోటిముప్పయిలక్షలు. నగరిమొగసాల గొల్చునవలక్షధనుర్ధరులకు ఏడాదికి మూడుకోట్లయెనుభయిలక్షలు. రాజమదగజంబులకును ఉత్తమాశ్వంబులకును జీతంబులవారికి రెండుకోట్లయెనుబయిలక్షలు. ఏకశిలానగరంబునం గలదేవతావైభవంబునకు ఒక్కకోటి. రాజగృహంబులు కట్టేపనులవారికి ప్రతివర్షంబున ఒక్కకోటియు వారణాసివిశ్వేశ్వరునకు శ్రీశైలమల్లికార్జునునకు శ్రీకాళహస్తీశ్వరునకు రామేశ్వరం రామేశ్వరునకు నాసికత్ర్యంబకేశ్వరునకు అరుణాచలేశ్వరునకుకొలనుపాక సోమేశ్వరునకు ఏకవీరేశ్వరునకు వేములవాడరాజేశ్వరునకు కాళేశ్వరముక్తీశ్వరునకు గోకర్ణేశ్వరునకు వీరు మొదలయినయీశ్వరస్థానంబులకును, శ్రీరంగనాయకులు కంచివరదరాజు శ్రీవెంకటేశ్వరులు మంగళగిరి నృసింహస్వామి సింహాచలము ఆదివరాహమూర్తి శ్రీకూర్మనాయకులు శ్రీజగన్నాయకులు భద్రాచలము శ్రీరాములకును దివ్యదేవమూర్తులకును ప్రతివర్షంబు మూడుకోట్లు. తనభండారమునకు మూడుకోట్లు చెల్లుచుండె.

ఇట్లు విక్రమార్కునిచందంబున మహామహిమతో రాజ్యంబుపాలింపుచు సకలభోగంబులు పరివారసహితంబుగా అనుభవింపుచు రాజ్యంబేలు సమయంబున నతండు ఏలినదేశంబులు దైవికంబులుగా ఆశ్చర్యంబులై ఆనందకరంబులుగా శోభిల్లునని సకలజనంబులు కొనియాడుచుందురు. ఆచరిత్రంబులు తొల్లింటి యట్టివారికైన చెల్లింపుగావు. శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు సాక్షాత్కారంబుగా రుద్రుండు గాని మనుష్యమాత్రుండు గాడు. అతనిచరిత్రంబులు ఆదిపురాణంబులట్లు సకలానందకరంబై యుండె.

అదియునుంగాక శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు ఒక్క పుణ్యగ్రహణకాలంబునందు మాంగల్యంబునకుం జని వేగుండంబునందు తీర్థంబులాడి యచట రామేశ్వరుని సేవించి పెక్కుదానంబులు చేసి, మరియు ప్రతాపవీరరుద్రుండు

పదికొండుహిరణ్యధేనువుల చేయించి ఒక్కొక్కధేనువునకు లక్షవేయుసువర్ణటంకంబులు దక్షిణలొసంగి వేదవేదాంగప్రచండు లయినవిప్రోత్తములకు దానంబులు ఇచ్చి. ఆదానంబులు అందనేరనివిప్రోత్తములు చండాలులవాకిటికిం జనిపోఁగా; చండాలులు కొన్నికుయుక్తివాక్యంబులు పలికిన రాజుచేత తమకు ప్రాణహాని యని యెఱుంగక యాదానంబులు పట్టినబ్రాహ్మణుల అరికట్టుకొని యీసువర్ణధేనువులు సజీవంబులయ్యెనేని తరల తోలుకొనిపొండి. నిర్జీవధేనువు లయ్యెనేని మాసొమ్ము. అని విప్రులతో వాదించిన, ఆవార్త శ్రీమత్ప్రతాప వీరరుద్రునకు ఎఱింగించి వారు బహువిధంబుల నారాధించిన దేవుఁడు ప్రత్యక్షంబయ్యె. రాజు మొదలుకొని సకజనంబులు చూచుచుండ ఆధేనువులు గునగున నడచుచుండె. అంతనప్పు డారాజు చండాలుల నరికించుటయు; ఏకశిలానగరంబు ప్రవేశించుటయు.

ఒక్కనాడు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు కొలువు చాలించి సకలజనంబుల వీడ్కొలిపి శివదేవుండును తానును అంతఃపురంబునకుఁ జనుదేర ఆరాజుపట్టంపుదేవి యగువిశాలాక్షి శివదేవునింజూచి పరపురుషుండుగదా యని మరుగు కేగుటయు. ఆశ్రీమత్ప్రతాపవీరరుద్రుండు శివదేవయ్యగారినిం జూచి నిజమందిరంబున కనిపి. రాజు మజ్జనభోజనాదులు దీర్చి నవరత్నఖచితం బైనయొక్కపీఠంబున గూర్చుండి తనపట్టపుదేవి యగువిశాలాక్షికి ఇట్లనియె. శివదేవయ్యను జూచి పరపురుషుడనితొలగిపోయితివి. అతడు ఈశ్వరుండుగాని మనుజమాత్రుండుగాడు. ఆశివదేవయ్యను పూజించి సుగతి గాంచుమని యెఱుంగబలికిన ఆవాక్యంబు విని విశాలాక్షీదేవి తనచిత్తంబు కొలిపి శివదేవయ్యగారిరూపంబుగా నొక్కసువర్ణప్రతిమను గావించి ఒక్కసువర్ణవేదిక నిలిపి షోడశోపచారంబుల పూజింపుచుండె. అంత నొకరునాడు మాసశివరాత్రియగుటయు ఆశ్రీమత్ప్రతాపవీరరుద్రుండును శివదేవుండును నుపవసించి స్నానాదికృత్యంబులు దీర్చి శ్రీశంభులింగంబునగరికిం జని యద్దేవుని షోడశోపచారంబుల బూజించి యచట జాగరణంబు చేయుచున్న సమయంబున శివదేవుండు సుగంధం బైన తేనువుం గ్రుసనం దీసినంజూచి యా శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు ఆశ్చర్యచిత్తుండై మహాత్మా మాతోడనే ఉపవసించితివి. ఇంతలో ఏమియు గుడిచితివి. సీధుసుగంధం బైన తేనువు తేనిచితి అని యడుగగా శివదేవుండు శ్రీమత్ప్రతాపవీరరుద్రున కిట్లనియె. నీ అంగన విశాలాక్షి విందుచేసిన గుడిచితి ననిన. ఆశ్చర్యపడి, తననగరికింజని విశాలాక్షీదేవి నడిగిన తాను సువర్ణప్రతిమను చేయించి శివదేవయ్య యీశ్వరుండని యింతకుమున్ను

నై వేదనంబు సమర్పించితి ననిన ఆరాజు ఆశ్చర్యపడి శివదేవయ్యగారి మహా మహాత్వంబు గొనియాడి. ఇట్లు మహామహుండైన శివదేవయ్య గురుండును మరియును బుధుండునై తనకు మహామహిమ చేకూర్చుచుండె.

అంత నొకనాడు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు కొలువై కూర్చున్న సమయంబున ప్రసంగవచనంబుల జ్యోతిషంబు తమసొమ్మని పాంచాలమువారు వాదించి యిందుకు పరీక్ష యిచ్చెదమని పాత్రోజు కన్నయ్య యనువాడు ఒక ముహూర్తంబున పాషాణంబుపై లోహసలాకాదిగా మొత్తించుటయు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు అతని మెచ్చి ఒక్క గ్రామంబు శూకాశనంబుగా సమర్పించెను. అదిగని హనుమకొండ రుద్రేశ్వరునకు అర్చకుండైన రుద్రజియ్య యనుశివబ్రాహ్మణుండు ఏతెంచి రాజసన్నిధిని నిలచి యిట్లనియె. పరీక్ష జూపినంతనే పాంచాళభక్తులకు జ్యోతిషంబు రానేర్చునే హితమదని వ్యతీపాతవు కాలంబున జిల్లేడుకొమ్మ విరచిన రక్తంబు గారుటయు అదిగని రాజు సంతోషించి ఒక్క గ్రామంబును పల్లకీ కృపచేసియునిపిన. ఆవార్త భూసురు లెరింగి కటకటా యితర జాతులప్రజ్ఞలు మెచ్చి నిగ్రహానుగ్రహసమర్థుల మైన విప్రజనంబుల మాహాత్మ్యంబులు ఎఱుంగరాదయ్యె అని రాజు సమ్ముఖంబున కేతెంచి యిట్లనిరి. జ్యోతిషంబు వేదాంగం బగుట నీవెరుంగుదువు. వేదవేదాంగంబులు విప్రులకె కాని యితర జాతులకు ఎట్లు సిద్ధించును. పరీక్ష జూపినది నిజంబు గాదు. ఆపదవేళ యెరింగి యీధేనువు క్షీరంబు పిదుకుదు రేని జ్యోతిషంబు వారిసొమ్మనిన ఒక్క గొడ్డుటావును జూపుటయు. అదిగని మునుపు పరీక్షయిచ్చినవారు తొలంగిపోయినం జూచి విప్రజనములలో వెలకతూర్తి సోమయ యనువారు ఏతెంచి ఆముహూర్తము వేళ యెరింగి ఆగొడ్డుటావును పితికి తేను కుంచెడుపాలు కురియుటయు. అదిజూచి యాశ్రీమత్ప్రతాపవీరరుద్రుండు అత్యంతయాత్మ్యనియుండై యావిప్రుండు గోరినట్టు గోదావరీతీరమున కుశతర్పణం బను అగ్రహారము నొసంగుటయు. మరియు నొక్కనాడు దక్షిణదేశమునుండి సుదర్శనమిత్రుండు గజారూఢుండై నూర్గురు విద్వాంసులు గొలువ ఏకశిలానగరమున కేతెంచి శ్రీమత్ప్రతాపవీరరుద్రుని కొలువుకూటమునం గల విద్వాంసులతో నేను వాదభిక్షకు ఏతెంచినవాడ నని పలుకుటయు ఆవిద్వాంసులు వాదముఖమున సుదర్శనమిత్రుని సమ్మతిపరచిరి. గెల్వనేరక చిక్కి కారుమాటలనైన గెలిచెదనని యీదినము కృష్ణచతుర్దశి యగుటయు సుదర్శనమిత్రుం డిటలనియె. రేపు అమావాస్య, నష్టచంద్రుండు, ఇది

నిజము, మీరందరు ఇది నిజము కాదని యనుమనుటయు. ఏకశిలానగర విద్వాంసులు నవ్వి మరియు సాహసంజాలక వాదములుపుపక్రమణము నేరక సుదర్శనమిత్రుం డను పేరు దెల్పుకొని వేదశాస్త్రముఖముల నిలువంజాలక నీవు కారుమాటలకు జొచ్చితివి. అటయినను ఆమాట అప్రతిష్ఠంబని అందరు రేపు నష్టచంద్రుండు కాడు. షోడశకళాపూర్ణుం డైనసంపూర్ణచంద్రుండు. ఇది నిజము, అని ఒక్కవాక్యముగా బలికి విప్రులు సభ వెడలిపోవుటయు, ఆరాత్రి శాఖ వెల్లిమల్లికార్జునభట్టు హన్మకొండ కేతెంచి అచట స్నానసంధ్యాదికృత్యములు దీర్చి భద్రకాళిగుడిలోకి వచ్చి సప్తశతిచే నద్దేవి నారాధించి పదకొండు శ్లోకములచే స్తుతించి ధ్యానారూఢుండై యున్న సమయమున అద్దేవి ప్రత్యక్షమై లెమ్ము విప్రవత్స ! యని, నీసత్యవాక్యంబులు ప్రతిష్ఠించెద నని వరంబొసగుటయు అతండు భద్రేశ్వరిచే వరంబుగైకొని యేకశిలానగరంబునకు ఏతెంచి వారలకెరింగించిన. ఆమావాస్యకృత్యంబులు మూడుయామంబున దీర్చి అంత అస్తమయంబగుటయు. తూర్పుదిక్కున చంద్రుం డుదయించె.

క్రమంబున చంద్రునిగతిచందంబున మహానిశికి మధ్యాహ్నగతుం డగుచు చంద్రమండలంబు ద్విగుణితంబై నిష్కళంకంబై సర్వజనులకును ఆనందంబుగా చంద్రుండు వెన్నెల గాయదొణంగిన జనంబు చూచి. సుదర్శనమిత్రుండు ఏకశిలానగరంబు విద్వాంసులపాదంబుల కొరగి నాయది మానుషప్రజ్ఞ. మీది దైవమానుషప్రజ్ఞ, మీకును నాకును హస్తిమశకాంతరంబు కాదె. నాఅపరాధంబు క్షమియింపుండని పలుకుటయు వారలుసుదర్శనమిత్రుని గౌరవించుటయు. అంతట శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు శాఖవెల్లిమల్లికార్జునభట్టును బ్రహ్మరథంబెక్కించి వరంగంటివిప్రులకు పదిలక్షలవరహాలు సమర్పించుటయు. సుదర్శనమిత్రుని గౌరవించి లక్షవరహాలు ఇచ్చి పంపుటయు. మరియొక్కనాడు సంతూరనుగ్రామంబున కృష్ణమాచార్యులతమ్ముండు ఆనందమాచార్యులు రజకస్త్రీతో రమించిన ఆరజకస్త్రీవిభుండు ఆయిద్దరిని పొడిచిన మృతంబైరి. శూద్రశవముతో వైష్ణవుడు మృతిఅయ్యెగనుక ఆపురివైష్ణవులు మొయ్యక ఊరకుండిరి. అదివిని కృష్ణమాచార్యులు తనమదినివిచారించి సచ్చిదానందస్వరూపుండై బ్రహ్మాండనాయకుండగువాసుదేవమూర్తిని ప్రార్థించిన ఆశవంబు తనంతటతానే కాష్ఠంబునకు నడుచుటయు. అదిగని సకలజనంబులు విప్రులు వైష్ణవులు ఏతెంచి కృష్ణమాచార్యుల పాదంబులకు ప్రణమిల్లి మాయపరాధంబులు క్షమియింపుమనుటయు అయ్యె

యొక్క నాకు రాగద్వేషంబులులేవు. మీరు వెరువకుడనుటయు. ఆవార్త శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు చారులచే నెరింగి కృష్ణమాచార్యులరావించి వారిని పూజించి యేకశిలానగరములో నాల్గవభాగము ఏబది గ్రామంబులను అధికారంబును ఒక్కఊరు అగ్రహారంబునుగాను నొసంగి అనుపుటయు. కృష్ణమాచార్యులును సంతూరును ప్రవేశించి కళ్లతనంబు పుట్టుటం జేసి కల్లూరను గ్రామంబును కట్టి కోట పెట్టుటయు, మూడువర్షంబులు అధికారంబు జేసి గ్రామంబుల గల్గుపదార్థంబుల దెచ్చి తామ్రపత్త్రికలు చేయించి యాపత్త్రికలమీద తారయించిన చాతుర్లక్షగ్రంథంబు లిఖించి అది శకటంబుపై పెట్టుకొని శ్రీరంగంబునకు గొనిపోవ నుద్యోగించిన కొందరు ధూర్తులు గూడి యారాజుసమ్ముఖంబునకుం బోయి కృష్ణమాచార్యులకు మీరుఅధికారంబు ఇచ్చినగ్రామంబులపదార్థం వ్యయించి తామ్రపత్త్రికలు చేయించి శ్రీరంగమునకు గొనిపోవుచున్నాడని యెరింగించిన శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు విని యతండు మహాత్ముండు. అతనికి ఏది యిష్టమో నాకు అదే యిష్టంబని ఊరకుండుటయు. ఆవార్త యిష్టజనులచే కృష్ణమాచార్యులు విని ఊరికేపోయిన మూర్ఖత్వం బని రాజసమ్ముఖంబున కేతెంచి యాబయిగ్రామంబులగలపదార్థంబు వర్షత్రయంబున లెక్కవినిపించి అప్పుడు మూడులక్షలవరహాలు అయినవని కృష్ణమాచార్యులు తనమనంబున వాసుదేవమూర్తి నారాధించి ఒక్కవచనంబు రచియించిన మెచ్చి యేకశిలానగరంబున కనకవృష్టి గురిపించుటయు. అదిగని శ్రీమత్ప్రతాపవీరరుద్రుండును ఆపరిజనంబులును కృష్ణమాచార్యుల పూజించి; వారి వీడ్కొని కృష్ణమాచార్యులు శ్రీరంగమున కరుగుటయు.

మరియొక్కనాడు తిక్కనసోమయాజుల వరప్రసాదంబు నీతి యగుకుమ్మర మొల్ల రామాయణంబు వచనకావ్యంబు రచియించి ప్రతాపరుద్రునకు అంకితంబుగా జేయుసమయంబున ఆరాజుసమ్ముఖంబున నున్నవిద్వాంసులు విని యిది శూద్రకవిత్వంబు, ఇది నిషిద్ధంబని నిరాకరించిన ఆరాజు సర్వజ్ఞుండుగానుస్న్నవని దాని మెచ్చి. రాజు బ్రాహ్మణకృతం బైనకావ్యంబు కావలెనని. ఆవిద్వాం[illegible]ులు భాస్కరుని పిలిపించిన. అతడు రచియించిన శ్రీరామాయణంబు వినుసమయంబున అచటికి ముల్లి యేతెంచి రామాయణంబును రచియించి యున్నానని [illegible]క పద్యంబు విచిత్రంబుగా చదువుటయు వినియారాజు సర్వజ్ఞుండుగావున దీనిప్రజ్ఞకు మెచ్చి విప్రజనంబులు మనంబులు నొచ్చునో యని మొల్లిని పిలిచి పల్లకియును నగిరినిత్యజీవనంబును కట్టడిచేసి తనయెదుట నుండక తనదేవి విశాలాక్షిసమ్ముఖంబున నుండజేయుటయు. ఆవార్త విని శాఖవెల్లి మల్లికార్జునభట్టు నిగ్[illegible]

ఇంద్రకీలపర్వతముమీఁది చాళుక్యశాసనము.



చూ. 229-వ పుటలో.

# ఇంద్రకీలపర్వతము

## మీఁది రెండుచాలుక్యశాసనములు.

ఈశాసనములు బెజవాడకుఁ జేరి పశ్చిమమున నున్నయింద్రకీల మను పర్వతముమీఁద నున్నవి. ఒకటి గోవిందమఠ మను స్థలమునమీపమునఁ బడి యున్న రాతిమీఁదను రెండవది కొండ నెత్తిమీఁద స్థాపింపఁబడియున్న శిలా స్తంభముమీఁదను జెక్కఁబడియున్నవి. మొదటిదానికి క యనియు, రెండవ దానికి చ యనియు సంజ్ఞ లుంచి వానిని వేఱువేఱు గా విమర్శించెదను.

క.

ఈశాసనమునకు శాసనాధికారులు తీయించిన ప్రతిబింబమును బట్టి మూలమును నిరూపించితిని.[1] లిపిస్వరూపము పాఠకులకుఁ జక్కఁగాఁ దెలియు టకై శాసనప్రతిబింబము గూడ ముద్రింపఁబడును. ఈశాసనపులిపి సర్వవిధముల యుద్ధమల్లుని బెజవాడశాసనపులిపిని బోలి యున్నది[2]. కావున నీ రెండు శాసన ములు నించుమించుగా నేకకాలమందే పుట్టిన వని నిశ్చయింపవచ్చును. శాసన మందు సంస్కృతాంధ్రములు రెండును బ్రయోగింపఁబడినవి. తప్పులు గలవు.

విష్ణువర్ధనమహారాజు రాజ్యకాలము పదియేడవసంవత్సరంబున విక్రమా దిత్యునితనయుఁ డగుశ్రీవిష్ణువర్ధనుని ప్రసాదముచేత చట్టప యనునతఁడు ఇంద్ర కీలపర్వతముపై పార్థేశ్వరుని బ్రతిష్ఠించె నని శాసనములోని విషయము. పేరును బట్టియు సర్వలోకాశ్రయుఁ డనుబిరుదును బట్టియు విష్ణువర్ధనమహారాజు చాలు క్యవంశమువాఁ డని స్పష్ట మగుచున్నది. ఆలయప్రతిష్ఠ బెజవాడయం దగుట చేత రాజు పూర్వచాలుక్యవంశ్యుఁ డనికూడ స్థిరపడుచున్నది. పూర్వచాలుక్య రాజులలో విక్రమాదిత్యుఁ డనుపేరు గలవా రిద్దఱు మాత్రమే కనఁబడుచు న్నారు :—13-వ తరమువాఁ డగు గుణగవిజయాదిత్యునితమ్ముఁడును, 14-వ

1. శాసనాధికారులు ఆ 1917-వ సంవత్సరములో సంపాదించిన శిలాశాసనములలో నిది 833 వది.

2. చూ: ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. 6.

తరమువాఁ డయిన ప్రథమచాలుక్యభీముని తండ్రియు నయినవిక్రమాదిత్యుఁ డొకఁడును, 18-వ తరమువాఁ డగువిక్రమాదిత్యుఁ డొకఁడును. ఈ రెండవ విక్రమాదిత్యునకుఁ గొడుకున్నట్లు గాని యాకొడుకు రాజ్యము చేసినట్లు గాని ప్రమాణములు లేవు. కావునఁ బ్రస్తుతశాసనములోఁ బేర్కొనఁబడిన విక్రమాదిత్యుఁడు మొదటి విక్రమాదిత్యుఁడే యని యూహింపవలసియున్నది. ఈవిక్రమాదిత్యుని కొడుకు ప్రథమచాలుక్యభీముఁ డగును. ఈతఁడే శాసనములో సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారా జని పేర్కొనఁబడినవాఁడు. సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన యనునవి చాలుక్యరాజుల బిరుదులు. ఈచాలుక్యభీమునినాఁటి యొకరాగిశాసనములో నితని పేరు "సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజపరమేశ్వర పరమబ్రహ్మణ్యః చాలుక్యభీమనామా" యని యున్నది[3]. ఆశాసనమందే భీమరాజు 814-వ శకవత్సరమునఁ బట్టాభిషిక్తుఁ డయిన ట్లున్నది. కాఁబట్టి పార్థేశ్వర ప్రతిష్ఠ 831-వ శకసంవత్సరమం దయియుండవలయును. ఇది క్రీ. 909-వ సంవత్సరమునకు సరిపోవును. ఈశాసనపులిపియు యుద్ధమల్లుని శాసనపులిపియు నేకవిధముగా నుండుటవలన నిదివఱలో నేను జేసిన యుద్ధమల్లశాసనకాలనిర్ణయ మీశాసనమువలన దృఢపడుచున్నది.

అర్జునుఁడు శివునిగూర్చి తపముచేసి పాశుపతాస్త్రమును బడసినచోటు బెజవాడే యని యీశాసనము సూచించుచున్నది. ఈవిషయము రెండవశాసనము విమర్శించునపుడు చర్చింపఁబడును.

శాసనములోఁ గొన్ని తెలుఁగుపదములకు విశేషరూపములు కనఁబడుచున్నవి. "సంవత్సరంబుళ్" అనుచో ళకార మొకవిశేషము "పదిఏడగునేణ్ట" పదిఏ డనునప్పుడు విసంధి పొరపా టని తోఁచుచున్నది. "పదియేడగు" ననఁగాఁ బదునేడవ యని యర్థము. అగు ననునది యగుధాతువు తద్ధర్మార్థకవిశేషణము. తొలుత నీవిశేషణమే పూరణార్థమందుఁ బ్రయోగింపఁబడి కాలక్రమమున "అవ" యనుప్రత్యయముగా మాఱిన ట్లగపడుచున్నది. ఆంధ్రభారతాది పర్వప్రారంభమునం దాయాపర్వములయందలి విషయముల వివరించు నవసరమున

1. శో భిల్లంగా । నెనిమిదియగుపర్వం బిది । యనఁ బరఁగున్

3. చూ. Report of the Government Epigraphist for 1918, page 107.

2. శ్రీ । పర్వంబు పదునొకం డగు । పర్వమునా వెలయు.
అని యీప్రకారముగాఁ బ్రయోగములు కనఁబడుచున్నవి. అన్యస్థలములందు "అగు"నకు మాఱు "అవ" యే కనఁబడుచున్నది. పూర్వప్రతులలో "అగు" నని యే యుండఁగా 'సంస్కర్త' లాపాఠము తప్పని యెంచి యాధునికాచారానుసారముగా దానిని "అవ"గా మార్చి, యట్లు మార్చుట కవకాశము లేదని తోఁచినపట్టులమాత్రము పూర్వప్రయోగ ముంచినట్లు తోఁచుచున్నది. ఈ ప్రకారముగా నన్నయభట్టకృతభారతభాగమునం దనేకము లగుమార్పులు కలిగి యుండవచ్చు నని నాయూహ. అనేకప్రాచీనప్రతులనుబట్టి విమర్శించినఁ గాని సరి యయిన పాఠములు తేలవు. ఆంధ్రభాష కంతకు మూలాధార మనఁదగు భారతము విషయములో నీపని తప్పక జరుగఁదగినదే.

"ఏణ్ట"—సానునాసిక మగునీపదము, ఏఁడుశబ్దము సార్ధబిందుక మని స్పష్టపఱుచుచున్నది.

మూలము.

1. స్వస్తి సర్వలోకాశ్రయ
2. శ్రీవిష్ణువర్ధనమహారాజుల
3. ప్రవర్ధమానవిజయా1రాజ్యసంవత్స
4. రంబుల్ 2పదిఏడగు3నేణ్టవిక్రమా
5. దిత్యతనయశ్రీవిష్ణువర్ధనప్రసాదాచ4
6. ట్టపాఖేన యిన్ద్రకీల5ప్రతిష్టితః6పార్త్థేశ్వరః7
7. సామాన్యోయంధర్మ్మసేతుఃనృపాణాంకాలేకాలే
8. పాలనియో8భవద్భిః సర్వ్వానేతాన్భావినఃపా
9. ర్త్థి9వేన్ద్రాన్ భూయోభూయోయాచతేరామ
10. భద్రా10 । శ్రీజల్పేయం శిఘ్రలిఖితం॥

---

1. విజయ్యాయని చదువునది.
2. రంబుల్ ,,
3. బదియేడగు ,,
4. ప్రసాదాచ్చ ,,
5. ఇన్ద్రకీలే ,,
6. ప్రతిష్ఠితః అని చదువునది.
7. పార్థేశ్వరః ,,
8. పాలనీయో ,,
9. పార్థివేన్ద్రాన్ ,,
10. భద్రః ,,

చ.

ఈశాసన మింద్రకీలపర్వతశిఖరమందు స్థాపింపఁబడియున్న శిలాస్తంభము రెండుప్రక్కలయడుగుభాగమునఁ జెక్కఁబడి యున్నది. స్తంభము నాలుగు ప్రక్కలను, అర్జునుఁడు తపస్సుచేసి శివునివలనఁ బాశుపతాస్త్రము పొందినకథ చిత్రరూపముగా లిఖింపఁబడినది. శాసనము సంస్కృతమయము. శాసనపులిపి క్ష శాసనపులిపిని బోలి యున్నది. ఆరంభమున నర్జునుని నామములు పది యు నుదాహరింపఁబడినవి. తరువాత విష్ణుసాహాయ్యముచేత నర్జునుఁ డింద్ర కీలపర్వతమందు మహేంద్రునిగూర్చి తపస్సుచేసి యాయింద్రుని యుపదేశంబున మహేశ్వరు నారాధించి సంప్రీతుఁడైన యాశివునివలనఁ బాశుపతాస్త్రమును బడసె ననియు, నింద్రకీలపర్వత మర్జునున కొకయక్షుఁడు చూపె ననియు, నా యక్షుఁడే కలియుగమున పెచ్చెవాడలో కలియమబోయుని కొడు కయిన త్రికో టిబోయుఁడుగా జన్మించె ననియు, నా త్రికోటిబోయుఁడు పూర్వజన్మజ్ఞానము కలిగినవాఁడై యర్జును తపోవృత్తాంతము కలారూపముగా లిఖింపఁబడిన యొక స్తంభము నింద్రకీలపర్వతమందు స్థాపించె ననియుఁ జెప్పఁబడియున్నది. ఈయితి వృత్తము భారతములోని కథకు సరిపోవుచున్నది. యక్షుని ప్రస్తావముమాత్రము భారతములో లేదు గాని భారవికృత కిరాతార్జునీయమున నున్నది. త్రికోటిబోయుని ప్రశంసార్థ మిందు గ్రహింపఁబడినది. ఇంద్రకీలపర్వతము హిమాలయమున కుత్తర భాగమున నున్నట్లు భారతములో నున్నది. బెజవాడపర్వతమే యాపర్వత మయి నట్లు జనశ్రుతి బెజవాడప్రాంతమునం దున్నది. ఈశాసనపులిపి క్ష శాసనపులిపిని బోలియుండుటంబట్టి యీశాసనము కూడ నిప్పటికి వేయిసంవత్సరముల పయి నాఁటి దని యు, నప్పటికిఁ గూడ నీజనశ్రుతి యుండె ననియుఁ దేలుచున్నది. క్ష శాసనముకూడ నీవాడుకను సూచించుచున్నది.

బెజవాడ యనునది సామాన్యముగా జనులు వాడునట్టి పేరు. ఈపేరే యుద్ధమల్లుని శాసనములోఁ గూడనున్నది. ప్రస్తుతశాసనమందు "పెచ్చెవాడ" యను రూపము కనుపట్టుచున్నది. బీజవాడ, విజయవాడ, విజయవాటిక యను నామములు శాసనాంతరములఁ గన్పట్టుచున్నవి. విజయవాడ, విజయవా టిక యనునవి యర్జునుని పేళ్లలో నొక టయిన విజయశబ్దమువలనఁ బుట్టినట్లు కనఁబడుచున్నవి. ఇదియే మొదటిపేరుగా నుండి, దానివలన బెజవాడ యనియు, దానివలన పెచ్చెవాడ యనియుఁ బేళ్లు పుట్టెనో, లేక మొదటిపేరు పెచ్చెవాడ యని యుండి దానివలన బెజవాడయని పుట్టి యది పండితులచే సంస్కరింపఁబడి విజయవాడ, విజయవాటిక యయ్యెనో, యదియునుంగాక పెచ్చెవాడ యనునది

వ్రాఁతపొరపాటునఁ గలిగిన లోపమో, ఉచ్చారణ భేదమో నిర్ణయించుటకుఁ జాలినన్ని యాధారము లింతవఱకు లభింపలేదు.

జయంతి రామయ్య.

చ.

మూలము.

(ఉత్తరపు వైపు.)

1. అర్జున (ః) ఫల్గుణ (ః) పార్థ (ః) కిరీటి[1] శ్వేతవాహ
2. నః [2]వీభత్సు విజయ (ః) కృష్ణః సవ్యసాచీ ధనం
3. జయః॥ స్వస్తి।(శ్రీ)య తేఖలు ద్వైతవనే పాణ్డవా
4. న్ దృష్ట్వాతత్పుపా(తే)న వ్యగ్రోర్జున ఇన్ద్రకీలమ్ గత్వా
5. వి(ష్ణు)నా(హాయ్యతో) తపసా మహేన్ద్ర మారాధ్య తదుప
6. దే(శాత్) మహేశ్వర మారాధయతః పా(శు)పాతాస్త్ర[3]
7. ర్థమ్ప్యాతిగహన మిన్ద్రకీలమయం యక్షః ప్రాప
8. యిష్యతి[4] త్వామిత్యాదిష్టావ[5]నితి॥ సచయక్షః శాపా
9. న్తరాత్కాలే పెచ్చె(వా)డ(క)లియమబోయిపుత్రః
10. త్రి(కో)టిబోయినామా ధార్మ్మికః ప్రాదు(రభూ)
11. (ద్య)శ్చకర్ణ ఇవ(బ)లపరాక్రమోపేతోవదా
12. న్యశ్చ మాతలిరివ సర్వకార్య్యకుశల(ః)(స్వా)
13. మిభక్త[6]శ్చ హనూమానివ విది(త)జన్మాంత
14. (రా)వ(తారో)స్వకులో[7]త్తమచరితశ్చసః[8] ప్రా

(దక్షిణపువైపు)

15. వర్షమర్జునమైత్ర్యాజ్జ(న్మా)ంతరవేదీ తత్పా
16. శుపతాస్త్రావాప్తి కల్యాన్నిధాన మిన్ద్రకీలే
17. (స్వ)యశోనిధిమివ స్వకులాభివృద్ధయే
18. స్తంభమాస్థాపయత్। ఇన్ద్రకీలోగిరి
19. ర్యావద్యావచ్చ యమ్ మహానదీత్రి
20. (కో)ట్టీ బోయుధర్మ్మయమ్ స్థేయాన్తా[9]వద్భువేది
21. హ॥ విజాయా[10]చార్య్యస్యలిఖితమ్॥

---

1. కిరీటీ యని యుండవలయును.
2. బీభత్సు ,,
3. పాశుపతాస్త్ర ,,
4. ప్రాపయిష్యతి ,,
5. త్యాదిష్టవానితి ,,
6. భక్తశ్చ యని యుండవలయును.
7. జన్మాంతరావతారస్స్వకులో ,,
8. స ,,
9. స్థేతాంస్తావత్ ,,
10. విజయాచార్య

ఓం

శ్రీపరమాత్మనే నమః

# అమృత కలశి.

## విజ్ఞాపనము

ఈయమృతకలశియందు సాహిత్యవిషయమున నాకుఁ గల యభిప్రాయములను గొన్నిటిని సూచించియున్నాఁడను. ఇట్టిపనికి గద్యమంత యెక్కువగాఁ బద్య మనుకూలింప దని నాకుఁ దెలియును. కాని, ఆర్నోల్డ్, కార్లైల్, హాజ్లిట్ మున్నగునాంగ్లేయకావ్యమీమాంసకులమార్గము ననుసరించి మనయాంధ్రభాషలోఁగూడఁ గొన్ని వ్యాసములను వ్రాయవలెనన్న నాకోరిక నెఱవేఱుటకుఁ జాలినంతయవకాశము లభింపకుండుటచేతను గడుపులోని యూహాలు కడుపులోనే జీర్ణమయిపోవు నన్నభయముపుట్టుటచేతను ఇట్టిరచనకుఁ గడఁగినాఁడను. జీర్ణమయి పోయినంతమాత్రమున లోకమున కింతలో సంభవించెడి ప్రమాదమేదియు లేదుగాని శ్రీయుతరవీంద్రనాథఠాకురు మున్నగుమహాకవులు బైలుదేఱిన యీకాలమందు మనయాంధ్రకవితకుఁగూడఁ ద్వరలోనే క్రొత్తశక మారంభము కాఁగలదేమో యని యాశతో నెదురుచూచెడిసాహిత్యపరులయాశ లడుగంటు నట్లుగా మనవారిలోఁ బెక్కుచోట్లఁ గవులను గూర్చియుఁ గవిత్వములను గూర్చియు సామాన్యవిశేషభేదముల నంతగాఁ బాటింపనివింతరుచులును విపరీతాభిప్రాయములును వెల్లడియై వ్యాపించుచుండుటచే నట్టివానిని గొంతవఱకు మార్పఁ బ్రయత్నించుట ధర్మ మని నే నీపద్యములను రచించినాఁడను. ఇందలి నాయభిప్రాయములలోఁ గొన్ని నాకొక్కనికే కలిగినవి కావు. నాకన్న బహువిధముల సమర్థులగుపండితులును పురాణవిద్యాధికులును నప్పుడప్పుడు ప్రసంగవశమున నాయభిప్రాయములనే నేఁటికాలపుఁ గొందఱకవులవిషయమునను గొన్ని కవిత్వములవిషయమునను వ్యక్తీకరించియున్నారు. అట్టివారి కీచిన్నికావ్యములోనిభావము లింపుగా నుండఁ గల వని నానమ్మిక. పైత్యతత్త్వములకుఁ బాలుపడవందురేమో కాని భిన్నాభిప్రాయులైన యితరుల కైనను విరసముగా నుండఁ గూడదనియే నాయెన్నిక.

కృతికర్త.

రాజమహేంద్రవరము.

శ్లో. నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి. మమ్మటభట్టు.

మ. తలలో నాలుకవోలె నీవు మెలఁగం దా సృష్టిఁ గావింపఁ గా
వలనయ్యెం జతురాస్యుఁ డయ్యును మెదల్పంజాలునే నోరు నీ
యలఘుప్రేరణశక్తి లేక యినుమంతైనన్ సమస్తాత్మచి
త్కళవై యొప్పెడిదేవి నీకిదె నమస్కారంబు వాగీశ్వరీ. ౧

శా. ఆరోగ్యంబు సెడెం గుటుంబభరణాయాసంబు హెచ్చెన్ సుదు
ర్వారుల్ పైయధికారులైరి మఱి సేవాముక్తిభాగ్యంబునున్
దూరస్థం బగుజీవితంబు వెగటై తోఁచున్ మఱేమన్న ని
న్నారాధింతునటన్నయాశ యొకటే యాలంబమై నిల్పెనున్. ౨

శా. వేదల్ వేదఱికంపుఁబెన్వెతలకున్ బెగ్గిల్లి యొక్కింతసే
పాదల్ మానఁగఁ దప్పఁద్రావి పడియుం ద్రళ్లే మహాసంసృతి
ప్రాదుర్భూతవిషాదఖేదములకుం బాల్పడ్డనాడెందమున్
నీదివ్యామృత మాని చొక్కి మఱచున్ విశ్వంబు వాగీశ్వరీ. ౩

శా. అన్నంబేటికిఁ బానమేటి కమృతాహారంబు చేకూరఁగాఁ
గన్నుల్ మోడ్పఁగఁ బారవశ్యమున నింకన్నిద్ర యంచేల న
ర్వోన్నత్యంబు ఘటిల్ల భావజగతిన్ బాహ్యప్రపంచం బిఁకే
లెన్నన్ భేదము యోగికిం గవికిఁ దా నింతేనియున్ లేదహో. ౪

శా. కోరన్ మువ్వలు వోఁగు లుంగరములుం గోరన్ దుకూలంబులుం
గోరన్ మేడలు మిద్దెమాడుగులునుం గోరన్ హయాందోళికల్
కోరందగ్గది యేదియో నరుల కీక్షోణీస్థలిం దాని వే
మాఱుం గోరుదు దేవి నిన్గొలువఁగం బ్రాపించునానందమున్. ౫

ఉ. అత్తకు నీకు వైర మని యాడినేయుదు రజ్ఞు లయ్యయో
విత్తముఁ గూర్పఁజాలుబలువిద్దియ యుండఁగ నెన్నియో రసా
యత్తమతిన్ మధువ్రతము లంబురుహాకరముంబలెం గవుల్
మెత్తురు సత్కవిత్వమును మిక్కిలియున్ గతకాంచనస్పృహన్ ౬

క. వనదేవతాప్రసాదము, నను బదముల నొయ్యనిడ వనము తెరువ్వన రా
ఘునిసతికిఁ దొలఁగె ముందులు,నన లయ్యెను గంష్టు నస్థె నాకవిత నాఁగన్. ౭

క. ప్రామాదికములు తొలఁగి య,సామాన్యము లగును దేవి సామాన్యములున్
సామాన్యమగునె నీదుకృ,పామహిమ ఘుణాక్షరముగ భావింపఁజుమీ. ౮

ఆ. వె. మెచ్చి వసుకవీంద్రు మెచ్చరేని యతండు,మెచ్చుకవిత సరసు లిచ్చ నదియ
పూర్వసరసత యగుఁ బొరయునే దేవి నా,ముదము వైపరీత్య మది కతముగ.

మ. వినతుం డై తనవిద్దె వేఁడుచిఱుతన్ ప్రేల్వట్టి దిద్దించుఁగా
దనఁడుం జేయఁడు శక్తివంచన మసూయం జెంది యట్లొట నె
ట్లొనరించున్ గుణధర్మకోవిదుఁడెయయ్యున్ సత్కృపామోదియ
య్యును ద్రోణుం డీక సుబ్బరాయకవితో నొప్పారఁగా సఖ్యమున్. ౧౦

మ. కవితాతత్త్వవిశారదుండగుటకై కాశీనవద్వీపవా
సవృథాయాసము లేల పూర్వభవసంస్కారంబు వాణీప్రసా
దవిశేషంబును గల్గ మూఁగయు వసంతశ్రీసమారంభవే
ళ వనీపాళిఁ బికంబువోలె మధురాలాపంబుఁ గావించెడున్. ౧౧

మ. కవనం బన్నను గాజుకుప్పెఁ గొని తేఁగా సంత గంగాజలం
బవునే పెద్దలకెల్ల దాహశమనం బై యోలలాడంగఁ ద
చ్ఛివమూర్ధోపరిఖేలదంబరధునీదివ్యప్రవాహంబులన్
భువిఁ బాఱింపవలెన్ భగీరథతపఃపుణ్యంబునన్ గణ్యుఁడై. ౧౨

క. కలుగుదురుగాని కవులిలఁ,గలిగింపంబడరటంద్రు ఖండాంతరవా
సులు ప్రాగ్భవకృతవిశ్వా,సులుగాకయుఁ బలుకుటెట్లు చోద్యముకాదే. ౧౩

క. కవిహృదయ మన్యహృదయం,బువిధంబునఁ బద్మకోశమున కెనయగుఁ గా
ని విశేషమెన్న ఘటసం,భవుపుడిసిలియట్లు నిండఁబట్టుం గడలిన్. ౧౪

క. కనుదెఱచి మూసెనేనియు,ఘనుఁడగుకవి ముజ్జగంబుఁ గట్టివయిచు వా
మనమూర్తిపదత్రయిక,న్నను బలవత్తరము భావనాదృష్టి యహో. ౧౫

క. పువులపయిఁ దేఁటివోలెం,దవిలెడుఁ దా నెపుడు వాసనాప్రేరితమై
కవిమనసు మధురవస్తుల,భువి సుమహితవృత్తుల కిది పోలునుగాదే. ౧౬

క. ఉన్నది లేనట్లుగ మఱి, యున్నట్లుగ లేనిదాని నొగిఁ జెప్పి కవుల్
కన్నులుగా వీనుంగవ,పన్నుదు రౌరౌర మాయపన్నాగంబుల్. ౧౭

ఆ. వె. శిల్పనిపుణుఁ డైనచిత్రకారుం డట్లు,సూక్ష్మములను జూపు స్థూలములను
బౌధకవియు నట్లె ప్రకటించు భావంబు,పూవు దెచ్చి ముక్కుపొంతనిడఁడు

గీ. పెదవిఁ గదలింపకుండ నవ్వినయలంతి
నగవు కనుదోయిఁ ద్రేవల నిగిడి మొగము
దమ్మి వికసింపఁజేయుచందమున మెఱసి
ప్రౌఢకవివాక్కు హృదయంబు నలరఁజేయు. ౧౯

క. చెప్పఁడు కవి భువి నితరులు, చెప్పెడుక్రియ మఱుఁగువిడిచి చిత్రం బేదో
గుప్పిట నిడి యూరించును, జెప్పికొనెడిదాఁకఁ దండ్రి శిశువులనుబలెన్. ౨౦

గీ. నవరసామోద మేదురం బవుచు వివిధ
పాకరీతుల నొప్పుకావ్యము సువర్ణ
పాత్రికలయందుఁ గవి మహాభాగ్యశాలి
యమృత మస్తని యిడును మృష్టాన్నమట్లు. ౨౧

క. నోరికొలఁదు లాడఁడు కవి, మేరువుఁ దృణముగఁ దృణంబు మేరువు గాఁగన్
సార మసార మసారము, సారము గావించు శక్తిసామర్థ్యములన్. ౨౨

శా. రమ్మన్నన్ వెస రావు రావలదనన్ రాకుండఁగాఁబోవు ర
మ్యమ్ముల్ కైతలకుం గళాకళలు వేళావేళలుం గల్గు సం
ద్రమ్మం బొందెడిపాటుపోట్లకుబలెన్ సంగీతసాహిత్యమా
ర్గమ్ములోవ్వ యిపి స్వస్థచిత్తులకుఁ దక్కం ద్రొక్కఁగారాని వౌ. ౨౩

ఆ. వె. చీమ చిటుకురన్నఁ జీఁకాకుఁ జెందెడు, నెదుట భేరిమ్రోయ నెఱుఁగకుండు
సున్నితంబుగాదుసూడ మ్రోడనరాదు, కవిమనంబు తెఱఁగుకపియెఱుఁగు.

ఆ. వె. కాఱుమబ్బు గ్రమ్ముకటికిచీఁకటిరాత్రి
త్రోవతెన్ను గనక త్రొక్కులాడి
యట్టె మెఱపుమెఱసి యర్థమెల్ల స్ఫురింపఁ
బొంథుఁడట్లు కవియుఁ బ్రమద మొందు. ౨౫

ఉ. ఆవిరదృశ్యరూపమున నర్యమతప్తమహార్ణవోద్గతం
బై వినువీథిఁ జల్లగ నవాంబుదరూపము నొందునట్లుగా
నేవో యసంగతార్థము లనేకముగా హృదిఁ దోఁచి భావముల్
వే విపులత్వ మొందెడు వివేకసమీక్షృతరమ్యమూర్తులై. ౨౬

మ. తొలుతన్ సన్ననినూలుపోఁగువలెఁ బ్రాదుర్భూతమై సాఁగి యా
వల నంతంత స్వభావమైత్రి నెఱపం బ్రాపించు నేళ్లం గడున్

బలుపుం జెంది యతిక్రమించి విషమావస్థల్ ప్రశాంతిన్ సమ
స్థలిఁ బాఱుం గవిరమ్యమానసరసస్సంభూతగంగౌఘముల్. ౨౭

క. అది యిది వ్రాయుం డనుచు సు,హృద్దు లెంతయు వేఁడుచుందురిది వ్రాయుదు లే
నిది వ్రాయు టశక్యంబు,న్నది వ్రాసిన మెచ్చ రింక నగు మౌనమె మేల్. ౨౮

క. తుడిచెను ముత్తెము లన్నియు, విడిచెను మఱి నత్తగుల్లపిం డెల్లను బా
ఱుఁడు మేటిధీవరుఁడె యగు, నడఁచెనె రత్నాకరాఖ్య నంభోనిధికిన్. ౨౯

ఉ. చెప్పెడిదేమి క్రొత్తగను జెప్పెడిచొప్పలె క్రొత్తగా కిలం
జెప్పఁ గలట్టివాఁ డెపుడు జీవదశాపరిణామతత్త్వమే
చెప్పెడుఁగాని వేఱొకటి చెప్పఁగనేరఁడు నేర్చెనేనియుం
దప్పక వాని నెన్నఁదగుఁ దాఁ దననీడను దాఁటుజాణఁగాన్. 30

ఆ. వె. క్రొత్తత్రోవఁ ద్రొక్కి క్రొత్తసీమలఁ జూపి, క్రొత్తచవులఁ దేల్చి చిత్తములకుఁ
గ్రొత్తవికసనంబుఁ గూర్పనియాకైత, సెప్పి యేమి యింకఁ జెప్పకేమి. ౩౧

గీ. పాడినదె పాడెదేని మున్ పాడినట్టి, వారికన్నను సొగసుగాఁ బాడవలయుఁ
బాడలేకున్న నగుదురు ప్రాఁచిపండ్లు, దాసరీ యంచు నిను గేలిసేసి జనులు.

గీ. పరమపురుషార్థ మంచును వ్రాసినదియె, వ్రాయఁదలఁచినఁ దప్పలే దేయెడలను
రామకోటులు వ్రాసి శ్రీరామపాద, పద్మసన్నిధి నిడమె సద్భక్తి మ్రొక్కి. 33

* * * *

శా. పద్యం బల్లుటయే కవిత్వ మని సంభాషించు సాహిత్యస
ద్విద్యాగంధదరిద్రు లెంచ నరులే పెంజీఁకటిం గానలో
ఖద్యోతంబులఁ జూచి నిప్పలనుచుం గ్రాఁగం జలిం బ్రీతిమై
నుద్యోగించెడివెఱ్ఱివానరులుగా నూహించి చూడం గడున్. ౩౪

క. వసుచరితమొ మనుచరితమొ, కసిగాట్లుగఁ గొఱికి లేచి గబ్బునఁ ద్రేఁపన్
రసహీనులు కవనపుఁబే, ర్వొసఁగించెదరా యజీర్ణపుం ద్రేఁపులకున్. ౩౫

ఉ. తియ్యనినీరు కొబ్బరియుఁ దేపకుఁ ద్రావ భుజింప నబ్బునం
చొయ్యనఁ గోశముం దెఱచి యోపికమైఁ బరికించిచూడఁగా
నయ్యది యే పెదకొంపవలె నజ్ఞమనంబునుబోలె శూన్యమై
దయ్యపుఁగాయ యయ్యెను వృథాశ్రమ మిచ్చుచు నేమి సెప్పదున్. ౩౬

ఆ. వె. టెంక తోక తక్క నింకేమి లేకొక్క, మాఱు చప్పరించి పాఱవేయు
బుడుతమావిపండ్ల పోలికఁ దుచ్ఛంపుఁ, గృతిశతంబు లేమి తృప్తి సేయు. ౩౭

గీ. విఱువవిఱుగకకోఱుకంగఁగొఱుకువడక,నమలనమలంగఁజప్పనైనారసాఁగి
నోరునొప్పించుకవనంపుధోరణులకు, బ్రెముక్కముదురుపాకపుజీడిపిక్కలకును.

క. భాసుర మగురసము రసా, భాసము ననురెంటివన్నెవాసియుఁ గనకే
చేసినకవనము బంగరు, పూసిచరవణంబువోలె మోసముఁ దెచ్చున్. ౩౯

గీ. చిన్నిబోగంపుఁబిల్ల గజ్జియను గట్టి, యభినయించెడి శృంగారమట్లు కవియు
ననుభవములేక వర్ణించునట్టిదియును,రసికహృదయంబులకుఁ గాను రంజకంబు.

క. భావమునకుఁ దగుపద్దెము, గావలెఁ గాదేని కుంభగతదీప మగున్
జీవున కుపాధి దొడ్డది, యైవెలయక సుప్రకాశ మబ్బదుగాదే. ౪౦

* * * *

మ. ప్రతిపద్యంబు రసాస్పదంబుగ రచింపన్ శక్తి లేదేని పం
డితులుం బామరులుం జెలంగి పొగడన్ లేవేని నేర్పుల్ పురా
కృత మింతే యని చింతనొందఁ దగ దింకేమన్నఁ బ్రాజ్ఞుండు సం
స్కృతకావ్యామృతపానమత్తమతియై క్రీడించు టొప్పం గడున్. ౪౧

ఆ. వె. ప్రాణి యూర్పుఁబుచ్చు భావంబు వెలిఁబుచ్చు,మాటనైననొండుపాటనైన
నుల్లముల్లసిల్లనూరకుండఁడుతీయు, మూఁగయయినఁ గూనురాగమొకటి.

మ. తన కానందముఁ గూర్చుతందనములం దా మెచ్చుకోఁ జెల్లెడుం
దన కీడైనజనంబు మెచ్చఁదగు లేదా లొచ్చువారేనియుం
దనకుం బెక్కుమడుంగు లుత్తములు తత్త్వజ్ఞుల్ ప్రశంసింప లే
దని దూపిల్లుచుఁ దాల్మిఁ బోవిడిచినన్ హాస్యాస్పదుం డయ్యెడున్. ౪౪

క. రసవంతమేని కావ్యము, రసికులు తమయంత మెచ్చి ప్రాపుదు రెలమిన్
భసలములు పారిజాత, ప్రసవంబులమీఁద వచ్చి వ్రాలుట గనమే. ౪౫

మ. పుటలన్ లెక్కిడి గొప్ప చెప్పికొనెదున్ మాహాత్మ్యఁ డొక్కండు సం
పుటముల్ దొంతరవెట్టి సంతసమునం బొంగున్ మఱొక్కండు దా
ఘటికం జెప్పితి నేకధారగ శతగ్రంథంబు నంచున్ సము
త్కటమోదంబును బొందు వేఱొకఁడు చిత్రం బల్పసంతోషముల్. ౪౬

క. ధృతరాష్ట్రునిసుతశతకము, వితమునఁ దమకృతులు భీనువికృతులయి క్షితిన్
బ్రతుకుసెడి యుంటఁ జూచిన, కృతికర్తలు కావుటెట్లు మృతజీవులికన్. ౪౭

క. నిలుకడయె వలయునేనిన్, నిలుకడయే వలయుఁ గృతికి నిమిషార్ధములో
పల నిండిపొంగిపారలెడి, సెలయే ఱడఁగెడునడఁగునె జీవనది యికన్. ౪౮

క. తొలుదొల్తటితమకృతులను, వెలయింపరు కవులు పేరు(బెంపు నడ(చు నం
చెలమావియంటుతో(టల, శొలిపూ(తల( ద్రుంచివేయుదురుగద కృషికుల్.

ఆ. వె. క్రొత్తసొమ్ము వెట్టికొని పెండ్లికేగునం
దా(క నిలువలేని తరుణులట్లు
అల్లి చవలు లొకటి యపుడె యచ్చిడి యొరుల్
- మెచ్చుకున్న( జిన్న(బుచ్చుకొంద్రు. ౫౦

* * * *

శా. బిడ్డం దొట్టిని(బెట్టి యూ(చుటకునై పేరంటముం జెప్ప(గన్
దొడ్డమ్మల్ పదిమందిచేరి నిసువుం బోలంగ నీక్షించి యీ
బిడ్డం డొప్పును నోరు చిన్న కడుపే పెద్దంచు నేమేమొ పే
ళ్లిడ్డం దల్లియు( బ్రొడవోలె నవి మీదృగ్దోష మంచు న్నగున్. ౫౧

ఉ. విద్దెలపేర్మి చాలనికవిత్వమునం బొడసూపు దోసముల్
దిద్దికొనంగ( దెల్పినసుధీమణి వంద్యు(డుగాక నింద్యు(డే
యుద్దము( జూచి నేర్పు మెఱయన్ సవరించుకొనంగ నొప్పగున్
ముద్దతెఱంగుసూపె మఱి మూతిముడుంచుక దాని( ద్రోయుటల్. ౫౨

గీ. కురులనెగదువ్వ(గొటుకమఱక(దుడువ, బొట్టుసవరింపమెడసొమ్ము మట్టుపఱుప(
దోసుపడు(గానియద్దంబుదొడుపడునె,కోలమొగమునుగావింపగుండ్రమొగము

శా. ష్షాలిత్యంబుల కెందు సంస్కరణముల్ సాధ్యంబు లౌ(గాని యు
న్మీలన్మూలపదార్థతత్త్వవికృతిం దీర్పంగరా దెరికిం
బోలుం గస్తురిబొట్టువంకరను సంపూర్ణంబుగా దిద్ద నే
లీలం గోలమొగంబు గుండ్రముగ( గల్పింపంగ శక్యంబగున్. ౫౪

ఆ. వె. తెలిసి యొక(డు మెచ్చ( దలద్రిప్పు నింకొక్క(,డద్దిసూచిగంగిరెద్దువోలె(
దాతమ్మతిని వినుచు( దల్లి గొల్లన( దల్లి, యేడ్పు నూచి బిడ్డ( డేడ్చునట్లు. ౫౫

గీ. పందివలె నోట ఘుర్ఘురింపంగ నొక్క(, డచ్చముగ(బందియేయని మెచ్చిరతని
నింకొక(డు పందిపిల్లనె చంకడా(చి, దాని( గూయింప మెచ్చ రద్దాని జనులు.

క. లోకులు పూజితపూజకు, లే కావున( గ్రొత్త మెచ్చ రిక( బ్రా(తయు రో(
తై కానంబడు వీరల, వాకులకున్ లేదు శుద్ధిబద్ధము నెంచన్. ౫౭

గీ. పెట్టినను బెండ్లి యందురు పెట్టకున్న, నింకొకటి యందురొకయింత శంక లేక
తోరణంబులు ద్రెంతు రాదుండగంపు(, గవుల నందులకైన మెచ్చవలె(బొండి.

క. తప్పున్న మీఁదఁ బడుదురు, త్రుప్పులు దుల్లింత్రు చెవ్రులత్రుప్పు లటుండన్
జప్పునఁ జేపట్టుచుఁ దమ, త్రుప్పుంగంటముల వారిత్రోవఁ జనకుఁడీ. ౫౯

*　　*　　*　　*

మ. పరమానందరసానుభూతికయి ప్రాప్తం బైనయోగంబు దో
మ్మరివిద్దెల్ ప్రకటింపఁ బాల్పడినసామ్యాసం గవిత్వంబు కొం
దఱనోళ్లంబడి యాశుధార లవధానంబుల్ మొదల్గల్గుశూ
న్యరసాకారవికారముల్ గని స్వకీయాన్నత్యముల్ వీడెడున్. ౬౦

ఆ. వె. ఉప్పువేయునొక్కఁడుడుకఁబెట్టునొకండు, కలియఁబెట్టఁసికనొకండునడుమ
నోరు దెఱచి సభను గూరుచున్నజనంబు, చప్పరించుఁ జేతు లప్పళించు. ౬౧

ఆ. వె. వట్టిలక్కపిడత లట్టిట్టు ప్రాయిమీఁదఁ, బెట్టినట్టి పెట్టి పెట్టుటకును
నేది యొదవకున్న నిది యన్న మిది పప్పు, టంచు బిడ్డలాడునాట లివ్వి.

క. పిల్లకవు లనెడియల్లరి, పిల్లకవుల్ సేరి రచ్చ పెనుమడువులసాం
పెల్లఁ జెడఁగొట్టుకొనఁ గం, పిల్లెడు సుమనోగణంబు పెల్లగువికృతిన్. ౬౩.

ఆ. వె. తిట్టుఁబోతుకవులు బట్టురాచకవులు, పిల్లకవులు కవలపిల్లకవులు
కనుపకలపుంగవులు నినుపగంటపుంగవుల్, బాలకవులు న్యగ్గుఁబాలకవులు. ౬౪

క. ఊరూరఁ గవులె యందఱు, నోరూరఁగఁ జవులువుట్ట నొడివెడివారల్
నూఱుగురలోఁ బదుంద్రును, బేరుకొనం గానఁబడరు పేరొంది నను బలెన్. ౬౫

క. తుమ్మినఁ దగ్గినఁ గవనము, గుమ్మమునకు మామిడాకు గ్రుచ్చినఁ గవనం
బిమ్ముసెడు పేదవిప్రుక, తమ్మునబలెఁ గ్రొత్తకుండఁ దడుప భయమ్మా. ౬౬

గీ. కాఱుచౌకయ్యెఁ గవనంబు కాగితంబు
మిగులఁ గఱవయ్యెఁ గవు లెట్లు మిడుకువారొ
యనదగేస్తులకొంపచూరాకు లూడఁ
బీఁకి పాకంబు లిడకుంద్రుగాక యింక. ౬౭

గీ. వారు వీ రిడుపదకముల్ బాసికములు, శాలువులజోళ్లు రమ్య వేషములుగాఁగ
శృంగములు మొల్చునీకవిపుంగవు లహో, యంకెలిడుదురు రచ్చ లలంకరించి.

*　　*　　*　　*

ఆ. వె. తల్లిబిడ్డకెట్లొ తలయెట్లొ నాల్కకు, నట్లె సంస్కృతమును నాంధ్రమునకు
సాంస్కృతికముగానిసాహిత్యమాంధ్రాన, నేలవిడుచుసాముఁబోలియుండు.

ఆ. వె. సంస్కృతాంధ్రపురాణసాహిత్యములు మూఁడు, సరసకవికి సమతసాఁగనేని
వానికపిత పట్టఁబగ్గాలు లేక ము,జ్జగము నుద్ధవడిని జంగగొనెడు. ౨౦

ఆ. వె. అనుట తగదుగాని యల్లసర్వజ్ఞుఁడుం, జూపలేఁడు వాని కోపలేఁడు
మూఁడుకన్నులున్న ముమ్మొనవాలున్న, మూఁడుజగము లేలుమూర్తియైన.

చ. చదివినవారికంటె సరసంబుగఁ గూరుప నేర్తు రంతగాఁ
జదువనివారె మించి సహజప్రతిభన్ వినుశాస్త్రి మేమిటం
గొదవడకుండఁ బాడినను గూర్చునె కోమలగాత్రమాధురిం
బొదలినగాలిపాటఁ గలభూరిసుఖంబును గాయకుం డిలన్. ౨౨

* * * *

ఉ. అంగడిదోసెలట్లు తెగనమ్మెడియల్లరినాటకంబులం
బొంగుచుఁ గొంద్రు నీరసులు ముట్టరు మూర్ఖుల రన్యులైనవా
రెంగిలివంటపుట్టిమెతుకేనియుత్రవ్వఁ డిచ్చగించెడున్
సంగతభక్తభావమున సామిప్రసాదమె కోరుఁగా కిఁకన్. 23

గీ. కడుపులోఁ బెట్టుకొనలేముగదయివన్ని, యింటిలోఁబెట్టుద మటన్న నెలుకబాధ
యేమిసేయుదుమయ్య యింకీవిచిత్ర, నాటకంబుల బిడ్డలయాట కిత్తు. ౨౪

ఆ. వె. మూరపాడుగెకాని పోఁగుచిక్కన లేదు, కట్టికొన్న గుట్టు బట్టబైలు
పిడత గట్టికాని పెరుఁగు పల్చన నేఁటి, కవితలందు నేటికవిత లివ్వి. ౨౫

ఆ. వె. హాస్యరచన లనుచు నపహాస్యములు వ్రాసి, వింతనవ్వుగొలిపి సంతసింత్రు
వెక్కిరింపఁ బోయి వెనుకఁ బడుటచేతఁ, బ్రౌఢులకును దెత్తు రలఁతినగవు.

గీ. మృదుత దప్పినహాస్యంబు మేలుగాదు, మృదుతనొప్పిన సరసులు మెచ్చికొంద్రు
ముడ్డి గిల్లినఁ గెవ్వని బిడ్డ యార్చు, బుగ్గ గిలిగింప నగుఁ జిన్నిబోసినవ్వు. ౨౭

* * * *

క. ఒకబాసలోనిరస మిం, కొకబాసకు నిండఁ దివియ నుంకించుకవుల్
తికమకలువడరె టెంకా, యకు లోనయి చేతులాడనట్టికపులె యై. ౨౮

గీ. త్రాగనేరనిపిల్లి బోరగిలఁ ద్రోసి, నేలపాలైనపాలఁ గొన్నింటి నాకు
నట్లు కొందఱు మూలంబు నందలిరస, మెల్లఁగొనలేకయల్పసంతృప్తిఁగంద్రు.

క. పాలగుదురు నగుఁబాట్లకు, మూలార్థముఁ గాన కేదొ ముడిపెట్టుకవుల్
నేలఁ బడ నన్న మంతయుఁ, బోలియుఁ దల చిక్కుశ్వానములఁ బోలి యహో.

క. తాత్త్వికకవులకవిత్వపుఁ, దత్త్వము వారలకెగాని తదితరులకు లా
కేత్వంబ యిద్ది వారిక, విత్వముసొంపా మఱి తత్త్వవిత్త్వము పెంపో. ౩౧

ఆ. వె. దొరలభావములను దొరలటోపీలతో
సరిగఁ గొనుచుఁ దెలుఁగుదొరల మంత్రము
తెలుపు నలుపుఁ జేయఁ దెలియనియీయింగి
లీషుపండితులవిశేష మిద్ది. ౨

ఉ. నన్నయతిక్కనాదికవినాథులు మున్ను మహాపురాణముల్
చెన్నుగ నాంధ్రభారతికిఁ జెప్పినచొప్పులు చేతఁగాక యం
దున్నది సాఁగఁ గొట్టుటయె యొప్పను కేవలపద్యకారులా
మిన్నతనంపుసొంపుఁ బనినేరనిసొన్నరు లే యనందగున్. ౩

క. నన్నయకుఁ దెలుఁగుఁ దిక్కన, కెన్నంగా సంస్కృతంబు నీరెండును బో
తన్నకుఁ దెలియవు దెలియు ని, వన్నియు నా కనుచుఁ దలఁచునజ్ఞుల నగరే.

క. కొందఱకుఁ దెలుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు నింకం
గొందఱకుఁ రెండు గుణమగు, నందఱ కన్నియు గుణంబులగుట గలుగునే.

* * * *

ఉ. తియ్యనిద్రాక్షపండ్లకును దీటయి తేనెయరంటిపండ్లకున్
వియ్యములై రసాలములనెయ్యములై మఱి జుంటిపాలకుం
దియ్యములై యొసంగుమన తెన్గులు వీనులవిందు సేయ న
క్షయ్యముదంబునం బ్రదుకఁగల్గుదు మన్నము నీళ్లు లేకయే. ౬

ఆ. వె. ఇట్టియాంధ్రభాష నట్టిట్టు గావించి, పెంపువేరు సెప్పి పేరుఁ బెంపు
నింపు సొంపు నన్ని యెడలించి సడలింపఁ, జూచుచున్నవారు చోద్యముగను.

క. గ్రామ్యగ్రాంథికభాషా, స్వామ్యపరిష్కృతికి రచ్చపట్టెక్కి కవుల్
రమ్యేతరవృత్తిం గొని, భూమ్యాకాశముల మాఱుమ్రోయింతు రయో. ౮

గీ. ఎత్తు తగ్గించి మఱికొంతయిరవు సేయఁ, గోటగోడలు పగులంగఁగొట్టి నేల
మట్ట మొనరింతు రావలఁ గట్టలేరు, రక్షకము లేక కలుగు నరాజకంబు ౯

గీ. ఎత్తు తఱిగిన గొప్పదై యొసఁగుభాష, యంత్రము కాని చూడగుపల్చనగుట వెనుక
గుల్లసొమ్ముట్లు పైగొప్ప వెల్లడించు, మేలిమై మెడఁ దిరుగుట మేలుగాదె.

ఆ వె. ఎగుగుఁబొదుగు లేనియెండుకొయ్యమతంబు, వారివలెనుబలుకు వాఁడఁగాను
సరసకవులచేతఁ బెరిఁగి యింపును సొంపు, నింపవలయు భాష తెంపు లేక. ౧౦

జనమంచి వేంకటరామయ్య.

శుభమస్తు.

# వర్ణోత్పత్తి.

పరమేశ్వరునిచే సృజింపఁబడినప్రాణికోటిలో మనుష్యులు శ్రేష్ఠులని యెల్లరును నంగీకరించినయంశమే. నిద్రాహారభయాదులు సమములైనను వీరికి శ్రేష్ఠత జ్ఞానాధిక్యమువలనఁ గలిగినది. ఈవిశేషజ్ఞానము లేనిచో నితరజంతువులకంటె వీరియందాధిక్య మున్న దనుట కవకాశ ముండదు. కాన వీరికి శ్రేష్ఠతను గలుగఁజేసినది జ్ఞానమే. ఈజ్ఞానతారతమ్యమునుబట్టి వీరిలోఁగూడఁ దరతమభావ మేర్పడుచున్నది. ఏమనుజుఁడైన నుత్తమతను బొందవలయునన్న నెక్కుడు జ్ఞానమును సంపాదింపవలయును. జ్ఞానసంపత్తికి "ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము" అని నాలుగుసాధనములు గలవని కొందఱువిద్వాంసులు నిరూపించిరి. మఱి కొందఱు "అర్థాపత్తి, అనుపలబ్ధి" అను మఱి రెండింటినిగూడ నొప్పుకొనిరి. ఈసాధనము లన్నిటిలోను విద్వాంసులయుపదేశమువలన బుద్ధి వికసించినయెడల ననుమానాదులు విశేషజ్ఞానసంపద కుపయోగించును గాని లేనిచో నుపయోగింపవు. కావున నాయుపదేశరూప మగుశబ్దము ప్రధాన మని చెప్పవచ్చును. ఆశబ్దము వర్ణసముదాయరూపము. (ఇచట వర్ణసముదాయమే శబ్ద మని కొందఱును నతిరిక్తమని మఱికొందఱును విప్రతిపన్నులగుచున్నారు. అయినను వర్ణమునుగాని వర్ణస్థానీయములుగా మఱికొన్నిటినిగాని యందఱు నంగీకరించియేయున్నారు. అవర్ణస్థానీయములకుఁగూడ వర్ణములని పేరిడినచో నందఱును వర్ణముల నంగీకరించినవారే యగుదురు.) ఈవర్ణపరిశుద్ధి, శబ్దపరిశుద్ధికిఁ గారణము. వర్ణపరిశుద్ధి లేనిచో శబ్దము పరిశుద్ధము కానేరదు. అపరిశుద్ధ మగుశబ్ద మభిమతార్థమును బోధింపక విపరీతార్థమును బోధించునుగనుక నుపదేష్టల కనభిప్రేతమగువర్ణజ్ఞానము బోద్ధలకుఁ గలుగును. కావున నాయుపదేశము నిష్ఫలమగుటయేకాక విపరీతఫలమును బుట్టించును. అది యెటులనఁగా, గుఱ్ఱమును గొనిరమ్మనుతాత్పర్యముతో "అశ్వ మానయ" అనువాక్యమును బ్రయోగింపవలసియుండగా నావాక్యమందలిశవర్ణ మపరిశుద్ధమై సకారమునుఁబోలి యుచ్చరింపబడెనేని బోద్ధకు "అస్వమానయ" అని శ్రుతిగోచరమై

నిర్ధనుని గొనిరమ్మను నర్థము స్ఫురించును. అపు డతఁడు గుజ్జమును దీసికొనిరాక నిర్ధనుని దీసికొనివచ్చును. అపుడు వక్తృతాత్పర్యార్థసిద్ధి కాలేదుగదా. దీనికి శవ ర్ణముయొక్క యపరిశుద్ధియే కారణము. కావున వర్ణములపారిశుద్ధ్యమును సంపా దింపవలయును. ఆపారిశుద్ధ్యము వర్ణములయుత్పత్తిసామగ్రిని దెలిసికొని యుచ్చ రించునపుడు తప్పక సిద్ధించును. ఈసామగ్రిని దెలిసికొననివారు గూడ శుద్ధము గనే యుచ్చరింతురు. కాని యొకానొకపుడైన నచట భ్రమ కవకాశ ముం డును. కనుక నట్టిభ్రమ లేకుండుటకై వర్ణోత్పత్తిసామగ్రి విమర్శింపఁదగి యున్నది. ఇట్టిభ్రమ కవకాశ మున్నపుడు తన్నివృత్తికై వకారబకారముల కును, శకారసకారషకారములకును, భేదమును దెలుపుటకు దంత్యోష్ఠ్యమనియు నోష్ఠ్యమనియుఁ దాలవ్యమనియు దంత్యమనియు మూర్ధన్యమనియు వ్రాయుట గ్రంథకారసమయసిద్ధమై యున్నది. కావున వర్ణోత్పత్తిసామగ్రిని నిరూపించుట యావశ్యకము.*

మఱియు నీసామగ్రిని గుర్తెఱింగిన మఱియొకలాభము కలదు. మాట లాడువారివైగుణ్యమువలన వర్ణములు మార్పునొందును. అట్లు మార్పునొం దునని "దైవీవాగ్వ్యవకీర్ణేయ మశక్తై రభిధాతృభిః" అనుకారికచే భర్తృ హారి వాక్యపదీయమునందు వక్కాణించెను. అటులు మార్పు నొందునపు డా శబ్ద మసాధు వనఁబడును. అట్టియసాధుశబ్దము నుచ్చరించునపుడు ప్రాజ్ఞులు సాధుశబ్దమును స్మరించి యర్థమును దెలిసికొందురు. ఎటు లనఁగా:—బాలుఁ డవ్యక్తముగ శబ్దము నుచ్చరించునపుడు వ్యక్తశబ్దమును స్మరించియే, పెద్ద లర్థ మును దెలిసికొందురు. ఈయంశమును "అంబాంబేతి యదా బాలశ్శిక్షమాణోఽపభాషతే అవ్యక్తం తద్విదాం తేన వ్యక్తే భవతి నిశ్చయః" అను కారికచే భర్తృహారి స్పష్టపఱిచెను. ఇది యనుభవసిద్ధము. కొన్నియసాధుశబ్దములు పారంపర్యమునఁ బ్రసిద్ధినొందెను. అచట సాధుశబ్దస్మృతి లేకయే యసాధుశబ్ద ములవలననే యర్థబోధ కలుగును. ఇట్టివే యొకభాషలో నసాధువు లనిపించు

---

* కొందఱు వర్ణములు నిత్యము లనునభిప్రాయమును గలిగియున్నారు. వారియభిప్రాయము చొప్పున వర్ణముల కుత్పత్తియే లేనపుడు సామగ్రి యుండదు. అయినను నుత్పత్తి లేదనువా రభి వ్యక్తి నంగీకరించెదరు. ఆయభివ్యక్తి కుత్పత్తివాదుల యుత్పత్తిసామగ్రియే సామగ్రియై యున్నది. కావున సామగ్రీభేదము లేనందున నాసామగ్రి యిట నిరూపింపఁబడును.

కొనినను మఱియొకభాషగా మాఱి యచట సాధువు లనిపించుకొనుచున్నవి. ఈయంశమును "పారంపర్యా దపభ్రంశా విగుణే ష్వభిధాతృషు। ప్రసిద్ధి మాగతా యేతు తేషాం సాధు రవాచకః" అనుకారికచే భర్తృహరి స్పష్టపఱిచెను. సంస్కృతవికారము లగుప్రాకృతపదములును దద్భవాంధ్రపదములును నిట్టివే యయియున్నవి. ఈమార్పు లనియతములుగాక చాలవఱకు నియతముగానే యుండును. ఈనియమమునకుఁ గారణమేమనఁగా—ఆయావర్ణములకుండుసామగ్రి వికలమగునపుడు వక్త దానికి దగ్గఱగానున్నసామగ్రి నుపయోగించునుగాని దూరమగుసామగ్రి నుపయోగింపఁడు. కావున నొకవర్ణముయొక్కయుచ్చారణసామగ్రి వికలమైనపుడు సామగ్రిచే దాని కేవర్ణము సన్నికృష్టమో యదియే యుచ్చరింపఁబడునుగాని మఱొకటి యుచ్చరింపఁబడదు. జకారయకారములసామగ్రి చాలదగ్గఱదియగుటచేత యకార ముచ్చరింపఁబడుచోట జకార ముచ్చరింపఁబడుచున్నది. ఆర్య-అజ్జ, కార్య-కజ్జ, యామ-జాము. ఈసామగ్రీసాన్నిధ్యమునుబట్టియే యుత్తరదేశమున యకారజకారముల కుచ్చారణభేద మగపడదు. ఇటులే వకారబకారములకును శషసలకును విశేషభేద మగపడదు, మధ్యదేశమున ఋకారోచ్చారణమునకును రేఫోకారోచ్చారణమునకును విశేషభేదము కనఁబడదు. ఇటులే దక్షిణదేశమున ఋకారమును రేఫేకారములను బోలి యుచ్చరించెదరు. దీనినిబట్టియే కృష్ణమూర్తి క్రిష్ణమూర్తి యాయెను. ఇటులే థకారధకారోచ్చారణములో విశేషభేదము కనఁబడదు. ఈసాంకర్యము గమనించుటకు వర్ణోత్పత్తిసామగ్రి ముఖ్యముగాఁ దెలియఁదగినది. దీనిని దెలిసికొనిన, నేభాషలోనిశబ్ద మేభాషలోని కెటులుమాఱినదో సులభముగాఁ దెలిసికొనవచ్చును. దీనివలన శబ్దవ్యుత్పత్తులు సుజ్ఞేయము లగును. వానివలన శబ్దశక్తి విస్పష్ట మగును. కావున వర్ణోత్పత్తి నిరూపింపఁదగిన దని యెంచి నామిత్రులు చేసినయాజ్ఞను మీఱలేక దానిని నిరూపింప సామర్థ్యము నాకు లేకున్నను

> గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళావివేశ్వరః।
> శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥

అనుసూక్తిని నమ్మి నా కున్నజ్ఞానము కొలఁది నిరూపింప సాహసించితిని. నాసాహసమును విద్వాంసులు మన్నించెదరుగాక.

శ్వాసకోశములనుండి గాలి పైకి వెడలుటయుఁ, బైనుండి గాలి లోపలికిఁ బ్రవేశించుటయు సహజమై యున్నది. ఈపద్ధతి ప్రాణులజీవనమునకును నారోగ్యమునకును సాధనముగ భగవంతునిచేత నేర్పఱుపఁబడినది. అందుఁ బైకి వెడలు గాలికి "నిశ్వాస" మనియు లోపలికిఁ బ్రవేశించుగాలికి "ఉచ్ఛ్వాస మనియుఁ బేళ్లు. మనుష్యునకు నికర్షము ననఁగా, సంకోచమును గలుగఁ జేయు శ్వాసము గాలి కావున దానికి నిశ్వాస మని పేరు కలిగెను. ఉత్కర్షము ననఁగా ఉచ్ఛభావమును గలుగఁజేయుగాలి కావున దాని కుచ్ఛ్వాస మని పేరు. ఈనిశ్వాసము పైకి వెడలుటకు ముఖమార్గము, నాసామార్గము నని రెండుమార్గములు గలవు. అందు నాసామార్గమున వెడలినది యారోగ్యసాధన మగును. ముఖమార్గమున వెడలినది యట్టి యారోగ్య సాధనము కాదు. ఈయుచ్ఛ్వాసనిశ్వాసములు పురుషేచ్ఛ యక్కఱలేకయే సుషుప్తికాలమునందుఁ గూడ నుండును. ఈనిశ్వాసమే వర్ణోచ్చారణేచ్ఛాసహకృత మగునపుడు వర్ణోత్పత్తికిఁ బ్రధానకారణ మగును. (ఉచ్ఛ్వాసమువలనఁ గూడ నొకప్పుడు వర్ణోత్పత్తి గావచ్చును గాని యవు డుత్పన్నము లగువర్ణములు పశ్యంతీరూపమునుఁ దాల్చి యితరులకు శ్రుతిగోచరము కానేరవు. కావున నవి ప్రకృతమున విచారణీయములు కావు, కావున నిశ్వాసరూపవాయువే వర్ణోత్పత్తికి ముఖ్యసాధన మని చెప్పితిని.) ఈనిశ్వాసవాయువువలననే యన్నివర్ణములును బుట్టును. అయినను శ్వాసకోశము మొదలుకొని యోష్ఠములవఱకు నుండునవయవవిశేషముల సంయోగవిశేషములవలన నీవర్ణవిభాగము సిద్ధించును. ఆభేదము లిటుఁ జూపఁబడును. ఏదేని యొకయర్థమును బోధింప నిచ్ఛ కలిగినపు డాయర్థమునకు నుపస్థాపక మగుశబ్దము నుచ్చరింపవలె ననునిచ్ఛ మనంబునఁ గలుగును. అట్టి యిచ్ఛతోఁ గూడినమనస్సు జాఠరాగ్నిని బ్రేరణ చేయును. అగ్నిప్రేరణమువలన బయలుదేఱిన నిశ్వాసవాయు వురోభాగమునందు సంచరించుచు మంద్ర మనుపేరుగల స్వరమును బుట్టించును. దీనినే ప్రాతస్సవనమునందు యాజ్ఞికు లుపయోగింతురు. కంఠమునందు సంచరించునపుడు మధ్యమ మనుపేరుగల స్వరమును బుట్టించును. దీనినే మాధ్యందినసవనమునం దుపయోగింతురు. శిరమునందు సంచరించి తారస్వరమును బుట్టించును. ఇదియే యాజ్ఞికులచే సాయంసవనమున వాడఁబడును. నిశ్వాసవాయువు వేగాఖ్యసంస్కారయుక్తమై మూర్ధపర్యన్తము వెళ్లి యచ్చటినుండి మరలినపుడు గళవివ

ద్వారమున నాస్యములోనికిఁ బ్రవేశించి యాస్యాన్తర్గతము లగుభిన్నస్థానము లతో సంయుక్తమై యాయావర్ణములఁ బుట్టించును. ఈయంశము "ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనోయుంక్తే వివక్షయా। మనః కాయాగ్ని మాహన్తి స ప్రేరయతి మారుతమ్॥ మారుత స్తూరసి చరన్ మన్ద్రం జనయతి స్వరమ్। ప్రాత స్సవనయోగ్యంత చ్ఛందోగాయత్ర మాశ్రితమ్। కంఠే మాధ్యందినయుగం మధ్యమం త్రైష్టుభానుగమ్। తారం తార్తీయసవనం శీర్షణ్యం జాగతానుగమ్। సోదీర్ణో మూర్ధ్న్యభిహతో వక్త్రి మాపద్య మారుతః। వర్ణాన్ జనయతే తేషాం విభాగః పంచధాస్మృతః॥ అని పాణినీయశిక్షయందు స్పష్టపఱుపఁబడినది. ఈ నిశ్వాసవాయువు గళవివరమార్గమున వెళ్లునపు డుచ్చరింపఁదలఁచిన వర్ణముల ననుసరించి యొకప్పుడు గళవివరమునకు సంకోచమును, మఱియొకప్పుడు వికాసమును, మఱియొకప్పుడు సంకోచవికాసములకు మధ్యావస్థయుఁ గలుగును. సంకోచము గలుగునపుడు సంకుచిత మగుగళద్వారమునుండి వెడలు నిశ్వాసము నాదరూపమును బొందును. ఈనాదమె యచ్చులకు, వర్గతృతీయపంచమవర్ణములకు, యరలవలకు ననుస్వారమునకును గారణమైనది. ఈనాద మీషన్నాద మని శిక్షలో వాడఁబడినది. గళవివరమునకు మధ్యావస్థ గలిగినపుడు వెడలిన నిశ్వాసము హాకారరూపమును బొందును. ఇదియే నాద మని పాణినిశిక్షలోఁ జెప్పఁబడినది. ఈహాకారధ్వనియే హాకారమునకును, వర్గచతుర్థవర్ణములకును గారణభూత మైనది. గళవివరము వికాసమును బొందినపుడు వెడలిన నిశ్వాసము శ్వాసరూపమగును. ఈశ్వాసముగూడ నీషచ్ఛ్వాస మనియు, శ్వాస మనియు రెండుతెఱంగుల వాడఁబడినది. శ్వాసము ప్రకృష్ట మైనపుడు శ్వాస మనియు, నప్రకృష్టమైనపుడు "ఈషచ్ఛ్వాస" మనియు నెఱుంగునది: అందు వర్గప్రథమములకు నీషచ్ఛ్వాసము నిమిత్తము. వర్గద్వితీయవర్ణములకును, శషసలకును, జిహ్వామూలీయోపధ్మానీయవిసర్గములకును శ్వాసము నిమిత్తకారణము. దీనినిబట్టి వర్ణములను నాదవంతములు, నీషన్నాదవంతములు, నీషచ్ఛ్వాసములు, శ్వాసవంతములు నని నాలుగుతరగతులుగా విభజింపవచ్చును. ఇందు నీషన్నాదములు నీషచ్ఛ్వాసములు నుపాదానకారణ వాయ్వల్పతను బట్టి యల్పప్రాణములనియు, నాదశ్వాసజన్యము లుపాదానకారణవాయుమహత్త్వమునుబట్టి మహాప్రాణము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. ఈయంశము లన్నియు "సంవృతే
థే నాదః క్రియతే। వివృతే శ్వాసః। మధ్యే హాకారః। తావర్ణప్రకృతయః। నాదో

నుప్రదానం స్వరఘోషవత్సు । హకారో హచతుర్థేషు । అఘోషేషు శ్వాసః । భూయాన్ ప్రథమేభ్యోన్యేషు," అను తైత్తిరీయప్రాతిశాఖ్య ద్వితీయాధ్యాయమునందలి 4, 5, 6, 7, 8, 9, 10, 11 సూత్రములవలనను, "అమోనునాసికానప్రహా నాదినో హఝషః స్మృతాః । ఈషన్నాదాయణో జశశ్చ శ్వాసినస్తు ఖఫాదయః । ఈషచ్ఛ్వాసాం శ్చరోవిద్యా ద్గోర్ధా మైతఃప్రచక్షతే।" అనుపాణినీయశిక్షవలనను, దేటపడినది. ఇటీవల వైయాకరణు లవాంతరభేదముల విడిచి నాదవంతములను నీషన్నాదములను నాదము లనియు, నీషచ్ఛ్వాసములను శ్వాసములను శ్వాసము లనియు వ్యవహరించిరి. ఇంకమీఁద నీవ్యాసమునందుఁ గూడ నటులే వ్యవహరింపఁబడును. నాదధ్వని పుట్టునపుడు గళవివరము సంకోచమును బొంది యుండుటచేత నాదజన్యములు సంవారము లనియు, నాదధ్వని విశేషరూపఘోషధ్వని పుట్టుటచేత నవి ఘోషములు లేక ఘోషవంతము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. శ్వాసోపాదానకవర్ణములు శ్వాసజన్యములగుటచేత శ్వాసము లనియు, నావర్ణము లుచ్చరింపఁబడునపుడు ఘోష మల్పమగుటచేత నల్పఘోషములు లేక యఘోషము లనియు శ్వాసము పుట్టునపుడు గళవివరము వికాసము నొందుటచేత వివారము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. మఱియు నేవర్ణముల నుచ్చరించునపుడు ప్రాణవాయు వల్పముగ నుండునో యవి యల్పప్రాణము లనియు నేవర్ణము లుచ్చరింపఁబడినపుడు ప్రాణవాయువు మహత్త్వమునొందునో యవి మహాప్రాణము లనియు వ్యవహరింపఁబడినవి. పైని జెప్పినవిధమునఁ బ్రతివర్ణము నాలుగునామములు గలదై యున్నది. ఉదాహరణము :—క-అనునది, శ్వాసము-అఘోషము-వివారము-అల్పప్రాణము. ఖ-అనునది శ్వాసము-అఘోషము-వివారము-మహాప్రాణము. గ-అనునది నాదము-ఘోషము-సంవారము-అల్పప్రాణము. ఘ-అనునది నాదము-ఘోషము-సంవారము-మహాప్రాణము. ఇటులే ప్రతివర్ణమును గుఱ్ఱించి తెలియఁదగినది. ఈయంశము సంగ్రహముగా సిద్ధాన్తకౌముదియందు "ఖయాం యమాః ఖయఃకపౌ విసర్గశ్శరఏవచ । ఏతే శ్వాసానుప్రదానా అఘోషాశ్చ వివృణ్వతే ॥ కంఠ మన్యేతు ఘోషాః స్యుః సంవృతా నాదభాగినః । అయుగ్మా వర్గయమగా యణశ్చాల్పాసవ స్స్మృతాః ॥" అను కారికలచేఁ దెలుపఁబడినది. పైని జెప్పినవిధమున మొత్తముపైని వర్ణము లెనిమిది ప్రయత్నముల నపేక్షించును. ఈయెనిమిదిప్రయత్నములను బాహ్యప్రయత్న

ము లని మహాభాష్యమునందు వ్యవహరించిరి. తత్తద్వర్ణోత్పత్తి కనుకూల మగు కాకలము (కొండనాలుక) మొదలుగ నోష్ఠపర్యంతము నున్నస్థానములతోఁ గూడియున్న యాస్యమునకు బహిర్దేశమునందు (కాకలమున కధోభాగమునందు) గళవివరవికాసము మొదలగు నాయాకార్యముల నీప్రయత్నములు పుట్టించుట చేతను, నాప్రయత్నోత్పత్తిప్రదేశము పైనిజెప్పిన యాస్యబాహ్య మగుటచేతను, నీప్రయత్నములకు బాహ్యము లని యన్వర్థనామము గలిగెను. ఇటు లెనిమిది బాహ్యప్రయత్నములు వర్ణోత్పత్తికిఁ గారణములై యున్నవి. "ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము" అని మఱిమూఁడు బాహ్యప్రయత్నము లున్నట్లు సిద్ధాంతకౌముదియందుఁ జెప్పఁబడినది. కాని వీనికి బాహ్యప్రయత్న మనుపేరు సార్థకము గానేరదు. ఇవి బాహ్యప్రయత్నములఁ బోలి సవర్ణసంజ్ఞలో నుపయోగింపక యాన్తరతమ్యపరీక్షలో నుపయోగించుటచేత బాహ్యప్రయత్నసాదృశ్యమును బట్టి వీనికిఁ గౌణముగా బాహ్యప్రయత్నము లని పేరు వచ్చినది గాని వీని కా నామము ముఖ్యము కాదు. ఈయంశము శబ్దేందుశేఖరమున "ఉదాత్తాదిజనకయత్న స్యాభ్యన్తరకార్యకరత్వేపి ఉదాత్తాదిశబ్దై ర్వినా చోదితానాం తేషామనజుదాత్త ఇత్యనేనావివక్షా బోధనాత్ సవర్ణసంజ్ఞానుపయుక్తత్వా న్తరతమ్యపరీక్షోపయుక్తత్వరూపసాదృశ్యేన బాహ్యేషు గణనమ్" అనుగ్రంథముచే స్పష్టపఱుపఁబడినది. పాశ్చాత్యపండితులు వ్రాసినరీతినిబట్టి చూడ వీనికిని బాహ్య మనుపేరు ముఖ్య మనియే స్పష్ట మగును. ఈసందర్భమునఁ బైయంశములను గుఱించి పాశ్చాత్యపండితుల యభిప్రాయములను సంగ్రహముగ వివరించెదను. ఉచ్ఛ్వాసమునందు మనచే లోపలికిఁ దీసికొనఁబడిన వాయువు నిశ్వాసమునందుఁ బైకి వెడలును. ఆవెడలునపు డనేకద్వారములలోఁ బ్రవేశించి వెడలును. మొదట వాయుమార్గము Larynx (లేరింక్స్) న బయలువెడలును. ఆమార్గమధ్యమునందు నర్ధచంద్రాకారము లగురెండుచర్మములు Vocal cards (వోకల్ కార్డ్స్) గలవు. ఆరెండుచర్మములు వాయుమార్గపార్శ్వభాగములతో సంయుక్తములై యున్నవి. ఈరెండుచర్మములు వికాసము నొందినపుడు వాయుమార్గము నిరోధింపఁబడును. వికాసము నొందనపుడు క్రిందుగాఁ బడి వాయుమార్గపార్శ్వభాగములయందు దణఁగి యుండును. అపుడు వాయుమార్గమును నిరోధింపవు. అవి వికాసమును బొందినపుడు మధ్యకుఁ జిరిఁగియున్న మృదంగచర్మము యొక్క సమాన మగు ఖండములఁ బోలి యుండును. నిశ్వాసము, ఈరెండు

చర్మములమధ్యమునుండి యూర్ధ్వముగా వెళ్లును. ఈవాయుమార్గమునకుఁ బైభాగమునం దొకమాంసఖండము Epiglottis (ఎపిగ్లాటిస్) కలదు. ఆమాంసఖండము మనమాహారమును భుజించునపు డీవాయుమార్గమును గప్పివేయును. అటులు గప్పనియెడల మనము భుజించినయాహార మీవాయుమార్గమునఁ బోయినచో మన కపాయము వాటిల్లును. ఇతరకాలములయందుఁ బైకి వెళ్లి యాహారమార్గమును మూయును. ఈద్వారము నతిక్రమించి నిశ్వాస మొకపేటికను బోలిన వివరము Pharynx (ఫేరింక్సు) నందుఁ బ్రవేశించును. ఈవివరము క్రిందిభాగమున వాయుమార్గముతోడను నాహారమార్గముతోడను సంబంధము కలిగియున్నది. పైభాగమున నాసికతోను ముఖముతోను సంబంధము కలిగియున్నది. ఈపేటికాకార మగువివరమునకుఁ బైభాగమున ముఖనాసికారంధ్రములు రెండును గ్రిందుభాగమున నాహారమార్గములు రెండును నుండుటచే నొకవిధమైనచతుష్పథమువలె నుండును. ఈవివరమున కుపరిభాగమునందు ముఖనాసికామార్గములఁ గప్పుటకు Uvula (ఉవ్యుల) అనుపేరుగల మాంసఖండము గలదు. ఈమాంసఖండము పైభాగమునకు వెళ్లునపుడు నాసామార్గమును, గ్రిందుగా వెళ్లునపుడు ముఖమార్గమును గప్పును. కేవలోచ్ఛ్వాసనిశ్వాసములు వెళ్లునపు డీమాంసఖండము తటస్థముగా నుండును. పేటికాకారవివరమునందుఁ బ్రవేశించిన నిశ్వాసము ముఖనాసామార్గములలో నెద్దానిమూలమున నైన వెళ్లఁగలదు. పేటికను విడిచి ముఖమార్గమున నిశ్వాసము వెడలునపుడు నిరనునాసికవర్ణము లుచ్చరింపఁబడును. ముఖమార్గములోఁ గ్రిందిభాగమున జిహ్వామూలము, దానిపైని మృదుతాలువు, దానిపైని జిహ్వామధ్యభాగమును గఠినతాలువును, దరువాత దంతపంక్తియును, దరువాత నోష్ఠములును గలవు. ఈ యవయవములు తమవ్యాపారములయందు వ్యాపృతములైనపు డాయావర్ణములు పుట్టును. అది యెటులన, వర్ణోచ్చారణేచ్ఛ పుట్టినతోడనే నిశ్వాసము శ్వాసకోశములనుండి బయలుదేఱి వాయుమార్గములోఁ బ్రవేశించును. ఈ మార్గమునందే నిశ్వాసము శ్వాసనాదభేదము నొందును. శ్వాసప్రయత్నజవర్ణము నుచ్చరింప నిచ్ఛగించునపుడు పూర్వోక్తచర్మములు (Vocal cards వోకల్ కార్డ్సు) వాయుమార్గమును నిరోధింపక క్రిందికిఁ బడి వాయుమార్గపార్శ్వభాగముల నంటియుండి యుదాసీనములై యుండును. ఆచర్మములమధ్యమునుండి నిశ్వాసమప్రతిబద్ధమై మార్పునొందక యూర్ధ్వముగా వెళ్లును. అపు డది శ్వాసరూప

ముగనే యుండును. నాదప్రయత్నజవర్ణము నుచ్చరింప నిశ్చగించినపు డీచర్మ ములు వికాసమునొంది వాయుమార్గమును నిరోధించును. అపు డూర్ధ్వముగాఁ బోవుచున్న నిశ్వాసము స్వబలమువలనఁ జర్మములను బైకి నెత్తి పైకిఁ బోవును. అపుడు నిశ్వాసమునకుఁ జర్మములతోఁ గలిగిన యభిఘాతమువలన నాదము పుట్టును. ఈవిధమునఁ జర్మములు క్రిందఁ బడుటచేతను, మీఁది కుత్క్షిప్తము లగుటచేతను, శ్వాసనాదభేదము కలుగును. ఈచర్మము లుత్క్షిప్తము లగు నపుడు చర్మాగ్రములయందుఁ గంపము కలుగును. ఈకంపముల సంఖ్యయొక్క న్యూనాధికభావమువలన నుదాత్తాదిస్వరభేదము కలుగును. తరువాత పేటికా కారవివరమును నిశ్వాసము ప్రవేశించువఱకును మఱియొకభేదము కలుగదు. అచ్చటినుండి ముఖనాసికామార్గములను వెళ్లునపుడే తత్తద్వర్ణవిభాగము కలు గును. అపుడు ముఖనాసారంధ్రములకు పిధాయక మగుమాంసఖండము వలన ననునాసికనిరనునాసికభేదము కలుగును. అది యెట్టు లన, నీమాంసఖండము నాసామార్గముకప్పి ముఖమార్గమున వర్ణోచ్చారణానుకూలనిశ్వాసమును వెళ్లు నటులు చేయునపుడు నిరనునాసికవర్ణములును, నాసామార్గమును గప్పక తాట స్థ్యము నొందుటచేత రెండుమార్గములనుండియు వర్ణోచ్చారణానుకూలనిశ్వాస మును వెళ్లునటులు చేయునపు డనునాసికవర్ణములును బుట్టును. ఈపాశ్చాత్య పండితులయభిప్రాయమునకును, మనప్రాచీనులయభిప్రాయమునకును విశేషభేద మున్నటులు గాన్పింపదు. పాశ్చాత్యులు చెప్పిన శ్వాసనాదభేదజనక మగుచర్మ ములయధఃపతనవికాసములును మనవారు చెప్పినగళవివరసంకోచవికాసములును నభిన్నము లని చెప్పవచ్చును. మనవారు శ్వాసనాదములలో నవాన్తరభేద ములఁ జెప్పిరి. పాశ్చాత్యులు చెప్పలేదు. ఈయవస్థయందు మనవారు చెప్పిన ఘోషాఘోషములును బాశ్చాతులు చెప్పలేదు. మనవారుకూడ నిది స్వరూప కీర్తనమేకాని దీనివలన విశేషోపయోగమేమియు లేదనియు వక్కాణించిరి. కావున నీయంశములలో వీరి కభిప్రాయభేదము లేదనియే చెప్పవచ్చును. ఉదాత్తాది జనకయత్న మాభ్యంతరముకాని బాహ్యము కాదనియు నచట బాహ్యవ్యవహా రము సాదృశ్యమూలకము కావున గౌణ మనియు మనవారి యభిప్రాయము. శ్వాసనాదభేదనిమిత్తము లగుచర్మముల కంపములసంఖ్యయొక్క న్యూనాధిక భావము "ఉదాత్తాది" జనక మని పాశ్చాత్యులయభిప్రాయము. వీరి యభిప్రా యముచొప్పునఁ జర్మకంపము కాకలమున కధఃప్రదేశమం దుత్పన్న మగుటచేత

నదియు శ్వాసనాదములవలె నాస్యబాహ్యమగుటచేత నచటను బాహ్యవ్యవహారము ముఖ్య మనియే చెప్పవచ్చును. అనునాసిక్యజనకయత్న మాస్యాంతర్గత మని మనవారిలోఁ గొందఱయభిప్రాయము. ఆస్యబాహ్యమనియే బహుసమ్మతము. ఈమతమే భాష్యసమ్మత మని భాష్యప్రదీపోద్యోతమునందు నిరూపింపఁబడినది. పాశ్చాత్యపండితులు ముఖనాసికామార్గమును గప్పెడిమాంసఖండము (Uvula ఉవ్యుల) యొక్క తాటస్థ్య మానునాసిక్యనిమిత్త మనిచెప్పిరి. ఈతాటస్థ్య మాస్యబహిర్దేశస్థ మగుటచేత వీరియభిప్రాయముగూడ భాష్యసమ్మత మగు మనవారియభిప్రాయముతో నేకీభవించుచున్నది. శ్వాసకోశములనుండి బయలుదేఱినగాలి వేగముగా మూర్ధపర్యంతము వెళ్లి యచ్చటినుండి మరలి వచ్చునపుడు శ్వాసనాదభేదములను బుట్టించు నని మనవారియభిప్రాయము. శ్వాసకోశమునుండి వెడలి మూర్ధపర్యంతము వెళ్లకముందు వాయుమార్గమునందే శ్వాసనాదభేదము పుట్టు నని పాశ్చాత్యపండితుల యభిప్రాయము. ఇచటఁ బాశ్చాత్యుల యభిప్రాయమె సరియైన దని తోఁచుచున్నది. ఏలయన:—మనవారి యభిప్రాయముచొప్పున మొదట మూర్ధపర్యంతము గాలి వెళ్లి మరలునపుడు మూర్ధసన్నికృష్ట మగునాసాద్వారమునకుఁ బోకుండుటకుఁ గారణము కాన్పింపదు. అటులు పోయిన ననునాసికనిరనునాసికవిభాగము సిద్ధింపదు. మఱియు మూర్ధపర్యంతము వెళ్లినగాలి మరలి పేటికాకారవివరమునకు వచ్చునపుడు ముఖనాసికాద్వారములు సన్నికృష్టములుకావున నటులు ప్రసరించినచోఁ బేటికాకారవివరమున కధోభాగమున నున్న వాయుమార్గమునందుఁ గల్గెడుశ్వాసనాదవిభాగమున కవకాశ ముండదు. కావున నిటఁ బాశ్చాత్యులరీతియె సమంజసమని యనవచ్చును. ఇట్లు పేటికాకార మగువివరమునుండి ముఖమునందు నిశ్వాసము ప్రవేశించి ముఖాంతర్గతములగునాయాయవయవములతో సంయుక్తమగునపు డాయాసంయుక్తస్థానములభేదమునుబట్టి వర్ణభేద మేర్పడును. ఆస్థానములు "ఉరము, కంఠము, శిరస్సు, జిహ్వామూలము, దంతములు, నాసిక, ఓష్ఠములు, తాలువు." అని యెనిమిదివిధములని "అష్టౌస్థానాని వర్ణానా మురః కంఠః శిర స్తథా। జిహ్వామూలంచ దంతాశ్చ నాసికోష్ఠౌచ తాలుచ॥" అను పాణిని శిక్షావచనమువలన స్పష్టమగుచున్నది. పైస్థానములలో నొకస్థానమందుఁగాని రెండుస్థానములందుఁగాని వాయుసంయోగమువలన వర్ణోత్పత్తి యగును. "ఏకారైకారౌకారౌకారములు, ఙ, ఞ, ణ, న, మ, లు వకారము" అను నీవర్ణములు ద్విస్థానకములు.

మిగిలినవి యేకస్థానకములు. వర్ణముల నుచ్చరించునపుడు జిహ్వాగ్రోపాగ్రమధ్య మూలాదులు తత్తత్ స్థానములను స్పృశించును. ఆస్పర్శము "గాఢస్పర్శము, మధ్యస్పర్శము, అల్పస్పర్శము" అని మూఁడువిధములై యున్నది. ఈస్పర్శమును గలుగఁజేయు ప్రయత్నములు స్పృష్టము (గాఢస్పర్శజనకము) ఈషత్ స్పృష్టము (మధ్యస్పర్శజనకము) ఈషద్వివృతము (అల్పస్పర్శజనకము)" అని మూఁడువిధములై యున్నవి. వీని నాభ్యంతరప్రయత్నము లందురు. ఈమూఁడుప్రయత్నములు వ్యంజనములకు నిమిత్తములు. అచ్చు లుచ్చరింపఁబడునపు డీమూఁడువిధములైనస్పర్శములు నుండవు. కావున నవి యస్పృష్టములు లేక వివృతములు నని వ్యవహరింపఁబడుచున్నవి. వీని కనుకూల మగునాభ్యంతరప్రయత్నముకూడ వివృత మనఁబడును. ఈస్పర్శాదులు ముఖాంతర్గతము లగుతత్తత్ స్థానముల యం దుత్పన్నములగుటచేత నీప్రయత్నములకు నాభ్యంతరములని నామము వచ్చినది. హల్లులు స్పర్శములనియు నంతస్థములనియు నూష్మములనియు మూఁడుతెరగతులుగా నున్నవి. అందు స్పర్శములు "కవర్గము, చవర్గము, టవర్గము, తవర్గము, పవర్గము" అని యైదువిధములుగా విభజింపఁబడినవి. ఇందు హల్లులవిభాగ మాభ్యంతరప్రయత్నమునుబట్టియు, స్పర్శములలోని యవాంతరవిభాగము స్థానసంబంధమును బట్టియు నేర్పడినది. ఇట్టి స్థానసంబంధ మితరవర్ణములకు సయితమున్నను వానికి స్పృష్టప్రయత్నము లేనందున నీవర్గవిభాగములోనికి రావు. ఏకస్థానము నేకప్రయత్నమును గలవర్ణము లొకవర్గములోఁ జేరును. యకారము చవర్గీయములతో స్థానైక్యము కలదైననుఁ బ్రయత్నము వేఱగుటచేతఁ జవర్గములోఁ జేరదు. ఇటులే శకారము ప్రయత్నైక్యముకలదైనను స్థానభేదముండుటచేతఁ జవర్గములోఁ జేరదు. ఈవర్గములయొక్క క్రమము తత్తద్వర్గీయస్థానములయొక్క స్థితిక్రమమునుబట్టి యేర్పడినది. ముఖమునందు "జిహ్వామూలము, తాలువు, మూర్ధము, దంతములు, ఓష్ఠములు" వరుసగా నున్నందున నాయా స్థానములయం దుత్పన్నములగువర్గములకుఁ గ్రమము మాతృకాపాఠమున నేర్పడినది. మాతృకాపాఠమున నీవర్ణములతరువాత నంతస్థములు పఠింపఁబడుచున్నవి. స్పర్శములకును (కకారాది మకారాంతవర్ణములకును) నూష్మములకు (శషసాదులకును) మధ్యమునఁ బఠింపఁబడుటచేత వీని కంతస్థములనుపేరు వచ్చినది. ఇవి మధ్యస్పర్శము లేక యీషత్ స్పర్శము కలవగుటచేత వీనికి మధ్యమునఁ బాఠము వచ్చినది. తరువాత నల్పస్పర్శములు లేక యీషద్వివృతము లగునూష్మముల

పాఠము చేయఁబడినది. ఈరీతిని స్పర్శాంతస్థోష్మములక్రమ మేర్పడినది. యరల
వలకు నంతస్థములని నామము కలుగుటకుఁ బాశ్చాత్యపండితులు వేఱొక కారణ
మును జెప్పెదరు. "ఇ, ఉ, ఋ, ఌ" ఈయచ్చులు "య వ ర ల" లుగ మార్పు
నొందుటయు యవరలలు "ఇ, ఉ, ఋ, ఌ"గ మార్పు నొందుటయు సంస్కృ
తభాషయం దగపడుచున్నందున "యరలవ"లు అచ్ ధర్మములు హల్ ధర్మములుఁ
గలవి, అట్లు రెంటికిని మధ్యస్థము లగుటచే నంతస్థము లనిపేరు వచ్చినదని వారు
చెప్పెదరు. ఈకారణమునుబట్టి వీని కీనామము వచ్చినచోఁ దుల్యన్యాయమున
"ఇ, ఉ, ఋ, ఌ" వర్ణములకుఁ గూడ నీనామము రావలసియున్నదని సందే
హము పొడముచున్నది. వర్గములలోనివర్ణముల కెట్టిక్రమము వచ్చెనందు రేని
వినుండు. ప్రతివర్గములోను నీషచ్ఛ్వాసములు మొదటను దరువాత శ్వాసము
లును దరువాత నీషన్నాదజములును దరువాత నాదజములును నీవిధమున వర్గ
ప్రథమద్వితీయతృతీయచతుర్థముల క్రమ మేర్పడినది. వర్గపంచమమం దాను
నాసిక్య మనునొకధర్మము నాదజము లగు వీని కుండుటచేత వీనికిఁ దుదిని పాఠ
మేర్పడినది. అంతస్థములలో నన్నియు నాదజము లగుటచేత స్థానక్రమముచే
తనే క్రమమేర్పడినది. ఊష్మములలోఁ (జిహ్వామూలీయ శషసోపధ్మానీయ హకార
ములలో) గూడ నాదజ మగుహకారమునకుఁ జరమపాఠము గలిగెను. మిగిలిన
శ్వాసజములలో స్థానక్రమముచేతఁ గ్రమ మేర్పడినది. ఈవిధమున మాతృకాపా
ఠమున హల్లులకుఁ గ్రమము సహేతుకమై యున్నది. పైనిఁ జెప్పినవిధమున
శ్వాసజములకుఁ బ్రథమపాఠము నాదజముల కనంతరపాఠమును సిద్ధమైయుం
డఁగా నాదజము లగునచ్చులకుఁ బ్రథమపాఠ మెట్లు ఘటించు నని శంకింపఁగూ
డదు. అచ్చులు స్వతంత్రములు. హల్లు లస్వతంత్రములు. హల్సాహాయ్యములేక
యచ్చుల నుచ్చరింపవచ్చును. అచ్ సాహాయ్యములేక హల్లుల నుచ్చరింపశక్యము
కాదు. "నపున రన్తరేణాచం వ్యంజన స్యోచ్చారణ మపి భవతి" అను భాష్యఫ
క్కికచేత నీయంశము స్పష్టపఱుపఁబడినది. మఱియు "అనుస్వారో వ్యంజనం
చాక్షరాంగమ్" అను ఋక్ప్రాతిశాఖ్యవలన హల్లు లంగము లనియు నచ్చు
లంగు లనియుఁ బ్రతిపాదింపఁబడినందునఁ బ్రధానము లగునచ్చులకుఁ బ్రథమ
పాఠము యుక్తము. అందు—అకారేకారోకారములకు స్థానక్రమమునుబట్టి
క్రమము వచ్చినది. ఋకారఌకారస్థానము లికారోకారస్థానముల మధ్యమున
నున్నను నీరెండువర్ణములు రేఫలకారరూపావయవఘటితములగుటచే వనన్తర

పాఠ మాదరింపఁబడెను. ఆరెంటిలోను స్థానక్రమముచేతనే క్రమ మేర్పడినది, ఏకారాదులు నాలుగు సంధ్యక్షరములు కావునఁ జరమపాఠ మాదృతమైనది. వానిలోని క్రమము గూడ స్థానక్రమమునుబట్టి వచ్చినదే. ఋకార ఌకారములు హల్సంపృక్తములు, ఏ, ఐ, ఓ, ఔలు అచ్ సంపృక్తములు, గావున వీనికిఁ బ్రథమపాఠము యుక్త మని శంకింపఁగూడదు. అచ్చుల కాభ్యంతరప్రయత్నము వివృతము. ఈవివృతము మూఁడువిధములు. వివృతము, వివృతతరము, వివృతతమము. అందు "అ, ఇ, ఉ, ఋ, ఌ" వర్ణములు వివృతము లగుటచే వీనికి సహపాఠ మాదరింపఁబడినది. పిమ్మట, నకారేకారజన్యములు, తరువాత నకారోకారజన్యములు, ఈవిధమున నచ్చులలోఁ గ్రమ మేర్పడినది. అనుస్వారవిసర్గము లచ్ధర్మమును హల్ధర్మమును గలవగుటచే నచ్చులకును హల్లులకును మధ్యమునఁ బాఠము వచ్చినది. జిహ్వామూలీయోపధ్మానీయములు కూడ నిట్టివే యని మఱి కొందఱు చెప్పెదరు. ఈవిధమునఁ బాఠక్రమ మేర్పడినది. ఇఁక నేయే వర్ణమున కెయ్యది స్థానమో యెద్ది యాభ్యంతరప్రయత్నమో యని నిరూపింపఁబడును.

కవర్గము—దీనికి జిహ్వామూలము స్థానము "అకుహవిసర్జనీయానాం కంఠః" అనుసిద్ధాన్తకౌముదీగ్రంథమునుబట్టి దీనికిఁ గంఠము స్థానమైనటులు గాన్పించునుగాని యచటఁ (కవర్గము విషయము) గంఠ మనఁగా; జిహ్వామూలమనియే యర్థము" ఇట్లు శేఖరమునందు నిరూపింపఁబడినది. "జిహ్వామూలేతు కుః ప్రోక్తః" అనుశిక్షావచనమును "ఋకారల్కారావథషష్ఠ ఊష్మాజిహ్వామూలీయాః ప్రథమశ్చవర్గః" అనుఋక్ప్రాతిశాఖ్యమును నిందులకుఁ బ్రమాణములు. తైత్తిరీయప్రాతిశాఖ్యమున దీనికి హనుమూలము స్థానమనియు జిహ్వామూలము కరణమనియు "హనుమూలే జిహ్వామూలేన కవర్గేస్పర్శయతి" యనుసూత్రమునఁ జెప్పఁబడినది. ఇతరులు స్థానమని చెప్పినజిహ్వామూలమును వీరు కరణమనిరి. ఇది విశేషభేదము కాదు. పాశ్చాత్యులు జిహ్వామూలమృదుతాలు సంయోగమువలన నీవర్గ ముత్పన్న మగు నని చెప్పిరి, ఈమృదుతాలువునే హనుమూల మనినచోఁ బాశ్చాత్యులయభిప్రాయమునకుఁ బ్రాతిశాఖ్యములకును భేద మేమియు నుండదు. ఈవర్గాగముల నుచ్చరించునపుడు స్థానకరణములకు దృఢస్పర్శము కలుగునుగావున నేతద్వర్గాగములకు స్పృష్టప్రయత్నము. ఈయంశ మన్నివర్గములగుఱించియు నెఱుంగునది. ఇందుఁ జరమవర్ణ ముచ్చరించునపుడు నాసికాద్వారముకూడ వివృ

తమగును. అందువలన దీనికి నాసికకూడ స్థానమైనది. ఈవర్ణమునకు నాసిక కూడ స్థాన మని "నాసిక్యా నాసిక్యయమానుస్వారాః" అనుసూత్రము బోధించుచున్నది. ఈయంశ మన్నివర్గములలోని చరమవర్ణముల గుఱించియు నెఱుంగునది.

చవర్గము—ఈవర్గము నుచ్చరించునపుడు జిహ్వామధ్యము తాలువును స్పృశింపవలెను. అనఁగాఁ దాలువు స్థానము. జిహ్వామధ్యము కరణము. "తాలౌజిహ్వామధ్యేన చవర్గే" అనుసూత్ర మీయంశమును బోధించుచున్నది. కఠినతాలు జిహ్వామధ్యసంయోగమువలనఁ జవర్గ ముత్పన్న మగు నని పాశ్చాత్యపండితులు చెప్పిరి. ఈకఠినతాలువునె మనవారు తాలు వని రనినచో నభిప్రాయభేద మేమియు నుండదు.

టవర్గము—ఈవర్గ ముచ్చరించునపుడు జిహ్వాగ్రమును మడంచి యధోభాగముచే మూర్ధమును (అనఁగా ముఖవివరోపరిభాగమును), స్పృశింపవలయును. కావున మూర్ధము స్థానము, ప్రతివేష్టితజిహ్వాగ్రము కరణము, అని తాత్పర్యము. జిహ్వాగ్రేణ ప్రతివేష్ట్య మూర్ధని టవర్గే" అనుసూత్ర మీయంశమును జెప్పుచున్నది. పాశ్చాత్యపండితులు గోళాకార మగుకఠిన తాలువుతో జిహ్వాగ్రమునకు సంయోగము కలుగునపు డీవర్గ ముచ్చరింపఁ బడు నని చెప్పిరి. మనవారు మూర్ధ మని చెప్పినస్థానమునే వీరు గోళాకార కఠినతాలు వనిరి, కావున నభిప్రాయభేదము లేదు. మనవారు జిహ్వాగ్రప్రతివేష్టనము నధికముగాఁ జెప్పిరి. ఇది యనుభవసిద్ధము.

తవర్గము—ఈవర్గము జిహ్వాగ్రముచేత దంతమూలములు స్పృశింపఁ బడునపుడు పుట్టును. అనఁగా దంతమూలములు స్థానము. జిహ్వాగ్రము కరణము, పాశ్చాత్యులుకూడ నిటులే చెప్పిరి.

పవర్గము—ఈవర్గ మోష్ఠద్వయసంయోగమువలనఁ బుట్టును. ముందటివానిలో "యత్రస్పర్శనం తత్ స్థానం, యేన స్పర్శయతి తత్కరణం" అను సూత్రములచే స్థానకరణవిభాగము చేయవచ్చును. ఇచట నటులు చేయుట కవకాశము లేదు. అయినను బూర్వవర్గములస్థానకరణముల కుత్తరాధరభావ మున్నందునఁ దత్సామ్యమునుబట్టి యుత్తరోష్ఠము స్థాన మనియు నధరోష్ఠము కరణ మనియుఁ దెలియఁదగినది. ఈయంశము ప్రాతిశాఖ్యవ్యాఖ్యయందు స్పష్టముగ నున్నది. పాశ్చాత్యపండితుల కిచటఁగూడ నభిప్రాయభేదము లేదు.

పాశ్చాత్యపండితులు స్థానకరణసంయోగానంతరమందు విభాగ ముండవలయునని చెప్పిరి. మనవారు చెప్పలేదు. ఇచ్చట నుచ్చారయితల యనుభవమె ప్రమాణము. సజాతీయవర్ణసంయుక్తత త్తద్వర్ణోచ్చారణస్థలమునందుఁ బూర్వ వర్ణోచ్చారణమున విభాగ మున్నటులు గాన్పింపదు. కావున విభాగమునకు నిమిత్తము సందిగ్ధముగ నున్నది.

అంతస్థములు—యకార ముచ్చరింపఁబడునపుడు జిహ్వామధ్యాంతములతోఁ దాలువును స్పృశింపవలయును. “తాలౌ జిహ్వామధ్యాంతాభ్యాం యకారే” అనుసూత్రముచే నీయంశము చెప్పఁబడెను. చవర్గమునకు జిహ్వామధ్య స్పర్శ ముండును. యకారమునకు జిహ్వాంతస్పర్శముకూడ నుండును. మఱియు, చవర్గము నుచ్చరించునపుడు స్థానకరణములకు దృఢస్పర్శ ముండును. యకారోచ్చారణమున మధ్యస్పర్శ ముండును. పాశ్చాత్యులు జిహ్వాంతము కరణ మని యంగీకరింపరు. మఱియు స్థానకరణములకు స్పర్శముండదు. సాన్నిధ్యమాత్రము కలుగునని చెప్పుదురు. చవర్గమునుబోలి దృఢస్పర్శము లేకున్నను శిథిలస్పర్శ ముండుట యనుభవసిద్ధ మగుచున్నది. రేఫ ముచ్చరింపఁబడునపుడు జిహ్వాగ్ర మధ్యభాగము, దంతమూలముల యూర్ధ్వభాగమును స్పృశింపవలెను. ఈ భాగమునకు “బర్స్వము” అని పేరు. ఇదియె ఋకారమునకుస్థానము. ఈవిషయము “రేఫేజిహ్వాగ్రమధ్యేన ప్రత్యగ్దంతమూలేభ్యః” అనుసూత్రముచేఁ దెలుపఁబడెను. పాశ్చాత్యులు టవర్గస్థానమే దీనికి స్థానమనిరిగాని టవర్గస్థానమునకును, తవర్గస్థానమునకును మధ్యభాగము దీనికి స్థాన మని మనవారి యభిప్రాయము. ఇదియె యనుభవమునకు సరిపోవుచున్నది. దీనికి మధ్యస్పర్శమె యుండును. జిహ్వాగ్రమునకుఁ గంపము కలుగునని పాశ్చాత్యులయభిప్రాయము.

లకారము—ఇది దంతమూలములయందు జిహ్వాగ్రమధ్యభాగపు స్పర్శముకలిగినపుడు పుట్టును. తవర్గరేఫలస్థానములకుమధ్యభాగము దీనికి స్థానము. “దంతమూలేషుచ లకారే” అనుసూత్రముచేత నీయంశము దెలుపఁబడినది. తవర్గమునకుఁ గలుగుస్పర్శముకంటె దీనియందు స్పర్శ మల్పము కావుననే దీని నీషత్ స్పృష్ట మనిచెప్పి యంతస్థములలో మనవారు పరిగణించిరి. పాశ్చాత్యపండితులు తవర్గస్థానమే దీనికిని స్థానమనిరి. మఱియు నిచట దృఢస్పర్శమే కలుగు ననిరి. చవర్గయకారశకారములకు స్థాన మొకటియైనను స్పర్శమును గుఱించి దృఢమాధ్యాల్పత్వతారతమ్య మెటు లున్నదో యటులే తవర్గలకార

సకారములయెడలఁ గూడఁ దారతమ్య మనుభవసిద్ధము. కావున లకారవిషయ మగుసర్శము మధ్యస్పర్శమని చెప్పవలసియున్నది. ఈయంశము ననుభవముచేత నిరూపింతురుగాక.

వకారము—ఇది దంతములచేత నధరోష్ఠము స్పృశింపఁబడునపు డుద్భవించును. ఊష్మములు—జిహ్వామూలీయశకారషకారసకారోపధ్మానీయములు క్రమముగ కవర్గాది స్థానజములు. వీనిలో స్పర్శ మత్యల్పముగ నుండును. కావున వీని నీషద్వివృతము లనిరి. వీనిస్థానములను "స్పర్శస్థానేషు ఊష్మాణఆనుపూర్వ్యేణ' అను సూత్రము బోధించినది.

హకారము—ఇయ్యది కంఠస్థానజన్యము, ఉరస్థానజన్యముకూడ నగును. ఈయంశము "హకారం పంచమైర్యుక్త మంతస్థాభిశ్చ సంయుతం। ఔరస్యం తం విజానీయాత్ కంఠ్య మాహు రసంయుతం" అనుశిక్షావచనమువలన స్పష్ట మగును. మఱియు హకారమున కేయచ్చుపరంబుగ నుండునో యాయచ్చు యొక్క మొదటిభాగమున కేదిస్థానమో యదియె హకారమునకు స్థాన మని కొందఱయభిప్రాయము. ఈయభిప్రాయముచొప్పున నెచ్చట నెద్ది స్థానమో యచ్చులస్థాననిరూపణమువలనఁ దెలియును. ఈయూష్మముల నుచ్చరించునపుడు కరణము లగుజిహ్వాదులమధ్యభాగము వివృతముగ నుండునుగావున నివి యీష ద్వివృతము లనఁబడుచున్నవి. విసర్జనీయమునకుఁ గంఠము స్థానమని కొందఱును బూర్వాచ్చున కెద్దిస్థానమో యదియె స్థాన మని మఱికొందఱును జెప్పెదరు. ఈయభిప్రాయమె "అయోగవాహా విజ్ఞేయా ఆశ్రయస్థానభాగినః" అనుశిక్షా వచనముచేఁ జూపఁబడినది.

అనుస్వారమునకు నాసిక స్థానము. "అనుస్వారోత్తమా అనునాసికాః" అనుసూత్ర మీయంశమును దెలుపును.

## అచ్చులు.

ఇందకారేకారోకారము లసంకీర్ణములు. ఋకారౡకారములు రేఫల కారసంపృక్తములు. 'ఏ, ఐ' అనునీరెండును 'అకారేకారసంధినిష్పన్నములు. "ఓ, ఔ" ఈరెండును అకారోకారసంధినిష్పన్నములు. కావున నీనాల్గింటికి సంధ్యక్షరము లని పేరు. "ఐ, ఔ" ఈరెండక్షరములలోను బూర్వోత్తరభాగ ములు వేఱువేఱుగ వినిపించుచున్నవి. కావున నివి సంధ్యక్షరము లనఁదగినవి. "ఏ, ఓ" ఈరెండక్షరములలో నటులు భాగము లున్నటు లగపడదు. కావున

నివి సంధ్యక్షరములు కావు. అకారేకారోకారములఁ బోలి యసంకీర్ణాక్షరములె యని పాశ్చాత్యులు చెప్పెదరు. "ఏ, ఓ, వర్ణములలోనుండెడి "అకారభాగము" సంవృతము "ఐ, ఔ" వర్ణములలోని అకారభాగము వివృతము. అందువలన "ఏ, ఐ, ఓ, ఔ" అనువర్ణముల యుచ్చారణములో భేదము కలిగెను, గాని "ఏ, ఓ" వర్ణములలో అకారభాగము లేదనరాదు. ఏకారమున కచ్చుపరంబగు నపుడు "అయ్" అనువికారము వచ్చుచున్నది. ఇందు "ఏకారములో" నుండెడి అకారభాగమునుబట్టి అకారమును ఇకారభాగమునుబట్టి "య"కారమును జేరి "అయ్" అని రూపము చేరినది. ఇటులే ఓకారమునకు "అవ్" అని వికారను వచ్చుచున్నది. ఇచటఁ గూడ "అ, ఉ" అను వర్ణభాగములంబట్టియే క్రమముగ అవ్ అను వికారము కలిగినది. ఇట్టివికారమున కనురూపమైన ప్రకృతి వర్ణద్వయఘటిత మయియె యుండవలయును. మఱియు వేదమునందుఁ గొన్నిచోట్ల "అగ్నే" అనుదానికి బదులుగా అగ్న 3 ఇ అనియు "పటో" అనుదానికి బదులుగా "పట 3 ఉ" అనియు "అగ్నే ఆశా" అనుచోట సంధిలో "అగ్నా 3 యాశా" యనియు "పటోఉదకం" అనుదానికి బదులుగా "పటా 3 వుదకం" అనియుఁ బ్రయోగములు గాన్పించుచున్నవి. ఈప్రయోగములలో "ఏ, ఓ" వర్ణములలోని ఇకారోకారములు తద్రూపముగాను యకారవకారరూపముగను విడఁదీయఁబడి అకారభాగ మధికకాలముగ మార్పు నొందినటులు స్పష్టమగుచున్నది. దీనినిబట్టిచూడ నివియు సంధ్యక్షరము లనుట యుక్తమని తోఁచుచున్నది. శుక్లయజుఃప్రాతిశాఖ్యమునందు "ఏకారము" ఇకారసమానస్థానక మనియు "ఓకారము" ఉకారసమానస్థానక మనియుఁ జెప్పఁబడెను. ఐకారౌకారములలో మొదటి యర్ధమాత్ర కంఠస్థానక మనియు మిగిలినభాగములు తాల్వోష్ఠస్థానికము లనియు దానినిబట్టి విశద మగుచున్నది. దీనినిబట్టి "ఐ, ఔ" వర్ణములలో భాగము లున్నటులును "ఏ, ఓ" వర్ణములలో లేనట్లును దోఁచునుగాని ఏ, ఓ వర్ణములలోనిభాగము లుత్తరభాగోపమర్దముచేత స్ఫుటముగ శ్రుతిగోచరము కాలేదని చెప్పుటయె సమంజసము. పాణినీయశిక్షలో "ఏ, ఓ" వర్ణములకుఁగూడ "ఏ ఐ తుకంఠతాలవ్యా వో ఔ కంఠోష్ఠజౌస్మృతౌ" అను కారికచేఁ గంఠతాలు కంఠోష్ఠస్థానములె బోధింపఁబడినవి. వీనికిం గంఠస్థానమకారభాగము ననుసరించి వచ్చినది యని తెలియునది. మఱియు "అకారార్ధమైకారౌకారయోరాదిః" "ఇకారోద్యర్ధః పూర్వస్య శేషః" "ఉకార స్తూత్త

రస్య" అనుసూత్రములచేత నైకారౌకారములకు విభాగము చెప్పఁబడుటచేత నేకారౌకారములవిషయమై యీభేదము లేనటు లగపడును. అయినను "యద్యప్యేకారాదీనాం చతుర్ణాం సంధ్యక్షరాణా మేవం ద్విస్వరాత్మకత్వం సమానం। తథాపి ఏదోతోః ప్రశ్లిష్టావయవత్వా త్ప్రికారాన్తర మేవోక్తం" అని వైదికాభరణమునందు సమాధాన మీయఁబడినది. దీనినిబట్టిచూడ "ఏ, ఓ" వర్ణములు ప్రశ్లిష్టావయవములు "ఐ, ఔ" అనువర్ణములు విశ్లిష్టావయవములు ననునిదియే భేదముగాని వేఱుభేదము లేదని స్పష్ట మగుచున్నది. పైయంశములనుబట్టి వీనికి సంధ్యక్షరత్వము యుక్తమో యయుక్తమో విద్వాంసులు నిరూపించెదరుగాక.

అకారము—ఇది హ్రస్వము, దీర్ఘము, ప్లుతము, అని కాలభేదములచేత మూఁడువిధములు. ఈమూఁడింటికిఁ గంఠము స్థానము. హనువులు-అనఁగా సృక్వలు స్థానమని ప్రాతిశాఖ్యయందుఁ జెప్పఁబడినది. ఓష్ఠములు కరణములు. అం దకారముచ్చరింపఁబడునపుడు స్థానకరణములు సంవృతములగును. ఆకారాదు లుచ్చరింపఁబడునపుడు వివృతములగును, ఉత్తరదేశమునందుఁ దప్ప మిగిలినదేశములం దకారము వివృతముగానే యుచ్చరింపఁబడుచున్నది. ఇకారము పూర్వోక్తవిధమున మూఁడువిధములు. దీనికిఁ దాలువు స్థానమైయున్నది. జిహ్వామధ్యము కరణము. వివృతము ప్రయత్నము. ఉకారము పైరీతిని మూఁడువిధములై యున్నది. దీనికుత్తరోష్ఠము స్థానమైయున్నది. అధరోష్ఠము కరణము. వివృతము ప్రయత్నము. వీని నుచ్చరించునపు డోష్ఠములు దీర్ఘములై వర్తులము లగును. ఋకారము-ఇదియు మూఁడువిధములు. దీనికి మూర్ధము (అనఁగా-టవర్గస్థానమె)స్థానమని కొందఱియభిప్రాయము. జిహ్వామూలము స్థానమని మఱికొందఱయభిప్రాయము వర్త్స్వము, (అనఁగాదంతపంక్తికూర్ధ్వభాగమందున్న రేఫకు స్థానభూతమైనయున్నతప్రదేశము) ఋకారమునకు స్థానమని మఱికొందఱు చెప్పుదురు. ఈమూఁడంశములును వేఱువేఱు ప్రాతిశాఖ్యలలోఁ జెప్పఁబడియున్నవి. ఆయాశాఖలయందలి యుచ్చారణభేదముచేత నీమతభేదము కలిగినటులు దోఁచుచున్నది. ప్రకృతకాలమందు మూఁడవమతమె యనుభవమునకు సరిపడియున్నది. వివృతము ప్రయత్నము. ౡకారము-దీనికి దంతమూలములు స్థానమని కొందఱును జిహ్వామూలమని మఱికొందఱును బర్త్స్వములు స్థానమని మఱికొందఱునుజెప్పుదురు. ఇచట మూఁడవమతమె యనుభవసిద్ధము. వివృతము ప్రయత్నము. ఏకారము—ఇది దీర్ఘమనియుఁ బ్లుతమనియు

రెండువిధములు. కొన్నిశాఖలలో హ్రస్వమును గలదు. "సుజాతే" అనుటకు బదులుగా "సుజాతె" అని హ్రస్వము నుచ్చరింతురు. తెనుఁగులో హ్రస్వము సుప్రసిద్ధము. దీనికిఁ దాలువు స్థానమని కొందఱును గంఠతాలువులు రెండును స్థానములని మఱికొందఱును హనువులు తాలువులును స్థానములని మఱికొందఱును జెప్పెదరు. ఓష్ఠములు జిహ్వామధ్యమును గరణములు. ఓకారము నుచ్చరించునప్పటికంటె నోష్ఠములు విప్రకృష్టములుగానుండును. జిహ్వామధ్యాంతముల చేత "నుత్తరజంభ్యములు" (అనఁగా హనుమూలప్రాంత దేశములు) స్పృశింపఁబడును. దీనికి వివృతతరప్రయత్నము. ఐకారము—ఇది యకారేకారములస్థానములు కలదై యున్నది. దీనికి వివృతతమప్రయత్నము. దీనికి హ్రస్వము లేదు. ఓకారము—ఇది కంఠోష్ఠస్థానము. తైత్తిరీయప్రాతిశాఖ్యమునఁ గంఠస్థానకము లన్నియుఁ గంఠసన్నిహితహనుభాగస్థానకములుగాఁ జేర్కొనఁబడినవి. దీనినుచ్చరించునపుడు హనువులు మిగులవ్యస్తములు కావు. ఓష్ఠము లేకారము నుచ్చరించునప్పటికంటె సన్నికృష్టములుగా నుండును. ఇదివివృతతరప్రయత్నముకలది. ఔకారము—కంఠోష్ఠస్థానకము. ఈస్థానము లకారోకారసమభివ్యాహారమువలనఁ గలిగినవి. దీనికి వివృతతమము ప్రయత్నము.

ఈవిధముగ వర్ణములకు స్థానములు కరణములు ప్రయత్నములు సంగ్రహముగఁ జూపఁబడినవి. వీనినుచ్చరించునపుడు ముఖాద్యవయవములలో ననేకవ్యాపారములు కలుగు నని ప్రాతిశాఖ్యలవలన శిక్షలవలనఁ గూడ స్పష్టమగును. గ్రంథవిస్తరభయముచేత నాయవాంతరభేదములు విడిచితిని. తెనుఁగుభాషలో నీవర్ణములలోఁ జేరనివి దంత్యచజలునర్ధానుస్వారమునుగలవు. ఈచజలకు దంతములు స్థానమని యాంధ్రవైయాకరణులయభిప్రాయము. అందు "చకారము" శ్వాసజము, జకారము నాదజము. వీని కాంధ్రవైయాకరణు లంగీకరించిన కారణసామగ్రినిబట్టిచూడ "తదల" కుండెడిసామగ్రిని బోలినసామగ్రి యున్నందున "తద" లనఁదగి యుండును గాని "చజ" లనఁదగి యుండవు. వ్యవహారమున "చజ" లనియె ప్రసిద్ధము. ఉచ్చారణమునఁగూడ "చజ"లకు సన్నికృష్టములై వినఁబడునుగాని తదలకు సన్నికృష్టములై వినఁబడలేదు. కావున వీని కీదంత్యవ్యవహార మెటులు వచ్చె నని యాలోచింపవలసియున్నది. చజ లని వ్యవహరించుటచేతఁ దాలవ్యచజల కుండుసామగ్రి యంతయు దీని కున్న దనియె నిశ్చయింపవచ్చును. ఆసామగ్రి యంతయు నుండఁగా దంతసన్నికృష్టదేశమునందు జిహ్వా

పాంత్యస్పర్శము కలుగునపు డీవర్ణము లుచ్చరింపఁబడును. ఇటులు సామగ్రీసాంక ర్యమువలన నూతనవర్ణములు పుట్టవచ్చును. అట్టివి కొన్ని ద్రవిడభాషలలో నగ పడుచున్నవి. కాలక్రమమున నీచజల నుచ్చరించుటలోఁ గొంతమార్పు కలిగి తాలుస్థానమునకు దూరమై దంతస్థానమునకు సన్నికృష్ట మాయెను. ఈసన్ని కర్షమునుబట్టి దంత్యచకారమునకుఁ జిహ్నముగాఁ దకారసకారసంయోగచిహ్న మును వ్రాయ మొదలిడిరి. ఈయంశము ప్రాచీనలిపిమార్గమును బాగుగఁ బరిశీ లించినవారందఱును గమనించియె యుందురు. ఈవర్ణముల కిట్టిమా ర్పేటులు గల్గె నని యూహింపవలసియున్నది. ఓష్ఠవ్యాపార మెక్కుడుగాఁ గలవర్ణములు అనఁగా "ఉ ఊ ఓ ఔ" అనువర్ణములు తాలవ్యము లగుచజలకుఁ బరమగు నపుడు పరమందున్నవర్ణములస్థానమును నీతాలుస్థానమును విప్రకృష్టము లగుట చేత నతిసన్నిహితముగా నుచ్చరించునపుడు రెంటికి మధ్యనుండుస్థానసంబంధము చేత నివి కొంచెముగా మార్పునొంది యుండును. అకారము నుచ్చరించునపుడు గూడ నోష్ఠవ్యాపార మావశ్యక మని తైత్తిరీయప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియు న్నందున నచ్చటఁగూడ నోష్ఠ్యసంబంధమే వీనిని దంత్యములుగాఁ జేయుచున్న దని యూహింపవచ్చును. "ఇ, ఈ, ఏ, ఐ"లు తాలవ్యములు కావున నవి పర మగునపుడు తాలవ్యచజలను మార్పును బొందింపఁజాలవు. కావున నచట నెపు డును దంత్యము లుండవు. అనుస్వారము మాత్రాకాలము కల దని ప్రాతిశా ఖ్యల యభిప్రాయము. ఆంధ్రభాషలో దానియుచ్చారణకాలము తగ్గుటచేత నీ యర్ధానుస్వార మేర్పడినది. కాలక్రమమున మిగుల నవిలంబోచ్చారణము వాడు కలోనికి రాఁగాఁ దదుచ్చారణకాల మంతరించి దానియందుండెడి యానునాసి క్యము పూర్వాచ్చునందు సంక్రమించినది. ప్రకృతకాలమున నర్ధానుస్వార ముండుచోటఁ బూర్వాచ్చునునాసికగా నుచ్చరింపఁబడుచున్నది. మఱియు శకటరేఫ మొకటి యాంధ్రభాషయందుఁ గలదు. రేఫ ముచ్చరించునపుడు జిహ్వాగ్రమునందుఁ గంపము కలుగునని యీవఱకుఁ జెప్పియుంటిని. రేఫద్విత్వ మున్నచోట నాకంప మధికమగుటచే నచ్చటి రేఫ మలఘుత్వము నొందును. ఆయుచ్చారణాభ్యాసమునుబట్టి యెచ్చట రేఫము నుచ్చరించుతఱి జిహ్వాగ్రకంప మధికముగ నుండునో యచట నలఘుత్వము కలుగుచుండును. ఈవిధమున నతిరిక్తవర్ణము లుత్పన్నమైన ట్లూహింపవచ్చును. ఇఁక నీసామగ్రీసాన్నిధ్యబల మున వచ్చినమార్పులను గొన్నిటిని జూపి నా వ్యాసమును ముగించెదను. స్పర్శ

ములలో నాదజములకు శ్వాసజములు పరమగునపుడు పరవర్ణబలమున నీనాదజములు శ్వాసజములుగ మాఱును. ఆమార్పునొందుటలో మహాప్రాణ మైనపూర్వము మ్మఱొకమహాప్రాణముతోఁ గలసియుండదు. కావున నల్పప్రాణ మగుశ్వాసజముగ మాఱును. ఇట్టి మార్పునె "ఖరిచ" అనుసూత్రముచేఁ బాణినియు నిరూపించెను. ఇటులే శ్వాసజములకు నాదజములు పర మగునపుడు పరవర్ణబలమువలన నీశ్వాసజము నాదజముగ మాఱును. అదియు నల్పప్రాణమై యుండును. ఈమార్పునె "ఝలాంజశ్ ఝశి" అనుసూత్రముచే నిరూపించెను. ఇట్టి వికారము కలిగినపుడు ప్రకృతియొక్క స్థానాదులబలమువలనఁ దత్తద్వర్గీయములే వికృతులుగా నుండును. ఉదాహరణము:—నాదజ మగుగకారమునకు శ్వాసజ మగువర్ణము పర మగునపుడు గకారమునకు స్థానమునుబట్టి సన్నికృష్ట మగుకకారము వచ్చును. కకారఖకారములకు నాదజము లగువర్ణములు పరమగునపుడు నాదజమగుగకారము వచ్చును. వీనిలో శ్వాసాదిబాహ్యప్రయత్నములకే మార్పు గాని స్థానాదులు మాఱవు. మఱియుఁ బదాన్తవర్గగములకుఁ బంచమవర్ణము పరమగునపుడు పరమగు ననునాసికబలమునఁ బూర్వ మనునాసికముగ మాఱును. ఈమార్పు "యరోనునాసికేఽనునాసికో వా" అనుసూత్రముచే నిరూపింపఁబడినది. ఉదాహరణము:—"వాక్ + మయ = వాఙ్మయ" "ఏతద్ + మమ = ఏతన్మమ." వర్గములోని మొదటి నాలుగువర్ణములకు హకారము పర మగునపుడు పూర్వవర్ణపు స్థానబలమువలన హకారము తద్వర్గీయముగ మాఱును. ఈమార్పు స్థానాదులలోనేగాని బాహ్యప్రయత్నములలో లేదు. బాహ్యప్రయత్నములు వర్గచతుర్థములకు హకారమునకును సమానమగుటచేత వర్గచతుర్థముగ మాఱును. ఉదాహరణము:—"వాగ్ఘరిః, తద్ధితమ్" అను మొదలగునవి. అనుస్వారమునకు వర్గగము పరమగునపుడు వర్గగముగ మాఱును. అపు డనుస్వారమునందలి యానునాసిక్యధర్మము సంక్రమించుటచేతఁ బంచమవర్ణముగ మాఱును. ఉదాహరణము:—"ఘటఙ్కరోతి, తండులమ్పచతి." అను మొదలగునవి. యవలలు పరమగునపు డనునాసిక యవలలుగ మాఱును. "సయ్యన్తా, యల్లోకమ్" అను మొదలగునవి యుదాహరణములు. తవర్గము తాలవ్యము లగుచవర్గములతో సంయుక్త మగునపుడు తాలవ్యముగ (నసఁగ, చవర్గముగ) మాఱును. ఇచ్చట స్థానమునకు మాత్రము మార్పు గలుగును. ఉదాహరణము:—తచ్చిత్, తజ్జానాతి, యాచ్ఞా.' ప్రకృతకాలమున "యాచ్న"

అని మార్పు లేకయే యుచ్చరింపఁబడుచున్నది. తవర్గమునకు టవర్గముతో సంయోగ ముండినపుడు టవర్గముగ మాఱును. ఉదాహరణము :—“తట్టీకా” మొదలగునవి. ఇందులకుఁ గరణభూత స్థా॥ జిహ్వాకృతిసామ్యము ప్రయోజకము. కవర్గము, చవర్గమును బరస్పరము ప్రాయికముగ వికారము నొందును. ఇందు స్థానసన్నికర్షము నిమిత్తము. విసర్గము ప్రాయికముగ శ్వాసజము పర మగునపుడు తత్సమానోష్మముగమాఱును. జిహ్వామూలీయము శ్వాసజము పరమగునపుడు జిహ్వామూలీయముగను,తాలవ్యశ్వాసజములు పరమగునపుడు తాలవ్యోష్మముగు శకారముగను నిటులు మూర్ధన్యదంత్యోష్ఠ్యశ్వాసజములు పరమగునపుడు తత్తదూష్మముగను మాఱును. ఉదాహరణము :—“రామఃకరోతి, రామశ్చినోతి, రామష్టీకతే, రామస్తిష్ఠతి, రామఃపచతి, రామశ్శరణ్యః, రామస్సుజనః” అను మొదలగువి. దీనికిఁ బరవర్ణబలమె ప్రయోజకము. ఇట్టి మార్పు లనేకములున్నట్లు ఋజువుచేయవచ్చును. అచ్చులలో రెండచ్చులను వ్యస్తముగ (నవ్యవహితముగ) నుచ్చరించుట కష్టము. అపు డాయచ్చులు రెండునుగాని లేక పూర్వాచ్చుగాని మార్పు నొందును. అట్టి మార్పు తత్తద్వర్ణసామగ్రి ననుసరించియె యుండును. అచ్ సంధ్యుదాహరణములను జూచిన నీయంశము వ్యక్త మగును. సంకీర్ణవర్ణములకు మార్పుకలిగినపు డావర్ణములకుఁ బృథక్కృతి కలుగును. ఈ మార్పు లన్నిటికిఁ దత్తద్వర్ణముల కారణసామగ్రీసన్నికర్షణమె నిమిత్తము గాని వేఱొకటి కానేరదు. వర్ణోత్పత్తిసామగ్రిని బాగుగఁ బరిశీలించినవా రీమార్పును బాగుగ గమనింపఁగలరు. ఇట్టి మార్పులను బట్టియె ప్రాకృతభాష లన్నియుఁ బుట్టినట్లు ప్రాకృతవ్యాకరణజ్ఞులకు గోచర మగును. తెలుఁగుభాషలోఁగూడ నిట్టిమార్పులు కలవు. నాదజ మగుద్రుతముయొక్క బలమున శ్వాసజము లగు పరుషములు నాదజము లగుసరళములుగా మాఱుచున్నవి.

రెండచ్చులు కలిపి యుచ్చరించుట కష్టమగుటచేత నచ్చులకు సంధి యేర్పడినది. తెలుఁగుభాషలో, ‘పరాచ్చు’నకే ప్రాబల్యము కలిగి పరరూపసంధియే తఱుచుగఁ గాన్పించుచున్నది. కొన్నిచోట్లఁ బూర్వరూపసంధికూడఁ గలదు గాని, యవి రెండుపదములుగ విభజింపఁబడక యొకపదముగనే రూఢి నొందినస్థలములై యున్నవి. అచటఁ బూర్వపదార్థము విధేయముగా భాసిల్లును. విధేయము ప్రధాన మగుట సహజము. ప్రధానభూతార్థబోధక మగు పదమును, దృఢముగ నుచ్చరించుట సమంజస మగుటచేత, నందలిచరమాచ్చు

నకుఁ బ్రాబల్యము కలిగిన దని యూహింపవచ్చును. ఇటులనేకాచ్చుల నవ్యవహితముగ నుచ్చరించుతఱి, మీఁదఁ జెప్పినకష్టమును బరిహరించుటకై యొకయాగమ మేర్పడినది. ఆయాగమము నిరర్థకమగుటచేత, లఘుతరమైన హల్లుండుట యుక్తము. లఘుతరములు 'యవ'లు రెండు మాత్ర మున్నట్లు శాకటాయనుఁడు చెప్పియున్నాఁడు. కావున 'యకారవకారములె, యాగమములుగ నుండుట కర్హములు. వానిలో "పరవర్ణ" బలమునుబట్టి పరవర్ణాదిభాగసస్థానకము గాని, సన్నికృష్టస్థానకము గాని, యుండుట స్వభావము. ఇకారము పరమగునపుడు సస్థానకయకార మాగమ మాయెను. అకారము పర మగునప్పు డకారస్థానభూతకంఠసన్నికృష్టతాలుస్థానక మగుయకారమె యాగమ మాయెను. సంధ్యక్షరములలోఁగూడ నకారము పూర్వభాగ మగుటచేత నవియు నకారమునుబోలి యకారమునె యాగమముగ సంపాదించినవి. ఈయచ్చుల సాదృశ్యమునుబట్టి, 'ఉ'వర్ణము పరమగునపుడు గూడ, యకారమె యాగమమైనచోఁ బ్రక్రియాలాఘవము (వేఱుగ నాగమము నంగీకరింపకపోవుట) సంభవించు నని యంతటను 'యకారమె' యాగమముగా నంగీకరింపఁబడినది. ఈప్రక్రియాలాఘవమును బాటింపకపోవుటచేత వాడుకలో 'మావూరు' మొదలగుస్థలములలో 'వ'కారమె యాగమమైనట్లు తోఁచుచున్నది. సంస్కృతప్రాకృతాంధ్రభాషలలో నిట్టిమార్పులు సహేతుకములని చాలవఱకు రుజువు చేయవచ్చును. గ్రంథవిస్తరభయమున విరమించితిని. ఈవ్యాసమునఁ గొన్నిదోషము లుండిన నుండవచ్చును. పండితులు వానిని బరికింపక గుణము లున్నవో వానినిమాత్రము గ్రహించి నన్ను మన్నింతురుగాక.

తాతా సుబ్బరాయశాస్త్రి.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీతరుణీసితవిలసన. జాతశివానూనభక్తిసంపద్గురువి
ఖ్యాతనుతకీర్తిసితజీ, మూతసితాఖిలదిగంత ముమ్మయశౌంతా. 1

గీ. అక్కథకుఁడు శౌనకాదు లైనమహాము, నీంద్రులకుఁ బ్రియమునవిట్టులనియె
నట్లు భూమి విడిచి యరుగవలయు నింక, ననుచు మాటలాడునవసరమున. 2

క. తెలతెలవాఱుచువచ్చెం, బలపలనయ్యెం బయోదపథమునఁ దారల్
కలకలవింకలకోమల, కలకలములు చెలఁగెఁ గాళికావిపినమునన్. 3

సీ. సంభోగపరిభిన్న శబరసీమంతినీ స్వేదవార్బిందువిచ్ఛేదకారి
విఘటమానాంభోజవిపినషండమధూళిపరిమళాసారసంపర్కసురభి
సమదకాంతారకాసరయూథసమ్మర్దసంభూతడిండీరశకలవాహి
లలితలుంగలవంగలవలీమతల్లికా లాస్యోపదేశలీలాగురుండు
యామినీశేషతుహినధారానుషంగ, జడిమభరమందచతురసంచారకారి
యల్లనల్లనఁబొలుపారునడపినదుమ, గాల్యసంధ్యానుగంధుండుగంధవహుఁడు.

ఉ. క్షోణిరుహాగ్రభాగముల జోకలుగట్టి వనీశిఖావళ
శ్రేణులు తాండవంబు లొనరింపఁగ మంద్రగభీరభంగి శ
ర్వాణిగృహంబులోనిబలివై భవలీలకు మ్రోసెఁ గంచుని
స్సాణము మాటిమాటి కనుశబ్దములీనఁగ గోపురంబునన్. 5

శా. నిష్ఠాసంపద నర్ఘ్యపాణు లగుచు న్విప్రు ల్ప్రశంసింప మం
జిష్ఠారాగము మండలంబున నధిష్ఠింప న్నిలింపాధిభూ
కాష్ఠామధ్యమునందుఁదోఁచెను శతాంగప్రష్ఠసర్పద్విషద్
జ్యేష్ఠుం డప్పుడు నిష్ఠురప్రసరబంహిష్ఠద్యుతిశ్రేష్ఠతన్. 6

వ. ఆదివసంబున. 7

ఉ. జాతరచేసె బ్రాహ్మణుఁడు చండికిఁ గమ్మనిపిండివంటతో
నేతులతోడ మట్టికడ నిర్మలినాన్నముతో రసావళీ

చూతఫలాదితోడ వరసూపముతోఁ జిఱువాలతోడుతన్
గీతులతోడ నప్పడకనిష్ఠతరం బగునిష్ఠ పెంపునన్. 8

వ. నాఁటిరాత్రి నిశాసమయంబునఁ గాలకంఠకంఠమూలకాకోలవిషమషీకళంక చ్ఛాయానముల్లాసంబు నుల్లసంబాడునిబిడాంధకారంబున నన్నెలవుగదలి చండాలియుం దానును సుకుమారుండు దుర్గమాటవీవిషయంబు హూణదేశంబు గడచి ప్రతిదినప్రయాణంబుల నెడనెడం బక్కణ...... 9

గీ. గ్రామఘోషంబు పురివాడ బ్రహ్మలోక
ము..... ను మొగసాల మోక్షమునకు
దూషితం బయ్యె సంసర్గదోషకలన
సంటుముట్టునఁ గలుషితంబయ్యె నాఁడు. 10

క. తనయుల విద్దఱ నిరువురు, తనయులనుం గాంచి కాలధర్మము నొందెన్
వనజాస్య గట్టివయసునఁ, దనయుఁడు పరలోకవిధులు తల్లికిఁ జేసెన్. 11

గీ. ఏమిచెప్పంగ నఱువదియేండ్లవయసు, ముసలిసుకుమారుఁడే కాంతమునరమించెఁ
గూఁతుబిడ్డఁ బోమల పైఁ గురులు వ్రాలు, సంతమాత్రపుఁ జిన్నప్రాయంబువారి.

వ. అంతం గొంతకాలంబునకు వానిదుశ్చేష్టితంబు లెఱింగి బ్రాహ్మణులు వాని బహి వెట్టి యూరువెడలనడిచి యారూఢపతితుం డైనవానిసంసర్గంబునం బుట్టినదోషంబు బుద్ధిపూర్వకంబు గాదు కావునఁ గొంద ఱుపవసించియుఁ గొంద ఱుత్తప్తకృచ్ఛ్రంబు లనుసరించియుఁ గొందఱు కృచ్ఛ్రాతికృచ్ఛ్రంబులు నడిపియుఁ గొందఱు చాంద్రాయణంబు లాచరించియుఁ గొందఱు........

సీ. ..................శౌంతశలలకు యమదూతలకు నభిధాంతరములు
ప్రతిబింబములు కాళరాత్రియామములకుఁ బుత్రసంతానంబు భూతములకు
నశుభకర్మముల కన్వాదేశములు మహానిశాపాతకరములకు సంగడీలు
కలికాలమునకు డగ్గఱినచుట్టంబులు ధూమకేతువులకుఁ దోడునీడ
లంధకారంబునకు విందు లనఁగ గిరుల
యందు వర్తించుచెంచుల నాశ్రయించి
మనువు మనెఁ గూఁతులునుదాను మహీసురుండు
కొంతకాలంబు మనములోఁ గుత్సలేక. 14

క. ఎనుబదియేఁడుల వార్ధక, మునఁ బ్రాక్తనశక్తి యుడిగిపో దాతనికిం
దినియెడిది పెద్దమాంసము, కొనియెడి దిది కల్లు మనసు క్రొవ్వెట్టుడుగున్,

గీ. కాంచె నిద్దఱు సుతుల నక్కామినులకు
వావివర్ణంబు మాలినవదర యతఁడు
శాస్త్రములఁ జెప్పఁబడినదోషంబు లెన్ని
యన్నియును జేసె నాతఁ డేమనఁగఁగలదు. 16

వ. అంత. 17

క. హేమంతము శరదాగమ, సామంతము తుహినకరవినంజ్ఞితశబరీ
సీమంతము మదనబల, శ్రీమంతము డాసె భువనసీమాంతంబై. 18

మ. బలుసు ల్పండెను దొండముక్కువడియెం బ్రాసంగుఁజే ల్వ్రీఁకమో
కలపూఁబాళలతావిఁ గ్రోలి పొరలెం గాబేరదిగ్వాయువుల్
ఫలినీవల్లిమతల్లివల్లరులపైఁ బైపై నలివ్రాతముల్
పొలసె న్మంచులు రాలె రాత్రికరణీఫూత్కారవార్బిందువుల్. 19

చ. కలమవనాళికాకణిశకంటకకోటులచేతఁ జూడ్కి కిం
పలవడిచె న్ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణీ
సలిలమువాఱి పండినయజాంగలసీమము లెన్ని యన్నిటం
దల మగుసీతువేర్మి గరుదాల్చినభావము ప్రస్ఫుటంబుగన్. 20

క. కలవింకకలకలాపల, వలభీగర్భములు సౌధవాటములు పురం
బులయందుఁ దుహినవేళలఁ, జలి గులగులకూయునట్టిచందం బొందెన్. 21

క. పెనుజలి గడగడ వణఁకుచు, వనదేవత దంతవీణ వాయించెనొకో
యన మోకప్రేంకనంబుల, ననగుత్తుల మొఱసె నలిగణము విపినములన్.

ఉ. బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబులన్ హత్తి మో
దంబార న్మృదుకేళిశయ్యల శుభాంతర్గర్భగేహంబులం
దాంబూలీదళభాగపూరితముఖుల్ ధన్యాత్ముకు ల్మీతకా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగలీలావధిన్. 23

సీ. ధనదదిగ్ధ్వాంతకాంతాపయోధరభారసంవ్యానపల్లవస్రంసనములు
కైలాసగిరికూటకల్పద్రుమాటవీకుసుమగుచ్ఛరజోఽవగుంఠనములు
చంద్రభాగాసరిత్సలిలవీచీఘటాప్రేంఖోలికాకేళిరింఖణములు
రాధాపురీహర్మ్యరత్నహేమగవాక్షసంవేశనక్రియాసౌష్ఠవములు
వలనుగాఁజంపకారణ్యవాటిఁదడిసి, కాశి యొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాఁగెను సపాదలక్షశైల, కటకబంధుఁ డుదగ్దిశాగంధవహుఁడు.

గీ. చలి ప్రవేశించు నాగులచవితినాఁడు, మఱియు వేసవి రథసప్తమీదినమున
నచ్చసీతు ప్రవేశించుఁ బెచ్చుపెరిఁగి, మార్గశిరపౌషమాసాలమధ్యవేళ. 25

గీ. ఇనుఁడు కోదండరాశిమీఁ దెక్కువేళ
నిక్షుకోదండవల్లి యెక్కుడు మరుండు
సమదవేదండసమమహాసత్త్వుఁ డయ్యు
జనుఁడు కోదండమునుబోలెఁ దనువు వంచు. 26

గీ. ఇండ్లమొదలను నీరెండ నీడికలను, ననుఁగుఁదమ్ముఁడు నన్నయు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము,గాఁచుచోటికి మకరసంక్రాన్తివేళ.

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి దుష్కరశుష్కగహనావళీదావదహనజిహ్వ
కుక్కుటేశ్వరవరకుండి పీఠాపురి శంకాతమస్కాండచండదీప్తి
దక్షవాటంబు సప్తర్షిగోదావరి కలిదోషపాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయుపురిరామాల దురితాహిసంఘాతగరుడమూర్తి
యిన్నిటను దీర్ఘమాడంగ నేగుదెంతు, రఖిలమునులు ప్రభాతసంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండరాశిఁబాసి, మకరమున కేగుదేరంగ మాఘవేళ.

మ. పఱివోయెం దుహినంబు పండె వరి యిప్పల్పూసె శైలంబులన్
గఱిగట్టె న్వలరాజు తేఁటిమొఱకం గాండప్రకాండంబులం
జఱపించె న్గ్రహరాజు మాతరకునిం జక్రాద్రికూటంబునం
దఱిఁ గౌబేరదిగంతరిక్షపథయాత్రాజైత్రతుత్తుంభముల్. 29

వ. వెండియుం జకోరలోచనల కుచమండలంబునకుఁ గర్పూరఖండక్షోదంబుల మేదించిన చందనానులేపనై పథ్యం బపథ్యం బయ్యె. రథ్యవేగంబున ననూరుసారథిరథంబు ప్రతివిఘట్టనక్షుణ్ణనక్షత్రక్షోదపాళీచుళుకితోర్ధ్వాండభిత్తియై యుత్తరాయణంబు గైకొని కులూదశాళోదరీకపోలముకురబింబంబులం బ్రతిబింబించె. సవ్యాపసవ్యక్రమంబునం జక్రమిథునంబుల నెట్టుకొని బిట్టేసి యేసి విసిగి నిల్చి మనోభవుఁడు నిగిడించిననిట్టూర్పునుంబోలె నిశాసమయంబుల నిండువెన్నెలలోనం జిన్నిచిన్ని నులివేఁడివడ పొడచూపె. కేదారక్షేత్రంబులం గలమగోపిక లొడికంబుగా దంచిన సిద్ధంబు లగుదుద్దుగడు బ్రాసంగుఁబ్రాలు సద్యోమార్జనావశంబున నతిస్నిగ్ధంబులై కర్ణాటదేశతాటంకినీ దశనవజ్రాంకురంబులకాంతిసంపదఁ దలంచె. నీహారవ్యపాయంబున నిర్మలంబులై బహుళపక్షప్రదోషంబులయందుం దారకంబులు, పికచక్షుష్షు

దకోరకంబులు కెలంకులఁ గొలంకులలోనం బ్రతిబింబించి మదకలకలహంస త్రోటీకోటీవిఖండితమృణాలదండఖండంబులభావంబు భజించె. హృదయోత్కంఠాతిరేకంబునఁ గంఠమూలకఠోరకాలకూటవిషమషీకళంకపంకచ్ఛాయాచ్ఛటాకుండు భువనరక్షాదాక్షిణ్యుండు దాక్షారామభీమేశ్వరుండు దక్షిణజలధివేలావలయితంబు లగులవంగలవలీమతల్లికాకుడుంగక్రోడంబులఁ గ్రీడించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగి వెడలె. వలవలనిమంచుఁ దుప్పరముసురుజడెందడిసిజడనుపడి వ్రేకలగుపోఁకపూఁబాళలపరిమళంబులఁ బుక్కిలించియుమియుచుఁ, బకఠంబులలోన నల్లనల్లన పొలుపారు నడవికరువలి యసమసమవిషమకుసుమఫలక్రీడామతల్లికల మల్లుపెనంగి డస్సినభిల్లపల్లవాధరల గల్లఫలకంబులఁ గ్రొత్తయుదయించు చెమటచిత్తడి యుడిపె. కాశిశ్రీశైలకుంభఘోణశోణార్కకాంచీకాంచనసభాకాళహస్తికురుక్షేత్రాదిపుణ్యస్థానంబులంగూపవాపీతటాకకుండికాప్రస్రవణస్రోతస్వినులం బ్రత్యామకాలంబులం బరమర్షిసార్థంబు తీర్థంబాడె నివ్విధంబున మాఘమాసవాసరంబులు వసంతసమయసామంతంబులు జరగుచుండ నాచండాలాదిమనుష్యులకు భుక్తిముక్తులు ప్రసాదింపంజాలి మాహేశ్వరులకు మహోత్సవంబు పాశుపతులకుం బ్రీతి కాలాముఖుల కవలంబంబు మునులకు మనికి జటాధారుల కాధారంబు పరివ్రాట్టులకుఁ బట్టుఁగొమ్మ వేదాంతులకు సంతోషం బాగమికులకు భాగధేయంబు మాంత్రికులకు మనువు తాంత్రికులకుఁ దావలంబు పౌరాణికులకుఁ బ్రాణ ముపనిషత్తుల కుపాయంబు ముముక్షులకు రక్ష శంభునకు విస్రంభస్థానంబు శాంభవికి హృదయోత్కంఠయు హేరంబునకుఁ బ్రియంబు తండువునకుఁ బండువు కుమారస్వామికిం బ్రేమాస్పదంబు భృంగిరిటికిం దంగేటిజున్ను దురితతరుషండఖండనంబునకు గండగొడ్డలి యఘపటలతిమిరసముదాయాహిమఘృణిసంతానంబు సంతాపశాంతికి భాగీరథీప్రవాహంబు శివరాత్రిపుణ్యకాలం బేతెంచిన. 30

సీ. ఆవణిక్పదమున కనతిదూరంబున గవ్యూతిమెడ నుదక్పశ్చిమమునఁ
బర్వతోపత్యకాపర్యంతతటమున సికతాతినిర్మలక్షేత్రసీమ
మాలూరతరుషండమధ్యభాగంబునం బ్రస్రవణాపగాపార్శ్వభూమిఁ
గుసుమవాటికలలోఁ గువలయాంభోరుహాకుముదమండితమైన కొలనితోడఁ

గోటతో గోపురములతో గుట్టుమట్టు, మండపంబులతో మహామహిమనొప్పు
నాదిమధ్యాంతనాగేశ మనఁగ నొక్క, పుణ్యతీర్థంబు త్రైలోక్యపూజితంబు.

గీ. అందు శేషప్రతిష్ఠితుం డమృతదివ్య, లింగమంగళమూర్తి ఖట్వాంగపాణి
యర్ధశశిమౌళి నాగేశ్వరాహ్వయుండు,ప్రతివసించు ననేకకల్పములనుండి. 32

వ. ఆశివరాత్రిపుణ్యకాలంబున. 33

సీ. శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి దరి నొనర్చిరి మూఁడుతర్పణములు
ధరియించి రంబునిర్ధౌతవస్త్రంబుల నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం దొనరించి రంశుమంతున కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి యభ్యాగతులకు సర్వ్వాణాలు నడిపి
రవనిసురులెల్ల నాగేశ్వరాలయమున, కేగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు
.........నాల్గుజాలుఁ బూజ, నాదిసంకల్పమొనరించి రభవుప్రోల. 34

గీ. ఆదరంబున సమ్మార్జనానులేప, ధూపపటువాసనలు తైలదీపములును
సంఘటించిరి వివిధసంస్కారవిధుల, బ్రాహ్మణులు సర్వులైనట్టి పౌరజనులు.

సీ. కాంస్యతోరణమాలికలు సంఘటించిరి ప్రాసాదగోపురాభ్యంతరముల
రంభాతరుస్తంభసంభారములు సముత్పాటించి రొగిఁ బ్రతిద్వారమునను
బూజోపకరణపాత్రీజాత మఖిలంబు సంస్కరించిరి భస్మసలిలశుద్ధిఁ
గరమొప్పు వృషభపుంగవకేతనంబులు నిలువంగఁబెట్టిరి వలభులందుఁ
గమలనీలోత్పలంబులుఁ గర్ణికార, మాలతీకుందములు హేమమరువకములు
మల్లికాకింశుకము లపామార్గవకుళ, పాటలంబులుఁ గూర్చి రపారములుగ. 36

గీ. అపుడు సుకుమారకాహ్వయుం డదరునజ్జ, నేగుదెంచెను నాగేశ్వరేశుగుడికిఁ
బుష్పవాటికలోఁగమ్మపువులఁగోసి,పొలఁతులకునిద్దఱకుఁగొంచుఁబోవఁదలఁచి.

క. కుడిచేతమాంసఖండము, లెడకేలను మద్యరససహితమగు కంచుం
గుడుకయు ధరించి మదమున, వడవణఁకులు గొనుచు నతఁడు వచ్చె న్గుడికిన్.

వ. జన్మాంతరస్థుండుపోలె రూపాంతరగతుండుపోలె నావిష్టుండుపోలె భూతాధి
ష్ఠితుండుపోలె గ్రహాగృహీతుండుపోలె నున్మత్తుండునుంబోలె మదిరామదాతి
రేకంబునఁ దన్నుఁ దా నెఱుంగక పరిసరలతాకంటకానుషజ్యమానాంశుకో
త్తరీయుండును నజ్ఞాతసమవిషమపదవీభాగవిన్యాసప్రస్ఖలితపాదద్వయుండును
నై పలితపాండురంబు లగుశిరోరుహంబులు విరిసి వీఁపునం బడ నొయ్యొ
నొయ్యన యేతెంచి నిర్లజ్జుండును నిస్స్నేహుండు నృశంసుండును నగునక్క

ర్మచండాలుండు గర్భగోళంబునకుఁ జక్కం గట్టెదుర నిలిచి రక్తకమలదళచ్ఛా
యంబు లగుకన్నులు దెఱచి విఘూర్ణమానతారకం బైన హీకారాలోకనం
బున నవలోకయుంబోలె నిర్మలస్ఫటికమండపాధ్యాసీనుండును నమృతమయ
జ్యోతిర్లింగమూర్తియు ముక్తాఫలధవళకాంతియుఁ ద్రిభువనవందితచరణుం
డును జరాచరగురుండును నగునాగేశ్వరుని దర్శించి యమ్మహాదేవుమౌళి
కపాలమాలికామండనఖండేందుశకలంబులకు గంగాప్రవాహడిండీరఖండంబు
లకు నుష్ణీషఫణిఫణాఫలకంబులకుఁ జెలికారంబు నేయంజాలి పాంచజన్యస
హోదరంబు లన దుగ్ధాంబురాశి హృదయంబు లనఁ జంద్రికాశరణంబు లన
నంగజాట్టహాసంబు ఛేదంబులన మెంచుకొని యున్నపుండరీకంబుల పూజ
గనుంగొని వెండియు. 39

ఉ. చాయన భోగిరాట్కటకసన్నిధిదీపితదీపమాలికా
చ్ఛాయఁ బురఃప్రదేశమునఁ జాగిన నిర్ఝరవాహినీమహా
తోయముసావి చీరయెగఁద్రోచి చొరంగఁ దలంచె నెంతలోఁ
తోయని కొంకి కొంకి పతితుం డతఁ డాసవపానవిక్రియన్. 40

గీ. పవనవశమునఁ గేతకీప్రసవధూళి, యంగమున హత్తియుండంగ నాతఁ డపుడు
విమలభస్మసముద్ధూళన మొనరించి, పాశుపతదీక్షఁ గైకొన్నభంగి నుండె.

చ. కలఁగఁగఁబొత్తె నాతని యఘంబులు పంచహృషీకసంభవం
బులు బహుకాలసంకలితము ల్దవవహ్ని చిటాచిటధ్వనిం
గలఁగఁగఁబొఱు పత్తులప్రకారమునం దొలుజాముపూజకై
బలుపటహమ్ము రత్మునుచు భర్గుని గేహమునందు మ్రోసినన్. 42

వ. ఆశివరాత్రిపుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపించువారును నితిహాసం
బులు చదువువారును బంచాక్షరీపంచబ్రహ్మాదిమంత్రంబులు జపించువారును
నీలకంఠస్తోత్రంబులు పఠించువారును బ్రాణాయామంబు లనుసంధించువా
రును బ్రత్యాహారంబులు నడుపువారును బ్రదక్షిణంబులు నేయువారును
భస్మోద్ధూళనంబు లొనర్చువారును దురోదరంబుల వినోదించువారును నష్టావ
ధానంబులఁ గ్రీడించువారును వీణలాస్ఫాలించువారును గావ్యగోష్ఠి సలుపు
వారును బరిహాసం బాదరించువారును, బిందుమతి యభ్యసించువారును
బ్రహేళికలు భావించువారును నాడువారును బాడువారును మేషకుక్కు
టకరేటులావుకకపింజలయుద్ధంబులు వీక్షించువారును గుబ్జవామనకిరాతబర్బ

రజరతమూకజనవికారంబు లవలోకించువారు నై జాగరంబులు సలుపుచునుం
డిరి సుకుమారుండును నొక్కించుక యన్నుం దేఱికొని వారిం జూచుచుండె
నప్పుడు శివగంగానిర్ఝరజలతరంగశీకరజాలజనితజడిమంబులు నందిరోమంథ
ఫేనబిందువాహులుం గుమారశిఖికలాపవిధూననక్రియాలలితంబులుఁ బశుపతి
జటాబద్ధవాసుకినిపీతశేషంబులు హేరంబగండమండలనిష్యందమానదాన
ధారాకలుషగంధలహరీపాణింధమంబులు భృంగిరిటినికుంభకుంభోదరప్రముఖ
నిఖిలగణపరిషదుద్ధూళితభసితధూళికావికిరంబులు మాతృకాశ్రవణావతంసక
హ్లారకోరకప్రేంఖోళనప్రక్రియాసమభిహారానుమేయావతరణంబులు మహిసా
క్షిగుగ్గులుధూపధూమకంబులు మాలూరకిసలయామోదమేదురంబులు నగు
మహాదేవనిశామారుతంబు లతనిమీఁదఁ బొలుపారి పాతకంబులు దూల
రాల్చె నట్టిసమయంబున. **43**

గీ. అర్ధరాత్రంబుదాఁక నయ్యధమవృత్తి, శివనిశావైభవంబు నీక్షించి తనియఁ
దానకమునకు నది యాదిగా నతండు, విడిచెఁ దొల్లింటి నీచవృత్తిబుద్ధి. **44**

వ. అంతఁ గొంతకాలంబునకు. **45**

క. కుక్కలలో శబరులలోఁ, గక్కెర చిమ్మటలలోనఁ గార్కోళులలోఁ
బక్కణముగుడిసె నడుమను, గుక్కిపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. **46**

క. శ్రీనాగేశ్వరశంభు, స్థానంబున గిరిశరాత్రి జాగరణంబుం
దానుండి కనుంగొన్నక, తానను విగతాఘుఁడై యతఁడు స్మృతిఁ బొందెన్.

సీ. క్రిమికంఠకుహరమార్గమున కడ్డము దోట్టి పెద్దయేనియు బాధపెట్టకుండ
శ్లేష్మ ముద్రేకించి సెలవి రంధ్రమువాయ మెఱసి నుచ్చిళ్లు గ్రమ్మింపకుండ
దృగ్గోళకంబులు దిరుగంగ దృష్టియు నంధకారంబులో నణఁగకుండ
నెఱిదప్పి యుచ్ఛ్వాసనిశ్వాసపవమానపరివాహగతు లోటువడకయుండఁ
బరమయోగీశ్వరుఁడుపోలె బ్రహ్మరంధ్ర, వీథిఁ బ్రాణంబువిడిచె నవ్విప్రకులుఁడు
పుణ్యశివరాత్రినలపోకవోలె నైన, సురగధరుచెంత జాగరం బుండెఁగాన. **48**

వ. ఆకాలంబునఁ గాలకింకరులు మృత్యుదేవతాసహితులై ముసలముద్గరతోమ
రాదిప్రహారణంబులతో......అతనిలింగశరీరంబు వరుణపాశంబుల బంధించి
కొనిపోవఁ గణంగిన నవ్వేళ శివదూతలు శివాజ్ఞావశంబున శూలాంకుశగదా
భిందిపాలపరిఘపరశ్వధ........చ్చి దవ్వుల నాకాశమార్గంబున. **49**

గీ. ఓరి యమునిదూతలార యీబ్రాహ్మణుఁ, గరుణ మాలి యేల కట్టినారు
విడుఁడు శివునియాన మృడునాజ్ఞదాఁటమీ, రాజు......గ్గరామదించి. 50

మాలిని. విడుఁడు విడుఁడు వీనిన్ విప్రునిన్ భాగ్యవంతున్
మృడుఁడు గరుణతోడ న్మిక్కిలిం గారవించెన్
జనుల కొరుల కేలా సంభవించున్ యథార్థం
బడర మఱిమ్ర........పాలవంబుల్. 51

గీ. అన్నదాన తపస్స్నానృతాదులైన, పుణ్యకర్మం బొనర్చిన పురుషునందు
నెట్లు సంతోషమందు నర్ధేందువకాళి, యట్టిసంతోష మితనియం దావహించె.

వ. అనిన యమకింకరులు శంకరకింకరుల కిట్లనిరి. 53

సీ. ఏకార్యమునకయి యెచ్చోటి కరిగెద రరుగుఁడు మీరు మహాత్ములార
యితనిక్లేశము చూచి యతికృపాపరతమై పు......రింపఁ బూనినారె
హరుకింకరుల మన్న నాశ్చర్య మయ్యెడు సదసద్వివేకంబు చాలకునికి
భవభక్తులకు నడ్డపడుట ధర్మము మీకు నేమేల పట్టుదు మీశుభక్తు
నితఁడు కలుద్రాగె అంకాడె నెఱచిఁ దినియె
నిలిచిమూత్రించెఁ జండాలలనఁగూడెఁ
గూఁతు రమియించెఁ దెరువాటుగొట్టెఁ బ్రజలఁ
జెంచురాజుల సేవించెఁ జెఱిచెఁ గులము. 54

సీ. కేలుదో యెత్తి మ్రొక్కెనె పాశుపతులకు శరణార్థి ననియెనే జంగములకు
ఫాలభాగమునందు భస్మంబు పూసెనే యఱుతఁ దాలిచెనె రుద్రాక్షపూస
శివమంత్ర ముచ్చరించెనె జిహ్వ నేప్రొద్దు నరిగెనే యెన్నఁడే నభవుగుడికి
పఠియించెనే మహాప్రమథచారిత్రంబు తిరిగెనే మృడుపుణ్యతీర్థములకు
దానములు పెక్కుఁజేసినదాన గాని, కాలగళుభక్తియావంతఁ గలిగెనేని
యడ్డపడ ధర్మమాఁగాక యనఘులార, యర్హమే యీదురాత్మున కడ్డపడఁగ.

ఉ. ఎట్టుగ నేగుదెంచితిరి యిందుకళాధరభృత్యులార యీ
చెట్ట దురాత్ముని స్మరునిచెంతకునుం గొనిపోవువారలై
యెట్టొకొ శంకరుం డొకని నెవ్వనినేఁ గొని తేరఁ బంపినం
బట్టఁగవచ్చినారొ తడఁబాటున వీని మతిభ్రమంబునన్. 56

సీ. అనిహేతువులును దృష్టాంతంబులును జూపి యమ........యవనిసురుని,
నూరకయుండె మృత్యువు నోర్గదల్పక భవునిచే మును పడ్డపాటుఁ దలఁచి

వరుణపాశములచే వ్యథితచేతస్కుఁడై సుకుమారుఁ డెంతేని స్రుక్కుచుండె నెమరునాఁడు ద్రోణంగిరి.........తారు పంచినవారు తడయుటయును గాలయాపనమునకు నిగ్రహముఁబూని, శంభుకింకరు లపుడవష్టంభ మెసఁగ నాడుగఱచుచు నప్పు డేకాంతముండి, సమధికం బైనసాహసోత్సాహవృత్తి.

ఉ. బిత్తరి దండిమాట లిటు ప్రేలెద రే యమరాజుసేవకుల్
చిత్తజవైరియాజ్ఞ యొకచీరికిఁ గైకొన కంచు నుద్ధతి
న్మిత్తిని వారినిం గదిసి నిర్భరభూరిభుజాబలంబునన్
మొత్తిరి యుర్కి బాహువులు మోడిచి పట్టి వృషాంక కింకరుల్. 58

క. కడవసములఁ బ్రహరించిరి, యడిఁచిరి లాతముల మొత్తి రహివలయములం
బిడికిళ్లను ఘట్టించిరి, తడఁబడ మృదుభటులు దండధరుకింకరులన్. 59

వ. ఇట్లు మొత్తువడి యమకింకరులు శంకరకింకరులకుం బ్రతిఘటింపక సుకుమారుని బరివేష్టించి యమలోకంబున కభిముఖులై యతనిం గొనిపోవం ద్రోణంగి రప్పుడు రుద్రాక్షమాలికావక్షస్థలుండును జంద్రార్ధకృత శేఖరుండును భస్మోద్ధూళితలాలితాంగుఁడును ద్రిలోచనుండును నతిప్రమాణకాయుండును నగునీలలోహితప్రమథుండు కాలాంబుదధ్వానగంభీరం బైనకంఠస్వరంబున నిట్లనియె. 60

సీ. పడసె నెవ్వనికృప బ్రహ్మ బ్రహ్మత్వంబు విష్ణుండు విష్ణుత్వవిభ్రమంబు
నీరేడుజగములు నెవ్వనికుక్షిలో నొక్కఁ డొక్కంటితో నొరయుచుండు
నంధకేభజలంధరాదిదానవకోటిఁ గ్రాఁగించె నెవ్వానికంటిమంట
యామ్నాయశాఖాసహస్రంబు లెవ్వని నాసికారంధ్రనిశ్వాసధార
యమ్మహాదేవులెంకల మైనమేము, భర్తయానతి నిర్వహింపంగఁ దలఁప
మమ్ముఁ జీరికిఁ గైకొక మదముపేర్మి, నెట్టుకొనిపోయెదరు విప్రు నెఱయఁగట్టి. 61

ఉ. బుద్ధియ కల్గె నేని కొనిపోకుఁడు ధర్మము సూక్ష్మ మీయసం
బద్ధము లైనన్యాయములఁ బంతము వచ్చునె మేము దెంపుమై
యుద్ధము సేయఁజాలకయ యోహరిసాహరి నెంతచెప్పిన
న్నిద్ధరణీతలామరుని నీరు చలంబున మీకుఁ దక్కునే. 62

గీ. ఎంత చెప్పిన విన రేమి యీమహమాకు,హరునియాజ్ఞయ బలవంత మల్ప మెట్టు
చాక నొవ్వక మీరు మాకాఁకఁ జెడక, యుద్ధరామరుమాకిప్పుడిచ్చుటొప్పు.

క. నావ్రుడును యమునిదూతలు, భావభవారాతిప్రమథవర్గముతోడన్
సేవకధర్మము తగవును, లావును బంతంబు దృఢబలంబును మెఱయన్. 64

వ. ఇట్లని పలికిరి. 65

క. చత్తుము చెఱంబడుదుము కడు,నొత్తుము మీచేత నెట్టినుం దగవు మముం
బుత్తెంచినపతిసన్నిధి,నుత్తర మెట్లిత్తు మాజ్ఞ యుపహతిఁబొందన్.

సీ. చర్చించి చూడంగా చంద్రార్ధమౌళికి యమరాజు నిజభృత్యుఁడౌనొ కాఁడొ
యభవుఁ డిచ్చినయట్టియధికారమూఁగాదొ యముఁడుగూర్చున్నధర్మాసనంబు
త్రిపురాసురాంతకుదివ్యదేహము గాదొ వేదస్మృతులు తత్త్వవిధిఁ దలంప
శిష్టరక్షయు దుష్టశిక్షయు శూలికి............దొ యాత్మలోన
నవశరము లెన్ని యన్నియునాచరించె, బాపియగువీనినరకకూపమునఁద్రోచి
బాధపెట్టంగవలసినపట్టునందుఁ, బంతమే విడఁడంట యోప్రమథులార. 67

ఉ. చచ్చిన నేమి మూర్ఛ.........నేమి ప్రహారవేదన
న్నొచ్చిన నేమి పండ్లు చెవి నోరు కరాంగుళనేత్రగోళముల్
ముచ్చిన నేమి పట్టపతి మొక్కలిబంధనశాలలోనికిన్
వచ్చిన నేమి భృత్యునకు నచ్చినయేలికయాజ్ఞ పట్టునన్. 68

గీ. తగవు ధర్మంబు పాడి పంతంబు దెలిసి,
యనుపుఁ డీబ్రాహ్మణుని బాధ లనుభవింప
నొండె; దురమున మమ్ము మృత్యువు జయించి,
విప్రుఁ గొనిపొండు మాటలు వేయునేల. 69

క. మీకును మీపతియానతి, మాకును మాభర్తయాజ్ఞ మన్నింపఁదగున్
వేకావవాక్యములు వెడ, వాకొట్ల బల్మజంబు వలవదు సేయన్. 70

క. అని యమువిభటులు పలికిన, విని శంకరభటులు తద్వివేకంబునకున్
మనమున సంతోషించియు, మనసిజహరుశాసనమును మన్నించుటకై. 71

సీ. పోడికచ్ఛడములపైఁ బులితోలునునుఁ జేలు కటిభారమునఁ గాసెకట్టు గట్టి
యభినవంబైనరుద్రాక్షయొడ్డాణంబు నాభిచక్రములోనుగా ధరించి
ప్రిదిలి జాఱక యుండఁ బెనుబాఁపఱేఁగులు శ్రవణభాగమునందు సంతరించి
యల్లిబిల్లిగ జటావల్లీమతల్లులు గూర్చి మెపొందఁ గీల్కొప్పు వెట్టి [కడ
భసితధూళి శరీర మభ్యంగమార్చి,యుద్ధపిడిఁ బారిమదయోధు లొక్కఁడొకఁ
డాయుధంబులు ధరియించి యట్టహాస,డమరుకధ్వానసింహనాదములతోడ.

శా. ఆటోపారభటీసముద్భటతరాహంకారబాహాధను
ర్జ్యాటంకారరవంబు లంబుజభవాండాభ్యంతరంబుల్ సమా
స్ఫోటింపంగ లలాటలోచనభుజిష్యుల్ దండభృద్భృత్యులన్
ధాటీసంభ్రమలీలఁ దాఁకిరి వడిన్ ధారాధరాధ్వంబునన్. 73

సీ. ద్రాఘిష్ఠకఠినదంష్ట్రాదండసంఘట్టకటుఘోరకిటకిటాత్కార మగుచుఁ
జటులఝంఝామరుజ్ఝంపాపరంపరాసన్నిభఘ్రాణనిశ్వాస మగుచు
సకలతారకచక్రవిభ్రాన్తిభీషణస్ఫారచక్షుర్ద్వయీభయద మగుచు
నిటలవీథివిటంకనిర్భరభ్రూకుటీనటనక్రియాటోపపటిమ మగుచుఁ
గాలమృత్యువు శాణచక్రమునఁబట్టి, చికిలిచేసిన యడిదంబుచేతఁ దాల్చి
జేగుఱించిన మొగముతోఁ జిత్రజారి, ప్రమథవర్గంబుఁదాఁకెనాగ్రహ మెలర్ప.

వ. ................ తవణిడమరువుతకఁతమనినదముతవణించుచుఁ దచ్చటులతమా
మీాకడంబరవిష్కంభము కాషాకటాహముల నుద్ఘాటింప దినకరకరచ్ఛా
యాచ్ఛేదాధిగమమున ధగద్ధగితము లగుని స్త్రింశకుశారాద్యాయుధదీప్తులు
రణలక్ష్మినివాళింపంగ నవుడు విద్యాధరపన్నగయక్షగరుడగంధర్వాదులు
మది నాహ్లాదింపంగ సురముని కుంచె యాడింపంగ నిలింపపథంబున భవుని
లెంకలు శమనకింకరులును బాహావష్టంభవిజృంభణ మప్రతిహతముగ నొం
డొరులఁ దాఁకిన భండనంబు ఘోరం బయ్యె. 75

క. శంకరభటులును నంతక, కింకరులు మిథఃప్రహారకీలాలసటా
పంకిలతను లయి కుసుమిత, కంకేళితరులభంగిఁ గనుపట్టి రనిన్. 76

వ. అప్పుడు కింకరులయందొకఁడు రుంచు యమునిసన్నిధికిం జని యతని కి ట్లనియె.

సీ. దేవ దేవరయాజ్ఞ ధృతి నేముదలఁబూనిమృత్యుతోఁ గూడి భూమిాస్థలికినిఁ
జని వణిక్పథ మనుఘనపట్టనమునకు ననతిదూరమున శైలాంతరమున
నడవిలో నొకమృగవ్యాధపక్కణమునఁ గుష్ఠామయంబునఁ గుతిలపడఁగఁ
జెడి పెకూఁతురు కాళ్లకడనుండి యేడ్వంగఁ బంచత్వమొందినపాపకర్ము
బ్రహ్మబంధుని సుకుమారుఁ బట్టి తేఁగ, నభవుదూతలురానీకయాఁగినారు
మాకు వారికి దుర మయ్యె నాకసమున, నెఱుఁగఁజెప్పంగ వచ్చితిని త్రైలింగు.

వ. అనిన విని కృతాంతుండు సమధికక్రోధావేశవివశస్వాంతుండై యులుంబ
ధుం డనుసేనానిరావించి యతనితో ని ట్లనియె. 79

గీ. చనుములుంబరవృషభలాంఛనునిలెంక, లాఁగినారఁటమన వాండ్రనాక సమున
నొక్కపాపాత్ముఁ గొనిరాఁగ నుద్ధవిడిని, నేగి యా జటాధారుల నెగిచి రమ్ము.

క. గబ్బున నెదిరించిన నొక, దెబ్బ గొనుచు........నెదురఁ ద్రిజగముల నొరుల్
తబ్బిబ్బుగ జంగములకుఁ, బబ్బంబులు వెట్టు ముష్టిపరిఘట్టనలన్. 81

గీ. వ్యాధులష్టోత్తరశతంబు వచ్చుఁగాక, తోడనే తెంచుఁగాక మృత్యువులు నూఱు
పంపినారము మువ్వాడిభటులఁ గూర్చి, కాలమృత్యువు గెలుము శంకరునిహితుల.

వ. అని పల్కిన వల్లె యని యయ్యుంబరుండు వివిధవ్యాధిమృత్యుపరివృతుండై కదలి యుద్ధవిడిఁ దూర్యంబులు మొరయఁ బ్రమథానీకంబుఁ దాఁకి శస్త్రజాలంబు నిగిడ్చి పేర్చి యార్చినం గోపించి పంచవదనభటులు కుటిలభ్రూభంగభీషణంబు లగు మొగంబులు జేవుఱింప నట్టహాసంబు చేసి య....డమరుడిండిమ రమరమధ్వానంబుతోఁ గీనాశకింకరుల ముసలభిందిపాలతోమర మండలాగ్రత్రిశూలపట్టసంబులఁ బ్రహరించిన విచ్ఛిన్నబాహూరుచరణవక్షః(ఫలక) లలాటకృకాటులై విచ్చియు నొచ్చియుఁ జచ్చియుఁ దెరలియుఁ బొరలియుఁ దోఁగియు డాఁగియుఁ గ్రుస్సియు డస్సియుఁ గందియుఁ గుందియుఁ దారియు....మ్రొగ్గియుఁ డగ్గియు నలసియు సొలసియుఁ బికాపికలై దికొఁక మొగంబులై యాఱుసారులై గుఱియై బండబండై భండనంబు విడిచి వలయ....బారి వెలవెలం....కృతాంతునిసన్నిధికిం బోయిరి. ఇట జటాధారులు సుకుమారుని బంధనంబు లూడ్చియు నతని మున్నిడుకొని హొన్నాళంపుఁగ రాచూరి చాయలం బట్టుచు నింటితెరువునం జనరి. అప్పు డాసుకుమారుండు పుణ్యశివరాత్రివ్రతాలోకనప్రభావంబున. 83

తాళవృత్తము. దౌదవ్వులఁ గాంచెం గైలాసముతరుణేందు(కళా)ధరునివాసము
(ద్వా)దశహరి...స్థానస్థపుటితధవళచ్ఛాయాచ్ఛేదవిలాసము
ధ్రువమండల....నంతాధిష్ఠాలశృంగశృంగాటకవిహార
త్ఖచరగరుడగంధర్వప్రమదాస్తోమవిహితలీలాపరిహాసము
నవలేపాటోపసముద్భటవిఘ్నాధిపదీర్ఘవిషాణప్రఘణ
వ్యాఘట్టనపారద....మయప్రస్థతటధ్వనివిసరము
నవిహితహూత్కాముద్రానిగదవ్యాఖ్యాతశోకలతోవల్లవ
ధ్యాంధ్యాతథ్యవిజిత్వరనీహారాద్రిసుతాచరణాబ్జన్యాసము. 84

సీ. కామధుగ్ధేనుసంఘాతంబుతోఁట్లులు, గాంచెఁ గాంచెను రత్నకందరములు
కాంచెఁ గల్పకవాటికాసహస్రంబులు, సిద్ధరసాపగాశ్రేణిఁ గాంచె
బహుహిరణ్మయమహాప్రాకారములు గాంచె, నమరిన......ధములు గాంచెఁ
బ్రబలచింతామణీస్పర్శవేధులఁగాంచె,నానావిమానరత్నములు గాంచె
హావభావవిలాసరేఖావిశేష, హారిమూర్తుల రుద్రకన్యకలఁ గాంచె
......నిహోవనర్ధేందుమాళిఁ, గాంచె సుకుమారుఁ డంబికాకాంతుశివుని. 85

వ. కాంచి దండప్రణామంబులుచేసి చేతులుమోడ్చి ఓమ్నమశ్శంకరాయ, శశాంకమూర్ధాలంకారాయాంధకపురంధ్రీనీరంధ్ర స్తనకుంభసముత్తంభితకస్తూరికాస్థాసకముద్రాద్రోహిబాహార్గళస్తంభాయ, జంభారిప్రముఖనిఖిలదేవతాకోటిహాటకకిరీటకోటీవిటంకసంవాసితమందారమాలికామరంద బిందునిష్యందధారాధౌతచరణారవిందాయ, జలంధరాసురకంధరాపీఠికాఘట్టనక్రియాగరిష్ఠనిష్ఠురతాశశ్వద్విభంగఖట్వాంగపాణయే, పశ్యల్లలాటాయ, మదనమదగదాగదంకారాయ సంధ్యానటాయ, కరకలితడమరుఝాంకార, బృంహితబ్రహ్మాండమండలాయ, చండికాధిపతయే, నిరస్తసమస్తోపాధికాయ, సచ్చిదానందస్వరూపాయ, స్వమహామహిమప్రతిష్ఠాయ, నిరుపాధికనిరవధికనిర్నిరోధనిరవగ్రహాభిసంధినిర్భరకృపాసంపత్సంపూర్ణ మేధసే, వృషాంకమాలికాభరణాయ, సముద్దండపుండరీకక్రవ్యాదకృత్తికంథాధుకంధరస్కంధభాగాయ,భగవతే నమస్తే; ధన్యోఽస్మి ! కృతపుణ్యోఽస్మి !! నమస్తే. అనిపలికి వెండియు. 86

విషమవృత్తము. జయజయశంకరజయజయపురహార
జయజయ.... .... .... ....గుణవసుశాలయ
జయజయతుహినక్ష్మాధరకన్యాసహచర
జయజయశాక్వరవరశుభ కేతన
జయజయమందరకందరకంథర
సంక్షుభితమహాక్షీరోదన్వజ్జఠర....రశజలన
గిరీశా నకల్మాషిశితి కంథరా. 87

వ. అనియనేకప్రకారంబులం బ్రస్తుతించిన సుకుమారుమీఁదఁ గరుణాకటాక్షవీక్షణంబు లొలయించుచు విరూపాక్షుం డతనికిఁ గామగమనంబును హేమకింకిణీమాలికాసనాథంబునురుద్రకన్యాసహస్రసంకులంబును నగుదివ్యవిమానంబొసంగి ప్రమథత్వంబు కృపచేసె. పుణ్యవంతుల భాగ్యంబునకుం గొల్ల

గలదే,యింక నెయ్యది.........యడుగుండని సూతుండు నైమిశారణ్యనివాసు
లగుమహామునులకు సవినయంబును సస్నేహంబును సగౌరవంబునుగా విన్న
వించిన.                                                                                    88

గీ. పరమమునులుసూతవ్యాసంభవునిసూతు,
భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ
భటులుప్రముఖులచేభంగపడుటచూచి,
చిన్నఁబోయి యముండేమిచేసెఁ జెపుమ*

మ. కరుణాసాగర శైవశాస్త్రకలనాగాంభీర్యశౌర్యోన్నతా
తరుణీమన్మథ రాజపూజితకళాధర్మక్రియాసంస్తుతా
వరనీతిప్రతిభావిశేషకలనా వాగీశసంకాశశ్రీ
తరుణీనాథమనోజ్ఞరూపవిలసత్కావ్యార్థసంబోధనా.                    90

క. ధర్మార్థాలయవరగుణ, నిర్మాణవిశేషవిభవనిరుపమకార్యా
కర్మోత్కటబహుగుణవృత, నిర్మలసుజ్ఞానచతురనిశ్చితధైర్యా.            91

మాలి. శతధృతిధృతదివ్యాసారనిర్మాణరూపా,సతతసుఖవినోదాసామగానప్రమోదా
వితతకవివరేణ్యావీరశైవాగ్రగణ్యా, యతులఫలవివేకాహార్షనైర్మల్యపాకా.

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకల
విద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బైనశివరాత్రి
మాహాత్మ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

* ఈగ్రంథ మింతతో సమాప్తమనియే తోఁచుచున్నది.

శ్రీ

# పాండవాజ్ఞాతవాసవత్సరవ్యాప్తినిర్ణయము.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రమహాభారత పీఠిక (వావిళ్లవారిచే నచ్చొత్తింపఁబడిన A critical Introduction to Andhra Mahabharatamu) యందు, తిక్కనయాంధ్రీకరణమునుగూర్చిన యుదాహరణములలో నొకటిగా నీయజ్ఞాతవాసవత్సరవ్యాప్తిసందర్భముదాహరించి, కొంతవఱకుఁ జర్చించి యందు మూలమును నీలకంఠభట్టాచార్యునివ్యాఖ్యానమును దిక్కనార్యుని తెలుఁగుపద్యమును వ్రాసి పైవిషయములో నివి పరస్పరసందర్భము లేకయున్నవనియు, ఈసందేహము లోకము విమర్శించుఁగాక యనియు వ్రాసి విడిచిరి.

శాస్త్రిగారును నేనును, ప్రస్తుత మనంతపురమందు రాజకీయకళాశాలలో నుపాధ్యాయులముగా నుండుటచేతఁ బ్రస్తావవశమునఁ బైవిషయము వారు నాకుఁ జదివి వినిపింపఁగా, విషయము జ్యోతిశ్శాస్త్రసంబద్ధ మగుటచే నేను గొంత కృషిచేసి చూచెదనని చెప్పి, మూలవ్యాఖ్యానాంధ్రీకరణములకుఁ బరస్పర విరోధ మేమియును లేదని, నాచేతనైనంతకొలఁదిని విమర్శింపఁబూనితిని. ఇందలి లోటుపాట్లను బెద్దలు మన్నింపఁగోరుచున్నాను.

చదవరులసౌకర్యమునకై మూలము నిక్రింద వ్రాయుచున్నాను.

భీష్మః॥ *కళాః కాష్ఠాశ్చ యుజ్యంతే ముహూర్తాశ్చ దినానిచ।
అర్ధమాసాశ్చ మాసాశ్చ నక్షత్రాణి గ్రహాస్తథా॥ ౧.
ఋతవశ్చాపి యుజ్యంతే తథా సంవత్సరా అపి।
ఏవం కాలవిభాగేన కాలచక్రం ప్రవర్తతే॥ ౨.

---

* [వ్యాఖ్యానము :—జ్యోతిషాం నక్షత్రాణాం వ్యతిక్రమాత్-సూర్యేణ చంద్రేణ చ లంఘనాత్. అత్ర చతుర్వింశత్యా పక్షైశ్చాంద్రసంవత్సరః చతుష్పంచాశదధికశతత్రయదినాత్మకః-పంచషష్ట్యుత్తరత్రిశతదినాని, పంచదశఘటికాః ఏకత్రింశద్వినాడ్యః. త్రింశదక్షరాణి, సౌరసంవత్సరమానం - షష్ట్యధికశతత్రయదినాత్మక స్సావనసంవత్సరః తత్ర - ప్రతిజ్ఞానిర్వహణాదిప్రాయశ్చిత్తక్రియా స్సావనమానేనైవ నిర్వర్త్యాః - న సౌరమానేన - నాపి చాంద్రమానేన - తథేతి శాస్త్రనిశ్చయాత్ - తథాహి॥ శ్లో॥ ఆయుర్దాయవిభాగశ్చ ప్రాయశ్చిత్తక్రియాశ్చ హి। సావనేనైవ కర్తవ్యా శ్శార్గ్యస్య వచనం తథా॥ ఇత్యుక్తత్వాత్ - యథా సౌరచాంద్రమానయో రాంతరాళిక స్సావన

తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాం చ వ్యతిక్రమాత్ ।
పంచమే పంచమే వర్షే ద్వౌ మాసా వుపజాయతః ॥ 3.
ఏషా మభ్యధికా మాసాః పంచచ ద్వాదశ క్షపాః ।
త్రయోదశానాం వర్షాణా మితి మే వర్తతే మతిః ॥ ౪.
సర్వం యథావ చ్చరితం యద్య దేభిః ప్రతిశ్రుతమ్ ।
ఏవమేవ ధ్రువం జ్ఞాత్వా తతో బీభత్సు రాగతః ॥ ౫.

(1) సీ॥ "రెండవయేట నొక్కం డధిమాస మి ట్లెక్కనయన్నెల లెల్లఁ గూర్చి,
కొనఁ బదుమూఁడు హాయనములు తప్పక నిన్నఁటితోడనె నిండె నింత
యెఱిగియెతమపూన్కి యెల్లనుదీర్చితి, మని పొడసూపె నర్జునుఁడు నేఁడు."
విరాటపర్వము. ౪ ఆశ్వాసము. 232 పద్యము.

ఈతిక్కనార్యునిపద్యమునుగుఱించి శాస్త్రిగా రిట్లు వ్రాసిరి "...13 సౌర సంవత్సరములును నాఁటికిఁ (ఉత్తరగోగ్రహణమునాఁటికి) బూర్వదినముతో నిండినట్లు కనబడుచుండుటంబట్టి యీవ్యాఖ్యాన మాధారముగానో మఱియెట్లో తిక్కనార్యుఁడు 'నిన్నఁటితోడనె నిండె' ననుచునూఁదిపలికి సౌరమానమునఁ గాలనిర్ణయ మొనరించినట్లు కనఁబడుచున్నది." వ్యాఖ్యానమందు 13 సౌరాబ్దములును 'నిన్నఁటితోనిండినట్లు గానరాదు, అందుచేత నది యాధారము గానేరదు. వ్యాసకృతమహాభారతమందలిపూర్వసందర్భములనుబట్టి యీభావమును గ్రహించి తిక్కన తెలుఁగుచేయుటలో వ్యక్తపఱిచెను. తిక్కనభావము సరియైనదని యీ క్రిందిపద్యములవలన స్పష్టముకాఁగలదు.

ఆంధ్రమహాభారతమందలి విరాటపర్వతృతీయాశ్వాసములో 107వ పద్యమందుఁ గృపాచార్యుఁ డిట్లు చెప్పెను.

ఉ. "వారలు పూనినట్లు వనవాసము సల్పిరి పీరు వేచి త
న్మారయఁగా బయల్పడనియట్లుగ నుండెడు వత్సరంబును

---

స్సారమానేనసాకం సమీక్రియతే - తదా సౌరమాసగతావృద్ధి స్తత్ర లభ్యతే - తత్రైవ - సౌరచంద్రమానయో ర్విషయేఽపి - సామరస్యే క్రియమాణే త్రయోదశసు సౌరసంవత్సరేషుగతేషు పంచ చాంద్రమాసాః కించి దభ్యధికద్వాదశదినా న్యధికాని భవంతీతిజ్ఞేయం. ఏవ మేవ క్రమేణ సావనమానానురోధేన గణనాయాం క్రియమాణాయాం - త్రయోదశసౌరసంవత్సరపరిపూర్తేః-సపాదాష్టషష్టిదినేభ్యః పూర్వమేవ త్రయోదశ సావనసంవత్సరాణాం పరిపూర్తి స్సమగ్రతయా జాయతే. తస్మాద్యథావ చ్చరిత మిత్యాదినా - పాండవై ర్యథాప్రతిజ్ఞ మాచరిత మిత్యుక్తమ్.]

జ్జేరువచేరువ ల్గడచెఁ.........................."

దీనికి వ్యాసభారతమందలి మూలము.

" నివృత్తసమయాః పార్థా మహాత్మానో మహాబలాః."

ఆసందర్భమందే చివరను 131వ, పద్య మిట్లున్నది.

ఆ. "పాండురాజసుతులుఁ బాంచాలియు నుదమ్ము, నొరు లెఱుంగకుండఁ దిరుగవలయు దుష్కరంపు టేఁడు దుది నేరఁబాఱె నెవ్వరును దీనిఁ దలఁపవలను లేర."

దీనికి మూలము.

" తత స్త్రయోదశ స్యాంతే తస్యవర్షస్య భారత
సుశర్మణా గృహీతం త ద్గోధనం తరసా బహు."

ఇంకను నొకసందర్భము. దక్షిణగోగ్రహణమందు విరాటుఁడు సుశర్మచేఁ గట్టఁబడియున్నసందర్భములో ధర్మరాజు భీమునితో నిట్లనును.

క. " తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని నుభయబలము న, చ్చెరువందుచుఁ జూచి వృకో, దరుఁడవగుట యెఱుఁగకున్నె తద్విధ మేలా."

మూలము,

" మా భీమసాహసం కార్షీ స్త్వ త్త్వేష వనస్పతిః ।
మా త్వాం వృక్షేణ కర్మాణి కుర్వాణ మతిమానుషమ్ ॥
జనా స్సమవబుధ్యేర న్భీమోఽయ మితి భారత ।
అన్య దే వాయుధం కించిత్ ప్రతిపద్యస్వ మానుషమ్ ॥

దీనివలన దక్షిణగోగ్రహణమునాఁటికి సమయపూర్తి కానటులు స్పష్టము. మఱునాఁ డుత్తరగోగ్రహణమందు అర్జునుఁడు త న్నుత్తరున కెఱింగించుకొనెను. ఆసమయమందే భీష్ములవారును సమయాబ్దములు నిండెనని నిష్కర్షచేయుటచేత 'నిన్నఁటితోడన నిండె'ననుట సమంజసమే. ఈయభిప్రాయమే కన్నడభారత మందుఁగూడ నీసందర్భమున నిట్లు చెప్పఁబడియున్నది.

" మగనె, కేళ్కెరె దువరుష కె, మిగువు వెర డేమాసమాసా
దిగళనవరనుభ విసిదరు హదిమూరువత్సరవ
మిగువవధిబుధరరియె నిన్ననహగలు నిన్నదు పాండుతనయరు
పొగువొడిందిన దివసవవరదు కంద కేళెంద ॥

(నిన్నఁటిదినము నీది ఈదినమువారిది యని తాత్పర్యము).

పూర్వార్థమందు 10సం॥ లకు అధికమాసములు 26 అని చెప్పియుండుట చేత భాషాంతరీకరణము మూలమునకు విరుద్ధమని తెలియనగుచున్నది.

(2) "పదుమూఁడు హాయనములుతప్పక నిన్నఁటితోడనె నిండె" ననుచో హాయన మన, సావనసంవత్సరమా, సౌరసంవత్సరమాయనికొంతశంకించికొని రెండింటికిని రెంపసందర్భములను శాస్త్రిగారు చూపించియున్నారు. మూలమందు లేనిసావనసంవత్సరమును నొకదానిని వ్యాఖ్యానకర్త గార్గ్యవచనమాధారముగాఁ దనవ్యాఖ్యానమందుఁ జొప్పించినాఁడు. కాని యావిషయ మెంత మాత్రమును మూలమందు భావింపఁబడలేదని నాయభిప్రాయము. కావునఁ బ్రస్తుత మాచర్చ యనవసరము.

శాస్త్రిగారిపీఠికలో నిట్లున్నది. " మూలములోనీ 13 సంవత్సరములలోను 5 మాసముల 12 దినము లధికముగా వచ్చినవనియుండుటచే నవి చాంద్రమానాబ్దము లగుటంబట్టి క్రిందిపట్టికప్రకార మప్పటికి సౌరాబ్దములు పదుమూఁడు నిండుటకు 13 దినములు తక్కువయయినట్లు తెలియుచున్నది. ఎట్లనఁగా.

| | | | | ది | ఘ |
|---|---|---|---|---|---|
| 13 సౌరాబ్దములకు దినములు | | ... | ... | ... | 4748.15 |
| 13 చాంద్రాబ్దములకు 4602<br>5 మా. 12 ది. కు 159½ | | ... | ... | ... | 4761-30 |

దీనింబట్టి భీష్ముఁడు చేసినకాలనిర్ణయమునాఁటికే 13 సౌరాబ్దములు నిండె నందుమా ? ఈ 13సం॥లో మా. 5 ది. 12 లధికముగా వచ్చినవని చెప్పెడి మాట యువిరుద్ధ మగును" ఇందులకు సమాధానము మూలమునందే స్పష్టపఱుపఁబడియున్నది. " తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్ । పంచమేపంచమే వర్షే ద్వౌమాసా వుపజాయతః॥ దీనిభావము. సూర్యచంద్రులు నక్షత్రములను దాఁటుటలోఁ గలుగుహెచ్చు 5 సంవత్సరములలోను 2 మాసములు. అనఁగా 5 సంవత్సరముల సౌరమానము, 5 సంవత్సరముల చాంద్రమానముకంటె 2 మాసము లధికమని. దీనినిబట్టిచూడఁగా భారతకర్తకాలము నాఁడు సౌరచాంద్రమానములయొక్క సర్దుబాటిట్టిది యని స్పష్టము. ఈ 5 సంవత్సరములకాలమునకును యుగమని పేరు (వేదాంగజ్యోతిషమందు) అప్పటి

గణితపద్ధతినిబట్టి ఈయుగము 62 చాంద్రామాసములకు సమానము. ఒకచాంద్ర మాస మనఁగా ది. 29 గడి. 31 వి. గ. 50 అక్ష. $7\frac{1}{2}$.*

62 చాంద్రమాసము లనఁగా 1830·90 దినములు (ది. 1830 గంట 21 ని. 30 సె, 56) ఇది 5 సౌరసంవత్సరములకు సరియని మూలము వ్యక్తపఱుచుచున్నది కనుక నొకసౌరాబ్ద మనఁగా 366.2 దినములు (ది. 366 గం. 4 ని. 18 సె. 11) అని మూలమునుబట్టి మనము గ్రహింపవలసియున్నది. ఇది 365·25 దినములకంటె (వ్యాఖ్యాత సూర్యసిద్ధాంతమునుబట్టి ఇచ్చినగడువుకంటె) రమారమి యొకదిన మధికమని స్పష్టము. అందుచేత సౌరసంవత్సరము నకు మూలముప్రకారము మన యొకదినము వృద్ధి గట్టుకొనవలసియుండఁగా శాస్త్రిగారు సూర్యసిద్ధాంతప్రకారము లెక్క గట్టియున్నారు. అందుచేతనే 13 సంవత్సరములకును 13 దినములు శాస్త్రిగారికిఁ దక్కువవచ్చినవి.

కాని యీసందర్భమున సౌరసంవత్సరమునకు $365\frac{1}{4}$ దినములగుట సార్వకాలికసత్యమైయుండఁగా నవుడుమాత్ర మొకదిన మధికముగా నెట్లుగలుగునని సంశయము గలుగకమానదు. నిజమే, కాని దీని కిట్లు సమాధాన మరయఁదగును. 'ఎన్నిసంవత్సరముల కొకయధిమాసము వచ్చునండీ'యని మనమిప్పుడు సిద్ధాంతులను బ్రశ్నించిన 'మూఁడేండ్ల కొకసారి' యని వారు సాధారణముగాఁ బ్రత్యుత్తర మిత్తురు. మనము దీనినే సిద్ధాంతముగాఁ దీసికొందుము. ఏమని ? 3 సౌరసంవత్సరములు 37 చాంద్రమాసములకు సరియని. పైని జెప్పినప్రకారము 37 చంద్రమాసములును 1092·6 దినములకు సరి. అందుచేత ఒకసౌర సంవత్సరము $\frac{1092\cdot6}{3}=364\cdot2$ దినములకు సరియని తేలుచున్నది. ఈగడువు 365·25 దినములకంటె రమారమి ఒకదినము తక్కువగదా ? కనుక 3 సంవత్సరములకు 1 మాస మధికమనునది లెక్కసౌకర్యముకొఱకుఁ జెప్పెడిమాటగాని సరియైనది గాదు. అట్లుచెప్పుటచేత 18 సంవత్సరములు గడచుసరికి, చాంద్రసంవత్సరాది సౌరసంవత్సరాదికంటె రమారమి 18 దినములు ముందగును. ఒకసౌరసంవత్స

---

*దీనిగడవునకును పాశ్చాత్యులశాస్త్రసమ్మతమైనదానికిని వ్యత్యాసములేదనియే చెప్పవచ్చును. మనవారు చాంద్రమానమును తిథులగట్టుటకై యుపయోగించుచు, అందు ఈషద్భేదముకూడ రాకుండుటకై శ్రమపడి, అంతటిచిరకాలమునందుఁగూడ, ఈచాంద్రమానపుగడువును ఏహెచ్చుతగ్గును లేకుండఁగట్టియున్నారు. చంద్రగతియందలి ప్రాముఖ్యము వారికి అట్టిదిగ్గా యుండెడిది. ధర్మకర్మములకుఁ జాంద్రమానము ముఖ్యాధారముగ నుండుటచే లెక్కయందు వారి కంతదీక్షయుండెను.

రము చాంద్రసంవత్సరముకంటె సుమారు 11 దినము లధికమగుటచేత 19 సౌర సంవత్సరములు పూర్తియగునాఁటికి 19 చాంద్రసంవత్సరములు పూర్తియై(18+11) సుమారు 29 రోజు లగును. కనుకనే 19వ యేఁటఁగూడ నొకయధికమాసము వేసికొని 19 సౌరసంవత్సరములకు 7 అధికమాసములని రెండులెక్కలను సరి చూచుకొనుచున్నారు. ఈలాగుననే సులభముగాఁ బ్రజలకుఁ దెలియుటకుఁ గాను 5 సంవత్సరములకు 2 అధికమాసము లని నాఁటివారు లెక్క ఉజ్జాయింపుగాఁ జెప్పెడివారుకయు, అట్లే పంచాంగములు గణించువారుకయు నుండ వచ్చును, మూలమందలిలెక్కప్రకారము 30 సంవత్సరము లగునాఁటికిఁ జాంద్రమానమందు రమారమి 30 దినము లధికమగును గనుక 6వ యుగాంత మందు ఒకయధికమాసము వారు తగ్గించుకొని రెండుమానములకును లెక్క సరిచూచుకొనియే యుండియుందురు. అనఁగా 30 సౌరసంవత్సరములకు 11 అధిక మాసములే చూచికొనియుండియుందురు. ఇది బహుకాలమునాఁటి అధికమాస గణనపద్ధతి. ఇదియే వేదాంగజ్యోతిషపద్ధతి. దీనినిగుఱించి దివానుబహద్దరు స్వామికణ్ణుపిళ్లగారు విపులముగా వ్రాసియేయున్నారు. ఆసక్తిగలవారలను 'The Vedanga Jyotish—Examples of Yuga, Cycle and Exeligmos' The Vedanga Jyotish Calendar.' అనురెండువిషయములగుఱించినభాగములను జూడుఁడని ప్రార్థించుచు ఈవిషయమును నిలుపుచున్నాను.

కనుక 'పంచమేపంచమేవర్షే...'యను మూలమునుబట్టి పాండవులసమయకాలమందు 5 మా. 12 ది. లధికముగాఁ దప్పకవచ్చియున్నవి. కావున పాండవాజ్ఞాతవత్సరవ్యాప్తినిగూర్చి సంశయ మక్కఱలేదు.

(3) మఱియు శాస్త్రిగారు "పంచమేపంచమేవర్షే......'యను దానిని వ్యాఖ్యాతయుఁ దిక్కనార్యుఁడుఁగూడ గ్రహించినట్లు కానరాదు" అని వ్రాసి యున్నారు. వ్యాఖ్యాత గ్రహించినాఁడని నాయభిప్రాయము. ఏలయన సావన మానము సౌరచాంద్రమానముల అంతరాళిక మనిచెప్పి, చాంద్రమానమున సంవత్సరము (స్థూలమున) 354 దినము లనియును, సావనసంవత్సరము 360 దినములనియును జెప్పుటచే సౌరమానము + 360 = $\frac{354+366}{2}$ గనుకనే అంత రాళికమునసంవత్సరము 366 దినములని గూఢముగాఁ జెప్పియే యున్నాఁడు. ఇదియంతయు స్థూలదృష్టి నిచ్చినలెక్క. (సరిగా గణించినచో) 13 సంవత్సరములు గతించునాఁటికి 5 మా. 12ది.లు చాంద్రమానమున హెచ్చువచ్చునని తెలిసికొనఁదగినదిగా వ్రాసివిడిచినాఁడు. కావున వ్యాఖ్యాత యంత విస్పష్టముగా వ్రాయలేదుగాని గ్రహించెననుటకు సందియము లేదు. "రెండవయేఁట నొకఁడం డధిమాసము" అని మూలములోను వ్యాఖ్యానములోను, లేనివిషయ

మేల తిక్కన వ్రాసియున్నాఁడని యాలోచింపఁదగియున్నది. దీనికి సమాధానము నాకు దెలిసినంతవఱకు వ్రాయుచున్నాను. మూఁడు సంవత్సరములకు సాధారణముగా నొకయధికమాస మనెడు తనకాలపులెక్కను 5 సంవత్సరములకు రెండధిమాసములను మూలమందలి లెక్కతో సమన్వయించుకొనుటకై యిట్లు వ్రాసియుండవచ్చును. పాండవులరణ్యవాసమునకు బయలుదేరినది యొక సంవత్సరాంత్యభాగ మనుకొని మఱునటిసంవత్సరమందు అధికమాసమనుకొనినఁగాని రెండింటికిని సమన్వయము గాదుగనుక తిక్కన దీనిగురించి యాలోచన చేసియే యుండవచ్చును. కాని మూలము ననుసరించి 5 మా. 12 ది లధిక మెట్లువచ్చునో యది యాంధ్రీకరణమందు స్పష్టపఱుప లేదు. ఇంతమాత్రమున మూలముయొక్కయర్థమును గ్రహించియుండ లేదని మన మెట్లు చెప్పనగును. పై రెండువిషయములకు సమన్వయము చేయుపద్ధతికి నుదాహరణ మొకదానిని సూచించుచున్నాను. పాండవులు ప్రభవసంవత్సరమాఘశుక్లమం దరణ్యమునకు పయనమై రనుకొని యీక్రిందిపట్టికను వ్రాసితిని.

| సంఖ్య | సంవత్సరముపేరు. | అధిక మాసము. | పాండవుల సమయకాలహాయనములు. |
|---|---|---|---|
| 1 | ప్రభవ ... | లేదు. | ఆంగిరసమాఘ శుక్లమునకు 5 ఏండ్లసమయ కాలము పూర్తియగును, అందు రెండధికమాసములును వచ్చినవి. |
| 2 | విభవ ... | జ్యేష్ఠము. | |
| 3 | శుక్ల ... | లేదు. | |
| 4 | ప్రమోదూత ... | ,, | |
| 5 | ప్రజోత్పత్తి ... | ఆషాఢము. | |
| 6 | ఆంగిరస ... | లేదు. | |
| 7 | శ్రీముఖ .. | ,, | ఈశ్వర, మాఘశుక్లమునకు 10యవ సమయాబ్దము నిండును. ఈ 5 సంవత్సరములలోను గూడ రెం డధికమాసములు వచ్చినవి. |
| 8 | భావ ... | శ్రావణము. | |
| 9 | యువ ... | లేదు. | |
| 10 | ధాత ... | ,, | |
| 11 | ఈశ్వర ... | భాద్రపదము. | |
| 12 | బహుధాన్య ... | లేదు. | విక్రమ, శుక్లములో 13 సమయాబ్దములును నిండను. ఈ మూఁడేండ్లలో నొకయధికమాసమున్ను వచ్చినది. మొత్తమున 5 అధికమాసములు వచ్చినవి. అధికదినములను సూచింపలేదు. |
| 13 | ప్రమాది ... | ,, | |
| 14 | విక్రమ ... | ఆశ్వీజము. | |

విస్సా. అప్పారావు,

అనంతపురము.

గూర్చుండనియమించి కస్తూరి గంధపరిమళతాంబూలంబు లొసంగి శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు వారలతో నిట్లనియె. వింటిరే మొన్నటిఆశ్చర్యంబు. దేవునిపై బందిపోటుబడిరి. ఈరేయి విప్రునిపై బందిపోటుబడిరి. రాజ్యం అనాయకంబుగా నున్నది. ఇందులకార్యంబు తెరం గెఱింగింపుడనుటయు వారలందరు ఏకగ్రీవంబుగా నిలచి చెయ్యెత్తి యిట్లనిరి. నీవు సాక్షాత్తు రుద్రుండవుగాని మనుష్యమాత్రుండవు గావు. నీ వేరీతిచేసిన అదియు మాకు సమ్మతం బనిన ఆరాజు విచారించి గణపతిమహారాజు నానావర్ణంబులవారికి నాయకత్వం బిచ్చుటంజేసి బహునాయకం బైయున్నది గనుక మొక్కపోయెను. ఇందుకు తగిన యుత్తమజాతులువారు గాని నాయకత్వంబులకు అర్హులు గారని రా జిట్లనియె. వెల్మలును మానధనులును విశ్వాసపరులును నీతివివేకసంపన్నులును గాంభీర్యసముద్రులును వివేకదక్షులును పాపభీతులును స్వామివిహితోపచారులును నగుసచ్ఛూద్రులును పద్మనాయకులును వారలకు నాయకత్వంబులకే తగుదు రని శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు ఎఱుంగంబల్కిన సభాసదులు రాజునడవడివివేకంబులకు ఎంతయుఁ గొనియాడి యిట్లు మాకు సమ్మతంబు చేయుమనుటయు. ఆప్రతాపవీరరుద్రుండు పద్మనాయంకులను భట్లు శివదేవరాజు మల్లికార్జునరాజు వీరదేవరాజు విశ్వదేవరాజు మొదలైనభట్లు రాజులు పిలిపించి వారికి వీరికి సమానబహుమానాలు ప్రమాణోక్తిగా పంక్తిని గూర్చుండేనిర్ణయం చేసిఅదివరకు ఇచ్చిన భాగములో మీకుసగము భాగము అని యిచ్చి అప్పుడు శ్రీమత్ప్రతాపవీర రుద్రుండును భట్లురాజులును పద్మనాయంకులును ఒక్కపంక్తిగూర్చుండి భోజనంబులు చేసి బహుమానించిఅందుకు నాయకత్వంబునకు అర్హులుగా యేర్పరిచి ఒక్కొక్కకొత్తడంబునకు ఒక్కొక్కరిని సర్వలక్షణసంపన్నునిగా యేర్పరిచి వారలకు ధనకనకవస్తువాహనాందోళికలను చీనిచీనాంబరంబు లొసంగి మరియు ఛత్రచామరంబులును ఆలవట్టంబులును సాహసకృత్యంబు లగుబిరుదు లొసంగి డెబ్బదియేడుగోత్రంబుల డెబ్బదియేడుగురను ఇట్లు బహుమానంబుజేసి వారలకు

ఏకశిలానగరంబునకు శిలాప్రాకారంబు వారలకు డెబ్బదియేడుకొత్తడంబు లుం
డుంటుంజేసి వారిబంధువులను పద్మనాయకులం జేసి పుట్టకోటకొత్తడంబుల నుం
డంజేసి మరియు డెబ్బదియేడుగురునాయకులకును తనరాజ్యంబులో ఒక్క-
భాగము పంచియిచ్చి ఒక్క-భాగంబు బంధువులకును, ఒక్క-భాగంబు తమమూల
బలంబులకును, ఒసంగి ఒక్క-భాగంబు విప్రులకొసంగి తనవశం బైనతన రాజ్యంబు
తనభండారంబునకు చెల్లంజేసి రాజ్యంబున చోరబాధాదికంబులు లేకుండునట్లుగా
మహామహిమతో పాలింపుచుండె. సప్తసంతానంబులు దరియించి హేమాద్రి
కల్పోక్తప్రకారంబున సకలదానంబులును జేసి ప్రతివర్షంబున పన్నెండుతులాభారం
బులు తూగి కోటిసువర్ణంబులు దానంబు సేయుచు దిగ్విజయంబు సేయుటకు సకల
సేనల రావించి ప్రయాణభేరి వేయించి మొదట కటకవల్లభునిపై గదలి వాని
సాధించి వానిసుతునికి పట్టంబుగట్టి యెప్పటియట్ల మూడుకోట్లసువర్ణటంకంబులు
అప్పనంబులుగైకొని సేనాయుక్తముగా తనవెంట రానియమించి దక్షిణాభిము
ఖుండై సముద్రతీరంబునకున్ జని గోదావరి యుత్తరించి రామేశ్వరముపర్యంతము
గలపురంబులు తనవశంబు జేసికొని రెండువెయిల ఓడల రావించి అందుకు తగిన
వర్తకుల నియమించి నానాదేశంబులకు వ్యవహారంబు చేయం బనిచి అందుల
ద్రవ్యంబు తనభండారంబునకు రాజేసి రామేశ్వరునిసేవించి అచ్చట పెక్కు-దానం
బులు చేసి నాల్గుతులాభారంబులు తూగి తామ్రపర్ణిని ఉన్నసమయంబున విజయ
నగరంబునుండి వీరనృసింహరాయలు అమూల్యాభరణచీనిచీనారంబులు కాను
కగా తెచ్చి సమర్పించిన సంతోషించి యతనిగారవించిన. ఆనరపతిరాయలగు
తనమేనల్లుడగు నృసింహరాయల దళవాయింజేసి పన్నెండులక్షలపదాతి వర్గం
బులు కానుకగా బట్టిన సంతోషించి రాయలు విజయనగరమునకుం జనుటయు.

ఆప్రతాపరుద్రుండు ఆడుమండలం బేలుచుకుండాదేవిని నోడించి మెఱు
భయినాల్గులక్షలసువర్ణనిష్కంబులు అప్పనంబులుగొని తనవెంటరా నియమించి
కొంకణకెంకణమలయాలబాహ్లీకదేశాధీశులం గెలిచి వారివారిచే పదిలక్షలు
అప్పనంబులుగైకొని వారిని తనవెంటరా నియమించి పశ్చిమదేశాధీశులం గెలిచి
వారిని తనఆజ్ఞకు లోనుజేసికొని యాభయిలక్షలసువర్ణ నిష్కంబులు అప్పనం
బులు పుచ్చుకొని వారు మూడులక్షలగుఱ్ఱంబులతో తన్నుగొలువ సౌరాష్ట్ర
దేశాధీశ్వరుల నోడించి వారిచే అప్పనంబులుగొని మరియు తక్కినరాజుల గెల్చుచు
వారిని తనఆజ్ఞకు లోనుజేసుకొని వారి సేనాయుక్తంబుగా తనవెంటరమ్మనుటయు.

అంతట పూర్వదక్షిణపశ్చిమభూములు తనఆజ్ఞకు లోనుజేసుకొని ఢిల్లీశ్వరుండు తనకెదురుగా బంపినకానుకలు గైకొని సంతోషించి భాగీరథీస్నానంబు జేసి గంగాయమునాసరస్వతీసంగమంబున కృతస్నానుండై పెక్కుదానంబులు చేసి యెనిమిదితులాభారంబులు తూగి ప్రయాగకేతెంచి ఆప్పట్టణంబు తనవశంబు చేసుకొని ఆపురంబునం గలమాధవదేవునివైభవంబున కాపురంబిచ్చి సేవించి యంతట కాశికిం జని మణికర్ణికయందు మునింగి విశ్వనాథుని సేవించి కాశీనగరంబు విశ్వనాథున కొసంగి అచ్చట పన్నెండుతులాపురుషంబులు తూగి కోటి సువర్ణంబులు దానంబులు చేసి ఉన్నంత నిజభుజపాలితంబులైనదుర్గంబుల కొలది యెరింగించెద.

అటతాళిసహస్రచక్రకోలాధీశ్వరబిరుదును, శుద్ధసువర్ణసింహాసనబిరుదును, సాధించి మరియు గయకుం జని యాసుల్తానుచే పూజితుండై అచట భూసురులజనంబులచేతను పితృపితామహప్రపితామహులకును మాతామహులకును విహితకృత్యంబులు చేయించి మగుడ వింధ్యానగరంబుదాటి గోదావరి త్రికూటంబునకు ప్రవేశించి యచట విధ్యుక్తప్రకారంబుగా పన్నెండుక్రతువులు చేయించి కాళేశ్వరంబున కేతెంచి ముక్తీశ్వరు దర్శించి పన్నెండుతులాభారంబులు తూగి కోటిసువర్ణంబులు దానంబులుచేసి రెండువేయిలవిప్రులకు పెండ్లి చేసి వెయ్యిశివాలయంబులు కట్టించి యేనూరులక్ష్మీనారాయణగోపాలనిలయంబులును ప్రతిష్ఠచేసి యేకశిలానగరంబునకు ఈశాన్యభాగంబున ప్రతాపగిరి యను దుర్గంబు గట్టించి అక్కడ కొన్నిదేవాలయంబులు కట్టించి అంతట మార్గల్యంబునకు వచ్చి యగ్గుండంబున స్నానంబుచేసి రామేశ్వరు నారాధించి ఉన్నతంబుగా గుడియు గట్టి మరియును పాఖాలసీమలో ఒక్కతటాకంబు గట్టి నలుబయి గ్రామంబులు రామేశ్వరున కొసంగి యెనిమిదితులాభారంబులు తూగి కోటిసువర్ణంబులు దానంబులు చేసి యేకశిలానగరంబునకు వచ్చుసమయంబున తనతమ్ముండైన అన్నమదేవుండు రాజ్యభారంబు పన్నెండువర్షంబులు పాలించి ప్రతాపరుద్రునకు యోజనవిస్తారంబుగా ఎగుర్కొని దండప్రణామంబులు చేసి ముకుళితహస్తుండైన. తమ్మునింజూచి కౌంగిలించుకొని కుశలంబడిగి పురజనంబుల గారవించి సంతోషచిత్తుండై పురంబుప్రవేశించి శంభులింగంబును నారాధించి..

తదనంతరంబున సింహాసనాసీనుండై కూర్చుండి తనవెంటవచ్చిన నానాదేశంబులవారికి బహుమానంబులు చేసి నిజనివాసంబులకు బనిచి అంతః

పురంబునకుఁ జని తనతల్లి యైనముమ్మక్కమహాదేవికి సాష్టాంగదండప్రణామం బులుచేసి ఆయమ్మచేత దీవెనలు గైకొని భోజనశాల కేతెంచి మజ్జనభోజనాదులు దీర్చి సుఖసుప్తుండై యున్నయెడ. మహాధర్మంబులచేత చాతుర్వర్ణంబులు చేయు చుండ. అంత విశాలాక్షిలోలాక్షియందు విరూపాక్షుండు వీరభద్రుండు నను నిద్దరుతనయుల గాంచుటయు. ఇంద్రవైభవంబున మహామహిమతో రాజ్యంబు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు పాలింపుచుండు ఏకశిలానగరంబు నలకాపురీ సమా నంబయియుండె.

ఈనగరంబునం గలనానావర్ణసంఖ్య చెప్పెద. వేదవేదాంగపారాయణు లగు విప్రగృహంబులు పద్దెనిమిదివేయిలు. రాజుద్వారంబున పనులుదీర్చుగణ కులయిండ్లు నాల్గువేయిలు. రణరంగచతురులైనక్షత్రియులనికేతనంబులు పదు నాల్గువేయిలు. సకలసామగ్రివస్తువులు గలవైశ్యగృహంబులు నలుబయివేలు. ఇందుకు ప్రసద్ధులు కోటికి పడగెత్తినవైశ్యులు యేనూటడెబ్బయితొమ్మిదియిండ్ల వారు. నాల్గవజాతిశూద్రులు కాపుఇండ్లు ఇరువయివెయిలు. పద్మనాయకులు డెబ్బయియేడుగురు. పాచకులయిండ్లు వేయ్యినేనూరును. మరియు అష్టాదశ వర్ణంబులవారి గృహంబులును పంచలోహప్రముఖ గృహంబులును రెండలక్షుల యాభయివేలయిండ్లు. అనవరతసంపూర్ణం బైనగొల్లయిండ్లు పన్నెండువెయిలు. కుమ్మరయిండ్లును మూడులక్షుల నిజగృహంబులు. గాండ్లతెల్కలయిండ్లు పద మూడువెయిలనేనూరును. నిజశాలయిండ్లు పద్దెన్మిదివెయిలనేనూరు. ముద్దకమ్మర యిండ్లు పదివెయిలయేనూరును. మహేశ్వరయిండ్లు నలుభయివెయిలఆరునూర్లును. గౌండ్లయిండ్లు ఎన్మిదివేయిలమున్నూరును. చిత్తారవ్రాసేయిండ్లు రెండువెయిలయే నూరును ఉప్పరయిండ్లు ముప్పయివెయిల ఆరునూర్లును. చిప్పమేరయిండ్లు పది హేనువెయిలు. మేరయిండ్లు దాసమయ్యమేదరప్రసాదకులైనయిండ్లు పన్నెండువె యిలు. రుద్రజియ్య మొదలైనశివవిప్రులయిండ్లు ముప్పయివెయిల ఆరునూర్లును. బుక్కయిండ్లు ముప్పయివెయిల ఆరునూర్లును. పెరికీకరణయిండ్లు పదహారువెయిలు. బలిజసదనంబులయిండ్లు నాల్గువెయిలు. ముచ్చయిండ్లు పదమూడువెయిలు. తెన్గు ఇండ్లు ఆరువెయిలనన్నూరును. బేస్తయిండ్లు ముప్పయిరెండువెయిలు. మేదర యిండ్లు నాల్గువెయిలు. రజకులయిండ్లు ఆరువెయిలు. క్షౌరకులయిండ్లు నలుభయి వెయిలు. నడుమనడుమ ఆరణ్యవస్తువాహానశోభితం బైనచిల్లరవైశ్యగృహంబులు ఆరువెయిలు. ప్రవాసులైనవారికి వండిపెట్టే అలీకర్కగృహంబులు ఆరువెయిలు.

సంగరయిండ్లు ఆరువేలయేనూరును. మరి యితరపరిచారకగృహంబులు లెక్క
యెన్న కొలదిగాదు. శివాలయంబులు అయిదువేలయేనూరును. విష్ణుస్థానంబులు
నాల్గువేయిలయేనూరును. దుర్గ, మహాలక్ష్మి, భద్రకాళి, వైష్ణవి, వారాహి,
చండిక, మహిషాసురమర్దిని, విజయ, భ్రమరాంబ, వీరుమొదలైన దేవీభవ
నంబులు వెయ్యినేనూరును. వినాయకవీరభద్రనిలయంబులు రెండువెయిలు.
మైలారుదేవరభైరవులు, ఊరిశక్తులు పదినూర్లును ఇండ్లు ప్రసిద్ధస్థానాలు. భేరీ,
యేనూటయేబదియును. నిషాణంబులు రెండువెయిలనేనూరును. ఇతరమహా
పంచమహాశబ్దాలు మెుఱయుచుండును. గుళ్లమీాదపసిడికుండలు అయిదువెయిల
నేనూరును. దేవస్థానంబులదీపాలకు తైలంబు దినంబును కొలపాటి యరువది
యైదుపుట్లును. నగిరిలో దీపాలకును నిత్యబ్రాహ్మణులసంతర్పణలకును ఘనసార
శ్రీచందనపరిమళద్రవ్య అస్తదక్షిణతాంబూలాదులకును నిత్యంబును పదివెయిల
వరహాలును. నగరిలో భాగీరథీజలంబులను గౌతమీజలంబులను శ్రీశంభులింగం
బును సాహస్రబిల్వదళపూజయు, వాసనపుష్పంబులును పూజించి, నిత్యమును
మహానైవేద్యంబు. యోజనవిస్తారం బైనపురంబునకు నానావస్తుశోభితం
బైనఅంగళ్లు మున్నూరును. పిన్నఅంగళ్లు మూడువెయిలమున్నూరును. గూడెం
బులు రెండువెయిలయేనూరును. ఇట్లు ఇంద్రపురంబుసమానం బైనయేకశిలా
నగరంబున కధీశ్వరుం డైనకాకతిరుద్రుని గొల్చియున్ననానాదేశాధిపతులు అను
సరింతురు, పద్మనాయకులు డెబ్బయియేడుగురును. మల్లికార్జునభట్లు, మల్లి
కార్జున, త్రిపురాంతక, మహాదేవ, విరూపాక్ష, నారాయణ, వాసుదేవ, జనార్దన,
పద్మనాభ, రామకృష్ణ, బ్రహ్మవిద్యాంసులు మొదలయినవారు బంగారుపల్లకీలు
ఎక్కి చనుదెంచువారు నూటయేబదియును. సకలకథాప్రవీణులయినపరిహాసకులు
వరదరామనాథుండును, లోకబాచయ్య మొదలయినవారును ఎనమండ్రును; శం
కరరాజు నారాయణరాజు, కేదారరాజు, రామరాజు మొదలైనసాహసవిక్ర
మార్కులు ఉత్తమక్షత్రియులు ఏనూరును, దివ్యకాంతలం బోలిన నవరత్న
ఖచిత మైనపాల్కి లెక్కిచనుదెంచువారాంగన కొలువుకు చనుదెంచువారు,
శ్రీగిరిమల్లికార్జును, కాళేశ్వరగంగు, జలరుహనేత్రి, చిత్తారుప్రమితె, బింబోష్ఠ,
కంబుకంఠి, హంసయాన, పల్లవాధరి, హరిమధ్య, చకోరాక్షి, వీరుమొదలయిన
కొలువుస్త్రీలు ఇన్నూరును; మరియు నాట్యంబుసేయు బిరుదుపాత్రలు భరతకళ,
అంబాదేవి, సర్వమంగళ, చక్రవర్తి, చిలుకపలుకులత్రిపురారి, గోరెంకపలుకుల

వాసుదేవి, కోకిలస్వరకమలాక్షి, బిత్తరిచూపులపద్మాక్షి, వీరు మొదలైన పాత్రలు ఎన్మిదినూర్లును. భాస్కరుఁడు మొదలయిన కవీశ్వరులు ఇన్నూరును; గుండంభట్లు, ప్రతాపభట్లు, బ్రహ్మాంభట్లు, నారాయణభట్లు, శంకరభట్లు, పురందరభట్లు, యజ్ఞంభట్లు, వామనభట్లు, మహేశ్వరభట్లు మొదలైనవేదవేదాంగపారాయణాంగు లగురాజపురోహితులు నూర్గురును; వందిమాగధస్తోత్రపాఠకులు మున్నూరును; మఱియు నానాదుర్గాధీశ్వరు లయినదేశాధిపతులు పద్మనాయకులు మదగజంబులపై నెక్కి మౌక్తికచ్ఛత్రచామరంబులు విలసిల్లుచు బిసుకుటెక్కెంబులును బిరుదుకాహళంబులును నంభటభయంకరార్భటంబులును పరభూపతులకు భయంకరం బగునట్లుగా సకలసేనానమేతులైనవారును; శ్రీరంగమదేవుండును, రాయరుద్రదేవుండును, పెనుకొండరుద్రమదేవుండును, నిడదవోలు చంద్రాదేవుండును, ఇందులూరి అన్నమదేవుండును; వీరలకు పెద్దనాయకుల జెప్పెద. విశ్వనాథుని రాముపెంక, ఝూట్టినాథుని రాముపెంక, గోగులవారి మల్లుపెంక, కోడూరి రాముపెంక, వీరు మొదలయినవెంకు నాయంకులు మూఁడు లక్షలపదాతివర్గంబులతో పురంబులు కూడెంబులు గాచుచుండేటి పెద్దతలారి యగు నిశ్శంకుమల్లభుండును; మఱియు నానాదేశాధిపతులును, రాయబారులును, గజంబులపెద్ద అయిన మహాంకాళిదొరయును; అశ్వంబులకు పెద్దయయిన సాహిణిమారయ్యయును; నవలక్షధనుర్ధలకు పెద్దయయిన కొలిపాక సిద్దయ్యయును; మనుబోతులకు పల్లాలుగట్టువారు మున్నూరును; నానావిద్యలవారు కొలువుసేయంగాను. పైడిబెత్తంబులవారు బారసూకుచు వెండికప్పెలవారు, పైడికప్పెలవారు పైడిఝల్లులవారు వెండిగొడుగులవారు, అయిదువెయిలు గలిగి పేరోలగంబున గూర్చుండి దేశాధిపతులవిన్నపంబు లంగీకరింపుచు రాయబాహులమనవులు పాలించుచు రాజ్యపరిపాలనంబు సేయుచు, దేవదేవుండును శరభాంకుండును మల్లికార్జునుండును శంభుదేవుండును పాలకుర్తిసూరపదేవుండును వీరు మొదలయినప్రధానవర్గంబుతో ముచ్చటాడుసమయంబున, ఈశ్వరస్థానంబుల దేవస్థానంబుల దుర్గగణపతివీరభద్రస్థానంబుల గల్గుఅధికారులు పచ్చలపల్లకీ లెక్కివచ్చి దేవతానైవేద్యంబు చెల్లెనన వాక్యంబువినియును సింహాసనంబుడిగ్గి అంతఃపురంబునకుఁ జని భోజనశాల కేతెంచి తనబంధువులును తానును దేశాధిపతులును తనతమ్ముండైన అన్నమదేవుండును డెబ్బదియేడుగురు పద్మనాయంకులును వందిమాగధస్తోత్రపాఠకులును ఒక్కపంక్తిగా గూర్చుండి షడ్ర

సోపేతం బైననానావిధపదార్థంబులను వెయ్యిన్నేనూటితోకూడా భోజనంబులు చేసి సుగంధంబు లగుజలంబుల కరంబులు కడిగి కర్పూరవిడియంబులు సకలజనం బుల కొసంగి వారలందరిని అనిపె. ఒక్కరమ్యహర్మ్యంబున తూగుటుయ్యాలపై నిలిచి సేవకజనంబులు పాదంబులొత్తుచుండ దాసదాసీజనంబులు మూడు వేల యేనూరును గలిగియుండె. అంతట ప్రతాపరుద్రుండు లులాయ వ్యాఘ్ర భల్లుక గజ యుద్ధంబులును, ఝట్టిమల్లులపెనంగులాడుటలును, సరసకావ్యనాటకాలం కార బహుశబ్దశాస్త్రాధికారంబులవారు హాస్యవచోవిశారదులైనవారి పరిహాస వాక్యంబులును పుణ్యకథాశ్రవణంబులును వారాంగనానృత్యగీతవినోదంబు లును ఇవి యాదిగాగలచిత్రవినోదంబుల బ్రొద్దుపుచ్చుచు సాయకాలం బగుట యు; నగరువెల్లివచ్చుసమయంబున కాకతిరుద్రునకు అవసరంబులకు వచ్చుకర దీపికలు మూడువెయిలయేనూరును. నాల్గుదిక్కుల గొల్చిరా నిజపరివారసమే తుండై స్వయంభుమూర్తి యగుజ్యోతిర్మయం బగుశ్రీశంభులింగంబునగరికిం జని శంభులీలావిలాసంబులు సదువుచు ప్రదక్షిణత్రయంబు గావించి శంభులింగంబు నకు సాష్టాంగదండప్రణామంబులు చేసి కొనియాడుచు ఒక్కయామంబు ఆరా ధించి యచటవారు నగరికేతెంచి సకలజనంబులను జీతంబులకు బనిచి పెద్దతలారి యగు నిశ్శంకవల్లభుండు పరివారసమేతంబుగా రెండుగడియలు కొలువుచేసి తద నతంరంబసమస్తజనంబుల నిజనివాసంబుల కనిచి తానును అభ్యంతరవర్తియయ్యె.

ఇట్లు రాజ్యభోగంబు లింద్రవైభవంబులుగా ననుభవింపుచు శ్రీభవానీ శంకరపూజయు శ్రీలక్ష్మీనారాయణపూజయు, దేవబ్రాహ్మణపూజయు నిత్యంబు జేయుచు. మరియు ననేకతటాక నారికేళ చూత తింత్రిణీ కపిత్థ జంబూక కదళీ బిల్వ వననిర్మాణంబులును అగణ్యపుణ్యంబులను సలుపుచున్నంతశ్రీమత్ప్రతాప వీరరుద్రునకు జెల్లినభూములు. ఉత్తర దేశంబునకు భాగీరథీయమునలు, పూర్వ దక్షిణపశ్చిమంబులకు సముద్రంబును మేరయు తనయాజ్ఞకు చెల్లుచుండె, చక్ర వర్తియునై పదిహేడో రాజునై రాజ్యంబేలుచుండె. అందులఅప్పనంబులు ఇచ్చు దేశంబులు. కటకవల్లభుండు లోనుగాగలచిల్లరరాజులు ప్రతివర్షంబును ఇచ్చు అప్పనంబులు ఇరువయినాల్గుకోట్లు. తనభూమిపాలితం బైనరాజ్యంబువలన వచ్చు ధనంబు ఇరువయికోట్లు. ఇవిగాక అగ్రహారంబులు బ్రాహ్మణులకు చెల్లుచుండె నాల్గువెయిలు. దేవతావైభవంబులకు రెండువెయిలగ్రామంబులు చెల్లుచుండె. ఇదిగాక తనభండారంబునకు వచ్చుచుండునట్లు నాలుగుకోట్లు.

ప్రతివర్షంబు తులాపురుషంబులకు మూడుకోట్లయేబయిలక్షలు. నిత్య వైభవంబునకు పరిమళగంధ కర్పూర కాశ్మీర, జవాజి, పరిమళంబులకు, పంక్తి భోజనంబులకు, నగరిదీపాలకును, నానాదేశంబులనుండివచ్చు విద్యార్థులకును పంచిపెట్టినద్రవ్యంబు ప్రతివర్షంబును మూడుకోట్లఅరువయిలక్షల యిరువయి వేయిలు. నగరు గాచునిశ్శంకవల్లభునకు జీతము ప్రతివర్షమును భటసహితంబుగా ఎనుభయియెనిమిదిలక్షలయిరువయివేలు. అన్నసత్రంబులగణుతి ఒక్కొకసత్రంబు నకు వేయింటిచొప్పున నూరుసత్రంబులు ద్విజులకు ఏడాదికి ఒక్కకోటిముప్పయి లక్షలు. నగరిమొగసాల గొల్చునవలక్షధనుర్ధరులకు ఏడాదికి మూడుకోట్లయెను భయిలక్షలు. రాజమదగజంబులకును ఉత్తమాశ్వంబులకును జీతంబులవారికి రెండుకోట్లయెనుబయిలక్షలు. ఏకశిలానగరంబునం గలదేవతావైభవంబునకు ఒక్కకోటి. రాజగృహంబులు కట్టేపనులవారికి ప్రతివర్షంబున ఒక్కకోటియు వారణాసివిశ్వేశ్వరునకు శ్రీశైలమల్లికార్జుననకు శ్రీకాళహస్తీశ్వరునకు రామేశ్వరం రామేశ్వరునకు నాసికత్ర్యంబకేశ్వరునకు అరుణాచలేశ్వరునకు కొలనుపాక సోమే శ్వరునకు ఏకవీరేశ్వరునకు వేములవాడరాజేశ్వరునకు కాళేశ్వరముక్తీశ్వరునకు గోకర్ణేశ్వరునకు వీరు మొదలయినయీశ్వరస్థానంబులకును, శ్రీరంగనాయకులు కంచివరదరాజు శ్రీవెంకటేశ్వరులు మంగళగిరి నృసింహస్వామి సింహాచలము ఆదివరాహమూర్తి శ్రీకూర్మనాయకులు శ్రీజగన్నాయకులు భద్రాచలము శ్రీ రాములకును దివ్యదేవమూర్తులకును ప్రతివర్షంబు మూడుకోట్లు. తనభండారము నకు మూడుకోట్లు చెల్లుచుండె.

ఇట్లు విక్రమార్కునిచందంబున మహామహిమతో రాజ్యంబు పాలింపుచు సకలభోగంబులు పరివారసహితంబుగా అనుభవింపుచు రాజ్యంబేలు సమయం బున నతండు ఏలిన దేశంబులు దైవికంబులుగా ఆశ్చర్యంబులై ఆనందకరంబు లుగా శోభిల్లునని సకలజనంబులు కొనియాడుచుండుదురు. ఆచరిత్రంబులు తొల్లింటి యట్టివారికైన చెల్లింపుగావు. శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు సాక్షాత్కారంబుగా రుద్రుండు గాని మనుష్యమాత్రుండు గాడు. అతనిచరిత్రంబులు ఆదిపురాణంబు లట్టు సకలానందకరంబై యుండె.

అదియునుంగాక శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు ఒక్క పుణ్యగ్రహణకాలం బునందు మాహాద్గల్యంబునకుం జని యాగకుండంబునందు తీర్థంబులాడి యచట రామేశ్వరుని సేవించి పెక్కుదానంబులు చేసి, మరియు ప్రతాపవీరరుద్రుండు

పదకొండుహిరణ్యధేనువుల చేయించి ఒక్కొక్కధేనువునకు లక్షవేయుసువర్ణటం కంబులు దక్షిణలొసంగి వేదవేదాంగప్రచండు లయినవిప్రోత్తములకు దానంబులు ఇచ్చి. ఆదానంబులు అందనేరనివిప్రోత్తములు చండాలులవాకిటికిం జనిపోఁగా; చండాలులు కొన్నికుయుక్తివాక్యంబులు పలికిన రాజుచేత తమకు ప్రాణహాని యని యెరుంగక యాదానంబులు పట్టినబ్రాహ్మణుల అరికట్టుకొని యీసువర్ణధేనువులు సజీవంబులయ్యెనేని తరల తోలుకొనిపొండి. నిర్జీవధేనువు లయ్యెనేని మాసొమ్ము. అని విప్రులతో వాదించిన, ఆవార్త శ్రీమత్ప్రతాప వీరరుద్రునకు ఎరింగించి వారు బహువిధంబుల నారాధించిన దేవుఁడు ప్రత్యక్షంబయ్యె. రాజు మొదలు కొని సకజనంబులు చూచుచుండ ఆధేనువులు గునగున నడచుచుండె. అంత నప్పు డారాజు చండాలుల నరికించుటయు; ఏకశిలానగరంబు ప్రవేశించుటయు.

ఒక్కనాడు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు కొలువు చాలించి సకలజనంబుల వీడ్కొలిపి శివదేవుండును తానును అంతఃపురంబునకుఁ జనుదేర ఆరాజుపట్టంపు దేవి యగువిశాలాక్షి శివదేవునింజూచి పరపురుషుండుగదా యని మరుగు కేగు టయు. ఆశ్రీమత్ప్రతాపవీరరుద్రుండు శివదేవయ్యగారినిం జూచి నిజమందిరంబున కనిపి. రాజు మజ్జనభోజనాదులు దీర్చి నవరత్నఖచితం బైనయొక్కపీఠంబున గూర్చుండి తనపట్టపుదేవి యగువిశాలాక్షికి ఇట్లనియె. శివదేవయ్యను జూచి పరపురుషుడనితొలగిపోయితివి. అతడు ఈశ్వరుండుగాని మనుజమాత్రుండుగాడు. ఆశివదేవయ్యను పూజించి సుగతి గాంచుమని యెఱుంగబలికిన ఆవాక్యంబు విని విశాలాక్షిదేవి తనచిత్తంబు కొలిపి శివదేవయ్యగారిరూపంబుగా నొక్కసువర్ణ ప్రతిమను గావించి ఒక్కసువర్ణవేదిక నిలిపి షోడశోపచారంబుల పూజింపుచుండె. అంత నొక్క నాడు మాసశివరాత్రియగుటయు ఆశ్రీమత్ప్రతాపవీరరుద్రుండును శివదేవుండును నుపవసించి స్నానాదికృత్యంబులు దీర్చి శ్రీశంభులింగంబునగరికిం జని యద్దేవుని షోడశోపచారంబుల బూజించి యచట జాగరణంబు చేయుచున్న సమయంబున శివదేవుండు సుగంధం బైన తేనువుం గ్రుసం దీసినంజూచి యా శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు ఆశ్చర్యచిత్తుండై మహాత్మా మాతోడనే ఉపవసించి తివి. ఇంతలో ఏమియు గుడిచితివి. సీధుసుగంధం బైన తేనువు తేనిచితి అని యడు గగా శివదేవుండు శ్రీమత్ప్రతాపవీరరుద్రున కిట్లనియె. నీ అంగన విశాలాక్షి విందుచేసిన గుడిచితి ననిన. ఆశ్చర్యపడి, తననగరికింజని విశాలాక్షిదేవి నడిగిన తాను సువర్ణప్రతిమను చేయించి శివదేవయ్య యీశ్వరుండని యింతకుమున్న

నై వేద్యంబు సమర్పించితి ననిన ఆరాజు ఆశ్చర్యపడి శివదేవయ్యగారి మహా మహత్వంబు గొనియాడె. ఇట్టి మహామహుండైన శివదేవయ్య గురుండును మరియును బుధుండునై తనకు మహామహిమ చేకూర్చుచుండె.

అంత నొకనాడు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు కొలువై కూర్చున్న సమయంబున ప్రసంగవచనంబుల జ్యోతిషంబు తమసొమ్మని పాంచాలమువారు వాదించి యిందుకు పరీక్ష యిచ్చెదమని పాత్రోజు కన్నయ్య యనువాడు ఒక ముహూర్తంబున పాషాణంబుపై లోహసలాకాదిగా మొత్తించుటయు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు అతని మెచ్చి ఒక్క గ్రామంబు శూకాశనంబుగా నమువం జేసె. అదిగని హనుమకొండ రుద్రేశ్వరునకు అర్చకుండైన రుద్రజియ్య యనుశివ బ్రాహ్మణుండు ఏతెంచి రాజసన్నిధిని నిలచి యిట్లనియె. పరీక్ష జూపినంతనే పాంచాళభక్తులకు జ్యోతిషంబు రానేర్చునే? తమదని వ్యతీపాతపు కాలంబున జిల్లేడుకొమ్మ విరచిన రక్తంబు గారుటయు అదిగని రాజు సంతోషించి ఒక్క గ్రామంబును పల్లకీ కృపచేసియనిపిన. ఆవార్త భూసురు లెరింగి కటకటా యితర జాతులప్రజ్ఞలుమెచ్చి నిగ్రహానుగ్రహసమర్థుల మైన విప్రజనంబుల మాహాత్మ్యంబులు ఎఱుంగరాదయ్యె అని రాజు సమ్ముఖంబున కేతెంచి యిట్లనిరి. జ్యోతిషంబు వేదాంగం బగుట నీవెరుంగుదువు. వేదవేదాంగంబులు విప్రులకె కాని యితర జాతులకు ఎట్లు సిద్ధించును. పరీక్ష జూపినది నిజంబు గాదు. ఆపదవేళ యెరింగి యీధేనువు క్షీరంబు పిదుకుదు రేని జ్యోతిషంబు వారిసొమ్మనిన ఒక్క గొడ్డుటావును జూపుటయు. అదిగని మునుపు పరీక్షయిచ్చినవారు తొలంగిపోయినం జూచి విప్రజనములలో వెలకతూర్తి సోమయ యనువారు ఏతెంచి ఆముహూర్తము వేళ యెరింగి ఆగొడ్డుటావును పితికి తేను కుంచెడుపాలు కురియుటయు. అదిజూచి యాశ్రీమత్ప్రతాపవీరరుద్రుండు అత్యంతయుత్మ్నయుండై యావిప్రుండు గోరినట్టి గోదావరీతీరమున కుశతర్పణం బనుఅగ్రహారము నొసంగుటయు. మరియు నొక్కనాడు దక్షిణదేశమునుండి సుదర్శనమిత్రుండు గజారూఢుండై నూర్గురు విద్వాంసులు గొలువ ఏకశిలానగరమున కేతెంచి శ్రీమత్ప్రతాపవీరరుద్రుని కొలువుకూటమునం గల విద్వాంసులతో నేను వాదభిక్షకు ఏతెంచినవాడ నని పలుకుటయు ఆవిద్వాంసులు వాదముఖమున సుదర్శనమిత్రుని సమ్మతిపరచిరి. గెల్వనేరక చిక్కి కారుమాటలనైన గెలిచెదనని యీదినము కృష్ణచతుర్దశి యగుట్లయు సుదర్శనమిత్రుం డిటనియె. రేపు అమావాస్య, నష్టచంద్రుండు, ఇది

నిజము, మీరందరు ఇది నిజము కాదని యనుమనుటయు. ఏకశిలానగర విద్వాంసులు నవ్వి మరియు సాహసంజాలక వాదులుపుపక్రమణము నేరక సుదర్శనమిత్రుం డను పేరు దెల్పుకొని వేదశాస్త్రముఖముల నిలువంజాలక నీవు కారుమాటలకు జొచ్చితివి. అటయినను ఆమాట అప్రతిష్ఠంబని అందరు రేపు నష్టచంద్రుండు కాడు. షోడశకళాపూర్ణుం డైనసంపూర్ణచంద్రుండు. ఇది నిజము, అని ఒక్కవాక్యముగా బలికి విప్రులు సభ వెడలిపోవుటయు, ఆరాత్రి శాఖ వెల్లిమల్లికార్జునభట్టు హన్మకొండ కేతెంచి అచట స్నానసంధ్యాదికృత్యములు దీర్చి భద్రకాళిగుడిలోకి వచ్చి సప్తశతిచే నద్దేవి నారాధించి పదకొండు శ్లోకములచే స్తుతించి ధ్యానారూఢుండై యున్నసమయమున అద్దేవి ప్రత్యక్షమై లెమ్ము విప్రవత్స ! యని, నీసత్యవాక్యంబులు ప్రతిష్ఠించెద నని వరంబొసగుటయు అతండు భద్రేశ్వరిచే వరంబుగైకొని యేకశిలానగరంబునకు ఏతెంచి వారలకెరింగించిన. ఆమావాస్యకృత్యంబులు మూడుయామంబున దీర్చి అంత అస్తమయం బగుటయు. తూర్పుదిక్కున చంద్రుం డుదయించె.

క్రమంబున చంద్రునిగతిచందంబున మహానిశికి మధ్యాహ్నగతుం డగుచు చంద్రమండలంబు ద్విగుణితంబై నిష్కళంకంబై సర్వజనులకును ఆనందంబుగా చంద్రుండు వెన్నెల గాయదొణంగిన జనంబు చూచి. సుదర్శనమిత్రుండు ఏకశిలానగరంబు విద్వాంసులపాదంబుల కొరగి నాయది మానుషప్రజ్ఞ. మీది దైవమానుషప్రజ్ఞ, మీకును నాకును హస్తిమశకాంతరంబు కాదె. నాఅపరాధంబు క్షమియింపుండని పలుకుటయు వారలుసుదర్శనమిత్రుని గౌరవించుటయు. అంతట శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు శాఖవెల్లిమల్లికార్జునభట్టును బ్రహ్మరథం బెక్కించి వరంగంటివిప్రులకు పదిలక్షలవరహాలు సమర్పించుటయు. సుదర్శనమిత్రుని గౌరవించి లక్షవరహాలు ఇచ్చి పంపుటయు. మరియొక్కనాడు సంతూరనుగ్రామంబున కృష్ణమాచార్యులతమ్ముండు ఆనందమాచార్యులు రజకస్త్రీతో రమించిన ఆరజకస్త్రీవిభుండు ఆయిద్దరిని పొడిచిన మృతంబైరి. శూద్రశవముతో వైష్ణవుడు మృతిఅయ్యెగనుక ఆపురివైష్ణవులు మొయ్యక ఊరకుండిరి. అదివిని కృష్ణమాచార్యులు తనమదినివిచారించి సచ్చిదానందస్వరూపుండై బ్రహ్మాండనాయకుండగువాసుదేవమూర్తిని ప్రార్థించిన ఆశవంబు తనంతటతానే కాష్ఠంబునకు నడుచుటయు. అదిగని సకలజనంబులు విప్రులు వైష్ణవులు ఏతెంచి కృష్ణమాచార్యుల పాదంబులకు ప్రణమిల్లి మాయపరాధంబులు క్షమియింపుమనుటయు అయ్యా

రెవ్వో నాకు రాగద్వేషంబులులేవు. మీరు వెరువకుడనుటయు. ఆవార్త శ్రీమ త్ప్రతాపవీరరుద్రుండు చారులచే నెరింగి కృష్ణమాచార్యులరావించి వారిని పూజించి యేకశిలానగరములో నాల్గవభాగము ఏబది గ్రామంబులను అధికారంబును ఒక్కఊరు అగ్రహారంబునుగాను నొసంగి అనుపుటయు. కృష్ణమాచార్యులును సంతూరును ప్రవేశించి కల్లతనంబు పుట్టుటంజేసి కల్లూరను గ్రామంబును కట్టి కోట పెట్టుటయు, మూడువర్షంబులు అధికారంబు జేసి గ్రామంబుల గల్గుపదార్థంబుల దెచ్చి తామ్రపత్రికలు చేయించి యాపత్రికలమీద తారయించిన చాతుర్లక్ష గ్రంథంబు లిఖించి అది శకటంబుపై పెట్టుకొని శ్రీరంగంబునకు గొనిపోవ నుద్యోగించిన కొందరు ధూర్తులు గూడి యారాజుసమ్ముఖంబునకుం బోయి కృష్ణమాచార్యులకు మీరుఅధికారంబు ఇచ్చినగ్రామంబులపదార్థం వ్యయించి తామ్ర పత్రికలు చేయించి శ్రీరంగమునకు గొనిపోవుచున్నాడని యెరిఁగించిన శ్రీమత్ప్ర తాపవీరరుద్రుండు విని యతండు మహాత్ముండు. అతనికి ఏది యిష్టమో నాకు అదే యిష్టంబని ఊరకుండుటయు. ఆవార్త యిష్టజనులచే కృష్ణమాచార్యులు విని ఊరికేపోయిన మూర్ఖత్వం బని రాజసమ్ముఖంబున కేతెంచి యాబయిగ్రామంబులగలపదార్థంబు వర్షత్రయంబున లెక్కవినిపించి అప్పుడు మూడులక్షలవరహాలు అయినదని కృష్ణమాచార్యులు తనమనంబున వాసుదేవమూర్తి నారాధించి ఒక్కవచనంబు రచియించిన మెచ్చి యేకశిలానగరంబున కనకవృష్టి గురిపించుటయు. అదిగని శ్రీమత్ప్రతాపవీరరుద్రుండును ఆపరిజనంబులును కృష్ణమాచార్యుల పూజించి; వారి వీడ్కొని కృష్ణమాచార్యులు శ్రీరంగమున కరుగుటయు.

మరియొక్కనాడు తిక్కనసోమయాజుల వరప్రసాదంబు నీతి యగుకుమ్మర మొల్ల రామాయణంబు వచనకావ్యంబు రచియించి ప్రతాపరుద్రునకు అంకితంబుగా జేయుసమయంబున ఆరాజుసమ్ముఖంబున నున్నవిద్వాంసులు విని యిది శూద్రకవిత్వంబు, ఇది నిషిద్ధంబని నిరాకరించిన ఆ రాజు సర్వజ్ఞుండుగానున్నావని దాని మెచ్చి, రాజు బ్రాహ్మణకృతం బైనకావ్యంబు కావలెనని. ఆవిద్వాంసులు భాస్కరుని పిలిపించిన, అతడు రచియించిన శ్రీరామాయణంబు వినుసమయంబున అచటికి మొల్లి యేతెంచి రామాయణంబును రచియించి యున్నానని గొనుక పద్యంబు విచిత్రంబుగా చదువుటయు వినియారాజు సర్వజ్ఞుండుగావున దీనిప్రజ్ఞకు మెచ్చి విప్రజనంబులు మనంబులు నొచ్చునో యని మొల్లిని పిలిచి పల్లకియును నగిరినిత్యజీవనంబును కట్టడిచేసి తనయెదుట నుండక తనదేవి విశాలాక్షిసమ్ముఖంబున నుండజేయుటయు. ఆవార్త విని శాఖవెల్లి మల్లికార్జునభట్టు నిర్గోష్ఠ్య

# చంపూరామాయణము.

---

## ఋగ్వేదికవి వేంకటాచలపతి కవిప్రణీతము.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము. కార్వేటినగరసంస్థానమునం దుద్భవిల్లినది. ఇంతవఱ కిట్టి భాషాంతరగ్రంథము భోజచంపువునకు లేదు, కావునసే యన్నివిధముల ముఖ్యమైనది. కవితాచమత్కృతులెల్ల నీగ్రంథమందే కానసగును. ఎనిమిది యాశ్వాసములు. 148 పుటలు రాయలుసైజు, 16 పుటల పీఠిక. ఇంగ్లీషు క్యాలికో బైండు. ముద్రింపఁబడినవి స్వల్పప్రతులు. అయినను వెల రు. 1-0-0 మాత్రమే. భాషాభిమానులు శీఘ్రముగా నొక్కొక్కప్రతిని తెప్పించుకొనుట మంచిది.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

---

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 2/7 పాపిన కొట్టు, పురసపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.

# విషయసూచిక.

రామాయణంబు రచియించుటయు. తదనంతరంబున రంగనాథుని బిల్వ బంచిన నతండు దక్షిణదేశంబుననుండి ఆందోళిక పైనెక్కి చనుదెంచునప్పుడు త్రిపురాంతకవిజయునిగోపురంబునుజూచి అదియేమియని అడిగిన అదిరాజత్రిపురాంతక గోపురంబులని పల్కుటయు. ఆశివభవనంబులుచూడనొల్లక మునపుజండ్లు కప్పించుకొనియె. అప్పుడురంగనాథునినేత్రములుగానరాక జాత్యంధునిపగిది చలింపక. రంగనాథుండుమగుడి శ్రీరంగంబునకుంబోయి యద్దేవునిప్రసన్నంబుచే సుకొని నేత్రంబులుపోయెనని మొరయిడుటయు అద్దేవుండుకరుణించి త్రిపురాంతక దేవునివేడుకొమ్మనుటయు. రంగనాథుండు మల్లి త్రిపురాంతకంబునకేతెంచి యద్దేవునకునమస్కరించి తనయతకృతులు సమర్పింతునని వ్రతంబుచేసి భక్తిమయంబగు ఒక్కపగళ చెప్పిన అద్దేవుండుప్రసన్నంబై రంగనాథునకు నిండుకన్ను లొసంగుటయు. రంగనాథుండు పాలకుర్తికింజని సోమనాథునిచే శివదీక్షగైకొనియె. ఆమహాత్మునివద్ద శైవరహస్యంబులు తెలుసుకొనుచుండె, నంత ఇక్కడ శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు రంగనాథునిప్రభావంబువిని ఆశ్చర్యంబునొందిన తనమంత్రి యగుపాలకుర్తి సూరయ్య ప్రతాపరుద్రున కిట్లనియె. పాలకుర్తిసోమనాథుండు రచియించిన శివకథలు దేవరవారు రేపు శంభుని సేవింపబోయినపుడు సుఖస్థితిని గూర్చుండివినియెదమనిన. మరునాడు ఆరాధ్యునిచారిత్ర వినుచుండగాను కొందరుధూర్తజనులు పాలకుర్తిసోమనాథుండు చెప్పినవి నూతనంబులుగాని అద్భుతంబులుగావు అనిన విని నిరాకరించిన. ఆప్రతాపరుద్రుండు ఊరకుండి తననిజనివాసంబునకుం జనియె. అచట శివభక్తులు సిగ్గుపడి పాలకుర్తికిజని సోమనాథున కెఱింగించిన ఆసోమనాథుండు శైవులుగాని వారలంజూడకుండుటంజేసి ఒక్కశకటంబుపై గుడారంబు పన్నించి యందు మీద తానుగూర్చుండి లింగముద్రలయెద్దులకట్టించి యేకామ్రనాథుండును రంగనాథుండు మొదలుగా గలశిష్యజనంబులు తన్నుగొలువ ఏకశిలానగరంబునకు జనుదెంచి యూరుబండికి గట్టినయెద్దులగవిని జొరకున్న నెరింగి గవినిపై అడ్డదూలంబు వేసినపలిమను రెండుయేనుగులంట దెలిసి తొలుగుమని పలుకుటయు అదితునిసియిరుగడలంబడుటయు. అంత యేకశిలానగరంబున తనశిష్యుడైన యిందూరి అన్నమదేవుని నివాసంబుననుండుటయు. ఆవార్త ప్రతాపరుద్రుండెరింగి విస్మయంబొంది. కొందరు ధూర్తులు సహింపంజాలక శిలలు తెగిపడుట మంత్రవిద్యగాని వాక్యసిద్ధికాదు అతనివద్దికింబోయి యీగుట్టుదెలిసి యిప్పుడెవత్తుమని రాజు చేసను

జ్ఞాతులై యీసోమనాథునివద్దికింజనిన. అతండు అన్యమతస్థుల జూడకుండు టంజేసి యతనివద్దికిబోయిన ద్వారపాలకులచేత నివారితులై మగుడిపురవీథికే తెంచి గుంపులుగూడి కటకటా వేదశాస్త్రసంపన్నుల జూడరాదట. ఛండాలుండైనను శైవుండగునేని మాట్లాడవచ్చునట. యట్లకాకయని నవ్వి యతనిహాస్యంబు చేసి యీప్రొద్దిపురంబు వెడలననుపవలయుననితలంచి యీపురిలోపల గ్రాసార్థులై తిరుగు అంగ హీనులను మొండిమొర్రి ముక్కిడివాండ్లను అంధులను బధిరులను మూగలను మఱియురోతజనులను రావించి మీరుపోయిసోమనాథుని హాస్యంబుజేసివచ్చితిరేని మీకు అన్నంబు వస్త్రంబులు యిచ్చెదమని యొడంబరచి వారికిలింగధారణవిభూతిరుద్రాక్షధారులంజేసి యతనివద్దికి పంపినంబోయిరి. అతనిప్రభావంబున అంగహీనులకున్ను అంగంబులున్ను బధిరులకు వినవచ్చుటయు అంధులకు కన్నులు మూగలకు వాక్యంబుగలుగుటయు అంగవికలులకు సరాఢ్యంబుగలుగుటయు. వారలు అత్యంతసంతోషంబున ఆయయ్యకు నమస్కరించి బహువిధంబుల గొనియాడి యీసోమనాథునిచే అనుజ్ఞాతులై పురవీథికేతెంచుటయు. సకలజనంబులుజూచి యీసోమనాథునిమహిమగొనియాడిరి యాధూర్తులులజ్జించిరి. ఆప్రతాపరుద్రునకు సోమనాథుండిట్లనియె శివుండు భక్తి సులభుండుగానియొక్క మోక్షవ్రతంబుచేపట్టినదుపుమనిన ఆవ్రతంబుభంగపడకుండ నడుపుమనిన శివుండు ప్రత్యక్షంబగునని యెరింగించిన ఆ రాజు శివదేవయ్యనుంజూచి యిట్టివ్రతంబు పట్టవచ్చునాయని యడిగిన రాజును జూచి శివదేవయ్య భాగీరథీ జలంబుల అభిషేకంబు గావించిగాని కుడువరాదని వ్రతంబు పట్టుమనియెరింగించిన యట్లకాకయని నిజనివానంబునకున్ జనుదెంచి నిత్యంబును భాగీరథీజలంబులు దెచ్చునట్టుగా మూడువెయిల యేనూరుమందిని ఏర్పరచి నిత్యకృత్యంబును భాగీరథీజలంబులు దెప్పించి నిత్యశంభులింగంబునకు అభిషేకంబుసేయుచుండె నంతవర్షత్రయంబువ్రతంబుచేసిన ఈశ్వరుండు ప్రతాపరుద్రునిభక్తినింజూడగోరి యేడుదినంబులు భాగీరథీజలంబులురాకుండునట్లు మహావర్షంబుగురియించి ప్రళయకాలమేఘంబుచందంబున ఉరుములు మెరుపులును పిడుగులును వాయువును. వానలచే భాగీరథీజలంబులు దెచ్చుజనులు రాలేక మిర్రుపల్లంబు లెరుంగక రాక వానచేతనొక్కొక్కమూలనొరింగిరి. ఇక్కడ ప్రతాపరుద్రుండు జలంబు రాకుండుటజూచి యేడుదినంబులునుపవసించి నిత్యత్రికాలంబును పూజసేయుచువచ్చుచుండె. అంత మరునాడు ప్రభాతసమయం

బున ప్రతాపరుద్రుండు మహాదేవునిగుడిలోకిజనుదెంచుసమయంబున ఖడ్గఖేటకం
బులుమయినపుజిడ్డుచుట్టి పరిజనంబులుతన్నుగొలువ వచ్చుచుండ కోటచేరువవీధి
లోపల నచటమహానాయువులచే ఖేటకంబులుయెగసిపోయిన. పరిజనంబులు నురు
ములు పిడుగులు వాయువులు వానయునుగూడి యొక్కయిద్దవిడివచ్చిన నోర్వలేక
బెదరిజనంబులునేలపైబడిరి. ఆరాజుచలింపకధైర్యంబుతోడ నుపవాసంబుల
సొకరాకబుద్ధిచలింపక భక్తిమరువక వేసారక వెరువక శంభునినగరికిపోవశక్యంబు
గాక పెద్దయెలుగెత్తి శ్రీశంభులింగా మహాదేవ మృత్యుంజయా శ్రీకైలాస
వాస యనిపిలుచుటయు ఆక్షణంబున నందివాహనారూఢుండై ప్రమథగణంబులు
గొలువ పార్వతీసమేతుండై శ్రీపరమేశ్వరుండు ప్రతాపరుద్రునకు ప్రత్యక్షం
బయ్యె. అంతనిర్మేఘంబైన సూర్యమండలంబుగానంబడిన అపుడు ప్రతాపరు
ద్రుండు శ్రీశంభులింగంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి బహువిధం
బులస్తుతియించిన అద్దేవుండుమెచ్చినీకు వరంబుల ఇచ్చెద అనుగుమనుటయు
ప్రతాపరుద్రుండు ముకుళితహస్తుండైదేవా నాకు వ్రతంబుభంగంబు గాకుండున
ట్లుగా కృపసేయుమనుటయు. అద్దేవుండుమెచ్చి యీపురమునకు ఉత్తరదిగ్భాగం
బున కోసుపర్యంతంబున భాగీరథీజలంబు గజగతుండసమానంబైవచ్చు. నీవ్రతంబు
చెల్లుచుండును. నీవుగంగాగర్భంబునశరీరంబువదలిదివ్యవిమానారూఢుండవై మా
కైలాసంబునకు వచ్చెదవనివరం బొసంగిన. శివుండు ప్రత్యక్షంబైనచోట
శివాలయంబుకట్టించి శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు సకలపరిజనంబుల సమేతుండై
పంచమహావాద్యంబులభోరుకొల్పి మహావైభవంబుతో పురంబు వెలువడి
యొక్కరమ్యదేశంబుననిలచి హరాహర హరాహర సకలపాపహరాహర యని
స్తుతియించి. నమోదేవిగంగే నమోమాతృగంగే భాగీరథీ లోకపావనీ పాప
హారీ విష్ణుపాదోద్భవియని పల్కుచున్నసమయంబున గజతుండసమానంబైన
చండకాశీసమానంబై భాగీరథీజలంబులబుగ్గయెగసివచ్చుటయు నజ్జలంబులు శ్రీ
మత్ప్రతాపవీరరుద్రుండుచూచి అత్యంతభరితసంతోషంబున సర్వజనులుతాను
నుస్నానంబుచేసి అక్కడశివాలయంబుకట్టించి యొక్కతులాపురుషంబు దేవియుక్తం
బుగాతూగి కోటిసువర్ణంబులుదానంబులుచేసి. మరియు అజ్జలంబులనుహేమకుం
భంబులనిడుకొని మదగజంబులపై నిడుకొని మహావైభవంబున శ్రీశంభులింగంబు
నగిరికేతెంచి యభిషేకంబులుగావించి అఖండబిల్వపత్రంబులబూజించి మహా
నైవేద్యంబుసమర్పించి బంధుహితసామంతవర్గంబులు విప్రులతోపంక్తిగూర్చుండి

భుజియించిరి. సుగంధగంధ లేపనంబులందిసుఖుంబుననుండె. శ్రీమత్ప్రతాప వీరరుద్రుండు రెండవ దేవేంద్రుండై సకలవిభూతిసంపన్నుండై, అనేకరాజులు గొల్వ సింహాసనాసీనుండై యున్నసమయంబున పాలకుర్తి సోమనాథుండు, ఈదేశంబున వరంబుచెల్లదు. దక్షిణదేశంబునకుంబోయెదనని ప్రతాపరుద్రుండు గొట్టిపర్తియనుగ్రామంబు అగ్రహారంబు నొసంగుటయు, అమహాత్ముని సమ్మతంబున రంగనాథుని తనవద్ద నుంచుకొనుటయు. ఇట్లు అపారంబుగా దైవికంబులచరిత్రంబులట్ల చెల్లుచుండె. ఈక్రమంబున శ్రీమత్ ప్రతాపవీరరుద్రుండు రాజ్యంబు సేయుంగాను, తనఆజ్ఞకు మరలబడిన పశ్చిమదేశాధీశ్వరులపై దళంబుబంపి వారినోడించి పత్నీయుక్తంబుగా ఆపారశిరాజును ఏకశిలానగరంబునకు దెచ్చుటయు. ఆసమయంబున దేవగిరినున్న రామదేవరాయలు పారశిరాజు తమ్మునింగలయుటయు. ఇక్కడ ఏకశిలానగరంబున నున్నపారశిరాజు మృతిబొందిన యతని తమ్ముడు జవానుములకు పక్కీరు వేషంబున ఏకశిలానగరంబునజొచ్చి పురంబు అంత తనచేతసాధ్యంబుగాకుండజేసి తనఅన్నసతిసుతులకున్ను తాను యెరుకచేసుకొని వారిని పఖీరువేషంబున పురంబువెడల దీసుకొని తమ రాజ్యంబునకువచ్చి వాండ్లనునిచి రామదేవరాయలు తానున్ను జవానీములుకు ఢిల్లికింబోయి సుల్తానునుజూచి యేకశిలానగరంబు బలంబు తెరంగుకొలందియు, చెప్పగ కొంచెంబని కార్యంబూహించి యేకశిలానగరంబు సాధింపన్ దలంచి. అపుడు సుల్తానుతోకూడినరాజులు పశ్చిమదేశాధీశ్వరుండు లక్షగుర్రంబులును రెండులక్షలపదాతివర్గంబును, కటకవల్లభుడు ఏభయివెయిలగజంబులును, రెండు లక్షలతురంగంబులును, ఎనిమిదిలక్షలపదాతివర్గంబులును, తక్కినరాజులు రెండులక్షలతురంగంబులును, రెండులక్షలపదాతివర్గంబులును, ఈచొప్పున దళంబునుగూర్చుకొని రాచర్లవద్ద విడియుటయు. ఢిల్లీశ్వరుండును మల్కిశేఖానును దళవాయంజేసి రెండులక్షల యాభయివెయిలగుఱ్ఱంబులున్ను పదిహేను లక్షలపదాతివర్గంబునుగూర్చి యేకశిలానగరంబునకు ఉత్తరదిగ్భాగంబున వజ్రాల్లయంబున విడియుటయు. ఇట్లు మూడుదిక్కుల విడియుట శ్రీమత్ప్రతాపవీర రుద్రుండు చారులచేవిని నరపతిరాయల కెరింగించిన అతండు ముప్పయిరెండు లక్షలపదాతివర్గంబును యేడులక్షలతురంగంబులతో దక్షిణదిగ్భాగంబున వేల్పుగొండద్వారంబున నరపతిరాయలు విడియుటయు. ఏకశిలానగరంబునంగల కొంతబలంబును డెబ్బయియేడ్గురు పద్మనాయకులున్ను రాజు తమ్ముడు అన్నమ

దేవుండును పశ్చిమంబున డిగిన బలంబులమీదికిపోవుటయు, సుల్తానుబలంబుల మీదికి తనమూలబలంబును తలపడ, అఘోరయుద్ధంబు జేయుసమయంబున మల్కిశేఖానుండు సమసిన హతశేషులు ఢిల్లిమార్గంబుపట్టి పారుటయు అన్నమదేవుండు డెబ్బయియేడుగురు పద్మనాయంకులును తలపడిన జవానులుకు విరిగి పారుటయు రామచంద్రరాయని తలదునిమిన బలంబులు పారిపోవుటయు కటకవల్లభునిపై నరపతిరాయలు కయ్యంబుచేసిన రాయలు తనపరాక్రమంబున రెండు వెయిల మదగజంబుల పదివెయిలగుఱ్ఱంబుల యెనిమిదిలక్షలపదాతివర్గంబులను ద్రుంచి వెయ్యిగజంబుల పట్టుకొనిన అతండు తిరిగి పారుటయు. ఇట్లు హతశేషం బైనవారలు ఢిల్లికిం జని సుల్తానుతో జెప్పిన విని బలంబులు మగుడాగూర్చి బిసరుఖానుని దళవాయింజేసి ఉత్తరానవిడియుటయు చిల్లరరాజులు ఎప్పటియట్ల బలంబులు గూర్చుకొని పడుమరరాచర్లకాడ విడియుటయు, ఎప్పటియట్ల మూడుదిక్కులవారు సంగరంబుచేసి విడియుటయు కటకవల్లభుండును ముకుంద నందనుండును వానిపట్టణంబు గట్టుకొని మగుడాబలంబులుగూర్చుకొని యప్పటి సుల్తానుబలంబులగూర్చి పుల్లుఖానును దళవాయింజేసి యేకశిలానగరంబునకు ఉత్తరదిగ్భాగంబున విడియుటయు చిల్లరరాజులు బలంబులుగూర్చుకొని పడుమరి రాచర్లకాడవిడియుటయు యప్పటియట్ల మూడుదిక్కులసంగరంబుచేసి విరుగుటయు ముకుందసుందరుండు ఒక్కనాడు ఏకశిలానగరంబు చూడవలెనని విప్రవేషముదాల్చి పురంబుజొచ్చి అన్నివీధులు రాజద్వారంబు జొచ్చుసమయంబున అతన్ని యెరిగినధోరలు అతడు కటకవల్లభుండనిన, ఈవార్త శ్రీమత్ప్రతాపరుద్రునకు ఎరింగించిన అతణ్నిగిరివేయించిన అప్పురివైశ్యుండు కోటిపల్లి విశ్వనాథుండనువాడు శ్రీమత్ప్రతాపవీరరుద్రునకు మూడుకొట్లధనంబులు ఇచ్చి యాముకుందసుందరున్ని విడిపించుటయు. అంతట కటకవల్లభుండు తనబలంబుల చేరి నరపతిరాయులచే సంగరంబుచేసి విరుగుటయు. పుల్లుఖానుండు జగడంబు చేసి విడిబడుటయు అన్నమదేవుండు చిల్లరరాజులతో యుద్ధంబుచేసిన తిరిగి తమతమదేశంబులకుంబోవుటయు. అంతట కటకవల్లభుండు కటకంబునకు పోవువాడై మార్గల్యంబుననున్నయగ్గుండంబులోనున్న హేమగోపురంబుబు చూచే దమని గుండంబునుంగండి తెగవేసుటయు. ఆజలంబులు పాఖాల చెరువునిండి మొదుధుకమ్మిన చెరువుకట్ట తప్పించుటయు యాజలంబులు పోయినవెనుక ఆ గుండంబులో మహోత్పాతంబు కనుపడుటయు, కటకవల్లభుండు భయంబంది

గజగజవణంకుచు తనపురంబునకుం జనియె. తిరుగాబలంబుల గూర్చుకొని యేక
శిలానగరంబునకు ఏతెంచుటయు కడును రెండుమొనలవారు ఎప్పటియట్ల
విడియుట కటకవల్లభునిపై నరపతిరాయలును జవానీములుకు చిల్లరరాజులపై
అన్నమదేవుండు డెబ్బయియేడ్గురు పద్మనాయకులున్ను సుల్తానుములుకు బలమునకు
దళవాయిలయిన పుల్లుఖానునిమీదికి ప్రతాపరుద్రుండును తనమూలబలంబులున్ను
నవలక్షధనుర్ధరులున్ను తలపడి అఘోరయుద్ధంబుచేసిన విరిగిపారుటయు. ఇవ్వి
ధంబున ఏడుమారులు పారిపారి సాధింపనేరక చింతాక్రాంతులై దళవాయ
యిన పుల్లుఖానుండు సంధిశాయందలంచి కార్యంబూహించి యితరజాతినాయ
కులు తమజాతినాయకత్వంబు తీసుట యొగ్గుగాదలంచి సంధికి ఒడంబడి యాభ
యిలక్షలవరహాలు యియ్యజేసుకొని యేకశిలానగరంబునకువచ్చి శ్రీమత్ప్రతాప
వీరరుద్రుని సన్నిధికింబోయి స్వామి హితపరులంబోలి యిట్లనిరి. దేవరవు మాకు
రణరంగంబునకు మమ్ములను ఏలి అనుజ్ఞ యిమ్మనుడు అయిదులక్షలపదాతి
వర్గంబుల యెన్నిక యిచ్చుటయు అంతట పుల్లుఖానుండు మూడులక్షలపదాతి
వర్గంబునుంగల బబ్బారెడ్డిని పిలుపించుకొని సంధిచేసుకొని తత్క్షణంబె పద్మినిని
లక్షలవరహాలుయిచ్చి కడునువికాశ్యాంతంబున ఇచ్చెదమని. తదనంతరంబున
రాజసముఖమునకు పరిశవేది పూజార్లువచ్చి శంభులింగంబునందు స్పర్శచేసిన
ఎప్పటియట్ల సువర్ణంబుగాదయ్యె. జ్యోతిర్మయంబగుతేజంబు నిలువదయ్యె
నని విన్నవించుటయు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు విని వెరగుపడి దేవతాప్రసా
దంబు మాకు తప్పెనని దేవతామహాత్మ్యంబు తొలగిపోవుట యెరింగి యుద్ధ
రంగంబునకు సన్నద్ధుండై హన్మకొండ సిద్ధేశ్వరు నారాధించి యచటచని పద్మా
క్షీదేవిని పూజించి యద్దేవిపూర్వదత్తంబై నఖడ్గఖేటకంబులు దేవిసముఖంబున
బెట్టి నమస్కరించుటయు. ఆసమయంబున ఖడ్గఖేటకంబులు సర్పాకారంబై
పద్మాక్షీదేవివద్ద నగగహ్వరంబున దూరిపోవుటయు ఆఖేటకంబు అంగరా
గంబు చందంబున అద్దేవివక్షస్థలంబున లిప్తంబగుటయు అవిచూచి శివదేవ
య్యయు శాఖవెల్లి మల్లికార్జునుండు మొదలుగాగల పెద్దలు విప్రజనంబులు
ప్రతాపరుద్రున కిట్లనిరి. ఈఖడ్గఖేటకంబులు తొల్లి మాధవవర్మకు ఇచ్చిన
ప్పుడు ఆజ్ఞాపించినవరంబున మీసింహాసనంబున సహస్రవర్షంబులు ఉండుననని
మహాశక్తియైన పద్మాక్షీదేవి యానతిచ్చెను. నేటివరకు సహస్రవర్షంబులు
అయిపోయెను. అని యానతిచ్చి యింక మానుషశక్తియేకాని తొల్లింటి యట్ల

దైవశక్తిలేదు. అని తెలియంజెప్పిన విని శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు చింతా క్రాంతుండై పద్మాక్షీదేవిని బహువిధంబుల స్తుతియించి సకలజనంబులతో నిజ నివాసంబునకు జనుదెంచి పరిశశేది శంభులింగంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ మరునాడుకయ్యంబున కాయత్తపడి కటకవల్లభునిపై నరపతిరాయులున్ను జవానీములుకుపై అన్నమదేవుండును పద్మనాయకులున్ను నవలక్షధనుర్ధరులున్ను సింధురాజునుగూర్చి పశ్చిమంబునకున్ బంపి సుల్తానుబలం బులమీదికి శ్రీమత్ప్రతాపవీరరుద్రుండును ఇతరజాతినాయకులున్ను అయిదు లక్షలును బబ్బారెడ్డి మూడులక్షలును తక్కినరాజులు యీబలంబులును కన్నో జురాజు రెండులక్షలగుఱ్ఱంబులును వీరపాండ్యరాజు ఎనుబయినూఱుల యేనుగు లున్ను తమకాసామదగజంబులు ఇన్నూరు తన్నుగొలిచిరాను శ్రీమత్ప్ర తాపవీరరుద్రుండు మదగజారూఢుండై మహాకీర్తిచ్ఛత్రచామరంబులు శోభిల్ల యుద్ధంబునకు జనుదెంచి యుద్ధంబుసేయుసమయంబున ఇతరజాతినాయకులు కొంత కొంత జగడంబుజేసి కడకుం జనిరి. వారినిజూచి తేరాల బబ్బా రెడ్డియుద్ధంబు చాలించి కడకుం జనియె. మరియు తక్కినరాజులుకయ్యంబుచేసి కొంతబలంబుల జంపి తాము కొట్టుపడుటయు అపుడు కన్నోజురాజు కొన్ని గుఱ్ఱంబుల జంపి తాను పడుటయు వీరపాండ్యరాజు అఘోరయుద్ధంబుచేసి సమయుటయు ఇట్లు సరజ్వానులును మడసిన రుధిరోద్గారిన్నా సం॥ ఆశ్వీజబ. ౨ గురువారంనాడు యుద్ధరంగంబునంగు మదగజారూఢుండైన శ్రీమత్ప్రతాప వీరరుద్రున్ని అయిక్యంబుచేసుకొని తమరూబటిని యెక్కించి గజారూఢుండై చనుదేర పుల్లుఖానుండు తానును శిబిరంబు ప్రవేశించినంత శ్రీమత్ప్రతాపవీర రుద్రుండు పట్టుబడెనని వార్త యేకశిలానగరంబు పురజనులు యెరింగి అహాహా కారంబులు వగచి శ్రీమత్ప్రతాపవీరరుద్రున్నిగలయుదమనితలంచి. అన్నమదే వుండు విని డెబ్బదియేనుగురు పద్మనాయకులు విని శోకరోషంబులు మనం బునం బెనంగొన జమానుములుకు ఎదిరించి అఘోరయుద్ధంబుజేసి జమాను ములుకు తలద్రుంచుటయు సిద్ధిఖానుండు హతశేషులం గలుపుకొని పుల్లుఖానుని గలయుదమనివచ్చి పుల్లుఖానుండు సిద్ధిఖానుండు ఇద్దఱు విచారించి శ్రీమత్ప్ర తాపవీరరుద్రుని ఢిల్లీశ్వరునిసముఖంబునకు పంపవలయునని ఊహించి రాత్రి రాజును పనుపుటయు. ఇతరజాతినాయకులు తమకు నోడిబడ్డ యిరవయియయిదు లక్షలవరహాలు ఇమ్మని పుల్లుఖానుని అడిగిన ఇతరజాతినాయకులతో మునుపు

మీాకు యిచ్చినవి మగుడాయిమ్మని బాధించుటయు. ఈవార్త శ్రీమత్ప్రతాప
వీరరుద్రుండువిని తహతహపడి తాను రణభిక్షకు తెచ్చినవి అందులో ఇరవయియ
యిదులక్షలవరహాలు సుల్తానుదళవాయిఅయిన ఫుల్లుఖానునికి ఇప్పించి యితర
జాతినాయకుల విడిపించినవారలు సిగ్గుపడి శ్రీమత్ప్రతాపవీరరుద్రుని దయావిత
రణంబులు దలంచి యితరజాతినాయకులున్ను తేరాల బబ్బారెడ్డి విచారించు
కొని తమతమబలంబు గూర్చుకొని శ్రీమత్ప్రతాపవీరరుద్రుని విడిపించుకోగల
వారమని శబదంబులు కూర్చుకొని చనుదెంచునపుడు సుల్తానులక్షదళంబుల
లక్షగుఱ్ఱంబులున్ను యెనిమిదిలక్షలపదాతివర్గంబులును ఎక్కువను లేచి ఢిల్లి
మార్గంబుబట్టిపోవుటయు రామగిరిచేరువ ఇతరజాతినాయకులు బబ్బారెడ్డి
మొదలుకొని సుల్తానుబలంబులదునిమి అరికట్టుకొని యుద్ధంబుసేయునపుడు రెండు
ఝాములు అఘోరయుద్ధంబుచేసి యాబయివెయిలగుఱ్ఱంబుల మూడులక్షల
పదాతివర్గంబులదునిమి యితరజాతినాయకులు నిర్విశేషంబుగామడియుటయు.
అట సుల్తానుదళంబులు కయ్యంబున అలసి గోదావరీగర్భంబున విడియుటయు
శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు మజ్జనభోజనాదులుదీర్చి కూర్చున్నయెడ ఏకశిలా
నగరంబు ప్రజలు రాజుసముఖంబునకువచ్చినవారలు కరదీపికలు వెయ్యినేనూరు
ఛత్రచామరంబులవారు వెయ్యినేనూరు పరిహాసకులు ఏనుబంద్రును శాఖవెల్లి
మల్లిఖార్జునుండును మొదలుకొని బ్రహ్మవిద్వాంసులు నూరుగురు గుండంభట్లు
బ్రహ్మాంభట్లు మొదలుకొని పురోహితులు ఇన్నూరుగురున్ను ఉత్తమక్షత్రియులు
రాజసంబంధులు ఏనూర్గురును అపారధనసమేతులైన వైశ్యులు మున్నూర్గురును
నాటకాలంకారులు ఎనిమిదినూర్లును వంధిమాగధస్తోత్రపాఠకులు నూర్గురు
జ్యోతిషప్రజ్ఞావంతులు ఇరువయియయిదుగురున్ను సకలనియోగంబులవారు
అయిదునూర్లును రజకక్షౌరకులు వెయ్యినేనూరును రాజుయొక్క ఉత్తమఅశ్వం
బులు పదినూర్లును మదగజంబులు ఎనిమిదినూర్లును శివదేవుండును శరభాంకుం
డును మల్లిఖార్జునుండును రంగనాథుండును వెంకటనాథుండును రామదేవుండును
మొదలుకొని యేనూర్గురును ప్రతిమాసంబున తులాపురుషంబునకు పదికోట్లును
సకల నియోగంబులవారు రాజుసముఖంబునకువచ్చి యారాజు అందరిని సమ
స్తిని గౌరవించి శివదేవయ్యనుచూచి ఆహితాగ్నులు తెర్లయితిరని అడిగిన నా
యయ్యమనము యీకాలంబునకు అతిత్వరితంబుగా మరలగలవారమని యానతి
చ్చెను. అందులో నొక విప్రుండు ప్రతాపరుద్రియంబను కావ్యంబుజెప్పి యా

మహారాజునకు అంకితంబుగా జేయుటయు ఆమహారాజు శలాకపరీక్షచే నచట చది వించుటయు. సర్వజ్ఞుండు గావున మెచ్చి యావిప్రునకు శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు అంగుళ్యకంబు ఇచ్చి యతడు విద్యానాథుం డని యేనుగుపై నెక్కించి చాటించుటయు. ఆవిద్యానాథుండు మహారాజుచే సెలవంది యేకశిలానగరంబు నకేతెంచి ఆయుంగరంబు వ్యవహారకులముందర బెట్టి యిందుకు తగిన ద్రవ్యంబు యిమ్మని అడిగిన ఆవర్తకులు చూచి యిది అమూల్యంబైన అంగుళ్యకంబు యిందుకు తగినద్రవ్యంబు ఇవ్వలే మనిన యీవిద్యానాథుండు వేసారి మీరు ఏమియు నొసంగిన నదియే మాకు పదిలక్ష లని పలికిన ఆవిప్రుని వాక్యంబులకు ప్రతిష్ఠించి యావుంగరంబునకు పదిలక్షల ద్రవ్యం బొసంగుటయు. అక్కడ నర పతిరాయులు ప్రతాపరుద్రుడు పట్టుబడుట విని తనకు నష్టంబైన కటకవల్లభుని జంపి సుల్తాను బలంబులద్రుంచి యామహారాజును మగుడ తెచ్చెదమని తలంచి కటకవల్లభుని గజబలంబు గెల్వశక్యంబు గాకుండుటంజేసి అశ్వత్థామమతంబు దలంచి బలంబుల నాయత్తపరిచి రాత్రిసుఖసుప్తులై యున్నయెడ కటకవల్లభునిబ లంబులపైబడి పొడిచియు నాల్గువెయిల గజంబులం దునిమి మూడువెయిలగజం బులపట్టుకొని పన్నిద్దరురాజకొమారులదళంబులపై బడి తలలుద్రుంచిన సింధుకటక వల్లభులదళంబు విరిగి పారుటయు. అంత నరపతిరాయులు అది గెల్పుచేసుకొని సుల్తానుబలంబులమీదికిపోయి అరికట్టుకొని అఘోరయుద్ధంబుచేసి యాభయివె యిలగుఱ్ఱంబుల లక్షపదాతుల ద్రుంచుటయు సుల్తానుబలంబుల పోనియ్యకుండు టయు అప్పుడు పుల్లుఖానుండు మనంబున విచారించి రాజును మగుడ విడిపించు కొనిన కార్యహాని యని చింతించి, నిలిచి కయ్యంబు చేసితిమేని ప్రాణహానియగు టయు రాజును ఢిల్లీపర్యంతంబు పంపవలయు నని తలంచి యొక్కగూఢమార్గం బున ఇర్వదిఅయిదు వేలగుఱ్ఱంబుల సహాయంబుచేసి ఢిల్లీపురంబునకు శ్రీమత్ప్ర తాపవీరరుద్రుని పరివారసమేతంబుగా పంపుటయు ఆసమయంబున కటకవల్ల భుండు అయిదువెయిలగజంబులగూర్చుకొని పుల్లుఖానుని గలయుటయు మరియు అన్నమదేవుండు డెబ్బదియేడ్గురు పద్మనాయంకులును నరపతిరాయుల గల్పు కొని సుల్తానుదళంబులు చుట్టివేసుకొని ప్రతాపరుద్రుని మున్నుగొనిపోవుట యెరింగి అరికట్టుకొని ఒక్కనాడురాత్రి కటకవల్లభునిబలంబులపైబడి సర్వబలం బులంగూల్చి నాల్గువేలగజంబులందునిమి శిబిరంబుజొచ్చి, కటకవల్లభుని తలద్రుం చుటయు మగిడి నరపతిరాయులు అన్నమదేవుండును విద్యానగరంబు చేరు

టయు కటకవల్లభుని ప్రధానులు నరపతిరాయుల అన్నమదేవునిసముఖంబునకుం
బోయి యేకశిలానగరంబున నున్న రామచంద్రదేవుని తమకు పెంపకము
ఇవ్వ చేసుకొని కటకంబునకు పట్నంబు గట్టుకొని యేకశిలానగరంబు చేరుటయు.
ఆప్రతాపరుద్రుండు పట్టుబడి వచ్చుచున్న వార్త ఢిల్లీశ్వరుండు చారులచే నెరింగి
మూడుయోజనంబులదూరంబు ఎదురుగాబోయి మహావైభవంబుతో తనపురం
బునకు దోడ్కొనిపోయి బహువిధంబుల సత్కారంబు గావించుటయు, సింహా
సనంబునగూర్చుండంజేసి యొక్క అర్ధపీఠంబునగూర్చుండి ముచ్చటాడుచున్న సమ
యంబున శ్రీమత్ప్రతాపరుద్రుని లలాటంబునందు లోచనంబు గనిపించుటయును
సుల్తానునుం జూచి వెరగుపడి కటకటా యెట్టి అపరాధంబుచేసితినని మనంబున
సొక్కి తనయొక్క నగరిలో శ్రీమత్ప్రతాపవీరరుద్రుని ఉండంజేసి సుల్తాను తన
తల్లికి యెరింగించిన, నామానిని ప్రయాగమాధవసేవాపరిణతయగుటయు తన
కుమారుండైన సుల్తాను నూరడించి యీమహారాజు నీవును మహనీయశయ్యల
సుఖసుప్తులయియున్న మీయిద్దరి తారతమ్యంబులు నాకు ఎరుంగవచ్చు. నేను
చూచెద నని పలికిన, అట్ల కాకయని యారాత్రి యిద్దరు ఒక మేడపై పవ్వ
ళించి సుఖసుప్తులై యున్నయెడ సుల్తానుతల్లి యేతెంచి చూచినపుడు వారల
యిద్దరియందు హరిహరాత్మకంబైన తేజంబు గనుపడుటయు. మీలో మీరు
వైరంబు చాలింపుడుసు. మీరిద్దరు తొల్లింటి యట్లు మహామహిమలు చెల్ల
వని బోధించి పలుకుటయు. ఇంతలో సుల్తానుమేల్కాంచి ప్రతాపరుద్రుని విప్రు
లకు తకిన రాజులకును పరివారంబులకును మూడుకోట్లద్రవ్యంబు పంచిపె
ట్టించి యీమహారాజునకు మణిమయాభరణంబులు చీనిచీనాంబరంబులు నానావ
స్తువులు సమర్పించి వినయపూర్వకంబుగా నిట్లనియె. నేను నీకు నపరాధంబు
చేసితి నని మనంబున నుంచక యేకశిలానగరంబు ప్రవేశించి సింహాస
నంబున గూర్చుండి తిన్నగ శుభవర్తమానంబు పంపవలయు. ఇదియే నావిన్న
పంబు. అనిన సుల్తానుతో మహారాజు ఇట్లనియె. శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు
డెబ్బదిఆరేండ్లు రాజ్యభోగంబు లనుభవించితి చాలును. నేను కాశీక్షేత్రంబు
నకుం జని మణికర్ణికాస్నానంబుచేసి విశ్వేశ్వరు నారాధించి అన్నపూర్ణ,
బిందుమాధవ, విఘ్నేశ్వర, కాలభైరవ, దండపాణుల భజియింపుచునందు
నిల్చెద. నాకు రాజ్యభోగంబులు సహస్రగణితంబులు. అక్కడనునికి ఆనందంబనిన
సుల్తాను అనేకవిధంబుల యొడంబరచి యేకశిలానగరంబునకేతెంచి సింహాసనంబున

గూర్చుండి ఒక్కనెలరాజ్యంబు పాలించి మగుడి వారణాసికిం బొమ్మని యిరువయివెయ్యిలగుఱ్ఱంబులు సహాయంబు నియమించి శ్రీమత్ప్రతాపవీరరుద్రుని మదగజారూఢుం జేసి సుల్తానుమదగజారూఢుండై యొక్కయోజనంబు శ్రీమత్ప్రతాపవీరరుద్రుని వెంటవచ్చిన ఒడంబడి యట్లకాకయని సుల్తాను వీడ్కొల్పిన ఢిల్లికింజని రాజ్యంబు సేయుచుండె. అట శ్రీమత్ప్రతాపవీరరుద్రదేవుండు దినదిన ప్రయాణంబుల కాశికిం జని మణికర్ణికయందు గ్రుంకి విశ్వనాయకుల నారాధించి యచట మొనిమిది తులాభారంబులు తూగి దండపాణి కాలభైరవుల నుతియించి మణికర్ణికయందు విశ్వేశ్వరు ప్రీతికై కోటిసువర్ణంబులు దానంబులు ఇచ్చి మగుడి యేకశిలానగరంబునకు జనుదెంచుచు గోదావరి జేరి కాళేశ్వరంబున నిలిచి యచట విధ్యుక్తప్రకారంబున మహాసంకల్పయుక్తిగా స్నానంబుచేసి నిత్యకర్మంబులు తీర్చి కాళేశ్వరుముక్తీశ్వరుగొలిచి లక్షబ్రాహ్మణభోజనంబు పెట్టించి కోటిసువర్ణదానంబులు ఈశ్వరార్పణంబుగా విప్రుల కిచ్చి వారలచే నాశీర్వాదంబులు గైకొని కృతార్థుండయ్యె. శ్రీమత్ప్రతాపరుద్రమహారాజు ఏకశిలానగరంబునకు పయనంబగుసమయంబున శివదేవుండు మహారాజును ఏకాంతంబునకు బిలిచి పద్దెనిమిదిదినములకు నీవు కైలాసమోక్షసామ్రాజ్యుండవు గాగలవు. ఇది గౌతమిగంగాగర్భంబు. ఇందుజీవనంబు విడచి దివ్యదేహంబుదాల్చి కైలాసంబునకువచ్చెదవని అవాఙ్మనసగోచరుండును సచ్చిదానందుండును నిరంజనుండును నిరాకారుండును పరమేశ్వరుండునగు శివుండు నీకు వరంబొసంగె. ఇచటనే ఉండి యేకశిలానగరంబు ప్రజల రాబనుపు మనుటయు అట్లకాకయని రాజు తనపట్టంపుదేవిని రాణివాసంబునంగల కాంతలను కుమారులను బంధువులను ఆహితాగ్నులను రాజకుమారులను వృద్ధవైశ్యుల శూద్రులను నానావర్ణంబుల రమ్మని చారుల బుత్తెంచిన వారలు యేకశిలానగరంబునకుం జని చెప్పగా కోటలు మేడలును గృహంబులుదకర ఆబాలవృద్ధగోపాలంబులును సర్వభండారంబులును నాలుగు దినంబులకు శ్రీమత్ప్రతాపవీరరుద్రమహారాజుసముఖంబునకు అందరు వచ్చుటయు. అచట నరపతిరాయులు అన్నమదేవుండును, డెబ్బదియేడుగురు పద్మనాయకులును, సుల్తానుదళంబుల నిర్విశేషంబుగా దునిమి జమానుఖానుని దేశంబున కేగి యతని తలద్రుంచి యావట్టణంబుకాలవేసి కోటలుతవ్వి యాసీమలు పాడుచేసి చారులచే శీమత్ప్రతాపవీరరుద్రమహారాజు కాళేశ్వరంబున కేగుటయు విని అన్నమదేవుండు మొదలయినవారువచ్చి కలుసుటయు. నరపతిరాయులకొమారు

నికి వేయుగజంబుల ఇచ్చి తొల్లి మీపెద్దల యట్ల పరాక్రమంబుచేసితి. నీకు ప్రతాపంబు చెల్లు నని ప్రతాపబిరుదులు ఇచ్చి నరపతిరాయులకు తనకూతురు రుద్రమదేవిని ఇచ్చి అయిదుకోట్ల సువర్ణంబులు ఇచ్చి కృష్ణమేరగా దక్షిణదేశంబు అరణంబు ఇచ్చి అనుపుటయు. రామచంద్రదేవుని బిలిచి గజపతిపట్నంబు గట్టి అన్నమదేవునికూతురు ముమ్మకదేవిని అతనికి వివాహంబుచేసి మూడుకోట్ల సువర్ణంబులు ఇచ్చి కటకంబునకు అతనిగజంబులగూర్చి అనుపుటయు. తనతమ్ముండైన అన్నమదేవుని బిలచి ప్రతాపరుద్రుం డిట్లనియె. నీవు రాజ్యంబునకు పట్టాభిషిక్తుండవై రాజ్యంబు పాలింపు మనిన అందుకు అన్నమదేవుం డిట్లనియె. ఈ రాజ్యంబు సకలభూపతులు గొలువ రాజుచేననుజ్ఞాతులై కొందరురాజులై, కొందరుజగమన్నీలై, కొందరు రాజమన్నీలై, స్వతంత్రులైరి. ఈ రాజ్యంబుసకల భూపతులు గొలువ నీవు రాజ్యంబుపాలించిన వెనుకను అట్టిప్రతాపంబు మాకు చెల్లదు. అని శివదేవయ్యం జూచిన ఆయయ్య యీ సింహాసనంబు మీసంతతికి లేదు. ఆశలుడుగుం డనిన, విని రాజు తనకుసహాయంబు వచ్చిన సుల్తానుదళంబులకు, పదివెయిలవరహాలు ఇచ్చి అనుపుటయు. భూసురులకు ముప్పయిలక్షల వరహాలు పంచిపెట్టి వారలచే నాశీర్వాదంబులు గయికొని అనుపుటయు. తనమూలబలంబుల నవలక్షధనుర్ధరులు కయ్యంబున మడిసినవారల సుతులరావించి తొమ్మిదిలక్షలును చేసి నాలుగుకోట్ల వరహాలు వారికి నిచ్చి అన్నమదేవునకు అప్పగించి, తదనంతరంబున మిగిలినద్రవ్యంబు అర్హ్మాజనబంధువులకు పంచిపెట్టించి, శ్రీమత్ప్రతాపవీర రుద్రుండు తన్నుగొలిచిన కన్నోజురాజుకయ్యంబునన్ జచ్చిన అతనిసుతునికి అతని దేశంబుగట్టి రెండుకోట్లద్రవ్యంబును యాబయివెయిలగుఱ్ఱంబులు నిచ్చి అనుపుటయు, వీరపాండ్యరాజుకొమారునికి వేయుగజంబులు ఇచ్చి కోటిద్రవ్యంబు ఇచ్చి తనకూతురు రుద్రమదేవిని అతనికి నిచ్చి అనుపుటయు. తదనంతరంబున రాజ్యభారంబు అన్నమదేవుని వశంబు జేసుటయు. తాను గోదావరినది తీర్థంబులాడి దివ్యాంబరంబులుగట్టి నానాభూషణంబులు దాల్చి విభూతిరుద్రాక్షమాలికాలంకృతుండై గోదావరీ గర్భంబునగూర్చుండి శంభులింగంబు హృదయకమలంబున నిల్పియున్న సమయంబున రాజుపట్నపుదేవి యగు విశాలాక్షింజూచి శివదేవయ్య యిట్లనియె. తల్లీనీవు పెద్దకాలంబునుండి పూజించితివి. నీకు ఇష్టంబయినవరంబాసంగెద వేడుమనిన ఆయమ్మనమస్కరించి మహాత్మ తనకు పతి జీవితంబువెంటనే జీవించనట్లుగా వరంబుదయసేయుమనిన ఆయయ్య

అట్లనే యొసంగిన. శ్రీమత్ప్రతాపవీరరుద్రమహారాజు రుధిరోద్గారినామసంవత్సర మాఘ శు ౫ గురువారంనాడు ఉదయకాలంబున శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు నిజ దేహంబువిడిచి, దివ్యదేహంబు దాల్చి సతితోఁగూడ దివ్యవిమానంబుమీఁద నెక్కె. ఇట్లు ఆపుణ్యదంపతులు ఆవిమానంబు సర్వజనంబులు జూచుచుండ కైలాసని వాసులైరి. అంతట అన్నమదేవుండు శ్రీమత్ప్రతాపవీరరుద్రమహారాజునకు విహితకార్యంబులుదీర్చి వైరాగ్యంబుదాల్చియుండె. శ్రీమత్ప్రతాపవీరరుద్రమహా రాజుకుమారుండు వీరభద్రయ్య తలఁపెఱిఁగి ఆవీరభద్రయ్యకు పట్టంబుగట్టి, తాను, విరూపాక్షుండును, ఈశాన్యభాగంబునకై వింధ్యదేశంబులకై చనిరి. శివదే వయ్యగారు శ్రీశైలంబునకుంజనిరి. వీరభద్రయ్య పట్టాభిషిక్తుండై రాజ్యంబు సేయు సమయంబున, అక్కడ ఢిల్లీసుల్తాను రాజదేవేంద్రుండు శ్రీమత్ప్రతాపవీరరుద్రమహా రాజు శివలోకంబున కేగుట విని పరమాత్ముం డగు పరంధాముం డగు నారా యణునారాధించి సుల్తానుదివ్యలోకంబునకు జనుటయు. వుల్లుఖానుండు సిద్ధిఖా నుండు మడియుటయు. తమదేశంబులదోచుట యింతప్రయోజనంబు జేసినవారు ఎవ్వరు. అనిన. నరపతిరాయులు ఇంతచేసిరా యని సుల్తాను కొమారుండు రౌద్రాకారుండై ప్రయాణభేరి వేయించి మూడులక్షల గుర్రంబులును పదిలక్షల పదాతివర్గంబులగూర్చుకొని విజయనగరంబుపై చనుదెంచునప్పుడు వీరభద్రయ్య సుల్తానివారివశంబున కొంచెంబుగా రాజ్యంబులోను జేసుకొని యేలులరానివ్వక ఆవలకృష్ణమేరగా రానివ్వక కంట్లగాంచి ముప్పదిలక్షల పదాతివర్గంబుతో సుల్తా ని వారిబలంబులతో యుద్ధంబు సేయుచు గటనములుగట్టి గవణంబులు రానివ్వక యిట్లు పెక్కుభంగుల చికాకుసేయుచు పన్నెండువరుషంబులు పోరిన సుల్తానియు పిరుదివియక అచట బెడదకోట యను పురంబుగావించుకొని యుండె. క్రమక్ర మంబున కొంచెంబు నరపతిరాయులతో పోరాడంజాలక తనభూములు తనకు లోనుగాక మరలబడుట విని ఢిల్లీకిపోక నరపతిరాయులతో సంధిచేసుకొని ఆనరప తిరాయులకు అప్పనంబులు ఇచ్చి. ఇట్లు తనయేకశిలానగరంబు డిల్లీసుల్తాను తన యాజ్ఞకు లోనుచేసుకొని దేవాలయంబులు పడగొట్టించి బహువిధంబుల బాధపె ట్టుటయు వీరభద్రుండు సహింపజాలక, తనబలంబుగూర్చుకొని సుల్తానువారి భృత్యులనందరిం దునిమి తానును పురంబునంగల జనులు ఏకమై పురంబు వెడలి కొండమీఁదనున్న రాయులం గలసి యుండుటయును.

---

(ఆనందనామసం॥ర జ్యేష్ఠ శు ౧౨ రోజున ఆదివారంసాయంత్రం వరకునేం పూర్ణంచేసినది. తిరుపతిరాజు).

ఈపుణ్యకథలు వినుండి. యిరువదేనుకథలు గలిగిన క్రమంబును కాకతిరా జుల వెలయంజెప్పెద. తొమ్మిదినూటతొంబయివరుషంబులు పృథివిపాలించి సకలై

శ్వర్యసిద్ధికరంబై విలసిల్లుచుండు మొదటిహంశ కందారంబుననుండి సోమదేవ రాజు యేలుచుండంగాను కటకవల్లభుండు వచ్చి యుద్ధంబుచేసి వానిచే మృతి నొందిన వెనుకను సోమదేవరాజు పట్టంపుదేవి పారివచ్చి హన్మకొండలోను కుమారుని గాంచెను. ఆమాధవవర్మ యనురాజు పద్మాక్షిదేవి వరప్రసాదంబున ఏకచక్రంబుగా రాజ్యంబేలించిన వారిసాంప్రదాయకులు శ్రీమత్ప్రతాపవీరరుద్రుని పర్యంతం వరంగంటినిగట్టి పెక్కుసాహసంబులుచేసి వెయ్యేండ్లు రాజ్యంబేలినరాజుల వెలయంజెప్పెద వినుడీ.

మాధవరాజు మొదలు ... ... ... ౧౭౫
పద్మసేనరాజు ద్వితీయం ... ... ... ౮౦
వెంన్నమరాజు తృతీయం ... ... ... ౭౨
గుండమరాజు చతుర్థం ... ... ... ౭౫
కుంతలదేవి పంచమం ... ... ... ౯
మొరుకదేవరాజు షష్ఠమం ... ... ౭౬
భువనేకమల్లుడు సప్తమం ... ... ... ౭౬
త్రిభువనేకమల్లుడు అష్టమం ... ... ౭౪
కాకితపోల్ రాజు నవమం ... ... ... ౭౨
రుద్రమరాజు దశమం ... ... ... ౭౪
మహాదేవరాజు ఏకాదశం ... ... ... ౩
గణపతిరాజు ద్వాదశం ... ... ... ౭౭
రుద్రమదేవులు త్రయోదశం ... ... ... ౩౮
అన్నమదేవుడు చతుర్దశం ... ... ... ౧౨
శ్రీమత్ప్రతాపవీరరుద్రమహారాజు పంచదదశంబుల పదిహేనుగురు ... ౭౬

౯౯౯

౨౩౦ సోమదేవరాజుల వరకు శాలివాహన శకవర్షాలు ౧౦౦౦. సోమదేవరాజువద్దనుంచి శ్రీమత్ప్రతాపవీరరుద్రునిపర్యంతం రుధిరోద్గారినామ సం॥ మాఘ శు ౫ గురువారము ప్రతాపరుద్రుడు కైలాసం సంప్రాప్తి ఆయెను. ౨౯౫. వీరభద్రుని సమేత రాయులవారుచేసినది ౨౩౪. అక్కన్నమాదన్నగారు హేవళంబి సం॥వరకు. రక్తాక్షి స॥ లో అక్కన్నమాదన్నగారు ముక్తింబొందినది. సం॥౧౦౩౫ సాలు. ౧౭౫౯. యిది లెక్కచేసినది. ఝల్లీ వెంకన్నగారు ఖండేరావుపంతులుగారు చేసినది పట్నములోను.

# కృష్ణరాయలకొన్ని దిగ్విజయయాత్రలు.

## (౧. ఆముక్తమాల్యద రచనాకాలము).

ఆముక్తమాల్యదలోని యీక్రిందివచనము మనమందఱము నెఱిఁగినదియే.

"మున్నే కళింగదేశవిజిగీషామనీషఁ దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళనికేతనుం డగునాంధ్రమధుమథను సేవింపఁబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున."

*కృష్ణరాయలు తెలుంగురాయని సేవించిన హరివాసర మెద్ది?*

కలలో నాంధ్రవిష్ణువు కనఁబడి గ్రంథము రచింపుమని కృష్ణరాయనితోఁ జెప్పెనన్నకథ మనము నమ్మినను నమ్మకపోయినను, రాయలు కళింగముమీఁదికి దండెత్తిపోవునప్పుడు బెజవాడలోఁ గొన్నిదినములుండి యచ్చటినుండి యొక యేకాదశిదినంబున శ్రీకాకుళమునకుఁ బోయెననియు, అప్పటినుండియు నొక కావ్యము వ్రాయవలెనన్నకోర్కె యాతనికిఁబుట్టి యాతఁడు వ్రాయసాగెననియు మన మూహింపవచ్చును. కావున నీహరివాసరం బెద్ది యని తెలిసికొనుట యావశ్యకంబయ్యె. కాని యిదివఱకునున్న చరిత్రసాధనమువలన నీయేకాదశి యేసంవత్సరమందలి యేనెలలోని యేపక్షమందలిదియో యని నిశ్చయించుటకు వీలులేకయుండెను. రాయలు బెజవాడలో మకాము చేసియున్నదినములను స్పష్టముగఁ దెల్పుశాసన మింకను మనకు దొరకలేదు. కళింగదండయాత్రాసందర్భమున రాయలవారు బెజవాడకుఁ జుట్టుపట్టుగ్రామములకును, బెజవాడ దాఁటి కళింగగ్రామములకును వెళ్లినకాలములను దెలుపుశాసనములు పెక్కులు కలవు. రాయలు క్రీ. శ. ౧౫౧౫లోఁ గొండవీటికిని అమరావతికిని వెళ్లెను.[1] ఇందువలననే శ్రీ వీరేశలింగముగారు "కళింగదేశవిజయయాత్రకయి వెడలి విజయవాటి (బెజవాడ) కి వచ్చినది షాలివాహనశకము ౧౫౧౫-వ సంవత్సర మగుటచేత రాజీగ్రంథము నాసంవత్సరమునందుఁ జేయ నుద్దేశించి ప్రారంభించియుండును." అని వ్రాసియున్నారు.[2] ఈ యేటనే రాయులు సింహాచలమునఁ దన యుద్ధఘు

---

1. 276 and 272 of 1897 Mad. Epi. Collections.
2. ఆంధ్రకవులచరిత్రము, ౨-వ భాగము కృష్ణరాయలు.

భార్యలతోఁ గలసి దేవునకు దానము చేసియున్నారు.[1] కావున ఈ యేట నాతఁడు బెజవాడమీఁదుగా వెళ్లియుండును. ౧౫౧౯లో మరల ఈ రాజుచేఁ జెక్కింపఁబడిన శాసన మొకటి సింహాచలమునందుఁ గానవచ్చుచున్నది.[2] "ఇట్లు కళింగదండయాత్రకై రాయలు క్రీ. ౧౫౧౫ మొదలు క్రీ. ౧౫౧౯ వఱకుఁ బెక్కుసారులు బెజవాడమీఁదుగా వెళ్లుట తటస్థించెను. ఈకళింగయుద్ధము పూర్తియగువఱకును కృష్ణరాయలు బెజవాడను తనసైన్యమునకు ముఖ్యశిబిరముగ నేర్పఱచుకొని, అచ్చటినుండి ఆవశ్యకతనుబట్టి సైన్యమును వేఱువేఱుదిశలకుఁ బంపుచున్నట్లు కానవచ్చుచున్నది. రాయలసేనానులైనపెద్దనమొదలయినవారి కోకటాది గ్రామములలోని శాసనములవలనను ఈ విషయమే తేలుచున్నది. "కోకటము మొదటిశాసనములో[3] నింకొక విశేషముగలదు. అది కోకటము దేవాలయమునందుఁ జెక్కఁబడినను నందలిదానము మాత్రము బెజవాడలోఁ గృష్ణాతీరమున మల్లికార్జునస్వామిసన్నిధిని నీయఁబడినది. అనఁగా శా. శ. ౧౪౪౦ వైశాఖ శు॥ ౧౫ చంద్రగ్రహణకాలమున (౨౫ ఏప్రిల్ ౧౫౧౮) పెద్దన బెజవాడలో నుండెను. కృష్ణదేవరాయఁడుకూడ నాకాలమున నచ్చట నుండెననియు, అతనితో నాతని సేనానులుకూడ బెజవాడ వెళ్లియుండి రనియు మన మూహింపవచ్చును. దీనికి ననుగుణముగ నిదే తేదినిఁ గృష్ణరాయని మఱియొకసేనాని యైన శ్రీ మన్మహామండలేశ్వరసింగయ్య యను నాతఁడు కనకదుర్గకు నిచ్చినభూదానశాసన మొకటి బెజవాడ కనకదుర్గగుడిలోఁ గలదు.[4] కావున నీ వీరులందఱును కృష్ణరాయునితో నచ్చటఁ గూడియుండిరని యూహించుటకు వీలు కలదు. రాయలు కళింగముమీఁదికి రెండుసారులో మూఁడుసారులో, దండయాత్ర వెళ్లినట్లు కానవచ్చుచున్నది. సింహాచలమునందుఁ గృష్ణరాయఁడు శా. శ. ౧౪౩౭ (క్రీ. శ. ౧౫౧౬) ధాత చైత్ర బ॥ ౧౨ దినమున నొకశాసనమును[5], శా. శ. ౧౪౪౧ ప్రమాది శ్రావణ శు॥ ౧౩ (క్రీ. శ. ౧౫౧౯) నాఁడొకశాసనమును వేయించెను. అందువలన మొదట సింహాద్రివఱకు దిగ్విజ

1. 243 and 249 of 1889 Mad. Epi. Collections. 2. 244 of 1899.

3. కోకటమునందలి శిలాశాసనములనకళ్లు. చెన్నపురి గవర్నమెంటు మ్యానుస్క్రిప్టులైబ్రరీలోని లోకల్ రికార్డ్సు, ౧౦-వ వాల్యుంలో "కోకటము కైఫియతు" అనుదానిలో నీయఁబడినవి.

4. Epigraphical Reports S. Circle 329 of 1892. 5. Epi. R. No. 244 and 245 of 1899. ఈ రెండుశాసనములనకళ్లు గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములలో నీయఁబడినవి.

యము చేసివచ్చినట్లును, రెండవసారి కటకమువఱకు వెళ్లినట్లును గానవచ్చుచున్నది. ఈరెండు కళింగదిగ్విజయములకు నడుమ నున్నకాలమునఁ గృష్ణరాయఁడు బెజవాడ మకాములోఁ దనసైన్యశిబిరము కొంత నిల్వయుంచినట్లును, తానును దన నాయకులును అటునుండి యిటు ఇటునుండి యటు వచ్చి వెళ్లుచున్నట్లును గానవచ్చెడిని."[1]

ఇట్లు "కళింగదేశ విజిగీషామనీషఁ దండెత్తి"పోవుట ౧౫౧౫ మొదలు ౧౫౧౯ వఱకు జరిగినందునఁ గృష్ణదేవరాయలు శ్రీకాకుళమునకుఁ బోయిన దేసంవత్సరమో నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేకయుండెను. కాని యిటీవల ఆంధ్రవిజ్ఞానసర్వస్వమున "అల్లసాని పెద్దన" యను వ్యాసము వ్రాయుటకునై నేను సాధనములను సేకరించుచుండఁగా, చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు నాకు "ఈలియట్సుకలెక్షన్" అను శాసనసమూహములో నీక్రింది శాసనము కానవచ్చెను. ఇది శ్రీకాకుళపుఁ దెలుఁగురాయనికిఁ గృష్ణరాయనిచే నీయఁబడిన దానశాసనము. నాకుఁ దెలిసినంతవఱకును ఈశాసనమందలి విషయము లిదివఱ కెవ్వరిచేతను జర్చింపఁబడియుండలేదు.[2] అందువలన, ఆంధ్రవాఙ్మయశోధకులకును రాయలచరిత్రకారులకును నిది ముఖ్యమైనది యని తలఁచి దానిని దొరకినది దొరకినట్లు దిద్దకుండ నిచ్చుచున్నాను. లేఖకప్రమాదములచే నిందుఁ గొన్నితప్పు లున్నను జరిత్రమునకు నక్కఱకువచ్చుభాగమున దోషములు లేనందునను మఱియొకప్రతి దొరకనందున మనయిష్టమువచ్చినట్లు దిద్దుట తప్పని నాసిద్ధాంత మగుటచేతను ఈలియట్ కలెక్షన్‌లో నున్నట్లే దాని నిచ్చుచున్నాను. శ్రీకాకుళమునుండి దీనియొక్కపరిశుద్ధప్రతి యొకటి సంపాదించుటకు యత్నించుచున్నాఁడను. అది దొరకినతరువాతఁ బటముతోఁగూడఁ బ్రకటింపఁగలను :—

" బందరుజిల్లా యిలాకా చల్లపల్లి తాలూకాలో చేరిన శ్రీకాకుళం గ్రామం తూర్పున వేంచేసియున్న శ్రీకాకుళేశ్వరస్వామివారి ఆలయంమీదవున్న శిలాశాసనములు. గర్భాలయంమీద తూర్పుద్వారంకు వుత్తరం.[3] "

---

1. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము 3-వ సంపుటము "అల్లసాని పెద్దన" అనువ్యాసములో నుండి తీసికొనఁబడినది. 2. రాబర్టుస్యూయెల్ "అంటిక్విటీస్ వాల్యూం ౧" అనుగ్రంథములో శ్రీకాకుళమునందు శా. శ. ౧౪౪౦ సంవత్సరపుశాసన మొకటిరాయలవారిది ఉన్నట్టు చెప్పెనేకాని అందలివిషయమును చెప్పలేదు. అది యిదియో మఱియొకటియో చెప్పఁజాలము.

3. ఈయుపోద్ఘాత మీశాసనమునకు నకలువ్రాసినవారిచే వ్రాయఁబడినదనుట స్పష్టము.

"శుభమస్తు ॥ హరేర్లీలావరాహస్య । దంష్ట్రాదండస్సపాతునః । హేమం
శ్రీకలశాయత్ర । ధాత్రీఛత్రశ్రియందధౌ ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివా
హన శకవర్షంబులు ౧౪౪౦ అగు నేటి బహుధాన్యనామసం॥ర ఫాల్గుణశుద్ధ ౧౧
శుక్రవారం శ్రీకాకుళపు తెలుగురాయలకు శ్రీమన్మహారాజాధిరాజరాజపరమే
శ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలుంగారు దణ్ణాం సమర్పించి
యిచ్చిన ధర్మశాసనం॥ 'స్వామికి కుంభసంక్రమణపుణ్యకాలమందు సందర్శించి
కొండపిలి సీమకుం జేరి వొచ్చిన దేవరపుంగోట స్థలం లోపలి యెర్ల:గడ్డగ్రామం
౧న్ని దేవపల్లిగ్రామం ౧న్ని శ్రీకామశానుస్వామి విప్రతిగ్రహాలబ్ధమైన సత్రాల
భూమి తోటలు నిత్యావసరాలు శ్రీ రామానుజకూటము ద్వాదసులు సహి
తమయిన భూమిన్ని క్రాంతలంక చింతలంక వుంద్రసలుక పిరాట్లంక పులు
గడ్డలంక క్రోసూరు మండల్లివచ్చిన కంభాలదొడ్డిన్ని కొండవీటి సీమలోని
పెడగాడిపట్టున్ను వినికొండ సీమలోని కారుమంచిన్ని స్వామి సన్నిధిని ధారా
పూర్వకముగాను స్వామి నిత్యనైవేద్యాలకున్ను అంగరంగవైభవాలకున్ను యిడ
మడవక జరుగుటకై శ్రీకాకులని తెలుంగువల్లభునికి సమర్పిస్తిమిగనుక ఆచంద్రా
ర్కస్థాయిగాను అవుధరించేది ॥ స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం పర
దత్తాపహారేణ స్వదత్తనిష్ఫలంభవేత్ ॥ ఈధర్మానకు యెవరుతప్పినాను గంగ
లోను గోబ్రాహ్మణవధ చేసినపాపాన వొందువారలు ఈ అయిదుగ్రామాలున్ను
శ్రీవల్లభునికి సమర్పించి యీ అయిదుగ్రామాదులలో యిందువల్లవచ్చిన నిత్య
నైవేద్యంకట్టడి దధ్యోజనంపళ్లెలు ౪ । అలంకారప్రసాదం పళ్లెలు ౪ అప్పాలు
౨౬ పళ్లెం ౧కి। అతిరసాలు పళ్లెం ౧। వడల పళ్లెం ౧। యిడ్డెనకుడుములపళ్లెం ౧।
పప్పుకూరలు నెయ్యి పచ్చళ్లు అర్కరంగాయలు తోడలు ఆరగించె పళ్లాలు ౬౦
న్ని। ఆనబాలప్రసాదపళ్లాలు ౨౩। బెరపి ఆరగించె ౭౪ డెబ్బయినాలుగుయింటికి
పళ్లెంవారి అమృతపడినిం।— లెక్కను।కస్తూరికర్పూరపరిమెళ సహితంగుండాలు౩."[*]

ఈశాసనమునుబట్టిచూడఁ గృష్ణరాయఁడు శ్రీకాకుళమందలి యాంధ్రవిష్ణు
వును సేవించినదినంబును, ఆతఁ డాతనికలఁ గాన్పించి యాంధ్రకావ్యము వ్రాయవల
సిన దని యానతిచ్చెనని యాముక్తమాల్యదలో వర్ణింపఁబడిన ప్రసంగము జరిగిన
హరివాసరంబును శా. శ. ౧౪౪౦ అగు నేటి బహుధాన్యనామసం॥ర ఫాల్గుణ
శుద్ధ ౧౧ (ఏకాదశి) శుక్రవారమని స్పష్టమగుచున్నది. లెక్కవేసిచూడ నిది క్రీ.
శ. ౧౫౧౯-వ సంవత్సరమందలి ఫిబ్రేవరినెలలోని ౧౧-వ తేది యగుచున్నది.

*Elliot's Collection in the Government Oriental Ms. Library, Madras, page 547.

కావున నాంధ్రమహాకావ్యములలో నొకఁటియగు నాముక్తమాల్యద రచన ప్రారంభింపఁబడిన దిన మింతసూక్ష్మముగను నిశ్చయముగను మనకుఁ దెలిసినందుకు మన మెంతయు సంతసిల్లవలసియున్నది.

౨ ఆదిల్ షాహ మీఁది దాడి.

పై శాసనముతో సంబంధము లేకపోయినను ఆముక్తమాల్యదయొక్క కాలనిర్ణయముతో సంబంధముండుటచే నాగ్రంథమందలి కొన్నిపద్యములలోని విషయములను గుఱించి యిచ్చటఁ గొంచెము వివరింపవలసియున్నది. ఉపోద్ఘాతమునందు నీక్రిందిపద్యము కలదు:—

మ. అలుకన్ఘోటకధట్టికాఖురపుటీహల్య న్ఖురాసానిపు
చ్చలు వోదున్ని చలచ్చమూగజమదాసారప్లుతి న్కీర్తిపు
ష్కలసస్యంబిడి యేకధాటి బళిరా కట్టించి తౌ దృష్టి కే
దులఖానోగ్రకపాల మర్ధపహరిద్భూజాంగలశ్రేణికిన్.[1]

ఈపద్యమునుబట్టిచూడఁ గృష్ణరాయఁడు ఏదులఖాను నోడించినతరువాత నీగ్రంథము పూర్తిచేయఁబడె ననుట స్పష్టము. ఏదులఖానుఁడు క్రీ. శ. ౧౫౨౦ లో నోడింపఁబడియెఁగావున నాసంవత్సరమునకుఁ దరువాతనే యీకావ్యము పూర్తిచేయఁబడినదని యిదివఱకు శ్రీవీరేశలింగముగారును, ఇతరపండితులును, నేనును వ్రాసియున్నారము. కాని యిప్పుడు, ఏదులఖానుఁడు రాయలచే నెప్పు డోడింపఁబడియెనో యన్నవిషయము మరలఁ గొంతవఱకు విమర్శనీయమని నాతాత్పర్యము.

ఏదులఖానుఁ డనఁగా బీజాపూరు (విజాపురము) నవాబు. కృష్ణరాయఁడు క్రీ. శ. ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వఱకు రాజ్యముచేసె నని యిప్పటిచరిత్రకారులందఱు నొప్పుకొనియున్నారు.[2] కావున నీతనికాలమున విజాపురమున నిద్దఱు

1. ఈపద్యము సంస్కృతసమాసభూయిష్ఠము గనుక దీనితాత్పర్య మిచ్చెదను. ["ఓకృష్ణరాయ!] నీవు ఉత్తరదేశముపై దాడివెడలినప్పుడు అచ్చటిభూములలో (పొలములలో) ఖురాసానుదేశజులైన మహమ్మదీయులనియెడు పుచ్చచెట్లులేకుండగ నీసైన్యమందలి గుఱ్ఱములగిట్టలనెడు నాఁగండ్లతోఁ జెడదున్ని, యేనుఁగుల మదధారలతో నాపొలములఁ దడిపిపదనుచేసి, యందు గీర్తియను పైరును ఎక్కువగా నాటి, దానికి దృష్టిపరిహారముగా ఏదులఖానని భయంకరమైనపుఱ్ఱను వెఱపుబొమ్మవలెఁ గట్టించితివి."

2. రాయలు శా. శ. ౧౪౪౨లో ననఁగా క్రీ. శ. ౧౫౨౦లోనే కీర్తిశేషుఁ డయ్యెనని చెప్పు చాటుపద్య మొకటికలదు (కవులచరిత్ర ౨-వ భా.) నాకు నిటీవల దొరకిన కొన్నికాగితములనుబట్టి యీచాటువు నిజముచెప్పుచున్నదేమో యన్నయభిప్రాయము కలుగుచున్నది. కాని కొన్నిశాసనము లిందుకు వ్యతిరేకముగ నున్నందున, వానిమూలములను (originals) పూర్తిగఁ బరిశోధించి, ప్రమాణద్వయమునకుఁ గలబలాబలములఁ జక్కగఁ దూఁచిచూచి నాయభిప్రాయమును లోకమునకు వెల్లడిచేయఁ దలఁచినాఁడను.

నవాబు లుండి రని చెప్పవలెను. యూసఫ్ఆదిల్ శాహా అనువాఁడు ౧౪౮౯ మొదలు ౧౫౧౦ వఱకు రాజ్యముచేసెను. అనఁగాఁ గృష్ణరాయలు రాజ్యమునకు వచ్చినతరువాత నీతఁ డొకసంవత్సరమువఱకైన నుండెను. ఇతఁడె స్వతంత్రుఁడై "ఆదిల్ శాహి" వంశమునకు మూలపురుషుఁ డయ్యెను. ఈతనికొమారుఁడు ఇస్మాయిల్ ఆదిల్ శాహ అనువాఁడు క్రీ. శ. ౧౫౧౦ మొదలు ౧౫౩౪ వఱకు రాజ్యమేలెను. అనఁగాఁ గృష్ణరాయనినిధనానంతర మీతఁడు నాల్గుసంవత్సరములవఱకు బ్రతికియుండెను.[1] ఈతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు పదునొకం డేండ్లవాఁ డఁట.

ఆదిల్ శాహాతో జరిగినముఖ్యయుద్ధము రాయచూరుయుద్ధము. కాని రాయచూరునొద్ద రాయలకు నాదిల్ శాహాతో రెండుతడవలు యుద్ధము సంభవించినట్లు కానవచ్చుచున్నది. ఇందునగుఱించి సూయెల్ ఇట్లు వ్రాయుచున్నాఁడు. "కాల మనుకూల మని తలఁచి కృష్ణరాయఁడు ౧౫౧౨-వ సంవత్సరప్రాంతమున సుల్తాను రాజ్యముపై దండెత్తిపోయి రాయచూరుదుర్గముపైఁ బడెను. తుద కాదుర్గమందలి సైనికులు దానిని రాయలకు స్వాధీనపఱిచిరి; తనరాజ్యమందలి వ్యవహారములో నెక్కువగాఁ జిక్కియున్నందున ఆదిల్ శాహ సకాలమునకు సాహాయ్యముఁ బంపలేకపోయెను. ఇట్లు ఫెరిస్తా చెప్పుచున్నాఁడు."[2] ఈసమాచారమును ననిజ్ ఎత్తుకొనలేదు. ఆతనివ్రాఁతలఁబట్టిచూడ రాయలు ౧౫౨౦ లోనే మొట్టమొదట ఆదిల్ శాహామీఁదికి దండెత్తిపోయినట్లును, రాయచూ రప్పుడు శాహ స్వాధీనమందుండఁగా రాయలు దానిని సాధించుటకు వెళ్లినట్లును గానవచ్చును. ఇట్లు నన్నిజుకథకును ఫెరిస్తాకథకును భేదము కలదు. ఎందుకనఁగా, ౧౫౨౦ లోని దాడినిగుఱించి వ్రాయుచు ఫెరిస్తా, అంతకుఁ బూర్వము ౧౫౧౨లో విజయనగరపురాయలచేఁ దీసికొనఁబడిన ముద్గల్లు, రాయచూరుదుర్గములను మరల సాధించుటకై ఇస్మాయిల్ ఆదిల్ శాహ యుద్ధసన్నద్ధుఁ డయ్యెను అని వ్రాసియున్నాఁడు. ఈ రెండుకథలలో నేది నిజమో నేను జెప్ప లేను."[3]

---

1. ఈయంకెలన్నియు Beale's Oriental Biographical Dictionary నుండి తీసికొనఁబడినవి ఈతఁడు ఫేరిస్టా మొదలయిన మహామ్మదీయ చరిత్రకారుల గ్రంథములనుండి వీనిని సేకరించెను.

2. Scott's Trans. I. 236. 3. Forgotten Empire.

ఇట్లు నన్నిజుమతమున ౧౫౨౦లో నొక్కసారిమాత్రమును, ఫెరిస్తామతమున ౧౫౧౭లో నొకసారియు, ౧౫౨౦లో రెండవసారియు రాయలకును శాహసైన్యములకును యుద్ధము జరిగి విజయలక్ష్మి రాయలనే వరించెను.

ఆలోచించిచూడఁగా ఫెరిస్తా మాటయే నిజ మని తోఁచుచున్నది. కృష్ణదేవరాయవిజయము, రాయవాచకము[1] అనుగ్రంథములలోఁ గృష్ణరాయఁడు గజపతిమీఁదికి దండెత్తిపోక పూర్వము రాచూరుదుర్గమును బట్టుకొని యందుఁ దనసైన్యముల నుంచినట్లును, అహమదునగర విజాపుర గోలకొండనవాబులతోఁ గృష్ణాతీరమునఁ బోరి వారిని నోడించినట్లును జెప్పఁబడియున్నది. ఇందునుగుఱించి కృష్ణరాయవిజయమందలి తృతీయాశ్వాసమంతయుఁ జూడనగును. అందును నీ క్రిందివాక్యములు ముఖ్యములు :—.

"........చంచత్ప్రతాపంబు మెఱయ రయంబున విజాపురంబు గడుదుర్గంబుల చాయం జనుదెంచు సమయంబున........"

"........తొంటి రఘుమహారాజు చందంబున నిఖిలరాజులు తనకు హస్తగతంబులు సేయ నాదవని ముదుగల్లు రాచూరు మొదలైన మహాస్థలంబుల నిజబలంబులుంచి మించి........"

రాయవాచకమునుండి యీ క్రిందివాక్యముఁ జూడనగును :—

"........నాయడిమూకలను జూచి విజయాపురం సరుదుల నడువమ సంగ్గా సరుదుస్థలాలవుండి గురిమనుష్యులనుంన్ను దుర్గాలవుండ్డె రాణువనుంన్ను నిర్వహించలేక విడిచి పారిపోసాగిరి. గనక అందుండ్డి, రాచూచి (రి), ముదికల్లు, అద్దంకి, ఆదవని ఇవిమొదలైన స్థలాదులకు ఠాణ్యములు వుంచి దినమొకరీటిగా సరినడవగా........"[2]

ఇట్లు చెప్పుటయేగాక యీగ్రంథములు కృష్ణరాయఁడు తురకలను ఈలిడవ గెలుచుట యాతనిప్రథమదిగ్విజయ[3] మన్నట్లుకూడఁ జెప్పుచున్నవి :—

---

1. ఈగ్రంథములు చరిత్ర కంతగాఁ బ్రామాణికములు కావని నే నెఱుఁగుదును. కాని ప్రామాణికము లయినయితరగ్రంథములలోని కథలకు సహకారిగా నున్నప్పుడు వీనిలోనికథలను బూర్వమునుండి పరంపరగా వచ్చుచున్నయితిహాసములు (traditions) అని అంగీకరింపవచ్చును. వానిని ప్రామాణికగ్రంథమునకు సహకారులుగా గ్రహింపవచ్చును.

2. ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రికలో ముద్రింపఁబడిన "రాయవాచకము" (పుట. ౭౩-౭౭)చూడనగును.

3. ఇంతకుఁ బూర్వము కృష్ణరాయఁడు "ఉమ్మత్తూరు శివసముద్రస్థలంబుల నెసంగుగంగరాజు నొడయులనోడించె" నని యీగ్రంథములోనె చెప్పఁబడియున్నను అతఁడు కేవలము చేతిక్రిందిసామంతుఁడగుటచే దానిని స్వతంత్రదిగ్విజయముగ నెంచలేదు. పరరాజుల గెలిచినది యిదియేమొదటితడవ.

“ గనక కృష్ణరాయలున్ను నగర కట్టిపెట్టమనిన్ని గుడారాలు నిశా నులు నగారా మొదలైనది మొదటజగడాన దొరికింది గనుక అదంతా నగర కట్టమని అప్పాజి మొదలయిన నియోగులతోనున్ను....….” [రాయ.49పుట]

దీనిని బట్టిచూడఁ గృష్ణరాయలు రాజ్యమునకు వచ్చినకొద్దిదినములకే రాయచూరుదుర్గమును బట్టుకొని ఆదిల్‌ఖానుతోఁ బోరాడెనని మనమూహింపవచ్చును. ఇఁక నీయుద్ధము ఫెరిస్తా చెప్పినట్లు ౧౫౧౨లో జరగెనా లేక యంతకంటెఁ బూర్వమె జరిగెనా చూడవలయును.

ఆముక్తమాల్యదనుండి పైనుదాహరింపఁబడిన పద్యమునందు నొకవిశేషము కలదు. అందలిరూపకమును మనము గమనింపవలెను. కృష్ణరాయఁడు ఏదులఖానునిపుత్త్రెను వెఱబొమ్మగా వ్రేలాడఁగట్టించె నన నేమి యర్థము? ఏదులఖానుని జంపెనన్న యర్థము స్పష్టముగ స్ఫురించుచున్నదిగదా? ఇదియెట్లు? ఇతరచరిత్రకారు లెవ్వరును ఆదిల్‌ఖానుని గృష్ణరాయలు చంపినట్లు వ్రాసియుండలేదు. కాని కృష్ణరాయలు తనగ్రంథములో, నప్పటివారికందఱకును దనకృతిగాఁ జూపుగ్రంథములో, నసత్యము వ్రాయునా? బ్రతికియున్న తనప్రబలశత్రునిగుఱించి యిట్లువ్రాయుట తటస్థించునా? కావున రాయలు నిజమే వ్రాసె నని తలఁపవలెను. కృష్ణరాయని చేతనే చచ్చినను చావకున్నను ఆదాడిలో నొకఆదిల్‌శాహ చచ్చియుండవలెను. లేనియెడల వాని పుత్త్రి వ్రేలాడఁగట్టఁబడెనని రూపకముగనైన వ్రాయుట యెట్లు సంభవించును. ఫెరిస్తా యీసంగతి వ్రాయకపోవుటకుఁ గారణము కలదు. అతఁడు మహామ్మదీయపక్షపాతి. కావున నొకమహామ్మదీయసుల్తాన్ హిందూరాజుచేఁ జచ్చె నని వ్రాయుట యాతనికి నప్రియమైనపని. కావున నాతఁడు వ్రాయకయుండును.

ఇఁక నొకఆదిల్‌శాహ కృష్ణరాయలచేఁ జచ్చెనన్నఁ, జచ్చినవాఁ డెవ్వఁడు? ౧౫౧౦లోఁ జచ్చిన యూసుఫ్ ఆదిల్‌శాహయే యితఁడై యుండవలెను. కృష్ణరాయల తరువాతఁగూడ బ్రతికియున్న ఇస్మాయిల్ ఆదిల్‌శాహ అయియుండఁడు. ఇదియె నిజమైనయెడల మొదటిరాయచూరు యుద్ధము ౧౫౧౦లో జరిగియుండవలెను.[1] పద్యమునందు “ఏదులశాహోగ్రకపాలము” అనుపాఠముండుటకు బదులుగా నన్నిప్రతులలోను “ ఏదులఖానోగ్రకపాలము ” అని యుండుటయు నీ

1. లేదా యూసుఫ్‌ఖాన్ ౧౫౧౨లోనైనఁ జచ్చియుండవలెను. ఈవిషయము శోధింపఁ దగినది.

యూహాకు సహకారిగ నున్నది. ఈయూసుఫ్ అనునతనికి మొదట యూసుఫ్ ఆదిల్ ఖాన్ అని పేరు. ఈతఁడు మొదట బహమనీరాజులసేవకుఁడుగానుండి విజాపురమునకు సుబేదారుగా నుండెను. ౧౪౮౯లో స్వతంత్రుఁడై "యూసఫ్ ఆదిల్ శాహ" యన్నబిరుదము ధరించెను. కాని యింకను బహమని సుల్తానులు పేరుకైనను నుండుటవలనను, కృష్ణరాయలు వారికి సాయము చేయవలయునని తలంచుచున్నందునను, స్వామిద్రోహి యైనయూసఫ్ ఆదిల్ ఖానుని 'శాహ'గా ననఁగా స్వతంత్రరాజుగా నొప్పుకొనక, ఒకానొకఖానుఁగా నెన్నుటయే రాజనీతి యనుటకు సందేహము లేదు. ఇందుచేతనే విజయనగరమువా రాతనిని ఒకానొక సేనాని యగుతురకగా నెంచిరేగాని స్వతంత్రుఁడైనరాజుఁగ నెంచ లేదు. పెద్దనాదు లిందువలననే తమగ్రంథములలో నీతనినిగుఱించి చెప్పియుండక పోవచ్చును. గజపతి మొదలయిన మహారాజులయెదుట వీఁడు వారి కొకవర్ణనీయుఁడుగఁ గాన్పింపక పోవచ్చును.

ఆముక్తమాల్యదలో వ్రాసినట్లు కృష్ణరాయఁడు ఆదిల్ ఖానుని నిజముగఁ జంపినయెడల నీసమాచారము ౧౫౧౦-వ సంవత్సరప్రాంతమున జరిగియుండును. తరువాత మరల ౧౫౨౦లోను, కృష్ణరాయలరాజ్యచరమదశయందును (౧౫౨౯) రాయచూరునొద్ద ఆదిల్ శాహకును కృష్ణరాయలకును పోరుజరిగి యందు శాహ ఫరారి యయ్యెను; కాని చావలేదు. ఆతఁడు రాయలతరువాతఁగూడ బ్రతికియుండెను. కావునఁ జచ్చినవాఁడు మొదటివాఁడే యై యుండవలెను. తుదకు యుద్ధములోఁ జచ్చినను జావకున్నను, రాయ లాదేశమునీఁదికి దండెత్తిపోయినకాలమందైనను జచ్చియుండవలెను. అట్లు కానియెడల రాయలు "ఏకధాటి బళిరా! కట్టించి తౌ దృష్టికేదులఖానోగ్రకపాల మర్థపహారిద్భాజాంగలశ్రేణికిఁ" అని వ్రాసికొనుట యెప్పుడున్ను దటస్థింపదు.

ఈయూసుఫ్ ఆదిల్ ఖానుఁడె తనచావునకుఁ గొలఁదిమాసములకుఁ బూర్వము గోవాపట్టణమును గోలుపోయె నని ఫిరంగివారు వ్రాసియున్నారు. కావున నట్లే యీతఁడు రాయచూరు మొదలయినదుర్గములనుగూడఁ బోఁగొట్టుకొని యుండుట యాశ్చర్యము కాదు. అయినను ఇవన్నియు నూహలు. వీనిని గట్టిగ సిద్ధాంతీకరించుటకుఁ జరిత్రశోధకు లింకను శోధనలు చేయవలెను.

3 కలుబర్గాపై దాడి — కృష్ణరాయఁడు యవనులను గెల్చినట్లు వర్ణింపఁబడినపద్య మింకొక్కటి ఆముక్తమాల్యదలోఁ గలదు :—

సీ. సనకాదిదివిజమస్కరిఫాలగోపిచందనపుండ్రవల్లికల్నాకినాకి
సెలసి హాహాహూహూవులదండియలతంత్రి త్రెవ్వసింగిణులుగాఁ దివిచితివిచి
సప్తర్షికృత వియజ్ఝరవాలుకాలింగసమితిముచ్చెలకాళ్లఁ జమిరిచమిరి
రంభాప్రధానాప్సరఃపృథూరోజకుంభంబు లెచ్చటఁ గన్నఁబట్టిపట్టి
తిరుగుహరిపురి సురతరుసురల మరిగి, బహుళహాళహాళిభరితకల్బరిగనగర
నగరపురవరపరిబృఢ జవనయవన, పృతన భవదసి ననిఁదెగి కృష్ణరాయ.*

కృష్ణరాయలు కల్బర్గపురమును గెల్చినట్లు మనుచరిత్రమునందుఁగూడ నీక్రిందిపద్యభాగమునఁ జెప్పఁబడినది :—

ప్రళయఘనాఘనఘోషజయానక భాంకృతిభీమచపేటలుఠత్
కలుబరగీకటకక్షితిరక్షక ! ౪

ఈపద్యములను బట్టిచూడ రాయలు కల్బరిగనగరమందును నగరపురమందును తురకలను సంహరించెనని తెలియుచున్నది. కల్బరిగ అనఁగా నిప్పుడు నైజామురాజ్యమందు "గుల్బర్గా" యని పిలువఁబడునది. ఇది పూర్వము బహమనీరాజ్యమునకు రాజధాని. నగరపట్టణమనునది యిప్పుడు భీమానదికి ననతిదూరమున "నస్రతాబాద్ సాగర్" అనుపేరిట గుల్బర్గాజిల్లాలో నేయున్నది.[1] కాని యీయుద్ధ మెప్పుడు జరిగినది కనుఁగొనవలసియున్నది. ఏదులఖానుసంబంధమైన క్రిందటి పద్యమందలి విషయమును, కలుబరగను గుఱించిన యీవిషయమును ఒక్కదాడికి సంబంధించినవో లేక వేఱువేఱుదాడులకు సంబంధించినవో ? పెద్దన కలుబరగినిగుఱించిచెప్పి వేఱుగ ఏదులఖానునిగుఱించి చెప్పకపోవుటయు, ఆము

---

* ఓకృష్ణరాయా, కల్బరిగనగరమందును, నగరనగరమందును, ఉన్న తొందరపాటుగలయవన సైనికులు యుద్ధమునందు నీఖడ్గముచేఁ జచ్చి యింద్రలోకమునకుఁ బోయి యచ్చటికల్పవృక్షమున కల్లుద్రావమరిగి సనకాదిదేవమునులనొసట నున్నగోపీచందనపునామములను నాకినాకి, హాహాహూహూలనఁబడు దేవగాయకుల వీణెలు లాఁగుకొని, తీఁగలు తెగునట్లు వానిని వంచివంచి, ఆకాశగంగ యొడ్డున సప్తఋషు లిసుకతో లింగములను చేసి పూజింప వానిని తమముచ్చెలకాళ్లతో రాచిరాచి రంభమొదలయినయప్సరస లెచ్చటఁ గనఁబడిన వారి నచ్చటఁ బట్టుకొని వారికుండఁబంటికుచములను ఒత్తియొత్తి తిరుగుచుందురు.

1. The yet Remembered Ruler of a long Forgotten Empire by Mr. S. Krishnaswami Iyengar, p. 22. ఈసాగర్‌కోటపేరు బహుమనీరాజులచరిత్రములో నెన్నియోసారులు వచ్చును. ఇచ్చటఁ బెద్దదుర్గ ముండెను. కొందఱు బహమనీరాజు లిందు ఖైదుచేయఁబడిరి. ఈసంగతి యిట్లుండ పైపద్యమునకు నర్థముఁ వ్రాసినవారు నగరపురమనఁగా అయోధ్య అని వ్రాసియున్నారు ! ! !

_క్తమాల్యదలో నీరెండుపద్యములును నొకదానితరువాత నొకటి కలసియుండుట యుఁ జూడ నివి యొక్క_దాడిలోనివార్తలే యని తోఁచెడిని. అట్లయిన దీనికా లముఁ గనుఁగొనుటకు వీలుగలదు. గుల్బర్గాపట్టణమును యూసఫ్ఆదిల్ఖానుఁడు ౧౫౦౪వ సంవత్సరమునఁ బట్టుకొనెను. అది ౧౫౧౪ వఱకు ఆదిల్శాహాల స్వాధీనమం దుండెను. ఆసంవత్సరమున అమీర్బేరీద్ దానిని సాధించెను. అని యిదివఱకున్న చరిత్రములు చెప్పుచున్నవి.[1] కావున నీపట్టణము ౧౫౦౯-౧౫౧౦ లో యూసఫ్ఆదిల్ఖానుని స్వాధీనమందె యుండె ననుటకు సందేహము లేదు. ఆకాలముననే రాయలు గుల్బర్గామీఁదికిఁ బోయె నని తలఁపవలసియుండును. కాని రాయలవారు తిరుపతికి వెళ్ళినప్పు డచ్చటినుండి గుల్బర్గాకుఁ బోయివచ్చె నని రాయవాచకమునందుఁ జెప్పఁబడియున్నది :—

"కృష్ణరాయలవారు ఉత్తరాదితురకలకార్యం జయంచేసుకొని శీమకై తిరిగి తిరుపతికి రాంగా కల్యాణకలుబరిగె కోటలవారు గర్వితులై కోటమీఁద నుండి కూతలింగా ఆవార్తలు రాయలవారు విని యెదిరితెగవారిని అడుగగా మ్లే చ్ఛులతెగవారు వున్నారు గనక కోటమీఁదికై అంద్దుల మగడించ మని కలు బరెగకోట లగ్గబెట్టించి మూడుముక్కాలు ఘడియలలో కోటసాధించి ఆకో టలో వున్నయజమానుణ్ణి చేపట్టుగా పట్టుకొని అరువెలగుర్రాలవారినిన్ని గుర్రాలనున్ను ఏకవాగెగా బట్టుకొని ఆకోటకు ఠాణ్యం గుజ్జరికళ్యాణరావును వుంచి తిరుపతికి వచ్చి......" [పుట. ౬౧]

ఇదియె నిజ మనుకొనినయెడల రాయలు గుల్బర్గాను సాధించినయేఁడు ౧౫౧౪ అగును. రాయలు తిరుపతికి వెళ్లినయేఁడు శా. శ. ౧౪౩౬ అనఁగా, క్రీ. శ. ౧౫౧౪.[2] ఈసంవత్సరముననే ఆమీర్బరీద్ అన్నవాఁడు గుల్బర్గాను విజాపురమువారియొద్దనుండి తీసికొనినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. అందు వలన, బరీదు కృష్ణరాయలసాయము కోరినందుననో, లేక స్వయముగనో, యనాథుఁడయిన బహమనీరాజునకు సాయముగ రాయలు ౧౫౧౪లో వెళ్లి విజాపురమువారిని ఓడించి యుండును అని మనమూహింపవచ్చును. మహమ్మ దీయచరిత్రకారులు కృష్ణరాయనిపేరు చెప్పక బరీదే గుల్బర్గాను గెలిచినట్లు వ్రాసియుందురు.

---

1. Imperial Gazetteer of India. *Gulburga.*
2. Epigraphical Collections No. 53 to 55 of 1889.

పంచగౌడధాత్రీపదము = పంచగౌడదేశములు మొదలైనవాని ఉత్తరదేశము ; అని టీకా కారులు వ్రాసియున్నారు. ఇంతకంటె నధికస్పష్టమైన యర్థ మేమైన నిందుండి లాగవచ్చునేమో యూహింపవలెను. ఇందలి 'శకంధర' శబ్దము 'శికందర్'* అను పారసీకశబ్దమునకు సంస్కృతీకరణ మని నా తాత్పర్యము. కృష్ణదేవరాయలకా లమున గుజరాతునేలినవారిలో నొకఁడు శికందర్ అనువా డుండెను. పెద్దనచేఁ బేర్కొ నఁబడిన శకంధరుఁ డితఁడే యగునేని, రాయలు గుజరాతుమీఁదికి క్రీ. శ. ౧౫౨౬లో దండెత్తె నని చెప్పుటయే గాక, ఆయేఁడు ఫిబ్రవరి, మార్చి, యేప్రిల్ ఈ మూఁడు నెలలలో నెప్పుడో యొకప్పుడు వెళ్లెననికూడఁ జెప్పవచ్చును. ఏలనఁగా నితఁడు మూఁడు నెలలే రాజ్యము చేసెను! ఈ కాలము మన మిదివఱ కూహించిన కాలముతో సరిపోవుట లేదు. ఈ రెండు కాలములలో నేది నిజమో శోధింపవలెను.

'ఆపంచగౌడధాత్రీపదము' లోని 'ఆఙ్' అనుదానికి మనము 'మర్యాద' యనియె యర్థముతీసికొనవచ్చును. 'అభివిధి' అని తీసికొన నక్కఱ లేదు. ['ఆఙ్ మర్యాదాభివిధ్యోః' పాణిని ౨ ౧-౧౩] 'ఆపంచగౌడ' అనఁగా పంచగౌడదేశములవఱకు నని యర్థము. పంచగౌడు లనఁగా సారస్వతులు, కాన్యకుబ్జులు, మైథిలులు, గౌడులు, ఉత్కలులు. గుజరాతీలు పంచద్రావిడులలోనివారే కాని, గౌడులు కారు. కావున ఆపంచగౌడ మనఁగా గుజరాతు దేశమువఱకును అని యర్థము చేయవచ్చును. దానికి గౌడదేశము తగిలియున్నది గనుక 'ఆపంచగౌడ' పద మిచ్చట మర్యాదార్థము. ఇట్లీపద్యము కృష్ణరాయని యుత్తర (నర్మదకుత్తర) దిగ్విజయయాత్రను సూచించుచున్న దని యర్థము చేసికొనవచ్చును. ఆపంచగౌడదేశ మనఁగా నర్మదకు నుత్తరమున నున్న హిందూదేశ మనియు సాధారణముగ నర్థము చేయవచ్చును. ఇందును గురించి యింతకంటె నెక్కుడు చర్చించుటకు నిచ్చట సాధనము లేమియు లేవు.

కే. వి. లక్ష్మణరావు.

---

* 'అలెగ్జాండర్' శబ్దమును పారసీకచరిత్రకారు లందఱును 'శికందర్' అని వ్యవహరించెదరు. దీనినే సంస్కృతకవులు 'శకంధర'గా మార్చి 'శక' శబ్దమునకును దానికిని సంబంధము కల్పించి రని నాయూహ.

# బాలవ్యాకరణగుప్తార్థ ప్రకాశిక విమర్శనము.

## సంజ్ఞాపరిచ్ఛేదము 3.వ సూత్రము.

(బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారిచే రచియింపఁబడిన బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక యను గ్రంథమునందలి ద్వంద్వసమాసలక్షణమును గూర్చియు స్త్రీవాచకశబ్దార్థమును గూర్చియు, నీపరిషత్పత్రికలో నాయభిప్రాయ మిదివఱకుఁ బ్రకటించియున్నాఁడను. మఱియిప్పు డాగ్రంథము లోని సంజ్ఞాపరిచ్ఛేదాదులలోని సూత్రములకుఁ గొన్నింటికి శ్రీశాస్త్రులవారువ్రాసిన వ్యాఖ్యానము నీదిగువను విమర్శించుచున్నాఁడను.)

"రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః" అనువాగనుశాసనసూత్రంబున శకట రేఫంబును సహితము వర్ణంబులలో లెక్కించినపక్షంబున ముప్పదియే డక్షరంబు లగునని యుద్ఘోషించు నప్పకవిపుస్తకమందలి పాఠాంతరము పెక్కుంగారణము లచే సమంజసముగా నున్నది. అహోబలపతియు నిది వక్కాణించెను. తక్కిన యనాద్యవర్ణంబులభాతిని శకటరేఫంబును వర్ణంబులలోఁ బృథక్కుగాఁ బరిగ ణించుట న్యాయ్యము" అని యిట్లు గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడియున్నది. సూరిగారిమతమును బాగుగ గ్రహించియున్నచో బాలవ్యాకరణమున శకటరేఫ మును వేఱుగఁ బరిగణించుట న్యాయ్యము కా దని స్ఫురింపకపోదు. లఘుయకార వకారములను, నలఘు (శకారము) లకారమును బరిగణింపనపు డచ్చాంధ్రవర్ణ సమామ్నాయమున నలఘురేఫమును మాత్రము పరిగణింప నేల యని సూరి గారు తలంచి యుందురు. ఇట్టి యభిప్రాయము సూరిగారి కుండుటచేతనే వా రాచ్ఛికవర్ణసమామ్నాయమునఁ జేరినిన శకారము వర్ణాంతర మనియు, నలఘులకారము కాదనియు, (చూ. బాల. సంజ్ఞ. 18 సూత్రము) స్పష్టముగాఁ జెప్పియున్నారు. గుప్తార్థప్రకాశికాకారు లందులకుఁ బ్రతిఘటించిన ట్లచ్చటివ్యా ఖ్యాన వైఖరివలన విశదపడదు. అరయనరయ వీరు, సూరిగా రట్లువ్రాయుటకుఁ బయికారణము దలంచినట్లుగాని, సూరిగారి యీమతభేదమును గ్రహించినట్లు గాని తోఁపదు.

అచ్చాంధ్రవర్ణసమామ్నాయములోని శకార మలఘువు కాదనునభిప్రా యము చింతామణి కున్నట్లు వ్యాఖ్యానము చేసియుండనందునఁ దద్వివరణకర్త లగునప్పకవ్యహోబలపండితాదుల లఘులకారమువలె నలఘురేఫము నేల వర్ణ

సమామ్నాయములోఁ జేర్పరా దనియు నుచ్చారణమునందును, లేఖనమునం దును నంతగా భేద మగపడని లఘుయవలను జేర్పకున్న క్షతి లేదనియుఁ దలంచి కావలయు, నలఘురేఫమును వర్ణాంతరముగాఁ జేర్చుట యుచిత మని వ్రాసిరి. గుప్తార్థప్రకాశికాకారు లాచర్యలను జూచి తాము మాత్ర మట్లేల చేయరా దని యెంచి చర్చించిరేగాని యీసందర్భమున సూరిగారికిని జింతామణివ్యాఖ్యాతలకును గలమతభేదమును గ్రహింపఁజాలరైరి.

పయిరీతిని మతభేదములను గ్రహింపలేక శ్రీశాస్త్రులవారు పొరపడిరని వారికి సంపూర్ణసామ్యము గలస్థలాంతరమందలివ్రాఁత విశదపఱుపఁగలదు.

“ యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు. రేఫంబులు పొరయవు ” (బాల, ప్రకీర్ణ, 24 సూత్ర) అను సూరిగారిసూత్రమునకు వ్యాఖ్యానము చేయుటలో శ్రీశాస్త్రులవారు సూరిగారిమతమున నలఘువులుగాని (పళ్లులు, పాళులు, త్రాళ్లు లని బహుత్వమందు రలడల కాదేశమయిన లకార మలఘువు, తల, నెల యిత్యాదులందలి ళకారము లఘువు........వర్ణసమామ్నాయమందలిళకారము వర్ణాంతరముగాని యలఘుళకారము గాదని యెఱుంగునది ” బాల, సంజ్ఞ, 18 సూ) తళతళ వళావళి మున్నగునచ్చాంధ్ర పదములలోని ళకారములకును లఘులకారమునకును గలయతిప్రాసమైత్రి నుదాహరించిరి. ఈసందర్భమున వీరు “ బెళుకుంజూపులు, తళుకుంజెక్కులు, పొలఁతి, చెలువ, ఇత్యాదౌ లకారస్య ద్వైవిధ్యమ్ ” అను నహోబలపండితీయ వాక్యాదులను జూచి యిట్లుదాహరించి రనుట స్పష్టము. శ్రీశాస్త్రులవారికే సూరిగారిమతభేదము తెలియ వచ్చియున్నయెడల నట్టియలక్ష్యములను లక్ష్యములుగఁ జేయక

క. “ ఎల్లెడఁ బరదేశులకును, గుళ్లుంబంచలును రచ్చకొట్టంబులు నం
గళ్లును గాక తలంపఁగఁ, జల్లని సున్నంపు మల్లెసాలలు గలవే ”

(శంకరకవి, హరిశ్చంద్రోపాఖ్యానము 4 ఆ. 193 పద్యము) అను మొదలగు వానివంటిలక్ష్యములను జూపియుండరాదా ? కావున సూరిగారిసిద్ధాంతము శ్రీశాస్త్రులవారిచిత్తపంకజాతకళికలోఁ బ్రవేశింపఁజాలదయ్యె ననియు, సూరిగారిమతమున శకటరేఫమును వర్ణాంతరముగాఁ బరిగణింపకుండుటయే న్యాయ్యమనియుఁ జదువరులు గ్రహింతురుగాక.

—♦ బాల-సంజ్ఞ-4 సూత్రపువ్యాఖ్య. ♦—

“ అనుస్వారస్య యయి పరసవర్ణః ” అనుపాణినిసూత్రము చెప్పిన

సంస్కృతపదమధ్యమునం దనుస్వారమునకుఁ బరసవర్ణాదేశము నిత్యమయియు న్నది. అట్లయినను నట్టిసంస్కృతశబ్దంబులు తెనుఁగులోనికి వచ్చునపుడు వాని యందు బిందువున్నైతము నిలువ వచ్చునని వాడుక ననుసరించి యాంధ్రికవు లం గీకరించిరి. కావుననే 'బంగరు, ముష్టింగొని' అనుమొదలగువానికిఁ బ్రాసము సంఘటించుచున్నది.

గీ. జ్ఞానవేద్యాయ తప్తకాంచనవిభూష, ణాయ మేచకవర్ణకంఠప్రియాయ,
నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత, మనసిజాతాయ గోపడింభాయయనఁగ.

అని యిట్లనుకృతిచేసి తెనుఁగులో శుద్ధసంస్కృతపదములను వాడుక చేసినపుడున్నైత మప్పకవి 'కాంచన, కంఠాదిశబ్దములలో ననుస్వారము గల దని' యంగీకరించియే పయిపద్యమును బిందుయతి కుదాహరించి యున్నాఁడు. అప్పకవివలెనే ప్రాచీనుఁ డగువిన్నకోట పెద్దనార్యుఁడును నట్టిసంస్కృతపదము లలో ననుస్వారము గలదని యభిప్రాయపడి యీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

గీ. టతపవర్గాక్షరములకు డాపలించి, యొనర నూఁదినబిందువు లుండెనేని
వరుస ణనమలు వళులగువానికెల్ల, నవనిఁగొందఱుసుకవులయనుమతమున.

చ. కినుకఁ జళుక్యవిశ్వనృపకేసరి చేసినచోఁ గృపాణదం
డనమునఁ గల్గుఁబో సురగణత్వము తత్పదవారిజాతవం
దనమునఁ గల్గుఁబో మనుజనాథత తద్బటదర్శనావలం
బనమునఁ గల్గుఁబో గహనమధ్యనివాసము వైరికోటికిన్. (కా. చూ. 1 ఉ.)

పయిరీతిని బయిపద్యమునం దున్న "దండనము, వందనము, అవలంబ నము" ననుసంస్కృతసమపదములం దూఁదినబిందువు లనఁగా నిండుసున్న లున్న వని పెద్దనార్యుఁ డంగీకరించియున్నాఁడు.

గీ. భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ, ణాకునిటనాల్గుఁజెల్లుఁబాండవసహాయ
నాకు నిటనాల్గుఁజెల్లుఁగందర్పజనక, మాకునిటనాల్గుఁజెల్లుసంపదలరాజ.
(అనంతచ్ఛందస్సు. 1 ఆ.)

పయిపద్యమునందలి 'పాండవ, కందర్పాది' శబ్దములలో నిండుసున్న లున్నవని ప్రాచీనుఁ డగుననంతుఁ డభిప్రాయపడి యున్నాఁడు.

సీ. ......"కలశమంబుమగ్నముగఁజేయుచప్పుడు" (రాఘవపాం. 1 ఆ. 19 ప.)

పయిపద్యభాగమునందు రామాయణార్థమున జలవాచకమగు "అంబు" శబ్దమును, భారతార్థమున "శమంబు" అనుతత్సమపదమును జోడింపఁబడినవి.

అందు 'శమంబు' అనుప్రథమావిభక్తిరూపమున "ముపర్ణకమునకు మూము డిమేని బిందుపూర్వకబువర్ణకంబేని విభాష నగు" (బాల-తత్స-42 సూ.) అను చొప్పున బిందువే గల దని యంగీకరింపక తప్పదు. అట్టిదానితో నర్థాంతరమున జోడింపఁబడిన "అంబు" అనుజలవాచక సంస్కృతపదమునందును బిందువే గలదని యంగీకరింపక తప్పదుగదా.

పయి నుదాహరించిన ప్రమాణములు, సంస్కృతపదములు తెనుఁగులో వాడఁబడునపుడు వానియందలి యనుస్వారమునకు. సంస్కృతవ్యాకరణముచే నిత్యముగా రావలసిన పరసవర్ణాదేశము రాకపోవచ్చు ననియు నచట బిందువు సైత ముండవచ్చు ననియుఁబ్రాచీను లభిప్రాయపడినట్లు విశదపఱుచుచున్నవి ,అట్ల యినను బయిప్రమాణము లట్టిసంస్కృతపదములలోని బిందువునకుఁ బరసవర్ణాదేశము రానే రాదని మాత్రము నిరూపింపఁ జాలవు. కాఁబట్టి సంస్కృతపదములలో బిందువును బరసవర్ణాదేశమును నైచ్ఛికములై నిలుచుచుండు నని తేలుచున్నది. కావుననే "అక్కుందళితే త్యత్ర అనుస్వారస్య యయి పరసవర్ణః ఇతి సాధుత్వ మూహ్యమ్" అని యి ట్లహోబలపతి పరసవర్ణాదేశమును సైతము "కందళిత" యనుసంస్కృతశబ్దములోని యనుస్వారమున కుండు నని యభిప్రాయపడి యున్నాఁడు. పైసందర్భమునుబట్టి సంస్కృతపదములలో ననుస్వారము నిల్చినను నిలువవచ్చు ననియు, లేదా దానికి బరసవర్ణాదేశము వచ్చినను రావచ్చు ననియు నాంధ్రపండితుల సిద్ధాంత మని విశదమగుచున్నది. ఇట్టిసిద్ధాంతము ననుసరించియే కావలయును సూరిగారు బాలవ్యాకరణములోని సంజ్ఞాపరిచ్ఛేదమునందలి నాల్గవసూత్రమున 'కంఠము, మండము' ననువానినడుమ ననుస్వారమునె నిల్పియు, ఙకారోదాహరణముగాఁ 'పఙ్క్తి' శబ్దము నుదాహరించిరి. ఙకారమునకు 'శార్ఙ్గము' మొదలగు నిర్వివాదము లగునుదాహరణము లుండఁగా నీ 'పఙ్క్తి' శబ్దము నుదాహరించుట యనుస్వారపరసవర్ణము లైచ్ఛికములై యుండ నగు ననుస్వాభిప్రాయమును వెల్లడించుటకే యని తోఁచుచున్నది.

పయిసూత్రమునకు వ్యాఖ్యానముచేయునపుడు శ్రీసుంకరి రంగయ్యగారి సంబంధముచేతఁ గావలయు శ్రీశాస్త్రులవారు విపరీతార్థములను జేయలేదు. కాని వారు తమకు సంపూర్ణస్వామ్యముగల సొంతభాగములోమాత్ర మీవిషయమునఁ గేవలము విపరీతాశయులైరి.

పయి నుదాహరించినరీతిని దెనుఁగులోనికి వచ్చునపుడు సంస్కృతపదము లనడుమ నున్నయనుస్వారమునకుఁ బరసవర్ణాదేశ మైచ్ఛిక మనువిషయమును గ్రహింపక శ్రీశాస్త్రులవారు బాలవ్యాకరణములోని ప్రకీర్ణపరిచ్ఛేదమునందుఁ బూర్ణానుస్వారమునుగుఱించి చర్చించుసందర్భమునఁ దొలుదొల్తఁ బరసవర్ణాదేశము నిత్యమె యనియభిప్రాయపడి "అఙ్కము, వంక" అను మొదలగువానికిఁ బ్రాసము చెల్లుటకయి ప్రాసములో నట్టివైషమ్యము గ్రాహ్యమె యని సిద్ధాంతముచేయుచు " అనఁగా, నేకానునాసిక్యంబును ద్విగుణకంఠ్యత్వంబును గల 'ఙ్క' యనుశబ్దముకంటె నేకానునాసిక్యంబును నేకకంఠ్యత్వధర్మంబును గల 'ంక' యనుశబ్దం బొకకంఠ్యత్వధర్మంబునఁ దక్కువ యగుట స్పష్టపడుచుండును గాన నిట నెట్లు ప్రాసంబుచెల్లునని యాధునికు లగుకొందఱి తాత్పర్యము కాని యిచ్చటఁ గంఠ్యద్విత్వంబులో నొక్కటి తగ్గినంతమాత్రమునఁ బ్రాసభంగము రానేరదనియే పూర్వులయభిప్రాయము." (ఆపూర్వు లెవ్వరో ?) (బాల-వ్యాక- గుప్తా. ప్రకా. 326 పుట) అని యిట్లు వ్రాసిరి. పయి నుదాహరించినరీతిని " అంకము" మొదలగువానిలో " వంక " మొదలగువానియందువలెనే పాక్షిక మగునను స్వారము గల దన్నిదె ప్రాచీను లభిప్రాయపడి రనియు శ్రీశాస్త్రులవా రనుకొన్నట్లు ప్రాసములం దట్టివైషమ్యమును బ్రాచీను లంగీకరింప లేదనియు మఱియు నిచట నట్లంగీకరింపవలసిన ప్రసక్తియే లే దనియు విశద మగుచున్నది గదా. మఱియు వీరి యానూతనసిద్ధాంతమునుబట్టి " శంక, దొంగ " యను మొదలగువానియందును నానునాసిక్యకంఠ్యత్వములకు శ్రీశాస్త్రులవా రంగీకరించినవైషమ్యము మాత్రమే యుండుటచే వానికిసైతము ప్రాసము చెల్లవచ్చునని తేలఁగలదు. ఇది కేవల మసంగతమని శ్రీశాస్త్రులవారుసైత మంగీకరింతురని నానమ్మకము.

ఇంక శ్రీశాస్త్రులవా రట్లుచేసిన తమయావర్గపంచమాదేశనిత్యతావాదమం దరుచిపూని కావలయుఁ దుదకుఁ బరసవర్ణశాస్త్రమును నిరాకరించి సంస్కృతపదమధ్యమున బిందువే నిత్యముగా నిలుచు నని చర్చించిరి. అట్టిబిందువునకుఁ బాణినీయులు విధించువర్గపంచమవర్ణంబులు పంచమవర్ణంబులే యనియుఁ, బలుపుట్టువులే యనియు నిట్లు దవ్వర్థిగా నేమేమో గొప్పయుక్తులు చెప్పి (బాల-గుప్తా-ప్రకా. 370 పుట.) వానిని బహిష్కరించిరి.

పయిరీతిని సంస్కృతపదమధ్యమునందలి యనుస్వారమునకుఁ బరసవర్ణాదేశము వచ్చిన నిత్యముగానే రావలయు ననియు, లేదా రానే రాదనియు నభిప్రా

యు నప్పకవినాఁటికి "రాజు" అనుతత్సమపదములోని జకారము దంత్యమను వైయాకరణసిద్ధాంతమే లేదు. కాఁబట్టి యాయనకు శాస్త్రులవారివలె రాజుఁడుశబ్దమును సృజించుకొనవలసిన ప్రసక్తియే లేదు.

విశేష్యార్థకమయి సుప్రసిద్ధమై యున్న రాజుశబ్దములోని జకారము తాలవ్యమే యనియు నకారాంతరణమున రాఘవపాండవీయ ప్రయోగమునకు బాధలేదనియు నప్పకవి యభిప్రాయము. అట్టిజకారము దంత్య మనియు రాజుఁడుశబ్దములోని జకారము తాలవ్యమనియుఁ బింగళి సూరన ప్రయోగములోని 'రాజ' అనుసంబోధన మీరాజుఁడుశబ్దసంబంధమైనదిగాన బాధ లేదనియు శాస్త్రులవారి యభిప్రాయము. ఇట్టిస్థితిలో వీ రప్పకవిమతమును స్వవాదోపష్టంభకముగా నెట్లు తలంచిరో తెలియకున్నది.

—◆ బాల. సంజ్ఞ. 11వ సూత్రవువ్యాఖ్య. ◆—

"కేవలనకారంబు ద్రుతనామంబున సామాన్యంబుగా వాడఁబడుచున్నను బ్రత్యయంబును, (ఫలమును, నేను, వెళ్లుచున్నాను) ఆగమంబును (వానిచేతను, చేయుచును, మమ్మును) అవ్యయంబును (అపుడును, మఱియును, అన్నయును) నైనయుకారాంతనకారంబే ద్రుతసంజ్ఞగలది యనిచెప్పుట యుక్తము" అని సుప్తార్థప్రకాశికాకారులు (బాల. సు. ప్ర. 7 పుట) వ్రాసియున్నారు. ఈ విషయమును వీరు "ప్రత్యయాగమావ్యయాత్మకంబై యుత్వవిశిష్టమైననకారంబు ద్రుతసంజ్ఞికం బనియర్థము" అనుప్రౌఢవ్యాకరణ గ్రంథమునుజూచి సంగ్రహించిరని చెప్పవచ్చును. "చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు" (బాల. క్రియా. 43 సూ.) అనుసూత్రముచే 'చును' అనునదెల్లఁ బ్రత్యయమె యైయుండఁగా 'చేయుచును' అనుదానిలోని 'ను' అనునది యాగమమని సుప్తార్థప్రకాశికాకారు లెట్లు తలంచిరో తెలియరాకున్నది. దానిమాట యటుండనిండు. పై నుదాహరించినరీతిని వీరు ప్రౌఢవ్యాకరణసిద్ధాంతమును స్వసిద్ధాంతముగా నుదాహరించియు "కన్ను" శబ్దములోనినకారము ద్రుతమని భ్రమించి వ్రాయుట యెంతయు వింతగానున్నది. కన్ను శబ్దములోని నకారము ప్రత్యయాగమావ్యయములలో నేదియుఁ గాదుగదా. అట్టిస్థితిలో "కన్ను + దోయి) ఇట్లుండఁ బ్రకీర్ణకపరిచ్ఛేదములోని యేడవసూత్రంబున ద్విత్వనకారలోపంబు గలిగి 'కనుదోయి' అగును. ప్రకీర్ణకపరిచ్ఛేదములోని పద్దునాలవసూత్రంబున 'కను' శబ్దముయొక్క ఉకారమునకు లోపమురాఁగా 'క +

దోయి ' అగును. ఇప్పుడీసంధి పరిచ్ఛేదములోని పదునేడవసూత్రంబున నీద్రుతంబునకు.........." (బా. గు. ప్ర. 43 పుట) అని యిట్లు ప్రక్రియచూపి కన్నుశబ్దపు సంక్షేపరూప మగు " కన్ " అనుదానిలోని ప్రకృతిసిద్ధమగునకారమును ద్రుతమని వ్రాయుటకు గుప్తార్థప్రకాశికాకారు లెట్లుసాహసించిరో తెలియరాకున్నది. వీరు సాధించినప్రక్రియచొప్పుననే సిద్ధించిన ' మిన్ను ' శబ్దంబులోని ' మిన్ ' అనుదానిని గళగాభావించి సూరిగారు ' మిన్వీడె ' అని యాత్రకీర్ణకపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రమందే యుదాహరించుటనైన గమనింపకుండుట మిక్కిలి శోచనీయము. సమాసములో నాగమముగా వచ్చిన ద్రుతముతోఁ గూడియున్నకన్నుందోయిపదముయొక్క సంక్షేపరూప మగుకందోయి శబ్దమునందలినకార మాగమనకారము కానోపునని తలఁచి సూరిగారు సంధిపరిచ్ఛేదమున 19-22 సూత్రములలో " కందోయి " అనుదాని నుదాహరించియుందురు. ఇట్టిప్రక్రియను ప్రౌఢవ్యాకరణకర్తగారు శబ్దరత్నాకరమున " వీని " శబ్దమునొద్ద విశదపఱిచియున్నారు. ఇట్టిప్రక్రియను గ్రహింపఁజాలనందున గుప్తార్థప్రకాశికాకారు లట్టిప్రమాదమునకుఁ బాల్పడవలసి వచ్చెనని తోఁచుచున్నది.

—♦ బాల. సంజ్ఞ. 12 సూత్రపువ్యాఖ్య. ♦—

పయిరీతిని గుప్తార్థప్రకాశికాకారులవంటి వారు ప్రమాదపడుదురని తలఁచియే యప్పకవి ప్రకృతిసంబంధమయిన నకారము ద్రుతము కానేరదని స్పష్టముగాఁ జెప్పి యనేకోదాహరణముల నిచ్చియున్నాఁడు.

గీ. గూను నెమ్మేను మొగనాను మీను పేను
మాను వరిచేను పులిబోను మఱియు నిట్లు
భువి నకారంబుతోఁ గూడఁ బుట్టుశబ్ద
ములు ద్రుతప్రకృతులు గావు మునిశరణ్య.

గీ. అన్ను బంగరుపొన్ను చాయయగుతెన్ను
చెన్ను పులిజున్ను దొరపన్ను జొన్నయెన్ను
మొదలుగా జడ్డలు నకారములకుఁ దుదిని,
దనరుపదములు గావు ద్రుతప్రకృతులు.

గీ. తన్ను నిన్ను నన్ను విన్ను మున్నో మిన్ను
చన్ను కన్ను వెన్ను శబ్దములకు
జడ్డ లుండుఁ బోవుఁ జర్చింప నివి ద్రుత
ప్రకృతు లెపుడు గావు భక్తసులభ. (అప్ప. 5 ఆ.)

పైదానిచొప్పునఁ గన్నుశబ్దములోలి నకారముగాని కనుశబ్దములోని నకారముగాని ద్రుతములు కానేరదని స్పష్టపడుచున్నది గదా. పయిపద్యముల సందర్భమును బాగుగాఁ బరిశీలించి యర్థము చేసికొనఁజాలక గుప్తార్థప్రకాశికా కారులు పైవానిలోని మూఁడవపద్యము నుదాహరించి " తన్ను, నిన్ను, నన్ను, శబ్దంబులు ద్వితీయాంతంబులు ; కావున గ్రుతప్రకృతికంబులు, పైపద్యములో నప్పకవి కళాశబ్దంబులలోఁ బరిగణించుట కవిరభసహేతుకంబు " అని తాము భ్రమించి యప్పకవి ప్రమాదపడినట్లు వ్రాసియున్నారు. " తన్నుక్, తనుక్ " అనువానిలోని తుదినకారము ద్రుతము కాదని యప్పకవి పైపద్యములోఁ జెప్పియుండలేదు. " తన్ను, తను " అనువానిలోని ప్రత్యయాగమేతరమగు శబ్దసంబంధ మయిననకారము ద్రుతము కాదని చెప్పియున్నాఁడు. అట్టినిర్వివాదమగు నప్పకవియసందర్భ మెట్లు కవిరభసహేతుకమగునో తెలియరాకున్నది. ' కన్ను ' శబ్దములోనినకారమును సైతము ద్రుతముగా భావించిన గుప్తార్థప్రకాశికాకారుల కదిరభసహేతుకమయిన నగుఁగాక.

—♦ బాల. సంజ్ఞ. 15 సూత్రపువ్యాఖ్య. ♦—

" దీర్ఘాక్షరము తరువాతను నుండునున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయునుగాని వ్యాకరణముచేత నిండునున్న రానేరదు. అరసున్న శాస్త్రముచేత రావచ్చును. ఉ. " తాఁజెప్పె " వాఁడు........" అని యిట్లు గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడియున్నది, " తేంట్లు, గోంట్లు, వేఁటకాండ్రు " మొదలగు శబ్దములలోని నిండునున్నలు వ్యాకరణముచేతనే వచ్చినవనియు నవి శబ్దముయొక్క పుట్టుకలో లేనేలేవనియు వేఱ చెప్పనక్కఱలేదుగదా. వేయేల పైరూపములను సాధించు బాలవ్యాకరణములోని యాచ్ఛికపరిచ్ఛేదమునందలి 15,7 మొదలగుసూత్రములకు గుప్తార్థప్రకాశికాకారులు వ్యాఖ్యవ్రాయ లేదా ? ఇట్టి విషయములను జ్ఞప్తికిఁ దెచ్చికొనక " వ్యాకరణముచేత నిండునున్న రానేరదు " అని యిట్లు పైరీతిని గుప్తార్థప్రకాశికాకారులు వ్రాయుట యెంతయు వింతగానున్నది. " దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు " అనుసూత్రము ఖండపూర్ణభేదము లేక సామాన్యముగా బిందువును విధించు " జిత్తుబిందుపూర్వకంబగు " (తత్స. 19 సూ.) అను మొదలగు సామాన్యబిందువిధానస్థలములందు మాత్ర ముపచరించునది యని గుప్తార్థప్రకాశికాకారులు గ్రహింపలేకుండుట శోచనీయము.

—• బాల. సంజ్ఞ. 23 సూత్రపువ్యాఖ్య. •—

"కలికంఠుఁడు, ప్రాణగొడ్డము జీవగఱ్ఱ, కపిలగడ్డము" మున్నగుప్రయోగములు గ్రామ్యములయినను సాధువులని సూరిగారి యభిప్రాయము. కాని త్రిలింగలక్షణమందు నయ్యవి గ్రామ్యములుకాక తద్భవంబులే యని చెప్పంబడినవి. ఎట్లన, గరకంఠ శబ్దభవము "కలికంఠుఁడు" అని యిట్లు గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడి యున్నది. ఈవ్రాఁతనుబట్టి చూచునపుడు వీరికిఁ త్రిలింగలక్షణ శేష గ్రంథము సరిగా నర్థము కాలేదనియు నకారణమున సీతారామాచార్యుల వారిమతము వీరిబుద్ధి కెక్కలేదనియు విశదపడకపోదు. త్రిలింగలక్షణ శేషములో "కలికంఠుఁడు" అనుపదము "గరకంఠుఁడు" అనుశబ్దముయొక్క వికృతి యనిమాత్రమె యున్నదిగాని "కలికంఠుఁడు" అనునది యనింద్యగ్రామ్యము కాదని చెప్పఁబడియుండలేదు. "ప్రాణగొడ్డము" అనునది "ప్రాణకుట్టకము" అనుదానికి వికృతియనియు నక్కారణమున నయ్యది గ్రామ్యము కానేరదనియుఁ త్రిలింగలక్షణ శేషములో "ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాదఁగు. ఇయ్యది ప్రాణ కుట్టకశబ్దభవము" (ప్రౌఢ. సంజ్ఞ. 12 సూ.) అని యిట్లు వ్రాయఁబడియున్నది. దీనినిజూచియు "కలికంఠుఁడు, గరకంఠశబ్దభవము" (ప్రౌఢ. సంజ్ఞ. 9 సూ) అనువాక్యమును జూచియు శ్రీగుప్తార్థప్రకాశికాకారులు తొందరపడి "ప్రాణ గొడ్డము" అనుదానివలెనే "కలికంఠుఁడు" అనుదానిని నయిత మగ్రామ్య మునుగాఁ త్రిలింగలక్షణ శేషకర్త చెప్పినట్లు భ్రమించిరేకాని సీతారామాచార్యులవా రందు "ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాదఁగు" అనిచెప్పినట్లు "కలికంఠుఁ డగ్రామ్యము" అని చెప్పియుండలేదు. "కలికంఠుఁడు" అనునది గర కంఠశబ్దభవ మనిమాత్రము చెప్పియున్నారు. అట్లు తద్భవము లని చెప్పుటచే "కలికంఠుఁడు, ప్రాణగొడ్డము" అను వానికి సామాసికగ్రామ్యత పోయినది. వానిలో "ప్రాణగొడ్డము" అనుపదమునందు మఱేవిధమయిన గ్రామ్యతయు లేనందున నది యగ్రామ్యమని వ్రాసిరి. "కలికంఠుఁడు" అనుశబ్దమునందన్ననో తద్భవకల్పనచే సామాసికగ్రామ్యత వారించినను నం దనాంధ్రాక్షర మగు ళకార ముండుటచే నద్దానికి గ్రామ్యత వారింపలేదు. తద్భవపదములలో వర్గ యుక్కు లుండరాదు గదా. ఆకారణముచేతనే యది గ్రామ్యమే యయినను "జీవగఱ్ఱ" పదమువలెనే మహాకవిప్రయుక్త మగుటచే ననింద్యగ్రామ్య మని త్రిలింగలక్షణశేషకర్త యభిప్రాయముగాని "ప్రాణగొడ్డము" అనుపదమువలె

నది యగ్రామ్యమని యభిప్రాయముకాదు. కావుననే త్రిలింగలక్షణశేషకర్త తాను రచించినశబ్దరత్నాకరకోశమునందు, "జీవగఱ్ఱ" "కఱకంఠుఁడు" అనుశబ్దములయొద్ద 'అనింద్య' గ్రామ్యములనుటకు సంజ్ఞగా సంజ్ఞావివరణపట్టికలోఁ జెప్పినరీతిని "గ్రా" అని వ్రాసియున్నాఁడు. "ప్రాణగొడ్డము" అను శబ్దమునొద్ద నట్లు "గ్రా" అనుదానిని వ్రాయలేదు.

ఇఁక "కపిలగడ్డము, కపిలకన్నులు, కపిలజడలు" అనునవి యనింద్య గ్రామ్యములని సూరిగారియభిప్రాయము. అవి నింద్యగ్రామ్యములని త్రిలింగలక్షణశేషకర్తయాశయము. పైకారణములచే "ప్రాణగొడ్డము" అనుదానికిఁ దద్భవకల్పనచే గ్రామ్యత వారించినట్లె "కఱకంఠుఁడు" మున్నగువానికిని దద్భవకల్పనచే గ్రామ్యత వారించినట్లును, నొక 'జీవగఱ్ఱ' శబ్దమునకుమాత్ర మట్లువారించుట కవకాశము లేకపోయినట్లును గుప్తార్థప్రకాశికాకారు లభిప్రాయపడి "జీవగఱ్ఱ నీరీతిగా గ్రామ్యంబు గాకుండఁజేయుటకుఁ దగినయాధారం బేమియుఁ గానంబడదు" అనివ్రాయుట యెంతయు నసంగతముగా నున్నదనుటకు సందేహము లేదు.

వఝల చినసీతారామస్వామిశాస్త్రి.

# తోడరమల్లు.

---

"తోడరమల్ల" నామము హిందూదేశచరిత్రమును జదివినవారి కంతయుఁ దెలిసియే యుండును. ఈనామ మెచ్చట నగపడినను ఢిల్లీచక్రవర్తులలోఁ బ్రఖ్యాతుఁ డైన అక్బరు నాస్థానియందలి సేనాపతి యని యన్వయము చేసికొనుచున్నారు. పరిశీలించిచూచిన నీపేరు గలవా రనేకులు గల రనియు వారిలోఁ గొందఱు దక్షిణహిందూదేశపువా రనియుఁ దెలియఁగలదు. అక్బరుకాలము నందే యాతనిసేనాధిపతిగాక వేఱొకతోడరమల్లు కూడ నుత్తరహిందూదేశమున నే యుండినట్లు తెలియుచున్నది. ఈ రెండవతోడరమల్లే సుప్రసిద్ధుఁడయి హిందీ రామాయణము వ్రాసిన తులసీదాసుగారి కీర్తనములయందుఁ బేర్కొనఁబడి యున్నాఁడు. వీరిద్దఱు నొకఁడే యని యనేకుల యభిప్రాయము గాని యిప్పటిచరిత్రకారులమతమున భిన్నపురుషులు. అక్బరుసేనాధిపతి యగుతోడరమల్లు యొక్క పుత్రుఁడు గొప్పగీర్వాణభాషావిద్వాంసుఁడును గవియు. ఈయన వ్రాసిన సంస్కృతనాటక మొకటి సంస్కృతకావ్యమాలలో ముద్రింపఁబడి యున్నది.

ఇఁక నీతోడరమల్ల శబ్దముయొక్క యర్థవిచారముఁ గొంత గావించెదము. అనేకులమతమున నీశబ్ద మొకపురుషవాచకము, కాని, యిది యొకబిరుదముగాఁ గన్పట్టుచున్నది. 'తోడర' శబ్దము కావ్యములయం దచ్చటచ్చటఁ బ్రయోగింపఁబడియున్నది. విజయనగరచక్రవర్తులలో మొదటివంశమైన హరిహరవంశమునందలి ప్రౌఢదేవరాయల కుమారుఁడైన మల్లికార్జునరాయలకాలములో నాయన యాస్థానియందలి కవులలో నొక్కఁడగు గంగాధరకవిచే రచింపఁబడిన "గంగాదాసప్రతాపవిలాసము"న నీశబ్దము తెనుఁగుప్రబంధములయం దచ్చటచ్చట నగపడు గండపెండేరశబ్దమునకుఁ బర్యాయపదముగా నున్నది. కృష్ణరాయలు 'బిరుదైనకవిగండపెండేరము'ను గవిపెద్దనకాలిలో నెట్లు తొడిగెనో యాప్రకారమే యీనాట్యకారుని కాలియందీబిరుదతోడరమును ప్రౌఢదేవరాయలు తొడిగిరఁట. దీనితో నీకవి ఘూర్జరసింహాసనాధిపతియు అహ్మదాబాదనగరప్రభువునగు బహదూరుషా యాస్థానమునందును చంపకపురపురందరుఁ డగుగంగాదాసభూవల్లభుని సభయందును దిగ్విజయ మొనర్చెను. కృష్ణదేవరాయల చరిత్రమును

గూర్చిన పురాతనగద్యకావ్య మగు 'రాయవాచకము' నందు కృష్ణరాయలకు గజపతి కన్యాదాన మొనర్చినపిదప అశ్వపతి, గజపతి, నరపతులప్రతిమలు గలిగినగండపెండేరమును దొడిగె నని యున్నది. ఈప్రకారమే 'గంగాదాసప్రతాపవిలాసకర్త' కాలియందలి బిరుదతోడరము 'రిపునాట్యకారకవిపుత్తలాంకిత' మని చెప్పఁబడియున్నది. వీని నన్నిటిని జూచిన తోడరమల్లశబ్దము కేవలము బిరుదవాచకము గాని యొక్కరి నామధేయముగాదు.*

ఇఁక దక్షిణహిందూదేశమందలి తోడరమల్లుల విషయముఁ గొంత చర్చించెదము. అక్బరున కించుమించుగ సమకాలీనుఁడైన విజయనగరచక్రవర్తి యగు నళియరామరాయల యాస్థానమునందలి కొందఱు గొప్పసరదారుల కీబిరుద ముండెను. వీరిలో ముఖ్యులు తోడరమల్లకల్లినాథుఁడు లేక కల్లీశ్వరుఁడును, తోడరమల్లరామయామాత్యుఁడును. వీరిద్దఱును గొప్పవిద్వాంసులును బంధువులును. వీరు వ్రాసినగ్రంథములు కొన్ని నేఁటికిని తంజాపురరాజసౌధ సరస్వతీభాండారమున నున్నవి. వీనిలో ముఖ్యము తోడరమల్లరామయామాత్యుఁడు రచించిన "స్వరమేళకళానిధి."[1] దీనిప్రస్తావమం దీకవి తనయొక్కయుఁ దనపోషకుఁడైన యళియరామరాయలయొక్కయు చరిత్రము గొంత వెలువఱిచినాఁడు. రాయలతమ్ముఁడైన వేంకటాద్రిభూపాలుఁడు సంగీతశాస్త్రములో నాకాలమునం దుండిన మతభేదముల నన్నింటిని దెలియఁబఱిచి వాని తారతమ్య మేర్పఱుప నీకవిని వేఁడెను. ఆసందర్భమున నీకవి యాకాలమునందలి సంగీతవిద్వాంసులలో 'శాస్త్రము'ను 'ప్రయోగము'నుఁ గూడ సమానముగా నెఱిఁగి వీణావాదనమునం దాఱితేఱిన వాఁడని చెప్పెను. ఇది యుఁగాక రామరాయల కీకవి విజయనగరరాజధానియం దనేకవిధములైన ఫలపుష్పతరువుల చేతను, జలయంత్రముల చేతను సువర్ణప్రతిమలచేత నలంకరింపఁబడిన యుద్యానముగలిగిన 'రత్నకూట' మనెడి ప్రాసాదమును నిర్మించె నఁట. కొండవీటిరాజ్యమునకు రాజప్రతినిధిగఁ

---

* కిట్టెలుమహాశయుఁడు సమకూర్చిన కర్ణాటాంగ్లేయనిఘంటువులో తోడరుశబ్దమునకు (a chain or other badge of honour) అనఁగా బిరుదశృంఖల మని యర్థము వ్రాయఁబడినది. కర్ణాటకశబ్దమణిదర్పణమందలి ధాతుపాఠములో "తోడర్ బంధనే" యనియున్నది.వీనినిబట్టి కన్నడములో తోడరనఁగాఁ గాలికిఁ గట్టుబిరుదచిహ్న మని తేలుచున్నది. కన్నడమునుండియే యీమాట హిందీలోనికిఁ బోయియుండవచ్చును. తోడరునకు తోడరు రూపాంతరము. (జ.రా.)

1. పరిషద్గ్రంథాలయములోఁగూడ నొకప్రతి గలదు.

గూడఁ గొన్నిసంవత్సరము లుండెను. ఇట్టియనుగ్రహమునకుఁ బ్రతీకారముగ నీకవి 'స్వరమేళకళానిధి' నారాజేంద్రున కంకిత మిడెను.

వీరిద్దఱుఁ గాక రామరాయలకాలముననే వేఱొక తోడరుమల్లుకూడ నుండినట్లు తెలియుచున్నది. 'వాహినీపతీయ'మను నామాంతరము గల "క్రతుప్రాయశ్చిత్త"మనుగ్రంథ మొకటి మదరాసు ఓరియంటల్ లైబ్రరీలో నున్నది. దీనికర్తపే రొకచో 'తోటమల్లు' డనియు వేఱొకచోట 'తోడరమల్లుఁ" డనియు నగపడుచున్నది. ఈకాలముననందే విజయనగరరాజధానియందే వెలువడిన 'వాసంతికాపరిణయ'మనుసంస్కృతనాటకమున నొకవాహినీపతి పేర్కొనఁబడియున్నాఁడు.

ఈవాసంతికాపరిణయకర్త యాకాలమునందు విజయనగరసంస్థానమున సుప్రసిద్ధమగు శ్రీవైష్ణవమఠములలో నొకటగు నహోబలమఠమునందలి యేడవస్వాములవారు. తమనాటకప్రస్తావనయందు సూత్రధారుఁడు కవియొక్క ప్రాశస్త్యమును వర్ణించుచు సకలశాస్త్రవేత్తయయిన వాహినీపతిచేతఁ జాల నీకవిప్రస్తుతిఁ జెంది రని చెప్పుచున్నాఁడు. ఈ 'వాహినీపతి'యు 'వాహినీపతీయకర్త'యు 'తోట (తోడర) మల్లుఁడు' నేకపురుషుఁడుగానే యుండనోవు.

ఈకాలమునకుఁ బిదపఁగూడ నొకతోడరమల్లు మన కగపడుచున్నాఁడు. దక్షిణహిందూస్థానములోఁ గర్ణాటకనవాబగు 'సాదతుల్లాఖాను' నాస్థానమునం దీపేరుగలిగిన సుప్రసిద్ధుఁడగు సేనాధిపతి యుండెను. ఈతనిపేరే యాదేశమునం దచ్చటచ్చట వినఁబడుచున్నది. కాని జనులు దీనిని అక్బరునాస్థానమందలి 'తోడరమల్లు' నామముగా భావించుచున్నారు. ఇది ప్రమాదము. తెలుఁగుజిల్లాలలో జంగముకథగాఁ బాడఁబడుచున్న 'దేశింగురాజు' కథ విననివారలుండరు. ఈకథయందలి విషయము కేవలము కల్పనగాక వాస్తవచరిత్రము. 'దేశింగ' నునామాంతరము గలిగిన 'తేజసింగు' చెంజిదుర్గపాలకుఁడైన సారుప్సింహునికుమారుఁడును కర్ణాటకనవాబు సాదతుల్లాఖానుని ప్రతినిధియు. ఇతఁడు తిరుగఁబడి నవాబునకు శిస్తుమొదలగునవి చెల్లింపనందున నవాబు వీనితోఁ జేసిన యుద్ధమే యీకథాంశము. ఈయుద్ధమునందు తేజసింహునకు సహాయముచేసినది కళ్లకురిచ్చి (దక్షిణయార్కాడు జిల్లాలోనిది) పాళెగా రగు మహమ్మదుఖానుఁడు. నవాబుతరపున తేజసింహునిపై దండెత్తి చెంజిదుర్గమును సాధించి దేశింగురాజును సంహరించిన దీ 'తోడరమల్లుఁ' డే. తేజసింగు (దేశింగు), మహ

మ్మదుఖాను, తోడరమల్లు, వీరికిని ప్రస్తుతపు ఆంగ్లేయరాజుల పూర్వులైన యీ కాలపు "ఈష్టుయిండియాకంపెనీ" వారి మదరాసుప్రతినిధులకును జరిగిన యుత్తర ప్రత్యుత్తరములు కొన్ని మదరాసు రికార్డు ఆఫీసులో నున్నవి. ఈజాబులకాలము క్రీ. 1700 మొదలు 1715 వఱకు.

దేశింగురాజుకథ గాక యీతోడరమల్లు చరిత్రము మనకుఁ దెలియుటకు వేఱాధారములుఁ గూడఁ గలవు. మద్రాసు చిత్రవస్తుప్రదర్శనశాల 'మ్యూసియం'లో నుండు తామ్రశాసనములలో నొకటి యీతోడరమల్లు శ్రీరంగపట్టణ మందలి భూవరాహస్వామివారి దేవాలయమున కయిదుగ్రామముల నాకుండల ములోఁ జేరినవానినే దానముచేయించినట్లు తెలియఁబఱుచుచున్నది. ఈశాసనము శాలివాహనశకము 1635-36 (క్రీ. 1713-14) సంవత్సరమున వ్రాయఁబడినది. దీనియందు ఢిల్లీపాచ్ఛా పరుకుషాహ (ఫరుక్‌షియర్) వారును కర్ణాటకన వాబు సాదతుల్లా ఖానువారును పేర్కొనఁబడియున్నారు. ఈతామ్రశాసనము నందలి దాత "తోడరమల్లు ప్రసాదలబ్ధ శ్రీనివాసదాసుఁడు" ఈసమాసము సరియయినదిగాకపోయినను తోడరమల్లుయొక్క ప్రసాదమును బొందిన శ్రీనివాస దాసుఁ డని యర్థమిచ్చుచున్నది.* అయిన నీశాసనమునందే వెనుకప్రక్క నున్న ఫారిషీభాషాంతరీకరణమున తోడరమల్లు అనఁబడు శ్రీనివాసదాసుఁ డనియున్నది. వీనియం దేదిసరియో తెలిసికొనుట కాధారములు మన కిప్పుడు దొరకవు. తోడర మల్లుప్రసాదమును బొందినశ్రీనివాసదాసుఁ డనుట యే సరి యని యీలేఖకుని యభిప్రాయము. దీనికిఁ గారణములు వెనుక తెలియఁగలవు.

కాంచీపురము వరదరాజస్వామివారి యాలయములో నొకశాసనమునం దీ తోడరమల్లే పేర్కొనఁబడియున్నాఁడు. ఈశాసనము రెండుసంస్కృతశార్దూ లవిక్రీడిత వృత్తములతో వ్రాయఁబడినది. వానియందొకటి:—'శేషాద్రీశ్వర నిత్యకిం కరయతిశ్రేష్ఠోపదిష్టాధ్వనా। శ్రీమత్తోండరమల్లభూమిరమణః శ్రీశ్రీనివాసాజ్ఞయా। దే వ్యాసాక మశేషలోకవరదం దేవాధిరాజం వనా। దానీయాదరవా నథిద్విరదగిర్యా స్థాన మాస్థాపయత్ ॥' రెండవశ్లోకమునందలి కడపటిపాదము 'కల్యాణంఉడయా రపాళయవనా త్కాంచీపురీ మానయత్ ॥' దీనియందలి విషయము 'ఉడయార్ పా

---

* ఈసమాసమునకు తోడరమల్లు ప్రసాదమువలనఁ బొందఁబడిన శ్రీనివాసదాసుఁ డని యర్థము. ఇది కుదురలేదు. గనుక 'లబ్ధ' శబ్దము పిదప 'వైభవ' యనుశబ్దము గాని యట్టియర్థముని చ్చు వేఱొకశబ్దము గాని యుండవలయు నని తోఁచుచున్నది. జ.శా

శయపువనములోనికిఁ బోయియుండిన దేవరాజస్వామి (వరదరాజస్వామి) వారివిగ్రహములను తోడరమల్లభూపాలుఁడు శ్రీనివాసునియాజ్ఞచేత వారియొక్క ప్రాచీన దేవస్థానమునకుఁ దీసికొనివచ్చి ప్రతిష్ఠించెను' అని. ఔరంగజీబు ఢిల్లీపాదుషా కాలమున మొట్ట మొదట మహమ్మదీయులు దక్షిణదేశమునకు వచ్చినపుడు జరిగినకలాపములో కంచివరదరాజులు దేవాలయమునుండి ఉడయార్ పాళెమునకు బోయి దేశము సంక్షోభ మాఱినవెనుక కంచికివచ్చి చేరెను. ఈవచ్చుటకుఁ గారణమే మన తోడరమల్లు. వీరియొక్క ప్రాభవసహాయముల చేత శ్రీనివాసదాసుఁడు ఉడయార్ పాళెపు జమీందారునియొద్దనుండి వరదరాజులను కంచికితీసికొని రాఁగలిగెను. దీనిజ్ఞాపకార్థ మిప్పటికిని కంచిలో ఉడయార్ పాళెపు ఉత్సవ మనియొక యుత్సవము జరగుచున్నది. కంచి దేవస్థానములోపల వరదరాజస్వామివారి గుడిలో నీతోడరమల్లుయొక్క విగ్రహ మొకటి కలదు. స్వామివారియుత్సవాదులలో పూర్వ మీతోడరమల్లును గూర్చియు నీయనను బ్రోత్సాహపఱిచిన శ్రీనివాసదాసుని (అత్తాన్ జియ్యర్) గూర్చియు పాటలు పాడుటవాడుకగా నుండెనఁట.*

ఈసందర్భమున నీతోడరమల్లునకుఁ దోడ్పడిన శ్రీనివాసుఁ డెవరయినది యుఁ గొంత చర్చింపవలసి యున్నది. కంచిదేవస్థానపు రికార్డులనుండియు శ్రీవైష్ణవమతేతిహాసముల బట్టియుఁ జూచిన వరదరాజవిగ్రహము ఉడయారుపాళెమునకుఁ బోయియుండినపుడు మరలఁ దీసికొనివచ్చినది అత్తాన్ జియ్యర్ అని ప్రసిద్ధినొందిన యొకవైష్ణవసన్యాసి. వీరు పూర్వాశ్రమమున గోలకొండవ్యాపారులు. పేరు సిద్దంబాగు శ్రీనివాసరావుగారు. తురీయాశ్రమమును స్వీకరించి కాంచీపురమునఁ గాలక్షేపము జరపుకాలమున వీరినచ్చటి వైష్ణవులందఱును వరదరాజస్వామివారిని దిరుగఁ గంచికిఁ గొనిరాఁ బ్రయత్నింపఁ బ్రోత్సాహపఱిచిరఁట. అందుపై వీరు తమపలుకుబడిచేత సేనాధిపతియయిన తోడరమల్లునుఁ బంపివరదరాజస్వామివారినిఁ దిరుగ దేవాలయమునకు దీసికొని వచ్చెనఁట. ఇట్లు తీసికొనివచ్చినందులకుఁ గాను నీయనవంశమునకుఁ గొన్నిమర్యాదలాయూరివా రేర్పఱిచిరి. ఆమర్యాదలిప్పటికిని వారికి జరుగుచున్నవి. అప్పుడే యీయన కంచివరదరాజస్వామివారి సన్నిధియం దెప్పుడును బూజయారంభమున 'శ్రీశైలేశదయాపాత్రం' అనఁబడు స్తోత్రముతో నారంభింపవలె నని యొకయొడంబడికఁ గూడఁ జేయించెను. ఆయొడంబడికయే కంచియందలి శ్రీవైష్ణవులలోని యంతఃకలహములలోఁ బెక్కింటికిఁ గారణమై యనేక వ్యాజ్యములను బుట్టించినది.

కంచికి రాకపూర్వ మీశ్రీనివాసరావుగారును వారితమ్ముఁడు రామానుజ

* ఈపాటలను సంపాదించుటకుఁ బ్రయత్నముచేయుచున్నాను. దొరకిన నీపత్రికలోనే ప్రచురింపఁబడును.

రావుగారును గోలకొండలో నక్కన్నమాదన్నగార్ల బంధువులై గొప్పయుద్యోగములలో నుండిరఁట. ఔరంగజేబు గోలకొండపైకి దండెత్తివచ్చి తానీషాను జెఱఁగొని యక్కన్నమాదన్నగార్లను సంహరించినపుడు వారిబంధువులయిన వీరును శిక్షకు వెఱచి కాంచీదేశమునకు వచ్చి చేరిరఁట.[1]

అంతకుఁ బూర్వము గోలకొండకు సమీపమున వీరార్జించియుండిన మునగాలజమీందారీని ఇప్పటి జమీందారు లగు కాసరవారి పూర్వులకు విక్రయించిరి.[2]

ఇఁక నీతోడరమల్లు విషయమును గూర్చి చర్చించెదము. తిరుపతిదేవస్థానమునందు తోడరమల్లుయొక్క ప్రతిమ యని వాడెడు విగ్రహ మొకటి కలదు.[3] అది యీతోడరమల్లు ప్రతిమగానే యుండవలెను. శ్రీరంగము దేవస్థానమున దేవునకు సమర్పించెడు చాల విలువగలిగిన 'ముత్తంగి' యనెడు మౌక్తికకవచమును తోడరమల్లు సమర్పించినదిగాఁ జెప్పుచున్నారు. ఫ్రెంచిగవర్నరగు డ్యూప్లెక్సు (Duplex) నొద్ద దుబాసిగానుండిన యానందరంగపిళ్లకంకితమిడిన యానందరంగరాట్ఛందస్సు ప్రస్తావనలో నీతనితండ్రి తిరువేంగడంపిళ్లనుగూర్చి వ్రాయుచు 'జ్ఞాననిధులయిన సకలకలావల్లభసన్నిభు లగు తోటరమల్లు ప్రముఖులకు విశదపడని భావార్థంబులు మాటమాత్రంబునఁ దేటపఱిచి' యని తోడరమల్లును చాలగౌరవముగా వర్ణించియున్నాఁడు.

ఇంతవఱకు మనకుఁ దెలియవచ్చిన తోడరమల్లుల చరిత్రము వ్రాయఁబడినది. ఆశబ్దము కేవల బిరుదము గావున నింకను వేఱుగ తోడరమల్లు లుండిన నుండవచ్చును. ఈప్రకారమే యనేకులనామముల నా నామములనే గలిగిన ప్రసిద్ధపురుషులవిగా భావించి వారిచరిత్రముల విషయమునఁ బొరపడుచున్నాము. సూక్ష్మబుద్ధిని బరిశీలించిన యిట్టిప్రసిద్ధపురుషు లనేకులు వెలువడి చరిత్రమున నిప్పుడు విశదముగాని యనేకవిషయములను దేటపఱుపఁగలుగుదు రని చెప్పవచ్చును.

ఆ. రంగస్వామిసరస్వతి.

---

1. అక్కన్నమాదన్నగార్లు మహారాష్ట్రి లని కొందఱ యభిప్రాయము. జ.రా.

2. ఇప్పటిజమీందారుగారి యింటిపేరు సాయనివారు. జమీందారీ పేరిమాతామహులది. వారియింటిపేరు కేసరవారు. జ.రా.

3. తోడరమల్లుయొక్కయు నాయనభార్యయొక్కయు విగ్రహములు దేవస్థానమం దొక చిన్నగుడిలో నున్నవి. వానిపైని పేళ్లు చెక్కఁబడియున్నట్లు జ్ఞప్తియున్నది. జ.రా.

# గ్రంథస్వీకారము.

(1) **సుభద్రాకళ్యాణము:**—ఇది యేడంకముల చక్కనినాటకము. దీనిని రచించినవారు శతావధానులు బ్ర॥ తిరుపతివేంకటేశ్వరకవుల శిష్యులగు బ్ర॥ ముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారు. గ్రంథశైలి ప్రౌఢమై రచయితకుఁ గలసంస్కృతాంధ్ర భాషాపాండిత్యమును వెల్లడించుచున్నది. ఇందు సంస్కృతనాటకలక్షణములు చాలవఱకుఁ గూర్పఁబడినవి. అక్కడక్కడ నాటక లక్షణవిరోధములును గలవు. ఆముఖమునందలి నటీసూత్రధారుల సంభాషణ మంతయింపుగ లేదు. అందలి వివాహవృత్తాంతము పాత్రప్రవేశోద్దిష్టమే యైనను బాత్రముల చరిత్రతాద్రూప్యమునే పొందియుండక విరసముగానున్నది. "రాజరాజులం దపచితిగొన్న పాండునకు నశ్వలు పుత్రులుగాఁ దనర్తురే" ఇందలిచమత్కారము ముదాహరామే. "ఈతఁడె రాజులందఱు బలీయని మెచ్చఁగ మీనయంత్ర మత్యాతతశక్తిఁ ద్రుంచి ద్రుపదాత్మజఁ గృష్ణ వరించినట్టి మే టీతఁడె." ఇచటి సంధి ప్రమాదజుష్టము. ఎందేని గొన్ని నెఱసులున్నను గవితాశైలి మంచిది. గ్రంథము 78 పుటలుగలది. వెల రు. 0-8-0. సికింద్రాబాదులో, మె॥ చలువాదికోటిలింగము అండు కంపెనీవారికడ దొరకును.

(2) **కంఠాభరణము :**—ఇది వార్తాపత్రికలయం దాంధ్రషేక్సుపియరని నుతింపఁబడిన మ॥రా॥పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిచే రచియింపఁబడిన యేడంకముల నాటకము. దీనియందు హాస్యము ప్రధానరసముగా నున్నది. అదియుఁ గొన్నిస్థలముల యం దతిమాత్రముగా నున్న దని మాయభిప్రాయము. ప్రస్తావనకుఁ గథాభాగమునకును రచయితలు వేఱగుటచేఁ గావలయు నతుకు బాగుగఁ బడలేదు. మొత్తముమీఁద నీగ్రంథము పంతులుగారి పూర్వగ్రంథముల పాకమునకుఁ దీసిపోవునని మాయాశయము. పుస్తకము వెల. రు. ౦-౧౨-౦. పిఠాపురములో గ్రంథకర్తగారియొద్దనే దొరకును.

(3) **శ్రీకాళహస్తీశ్వరశతకము :**—ఇది బ్ర॥ నాగపూఁడి కుప్పుస్వామయ్య బి.ఏ. గారిచే రచియింపఁబడినది. ఈశతకమునకుఁ బీఠికగాఁ గాళహస్తిక్షేత్రమాహాత్మ్యము చక్కఁగ వర్ణింపఁబడినది. కవిత్వము నిర్దుష్టమై సరసముగా నున్నది. ఆస్తికులు భక్తితాత్పర్యమున, నాస్తికులు కవితా చమత్కృతిని నాదరింపఁదగినది. గ్రంథమమూల్యము. తిరుపతివాస్తవ్యు లగు గ్రంథకర్తగారికి వ్రాయవలయును.

(4) **చిత్రకేతుచరిత్రము :**—ఇది బళ్లారి మ్యూనిసిపల్ హైస్కూలు తెనుఁగు పండితులు బ్ర॥ చింతలపల్లి నరసింహశాస్త్రిగారిచే రచియింపఁబడిన యైదాశ్వాసముల గద్యపద్యాత్మక ప్రబంధము. ఆంగ్లేయభాషలో షేక్సుపియర్ మహాకవి రచించిన "కింగులియర్" అనునాటకమునకు రా॥బ॥ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తెనుఁగున రచియించిన సంక్షేపానువాదమును మూలముగా గ్రహించి యీగ్రంథము వ్రాయఁబడినది. ఇందలిశైలి సులభము. కథ ప్రత్యక్షానుభవసిద్ధ మనియే యీవిదేశీయగ్రంథము నాంధ్రీకరించి భారతభాగవతాదికథల నుపేక్షించినా నని కవిగారు వ్రాసినారు. అది యథార్థమేని యిఁక ముందు ఘోరములగు దురాచారములవర్ణింపక నీతిబోధకము లగుభాగములనే రచించుటకు విదేశీయగ్రంథముల నాంధ్రీకరించువారు గమనింపవల

సిన ముఖ్యవిషయము. ఈకథవంటి కథ లనేకములు మనదేశమున లేకపోలేదు. వానిప్రచారమే మఱింత వృద్ధిపఱుచుట దేశీయులకు ముదావహము.

శైలిం దిలకింపుఁడు:—

క. తెల్లనివి యెల్లఁ బాలును, నల్లనివెల్ల జలము లని నమ్ముజనుఁడ వీ
కల్ల లెఱుంగవు నినుఁ గడుఁ, గొల్ల గొనందలఁచినారు కోమలహృదయా.

గీ. మచ్చరంబును గ్రోధంబు హెచ్చుఁబగను, నాలుబిడ్డలనైనను నరయదుపగ
తల్లిదండ్రుల మిత్రులఁ దడవదుపగ, పగను మేలిమిలే దెందుఁ బడఁతులార!

ఈగ్రంథము వెల. రు. ౧. గ్రంథకర్తగారికే వ్రాసి తెప్పించుకొనవలయును.

(5) **శ్రీకృష్ణచరిత్రము :**—ఇది శ్రీకృష్ణుని యథార్థచరిత్రమును దెలుపుటకు సమకట్టిన యొకచక్కని విమర్శనగ్రంథము. మ॥శ్రీ॥ బాలాంత్రపు సూర్యనారాయణరావు, ఎం.ఏ. గారిచే శ్రీ బంకించంద్రభట్టోపాధ్యాయుని వంగభాషాగ్రంథమున కనువాదముగా రచియింపఁబడి యాంధ్రప్రచారిణీగ్రంథమాలలో నిరువదియొకటవ గ్రంథముగాఁ బ్రకటింపఁబడినది. అనేకమహాగ్రంథముల నుండి ప్రమాణములనెత్తి వానిపరస్పర విరోధమును యుక్తియుక్తముగఁ బరిహరించి కృష్ణుని తత్త్వమును భారతలోకమున కర్పించిన యుపాధ్యాయులు మిగులఁ బ్రశంసార్హులు. అట్టియుద్గ్రంథమును మనశాస్త్రోపాధ్యాయు లాభట్టోపాధ్యాయు నభిప్రాయమెఱిఁగి తెనిఁగించుట సరసము గదా! పుస్తకము వెల రు. ౦-౫-౦. నిడదవోలులో, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయమున దొరకును.

(6) **దాదాభాయినౌరోజీ జీవితచరిత్రము:**—ఇది శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదరుగారిచే నేకాశ్వాసమునఁ గేవలపద్యాత్మకముగా రచియింపఁబడిన చిన్నపొత్తము. శ్రీదాదాభాయినౌరోజీ మహాశయుని చరిత్రము బాలురకు స్త్రీలకుఁగూడ సుబోధమగుటకై చక్కనిశైలిని తెనుఁగున వెలయుచున్నది.

గీ. ఆంగ్లభారత దేశంబులందుఁ గాసు, లెల్ల సమమూల్యమున నమ్మఁజెల్లుఁగాని
యచటఁ బదియుఁ బదేనురూప్యంబు లిచట, వెల యొనర్చుట తగదని పలికె రూఢి.

ఇట్టులే పుస్తకము సుబోధముగా నున్నది. రాజకీయ వ్యవహారముం దెల్పుపదముల మార్పవలను లేమి నన్యభాషాపదములు తెలుచుగాఁ జొన్పఁబడినవి. వెల రు. ౦-౮-౦. ఏలూరులో భారతీపేర్ షాపులో దొరకును.

(7) **విజయవిజయము :**— దీనికిఁ గర్ణవిక్రమ మను నామాంతరముగలదు. ఇది ఛత్రపురాజాస్థాన మహాపాఠశాలా పండితు లగు బ్ర॥ భాగవతుల నృసింహశర్మగారిచే విరచింపఁబడిన యైదంకముల నాటకము. విజయనగర సంస్కృతకళాశాలలోని పండితులగు బ్ర॥ వఝుల చిన సీతారామస్వామిశాస్త్రిగారిచే రచియింపఁబడిన కర్ణచరిత్ర మను వ్యాస మీనాటకమునకు మాతృకగాఁ గనిపించుచున్నది. గ్రంథశైలి నిరర్గళమైనదికాని పెక్కుచోటుల నిరర్థకపదములును విపరీతార్థకపదములును గనఁబడుచున్నవి. ప్రస్తావనయందలి చంద్రికావర్ణనము కథకేమయిన నుపకరించునా యని సంశయించుచున్నారము. గ్రామ్యగ్రాంథికభాషా చర్చ యప్రస్తుతము. ఇట్టిదోసంగులు పరిహరించినచో నాటకము మంచిది యగును. గ్రంథకర్తగారియొద్ద ఛత్రపురములో దొరకును.

(8) **శ్రీహరికారికాశేషసర్వస్వము :**—ఇది బ్ర॥శ్రీ॥ భాగవతుల వేంకటభాగవతశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడిన సంస్కృతభాషామయాంధ్రవ్యాకరణము. పీఠికలో శిష్టకృష్ణ

మూర్తిగారు రచించిన హరికారికలకు సాధ్యములుకాని ప్రయోగములుకొన్ని భారతాది గ్రంథములం దుండుటంజూచి “వాని నన్నిటిని నధికశ్రద్ధతో నతిజాగ్రత్తతో సాధించుచు హరికారికాశేషసర్వస్వ మనునీగ్రంథమును, హరికారికారచనకుఁ బిదప ముప్పది సంవత్సరములలోపుననే తమతండ్రిగారగు భాగవతుల రామమూర్తిశాస్త్రిగారు రచించి యచ్చువేయింపఁ దలంచియుఁ దగిన యవకాశము దొరకకుండుటవలన నుపేక్షగా నూరకుండి కొంతకాలమునకుఁ బరమపదించి” రనియు “పదంపడి యనేకులగు విద్యార్థులును బండితులు దీని ననేకము ప్రతులుగా వ్రాసికొని యుపయోగించుకొనుచుండి” రనియు వేంకటభాగవతశాస్త్రిగారు వ్రాసినారు. ఈగ్రంథము భాషయందుఁ దప్పఁ దక్కిన యన్నివిషయముల యందును “ఆంధ్రశబ్దరత్నాకర” కర్తయగు సీతారామాచార్యులవారిచే రచియింపఁబడి చిరకాలమునుండి ముద్రింపఁబడుచున్న త్రిలింగలక్షణశేషమును ప్రౌఢవ్యాకరణమునకు సరిగానున్నది. పరిచ్ఛేదసంజ్ఞ లందునిందు నొక్కటియే. సూత్రములుగూడ నొక్కటే. సూత్రక్రమము ఛందోనిరోధమున నక్కడక్కడఁ గొంచెము మాఱెఁగాని తక్కినచోటుల సమానమే.

ప్రౌఢవ్యాకరణకారకపరిచ్ఛేదము 7-వ సూత్రము “కొన్నియెడల నుశబ్దయోగంబునం దోడకు లోపంబును వ్యవహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి” ననియుండఁగా సంస్కృతములో “క్వచిన్నుశబ్దయోగేస్యాత్ డస్యాదర్శనంచవై । వ్యవధానప్రయోగశ్చ బహుత్వే దృశ్యతే కృతౌ” అని తెనుఁగున “ఉ” శబ్దయోగమున నని యుండఁగా “ను” శబ్దయోగ మనుభ్రమచేఁ దప్పుగా సంస్కృతింపఁబడినది. ఇట్టి వ్యత్యాసము లక్కడక్కడఁ గొంచెము గానిపించినను రెండు గ్రంథములును బహువిధముల సమానములై యొకదాని కొకటి యనువాదముగాఁ గన్పట్టుచున్నవి. కావున నిందు మాతృక యేదియో యనువాద మేదియో నిర్ణయింపవలసి యున్నది. త్రిలింగలక్షణశేష గ్రంథోపోద్ఘాతమునందు సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరనిర్మాణమునకై గ్రంథశోధనము చేయు నవసరమున విశేషలక్షణప్రయోగములు కొన్ని దొరకిన వనియు వాని నేర్చికూర్చి యీగ్రంథమును రచించితి ననియు వ్రాసినారు. ఈవ్రాఁత కనుగుణముగా సూత్రములక్రింద నచ్చటచ్చట సూత్రవివరణమును బ్రమాణములగు ప్రయోగములును గనఁబడుచుండెను. శబ్దరత్నాకరమువంటి గొప్పనిఘంటువును రచించుట కాంధ్రవాఙ్మయపరిశోధన మావశ్యకమై యున్నది. ఆపరిశోధనవలన నిట్టి ప్రయోగవిశేషములు దొరకుట యసంభవము కాదు. అట్టిప్రయోగములు కూడ నుదాహరింపఁబడినవి. సంస్కృతగ్రంథమునందో తెనుఁగుసూత్రములకు సరియైన సంస్కృతసూత్రములు తప్ప మఱి యేమియుఁ గానఁబడవు. ఈసూత్రములు ప్రయోగములమూలమునఁ దప్ప మఱియొకవిధముగ సాధింపఁబడఁదగినవి కావు. ఈహేతువుచేతను, సీతారామాచార్యులవారిగ్రంథము చిరకాలముక్రిందటనే ప్రకటింపఁబడి యుండుటచేతను నాగ్రంథమే మాతృక యనియు హరికారికాశేషసర్వస్వము దాని కనువాద మనియు నిస్సందేహముగాఁ జెప్పవచ్చునని మాయభిప్రాయము. ఈగ్రంథమధ్యమందుఁగాని పీఠికయందుఁగాని త్రిలింగలక్షణశేషస్మరణమే కనఁబడదు. హరికారికలు రచియింపఁబడిన ముప్పదిసంవత్సరముల లోపుననే రామశాస్త్రిలవారీగ్రంథమును రచించినట్లును నది యింతవఱకు నచ్చొత్తింపఁబడకపోయినను బలువురు విద్యార్థులును బండితులును దీని కనేకము లగుప్రతుల వ్రాసికొని యుపయోగించుచుండి రనియుఁ బీఠికయందు వ్రాయఁబడి యుండుటచే నీసంస్కృత గ్రంథమే స్వతంత్రగ్రంథ మనియును దానిప్రతి యేలాగువనో సంపాదించి సీతారామాచార్యులవారు తెనుఁగుచేసిరనియుఁ బీఠికాకారుల యాశయమై యట్లూహింపఁదగి యున్నది. దీనికి లోకమెంతమాత్రమును సమ్మతింపదు. పూర్వోదాహృతహేతువులచేఁ ద్రిలింగలక్షణశేషమే స్వతంత్రగ్రంథ

మని సహృదయులగు పండితులకుఁ దోఁపకమానదు. అందువలన దానికి సంస్కృతగ్రంథ మనువాద మని చెప్పక తప్పదు. ఇది యిట్లుండ లోకమునకు విరుద్ధాభిప్రాయమును గలిగించు ప్రయత్నములు ప్రశంసార్హములుగావు. పీఠికయందు హరికారికలు శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిరని చెప్పఁబడియున్నది. ఇది వివాదాస్పదమైనవిషయము. మాయొద్దనున్న తాళపత్రప్రతిలోఁ జివర,

శ్లో. శ్రీకృష్ణమూర్తి రచితా వృత్తి హరికారికానశేరేషా! నికటేనివపత్వనవాచంద్రార్కం కవీంద్ర రింఛోశ్లేః॥ అనియున్నది.దీనింబట్టి కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించినది హరికారికావృత్తి కాని హరికారికలు కావని స్పష్టపడుచున్నది. బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికానుబంధముగా ముద్రింపఁబడిన గ్రంథములో నీశ్లోకము మఱియొకరీతిగా నున్నది. ఏపాఠము సరియో విమర్శనపూర్వకముగా నిర్ణయింపవలసి యున్నది. దాని కిది సమయము కాదు మఱియు హరికారికలునుఁ జిన్నయసూరికృత బాలవ్యాకరణము నొకదానికొకటి యనువాద మనఁదగి యుండుటచే నేది స్వతంత్రగ్రంథమో యేది యనువాదమో యనువిషయము వివాదాస్పదమై యున్నది. ఈవాదమునందలి సత్యాసత్యము లెట్లున్నను హరికారికాశేషసర్వస్వము త్రిలింగలక్షణశేషమున కనువాద మనిచెప్పుట కాక్షేప మేమియుఁ గానఁబడదు.

ఈగ్రంథము వలయువారికి విజయనగరము కాలేజిలో నాంగ్లోపాధ్యాయులు మ॥రా॥ భాగవతుల వేంకట భాగవతశాస్త్రిగారికి వ్రాసిన రూ. ౦-౮-౦ లకు దొరకును,

(9) వనవాసి :—ఇది యేడంకములనాటకము. శ్రీపిఠాపురము రాజావారి హైస్కూలు ప్రధానోపాధ్యాయు లగు బ్ర॥ కూచి నరసింహము బి.ఏ. గారిచే నాంగ్లకవి "టామస్ పార్నలీ" అనునాతని "హర్మిట్" అనుదానిలోని కథ వలయు మార్పులతో రచింపఁబడినది,గ్రంథకర్తగారిదివఱకనేకగ్రంథముల రచించి యున్నవారు. దీని పేరును బట్టియే దీనియందు శాంతరస మని తెలియుచున్నది. విషయము శైలియు ననుకూలములుగ నున్నవి.

గీ శమదమాభ్యాసపటుఁ డగుసంయమీంద్రు, క్షమకు మితియున్న దది దాఁటెఁగాదె యిపుడు
పీనిశిక్షింతు శిక్షింపనేని రెచ్చి, యింకనెందఱినో పాపి యేఁచి చంపు.

గీ. బిరడ మితిమీఱి గట్టిగా బిగియఁద్రిప్పి, తంతిఁ దంబుఱ నుతిఁగాఁడు తగనిబాధఁ
బెట్టెనే నెంతజడమైన బెడిసి కసలి, తెగిపడదె కంటిమీఁదను మొగముమీఁద

ఈదృష్టాంత దార్ష్టాంతికములకు బింబప్రతిబింబత కొంచెము న్యూనముగా నున్నది. తంతికిఁదగినబాధ తగనిబాధ యనుభేద మెక్కడ నగపడదు. "బాధ" యనుపదముఁ దీసి వేఱొండు పదముంచుట మిక్కిలి బాగుగనుండును.

క. కాసారంబునఁ దలక్రిం, దై సర్వప్రతిఫలనము లగపడునుగదా
యీసృష్టియు నామానస, కాసారములోన నట్లెకనఁబడెనేమో.

ఇట్టిరసవంతము లగుపద్యము లనేకములు గలవు. గ్రంథము వెల. ౧౨ అణాలు. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొనవలయును.

(10) శ్రీవైఖానసమహిమమంజరి :—ఇది యొక సంస్కృతగ్రంథము. వైఖానస మతవిషయమును బోధించును. మతగ్రంథమగుటచే నింతకంటె దీని నిటఁ జర్చించుట యనవసరమని మానినాము. ఎట్టి యుద్ధసమయమైనను మతాభిమానముచే నిట్టియుద్గ్రంథములఁ బ్రకటించు శ్రీవైఖానసగ్రంథమాలవా రెంతయుఁ బట్టుదలతోఁ బూనినపనిని నిర్వహించుచుండుట ప్రశస్యము.

వెల రు. ౧-౨-౦ వలయువారు గ్రంథమాలాధిపతులకు ఈగావారిపాళెము సత్యవేడుపోస్టు, చెంగల్పట్టుజిల్లా యని వ్రాసికొనవలయును.

**(11) ప్రభావతీపరిణయము :**—ఇయ్యది విశాఖపట్టణమండలము లోని చోడవరము తాలూకాలోఁ జేరిన పెదనందిపల్లి అగ్రహారనివాసులు కీర్తిశేషులు నగు బ్రా॥శ్రీ॥ ఓరుగంటి సోమశేఖరకవిగారిచే రచింపఁబడి కాకినాడవాస్తవ్యులగు రావుబహదర్ పైడా వేంకటచలపతిగారి కంకితము చేయఁబడినది. అధునికకృతులం దింతటిప్రౌఢప్రబంధము లరుదుగాఁ గలవు. ఇద్దాని కాంధాత్రిక్షురతత్త్వాది గ్రంథముల రచించిన పాడి వేంకటనారాయణపాత్రిగా రొకవిపుల విమర్శనముతోఁ గూడిన పీఠికను వ్రాసియున్నారు. దానివలన నిందలిగుణాగుణములు తెలియఁగలవు. ఇందలిపద్యములు చాలవఱకితరకవుల పద్యములకుఁ దలవిఱుపులుగా నున్నట్లు దోఁచును. ఇది యొకగొప్ప దోషముగా నగపడదు. ఏదియెట్లున్నను గ్రంథ ముత్తమశైలి నున్నది.

ఇందుఁ గొన్నిస్థలములఁ బీఠికవ్రాసినవారు గూడఁ బూరించినారు గావున నిరువురపద్యములను నుదాహరించెదము.

సోమశేఖరకవిగారిది.

సీ. సారంగగమన యీనారంగములఁజూడు మారంగ సరసఫలాంచితములు
మల్లికాళి సతీమతల్లికా యిదిచూడు వల్లికావేల్లితపల్లవతతి
కేళాకుళులఁ జారువేలాలసన్నారికేళావళులఁజూడు నీలవేణి
కాంచనం బిది చూడు చంచలనేత్ర పుష్పాంచలశాఖాశిఖాంచితంబు
అనుచు ఘనభూజరాజిని వనితచెలులు, కానిపించుచు విరహార్తిఁ గ్రాఁగకుండఁ
జివురులును బుష్పములు ఫలనివహములును, గోసినడిఁదెచ్చి యొక్కెడఁ గూడివేర్చ.

వేంకటనారాయణపాత్రిగారిది.

సీ. చివురులన్నియుఁ గోసి చిందులాడితిమమ్మ వనలక్ష్మి దానెంత వనటఁగనునొ
పూవులన్నియు రాల్చి తావులార్చితిమమ్మ కేళీవనం బెంత జాలిపడునొ
ఫలము లన్నియు డుల్చి పర్వువెట్టితిమమ్మ యుద్యానవనమెంత యుడుకుగనునొ
మకరందములఁదీసి మాయఁజేసితి మమ్మ యళులెంతదోఁ టదియెంత యదరిపడునొ
చందనాచలపవమానసంతతులను, నవిరళాభోగవిమలచంద్రాతపముల
దోడుఁజేసికొని వసంతుఁ డీడఁబోక, యేమిగావింపఁదలఁచెనో యెఱుఁగమమ్మ.

ఈగ్రంథము నాలుగాశ్వాసములది. 101 పుటలు మూలము. లఘుటీక 28 పుటలు గలదు. 18 పుటల పీఠిక. వెల వేయఁబడియుండలేదు. ఉచితముగానే దొరకునేమో. వలసినసంగతులు కృతిపతులు ప్రకాశకులునగు శ్రీ వేంకటచలపతి గారికి వ్రాసికొనవలయును.

**(12) చంద్రరేఖావిలాపము :**—ఇది సుప్రసిద్ధుఁడగు కూచిమంచి తిమ్మకవి సోదరుఁడును సుభద్రాపరిణయాది బహుగ్రంథనిర్మాతయు నగు కూచిమంచి జగ్గకవిచే రచియింపఁబడిన హాస్యరసప్రబంధము. మహారాజశ్రీ కాళ్లకూరి గోపాలరావుగారిచే (సంస్కరింపఁబడి) ప్రకటింపఁబడినది. ఇందు నీలాద్రిరాజునకును చంద్రరేఖ యనువేశ్యకును గల యన్యోన్యానురాగము వికటముగా వర్ణింపఁబడినది. నీలాద్రిరాజును నతని యాస్థానవిద్వాంసుఁడగు వేంకటశాస్త్రిని మంత్రిని గసి దీనిఁ దిట్టుటయే దీనిప్రయోజనముగఁ గనఁబడుచున్నది. కవి కృత్యాదిని దిట్టుకవులను స్మరించుటయుఁ గృతి

పతి తన్నుం గూర్చి "చక్కఁగఁ బల్కు మూర్ఖులం దూర్ణ మె తిట్టించంపుదును" అనియె నని చెప్పుటయు గ్రంథమం దచ్చటచ్చట నున్న బూతుపద్యములును నీయభిప్రాయమును దృఢపఱుచుచున్నవి. ఇది యిట్లుండఁ గవియుద్దేశము ప్రాచీనప్రబంధ రచనారీతి నాక్షేపించుట కాని యెవ్వరిని దిట్టుట కాదని కొందఱభిప్రాయపడుట వింతగా నున్నది ఈయభిప్రాయము, కవి యుద్దేశమును గనిపెట్టలేక యాంగ్లేయభాషలోని కొన్నిహాస్యగ్రంథములను దలంపునకుఁ దెచ్చికొని బ్రౌనుగారు వ్రాసినవ్రాఁతనుబట్టి కల్పించుకొన్నది చంద్రరేఖావిలాపములోని పాత్రనామములును గ్రామనామములును యథార్థములు కాని కల్పితములు కావు. కృతినాయకునియొక్కయు నాయన యాస్థానవిద్వాంసునియొక్కయు సంతతివా రిప్పటికి నున్నారు. కృతినాయకునిచే నావిద్వాంసున కొసంగఁబడిన యగ్రహారమిప్పటికిఁ దద్వంశ్యు లనుభవించుచున్నారని వినికి. మఱియుఁ గవితారీతి నాక్షేపింపఁ దలఁచినకవి బంతు బూతులఁ బ్రయోగింపనవసరము లేదు. ఈవిషయము లన్నియు మనస్సునం దుంచుకొని తలుష్టభావముతో గ్రంథముం జదివినవారికిఁ దిట్టుట కయియే గ్రంథము పుట్టినట్లు తోఁపకమానదు.

ఈగ్రంథము వ్రాఁతప్రతు లనేకములు దేశమున వ్యాపించియున్నవి. కాని, పెక్కుచోటుల నసభ్యవర్ణనము లుండుటచే నింతవఱకు నచ్చుపడి యుండలేదు. బూతులు గలపద్యములు కొంతవఱకు మార్చియుఁ బాత్రములయొక్కయు గ్రామములయొక్కయుఁ బేళ్లను మాఱుపేళ్లు పెట్టియు గ్రంథ మొకరీతిగా మార్పుచేసి గోపాలరావుగారు ప్రకటించి యున్నారు. ఈసంస్కరణము మాకుసమ్మతము గాదు. గ్రంథప్రకాశకులు చేయవలసినది కవిహృదయమునకు సరిపడునట్లుగా లేఖకప్రమాదజనితదోషములను సవరించుట గాని కవ్యుద్దేశమునకు విరుద్ధముగా యథేచ్ఛముగా గ్రంథమును మార్చుటగాదు. బూతులు తిట్టవలయునని కవి యుద్దేశించినపుడా బూతులను నీతులనుగా మార్చుట గ్రంథప్రకాశకులు చేయవలసిన పనిగాదు. ప్రకటనార్హములు కావనితోఁచినపద్యములు వదలివేసినను వేయవచ్చును. ఆంధ్రవాఙ్మయచరిత్రమును దన్మూలముగా నాంధ్రలోకచరిత్రమును సరిగాఁ దెలిసికొనవలయును నసన గ్రంథములు పుట్టినవి పుట్టినట్లే యుండిన దానికి సాయపడును గాని కాలానుగుణముగ వానిని మార్చుచున్న యెడల వానిప్రామాణ్యమునకు భంగము కలుగును. కొన్నిపురాణములయందుఁ బరస్పరవిరుద్ధములు నీకాలమున కనుగుణము కానట్టియు భాగములు కొన్నికలవనియు నిప్పటివారి కందఱకు రుచించునట్లులు మనపురాణములను సంస్కరింపవలయు నని కొందఱు బుద్ధిమంతుల యభిప్రాయమై యున్నది. అట్లులు మార్చినచో నవి యెంత యుపయోగించునో యీనూతనవిధసంస్కరణము నొందినగ్రంథములు నంతవఱకే యుపయోగించును. యథేచ్ఛముగా మార్చుటచే నిందుఁ గొన్నిపద్యము లనన్వయముగా నున్నవి. అచ్చు, నట్టుకట్టు మొదలగునవి సుందరముగా నున్నవి. వెల రు. ౧. చెన్నపురిలో నున్న కాళ్లకూరి గోపాలరావుగారికి వ్రాసి తెప్పించుకొనవలయును.

(13) అడిదము సూరకవి :—ఇయ్యది, అడిదము రామరావుగారిచే సమకూర్పఁబడి విజయనగరమం దాంధ్రపారిజాతసమాజమువారిచేఁ బ్రకటింపఁబడిన సూరకవి జీవితచరిత్రము. వెల రు. ౧-౪-౦.

అడిదము సూరకవి సుప్రసిద్ధులగు నాంధ్రకవులలో నొకఁడు. ఈయన ౧౭౨౦-౧౭౮౫ క్రిస్తవాబ్దముల మధ్యకాలములో జీవించియుండినట్లు శ్రీరామరావుగారు వర్ణించియున్నారు. గ్రంథములో వర్ణింపఁబడిన కవిజీవితచరిత్రమునకు జనశ్రుతులే ముఖ్యాధారములయియున్న

ని. ఇవి మంచి ప్రమాణములు కాకపోయినను సంతకంబె సూచియాధారములు లేనప్పుడు జనశ్రుతులను సమకూర్చుటయు లోకోపకారమే యని మాయభిప్రాయము. సూరకవి పెక్కుకృతుల రచించెను అవియన్నియు రసవంతములే; కాని, కవిజనరంజనము మొదలగు పెద్దగ్రంథములందుకంటెం బొణుగుపాటి వేంకటమంత్రి మొదలగువారిపైం జెప్పంబడినచాటుపద్యములందే కవిస్వభావాదు లధికముగాం దెలియుచున్నవి.

సూరకవి పూసపాటిసంస్థానమునం దాస్థానకవిగా నుండినట్లు రామరావుగారు వ్రాసినారు, కాని, యాతనికృతులలో నొక్కటియు నారాజుల కంకితము కాకపోవుటను బట్టియు, సూరకవి, విజయనగరపువారికి శత్రువు లగురాజుల నాశ్రయించుచు నుండినవాం డగుటవలనను సూరకవి యాస్థానకవిగా నుండలేదేమో యని తోంచుచున్నది. "విజయరామక్ష్మావిభుం దిట్టి భాసిల్లెధరణిలో మాప్రపితామహుండు" అని సూరకవి మనుమనిమనుమం డగు బాలభాస్కరకవి చెప్పినదిగూడ నీయూహనే దృఢపఱచుచున్నది

సూరకవిచరిత్రమును వర్ణించునప్పుడేమి యాతనికృతుల విమర్శించునపుడేమి యాకవి తన వంశమువాం డనునభిమాన మంతగాం బెట్టుకొనక రామరావుగారు మొత్తముమీంద సమభావమును నెపాటించుట ప్రశంసార్హము.

**(14) సోహ్రాబు :**—మాథ్యూఆర్నాల్డు అను నాంగ్లకవి రచించిన సోహ్రాబు-రుస్తుము అను పద్యకావ్యమునకు నాంధ్రీకరణము. కాకినాడ నివాసులగు మ॥శ్రీ॥ మోచర్ల హనుమంతరావుగారు దీనిని రచించినవారు 1075 గీతపాదములుగా నున్నది. ఇట్టి గీతమాలికను గొందఱు "రోకటిపాటవలె మొదటినుండి తుదవఱకు నొక్కచందమే" యని యనువారుందురు కాని యాథార్థ్యమున నిది యట్లుగాక శైలీసౌగమ్యమునను, గథాచమత్కారమువలనను, గథయందలి రసపుష్టివలనను మొదటినుండి తుదివఱకుం జదువుదనుక పుస్తకమును విడువనీయని యుత్సాహము నిచ్చుచున్నది. దీనిమూలగ్రంథము ననేకులు తెనిఁగించియున్నారు. దీనివెల రు. ౦-౮-౦ గ్రంథకర్తగారియొద్ద దొరకును.

**(15) శ్రీమహాలక్ష్మీపరిణయము :**—ఇది యైదాశ్వాసముల ప్రబంధము. సద్దిపల్లి కోనరాజకవిచే రచింపఁబడినది. ఇందలికథ క్షీరసాగరమథనమందు లక్ష్మియుద్భవించుట, యామె విష్ణునివరించుటయును. పురాణములందువలెనే దీనియందును దేవాసురయుద్ధాదికములు వర్ణింపఁబడినవి. కవి పద్మపురాణాంతర్గత మగు "లక్ష్మీపరిణయము"ను మూలముగాఁ గొని దీనిని రచించెనఁట. కవినివాసస్థలము విశాఖపట్టనమండలములోని పక్కినాంటికి ముఖ్యగ్రామ మగు సర్వసిద్ధి యనుగ్రామము. కవికాలమును గూర్చి పీఠికలో "ఇప్పటికి 162 సం॥లకు ముందు క్రీ. 1754 సం॥ బుట్టి యెనుబది సంవత్సరములు జీవించి 1834 సం॥ మరణించె నని, తెలుపఁబడియున్నది. ఈకవి వ్రాసిన "కమిటీవుత్తరము" కాళయుక్తిసంవత్సరమున రచింపఁబడిన ట్లగపడుచున్నది. ఇది యెప్పటి కాళయుక్తియో, ఆలోచించిన భేదమగపడును. పీఠికలోఁ బ్రకటింపఁబడిన "సర్వసిద్ధిసరసులుగారికి నెల్లూరు నెఱజాణలు వ్రాసినయుత్తరము" విషయమమాత్రము విశ్వాసార్హముగాదు. ఈయుత్తరములకథ లనేకస్థలముల ననేకవిధముల "నెల్లూరు నెఱజాణలు రావూరిరసికులకు" సాలూరు సామంతులకు భోగాపురము భోగమువారు" మొదలగురీతుల నుండుటచే దీనియాథార్థ్య మూహ్యము గానున్నది. కవి యీయుత్తరమునకుఁ బ్రత్యుత్తరంబిచ్చుటయు నయాథార్థమే. కవి నాఁడే కాక కవిపూర్వుల

వాఁడుగూడ నిట్లె యెవరో సమాధాన మంపిరను వాడుక యుండియే యుండును. ఈవిషయము లెట్లున్నను గ్రంథవిషయము మాత్ర ముత్తమమయినది. శైలి నిరర్గళమృదులము. కల్పన లనల్పములు. కవితాప్రౌఢి నిరంకుశము. ఆధునికకవుల గ్రంథములం దిది యొకయుత్తమగ్రంథ మని యెన్నఁదగి యున్నది.

సీ. కలశజుం డబ్ధిఁ గ్రోలుచో గళముదగులు, రత్నములు పుక్కిలించి యభ్రస్థలంబు
నంట నూఁచెను నాశారదాగమమున, భాస్వద్గ్రహతారకాపంక్తు లలరె.

మ. శరదబ్జాక్షికిఁ గాలిపావడ లొనర్చ న్వారిశృత్స్వర్ణత
స్కరు లొప్పారఁగఁ గ్రౌంచశైలమను పల్కుంగల్లు పెజ్జంబులం
దరయం దీసిన వెండితీఁగెలనఁగా నభ్రంబునం దుండి పె
న్వరుస న్గట్టి దిగెం గెలంకులకు నొప్పన్మత్తహంసావళుల్.

మహాలక్ష్మికిఁ దలిదండ్రులు బుద్ధులు సెప్పుట.

మ. పరుఁడన్నన్ ధనమన్న సత్యమనిన న్వాత్సల్య మన్నన్ మనో
హరుఁడన్నం బరమార్థమన్న సుకృతంబన్నం దపంబన్న స
ద్గురు వన్న న్వ్రతమన్నఁ గోరికన సంతోషంబనన్ జీవితే
శ్వరుఁడన్నన్ విభుఁడన్న నీకు నబలా వైకుంఠుఁ డెల్లప్పుడున్.

ఇట్టి యితరానుకృతులు నందందుఁ దఱచుగా నగపడుచున్నవి. గ్రంథమునందచ్చుతప్పులత్యధికముగాఁ బడినవి. రెండవకూర్పునం దాతప్పు లన్నియు సవరించుట యుచితము. ఇట్టియుద్గ్రంథములఁ బండితులసాయమునఁ బరిష్కరింపనియెడఁ దప్పులు గుప్పలై కొన్ని కవిమెడకును జుట్టుకొనుట యుచితము. గ్రంథము వెలవేయఁబడలేదు. మాకీగ్రంథమును రాజధానీకలాశాలోద్యోగి యగు మ॥ దిన నహీ గున్నయ్య బి.ఏ. గారొసంగిరి. ఈగ్రంథమును గవికి మనుమని కుమారుఁడగు వద్దిపర్తి వీరరాఘవస్వామిగారు తమపూర్వులయందలి భక్తిచేతను భాషాభిమానముచేతను బ్రకటించినందున మే మెంతయుఁ గొనియాడుచున్నారము. దీనిని వీరరాఘవస్వామిగారు 250 ప్రతులు మాత్రమే ముద్రింపించి యమూల్యముగా నొనరించినారు.

# ఉత్తరరామచరితము.

[శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరాయప్రణీతాంధ్రోత్తరరామచరితము. సటిప్పణము. వెల రు ౦-౧-౨-౦ ఏలూరు భారతీవేర్ హౌసులో దొరకును.]

(మహాకవి భవభూతికృత మగు సంస్కృతనాటకమునకుఁ దెనుఁగు.)

ఈనాటకము నిదివఱకు నలుగురైదుగురు కవులు తెనిఁగించిరి. వారిలో యశఃకాయు లగు వావిలాల వాసుదేవశాస్త్రిగా రాద్యులని తోఁచుచున్నది. శ్రీ భుజంగరావు గారి యాంధ్రీకరణము చిట్టచివరిది. నాటకరాజమగు శాకుంతలము కన్న మిన్న యని కవిశిరోమణి యగు కాళిదాసునిచే నెన్నఁబడిన దని వన్నెకెక్కిన యీనాటకమును దెనిఁగించుటకుఁ బలువు రుద్యమించుట వింతగాదు. శ్రీభుజంగరావుగారు మూలగ్రంథము గుణాగుణములను భీఠికలోఁ గొంతవఱకుఁ జర్చించి "సీతాపరిత్యాగము చేయుట రామునకుఁ దగినపనియా" యనునంశముం జర్చించి "సీతాపరిత్యాగమున రాముఁ డకార్యకరణమొనర్చె నని కాని భవభూతి కాళిదాసునివలెఁ దగునుపపత్తిని గలిగింపలేకపోయెనని కాని తలంచుట యసమంజస" మని సిద్ధాంతము చేసినారు. ఈసిద్ధాంతము సరియనియు, నీవిషయములో శాకుంతలము నందుకంటె నుత్తరరామచరితమునందే కథానన్నివేశకౌశల మధికముగాఁ గనఁబడుచున్న దనియు మామతము. సకలసద్గుణసంపన్నునిగా వర్ణింప వాల్మీకి ప్రతిజ్ఞచేసిన శ్రీరామచంద్రుని చరిత్రమందు వాలివధము, సీతావివాసనమును దోషము లని స్థూలదృష్టిచే లోక మెంచుచున్నది. వీనిలో రెండవకార్యము దోషము కాదనియు గుణమె యనియు సమర్థింపనెంచి భవభూతి యీనాటకమును రచించె నని తోఁచుచున్నది. భార్యను భరించుట భర్తకు విధి. పవిత్రురా లగు భార్యనుగుఱించి వేఱ చెప్పనేల? సీత పరమపావనియని రాముఁడునిశ్చయముగా నెఱుంగును. ఎఱింగియు నెవ్వఁడో పామరుఁడు దోషారోపణము చేసినంతమాత్రమున నాదేవిని బరిత్యజించుట భర్తృధర్మమునకు విరుద్ధము. ఇదియె లోకసామాన్యమతము. కాని, సూక్ష్మదృష్టితోఁ బరిశీలించినచో రాముని చర్యకుపపత్తి కనఁబడకపోదు. ధర్మము లనేకవిధములు. సామాన్యముగా నన్నియు ననుష్ఠింపఁదగినవే కాని యేకక్రియయందు వివిధములగు రెండుధర్మములకుఁ బ్రసక్తి కలిగినపుడు ధర్మవిరోధము తటస్థించి రెంటిలో దేనినో యొక

ధర్మమును విడిచి రెండవదాని ననుష్ఠింపవలసి వచ్చును. విరుద్ధధర్మముల బలాబ
లములు నిర్ణయించుట కష్టసాధ్యము. ఇట్టివే ధర్మసందేహమున కాస్పద మైనప
ట్టులు. ధర్మరహస్యములు కడుసూక్ష్మములు. స్థూలదృష్టిచే నిర్ణయింప నలవిగా
నివి. సీతాపరిత్యాగమునందిట్టి ధర్మద్వైవిధ్య మున్నది. ఈవిషయముఁ బరిష్క
రించుచు శ్రీభుజంగరావుగారు "లోకమున మూఁడువిధము లగుధర్మములు గల
వు......ధర్మములై పరిణమించెను" అని వ్రాసిరి. కాని, యీపరిష్కారమంత
తృప్తికరముగా లేదనికొనియెదము. ధర్మాధర్మవిచారము జీవులవిషయమై గాని
యీశ్వరుని విషయమై కాదు. ఈశ్వరధర్మములు నిరూపించుటకు జీవున కధికార
ములేదు. అట్టిస్థితిలో మనము సమర్థింపఁజాలని కార్యము లన్నియు నీశ్వరేచ్ఛాను
సారముగా జరగినవని చెప్పి తప్పించుకొనఁ జూచుట సరసముకాదు. ఇంతకు భవ
భూతి రాముని మహాపురుషునిగానె వర్ణించెనుగాని యీశ్వరునిగా వర్ణింపలేదు.
ఇది శ్రీభుజంగరావుగారే యొప్పికొని యున్నారు. మఱియు నవిదితమగు నీశ్వరే
చ్ఛను బురస్కరించుకొని సమర్థించుట ప్రవృత్తిమార్గమును బురాణమార్గమునై
యుండునుగాని కావ్యమార్గము కాదు. యుక్తియుక్తమును లోకానుభవానుగు
ణము నైనంగాని శోభింపదు.

సీతావివాసనమును సమర్థింపవలయు ననిన శ్రీభుజంగరావుగారి రెండవ
కోటిలోఁ జేరినరాజధర్మమును బురస్కరించుకొనియే సమర్థింపవలయును. ఇదియే
కవిమతము. ఇచ్చట భర్తృధర్మమునకును రాజధర్మమునకును బ్రసక్తి యేకస్థల
మం దేక కాలమందుఁ గలిగినది. గుణవంతురా లగుభార్య నేలుట భర్తృధర్మ
ము. ప్రజల రంజింపఁజేయుట రాజధర్మము. ఈరెంటిని బాటించుట రామున కసా
ధ్యముగాఁ దోఁచెను. అందఱుఁగాకపోయినఁ గొందఱయిన సీతయందు దోషమా
రోపించిరి. జనుల కిట్టియభిప్రాయ మున్నదనియెఱింగియు నామెను వీడకుండిన
చో రామునకు ధర్మమునందుకంటెఁ గామమునందె యధికాదర మున్నదని ప్రజ
లకుఁ దోఁచుటయు నామూలమునఁ బ్రజకు రాజునెడల నుండవలసిన భక్తివిశ్వా
సము లుండకపోవుటయు, రాజు జనానురంజకుఁడు కాకపోవుటయుఁ దటస్థించి చివ
రకు దేశము చెడిపోవును. రాజెప్పుడును ధర్మశాస్త్రబద్ధుఁడుగాని స్వతంత్రుఁడు
గాఁడు. ధర్మములన్ననో శిష్టాచారరూపముగా బైలుదేఱి మహర్షులచే గ్రథిత
ములై విలసిల్లును. రాజు ధర్మములను సంరక్షింపవలసినవాఁడే కాని వానిని మా
ర్చుట కధికారము కలవాఁడుకాఁడు. తెలియనివారు కొందఱిపు డేమనుకొన్నను
నిదియే హిందూసంప్రదాయము.

సామాన్య భర్తృధర్మమునకును రాజధర్మమునకును విరోధము వాటిల్లి నప్పుడు రాజధర్మమే బలవత్తర మని యెంచి "స్నేహం దయాంచ సౌఖ్యంచ యదివా జానకీ మపి। ఆరాధనాయ లోకస్య ముఞ్చతో నాస్తి మేవ్యథా." అని రాముఁడు ప్రతిజ్ఞ చేసెను. పిదప సీవిషయమునే—

"సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం పరమ్ ।
తత్ప్రీతితంహి తాతేన మాంచప్రాణాంశ్చ ముంచతా ॥"

(ఏవిధముచేతనైనను లోకారాధనము సత్పురుషుల కవశ్యకర్తవ్యము. ఈయర్థము నన్నును ప్రాణములను విడిచిపెట్టిన మాతండ్రిగారిచే స్పష్టము చేయఁబడినది.) అనువాక్యముచే దృఢపఱిచెను. ఈయుపపత్తియే గ్రంథమునం దచ్చట నచ్చట నిరూపింపఁబడినది. చిట్టచివరకు సప్తమాంకమునందు గంగకూడ నీసిద్ధాంతము నే యనుసరించి "ఘోరంలోకే వితత మయశో యాచ వహ్నౌ విశుద్ధి। ర్లంకాద్వీపే కథమివ జన స్తామిహశ్రద్దధాతు। ఇక్ష్వాకూణాం కులధనమిదం యత్సమారాధనీయః। కృత్స్నోలోక స్తదిహవిషమే కిం సవత్సః కరోతు. (లోకమునందు ఘోరమగు నపవాదము వ్యాపించియున్నది. లంకాద్వీపమందు జరిగినయగ్నిశుద్ధి నిక్కడిజను లెట్లు నమ్ముదురు. సర్వవిధములను లోకారాధనముచేయుట యిక్ష్వాకుల కులధనమై యున్నది. ఇట్టివిషమసంధిలో మఱి రాముఁడేమిచేయవచ్చును.)

అని చెప్పి రామునియందు నిరపరాధిత్వము సాధించెను. కావున నెన్నివిధములఁ జూచినను లోకారాధనవిధిని బురస్కరించుకొనియే రాముఁడు సీతాపరిత్యాగము చేసెనని కవిహృదయమైనట్లు స్పష్టమగుచున్నది.

ఈయుపపత్తియీనాఁటివారికిఁ గొందఱకు రుచింపకపోవచ్చును. కాని శకుంతలాపరిత్యాగమునకుఁ గాళిదాసుఁడు కల్పించిన యుపపత్తికంటె నిదియే బాగుగ నున్న దని మాయభిప్రాయము. ఈవిషయములో నభిజ్ఞానశాకుంతలనాటకకథకును భారతకథకును భేదమున్నది. భరతుఁడు పుట్టిన కొన్నిసంవత్సరములకుఁ బిదపఁ గొడుకును దీసికొని దుష్యంతునికడకు శకుంతలవచ్చి తన్నుభార్యఁగాను భరతుని పుత్రునిగాను బరిగ్రహింపవలయు నని కోరె ననియు, నీవు నాభార్యవుగావు, పిల్లవాఁడు నాకొడుకుగాఁడు, నిన్ను నే నెఱుఁగనే యెఱుఁగను పొమ్మని దుష్యంతుఁ డనియె ననియు నంతట శకుంతల చెప్పినమాట సత్యమేయనియు నామెను భార్యగా గ్రహింపవలయుననియు నాకాశవాణి పలికినపిదప రాజామెను బరిగ్రహించె ననియు భారతమునం దున్నది. తనకును దుష్యంతునకును గాంధర్వవి

వాహమైనపిదపఁ జిరకాలమునకు శకుంతల వచ్చుటచే మఱపుచేత నేమి సపుత్రయై వచ్చినస్త్రీని భార్యఁగాఁ బరిగ్రహించినచోఁ దమరహస్యవివాహ మెఱుఁగనిలోకము తనయందు దోషమారోపించు నను భయముచేత నేమి దుష్యంతుఁడు శకుంతలను దొలుత పరిగ్రహింపకపోవుట కొంతవఱకు సోపపత్తికముగా నే యున్నది. కాళిదాసుఁ డీకథను మార్చి గర్భిణిగా నున్నపుడే శకుంతల దుష్యంతునియొద్దికి వచ్చెననియు నామెకు సాయముగాఁ గణ్వునిచేఁ బంపఁబడిన కణ్వశిష్యులును గౌతమి యనువృద్ధతాపసియుఁ గూడవచ్చి రనియు వీరందఱు నెన్నివిధములం జెప్పినను గణ్వుని సందేశముఁ బ్రకటించినను గూడ దుష్యంతుఁడు శకుంతలను దానెఱుఁగ ననియే పలికి వెడలఁగొట్టె ననియుఁజెప్పి గాంధర్వవివాహము దుష్యంతుఁడు మఱచిపోవుటకు దుర్వాసుశాప మను నొక యుపపత్తిఁగల్పించెను. ఇది లోకానుభవమునకును గావ్యసరణికిని విరుద్ధ మనినాయభిప్రాయము. గాంధర్వవిధిచే శకుంతలను దానుగూడిన కొద్దినెలలకే యాసమాగమమును బొత్తిగా మఱచిపోవుట యసంభవము. శకుంతలచేతను గణ్వునిచేతను బోధింపఁబడియుఁ గూడఁ గణ్వాశ్రమమున జరగినవృత్తాంతమును బొత్తిగా మఱచిపోవుట మిక్కిలి యసంభవము. దుష్యంతుఁడు నిజముగా నీవృత్తాంతమును మఱచుటయే సత్యమైన యెడల నతనియందుఁ బ్రమాదము నారోపింపవలసియుండును. ఆరోపించిన యెడల నాతఁడు ధీరోదాత్త నాయకుఁడు కాఁజాలఁడు. దీని కంతకును దుర్వాసుని శాపము తగిన కారణము కానేరదు. లోకానుభవమునకు విరుద్ధమైన యమానుషచర్యల నుపపత్తిగాఁ గొనుట పైనఁజెప్పినప్రకారము పురాణమార్గానుసారమైన నై యుండవచ్చును గాని కావ్యరీతికి సరిపడదు. కావ్యమునందలి కథాసన్నివేశము యుక్తియుక్తముగను లోకానుభవమున కవిరుద్ధముగ నుండవలయును.

ఇఁక శ్రీభుజంగరావుగారి యాంధ్రీకరణముంగూర్చి యోజింతము. సంస్కృతగ్రంథమును దెనిఁగించుటలో రెండురీతులు కనఁబడుచున్నవి. మూలములోని భావము లన్నియుఁ జక్కఁగా గ్రహించి వానిని జక్కని తెనుఁగుమాటలలో నాంధ్రభాషాసాంప్రదాయమునకు భంగము కలుగకుండునట్లుగాను సంస్కృతమంతగాఁ దెలియని తెనుఁగువారలకు హృదయంగమముగా నుండునట్లును దెనిఁగించుట ప్రాచీన కవిసమ్మత మైయున్నది. తొలుత నన్నయాదులుఁ బిదపశ్రీనాథాదులు నీదారి నేపట్టి రసవద్గ్రంథముల నిర్మించిరి. శ్రీనాథుని శృంగారనైషధము "శబ్దంబను సరించియు......మాతృకానుసారంబున నాంధ్రభాషావిశేషంబున నశేష మనిషి

హృదయంగమంబుగ రచియించితి" నని యీమార్గముననే వర్ణించెను. అట్లుగాక భావవిషయమున మాత్రమేకాక రచనావిశేషములయందును భాషాసంప్రదాయ విశేషములందును గూడ మాతృకనే యనుసరించి తెనిఁగింపవలయునని యాధునికులు కొందఱిమత మైనట్లు కనఁబడుచున్నది. దీనివలన నాంధ్రభాషాసంప్రదాయములకును కవితాధారాశుద్ధికిని గావ్యరసవత్త్వమునకు లోటు వాటిల్లుట కవకాశము కలుగును. ఇట్టి నెఱసు లీకృతియం దచ్చటచ్చటఁ గనఁబడుచున్నవి. నాందీశ్లోకమున "ఇదంకవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే" అను మూలమునకు "మొదలిటికవిరాజులకై । యిదియె నమోవాక మిచ్చనెంచెద" నని తెనుఁగుచేయఁబడినది. నమోవాక మిచ్చ నెంచెద ననురచన యంతసరసముగా లేదు. ఎవ్వరికో పండితులకుఁగాని యర్థమును గాదు. మ్రొక్కెద నని కాని యా యర్థమిచ్చు మఱియొక సులభశబ్దముగాని ప్రయోగించిన నెంతయో రమ్యముగా నుండియుండును.

"యది పున రియం కింవదంతీ మహారాజం ప్రతిస్యందేత తతఃకష్టం స్యాత్" అనుదానిలో స్యందేత యను శబ్దమునకు "శ్రవణవిషయీభవే దితి యావ"త్తను వ్యాఖ్యానములోని భావబోధకవాక్యము నాధారముచేసికొని "ఈకింవదంతి మహారాజు వీనులం బడెనేని దానఁ దప్పక ముప్పువాటిల్లు" నని తెనిఁగించిరి. కింవదంతి మహారాజు దనుకఁ బోయెనేని యని యుండుట సరసము.

కంచు—రామభద్ర (ఇత్యర్ధోక్తే సాశంకం) మహారాజ!" అనుదానిని

జయమురామభద్ర (అర్ధోక్తిలోసంశయించి) మహారాజ ! అని తెనిఁగించిరి. అర్ధోక్తిలోసంశయించి యనుటకు మాఱుగ, "అని సగము పల్కి సంశయించి" యనియుండిన నెక్కుడు బాగుగా నుండును.

మూలము— సీత—అస్మా నపిస్మరతి.

అష్టా—(ఉపవిశ్య) అథకిం దేవి !

తెనుఁగు— సీత—మమ్ముఁ దలపోయుచుండెనా !

అష్టా—(కూర్చుండి) అవును దేవి.

ఇచ్చట, అవుననుట యేమియు సరసముగా లేదు. తలంపకేమి యని యుండనగు.

మూలము— అష్టా—అయే కుమారలక్ష్మణః ప్రాప్తః

తెనుఁగు— అష్టా—ఓయీ కుమారలక్ష్మణుఁ డరుదెంచె.

ఇచ్చట నోయి యనునది బాగుగాలేదు. ఇదే యని, లేక యిదిగో నని యుండఁదగు.

మూలము— లక్ష్మణః—తేనచ తాటకావధే ప్రసాదీకృతాన్యార్యస్య.

తెనుఁగు— లక్ష్మణు—వారిచేఁ దాటకావధంబున నార్యునికిఁ బ్రసాదింపఁబడినవి.

తాటకావధావసరమ్మున నని యర్థము రావలయును.

మూలము— లక్ష్మ—అయంచ భగవాన్ భార్గవః.

సీతా—(ససంభ్రమం) కంపితాస్మి.

రామః—ఋషే. నమస్తే.

లక్ష్మ—ఆర్యే పశ్య, అయ మార్యేణ (ఇత్యర్థోక్తే)

రామః—(సాక్షేపం) అయి బహుతరం ద్రష్టవ్యం.అన్యతో దర్శయ.

తెనుఁగు— లక్ష్మ—ఇది భగవానుఁ డగుభార్గవుఁడు.

సీత—చకితురాలనైతిని.

రాము—ఋషీంద్రా! నీకునమస్కారము.

లక్ష్మ—ఆర్యురాల! చూడుము. ఈతఁడార్యునిచే

రాము—(సాక్షేపముగ) ఓయీ దర్శనీయము పెక్కుగలదు. వే

ఱొకటఁ జూపుము.

ఇచ్చట, చకితురాలనైతి ననుటకు, మాఱు నాయొడలు వడఁకుచున్నదనియు, దర్శనీయము పెక్కు గలదనుటకు, చూడవలసిన దింకను జాలఁగలదనియు నుండి న స్పష్టముగను మధురముగ నుండియుండును.

ఇట్టి లోపము లందందుఁ గన్పట్టుచున్నవి. కొన్నితావుల మూలములోని కవిహృదయము చక్కఁగా స్ఫురించుటలేదు.

శ్లో. సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యవచనీయతా
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః.

తెనుఁగు— [యు?

గీ. ఎల్లతెఱఁగుల వచియింపఁ జెల్లుఁ గాని, దోషరాహిత్య మనఁగ నెందులకువల
కలుకులం దెట్టులో పలుకులను నట్లె, దుర్జనుఁడెయగు జనుఁడు సాధుత్వమందు.

లోకములో స్త్రీలవిషయమున వాక్కులవిషయమునను జనులు సాధారణముగా దోషారోపణము చేయుచుందురు. కావున నిందలేక పోవుట తటస్థింపనే తటస్థింపదనియుఁ గాఁబట్టి యెవ్వరికిఁ దోఁచినట్లు వారు పలుక వచ్చుననియు మూలభావము. ఎల్లతెఱఁగుల వచియింపఁజెల్లుననుట సరసముగాదు. 'దుర్జనుఁడె యగు జనుఁడు సాధుత్వమందు' అనునది తేటతెనుఁగుగాదు.

శ్లో. స్నేహం దయాంచ సౌఖ్యంచ యదివా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మేవ్యథా.

తెను. క. కరుణన్ మైత్రిని సౌఖ్యము, సరగున జనకసుతనైన జనరంజనముంన్
నెరపఁగ విడిచెదు నాకుం, దొరకొనదొక్కింత యైన దుఃఖము మదిలోన్.

ఇచ్చట లోకారాధనము కొఱకు స్నేహమునైనను దయనైనను సౌఖ్యమునైనను జివరకు సీతనైనను దుఃఖము లేకయే నేను విడిచిపెట్టఁగలనని మూలభావము. దీనిలోఁ బేర్కొనఁబడిన వన్నియు సామాన్యముగా విడువఁదగినవి కావనియు నందును జానకిని విడుచుటకష్టతమమనియు "యదివా" యనుపదముచే స్ఫురించుచున్నది. తెనుఁగులో సరగున జనకసుతనైన ననియుండుటవలనఁ గరుణాదులకంటె జనకసుతను సులభముగా విడిచిపెట్టఁగల నని చెప్పినట్లు స్ఫురించును. ఇది మూలవిరుద్ధము, రసభంగమును. మఱియు, "విడిచెదునాకుం దొరకొనదు" ఇది మూలవాక్యక్రమానుసారము తెనిఁగింపఁబడినది. "ముంచతః" వర్తమానము "విడిచెదు" ననునది తద్ధర్మము. ప్రియపదార్థముల విడుచుసమయమున దుఃఖమధికముగా నుండును. అంతకంతకుఁ దగ్గును. విడుచునపుడుఁగూడ దుఃఖము నొందకయే యుండఁగలనని రామునిచేఁ జెప్పించు తలంపున "ముంచతః" అని మూలమునందు వర్తమానార్థక విశేషణము ప్రయోగింపఁబడినది. తెనుఁగులోఁగూడ వర్తమానార్థకములో నుండిన సరసము.

మూలము— లక్ష్మ—ఆర్యే పశ్య.

శ్లో. సంబంధినో వసిష్ఠాదీ నేష తాతస్తవార్చతి
గౌతమశ్చ శతానందో జనకస్య పురోహితః,
రామః— సుశ్లిష్టమేతత్.

శ్లో. జనకానాం రఘూణాంచ సంబంధః కస్య నప్రియః
యత్రదాతా గ్రహీతాచ స్వయం కుశికనందనః.

తెనుఁగు— లక్ష్మ—ఆర్యురాల! చూడుము.

క. బందుగులకు నీజనకుఁడు. నందముగ వసిష్ఠముఖ్యులందఱికి శతా
నందుఁడుగౌతముఁ డనుజన, కేందుపురోహితుఁడుఁ బూజలిడుచుండిరొగిన్.
రాముఁడు—దర్శనీయమిది.

క. జనకరఘురాజకులముల, యనుబంధం బెవని కిష్టమై యుండదు ? దీ
నిని సమకూర్పఁగఁ గౌశికుఁ, డొనరఁగ దాతయు గ్రహీతయును దానయ్యెన్,

మూలమున "సుశ్లిష్టమేతత్" అనుదానికిఁ దత్పూర్వపద్యము నందు సూచింపఁబడిన జనక రఘుకులముల సంబంధము మిక్కిలి యనుకూలముగా నున్న దని భావము. కావుననే "హేమారవింద పరిమళన్యాయాదితి" యని వ్యాఖ్యాత వ్రాసెను. తరువాతిపద్యము దీనినే దృఢపఱుచుచున్నది. కావున నీవాక్యమునకు "దర్శనీయమిది" యను తెనుఁగు సరిపడదు. మఱియు నేసంబంధములోఁ గాశికుఁడు స్వయముగా దాతయుఁ బ్రతిగ్రహీతయునై యొప్పుచున్నాఁడో యట్టి జనకరఘువంశసంబంధ మందఱకుఁ బ్రియమే యని పూర్వోదాహృత ద్వితీయ శ్లోక తాత్పర్యము. అనఁగా, నీసంబంధ మందఱకుఁ బ్రియమగుటకు విశ్వామిత్రుఁడు దానిని సమకూర్చుటయే ముఖ్యకారణ మని ధీరోదాత్తుఁ డగు రాముని యాశయము. ఈకార్యకారణసంబంధము మూలములోని యత్రశబ్దముచే ద్యోతిత మగుచున్నది. తెనుఁగులో, మొదట జనకరఘురాజకులముల సంబంధ మెవ్వరి కిష్టమైయుండఁ దనిచెప్పి పిదప నీసంబంధమును సమకూర్చుటకు విశ్వామిత్రుఁడే దాతయుఁ బ్రతిగ్రహీతయునయ్యె నని చెప్పఁబడినది గాని పూర్వార్ధమునకు నుత్తరార్ధమునకుఁ గలకార్యకారణసంబంధము సూచింపఁబడలేదు. దీనివలన నాత్మోత్కర్ష చెప్పుకొన నిష్టము లేనివాఁడై కౌశికునియందే గౌరవ మంతయు నిలుపఁ దలఁచిన రాముని యుదారాశయమునకు భంగమును మూలవిరోధమును గలిగినవి.

మూలము— సీతా—వత్స! ఏష సకుసుమిత............

లక్ష్మ—సోయం శైలః కకుభసురభి ర్మాల్యవాన్నామయస్మి
న్నీలస్నిగ్ధః శ్రయతి శిఖరం నూతన స్తోయవాహః
ఆర్యేణాస్మిన్—

రామః— విరమవిరమాతః పరంనక్షమోస్మి
ప్రత్యావృత్త స్సపునరివమే జానకీ విప్రయోగః

తె— సీత—కుసుమితకదంబనృత్యన్మయూరంబైనయిమ్మహీధరంబు పేరేమి....

లక్ష్మ—శ్యామస్నిగ్ధ నవాంబుదాశ్రిత శిరస్థానంబు సాలద్రుమ
వ్యామీలత్సుమసౌరభం బిదియొసుమ్మా మాల్యవ చ్ఛైల మహా

రాము—సౌమిత్రీ! యిఁకఁజాలుఁ జాలును వినం జాలం బరార్ధంబు నీ
రామాంగళ్యవతీవియోగ మిదె! సిద్ధం బయ్యెడిఁ బెండియుఁ

చిత్రపటమునం దొకపర్వతము మీఁదఁ జెట్టుక్రింద మూర్ఛనొందిన రా

ముని నేడ్చుచు లక్ష్మణుఁడు పట్టుకొనియున్నట్లున్న యొక బొమ్మనుజూచి యాపర్వ తము పేరేమని సీతయడుగఁగా లక్ష్మణుఁడు మొదటి రెండుపాదములందు నాపర్వత మును వర్ణించి, ఆర్యుఁ డిందు—(ఈపర్వతమునందు) అని మూఁడవపాద మెత్తు గడ చేయఁగనే, వలదు వలదు సీతావియోగము మరలవచ్చినట్లున్న దని రాముఁడు నిషేధించెనని మూలతాత్పర్యము. సీతప్రశ్నకును రాముఁ డాక్షేపింపలేదు. ప్ర శ్నమున కుత్తర మైన మొదటి రెండుపాదములలోని విషయమునకు నాక్షేపింప లేదు. మాల్యవంతమునందుఁ దానుపొందినదుఃఖమును వర్ణింపఁ దలఁచి లక్ష్మ ణుఁడు "ఆర్యుఁ డిందు" అనియెత్తుగడ చేయఁగనే యాదుఃఖవర్ణనము విసన హింపఁజాలనివాఁడై వలదు వల దని యాతురతతో నివారించెను. తెనుఁగులో "ఆర్యేణాస్మిన్" అనియెత్తుకొనకయే మాల్యవత్పర్వతవర్ణనమైన వెంటనే యిఁక నేమియుఁ జెప్ప వల దని రాముఁడు లక్ష్మణు నిషేధించినట్లున్నది. ఆర్యేణాస్మిన్ అని లక్ష్మణుఁడనువఱకును నిషేధమునకుఁ బ్రసక్తియే కలుగలేదు. పర్వతవర్ణనమే రామున కనిష్టమని యనినచో "సోయం శైలః" అనునప్పుడే నిషేధింపవలసియుం డెను. అట్లు చేయకపోవుటచేతఁ దనదుఃఖవర్ణనముమాత్రము వినుట కిష్టములేక దానిని నిషేధించె ననిస్పష్టము. ఇప్పట్టునఁ దెనుఁగు నీరసముగానున్నది. మఱియుఁ దొలుత, లక్ష్మణుఁడు దుఃఖవర్ణనముచేయఁ దలఁచినపుడు రాముఁడు "విరమ విర మ" యని యారంభించుటచేఁ దడవైనయెడల నసహ్యవాక్యములు లక్ష్మణునినోట నేమి వెలువడునో యని యాతని నోరు మూసినంతపనిచేసినట్లు మూలశ్లోకమువ లన స్ఫురించుచున్నది. తెలుఁగునందో. "సౌమిత్రీ! యిఁకఁ జాలుఁ జాలు" నని చాలు నను నిషేధవాక్య ముచ్చరించుటకుఁ బూర్వము "సౌమిత్రీయిఁక" నను మాట పల్కుటకై కాలవిలంబమైనది.

స్మరించుచున్నాఁడ ననుటకు స్మరించుచుంటి ననియు లోకు లిట్లనుచున్నా రనుటకు లోకు లిట్లనుచుండిరనియు, లెస్సగా దీపించుచున్నాఁ డనుటకు దీపించు చుండె ననియు వర్తమానార్థకమునందు భూతార్థకక్రియ లుపయోగింపఁబడినవి.

గుణదోషములు యథార్థముగాఁ గనఁబఱుచుట విమర్శకుల కృత్యము కావున దోషము లిట్లుద్ఘాటింపవలసి వచ్చినది. ఇంతమాత్రముచే గ్రంథము దోష భూయిష్ఠమని యభిప్రాయపడుట కవకాశములేదు. అనేకస్థలములయందుఁ దె నుఁగు కడురసవంతముగ నున్నది. బహుళములైన గుణములనన్నింటిని జెప్పను టచే గ్రంథవిస్తరమగును. శ్రీభుజంగరావు బహదరుగారు మూలగ్రంథమును

వ్యాఖ్యానమును జక్కఁగాఁ బరిశీలించి తెనుఁగు చేసిరనుటకు సందేహము లేదు. వీరు ప్రస్తుతము రచించుచున్న శాకుంతలనాటకమునకై యెదురుచూచుచున్నాము.

శైలికై రెండుమూఁడు పద్యము లిందుదాహరించుచున్నాము—

మ. ఒకచో సీరవనిశ్చలంబు లొకచో నుద్ఘుష్టసత్త్వంబు లిం
కొకచో స్వైరసుషుప్త ధీరరవనాగోచ్ఛ్వాస దీప్తాగ్ను లిం
కొకచోటం బ్రదరాంతరప్రసర దళోత్పేదంబు లౌసీమలం
గృకలాసంబులు తృష్ణవాహననిదాఘోరమ్ములంగ్రోలెడున్.

ఉ. నందనియందుఁ దాదృశఘనవ్యతిరేకము గల్గి తీవ్రమై
చెందను వచ్చి వేదనఁ గడిందిగఁ జేసి పురాతనత్వమున్
జెందియుఁ గ్రొత్తవోలె నెడనేయక యేఁచు దురంతశోకమున్
గ్రందుగఁ గూర్చి మర్మముల నంపమునం బలెఁ గోసె దానిచేన్.

ఉ. అంతరహేతు వొకటి పదార్థముల న్సమకూర్చుచుండు న
త్యంతము స్నేహము ల్బహిరుపాధుల నెన్నఁడుఁ గోరఁబోవు భా
స్వంతుఁడు దోఁచువేళ జలజంబు వికాసము నొందు శర్వరీ
కాంతుఁడు గోచరింప శశికాంతము లీలఁ జెమర్చుఁగాదొకో.

గీ. పరిణతాపూర్ణపుష్కరాంతరపలాశ, మసృణ మాంసలతరసుకుమార మైన
నీతనుస్పర్శ మానందనిలయ మయ్యెఁ, జంద్రచందన నిష్యందసరస మగుచు.

శ్రీరస్తు.

# కావ్యాలంకారచూడామణి.

## అష్టమోల్లాసము.

### ఛందస్సు

| భ | జ | స | య | ర | త | మ | న | గ | ల |
|---|---|---|---|---|---|---|---|---|---|
| U I I | I U I | I I U | I U U | U I U | U U I | U U U | I I I | U | I |

గలము — లగము
U I — I U

(గలమునకు హగణమనియు—లగమునకు వగణమనియు నామాంతరములు.)

---

క. శ్రీవిశ్వేశ్వర విశ్వ, ఙ్మోవల్లభవంద్యపాదకమల కమలభూ
దేవీకమలసితయశా, కోవిదనుత రాయగండ గోపాలంకా!

౧౩. అతిజగతీచ్ఛందఃపాదంబు త్రయోదశాక్షరంబు—

అందుఁ బ్రహర్షిణీవృత్తము—(మ-న-జ-ర-గ-౮ యతి.)

ప్రావీణ్యప్రదయొనరం బ్రహర్షిణిం దాఁ, గావించుఁ మనజరగ వ్రజంబుధాత్రిన్

రుచిరవృత్తము—(జ-భ-స-జ-గ ౯ యతి.)

క్రమంబుతో జభసజగమ్ము లిమ్ముగా, నమర్చఁగా రుచిరసమాహ్వయుం బగున్.

మత్తమయూరము—(మ-త-య-స-గ-౮ యతి.)

[1]సంబోధార్థంబై విలసన్మత్త మయూరా, ఖ్యం బింపొప్పారున్ మతయా[2]గ్ర్యాత్త

మంజుభాషిణి—(స-జ-స-జ-గ-౯ యతి.) [నగాప్తిన్.

సలయుంబు గాఁగ సజసంబుతో జగం, బులు మంజుభాషిణికిఁ బొందు నందమై.

జలదము—(భ-ర-న-భ-గురు-౧౦ యతి.)

ఈభరనంబుల న్భగురు లెక్కుచు [3]నిం, పైభజియించె నేని జలదాహ్వయ మా.

ప్రభాతము—(న-జ-జ-ర-గ-౮ యతి.)

మొదల నజారగము ల్ప్రభాతసంజ్ఞం, బొదవఁగఁ జేయు నపూర్వకల్పనోక్తిన్.

---

క. పరిషత్తులోని ౩౮-౨ సంఖ్యగల పుస్తకము.

చ. ,, ౮౭౧ సంఖ్యగల పుస్తకము.

ట. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము ౧౩-౧-౨ సంఖ్యగల పుస్తకము.

1. చ-సంబద్ధార్థంబై-ట-సంబంధార్థంబై. 2. చ-మతయాగ్రాత్త. 3. ట-పెంపై.

౧౪. శక్వరీచ్ఛందఃపాదంబు చతుర్దశాక్షరంబు—

అందు వసంతతిలకవృత్తము—(త-భ-జ-జ-గ-గ-౮ యతి.)

స్థాపించినం దభజజంబు చతుర్క విశ్వ, త్స్మాపావసంతతిలకంబగు గానియుక్తిన్.

అపరాజితవృత్తము—(న-న-ర-స-ల-గ-౯ యతి.)

ననరసలగముల్ దనర్చిన సత్కృతిం, దనరఁగ నపరాజితంబు[1] కవిస్తుతిన్.

వనమయూరము—(భ-జ-స-న-గగ-౯ యతి.)

నందయతితో భజసనవ్రజగగం బిం, పొంది చదువ న్వనమయూర మగుధాత్రిన్.

[2]సుందరము—(భ-భ-ర-స-లగ-౯ యతి.)

భారసవంబుల నొప్పుఁ బద్మజవిశ్రమం, బారఁగ సుందరవృత్తమై బుధవర్ణ్యమై.

ప్రహరణకలితము—(న-న-భ-న-లగ-౮ యతి.)

ప్రహరణకలితంబయి ననభనవల్, బహువిధయతులం [3]బ్రథచెలు [4]వడరున్.

భూనుతము—(ర-న-న-భ-గగ-౧౦ యతి.)

అందమై రననభతతి నంది గగంబుల్, పొందఁగాఁ బదగతిఁగని భూనుతమయ్యెన్

౧౫. అతిశక్వరీచ్ఛందఃపాదంబు పంచదశాక్షరంబు—

అందు మణిగణనికరవృత్తము—(న-న-న-న-స-౮ యతి.)

నరసత ననన నగణములెసఁగం, గరియతిఁగని మణిగణనికర మగున్.

మాలినీవృత్తము—(న-న-మ-య-య-౮ యతి.)

కరటివిరతి నామక్రాంతయాయుక్తితోడన్, మరిగి[5]తిసుగఁజెప్పన్మాలినీవృత్తమయ్యెన్

సుకేసరము—(న-జ-భ-జ-ర-౧౦ యతి.)

నజభజరేఫలం [6]గదియ నచ్చి దిగ్గతిన్, సుజనమతి న్సుకేసరము శోభితంబగున్.

మణిభూషణము—(ర-న-భ-భ-ర-౧౦ యతి.)

విశ్వభూపమణిభూషణవృత్త మనంజనున్, శశ్వదుత్తరనభారదిశాయతిఁగూడినన్.

మనోజ్ఞము—(న-జ-జ-భ-ర-౯ యతి.)

వరుసమనోజ్ఞ మనంగవచ్చు నజాభర, స్థిరగతిఁబంకజభూయతిం బ్రతిపన్నమై.

౧౬. అష్టిచ్ఛందఃపాదంబు షోడశాక్షరంబు—

[7]అందుఁ బద్మకవృత్తము—(న-భ-జ-జ-జ-గ-౧౧ యతి)

నభజజద్వయగకార సనాతన విశ్రుతిం,బ్రభవమై పరఁగు [8] సత్కృతిఁ బద్మకవృత్తమై

---

1. ట-బగుసంస్తుతిన్. 2. ట లోనీవృత్తములేదు. 3. ట-ప్రభ. 4. చ-వమరున్. 5. ట-తిరిగి. 6. గలయ.
7. యతి లక్ష్యమువలన నెఱుఁగఁదగును. 8. ట-నున్నతిఁ బద్మకమైచనున్.

[1]ప్రియకాంతావృత్తము—(న-య-న-య-స-గ-౧౦ యతి.)

నయనయయుక్తిం దగసగణంబుల్ గురువొందుల్
నియతముదిగ్విశ్రమమును నించుం బ్రియకాంతల్.

చంద్రశ్రీ—(య-మ-న-స-ర-గ-౧౧ యతి.)

అగుంజంద్రశ్రీ[2] దాహారవిరమణాయత్తమైనం
బ్రగాఢంబై యొప్పున్ యమనసర బద్ధాగ్రగాప్తిన్.

మేదిని—(న-జ-భ-జ-ర-గ-౧౦ యతి.)

నజభజరేఫ[3]గంబునఁ దనర్చు మేదినీవృ
త్తజనికి మూలమై దిగుదితస్థవిశ్రమంబై.

౧౭. అత్యష్టిచ్ఛందఃపాదంబు సప్తదశాక్షరంబు—

అందు శిఖరిణీవృత్తము—(య-మ-న-స-భ-లగ-౧౨ యతి)

వివస్వద్విశ్రాంతిన్యమనసభవావిష్కృతగతిం
గవిశ్రేణీరక్తిన్[4] శిఖరిణియనంగాఁదగుఁ [5]బ్రథన్,

పృథివీవృత్తము—(జ-స-జ-స-య-వ-౧౨ యతి.)

జసంబులు జసంబులున్ యవనిషక్తరూపంబులై
పొసంగఁ బృథివీసమాఖ్యయగుఁ బూష[6]విశ్రాంతితోన్.

హరిణి—(న-స-మ-ర-స-వ-౧౧ యతి.)

హరిణి యనువృత్తం బయ్యెన్ శంకరాత్తయతిప్రథన్
సరినసమరేఫాక్రాంతోపేత సస్థలగంబులన్.

మందాక్రాంతము—(మ-భ-న-త-త-గగ-౧౧ యతి.)

పొందందంబై మభనతతగా భూషితంబై తనర్పన్
మందాక్రాంతాహ్వయ మగు [7]శివామంద విశ్రాంతిచేతన్.

త్వరితపదగతి—(న-న-న-న-న-గగ-౧౧ యతి.)

త్వరితపదగతి యనఁగఁ దగుననననాగా
[8]విరచితయు దశమయతి [9]విలసితయు నై నన్.

నర్కుటము—(న-జ-భ-జ-జ-వ-౧౦ యతి.)

నజభజముల్ జవంబులఁ దనర్చిననర్కుటకప్రజననమొప్పు దిగ్యతినిరాజకులాబ్ధిశశీ

---

1. ఈలక్ష్యలక్షణములు ట-లో లేవు. 2. ట-శ్రీనా. 3. ట-గంబులు. 4. ట-కవిశ్రేణీకీర్తిన్. 5. ట-ధృతిన్. 6. చ-విశ్రాంతమై. 7. ట-శివానంద, చ-దిశామంద విశ్రాంతిచేతన్. 8. ట-విరచితము. 9. ట-విలసితము.

౧౮. ధృతిచ్ఛందఃపాదం బష్టాదశాక్షరంబు—

అందుఁ గుసుమితలతావేల్లితావృత్తము—(మ-త-న-య-య-య-౧౧యతి.)

స్వశ్రేయస్సిద్ధిన్ మతనయయయవ్యాప్తిచేఁ జర్మవాసో
విశ్రామం బొప్పం గుసుమితలతావేల్లితావృత్తమయ్యెన్.

మత్తకోకిలవృత్తము—(ర-స-జ-జ-భ-ర ౧౦ యతి.)

మత్తకోకిలవృత్తమై దశమప్రవర్తిత విశ్రమా
యత్తమై రసజాభరేఫల నచ్చమై కడు నొప్పగున్.

౧౯. అతిధృతిచ్ఛందఃపాదం బేకోనవింశత్యక్షరంబు—

అందుశార్దూలవిక్రీడితవృత్తము—(మ-స-జ-స-త-త-గ-౧౩ యతి)

సంబంధించి దినేశవిశ్రమముతో శార్దూలవిక్రీడితా
ఖ్యం బయ్యెన్ మసజంబు[1]లున్ సతతగాయుక్తంబులై యుండినన్

మేఘవిస్ఫూర్జితవృత్తము—(య-మ-న-స-ర-ర-గ-౧౩ యతి.)

మృదువ్యస్తార్థంబై దినకరయతిన్మేఘవిస్ఫూర్జితాఖ్యం
బుదాత్తశ్రీఁ జేర్చున్ యమనసరరప్రోతగప్రాప్తిచేతన్.

చంద్రకళ—(ర-స-స-త-జ-జ-గ-౧౦ యతి.)

వ్యక్తరీతి రసాతజజగ్రా యత్తగకారనిరూఢిచే
సక్త దిగ్విరమంబున నొప్పుం జంద్రకళాహ్వయమై ధరన్.

తరలము (ధ్రువకోకిల)—(న-భ-ర-స-జ-జ-గ-౧౧ యతి.)

నభరసంబులు జాగవర్గము నచ్చి యీశ్వరవిశ్రమ
ప్రభవమై తరలం బనంజను రాజవంశశిఖామణీ.

భూతిలకము—(భ-భ-ర-స-జ-జ-గ-౧౧ యతి.)

భూతిలకం బగు భారసంబులఁ బొంది జాగము లుండినన్
భూతపతిస్ఫుట విశ్రమంబున భూప విశ్వనరేశ్వరా.

౨౦. కృతిచ్ఛందఃపాదంబు వింశత్యక్షరంబు—

అందుమత్తేభవిక్రీడితవృత్తము—(స-భ-ర-న-మ-య-వ-౧౪యతి)

మసమారం బదుమూఁట విశ్రమముగా మత్తేభవిక్రీడి[2]తా
హ్వాన మయ్యెన్ సభరంబుల న్నమయవన్యాసంబులం జెప్పినన్.

---

1. చ-ట. సతతగా. 2. ట-తంబననొప్పున్.

ఉత్పలమాలావృత్తము—(భ-ర-న-భ-భ-ర-లగ-౧౦ యతి.)

పద్మజయుగ్యతిన్ భరనభారలగంబులఁ జెందిన న్మనః
పద్మవికాసహేతువగు పద్యము నుత్పలమాల యండ్రిలన్.

అంబురుహము—(భ-భ-భ-భ-ర-స-వ-౧౨ యతి.)

భాభభరంబులపై సవలొందుచు భానువిశ్రమయుక్తమై
యీభువి నంబురుహం బనఁగాఁ జను నిందువంశనృపాగ్రణీ.

ఖచరప్లుతము—(న-భ-భ-మ-స-స-వ-౧౧ యతి.)

నభభముల్ మసనంబు లగాప్తి న్నాగవిభూషణయుగ్యతిన్
శుభదమై ఖచరప్లుత మొప్పు న్సోమకులార్ణవచంద్రమా.

౨౧. ప్రకృతిచ్ఛందఃపాదం బేకవింశత్యక్షరంబు—

అందు స్రగ్ధరావృత్తము—(మ-ర-భ-న-య-య-య-౭-౭ యతులు.)

క్ష్మాభృద్భ్రాభృద్యతిన్ శ్రీమరభనయయయామాత్రమై యాదిమాద్య
క్ష్మాభృత్కీర్తీశ విశ్వేశ్వరనృపతివరా స్రగ్ధరావృత్త మయ్యెన్.

చంపకమాలావృత్తము—(న-జ-భ-జ-జ-జ-ర-౧౧ యతి.)

నజభజ జారవర్గము దనర్చి దిశాయతి నర్థ[1]యుక్తమై
ఋజుగతిఁ జెంది సత్కవుల [2]కింపుగఁ జంపకమాల యై[3] చనున్.

**లాటీవిటము**—(స,స-స-స-మ-త-య-౧౨ యతి.)

సససా మతయంబులు భానుయతి న్నాకంబై లాటీవిటవృత్తం
బెనకం బెసఁగున్ విరచించినవిశ్వేశా చాళుక్యక్షితిపాలా.

వనమంజరి—(న-జ-జ-జ-జ-భ-ర-౧౩ యతి.)

తనర నజాజజభాగ్భరకారయుతత్రయోదశయుగ్యతిన్
వినుత మగు న్వనమంజరినా[4] దగువృత్త మింపెసలారఁగన్.

మణిమాల—(స-జ-స-జ-స-జ-స-౧౦ యతి.)

వరుసన్ సజత్రితయము న్విసక్త సగణంబుతోడ నొనరం
బరఁగున్ దిగంతవిరతిం బ్రధానపదమై చళుక్యమదనా.

౨౨. ఆకృతిచ్ఛందఃపాదంబు ద్వావింశత్యక్షరంబు—

అందు మహాస్రగ్ధరావృత్తము—(స-త-త-న-స-ర-ర-గ-౮-౭ యతులు.)

సకలశ్రీవిశ్వ భూపా [5]సతతనసరరా సక్తమై యగ్రగాప్తిం
బ్రకటింపన్ దంతి శైలప్రచురయతి మహాస్రగ్ధరావృత్త మయ్యెన్.

---

1. ట-సృష్టిచే. 2. ట-ఇంపగు. 3. ట-నానిలన్. 4 ట-నాఁజను. 5. ట-సతతలనసరా.

[1]భద్రిణీవృత్తము—(భ-ర-న-ర-న-ర-న-గ-౧౧ యతి.)

భాదిరనత్రయంబు గురుయుక్తమై గిరిశవిశ్రమప్రకటమై
మేదిని నొప్పుభద్రిణికి నందు మేరునగధీర విశ్వనృపతీ.

[2]మానిని—(భ-భ-భ-భ-భ-భ-భ-గ-౭-౧౩-౧౯ యతులు.)

కామిని సప్తభకారము తొల గకారమునై పరి కల్పితమై
నేమముగావడి నిల్పినఁ బెన్వలు నిల్పిన మానిని నిక్కముగుఁ.

తురగవల్గితము—(న-న-న-న-స-జ-జ-గ-౧౪ యతి.)

మెఱయునననసజజగములను మేలుగా రచియించినన్
వళులు మనుయతి వలనను దురగవల్గితంబను వృత్తమౌ.

౨౩. వికృతిచ్ఛందఃపాదంబు త్రయోవింశత్యక్షరంబు—

అందు అశ్వలలితవృత్తము—(న-జ-భ-జ-భ-జ-భ-లగ ౧౩ యతి.)

నజభజము ల్భజంబులకునచ్చి భస్థలగయుక్తమైరవియతిం
బ్రజనితమైన నశ్వలలితంబు రాజకులదీప ధీజననుతా.

కవిరాజవిరాజితవృత్తము—(న-జ-జ-జ-జ-జ-జ-వ ౧౪ యతి[3].)

కలయఁగ నేకనకారవయుక్త జకారవకారనికాయనిర
ర్గళగతిచే [4]నలరంగవిరాజవిరాజితవృత్తము రమ్యముగుఁ.

౨౪. సంకృతిచ్ఛందఃపాదంబు చతుర్వింశత్యక్షరంబు—

అందు సరసిజవృత్తము—(మ-త-య-న-న-న-న-స-౧౦-౧౭ యతులు.)

చాళుక్యక్ష్మాపాలవరేణ్యా శ్రీయమతయననిచయయుతననసల్
చాలై యింపై ప్రాలఁదనర్పన్ సరసిజ[5]మగునిలఁ జవులకుఁగుదురై.

క్రౌంచపదవృత్తము—(భ-మ-స-భ-న-న-న-య-౧౦-౧౯-యతులు.)

ప్రాంచితతేజఃకుంచితవైరీభమసభననయపరిచితరీతిన్
[5]అంచితమయ్యెం గ్రౌంచపదాఖ్యం బనుగతహరిదిభయతి నభివృత్తిన్.

౨౫. అభికృతిచ్ఛందఃపాదంబు పంచవింశత్యక్షరంబు—

అందు సింధురవృత్తము—(న-న-న-న-స-భ-భ-భ-గ-౧౩ యతి.)

క్రమమున ననన సభభభగగణక్రాంతిదినాధిపవిశ్రమమై
ప్రమదధరసలయభరితవిరచనన్ బంధురసింధురవృత్తముగుఁ.

---

1. ట-లో, భద్రమనువృత్తము. 2. ట-లో నీవృత్తమును దీనిక్రింది తురగవల్గితమును లేవు. 3. యతిలక్ష్యమువలనఁ దెలియనగును. 4. ట-గవిరాజవిరాజితరంజితవృత్తము. 5. అంచితమయ్యెం గ్రౌంచపదంబీయతిహరిదిభములనభిమతవృత్తిన్.

భాస్కరవిలసితవృత్తము—(భ-న-జ-య-భ-న-న-స-గ-౧-౨యతి.)

సారసహితయతి సంగతవృత్తి న్నంచితభనజయ భననసగంబుల్

పౌరవకులజలరాశిమృగాంకా భాస్కరవిలసిత మన విలసిల్లున్.

౨౬. ఉత్కృతిచ్ఛందఃపాదంబు షడ్వింశత్యక్షరంబు—

[1]భుజంగవిజృంభితవృత్తము—(మ-మ-త-న-న-న-ర-స-వ- ౭-౧౦ యతులు.)

ధీవైదగ్ధ్య శ్రీవిక్రాంతా దిగిభదశమ పదవిరతిన్ భుజంగవిజృంభితం

బై విశ్రాంతుల్ దైవాఱం జెన్నగుమమతననవరసహారియై లగసంయుతిన్.

మంగళమహాశ్రీవృత్తము—(భ-జ-స-న-భ-జ-స-న-గగ-౮-౮ యతులు.)

శ్రీనిలయవిశ్వనృపశేఖరకృతస్తుతివశీకరణమంగళమహాశ్రీ

నానెగడుసద్భజసనంబులతుదన్ భజసనంబులు గగంబును దనర్పన్.

క. క్రమమున నిరువదియార్తై, యమరిన ఛందంబులందు నందంబులుగా

సముచిత సమవృత్తంబుల,సమకూర్చితి నెఱుఁగవలయుఁ జతురులు మఱియున్.

క. ఆలాగు గాక యుద్ధుర, మాలావృత్తములు నాఁగ మంజులతాలా

వాలములు నధికవర్ణవి, శాలమ్ములు నగుచుఁ [2]బరఁగుఁ జతురులకెల్లన్.

అందుఁ జత్వారింశన్మాత్రాగర్భితపాదంబు త్రింశదక్షరంబు—

లయగ్రాహి—(భ-జ-స-న-భ-జ-స-న-భ-య-౮ పైఁబ్రాసయతులు,)

పంబినయతిన్ భజసనంబులఁ బునర్భజసనంబుల భయంబులకదంబము లయగ్రా

హింబెనుపునంబుధమతిం బరఁగుఁబ్రాసనికురుంబకము పాదముల నింబడరుచూడన్

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు—

లయవిభాతియనువృత్తము—(న-స న-న-స-న-న-స-న-న-స-గ)

ననననసనాకలితననననసగంబులవిలసితతరపాదములఁబొసఁగునలుప్రాలన్

బ్రసరితములై యలరుఁబసలయవిభాతియనరసికులకువీనులకు నొసఁగుఁజవులింపై.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు సప్తత్రింశదక్షరంబు—

లయహారి యనువృత్తము—(న-న-న-న-న-న-న-న-న-న-న-స-గ౧౦పైఁబ్రాసయతి.)

పదునొకఁడునగణములఁబొదలిసగణముగురువుమృదులపదరచనఁదగియొదవిమితి

ప్రాలన్

ముదమొసఁగు సభలనని చదువుదురుకవివరులు హృదయములఁజతురతలుగదురల

యహారిన్.

---

1. ట-లో మాత్రమున్నది. 2. ట-నమరు.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు—

త్రిభంగియనువృత్తము(న-న-న-న-న-న-స-స-భ-మ-స-గ.)

లలిననననననములుసనభ మములునతిసగయుక్తిఁజరింపంబ్రసరింపం బాటివహింపం
జెలువుగనవకలినిలుపఁగఁదగునెడవెలయుఁద్రిభంగిసురక్తింబదభక్తింబ్రాసనియు
మఱియు [1]ననియతపాదంబు— క్తిన్

.—దండకము.—

కృతినాది ననహంబు లొండెంద కారంబులొండెం బ్రకల్పించి[2]యామీఁద
నెల్ల[3]ందకారప్రధానంబుగుర్వంతమైత్రకాల నిచ్ఛానురూపావధింబేర్మినిర్మించు
చో[4]మించిత త్తద్గణవ్రాతముక్ వృత్త్యనుప్రాసధుర్యంబులై యర్థవర్యంబులై
మోదితార్యంబులై సాధుసారస్యహార్యంబులై రీత్యలంకారవంతంబులై పు
ష్టిమంతంబులై యింపులంతంతకింపాఱఁ గల్పింపఁగా దండకంబున్నమన్మండలం
బయ్యె రాజేంద్రకోటీరకోటీతటీ నృత్యదాజ్ఞాగ్ర[5]మాణిక్యవిశ్వేశ్వరా విశ్వ
విశ్వంభరాధీశ్వరా.

మఱియు నీవృత్తములు స్వస్థానార్ధసమవృత్తములు పరస్థానార్ధసమవృత్తం
బులునన రెండు తెఱంగు లయ్యె నది యెట్లనిన :—

క. ఛందోవృత్తంబులనము, సందర్భము లీడువడఁగ సముచితనికట
చ్ఛందఃపాదంబుల సర, వింద ద్వ్యకయుభయరూపవృత్తము లయ్యెన్.

క. స్వస్థానార్ధసమములుఁబ, రస్థానార్ధసమములును రచనలచేన
ర్థస్థూలతనిరుఁదెఱఁగై, సుస్థిరవృత్తములఁ గృతులసొంపుల నింపున్.

గీ. మొదలిపాదంబు మూఁడవయదియువరుసఁ, దద్ద్వితీయచతుర్థపాదములునట్ల
[6]సమకవర్ణంబులైనవృత్తములఁజెప్ప, స్వపదజాతార్ధసమవృత్త సంజ్ఞవడయు.

—[7]నారీప్లుతవృత్తము.—

దానోదారశ్రీమతా గానియుక్తిం, గానంగఁదాజన్ధ గగప్రసక్తిన్
మానై చాళుక్యక్ష్మాపాలరమ్యా, స్థానంబు నారీప్లుత సంజ్ఞమయ్యెన్.

—.రతిప్రియవృత్తము.—

ఖ్యాతశ్రీమనజరగంబులుండఁగాఁ ద, ద్గతంబులై జభసజగంబు లొండఁగా
వీతాఘప్రముదితవిశ్వ విశ్వభూపా, ధృతిందలంప నిది రతిప్రియంబగున్.

1. ట-ననేకపాదంబు. 2 ట-లో యామీఁద ననునదిలేదు. 3. ట-నెమ్మిం. 4. ట-ఁజారు. 5. ట-చాళుక్యవిశ్వేశ్వరా. 6 ట-నమర విననింపులైన వృత్తములఁజెప్ప. 7. చ-నారీభుత, ట-నారీభత, అప్పకవీయములో నారీనుత.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నిమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె మిన్న. ౫ ఆశ్వాసములు. ౭౮ పుటలు. సవిమర్శమైన ౧౮ పుటలపీఠిక. వెల రు. ౦-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. భాష సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౦-౧౨-౦.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము.

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవి విరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదము లచ్చటచ్చటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు వర్ణక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రు. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఎ., బి.ఎల్. గారిచే రచింపఁబడిన సవిమర్శపీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౦-౨-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము, శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టీ. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Guru. 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల రు. ౦-౩-౬.

# చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవిప్రణీతము.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము. కార్వేటినగరసంస్థానమునం దుద్భవిల్లినది. ఇంతవఱ కిట్టి భాషాంతరగ్రంథము భోజచంపువునకు లేదు, కావుననే యన్నివిధముల ముఖ్యమైనది. కవితాచమత్కృతులెల్ల నీగ్రంథమందే కానగును. ఎనిమిది యాశ్వాసములు 148 పుటలు రాయలు సైజు, 16 పుటల పీఠిక. ఇంగ్లీషు క్యాలికో బైండు. ముద్రింపఁబడినవి స్వల్పప్రతులు. అయినను వెల రు. 1-0-0 మాత్రమే. భాషాభిమానులు శీఘ్రముగా నొక్కొక్కప్రతిని దెప్పించుకొనుట మంచిది

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయుఁగలరు.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 27 [illegible]
[illegible] ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రకటింపఁబడినది.

[illegible] రు. ౨—౦—౦. విడిసంచిక రు. 0—8—0.

సంపుటము 7. | కాళయుక్తిసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. | సంచిక. 6.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక.

శ్రీరస్తు.

# సర్వేశ్వరశతకము.

*(ఈమూలపాఠము ప్రథమప్రతిలోనిది. రెండుమూఁడు ప్రతులలోని పాఠభేదములు క్రిందఁ జూపఁబడుచున్నవి.)

శా. [1]శ్రీకంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీపాదదివ్యప్రభా
నీకోత్సారితదేవతానిటలదుర్నీత్యక్షరధ్వాంతుఁ జి
త్ప్రాకామ్యాంగు నపాంగమాత్రరచితబ్రహ్మాండసంఘాతుఁ జం
ద్రాకల్పుం బ్రణుతింతు నిన్ను మది [2]నాహ్లాదింతు సర్వేశ్వరా. 1

మ. ఒకమాటీసకలంబు నీమహిమగా [3]నూహించుచు న్వెండి గ్రొ
క్కొకమా టెద్దియు నీవుగా వనుచు నే యుక్తిం [4]బ్రశంసింప నే
రక వేదంబులు చిక్కువడ్డవనినం బ్రవ్యక్తమై [5]యుండు భా
వకుఁడై నీనిజ [6]మిట్టిదట్టిదన నెవ్వాఁ డోపు సర్వేశ్వరా. 2

శా. జ్ఞానాతీతుఁడవై ననీమహిమఁ బ్రజ్ఞం బూని తర్కించు ట
జ్ఞానాంగం బగునైననుం దమయథాశక్తిం బ్రశంసించి ది
వ్యానందస్థితిఁ బొందువారిఁ గని భక్త్యావృత్తి నిన్నెట్టివాఁ
డైనం బ్రస్తుతిసేయుచుండుఁ దనచే నైనంత సర్వేశ్వరా. 3

మ. అమితాంభోజభవాండభాండనిలయం బై యుండు నీయంతరం
గముపట్టెంతయొ దాని కింక బహిరంగం బెట్టిదో సూక్ష్మత
త్త్వము దా నంతకు మీఁద నేమివిధమో[7] తా నిట్టిదీ పెంపుమా
ర్గము నీకై [8]నచింత్య మెట్లొరుఁ డెఱుంగంజాలు సర్వేశ్వరా. 4

---

* ప్రథమప్రతి గురజాల దుర్గరాజు శేషగిరిరావుగారిచ్చినది. †రెండవప్రతి కాశీలోనున్న కొవ్వలి జగన్నాథముగారు పంపినది. మూఁడవది యచ్చుప్రతి.

1. రెండవప్రతిలోఁ నీపద్యమునకుమీఁద

ఉ. చిత్తము ప్రాణ మారుతమును జేర్చి త్రికూటపుదారిఁ దూఱుచు
నృత్తిలియున్న కుండలిని మట్టుగదల్చి పెగల్చినంతట
త్యుత్తమ మండలత్రయము లొందును నిత్యము నెల్లమేల్ బళీ
హ త్తి నిషిద్ధలింగగురుఁ డంచు భజించినుతించి కొల్చెదన్. అనుపద్య మొక్కటిగలదు.

2. నాహ్లాదించి. 3. నూహించి వర్ణించి వే ఱొకమా టెంతయు. 4. బ్రవర్తింప. 5. యుందు. 6. తత్త్వమిట్టిదన. 7. తర్కింపనీపెంపుమా. 8. నశక్య.

మ. ఇన విఘ్నేశ్వరమాతృకాద్రుహిణ బ్రాహ్మీనంద దుర్గారమా
వనితాధీశ్వర భైరవుల్ బలసి భాస్వద్భక్తిసంయుక్తి నీ
కనిశంబుం బరివారభృత్యనికరంబై [1]యున్న నిన్నింకఁ గొ
ల్వనివా రెవ్వ రజాండభాండములలో వర్ణింప సర్వేశ్వరా. 5

శా. ఏపారంగ నజాండభాండనికరం బేరూపులోఁ బుట్టియు
దీపించు న్మఱి రూపులెల్ల సమసుప్తిం బొంది యేరూపులో
[2]లోపింపం గలయంగ నంతటికిఁ దా లోనై విజృంభించి యే
రూపం బవ్యయమై వెలుంగు నది నీరూపంబు సర్వేశ్వరా. 6

మ. జలజాతప్రభవాండబుద్బుదము లశ్రాంతంబునుం బుట్టుచుం
గలయం గ్రాఁగుచునుండు నీపృథులలింగస్ఫారగర్భాబ్ధిలో
పలఁ దద్బుద్బుదగర్భవాసులు [3]హరి బ్రహ్మాదిదేవాలియుం
గలదే వారికి నీమహత్త్వ మెఱుఁగంగాశక్తి సర్వేశ్వరా. 7

మ. భవదున్మేషవిజృంభణంబు [4]వివరింపంగా సరోజాతసం
భవుజన్మంబు భవన్నిమేష మమితబ్రహ్మాండకల్పాంతభై
రవసంక్షోభిత మన్నఁ దక్కిన భవత్ప్రారంభభూరిక్రియా
నివహం బెవ్వరు నేర్తు రెట్టి దని వర్ణింపంగ సర్వేశ్వరా. 8

మ. పవనుండై హిమధాముఁడై యనలుఁడై పానీయమై యాత్మయై
రవియై యంబరమై మహీవలయమై రమ్యాష్టమూర్తిక్రియన్
భువనాండంబులు రక్షణాంగములుగాఁ బుట్టించు నత్యద్భుతో
త్సవలీలావిభవంబు[5]తోడ భవదాజ్ఞాశక్తి సర్వేశ్వరా. 9

మ జలజాతప్రభవాండభాండములు దుశ్చారిత్రులం శాత్రులం
జెలువై యుండ యథాప్రమాణములుగా శిక్షింప రక్షింప ని
శ్చలలీలం బ్రభవించు రాజు భవదాజ్ఞాశక్తిఁగా కింతవ
ట్టెలమిం జేకొని నిర్వహింప మఱి రాజెవ్వాఁడు సర్వేశ్వరా. 10

శా. జ్ఞానజ్యోతి విజృంభమాణముగ నోజన్ విష్ణుదేవాది దే
వానీకాత్మదశావలిం దవిలి [6]నీ వారంగ వారింగళా

---

1. భైరన్న. 2. లోపించుం. 3. హరిబ్రహ్మాదులందేమియుం. 4. ప్రకటింపంగా
5. తోఁప. 6. నీవారంగ వారించుచున్.

జ్ఞానప్రౌఢులఁ జేయుటల్ వెలయఁగా సర్వజ్ఞశబ్దంబు దా
నీనామాంకముగా [1]విధించె నిగమానీకంబు సర్వేశ్వరా. 11

మ. సురల న్మర్త్యసమంబుగా మనుజులన్ శోభిల్ల బృందారకో
త్కరముంగా ఘను నల్పు నల్పుని ఘనుంగాఁ బుణ్యపాపాలిచేఁ
దిరుగన్ద్రైచుచు నీమహామహిమ ప్రీతిం బద్మజాండంబులం
దరయన్ జీవుల నింద్రజాలములుగా నాడించు సర్వేశ్వరా. 12

మ. ఘనుఁడై యేచి దశాననుండు బలిమిం గైలాసశైలేంద్ర మె
త్తిన నద్దానవనాథుఁ ద్రొక్క నతఁ డర్థి న్మ్రొక్కినంగాచి [2]ప్రా
ప్తనశౌర్యాధికుఁ జేసె దుష్టు నణఁప[3]ంగా శిష్టు రక్షింప రం
జనతో నెప్పుడు[4]వేచియుండు భవదాజ్ఞాశక్తి సర్వేశ్వరా. 13

మ. తమకంబెత్తిన నాత్మజం గను మదాంధవ్యాప్తి నేకాంతిస
క్షమునం దెవ్వరుఁ గానకుండఁ గవయంగాఁ బోయి నీబాణపా
తమునం బద్మభవుండు ద్రెళ్లె ననినం దాఁ దప్పివర్తింప లో
కమునం దెవ్వరి కింక నిన్ను[6]నెఱుఁగంగా వచ్చు సర్వేశ్వరా. 14

మ. పలుజన్మంబులఁ గూడఁబడ్డ భవశుంభద్ఘోరదుష్కర్మరా
సులపైఁ గూలి సమస్తజీవులు వెసన్[7] శోకించుచు న్బెద్దదు
ర్బలులై చిక్కినఁ దద్భవాపహరణార్థంబొప్పఁ బద్మోద్భవ
ప్రళయం బొక్కొకమాటు సేయుదు [8]తుదిన్ భావింప సర్వేశ్వరా. 15

మ. సుమహాత్పద్మభవాండపంక్తుల లయక్షోభప్రతాపంబుతో
నిమిషార్థంబునఁ[9]గ్రాఁచి పెంపెసఁగు నీనేత్రానలజ్యోతి క
య్యమమీనాంకజలంధరత్రిపురదైత్యాలి[10]న్విజృంభించి భ
స్మముగాఁ జేయుట నిశ్చయింప నిదిదా శౌర్యంబె సర్వేశ్వరా. 16

మ. అతిదక్షుం డగుదక్షుఁ డీజగములో యాగంబు సల్లక్షణ
స్థితిగాఁ జేయుచునుండి మిమ్ము మదినుద్దేశింపమిం జేసి తా
హతుఁ డయ్యెం దుది[11]నెట్టికార్యములుఁ బొందై యుండునే కర్తస
న్మతితోఁ జేయని దుర్మదుండు మనునే భావింప సర్వేశ్వరా. 17

---

1. విధించు. 2 ప్రార్థన. 3. దాసృష్టిరక్షింప. 4. నేర్చియుండు. 5. ఘాతము(అ). 6. మొఱఁగంగా. 7. మహాశోకించు, శోషించు(అ). 8. మదిన్. 9. గాల్చి (అ). 10. న్విగుర్వించి. 11. నట్ల కార్యములు పొల్లైయుండవేకర్తసమ్మతిగా.

మ. జగతీచక్రము పాదఘట్టన నదృశ్యంబై ప్రవర్తింపఁగా
గగనం బంతయు బాహుమండల సమగ్రవ్యాప్తులం దమ్ముతఁ
బుగఘూర్ణిల్ల నజాంత్యవేళల సముద్భూతాంగహారావళుల్
నెగడం బొంగి నటింతు తాండవమహానృత్యంబు సర్వేశ్వరా. 18

మ. [1]అమరేంద్రాబ్జభవాళి కెన్నఁ దుది నీవాదిం బ్రసాదించి న
ర్థము సిద్ధించుచు నుండుఁగాని సురమాత్రుంగోరినన్నీరికా
ర్యము సిద్ధింప దనేకమార్గములఁ బ్రారంభించిరే నిశ్చయా
ర్థముగా నీవ సమస్తకర్త వగుటం దలిరంప సర్వేశ్వరా. 19

మ. అమరంగా స్ఫటభక్తినాటకము భాషాంగక్రియాంగాభిర
మ్యముగాఁ జూపిన మెచ్చి [2]మీరలు పురేయన్నంతకున్ యోనిగే
హములన్ రూపులు వన్నుకొంచును నటుండై వచ్చి సంసారరం
గములోనం బహురూపమాడు వెలయంగా జీవి సర్వేశ్వరా. 20

శా. శివతత్త్వాంకు రమావిశేషతయు వాక్ఛ్రీనాథుచాతుర్యముల్
దేవాధీశ్వరు[3]వైభవాతిశయముం దిగ్మాంశుతేజంబు శ్రీ
దేవీనందనురూపవిభ్రమము చింతింపంగ నీభక్తిస
ద్భావాత్మం డగుపుణ్యమూర్తికిఁ దృణప్రాయంబు సర్వేశ్వరా. 21

మ. ఇల సద్భక్తులపాదధూళిపటలం బేమర్త్యఫాలంబునం
[4]జిలికె న్వాఁ డపవర్గనాథుఁ డనినన్ సిద్ధంబుగా వానిని
ర్మలహస్తార్పితభూతిఁ బ్రీతి నొసలారంబూయు విశ్వాసికిన్
ఫలమూహించి [5]విధింప నెవ్వరికిఁ జెప్పన్వచ్చు సర్వేశ్వరా. 22

మ. పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రిపానీయముల్
తలమీఁదం [6]జిలికించుకొఁ దగును దీర్ఘంబాడ భారంబు త
త్ఫల మత్యల్పము భక్తపాదయుగళాంభస్స్పర్శ నిర్భారమై
యలరున్ శాశ్వతభుక్తిముక్తిఫలదంబై యుండు సర్వేశ్వరా. 23

---

1. అమరేంద్రాబ్జభవాళికైన మదినీవారం బ్రసాదింప న
ర్థము సిద్ధించుచునుండు దానుచితమాత్మంగోరి నీవీని కా
ర్యము సిద్ధింప.

2. నీవిలబలే. 3. వైభవోన్నతిశయిం (అ). 4. చిలుకన్. 5. విధించిరయి. 6. జిలికించు
కొన్నశుచి.

మ. రమణా! భక్తసమగ్రదర్శనము తీర్థశ్రేణి, తద్గోష్ఠి తీ
ర్థము, తద్దివ్యదయావలోకనము తీర్థం బెన్నఁగా నిట్టిజం
గమతీర్థాంబుధి నోలలాడక వివేకభ్రష్టులై పోయి లో
కమునం దీర్థములంచు నేఱులు సొఱంగా నేల సర్వేశ్వరా. 24

మ. కమనీయం బగుసర్వతీర్థములు లింగం బున్నచో మూర్తిమం
తములై యొప్పుచునుండు [1]లింగమును దాత్పర్యంబుగా భక్తగా
త్రములం దెప్పుడు నుండుఁగాన మహిలోఁ దత్త్వార్థమూహింపఁ దీ
ర్థములం దెల్లను దివ్యతీర్థము భవద్భక్తుండు సర్వేశ్వరా. 25

మ. ధరణిం దీర్థము లాడుకంటె ముదమంద న్సర్వయజ్ఞంబులం
బరఁగం జేయుటకంటె సువ్రతము లొప్పన్ వేదశాస్త్రోక్తత
త్పరుఁడై యాదటఁ జల్పుకంటె మది నుత్సాహించి నీభక్తిమ
త్పురుషశ్రేష్ఠులఁ బూజసేయుట మహాపుణ్యంబు సర్వేశ్వరా. 26

మ. భవదీయామలతత్త్వనిర్ణయకళాప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠీసుఖవార్ధిలోనఁ గడు వేడ్కం దేలినం గాక యీ
భువి నే తీర్థజలంబులం గడిగినం బోనేర్చునే ఘోరదు
ర్భవ[2]సంఘాతదురాత్మతామసమహాపంకంబు సర్వేశ్వరా. 27

మ. ధరణిం బ్రాక్తనభక్తనిర్మితమహాస్థానంబులై యొప్పు శ్రీ
గిరిముఖ్యం బగు దివ్యతీర్థములు భక్తిం జూచిరే వారి దు
స్తరదోషంబులు వాయునన్న మఱి సాక్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగఁ బాయదే నరులపాపంబెల్ల సర్వేశ్వరా. 28

మ. కని సద్భక్తుల కంతనంతఁ గడు వేడ్కన్ హృత్ప్రణామంబు సే
సినమాత్రం జెడు సర్వదోషములు [3]తచ్ఛ్రీపాదముల్ముట్టి మ్రొ
క్కిన సర్వాంగసమగ్రశుద్ధియగు భక్తిన్ వారికిం బ్రీతిచే
సినఁ ద్వద్దివ్యదయావలోకనఘనశ్రీ లొందు సర్వేశ్వరా. 29

---

1. లింగమునఁ దాత్పర్యంబుగా భక్తగాత్రమునం దేవుఁడునుండు, అని ప్రథమప్రతిలోని పాఠము. ఈ 25-వ పద్యమునకుమీఁద రెండవప్రతిలో "భక్తిమాహాత్మ్య"మను శీర్షిక కలదు.
2. సంఘా(గా)కలితాత్మతామస. 3. ఇది మొదలు ప్రథమపుస్తకములోఁ బద్యము కడవఱకు లేదు. దీనికి మాఱు పైపద్యములోని "భక్తింజూచిరేవారి" యిత్యాది పూరింపఁబడినది

ఉ. జలజాతప్రభవాచ్యుతాదులు [1]మదిం జర్చించి చర్చించి నీ
కలయూ పారయులేక చిక్కులఁ బడంగా నిన్ను హస్తార్పితా
మలకవ్యాప్తికిఁ దెచ్చి యేర్పఱిచి సంబంధించి చేకొన్న భ
క్తులశౌర్యం బుపమింప నెవ్వఁడు సమర్థుం డింక సర్వేశ్వరా. 30

మ. అమరన్ భక్తగణాత్మమధ్యమము లింగావాస మాలింగమ
ధ్యము పద్మప్రభవాండభాండనిలయం బై యుండుటన్ భక్తతృ
ప్తి మహాలింగము తృప్తియై మహిమ నుద్దీపించుఁ దల్లింగతృ
ప్తిన్మహాత్త్వంబున నీసమస్తమును దృప్తింజెందు సర్వేశ్వరా. 31

మ. [2]అనురాగంబున నిన్నుఁ జూచుఁ దలపోయుం జొక్కుఁ గాంక్షించు వ
ర్ణనసేయుం దమకించు సిగ్గు విడియుం బ్రార్థించు శోషించు సం
తను నీధ్యానముదాల్చుఁ దన్ను మఱచుం దా నీదశావస్థలం
దనరంగా మది నిన్ను డక్కఁగొను సద్భక్తుండు సర్వేశ్వరా. 32

మ. ఎలమిన్ భక్తుఁడు వక్రుఁడై నడిచెనే నేపారఁగా దానికిం
గలుషింపం గలహింపఁ గింకిరిపడంగా దెట్టిచో నైన ని
ర్మలగంగాపృథులప్రవాహమరయం [3]బ్రస్ఫూర్తిమై నెన్నివం
కలుగాఁ బాఱిన దాని నొండు వలుకంగాఁ జన్నె సర్వేశ్వరా. 33

మ. సికతాధామము నీకుఁ జేసి తమలోఁ జెన్నొందిక్రీడించు బా
లకులింద్రాధికు లన్న నీగుడు లతిశ్లాఘ్యేష్టకాష్ఠామలన్
సుకుమారంబుగ నెత్తి భూతలములో శోభిల్లువంశప్రదీ
పకు సౌభాగ్యముమాన మెవ్వరికిఁ జెప్పన్వచ్చు సర్వేశ్వరా. 34

మ. భవదభ్యర్చనవేళలన్ భవుల సంపద్భ్రాంతులన్ దీనమా
నవులన్ విద్విషులన్ [4]భవాతురుల సన్మానించుటల్ సౌఖ్యము
ఖ్యవిహారేచ్ఛలు నీమహత్త్వములు నిత్యానంద మూహించుచో
భువినీభక్తుల కాత్మలోనవరసంబు ల్పుట్టు సర్వేశ్వరా. 35

మ. కరుణం జేకొని రేని [5]రౌరవపదగ్రస్తాత్ము దేవేంద్రుఁగాఁ
బరఁగం జేయుదు రాత్మలో నలిగిరేఁ బర్జన్యునే రౌరవో

---

1. మొగిం (అ). 2. ఈ 32వ పద్యమునకు రెండవప్రతిలో "దశావస్థలు" అను శీర్షిక కలదు. 3. బ్రస్ఫూర్తితో నెన్నివంకలు. 4. భవాతురుల సన్మానించుటల్ సంఘసౌఖ్యవిహారేచ్ఛలు నీ మహామహిమ. 5. నున్నద (అ).

త్కరపంకప్రవిలీనకీటకముఁగాఁ గల్పింతు రన్నట్టిచో
హర! నీభక్తులశక్తి యెట్లు గుఱిసేయన్వచ్చు సర్వేశ్వరా. 36

మ. రమణీయక్షితిపాలుఁ [1]డింద్రునిచతుర్థాసక్రమాయుష్యుఁ డా
యమరేంద్రుం డజునాడికాద్వయముపాఁ[2]డాబ్రహ్మ విష్ణున్ని మే
షముపాఁ డంచును వీరి నెల్లనగు నీసాలోక్యసామీప్యస
త్తమరాజ్యస్థితిపట్టభద్రుఁ డగుసద్భక్తుండు సర్వేశ్వరా. 37

మ. [3]ప్రకటింపంగ సమస్తపాతకములం బాపంగ నీపూజయం
దొకపుష్పాంశము చాలు నన్న మహిలో నూహింపఁగా నీపదా
ర్చకు లేమార్గమునందు శుద్ధులు మదిం జర్చించి తద్దుర్గుణ
ప్రకరం బెన్నెడివాఁడు లోకములలోఁ బాపిష్ఠి సర్వేశ్వరా, 38

మ. తమ తేజంబుఁ దృణీకరించుచు సముద్యత్తేజులై మీఁదిలో
కములం దెల్లఁ జరించు నీయచలభక్తశ్రేణులం జూచి నె
య్యమునం దారును దద్విధంబునను మిమ్మర్చింపనూహించిమ
ర్త్యమునం బుట్టఁగ వాంఛసేయుదు రమర్త్యశ్రేణి సర్వేశ్వరా. 39

మ. అమరన్ భక్తులకెల్ల నీవ హృదయంబై యుండుట న్వారి సౌ
ఖ్యము నీసౌఖ్యము వారికూర్మియు సమగ్రంబై ననీకూర్మి త
త్త్వము భావింపఁగ వారికోపము భవత్ప్రఖ్యాతరౌద్రప్రభా
వము దా వారలవాక్యనిర్ణయము నీవాక్యంబు సర్వేశ్వరా. 40

మ. అవనిం బెన్నిధి భాగ్యహీనునకుఁ బ్రత్యక్షంబు[4]గా కప్పుడొం
డవ భాండాకృతిఁ దాల్చి మాటువడి మాయావృత్తి నున్నట్లుకా
భవదీయప్రతిబింబమూర్తి యగు సద్భక్తుండు సంసారదు
ర్వ్యవయసాయాత్ముల కెల్లఁ గేవలనరుండై తోఁచు సర్వేశ్వరా. 41

మ. క్షితిపై శ్వేతమునీంద్రుఁ డంపనలుకం గీనాశుఁ డేతెంచి నీ
యతికోపోజ్జ్వలనాహుతి న్నడిసెఁ దథ్యం బేకనిష్ఠానమ
న్వితులం జేకొని భక్తవత్సలుఁడవై నీ వెప్పుడు న్గావఁగాఁ
బ్రతిపత్త్యావలి కెట్లు వారిదెసఁ జేరన్వచ్చు సర్వేశ్వరా. 42

---

1. రింద్రునిచతుర్థాసక్రమాయుష్యులా. 2. డాబ్రహ్మాయుష్మన్నిమే. 3. ఈపద్యము నకుఁ బూజామాహాత్మ్య మని రెండుప్రతిలోఁ జేరుకలదు. 4. గాకుంట దొంతవ.

శా. కింకం దన్నునదల్చి చక్రము గ్రాంగ్రాణంబున నాస్త్ర సంచిన కొంకం బొప్పఁగ దానిఁ [1]దుత్తుఱుముగాఁ జోఁదట్టి యుప్పొంగె ని

శ్శంకాత్ముండు దధీచి శాశ్వతుఁలు నీసద్భక్తు లూహింపఁగా
సంకల్పప్రభవప్రతాపవనభాస్వద్దావ సర్వేశ్వరా. 43

శా. ఘటదుగ్ధంబులు వేఱుగాక వెలయంగా నొంతతోఁ డంటిన
న్నటదుగ్ధాంబుధి పేరనే జగములో నల్పుండు దుస్సంగతిం
జటులాత్ముం డగుఁగాక యెయ్యెడల నీ సద్భక్తుఁ డేకార్యము
త్కటమై తాఁకిన నన్యచిత్తుఁ డగునే తర్కింప సర్వేశ్వరా. 44

మ. సతి వేడ్కం దన ప్రాణవల్లభునితో సంయోగ[2]మాసించుఁగా
కతనిం బ్రార్థన నేసి సొమ్ము గొనిపో నర్థాడునే తజ్జ్ఞఁడీ
క్షితి నీభక్తియు వేఁడుఁగాక మఱి నీశ్రీపాదము ల్గొల్చి కు
చ్చితకామ్యార్థము [3]లొంద వేఁడుకొనునే చింతింప సర్వేశ్వరా. 45

మ. భ్రమరధ్యానము దాల్చి కీటకము సద్భావాదిసంయుక్తిఁదా
భ్రమరంబై ఖగవీథి[4]నాడునన నన్భావించి నిన్నాత్మ నె
య్యముతోఁ ధ్యానము సేయుమర్త్యుఁడును నీయట్లే పరవ్యోమత
త్త్వమునం [5]దవ్యయలీల నుండు టరుదే తర్కింప సర్వేశ్వరా. 46

మ. అమరశ్రేణులకు న్సుధామయకళౌఘాత్మీయసారంబు ర
మ్యముగాఁ [6]గ్రోలఁగనిచ్చి తా నొకకళామాత్రాంగుఁడై యున్నచం
ద్రమునింజూచి [7]జనమ్ము మ్రొక్కు [8]క్రియ నారన్ భక్తపూజావిధి
క్రమభారాకృశుఁజూచి మ్రొక్కుదురు లోకంబెల్ల సర్వేశ్వరా. 47

మ. చెదరంబాఱు దశప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునం
గుదియంబట్టి చరింపకుండ శశి నర్కుంగట్టి భాస్వన్మన
స్సదనస్థానమునందు నిశ్చలమి సంస్థాప్యంబు గాఁ జేసి తా
హృదయానందరసాబ్ధిఁ దేలు శివయోగీంద్రుండు సర్వేశ్వరా. 48

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహావిస్పష్టమై యాత్మలో
పలభావించిన నీస్వరూపమె మహాప్రవ్యక్తమై దృష్టులం
దలఁపం జేకొని యున్న నీయచలితధ్యానంబునం జేసి తాఁ
గలనైన న్శివయోగి[9]తన్ను జగముం గానండు సర్వేశ్వరా. 49

---

1. తుత్తుమురు (అ) 2. మర్థించు. 3. నొందు. 4. నాడుగతి సంభావించి. 5. దవ్వయ. 6. జేకుఱనిచ్చి, 7. జగత్తు. 8. గతి (అ). 9. తానె జగముంగా నుండు.

మ. భవదాకారము గాంచు నీ స్తవకదంబ శ్రేష్ఠసద్వాక్యముల్
చెవులార న్వినుఁ నిన్నె చెప్పు మది దుశ్శీలేంద్రియాటోపదు
ర్వ్యవసాయాత్ములఁ గాంచుచోఁ వినెడిచో వర్ణించుచోఁ జేఁకునుం
జెవిటిన్మూఁగయునై చరించు మహి నీశీలుండు సర్వేశ్వరా. 50

మ. [1]అతిలాలిత్యముగా నహర్నిశము నిన్నర్చింపఁగావచ్చు సు
వ్రతుఁడై యుండఁగవచ్చు నెల్లకళలం బ్రౌఢుండు గావచ్చు వా
క్పతి గానైనను వచ్చుఁగాని మదినీభక్తుండుగారాదు సు
స్థితిగా నీదయలేనిమానవునకుం జింతింప సర్వేశ్వరా. 51

మ. [2]భవికిన్ భక్తి మహత్త్వ మంకురితమై పాటిల్ల భక్తుండు బాం
ధవమాత్రుండగు భక్తి పుష్పితముగాఁ దద్భక్తుఁ డాత్మేశుఁడై
సవిశేషస్థితిఁ దోఁచు భక్తిసఫలోత్సాహంబునుం బొందఁగా
[3]నవికల్పక్రియ నంత భక్తుఁడును నీవై యుండు సర్వేశ్వరా. 52

మ. సుముఖుండై శివయోగి మోదము మదిన్ శోభిల్లఁ జేకొన్న భి
క్షము విప్రోత్తమకోటిభోజనసదృక్షం బన్న సౌభాగ్యయో
గమునం దారయ నమ్మహామహుఁడు వేడ్కంగోరి యారోగిణం[4]
బమరం జేసినపుణ్య మెట్లు గుణియింపన్వచ్చు సర్వేశ్వరా. 53

శా. ఎచ్చో నీపదభక్తుఁడుండు మది నింపెక్కం బ్రయత్నంబుతో
నచ్చో నీవనిశంబు నుండుదు త్వదీయధ్యానచిన్మూర్తులై
యచ్చోసన్మునులెల్ల నుండుదురు మంత్రాంగాక్షరాయుక్తులై
యచ్చోఁ దీర్థములెల్లనుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా. 54

శా. సత్యంబెప్పుఁడు దప్పఁడే మహిదురాచారుండు గాఁడేని యా
చిత్యం బేమఱఁడేని దుర్జనులగోష్ఠిం బొందఁడే భక్తసాం
గత్యం బాదటఁ బాయఁడేని మదనగ్రస్తుండుగాఁడేని నీ
భృత్యుం డాతఁడు మూఁడులోకములలోఁ[5]బెంపొంద సర్వేశ్వరా. 55

శా. [6]పెంపం దల్లియుగుర్ రుజాపటల[7]దుష్పీడాపధిక్షోభ వా
రింపన్ వైద్యుఁ డగుం గుమార్గవిధులం గ్రీడింపఁ బోకుండ శి

1. ఈ 51-వ పద్యమునకు రెండవప్రతిలో మొదటిపాదముమాత్రమే యున్నది. 2. దీనికి రెండవప్రతిలో "భక్తులకుభవసంగమంబు గలుగుట" యను శీర్షిక గలదు. 3. నవికల్పస్థితినంత భక్తుఁడగు. 4. ఆరోగిణము = భోజనము. 5. మొదటిప్రతిలో "రూపింప" అని తప్పుగానున్నది. పద్యములోని పాఠము రెండవప్రతిలోనిది. 6. దీనికి భక్తిమాహాత్మ్యమని రెండవప్రతిలోశీర్షిక. 7. దుష్పీడావధిక్షోభమాఱింపన్.

క్షించఁగ బల్లిదుఁడైన తండ్రియగుచుం బ్రీమంతుఁగా నెంతయుం
సంపద్వృద్ధి[1]యొసంగ దాతయగు నీసద్భక్తి సర్వేశ్వరా. 56

మ. ఉరుసంసారగజేంద్రదర్పదళనప్రఖ్యాతప్రతాపోగ్రకే
సరి, దుష్ప్రాపశరీరబంధవిపు[2]లత్మాజవ్రజచ్ఛేదవి
స్ఫురితక్రూరకుఠారధార, దురితప్రోద్భూతజీమూతదు
స్తరసంఘాతవిఘాతమారుతము నీసద్భక్తి సర్వేశ్వరా. 57

మ. అరివీరప్రకరంబు భీకరతరంబై తాఁకుచో సింహసిం
ధురశార్దూలమృగోరగాది భయము ల్దో తెంచుచో ఘోరదు
స్తరసంసారవికారవేదనలు మీఁదం బర్వుచో వజ్రపం
జరమై చేకొని తన్ను నెత్తుకొను నీసద్భక్తి సర్వేశ్వరా. 58

మ. కమలాప్తుం డుదయింపఁగా ననలనక్షత్రతమీపాధీశ తే
జములెల్లం బెడఁబాసిపోవుగతి నీసద్భక్తిభావంబు చి
త్తములోనం బ్రభవింపఁగా నితరమంత్రధ్యాన తద్దేవతా
క్రమమాయాపటలంబు లన్నియును వీఁకం గ్రాఁగు సర్వేశ్వరా. 59

మ. చటులప్రాయగుణేంద్రియాత్ములకు వాంఛావృత్తి నీభక్తి సం
స్ఫుటమై యుండదు భక్తితత్పరులకుం బొల్పొందఁగాఁ జిత్తము
తఁటదుష్టేంద్రియవర్గతామసపరిగ్రస్తంబుగా దెట్లు చీఁ
[3]కటికిం దిగ్మమరీచికిం గలదె సాంగత్యంబు సర్వేశ్వరా. 60

మ. బలవంతుండును దుర్బలుండును మహాప్రౌఢుండు మూఢుండు నుం
గులజుండుం గులహీనజాతుఁడు ఘనక్రూరుండు శాంతాత్మని
శ్చలచిత్తుండును నొక్కరూప మది నీసద్భక్తిచిత్తంబులో
పల వర్తించిన మీఁద నేవిధమునం భావింప సర్వేశ్వరా. 61

శా. కామోద్రేకవిజృంభణంబును సమగ్రక్రోధమున్ లోభమున్
వ్యామోహంబు మదంబు మచ్చరము దీవ్రంబైన పంచేంద్రియో
ద్దామాశీటోపముగ్రాఁ‡ పెంపెసఁగు తత్త్వజ్ఞానికిం గాక తా
సామాన్యాత్ములకేల నూలుకొను నీసద్భక్తి సర్వేశ్వరా. 62

---

1. యొసర్చు. 2. త్మాజచ్ఛిదానర్గళ. 3. "చీఁకటికిం గల్గునె దిగ్మరోచికిని" అని మొదటి పుస్తకము. ‡ టోపమణంచ (అ).

మ. ఉరుపక్షంబులు వచ్చునంతకు నిరుద్యోగంబున న్వృక్షకో
టరమధ్యంబున నుండుపక్షిగతి నిష్ఠంగోరి నీభక్తివి
స్తరమాత్మం బ్రభవించునంతకును దత్సంసారకారాగృహాం
తరగేహంబున[1]నుండి జీవుం డతిచింతంబొందు సర్వేశ్వరా. 63

శా. లింగారాధన జంగమార్చనములోలిన్ భక్తికంగంబు ప్రా
ణాంగవ్యాప్తియునై స్ఫురించు నిది తత్త్వార్థం బగుంగాన నా
యంగాభ్యర్చన జంగమాహితకరుండై చేసినం డాశివ[2]
శృంగారం బగు వానిభక్తి మదిం జర్చింపంగ సర్వేశ్వరా. 64

మ. *అరయంగర్మవిధానదానవిధివద్ధ్యానోత్తమజ్ఞానముల్
వరుసం బేర్కొన నాల్గుయోగములు తత్త్వం బెందు నీభక్తి వి
స్తరబాహ్యక్రియలెల్లం బొల్లులగుటం దద్భక్తియోగంబు తాం
బరంగం దక్కినమూండుయోగములకుం బ్రాణంబు సర్వేశ్వరా. 65

మ. అమరంగా ధన మిచ్చి కాతురు[3]మహీయఃప్రీతిం బ్రాణంబుం, బ్రా
ణము నర్థంబును నిచ్చి కాతు, రభిమానంబు న్విశేషించి మా
నముం బ్రాణంబు ధనంబు నిచ్చి కడుసన్మానంబుగా నుత్తమో
త్తమచారిత్రులు భక్తిం గాతురు ప్రమోదం బంది సర్వేశ్వరా. 66

మ. [4]అనుబంధేంద్రియ భూతవర్గము యమాద్యష్టాంగ[5]మంత్రోరుసా
ధన[6]ముచ్చాటననేసి పాపి గురుసద్వాక్యప్రకాశోత్తమాం
జనదృష్టిం బరికించి యేర్పఱిచి వాంఛంగోరి సాధించి చే
కొను చిన్మూర్తికిం గాని భక్తివిధి గీలొందెందు సర్వేశ్వరా. 67

మ కనకంబందు ఘనీభవించిన కళంకంబెల్ల[7]సువ్యక్తిగా
ననలాస్యంబునం గానిపోనిగతి జీవాత్మంబ్రవేశించి చే
కొని వర్తించిన దుర్మలత్రయపరిక్షోభంబు నీభక్తిచే
తను బాపంబడుం గాని[8]యొండొకటిచేతం బోదు సర్వేశ్వరా. 68

మ. అమరంగా గురుమంత్రకార్ముకమునం దాత్మాస్త్ర మష్టాంగయో
గమహాముష్టివివేకి యేయుటయుం దఖండం బజాండాదిత

---

1. నుండు జీవుం డతిపంతంబొంది. 2. శివశృంగారము—గణముచెడినది *ధరణింగర్మవిధాన భక్తివిభవ. 3. మహోద్యత్ప్రీతి. 4. అనుబద్ధేంద్రియ. 5.యోగానుసా. 6. ముచ్చాటన మొందం జేసి. 7. తెల్లంబుగా. 8. వేఱొకటి.

త్తవేసులెల్లనప్డి[1]నుచ్చిపాఱి భవదుద్యత్సూక్ష్మకైవల్యల
క్ష్యము సత్యద్భుతశక్తితోడఁ గమియంగానాటు సర్వేశ్వరా. 69

మ. [2]తనరం గాయవహిత్రమందు హృదయస్తంభాభిసంస్థానమై
చను నీధ్యానపటంబు నూల్కొలిపి భాస్వద్భక్తివాతాహతి
[3]న్వినుతజ్ఞానపథంబు చేకొని సముద్వేగంబుమై జీవుఁడీ
ఘనసంసారమహార్ణవంబుఁ గడవంగాఁబాఱు సర్వేశ్వరా. 70

మ. అకలంకస్థిరభక్తి[4]మున్నొగయ నిన్నశ్రాంతముం జూచి పా
యక పూజించి మహామహుండు భవదభ్యర్చ్యుండగుంగాక దా
సకలేచ్ఛావిషయంబులం బొగయుచుం జాపల్యతం జేయు నీ
బక వేషార్చన నిన్ను నెట్లు సొగయింపం జాలు సర్వేశ్వరా. 71

మ. సమదోత్సాహసుఖాభిలాషలును నీసంసారమాయావినో
దములు న్స్వర్గఫలాపవర్గఫలచిత్తభ్రాంతులుం బూజ్యరా
జ్యమహాకాంక్షలు నెన్నిచూడ నివి నీసద్భక్తి కత్యంతరా
యములై మాటికి మాటి కడ్డుపడుఁ [5]గార్యశ్రేణి సర్వేశ్వరా. 72

శా. మోహాంధ్వాంతములో మునింగిన మహామూఢుం డతిభ్రష్టుఁడై
సోహంబంచుఁ దొడంగి నీకుఁ గడు దూరాత్ముండగుంగాని దు
ష్టాహంకారగుణంబుమాని మదిసొంపారంగ[6]సద్భక్తి దా
సోహం బన్న భవత్పదార్చకుఁడు నీవై యుండు సర్వేశ్వరా. 73

శా. చావం బుట్టుచుఁ బుట్టఁ జచ్చుచు మహాచండాలసంసారపా
రావారంబునఁ గూలి తాఁ జెడుటకుం బ్రవ్యక్తిగా నాత్మలో
నేవం బొందక యేను నీవనుట తానేజ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టి కుతర్కముం గలదె చింతింపంగ సర్వేశ్వరా. 74

మ రసికుండై భవదంఘ్రిపద్మయుగ మారాధించుచో దుర్మద
వ్యసనాటోపము చిక్కలం బొరలుచు న్వర్తించుచున్నట్టి పా
లసుపూజావిభవం బదొప్పునె భువిన్ లక్షింప నారంభముం
గసవుం బెంచిన చేనుఁ[7]బోలుఁ దలఁపంగా మీఁద సర్వేశ్వరా. 75

---

1. గ్రుచ్చి. 2. తనరంగాయవహిత్రమందు హృదయస్తంభాతిసంధానమై. అచ్చుప్రతిలోఁగూడ నిట్లె. వహిత్రము = తెప్ప. 3. ఒనరన్ జ్ఞానపుటంబు వెల్గునఁ దమోదోగ్యగంబుఁ బోజీవుఁ 4. మై సొగసి మిమ్మశ్రాంతముఁన్. తోనొరసి (అ). 5. కామ్యశ్రేణి. 6. నీభక్తి. 7. బోలెఁ దలఁపంగా నెందు.

మ. అమితోత్సాహమునంది నీకుఁ దనసర్వార్థంబులుంగూర్చి నే
మముతో నిచ్చుటకంటె శౌర్యగుణసామర్థ్యంబునుం[1]బొంది ప్రా
ణము నీకిచ్చుటకంటె దుస్తరభవోన్మాదంబు[2]మర్దించి చి
త్తము నీకిచ్చుట పెక్కుభంగుల మహౌదార్యంబు సర్వేశ్వరా. 76

మ. ఘనవైరిప్రకరంబు[3]ధాటిననిలో ఖండించుకంటెన్ మృగేం
ద్రుని జేపట్టుటకంటె[4]వారినిధిలోఁ దోఁగాడుకంటెన్ మహా
శనిఁదాఁ బ్రేయుటకంటె ఘోరభవ[5]రదుశ్చారిత్రవారించి రం
జనతోఁ జిత్తము శిక్షసేయుట మహాశౌర్యంబు సర్వేశ్వరా. 77

మ. అమితామోద నవప్రసూనముల నిన్నర్చించుచో గద్యప
ద్యము లూహించి నుతించుచో వివిధగీతవ్రాతముల్పాడుచో
నమృతాహారము లిచ్చుచో నిపుణుఁడై యాటాడుచో[6]నందుఁ జి
త్తము సద్భక్తియె నీవు చేకొనుపదార్థంబెల్ల సర్వేశ్వరా. 78

మ. కడుఁ జిత్రంబుగఁ జేయఁగా నొఱ సురంగం బయ్యెనే ఖడ్గమం
దిడకున్నం; [7]జెడురూపదేమికొఱ దానిం బెక్కుపాటింపఁగా
[8]నొడలెబ్బంగులనోపునే నియతితో నూహించి నిన్నాత్మలో
నిడకున్నం [9]జనురూపు నేమికొఱ తా నీక్షింప సర్వేశ్వరా. 79

మ. జ్వరసంతాపవిశోషితాంగుఁడు సుధాసంకాశదివ్యాన్నపా
నరసశ్రేణి భుజింపరోయుగతి నున్మాదేంద్రియధ్వాంతదు
స్తరసంసారమదప్రమత్తుఁడు మహాసౌఖ్యోత్సవంబైన మీ
చరణారాధనయందు బుద్ధిఁ జొనుపం జాలండు సర్వేశ్వరా. 80

మ. కలయం గాష్ఠయుగంబుఁ గూర్చి తరువంగాఁ బుట్టి తత్సాధనం
బుల రెంటిన్ దహియించు వహ్నిగతిఁదాఁ బొల్పొందఁ గాయంబుసం
ధిల సత్కర్మముతో మథింపఁగ భవచ్చిద్భక్తి సద్వహ్ని యు
జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ దత్త్వం బెన్న సర్వేశ్వరా. 81

మ. స్థిరబుద్ధిం దనసొమ్ము భక్తవరసుక్షేత్రంబులన్ బీజమై
పరఁగంగా వెదపెట్టి మీఁద ఘనసంపన్నుం డగుంగాక దా

---

1. జెంది. 2. వారించి 3 దాఁకియు. 4. దిగ్గజములోఁ ద్రోపాడుంకటెన్. 5. భవ. 6. జిత్రముల్ రమణన్ భక్తిరొ నీవుచేకొని సదారక్షింతు సర్వేశ్వరా. 7. జెద నాటదేమి మెరదా నేకట్లపాటింపఁగా. 8. నొడలేభంగుల నొప్పునేని. 9. జడరూపదేమిగొఱ (అచ్చు).

నరిషడ్వర్గ ముపాలుసేసి భవమాయాగ్రస్తుఁడై యిచ్చనె
వ్వరి వేఁడం జనువాఁడొకో విషయదుర్వ్యాపారి సర్వేశ్వరా. 82

శా. కాయం బన్నది వారిబుద్బుదసదృక్షం బందు రూపింప లేఁ
బ్రాయం బన్నది శారదాంబుదతటి[1]త్ప్రఖ్యంబగుం దత్సుఖ
శ్రేయం బన్నది మాయ యి ట్లెఱిఁగియున్ శీఘ్రంబ నీధ్యానసం
స్థాయీభావనఁ జెందఁ డేమిటికియో సంసారి సర్వేశ్వరా. 83

మ. భవదీయస్థిరభక్తి లబ్ధియు భవద్భక్తైకగోష్ఠీమహో
త్సవలీలావిభవంబు నీయనుదినధ్యానానుమోదంబులో
నివి నిత్యస్థితులారయంగ విధి దేవేంద్రాది భూతాఖిలో
త్సవభోగస్థితులెల్ల [2]మిథ్య లవి తత్త్వం బెన్న సర్వేశ్వరా. 84

మ. తనయుక్తి న్భవదంఘ్రి[3]సేవగలసద్భక్తుండు పాపంబుచే
సినఁ బుణ్యంబగు భక్తిహీనుఁడు శ్రుతుల్చేపట్టి పుణ్యంబుచే
సినఁ బాపంబగు దీని కింతటికిఁ జర్చింపంగఁ జండేశ్వరుం
డును దక్షుండును సాక్షులెన్న నగరాట్కోదండ సర్వేశ్వరా. 85

శా. ప్రారంభించి చకోరపోతము మహీయజ్యోత్స్నయం దుత్సవ
శ్రీరంజిల్లుచు వేడ్క నుండుగతి నాచిత్తంబు నీదివ్యశృం
గారధ్యానమునం దహర్నిశముఁ జొక్కంజేయవే దేవశ్రీ
గౌరీలోచనసక్తకీనటనరంగస్థాన సర్వేశ్వరా. 86

మ. [4]తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హరమీపాదపయోజ[5]పూజితములై యత్యద్భుతం బవ్విగుల్
కరులో నశ్వములో ననర్ఘమణులోఁ గర్పూరమో హారమోఁ
దరుణీరత్నములోఁ బటీరతరులోఁ దథ్యంబు సర్వేశ్వరా. 87

మ. [6]ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా

---

1. త్ప్రాయంబుగా(అ) 2. దుస్థితులు సత్యంబెన్న. 3 పంకరుహ. 4. ఈపద్యము ప్రథమమంద న్నమయ్యగారు చెప్పినది యని మొదటి ప్రతిలో నున్నది. 5. పూజనముచే. 6. ఈపద్యముంగూర్చి ప్రథమప్రతిలో నీరీతినున్నది. ఈశతకపద్యములు తాటియాకున కొకపద్యముచొప్పున వ్రాసి శ్రీసత్రశాల సమీపస్థానమునఁ గృష్ణానది సన్నిధిని గంగదాపునఁ గూర్చుండి గండక త్తెర కంఠమున ధరించి యొక్కొక్క తాటియాకును గృష్ణలో వేసి యెదురు నడచివచ్చిన యాకును సూత్రమునఁ గుచ్చు

యకకాలత్రితయోపచారముల నిన్నర్చించుచోఁ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా. 88

శా. ఆనందంబును బొందినప్పుడును సత్యాశ్చర్యకార్యార్థభా
వానీకంబులు దోఁచునప్పుడును రోగాపాయదుఃఖాతుర
గ్లానింబొంది చరించునప్పుడును సత్కార్యంబున న్నీవు నా
ధ్యానాబ్జం బదయింపుమయ్య దివిజేంద్రస్తుత్య సర్వేశ్వరా. 89

శా. నానాశాస్త్రసముచ్చయాగమపురాణప్రౌఢులై తత్త్వవి
జ్ఞానధ్యానసమాధివిద్యలతివిస్పష్టంబుగా నేర్చరే
దానన్నేర్పరులెల్ల నేరరు భవత్సద్భక్తివిద్యాసమా
ధానప్రస్ఫుటశక్తి నీకరుణచేతంగాని సర్వేశ్వరా. 90

మ. ప్రకటింపంగ మదీయచిత్త మదిరా పంచేంద్రియోద్వృత్తమై
ప్రకటప్రాప్తిని సోలుఁగాని మఱి నీపాదాబ్జసంసేవనం
బొకవేళైనభజింప నొల్లదు నిజం బూహింపఁగా నట్ల యీఁ
గకు దుర్గంధముగాక సహ్యమగునే కస్తూరి సర్వేశ్వరా. 91

మ. మలినాంగుం డగుటేమికష్టము మనోమార్గంబు నీభక్తివి
ర్మలసౌభాగ్యనిధానదీపశిఖయై రంజిల్లదే భూషణో
జ్జ్వలదేహుం డగుటేమి తేజము మనోవ్యావృత్తి దుర్మోహసం
[1]చలదుష్కర్మగతిం జెడందగునె దా జీవుండు సర్వేశ్వరా. 92

మ. ఇల[2]నాచిత్తము యోగసాధనలయం దీఁదాడఁగాఁ గొంతని
శ్చలతం జేరఁగవచ్చు; లేక తినవాంఛావృత్తిఁ బోనిచ్చినం

---

చునుండఁగాఁ బైనివ్రాసినపద్యము కామ్యార్థముగా రచింపఁబడినదని కృష్ణలోఁ బోవుచుఁ దిరిగి రానందునఁ దనతల నుత్తరించుకొన నుద్యోగించుసమయమున నాతాటియాకుమీఁదిపద్యము తుడిచి మోక్షార్థముగాఁ దాఁజాపద్యమువ్రాసియున్న తాటియాకును నొక పసులకాపరి చిన్నవాఁడు అన్నమయ్యంగారి తావునకువచ్చి నాకుఁ "దాటియాకు దొరకినది దీనిమీఁద నేమోవ్రాసియున్నది చూచుకో"మ్మని యొకతాటియాకును జేతికిచ్చి యాచిన్నవాఁ డదృశ్యుం డయ్యె నంతటఁ బద్యమును జూచి యిది యీశ్వరుఁడు చేసిన మాయ యని సంతోషించినాఁ డని పెద్దలవలనఁ దెలియఁబడుచున్నది.

1. చలదుష్పంకముఁ బొంది పీడఁబడఁగా జర్చింప సర్వేశ్వరా. కలితాటోపము ఖాఁదఁ బీడితునిగాఁ గాఁజింప. (అచ్చు). 2. ఇలలోఁ జిత్తము.

బొలుపై నీదెనఁ జేర దట్టిదకటా బోధించినంగాక కే
వలసంబోధన నేల నిల్చు బుజువై [1]వర్తిప సర్వేశ్వరా. 93

మ. ఉదకం బింకిన లావుమాలి కడు మై యుష్ణింపఁగా రొంపిలోఁ
గదలంజాలని మీను వానగురియం గ్రమ్మెక్కి పెన్నీటిలోఁ
బొదలం గన్నవిధంబునన్ భవముతోఁ [2]బోరాడుమర్త్యుండు దా
హృదయాబ్జంబున నిన్నుఁ [3]గొల్వఁగనునే యింపొంద సర్వేశ్వరా. 94

మ. భవదీయార్చన సేయుచోఁ బ్రథమపుష్పం బెన్న సత్యంబు రెం
డవపుష్పంబు దయాగుణం [4]బును విశిష్టం బేకనిష్ఠాసమో
త్సవసంపత్తి తృతీయపుష్పమది భాస్వద్భక్తి సంయుక్తియో
గవిధానం బవి లేనిపూజలు [5]మదిం గైకోవు సర్వేశ్వరా. 95

మ. అమరేంద్రాద్రిశరాసనంబు, హరి దివ్యాస్త్రంబు, భూమండలం
బమరంగా రథ, మర్కచంద్రులు తదీయాంగంబులై యొప్పఁ జి
త్రము నీకుం బురలక్ష్య మేయునెడ నుద్యద్భాతి నేయల్ప కా
ర్యములం, [6]దైనను దామహాఘనము నీయత్నంబు సర్వేశ్వరా. 96

మ. దివిజేంద్రత్వముఁ బద్మజత్వము జగత్సేవ్యస్థిరానర్ఘలో
త్సవరూపంబగు కేశవత్వమును నీసద్భక్తి సంవృద్ధిలోఁ
లవమాత్రస్థితు లెన్న భక్తిజనితోల్లాసావనోద్యత్సుఖా
ర్ణవసౌభాగ్యముమాన మెవ్వరికి నెన్నన్వచ్చు సర్వేశ్వరా. 97

మ. పరమార్థంబుగ నామనంబున భవద్భక్తిప్రభావంబు వి
స్తరమై పుట్టదు పుట్టినం బ్రబల దంతం గొంతవర్ధిల్లనే
విరసంబై యటమీఁదఁ జిక్కువడు భావింపంగనెట్లన్న న
స్థిరుఁడంగాన జడుండఁగాన బకవేషింగాన సర్వేశ్వరా. 98

శా. శ్రీకంఠాయ నమోనమో నతసురజ్యేష్ఠాయ రుద్రాయ లిం
గాకారాయ నమోనమో విగతసంసారాయ [7]శాంతాయ చం
ద్రాకల్పాయ నమోనమో దురితసంహారాయ తే యంచు ని
న్నాకాంక్షం బ్రణుతించు మానవుఁడు నీవై యుండు సర్వేశ్వరా. 99

---

1. వర్తిల్లి. 2. బోల్డాడు. 3. నిల్పనగు నిర్భీకుండు (అ). 4. బతివిశిష్టం. 5. మహిం. 6. దైనసదా. 7. దివ్యాయ (అ).

మ. భువనోత్పత్తి విధించుచో నజుఁడవై పొల్పొందఁగా దాని ను
త్సవలీలం బ్రభవించుచో మృడుఁడవై సర్వంబుఁ గల్పాంతభై
రవసంక్షోభ నటించుచో హరుఁడవై త్రైగుణ్యశక్తిం దుదిన్
శివనామాంకముఁ దాల్చు నీమహిమ దాఁ జిత్రంబు సర్వేశ్వరా. 100

మ. [1]జలధుల్ మేరల నాక్రమించి సముదంచద్భంగి నుప్పొంగినన్
జలజాతప్రియశీతభానులు యథాసంచారము ల్దప్పినం
గులశైలంబులు పాదుపెల్లగిలి దిక్కూలంబునం గూలినం
[2]దలఁకం డుబ్బఁడు చొప్పఁదప్పఁడు భవద్భక్తుండు సర్వేశ్వరా. 101

శా. శూలస్థాపితుఁ డైనమానవునకున్ శూలంబు దుర్వారవా
త్యాలిం గంపము[3]నొందకుండిన సుఖంబై తోఁచు మాడ్కిన్ భవా
భీలజ్వాలలఁ గ్రాఁగుమానవునకున్ బింబాధరాహారవ
స్త్రాలంకారము లించుకించుక[4]సుఖంబై తోఁచు సర్వేశ్వరా. 102

శా. *ఆకాశానలచంద్రసూర్యపవమానాత్మాంబువిశ్వంభరా
ప్రాకామ్యాంచితమూర్తి భేదముల నీబ్రహ్మాండనానాఘటా
నీకప్రాకటజీవభావవిలసన్నిర్మాణకర్మాద్భుతా
స్తోకశ్రీకరమూర్తియై వెలుఁగు నీస్థూలంబు సర్వేశ్వరా. 103

మ. అతివాఙ్మాలమునై యజాండనిలయంబై యాదిమధ్యాంతవ
ర్జితరూపాధికనిష్కలంకపదమై సిద్ధాంత మధ్యాత్మసం
యుతమై కోటిరవిప్రకాశయుతమై యోంకారమంత్రాదిసం
స్తుతమై [5]యేచి యచింత్యమై నిగుడు నీసూక్ష్మంబు సర్వేశ్వరా. 104

మ. అజుఁడై సృష్టి[6]యొనర్చు రాజసముచే నందంబుగాఁ దానధో
క్షజుఁడై వర్ధిలఁజేయు సాత్త్వికము సంప్రవృత్తిగా గోపతి
[7]ధ్వజుఁడై సంహృతిసేయుఁ దామసమునం, దత్సర్వముం[8]గూడఁగా
నిజవిస్ఫూర్తి వెలుంగుఁ దుర్యమగుచున్ నీయాజ్ఞ సర్వేశ్వరా. 105

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంతశాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌందర్యాంబికాసంగమా

---

1. రెండవప్రతిలోఁ జరణములు క్రిందు మీఁదైనవి. 2 తలఁగండెన్నఁడు. 3. నొందకించుక. 4. సుఖంబైయుండు. * ఈపద్యమునకు "శివస్థూలసూక్ష్మశరీరములు" అను శీర్షికకలదు. 5. మించి యచింత్యమై నెగడు (అ). 6. యొనర్ప. 7. ధ్వజుఁడౌచున్ మృతిసేయు. 8. జూడఁగా నిజమూహింప నజాండభాండములలో (అ).

ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
[1]రికిం దాశక్యమె నీనిజంబెఱిఁగి వర్ణింపంగ సర్వేశ్వరా. 106

మ. భవదుఃఖార్ణవయానపాత్రము పరబ్రహ్మంబు యోగీంద్రహృ
ద్భవనప్రస్ఫురితప్రదీపము నఘధ్వాంతార్కబింబం బతి
శ్రవణానందకరంబు సన్మునిగణస్వాధ్యాయ[2]పాఠంబు మీ
శివనామాంకము భక్తపుంగవసదాసేవ్యంబు సర్వేశ్వరా. 107

మ. అణిమాద్యష్టగుణప్రసిద్ధులు [3]త్రికాలారాధ్యు లుద్యద్వచో
మణికోటిప్రతిమప్రభాపటలు లున్మాదేంద్రియధ్వాంతభీ
షణదైత్యేంద్రవినాశకారణమహాశౌర్యాన్వితు ల్లోకర
క్షణదక్షుల్ వినుతింప నీప్రమథసంఘాతంబు సర్వేశ్వరా. 108

మ. సకలాధీశ్వరులై గణాధిపతులై సర్వజ్ఞులై నిత్యులై
యకలంకాత్మకులై మహామహిములై యంభోజగర్భాండర
క్షకులై యుండుదు రెల్లవారును భవత్సద్భక్తి నానాగణా
ధికలీలావిధి నంతరంగముల వర్తింపంగ సర్వేశ్వరా. 109

మ. *అమరేంద్రాబ్జభవాచ్యుతాదులకు నీయాజ్ఞాప్రభావంబలం
ఘ్యము నీకుం భవదీయభక్తమహదాజ్ఞాపంబు నుద్యత్ప్రభా
వము లోకంబులలో నలంఘ్యమగుట న్వర్ణింపఁగా నీమహా
త్త్వముకంటెం గడుఁజెల్లు భక్తులమహత్త్వం బెన్న సర్వేశ్వరా. 110

మ. శివసాహిత్యుల [4]సత్కరస్థలము కాశీక్షేత్ర మాహాత్త్వదే
[5]శవిశాలోన్నతశాఖ లారయఁగఁ బంచక్రోశ మాపాణిసం
భవశోభాన్వితచిత్రరేఖలు మహాభాగీరథీతీర్థముల్
శివలింగం బలవిశ్వనాథుఁ డరయన్ సిద్ధంబు సర్వేశ్వరా. 111

మ. వరుసం బైకొని వచ్చుకర్మములు[6]మున్వారించి మాయామల
[7]జ్వరముల్గూల్చి యపారఘోరతరసంసారాబ్ధిలంఘించి భీ
[8]కరసూత్రాంగవిచిత్రకంచుకము హీఁకంబుచ్చిపోవైచి తాఁ
[9]బరమవ్యోమము [10]సొచ్చునీయచలసద్భక్తుండు సర్వేశ్వరా. 112

---

1. రికిశక్యంబగు నీనిజంబరసి. 2. సారంబు. ఈపద్యమునకు రెండవప్రతిలో మంత్రమాహాత్మ్యమనిశీర్షిక. 3. త్రిలోకారాధ్యులు. *ఈపద్యము రెండుమూఁడు ప్రతులలో లేదు. 4. దాకర—సాహిత్యులసత్కర (అ). 5. శవిశేషోన్నతిఁ బొల్చునంగుళులు(అ). 6. దావారించి. 7. జ్వరముంగాల్చి. 8. కరసూత్రాంగము పట్టుకంచుకము. 9. బరమధ్యానముదాల్చి (అ). 10. చొప్పునుండును భవద్భక్తుండు.

మ. పరమార్థంబగు [1]తత్త్వమార్గమున నీపాదాబ్జసద్భక్తిఁ డో
 క్కరుఁడుం దక్క సరోజజాద్యమరసంఘాతంబులో నెల్లఁ దా
 నెరయం[2]గాచికొనంగఁజాలఁడు మహానిర్భీతుఁడున్ లేఁ డతి
 స్ఫురణం గాలుఁడు దన్ను [3]వేచి వడిఁ గొంపోనుండ సర్వేశ్వరా. 113

మ. [4]తనచారిత్రము సన్నుతించు గురుభక్తశ్రేణి వర్ణింపఁగాఁ
 దనచిత్తంబు భవత్పదస్మరణచేతన్నిన్ను మెప్పింపఁగా
 ననుకూలస్ఫుట[5]నిశ్చలత్వమున రా నభ్యంతరంగస్థితి
 న్వినుతిం బొందినతజ్ఞుఁ డీజగములో నీమెచ్చు సర్వేశ్వరా. 114

మ. క్షితి నత్యుగ్ర[6]తపంబునందు జఠరాగ్నిం[7]గాలఁగానేల ని
 ష్ఠతిభక్తిస్థితిఁ[8]బూజసేయు మహనీయత్వంబు తాఁజాలదే
 [9]ప్రతిపక్షాలినడంప రోగభయముర్వారంబు వారింప న
 ద్భుతసౌఖ్యంబులు వెంప దివ్యసుఖముం బొందింప సర్వేశ్వరా. 115

మ. శివవాక్యస్ఫురితాక్షరద్వయసకృజ్జిహ్వా[10]ప్రదేశాత్ముఁ డీ
 భవదుఃఖాంబుధి[11]దాఁటఁజూచుతఱిఁ దత్పంచాక్షరీమంత్ర ము
 త్సవలీలంగడు[12]శుద్ధుఁడై జపము వాంఛంజేయు భాస్వద్గుణా
 ర్ణవు సౌభాగ్యముమాన మెవ్వరికి నెన్నవచ్చు సర్వేశ్వరా. 116

శా. ఏదేశంబున నేదిశాముఖమునం దేయూర నేవాడ మీ
 పాదాభ్యర్చనసేయు నిర్మలుఁడు సద్భక్తుం డొకం డుండె నా
 యాదేశంబును నాదిశాముఖమును న్నాయూరు నావాడ గం
 గాదిస్నానసదీప్రవాహఫలదంబై [13]యొప్పు సర్వేశ్వరా. 117

మ. ఒనరం జిత్తము శుద్ధిలేనినరుఁ డుద్యోగంబునం గోరి చే
 సినపూజావిభవంబు సువ్రతములున్ శీలంబులు న్మంత్రసా
 ధనముల్ తీర్థములుం దపంబులును మీఁదం జెట్టవాఁ డభ్యసిం
 చిన శస్త్రాస్త్రకళానిభంబులగుఁ జర్చింపంగ సర్వేశ్వరా. 118

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహంకారంబుఁ జిత్తంబు నా
 యమలాంతఃకరణంబు నతురచతుష్కావాప్తిఁగావించి పం

---

1. తత్త్వమారయఁగ. 2. గాచికొనంగఁజాలి నిలుప న్నేదేవుఁడు న్లేఁడతి. 3. చేరి. 4. తన చారిత్రము తత్త్వవేత్తలగు 5. నిష్కళంకబహిరంగాభ్యం. 6. తపంబుచేసి. 7. గ్రాఁగఁగానేల. 8. బూజసేయ నియతుండై యుండఁగాఁ. 9. ప్రతిపక్షావలినొంప. 10. ప్రదేశాత్ముఁడై. 11. దాఁటునన్న మఱి 12. సిద్ధుఁడై. 13. యుండు.

చమవర్ణంబుగ నాత్మఁగూర్చి కడువాంఛన్ యోగి పంచాక్షరీ
సుమహామంత్రముతోడ [1]నైక్యపదవిన్ శోభిల్లు సర్వేశ్వరా. 119

మ. భవదీయాననపంచకంబువలనం బంచాక్షరీమంత్రము
ద్భవమై తత్పదవర్ణపద్ధతుల శుంభత్పంచభూతంబులు
ద్భవనంబై యఖిలంబుఁ బుట్టెను లసత్పంచాక్షరీమంత్రమీ
భువనాండంబులఁ దల్లియై సఫలతం బొందించు సర్వేశ్వరా. 120

మ. పటుశాస్త్రాగమదృష్టి నివ్విధమునన్ భావించి వీక్షించి యు
ద్భటవృత్తిన్ భవదీయ[2]భక్తినికర బ్రహ్మాండకుండైన నా[3]
దట లోఁగాచుకొనంగవచ్చు విదితోద్దండప్రతాపోత్కట
స్ఫుటకోపానలమూర్తియై యముఁడు కొంపోకుండ సర్వేశ్వరా. 121

మ. [4]కలవారై మతిమంతులై రసికులై గంభీరులై ధీరులై
లలనామన్మథులై సముజ్జ్వలవచోలాలిత్యులై నిత్యులై
బలవిభ్రాజితులై యశోభరితులై భాసిల్లుభాగ్యోదయుల్
తొలిజన్మంబుల మిమ్ముఁ గొల్చినమహాత్ముల్ వారు సర్వేశ్వరా. 122

మ. ఖలులై యాచకులై విరుద్ధవికటాకారాంగులై పంగులై
బలహీనాతురులై రుజాపటలతాపచ్ఛన్నులై ఖిన్నులై
చలనాందోళితచిత్తులై మలినులై జాత్యంధులై మందులై
[5]తొలిజన్మంబున మిమ్ముఁ గొల్వని దురాత్ముల్ వారు సర్వేశ్వరా. 123

శా. [6]ఏయేవేళల నేవయస్సున నరుం డేభూమి నేయూరిలో
నేయేకర్మము నాచరించు నశుభంబేని న్శుభంబేని దా
నాయావేళల నావయస్సున నరు డాభూమి నాయూరిలో
నాయాకర్మములెల్లఁ దాఁగుడుచుఁ దథ్యంబింత సర్వేశ్వరా. 124

శా. అడ్డం బోయినచోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయం బనుచుఁ [7]బేర్కొన్నంతటం జేసి వా
రాడంబోయి సురాంగనాకలితదివ్యారామ[8]చింతామణి
క్రీడాశైలవిహారు లౌదురు మిముం గీర్తింప సర్వేశ్వరా. 125

---

1. నైక్యము మదిన్. 2. భీతినికర. 3. నంతట. 4. ఈ పద్యమచ్చు ప్రతిలోఁ గనఁబడదు. 5. యిలజన్మించు దురాత్ము లేమిడని వారీక్షింప సర్వేశ్వరా. యిలజన్మించెదరాత్మమిమ్మిడక తార క్షింప సర్వేశ్వరా (అ) 6. ఈ పద్యము మొదటిప్రతిలోమాత్రము గలదు. 7. బేర్కొన్నంత మాత్రాన. 8. చంద్రోపల క్రీడాగేహ (అ).

మ. తమలింగంబునకంటె జంగమము సౌందర్యంబుగాఁ గొల్చు టు
త్తమభక్తస్థితి లింగజంగమలసత్సామ్యంబుగాఁ జేత మ
ధ్యమభక్తస్థితి లింగపూజ నధికుండై [1]జంగమోపాసనా
క్షముఁడై యుండుట భక్తియందును గనిష్ఠత్వంబు సర్వేశ్వరా. 126

శా. [2]శాకాబ్దంబులు వార్ధిషట్క పురజిత్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగాఁగ మహిలో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవమొప్పఁ జెప్పె శుభకృత్ప్రవ్యక్త[3]వర్షంబునన్
శ్రీకారాధనవంతమై వసుధలోఁ జెన్నొంద సర్వేశ్వరా. 127

మ. అభిరమ్యంబుగ[4]దూదికొండ మహనీయారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్యవసంతసంజనితసద్భావప్రసూనావళి
న్విభవం బొప్పఁగఁ గూర్చి యెంతయు లసద్విఖ్యాతి సంపత్సుఖ
ప్రభవం బైన భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా. 128

శా. ధాత్రి న్భక్తజనానురంజనముగాఁ దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచితశబ్దబంధురముగా సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాన్వితముగా శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా. 129

శా. బాలుం డాడెడు ముద్దుమాట లుపమింపం దండ్రికిం బ్రౌఢభా
షాలాపంబులకంటె నింపయినయ ట్లస్మత్స్వభావంబునం
దాలోకించి రచించినట్టి యిది యింపారంగ నీకు న్మహో
లాలిత్యస్తుతికంటె నావినుతి యశ్లాఘ్యంబు సర్వేశ్వరా. 130

మ. పరమార్థంబుగఁ దత్త్వము న్నెఱుఁగ నొప్పం దీర్చి డెందంబు నీ
కరుణాస్థానముఁ జేర్పలేక తనవంకం బోవఁగా నిచ్చి రే
నరకాబ్ధింబడవైచుఁ దత్క్షణములోనంగానఁ దత్త్వక్షమం
బరయం జిత్తము [5]శూకలాశ్వము విధంబై యుండు సర్వేశ్వరా. 131

మ. [6]భవదంఘ్రిద్వితయార్చనంబును భవత్ప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠీవిభవంబులు న్విమల సూక్ష్మధ్యానయోగంబు నా

---

1. జంగమోపాస్తిన (అ). 2. శా॥ శ॥ ౧౧౬౮. 3 సంవత్సర శ్రీకూలంబునఁ గూలుఁగాక మదిఁ దర్కింపంగ సర్వేశ్వరా (మూల). ఈ 127 పద్యములే మొదటి ప్రతిలోనున్నవి. 4. దూదికొండయను గ్రామము కర్నూలుజిల్లా పత్తికొండ తాలూకాలోఁ బత్తికొండకు సమీపమున నున్నది 5. శూకలాశ్వము = శిక్షింపఁబడని గుఱ్ఱము. 6. ఈపద్యమచ్చు ప్రతిలో లేదు.

నివి సంపూర్ణసుఖంబు లెన్న మఱి దేవేంద్రాదిభోగంబు లు
త్సవసంబంధములెల్ల సుస్థిరతులు తథ్యం బెన్న సర్వేశ్వరా. 132

మ. సమయోద్దిష్టసహస్రపంకరుహపూజాపూరణార్థంబు నే
త్రము విష్ణుండు సుభక్తి యేర్పడ భవత్పాదంబు లర్పించి చ
క్రముఁ దాఁ గైకొని దైత్యకోటి ననిలో ఖండించెఁ దా నీపద
క్షమతానేవ సమస్తదేవతలకు న్సత్త్వంబు సర్వేశ్వరా. 133

మ. అమర న్వేదపురాణశాస్త్రములు మున్నాకాంక్షఁ దత్త్వ[1]ప్రభే
దము రూపింపఁగ నేర వన్న మఱి యాతత్త్వంబు లెట్లన్న ను
త్తమసంతోషమెకోరుగనన్న నరుఁ డుత్సాహించి నీభక్తస
త్తమపూజారతి నేర్చునే నతఁడు తత్త్వజ్ఞుండు సర్వేశ్వరా. 134

మ. అమితోద్యద్ధ్వనదీయతత్త్వము [2]మహీయస్తోత్రవాణీవిలా
సములై యొప్పు సమస్తవేదములు శాస్త్రశ్రేణియు న్దివ్యవి
భ్రమనాదంబులు నెన్నిచూడ నివి నీపంచాక్షరీమంత్ర భా
వములై యుండు సమస్తలక్షణముల న్వర్ణింప సర్వేశ్వరా. 135

శా. సంకీర్ణాకలితాక్షరత్రయము భాస్వన్నాదబిందు క్రమా
లంకారద్వి[3]తయంబుతోఁ గలసి లీల న్దివ్యయోగీంద్రహృ
త్పంకోద్భూతము[4]లందు రూఢమగుచుం బంచాక్షరీమంత్ర మ
య్యోంకారాత్మక మా లసన్మునిగణం బూహింప సర్వేశ్వరా. 136

మ. అమలజ్ఞానవిభాసభాసురత నయ్యష్టాంగపూజావిధి
క్రమయోగంబుల నిన్ను నెల్లపుడు జోకం గొల్వఁ[5]గా నేల ని
క్కము నీభక్తులగోష్ఠి చాలుఁ గడువీక న్ఘోరసంసారదుః
ఖము లెల్లం బెడవాప నిన్ను వెలయంగాఁ జూప సర్వేశ్వరా. 137

మ. [6]జయశక్తి న్రవిచంద్రతారకముగాఁ జల్పె న్యథావాక్యలా
న్వయ సంజాతుఁడు నన్నమార్యుఁ డవని న్వర్ణించి నీసత్కథా
క్రియ సంబోధన నీదుభక్తిని మహానిర్ణీతవిశ్రాంతిగా
భయవిభ్రాంతులు లేక యీశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా. 138

---

1. ప్రబోధము (అ). 2. తదీయస్తోత్రవాణీసముద్రము లై యొప్పు సమస్తశాస్త్రములు పూర్ణశ్రేణులన్ దివ్యవి। భ్రమవాదంబులు నిశ్చయింప నవి శ్రీపంచాక్షరీమంత్ర భా। వ్యములై యొప్పు సమస్తలక్షణములం జర్చింప-(అ). 3. త్రితయంబులో (అ). 4. నందు గూఢమగుఁ దత్పంచాక్షరీమంత్ర మ। య్యోంకారాక్షరమంత్రము సన్మునిగణం బూహించి (అ). 5. సద్భక్తి (అ). 6. ఈ పద్య మచ్చుప్రతి లోలేదు.

# గ్రంథస్వీకారము.

## వారంగల్ ఒంటిమిట్ట వివాదము.

ఈవ్యాస మీనడుమఁ బరిషత్పత్రికాముఖమున జరగిన బమ్మెర పోతనామాత్యనివాసవిషయకవివాదమునకు సంబంధించినది. బెజవాడలో న్యాయవాదిగ నున్న బ్రః పెద్దిభట్ల వీరయ్య, బి.ఏ.బి.ఎల్., గారిచే రచింపఁబడినది. తా మీవాదములో దిగుటకుఁ గారణము వీరయ్యగా రిట్లుపన్యసించిరి.

"నైజాము రాష్ట్రమువారికిని కడపవారికిని అభిప్రాయము లభిమాన ప్రేరితములు గానోపును గాని రామయ్యపంతులు, శ్రీరామమూర్తిపంతులు వంటివారి కిరుపక్షములయెడ సమానాభిమానమే యని దలంచగలము. రామయ్యపంతులుగారి వాదబల మెట్టులుండినను వారియభిప్రాయ మాగ్రహరాహిత్యమనుటలో సందియములేదు. ఆంధ్రవాల్మీకియన్నతో తమరామాయణగ్రంథము నొంటిమిట్ట పోతనస్థలమును దృఢనమ్మకముతో నచ్చట ప్రచురించియుండుటయు పిమ్మట కొంతకాలము గతించి తమ అభిప్రాయమునకు భంగము కలుగుటయు జూడ వార్ధక్యమున నున్న వీరి యాగ్రహము రెచ్చి యనవసరముగ తమకంటె భిన్నాభిప్రాయములు గలిగిన రామయ్యపంతులు రావుబహదరు వీరేశలింగము పంతులుగారు మొదలగు వారిని విచ్చలవిడిగ దూషించుటకు బ్రారంభించి తమవ్యాసముల నెల్ల నిందావాక్యములతోను పరిహాసోక్తులతోను నింపియున్నారు. ఈవయోవృద్ధు లట్టి క్రుద్ధులుగానిచో నేనీవ్యాస రచనకుం బూనుకొని యుండెడివాడను గాను. వారివ్యాసములు నాకు కర్ణకఠోరముగ నుండుటయు నందలి పర్యవసానము నాఅభిప్రాయమునకు వ్యతిరేకముగనుండుటయు నేను కవులకయ్యములో బ్రవేశింప శక్తిజాలనివాడ నైనను నేనీరచనకు బ్రేరింపబడినాడను."

పోతన బమ్మెరనివాసియనియు భాగవతము వారంగలులో వ్రాయఁబడినదనియు నిర్ణయించి యాసిద్ధాంతమున కాధారముగా, నిదివఱలోఁ జెప్పఁబడిన విషయములు కాక మఱికొన్ని నూతనాంశముల నుదాహరించిరి. ఈ క్రొత్త విషయములం గుఱించి వారు వ్రాసినమాటలు కొన్ని యీక్రిందఁ బొందుపఱచెదము.

"1350 సంవత్సరం ప్రాంతమున దేశముయొక్క చరిత్రమును భూగోళవైఖరిని కవులతోను వారినివాసస్థలములతో సంబంధించినంతవరకు బోల్చిచూచినయెడల మన వాది ప్రతివాదులవాదములను సులభముగ గ్రహించుటకు వీలుగలదు.

ఆకాలమున దక్షిణహిందూస్థానమును పాలించిన వివిధసంఘములు జాతులు వారిమతపద్ధతులు వారిదేశమునందలినెమ్మది వారి విద్యావైభవమును పరిశీలించినయెడల శాస్త్రములను కళలను

ఎంతవరకు ప్రోత్సాహపరుచుటకు వారికవకాశముగలదో విశదముకాగలదు. మధురప్రధానపట్టణముగ పాలించిన పాండ్యులును కాంచీపురము ప్రధానపట్టణముగ పాలించిన చోడులును కల్యాణము ప్రధానపట్టణముగపాలించిన పశ్చిమచాళుక్యులును రాజమహేంద్రవరమును ప్రధానపట్టణముగ పరిపాలించిన తూర్పుచాళుక్యులును 1000 సంవత్సరమునాటికి దక్షిణహిందూదేశమును పరిపాలించిన ప్రభుత్వసంఘములలో ప్రధానమైనవారు. తరువాత పాండ్యులు నెల్లూరువరకు దాడిసలిపిరి. చోడులు రాజమహేంద్రవరమువరకు బోగలిగిరి. పశ్చిమచాళుక్యులు నదేవిధముగబోయిరి. కాని వీరిదండయాత్రలు దీర్ఘకాలమునిలవక కొలదికాలములలో నంతరించినవి. 12వ శతాబ్దమునాటికి చోడులు వెలనాటిచోడులు మొదలగు నామముల వ్యవహరింపబడి పరస్పర వైవాహికసంబంధ బాంధవ్యములవల్ల చాళుక్యులతో సమ్మేళనము జెందిరి. తర్వాత తెలుగుచోడులలోనుంచి కమ్మవారు రెడ్లు వెలమవారు క్షత్రియులు బయలుదేరి గోదావరి పెన్నానదులమధ్య ప్రదేశములోని వివిధ భాగములను స్వతంత్రముగను పశ్చిమచాళుక్యుల సామంత ప్రభుత్వమునకు లోబడియును పరిపాలింపదొడంగిరి. తుదకు కాకతీయాంధ్రులు ఏకశిలానగరమని ప్రసిద్ధిజెందిన వార్రంగలు ముఖ్యపట్టణముగ రాజ్యమును స్థాపించి కాంచీపురమువరకుగల ప్రదేశమును జయించిరి. కాంచీపురమునందలి చోడులు కొంతవరకు కాళహస్తిలోని బాణులవల్లను దక్షిణమునుంచి పల్లవులవల్లను తొందరలుగలిగింపబడుచుండిరి. అదేవిధముగా కాకతీయులకు కాళింగులును, బస్తరురాజ్యములోని నాగులును తొందరల గలిగించుచుండిరి. చోడులు తమపూర్వులు కాలచుర్యులనియు వారిలోనొక్కరగు కరికాలచోడుడు కావేరిమీద సుప్రసిద్ధమైన ఆనకట్టను గట్టించెననియు తెలియజేయుచున్నారు. కోసలప్రాంతము అనగా కర్ణాటరాష్ట్రమునుంచివచ్చిన హైహయులను తెగవారు పల్నాడున ప్రవేశించిరి. రాష్ట్రకూటులనువారు 500 మొదలు 1000 వరకు వార్రంగల్ ప్రదేశములోనున్నవారు. దక్షిణమున భల్లాణులు కల్యాణములోని కర్ణాటులకు 1100 సంవత్సరమువరకు తొందర గలిగించుచుండిరి. కర్నాటిచోడులు 1162 వరకు వసపర్తిప్రాంతదేశము నాక్రమించుకొనియుండిరి. చాళుక్యులలో నొకతెగవారగు యాదవులు దక్షిణఆర్కాడు చెంగల్పట్టు చిత్తూరుమండలములలో 1250 వరకు నుండిరి. కాంచీపురమున చోడులప్రభ 1290 తో నడుగంటినది. పశ్చిమ చాళుక్యులు 1120లో వేగిదేశమును జయించి తిరిగి 1182లో తమదేశము చేరిరి. 400 మొదలు 1050 వరకు సామాన్యముగ వార్రంగల్ ప్రదేశమంతయు వారి స్వాధీనములోనే యున్నది. ఇంద్రావతినదికి దక్షిణమున నాగులప్రభ 1030 మొదలు 1325 వరకు సాగినది. ఒకప్పుడు వారు వేంగిదేశమునకు వచ్చియుండిరి. 1243 మొదలు 1276 మధ్యకాలమున పల్లవులు కర్నూలువరకును ద్రాక్షారామమువరకును దండయాత్రలు సలిపిరి. ఆకాలమున కమ్మవారికి ముఖ్యపట్టణములు కొణిదెన, కంభం మెట్టు ; రెడ్లకు కొండ వీడును, వెలమవారికి పిఠాపురం, వెంకటగిరియును, క్షత్రియులకు గుడిమెట్టయును ముఖ్యపట్టణములుగ నుండెను.

పూర్వకాలమున దక్షిణహిందూదేశ మనేకనాడులుగను, సీమలుగను విభజింపబడినది. ఆనాడులను పరిపాలించిన జాతులవారలెల్లను సీమలను పాలించుటకు తమకు లోబడినవారిని నియమించుచుండిరి. మిక్కిలి దక్షిణముననున్న అరవదేశములోని నాడులు అనగా పాగూరునాడు, తొండనాడు, సోనాడు, పాండినాడు, వలనాడు, ఐనాడు, తుయ్యనాడు, పుదుప్పాకనాడు, వెంగలనాడు, తడిగనాడు, మొదలగు నాడులవివరమును వదిలి కేవల మాంధ్రనాడుల వివరమును పరిశీలింపవగును. మొదట కడపజిల్లాలో ప్రారంభించి మైసూరురాష్ట్రములో చాలవరకు వ్యాపించిన ములి

కినాడు గలదు. పిమ్మట చెంగల్పట్టు ఉత్తర ఆర్కాడుజిల్లాలలోచేరిన మండనాడును, దత్తమండలములలోని సకిలినాడు ఏరువనాడును గలవు. తర్వాత కడప మండలమునుంచి యుత్తరమున పొత్తపినాడును పెన్నానది వెంబడి పూగినాడును గలవు కర్నూలుజిల్లాలో రేనాడు మానాడులును గుంటూరు జిల్లాకు పశ్చిమమున పల్నాడును గలవు. ప్రాక్నాడని వాడుకజెందు పాకనాడు నెల్లూరు నుంచి కృష్ణవరకు సముద్రతీర ప్రాంతమునకు వర్తించుచున్నది. కృష్ణాగోదావరులమధ్య వేగినాడున్నది. గుంటూరుజిల్లాలో కొణిదెనప్రాంతమున ప్రారంభించి కమ్మనాడు కమ్మమెట్టువరకు వ్యాపించియుండెను. తెలుగునాడునకు రాజమహేంద్రవరము ముఖ్యపట్టణము. ఆరువేలనాడనిపిలువబడు వెలనాటికి నెల్లూరు ముఖ్యపట్టణముగ నుండెను. కన్నడదేశమున కోసలనాడనియు, బస్తరురాజ్యమున వడ్డెనాడనియు గలవు. కోనసీమ పేర్కూరునాడులో చేరినది. కొండవీటిసీమ, అద్దంకి, పొదిలిసీమలును కమ్మనాడులో చేరినవి. కొన్నిచోట్ల నాడులే రాష్ట్రము లనబడుచున్నవి. నైజాంరాజ్యమున నతవాటిరాష్ట్రము, సబ్బినాటి రాష్ట్రము లనియున్నవి. ఈ రెండును వార్రంగల్ దేశములో జేరినవి. నతవాటిసీమనే శ్రీనాథవాటి సీమ యని పిలిచెదరు. కడపమండలములోని పొత్తపినాటిలో జేరినదే మనయొంటిమిట్ట. ఏకశిలా నగరమనబడు వార్రంగలు నతవాటిరాష్ట్రములోనిదై యున్నది. నల్లగొండసీమలోని పానగల్లు మొదలు కడపమండలములోని వల్లూరువరకు గల రాష్ట్రమును మార్జవాటిరాష్ట్రమందురు. కళ్యాణమునకు సమీపముననున్న కన్నడదేశమును కుంతలదేశమనుచున్నారు. ఇప్పుడు మనము 1000 మొదలు 1400 వరకు పొత్తపి నతవాటి ప్రదేశములను పరిపాలించిన రాజుల చరిత్రను తెలిసికొనిన వారినాగరికతయెట్టిదో, కవిత్వములో వారికెట్టి ప్రవేశముగలదో, కవులకు సాహిత్యమునకు వారెట్టి ప్రోత్సాహమొసంగిరో విశదము కాగలదు.

1000 వ సంవత్సరమునాటివరకు కడపమండలములో నుత్తరభాగము నిర్జనభూమిగ విశేషముగ దేవాలయములుగాని అగ్రహారములు గాని లేనిస్థితిలో నుండిన సంగతిని ముఖ్యముగ జ్ఞాపకముంచుకొన వలెను. ఆప్రదేశము దండకారణ్యభాగమై శ్రీశైలము మహానంది ప్రదేశముల కాగ్నేయముగ నుండినది. 15 వ శతాబ్దము పిమ్మట పెన్నకు దక్షిణమున గొప్ప కవీశ్వరులుండుటకును 1450 తర్వాత పెన్ననదికి నుత్తరమున పేరుగల కవీశ్వరులు లేకుండుటకు గల కారణముల నికమీదవివరించెదను. గనుక ఒక కవీశ్వరునిగురించి మనము ఆలోచన చేయునెడ అతని నివాసస్థలముయొక్క నాగరికత యెట్టిదో, అతనితోడి కవులెవ్వరో, వారి స్థితిగతులెట్టివో, చరిత్రప్రకారము వారికి భాషాభివృద్ధికిగల సాధన సంపత్తి యనుకూల ప్రతికూలము లెట్టివో, దేశ కాలపాత్రలం బట్టినిర్ధారణజేయుట మనకు ప్రథమవిధియై యున్నది.

చరిత్రవల్ల జనులలో చలనమెప్పుడును రాజుయొక్క ముఖ్యపట్టమువైపునకే యనిస్థిరపడుచున్నది. రాచవీటు లెప్పుడును విద్యానిలయములుగను, కళాస్థానములుగనుండును. సంగీత సాహిత్యము లెక్కాలమునను రాజపోషణవల్లనే యభివృద్ధికి రాగలిగినవి. ఇందుకు నిదర్శనముగ కులోత్తుంగ రాజరాజుల కాలమున రాజమహేంద్రవరమును, అనవేమ, అనపోతలకాలమున కొండవీడును, మనుమసిద్ధి కాలమున నెల్లూరును, గణపతి, రుద్రమ, ప్రతాపరుద్రులకాలమున వార్రంగలును కవులకును సాహిత్యమునకు గలిగించిన యాదరణను పరిశీలింపనగును. ఇదిగాక దేశనాగరికతలో మధ్యమకాలము కవిత్వనైపుణికనువైనదై యూహకెక్కువ అవకాశమునిచ్చును. పైకన

వరచిన ముఖ్యపట్టణము లుచ్ఛస్థితియందుండ పేదలును, విద్వాంసులు నట్టిపట్టణములకు జేరియుం డుట సహజమై యున్నది. ఆ కాలమునందలి కవులెచ్చటజన్మించినను, వారియొక్క కాలమును, రాజులయొక్క ముఖ్యపట్టణముల వద్దనే గడపినట్లుల గనవచ్చుచున్నది. పైచెప్పబడిన రాజులే కాలమునబాలించిరో దెలిసికొనిన వారికి మతమునుగురించి, కవిత్వమును గురించి గల యభిమాన మును దెలిసికొనగలము. శ్రీనాథుడు రాజమహేంద్రవరము, కొండవీడుల కాలముగడిపినను, అనేక రాజస్థానములను జూచియున్నవాడు. పోతనమాత్రము ఒంటిమిట్టవాడైన కావలెను, వార్రంగలు వాడైన కావలెను గాని ఆయనకు దేశాటనము విధించుట కాధారములు లేవు. 1000 మొదలు 1400 లోగా పొత్తపినాటిని పాలించిన యుత్తమరాజులెవ్వరును లేరు. ఆకాలమున కవుల కయ్యెడ ప్రోత్సాహము గలిగినదనుటకు దగిననిదర్శనము లేదు. ఈ ఒంటిమిట్ట విజయనగర రాజ్యము ధ్వంసమైన చాలకాలమునకు మల్లిరాజులపాలనకు లోబడి కొంతప్రాశస్త్యము వహించి నది. అప్పుడు ఒంటిమిట్టలో కొందరు కవులు బయలుదేరిరి. 1320 లో వార్రంగల్ రాజ్యము మహమ్మదీయులు నిర్మూలముచేయ అచ్చటి కోశాగారులైన హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగర ప్రాంతమునకుం జని రాజ్యస్థాపనగావించిరి. వారు కవులను విద్వాంసులను ప్రోత్సాహ పరచిరి. అప్పుడే విద్యారణ్యులవారు శాయనమాధవాచార్యులవారు భాష్య గ్రంథములను వ్రాసిరి. రాజావలంబనమైన మతము ననుసరించి గ్రంథములు వ్రాయబడుచుండెను.

700 సంవత్సరము వరకు జైనులును, బౌద్ధులును జనులమనస్సుల నాకర్షించుచుండ శ్రీశంక రాచార్యులవారు వారి సిద్ధాంతములను ఖండించిరి. వెంటనే 1000 సంవత్సరమునాటికి బసవేశ్వ రుని శైవసిద్ధాంతములును శ్రీరామానుజాచార్యులవారి వైష్ణవ సిద్ధాంతములును బయలుదేరినవి. వీరి వెంట నడిపి మధ్వాచార్యులవారు ద్వైతమత సిద్ధాంతమును ప్రతిపాదించిరి. ఈమతకర్తలంద రును రాజులను తమ వశముజేసికొని తమ మతములను దేశమున విస్తరిల్లజేసిరి. ఈమతకర్తలే వేద ములకు మహాభాష్యములను రచియించియున్నవారు. మధ్వాచార్యులవారి పిమ్మట మూడుశతాబ్దముల లోను భాష్యకర్తలుండిరి. 1000 మొదలు 1400 వరకుగల తెనుగు గ్రంథము లనేకములు సంస్కృత మునందలి మతగ్రంథముల భాషాంతరీకరణములో వానిననుసరించి వ్రాయబడినవో యైయున్నవి. అందు వల్ల 1000 మొదలు 1400 లోగా అనేకపురాణములను సుప్రసిద్ధాంధ్రకవులు పద్య కావ్యములుగ రచి యించుట సంభవించినది. ఆకవీశ్వరులందరు పెన్నకును గోదావరికిని మధ్యనున్నవారలై యుండిరి. ఇప్పుడు మన పోతన శ్రీనాథుడు కొన్ని పురాణములను భాషాంతరీకరణము జేసినవారలే. శ్రీనాథు డేరాజునకో మంత్రికో కృతినిచ్చి గ్రంథములువ్రాయ పోతనామాత్యుడు ప్రాపంచిక సౌఖ్యముల నాశింపక రాజాదరణను తృణీకరించి భాగవతమును శ్రీరాములవారి కంకితముజేసిన మహానుభావుడు. ఇటులనే తనవార్ధక్యమున యెర్రాప్రగడ నారసింహపురాణమును అహోబలస్వామి కంకితముజేసెను. ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రను ద్రాక్షారామ భీమేశ్వరున కంకితముజేసెను. అప్పటి కాలమున రాజులు మతావేశముచేత అన్యమతసహనము లేనివారై మతాంతరులను పెక్కువిధముల బాధించు చుండిరి. కవులన్నో రాజుమతిగని రాజుమతమున కనుకూలముగ గావ్యముల వ్రాయుచు ఆరాజు లను వారిమతములను అనేకవిధముల బొగడుచు జీవయాత్రలు సలుపుచుండెడివారు. కాని పోతనా మాత్యుడిట్టి దూషణభూషణముల లక్ష్యముజేయక తనబుద్ధికి తోచినరీతిని మతసహనము గలిగి గ్రంథ రచనజేసిన మహనీయుడు. ఇట్టిలోకాగ్రగణ్యుని మావాడుమావాడని వార్రంగలు వారును, కడప

వారును వాదమునకుదిగినారు. ఇట్టిసమస్యను నిర్ధారణ జేయుట జనసామాన్యమునకు, ముఖ్యముగ నాంధ్రులకు నవసరమైయున్నది.

పదియవ శతాబ్దము వరకు నాంధ్రభాషలోని లిపికి స్థైర్యము కుదిరి యుండలేదు. ఈభాషలో నాగరకర్ణాట మిశ్రమము గలదు. కర్ణాటమును పరిపాలించిన పశ్చిమచాళుక్యులు చాలకాలము తూర్పు చాళుక్యులకును చోడులకును సామంత ప్రభువులుగ నుండిరి. పదియవ శతాబ్దమునకు బూర్వపుశాసనములను దెలిసికొనుట మనకుచాల కష్టముగానుండును. పదియవశతాబ్దానంతరము లిపిలో నక్షరములందు స్థిరమైన మార్పులు గలిగినవి. వ్రాతసౌకర్య మేర్పడినంతగనే తెనుగుకవిత్వము నందభివృద్ధిగన్పడుటకు ప్రారంభ మయ్యెను. పెన్నానదికి నుత్తరభాగమునయున్న ప్రదేశములలో నాకాలపునాగరికత యెట్టులుండినను పొత్తపినాడులో నక్కాలంబున మాత్రమప్పుడే గ్రామము లేర్పడి యరణ్యములు జనపదములుగా మారుస్థితిలోనుండి నాగరికతకు నోచుకొనియుండలేదు దత్తమండలములందు మధ్యమనాగరికత కాలము విజయనగర సామ్రాజ్యకాల మని నిశ్చయింపనగును. పెన్నకు నుత్తరమున నంతకు రెండు శతాబ్దములకు పూర్వమే యట్టినాగరికత గలదు. 1000 మొదలు 1400 వరకు పెన్నకు నుత్తర భాగమున గల విశేషశాసనములంబట్టియు పెన్నకు దక్షిణమున దేవాలయములు అగ్రహారములు దత్తమండలములలో నాకాలమున లేనందునను 1300 నాటికి కడప మండలమనాగరికత స్థితిలో నున్నదనుటలో సందియములేదు. కడపమండలములో ప్రస్తుత మనవివాదములోచేరిన పోతనామాత్యుడు భాగవతము దక్క మఱియొక్క కవీశ్వరునిపేరు గాని గ్రంథముపేరు గాని 1000 మొదలు 1400 మధ్యకాలమున నుండినటులలేనందున నక్కాలంబున నచటపేరెన్నికగన్న రాజులు పరిపాలించలేదనియు నందువల్ల నచటకు గవులాకర్షింపబడుటగాని యట కవిత్వంబభివృద్ధిగాంచుటకుగాని జరుగలేదని యనవచ్చును. ఇంతకును కడపప్రాంత మాకాలములో ననాగరికత దశయందే యున్నది. చారిత్రక దృష్టాంతములవల్ల 1000 మొదలు 1400 మధ్య జనుల చలన పథము దక్షిణమునుండి యుత్తరమునకే యుండినటుల స్పష్టపడుచున్నది. ఇందుకుభిన్నముగ 15, 16 శతాబ్దములలో విజయనగర సామ్రాజ్యమేర్పడినపిమ్మట అనేకమంది కవులు దక్షిణమునకు బోయినటుల గలదు. ఆమహాసామ్రాజ్యమత్యంతవైభవములో నున్నకాలమం దన్నివైపులనుండి కవుల నాకర్షింపగలిగెను. తెనాలి రామలింగము మొదలగు కవులు ప్రాక్నాటినివాసులైనను విజయనగరము జేరుటకుగల కారణంబు మనకు దెలియును. మఱియొక విచిత్రము గనుడు. కొండవీడు వారంగలు రాజ్యములంతరించిన పిమ్మట పెన్నకునుత్తరమున ప్రసిద్ధకవుల నామములు వినబడకుండుటయు 1450–1600 వరకు గల సుప్రసిద్ధకవులందరు విజయనగర ప్రాంతమునందే యున్నవారని స్థిరపడుటయు జూడ 1450 సంవత్సరమునకు బూర్వము సుప్రసిద్ధకవు లందరును కొండవీడు వారంగలు నెల్లూరు రాజమహేంద్రవరము ప్రాంతములోనుండినటుల నిశ్చయింపనగును. అనంతామాత్యకవియొక్క తండ్రి కృష్ణాజిల్లా శ్రీకాకుళములో నుండినటులను అతనితాత నెల్లూరిలోనుండినటులను తెలియుచున్నది. ఇందువలన కవులచలన పథమును నిర్ధారణజేయనగును.

ఒక దేశముయొక్క మధ్యమనాగరికతకాల మెందుకు కవిత్వాభివృద్ధికి సహకారియగుచున్నదో ప్రస్తుతము చర్చించుట యనవసరము. కాని ఐరోపాఖండములోని యాంగ్లదేశమునందేమి యితరదేశములందేమి యిట్టిస్థితే గలదు. హోమరు వర్జిలు షేక్సుపియరు మొదలగు పాశ్చాత్య కవీంద్రు లద్వితీయులుగ నుండిరి. ఈ శతాబ్దమున షేక్సుపియరు పోతన తిక్కనలవంటి కవీశ్వ

రులు గలుగుట దుస్సాధ్యము. నాగరికత హెచ్చినకొలది కల్పనాశక్తి నశించుట సహజము. నేబూనిన వాదములో సాధ్యమైనంతవరకు పుక్కిటి పురాణగాథలను చాటుపద్యములను చర్చకు దెచ్చుటలేదు. అట్టివి విశ్వసనీయములుగావు. ఒకప్పుడు వానిలో గొంతనిజము గన్పడవచ్చును. కాని సాధారణముగా నట్టిగాథలు కల్లలకు పుట్టినిండ్లుగా నుండును. ఇప్పుడు మనము దక్షిణహిందూ దేశముయొక్క పటమును చిత్రించినయెడల 1000 మొదలు 1400 వరకుగల తెనుగుకవుల జన్మస్థానములును వారికవిత్వనిలయములును పెన్నకు నుత్తరముగను వారంగల్ గోదావరులకు దక్షిణముగను దగ్గిర దగ్గిర ప్రదేశములందు ముఖ్యకవులంద ఱుండినటుల మనకు గోచరము కాగలదు. ఒంటిమిట్ట మాత్రము నొంటరిగ దూరమున విసిరివేసినటు లుండును. ఆకాలంబున పొత్తపినాటిలో కవులులేరనిగాని కవిత్వమున కాదరణలేదనిగాని నిర్ధారణజేయుట కొంతకష్టసాధ్యమైనను ఇదివరకు దెలియజేయబడిన సంగతులవల్లనే పొత్తపినాటిస్థితి విశదపడినది. కవుల పేర్లలోగాని వారిపూర్వుల పేర్లలోగాని గల పోలికలును కవిత్వములందుగల అన్యోన్యసంబంధములును కవులు సమకాలీనులై యుండొరులకవిత్వమును జూచియుండుట కవకాశము గలిగిన వారని దోచినప్పుడు వారు నివసించినతావు లొకదానికొకటి దగ్గిరనుండుననియు నెవ్విధముగ జూచిన నొకరు పెన్నకు దక్షిణమున నుండి రెండవవారు గోదావరి తీరమునసుండుట యసంభవమని నొక్కివక్కాణింపనగును.''

*　　*　　*　　*　　*

"పై రెండు పక్షములవారి వాదములను పరిశీలించుటకు బూర్వము 1000 మొదలు 1400 వరకు దత్తమండలములయొక్క చారిత్రకస్థితి యెట్టిదో కనుగొనుటకు బ్రయత్నించుచున్నాను. పిమ్మట అయ్యలరాజు రామభద్రకవిని గురించి వివరించెదను. ఒంటిమిట్టగ్రామము పొత్తపినాడునకు జెందినదని విశదపరిచియున్నాను. 1100 సంవత్సరములో కులోత్తుంగ చోడుని కాలమువరకు దత్తమండలములు దండకారణ్య భాగములై నిర్మానుష్యముగ నుండెను. పొత్తపినాటికి కొంతకాలము నందలూరు ముఖ్యపట్టణముగ నుండెను. మొట్టమొదట ఆకాలమున అరవలైన పల్లవులు దత్తమండలములను బాలించిరి. వారి రాజులలో నొక్కరగు నందివర్మరాజు 1102 లో ప్రొద్దుటూరులో రాజ్యముజేసెను. ఆయన రాజ్యము ఉత్తరమున పూగినాటివరకు వ్యాపించియుండెను. సిద్ధనదేవ యనురాజు 1182 వరకును అభిదేవ మలిదేవ 1218 వరకును ఇమ్మడిదేవ 1268 వరకును మహారాజసింహ 1279 వరకును బాలించిరి. అంతట పల్లవుల ప్రభ యంతరించి చాళుక్యులు రాజ్యమునకు వచ్చిరి. తుదకు కాకతీయాంధ్రులు రాజ్యముజేసిరి. సిద్ధవటము పొత్తపినాడుల గంగయదేవ మహారాజు గణపతిదేవరాజు కాలమున పరిపాలించెను. అతడు కాయస్థుడు. ప్రతాపరుద్రుడు పొత్తపినాటిని జయించి 1313 లో దానిని ములికినాటిని గండికోటసీమను గొంకారెడ్డియొక్క ప్రభుత్వమునకు లోబరిచెను. పుష్పగిరి మఠాధిపతులైన శివయోగీంద్రులను గణపతిదేవ మహారాజు గురువుగా జేకొనెను. గంగయసాహిణి కడపకు సమీపమునవున్న వల్లూరు ముఖ్యపట్టణముగ జేసికొనెను. 1247 సంవత్సరమువరకు గంగయసాహిణి తిక్కరాజునకు లోబడియుండి పిమ్మట గణపతిదేవునకు లోబడెను. చిట్టివేల్ సంస్థానాధీశులైన మట్లిరాజులు కృష్ణదేవరాయలకు పిమ్మట ప్రాముఖ్యత జెంది యభివృద్ధికి వచ్చిరి. పదునాలుగవ శతాబ్దాంతమున వార్రంగలు రాజ్యధ్వంసమైన తర్వాత హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగరమునకు జేరి యచ్చట రాజ్యమును సాపించిరి.

1300 కు పూర్వము దత్తమండలములను పాలించిన పల్లవులు గాని మఱియితరులుగాని తగినంత సావకాశము నెమ్మదిగలిగి సాహిత్యాభివృద్ధికి సహకారులుగ నుండుటకుగాని యక్కాలంబున నచ్చట కవులుండినటులగాని గ్రంథములు రచియింప బడినటులగాని యెట్టినిదర్శనములు గానబడుట లేదు. హరిహరరాయలు వచ్చినప్పుడు ఆయన కవులను విద్వాంసుల ప్రోత్సాహపరచి యాదరించెను. శ్రీవిద్యారణ్యస్వాములవారు ఆయనకు మంత్రియు సుప్రసిద్ధుడైన భాష్యకర్తయునై యుండెను. శ్రీశాయన మాధవాచార్యులవారు వేదభాష్యమును బుక్కరాయలకంకితము చేసెను. బుక్కరాయలు తెనుంగు కవిత్వమును పెన్నకు దక్షిణమున ప్రోత్సాహపరచిన వారిలో ప్రథములని చెప్పవచ్చును. 1350 ప్రాంతమునసున్న నాచన సోమనకవిని బుక్కరాయలే యాదరించెను. పొత్తపి నాటికి ప్రథమకవి యనందగిన అయ్యలరాజు రామభద్రుని గూర్చి వేరుగవివరింపనగును. ఆయన సహితము 1600 ప్రాంతమున జీవించియుండెను. భాగవతమును ద్విపదకావ్యముగ రచించిన తరిగొండ వెంగమాంబ ఇటీవల 1840 లో నుండిన విదుషీమణి. అటుపిమ్మట కకుత్స్థవిజయమును రచించిన మట్లి అనంత భూపాలుడేమి, రామరాజ భూషణుడు, భట్టుమూర్తి, పెద్దన, వేమన, పోడప్ప, జగన్నాథ, మల్లినాథ మొదలగు దత్తమండల కవిశ్రేష్ఠులు 15 వ శతాబ్దము తర్వాతనుండిన వారని గమనించవలసియున్నది."

"ఇక అయ్యలరాజు రామభద్రకవినిగురించి యించుకవిచారింపనగును. ఈకవి 1600 సంవత్సర ప్రాంతమున పొత్తపినాటిలో నొంటిమిట్టలో నుండినవాడు. అనగా పోతనకు 200 సంవత్సరముల తర్వాత నున్నవాడు. ఈకవి చరిత్రలో కొన్నిచిత్రములు మనకు దోచగలవు. ఒంటిమిట్టనివాసి యగుటయే గాక యీకవి కౌండిన్యసగోత్రోద్భవుండు. ఒంటిమిట్టలోగల దేవుని వీరరాఘవస్వామి యని యిక్కవి వర్ణించియున్నాడు. రామాభ్యుదయమునకు పూర్వము ఒంటిమిట్టరఘువీర శతకమను గ్రంథమొకటి యచ్చట ప్రచురింపబడియుండెను. ఈకవి యింటిపేరు అయ్యలరాజువారు. అయ్యలరాజు అనునది యొకమనుజునిపేరు. ఆ అయ్యలరాజు ఉత్తరమునుంచి దక్షిణమునకు వచ్చినవాడా లేక దత్తమండల నివాసియా యనునంశము ఎందుగా నాలోచనచేయదగియున్నది. హరిహరరాయలు కాలమునుంచి ముఖ్యముగ కృష్ణదేవరాయలు కాలములో అనేకమందికవులు ఉత్తరము నుండి దక్షిణమునకు వచ్చియుండిరి. వారిలో తెనాలి రామలింగం పింగళిసూరన మొదలగు కవిపశ్రేణ్యులు గలరు. ఇప్పుడు మడికి సింగన తండ్రిపేరు అయ్యలమంత్రి అని తెలియునుగదా. పోతన పూర్వీకులలో నయ్యలు ప్రగ్గడ గలడు. భాస్కరాచార్యుని శిష్యుడైన అయ్యలభట్టారకుడు రామాయణము నాంధ్రీకరించెను. 1350లో వేదగిరినాయనింగారివద్ద అయ్యలార్యుడను కవియుండినటుల తెలియుచున్నది. అట్టి అయ్యలరాజులలో నొక్కడు దక్షిణాపథంబున కరిగియుండవచ్చును. రామభద్రకవి తన గురువు పరవస్తు ముమ్మిడి వరదాచార్యులు అని వ్రాసియున్నాడు. ఇంతకు పూర్వము ముమ్మిడియనుపదము గోదావరియందెక్కువ వ్యాప్తిగలిగినదని విశదపరిచియుంటిని. ఇంతియె కాకపరవస్తు అనుపదముకూడ గోదావరిజిల్లాలో సామాన్యమైన వాడుకలోనున్నది. రామభద్రకవి పూర్వులలో తిప్పయ యనువారు గలరు. అయ్యలమంత్రి పూర్వీకులలో తిప్పయయుండి నట్లిదివరకు తెలియపరచి యున్నాను. అయ్యలమంత్రి గోత్రము వేరు. శ్రీనాథుని దౌహిత్రసంతతి వారు శ్రీనాథ అను యింటిపేరును గలిగియుండిరిగదా. పైసంగతుల వల్ల రామభద్రకవి పూర్వీకులుత్తరమునుండి దక్షిణమునకు వచ్చినట్లూహించుట కవకాశము గలుగుచున్నది. ఈకవియో ఆయనతండ్రియో అటుల వచ్చియుండవచ్చును. ఇటీవలికవులలో నొక్కరగు శ్రీకృష్ణమూర్తి గోదావరివాస్తవ్యుడై కాళహస్తికిబోయి యచ్చట 19వ శతాబ్దంబున గ్రంథరచన జేసియుండెను."

ఈక్రింది యెనిమిది గ్రంథములును బందరు నోబిల్ కళాశాలాపండితు లగు బ్ర. శ్రీ. కోరాడ రామచంద్ర శాస్త్రిగారిచే రచింపఁబడినవి. వారికుమారు లగు మ-రా-రా-శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిచే బంపఁబడినవి వలయువారు శ్రీరామకృష్ణయ్యగారికి వ్రాసి తెప్పించుకొనవలయును.

(1) **ఘనవృత్తము** :— ఇది సంస్కృతకావ్యము, రెండుసర్గములు, కాళిదాసకృతిమేఘసందేశమున నంత్యమగు "శ్రుత్వావార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి" యనుశ్లోకము, బీజముగాఁగొని యుత్తరకథగా నిదికల్పింపఁబడినది. ఈగ్రంథములన్నిటియందును శైలినారికేళపాకము. పండితులకుఁ దక్క సామాన్యులకు బోధపడదు కల్పనములును గవిత్వమును రసవంతములుగానే యున్నవి. ఈఘనవృత్తకథనే రామచంద్రశాస్త్రిగారి గురువుగారగు శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారు కూడ యశోల్లాస మనుపేరున నొకగ్రంథముగా రచించిరఁట. ఘనవృత్తమున కాంధ్రపద్యములను బ్ర. శ్రీ. మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు రచించినారు. అవియు దీనియందుఁ గలవు, గ్రంథము వెల రు. ౧-౮-౦.

(2) **కుమారోదయము** :— ఇది తొమ్మిదియుల్లాసముల సంస్కృతచంపూప్రబంధము. కథ కుమారసంభవములోనిది. పూర్వభాగము 9 ఉల్లాసములు. ఉత్తరభాగము మాకుఁ బంపఁబడలేదు. దీనిలోఁ గథ కామదహనానంతరము విలపించుచున్న రతిని సమాశ్వాసపఱుచుటతో ముగిసినది. వెల ౧-౦-౦.

(3) **దేవీవిజయము** :— ఇదియు సంస్కృతచంపువే. శ్రీదేవీసప్తశతిలోని కథలన్నియు నొకటిగాఁ జేర్చి యిది రచింపఁబడిన దని తోఁచుచున్నది. దీనియందు భాగములకు చరితము లని పేరుంపఁబడినది. ఇందు మూఁడుచరితములు గలవు. వెల ౦-౮-౦.

(4) **శృంగారసుధార్ణవము** :— సంస్కృతభాణము, ఇది రూపకభేదములలో నొకటి. దీనియందును పై గ్రంథములందునుగూడ శబ్దాలంకారము లగునను ప్రాసయమకాదు లతిమాత్రముగా నుపయోగింపఁబడినవి. వెల ౦-౮-౦.

(5) **ఉపమావళీ** :— దీనియందుపమాలంకారములుగల ౨౬౦ ఆర్యావృత్తములున్నవి. రెండుభాగములు. మొదటిదానియందు "తారుణ్యోత్తనవిభాతి తనుశోభా" యనుమకుటముగల శ్లోకములున్నవి. ఈవాక్యార్థమునకే యన్నిశ్లోకములందు నుపమానములు చూపఁబడినవి. ద్వితీయార్థమునందు "కృశ్యత్యవలగ్న మయి తరుణి మన్మః" అనుమకుటమునఁ దానియుపమానములు నున్నవి. చిన్నపుస్తకము, చమత్కారముగానే యున్నది.

(6) **మంజరీమధుకరీయము** :— ఇది నాటిక, నాలుగంకములు, ఆంధ్రభాషలో రచింపఁబడినది, అంకములు నాలుగైనను గ్రంథము 237 పుటలు పట్టినది. కథ స్వకపోలకల్పితము. ఇదియుఁ బైవానివలెఁ బండితైకవేద్యమే, వెల ౧-౪-౦.

(7) **రథాంగదూతము** :— ఇది యాంధ్రవచనకావ్యము, ఇం దిద్దఱు దంపతుల వనవిహారము వియోగమును మరలసంయోగమును వర్ణింపఁబడినవి. శృంగారరసము ప్రధానముగా నున్నది. లోకాచారము లక్కడక్కడ నమగుణములుగఁ జొన్పంబడి యింపుగా నున్నది. శైలి సంస్కృతగ్రంథములకుఁ దీసిపోదు. వెల ౦-౪-౦.

(8) **ఉన్మత్తరాఘవము** :— ఇది సంస్కృతమున భాస్కరకవిచే రచింపఁబడిన ప్రేక్షణికంబునకు నాంధ్రీకరణంబు. ఒకకాలమున సీతారాములు వనవిహారము సల్పుచుండ దుర్వాసునిచే శపింపఁబడిన యడవిలోఁ బూలుగోసి సీత లేడియగుటయు రాముఁడు సీతావియోగమున విలపించుటయుఁ బిదప శాపవిముక్త యగుసీతం దోడ్కొనివచ్చి యగస్త్యి రామున కాదేవి నిచ్చుటయు నిందలి కథ. వెల ౦-౨-౦.

—అజితప్రతాపవృత్తము.—

నజసాగణావలిఁ బ్రసన్నదభా, గ్రగజరపంక్తి నభిరామరూపమై
యజితప్రతాప చెలువారుఁగృతి, న్విజయవిక్రమణ విశ్వభూవరా.

గీ. [1]వలయుఛందంబుపాదంబుఁ దొలుత నిలిపి
యాలఛందంబుపాదంబు నొల నిలిపి
యొలి నెడవెట్టి యీగతి నొనరఁ జెప్ప
వెసఁ బరస్థానసమకార్ధవృత్త మయ్యె.

—అందు మనోహరవృత్తము.[2]—

చాళుక్యనృపాల తజావములం, గలయన్ననసాపదికల్పితమై
మేలొప్పఁగఁ జెప్పిన మేదినిలో, విలసిల్లు మనోహరవృత్త మనన్.

—కోమలవృత్తము.—

సలలితరీతి నజాయగణంబుల్, చళుక్యభూప జభనజస్థగస్థితిన్
[3]మలయుచు నర్థసమర్థత చేత, న్వెలుంగఁ గోమల మనువృత్తమొప్పగున్

క. ఏకచ్ఛందోవృత్తా, నీకంబులు రెండురెండు నిలుపుదు రిట్ట
శ్లోకార్థంబుల నొలి వి,వేకులు స్వస్థానవిషమవృత్తంబులకున్.

అదు, అంగజాస్త్రమనువృత్తము.

దానబలేంద్రోదారభమంబుల్, ఘూని సగాప్తిం బొంపిదివొవన్
జానార న్మనజంబు గస్థితం, బై నీడంజను నంగజాస్త్రమై.

—వారాంగియనువృత్తము.—

చళుక్యవంశా జతజల్గగంబుల్, చెలంగి యర్ధంబునఁజెందిరీతిం
గ్రాలంగఁ దాయత్తజగానియుక్తిన్, మేలయ్యె వారాంగి సమీహితాఖ్యన్.

—నదీప్రఘోష మనువృత్తము—

భారరములొప్పగిఁ బ్రాగుపేతంబులై, చరించుచుండంజతజస్థరేఫలం
బరత్రిపాదంబులఁ బర్వినొప్పగం, దిరంబుగామూఁటనదీప్రఘోషమై.

క. అందముగ నుపక్రాంత,చ్ఛందఃపాదంబులొల సాగెడునికట
చ్ఛందఃపాదంబులతో,నందఁ బరస్థానవిషమ మనువృత్తమగున్

1. ట-తొలుతఛందంబు. 2. ట-లో నీవృత్తములేదు. 3. ట-లోనీయుత్తరార్థము రెండు పాదములు లేవు.

అందు శ్రీరమణమనువృత్తము.

ఆరభమవ్యాయ త్తనగవ్యా, పారము నాదిమపాదము పెందం
జారుభభాగగసంగతిచేతన్, శ్రీరమణం బనిచెప్పిరి మూఁటన్.

—శరభక్రీడావృత్తము.—

చతుర్వర్ణాధారాయమనసరగవ్యాప్తినాద్య
ద్వితీయాంత్యాంఘ్రిప్రస్తుతగతి నతిస్పష్టమైనన్
ఖ్యాతానక్తిన్ మభనయయ తృతీయాంఘ్రినొప్పన్
బ్రతిప్రేమోత్పత్తిం బరఁగి శరభక్రీడ యమ్యెన్.

— సర్వపరస్థానవిషమవృత్తంబులలో వీణారచనయనువృత్తము. —

చాణక్యనయజ్ఞాతయసస్థసగంబుల్, వీణారచనకొందు భువిం దనసావంబుల్
శ్రేణిందజనస్థితభసనేవిత నియతిన్, రాణలనెలవై భన నజరంబు లోలిగన్.

క. ఛందః ప్రస్తారక్రమ, సంద్పృష్టంబైన వృత్తసంఘములో నొ
ప్పందము లగుపాదంబులఁ, బొందింపఁగ విషమవృత్తపుంజములదరున్.

ఇది వివిధవిషమవృత్తలక్షణము.

క. మాత్రాగణరచనలకుం, బాత్రములై నెగడి యంధ్రభాషాకవితా
మిత్రములై రసభావా, మత్రములొ జాతులెఱుఁగ మంచిది కృతులన్.

క. అందును గంధంబులు నా,నందంబులు భజసనలగగాఖ్యలచే వా
నిం దగునెఱుఁగం బ్రాసము,ముందుగనిడిమూఁడు నైదు మూఁడునై దున్.

క. అదిమవర్ణమువళి నిడు, పైదొరకినఁ గుఱుచయైన నట్టుల తత్త
త్పాదాదుల నిలుపందగు, గాదిలిగాఁ జెప్పఁదలఁచు కందంబులకున్.

క. నిడుదలగు పాదములకును, వడి నాలవగణము మొదల వలయు నిలుప న
క్కడలను గురువును మూఁడవ,యెడ నలజలలోన నొకటి నిడ బెడఁగడరున్.

క. ఇందుపురబాణనగముల, కందువ జగణంబు నిలుపఁగాఁ గా దెపుడుం
[1]గందములకు నార్యాగుల, [2]చందం బధికంబు వానిఁ జనుఁ దెలియుంగన్.

క. కందము నర్ధంబులతుద, నందినగురు వుడుపఁ బథ్య యగు నాఱవచోఁ
జెంచిన జగణము[3]లత్వముఁ,బొందిన నది యార్యయనఁగఁబొసఁగుంగృతులన్.

క. క్రమమునఁ బథ్యార్యార్థము, లమరంగా వీడుపడిన నది గాథాభే
దము[4]గాఁగంబరఁగు ప్రపంచము తెనుఁగునఁజెప్పరంద్రు చతురులుకృతులన్.

---

1. ట-గందములను, 2. ట-చందములధికములు, 3. ట-లర్థము, 4. చ-నాఁగ,

## సీసపద్యలక్షణము.

క. భావరసాలంకారా, ప్రావిర్భావితాంధ్రకావ్యఫణితులకును ర
మ్యావాలము లగుసీసగ, ణావళిలక్షణము తెలుఁగనగుఁ జతురులకున్.

క. నలనగసలభరతగణం,బులు నసహంబులును నసఁగఁ బొలుపగు సీసం
బులు [1]గీతులు వానఁగదా, యలవఁడుపఁగవలయుఁ[2]గృతులకందంబరయన్.

క. [3]ఒకగురువు రెండులఘువులు, నకలంకత సమము కాన హానములు దమలో
నొకఁడొకఁడు వీడుపడుచున్, వికటింపక చెల్లు నొక్కవృత్తము తక్కన్.

క. అమరంగ విషమసీసము, సమసీసము ననఁగ రెండుచందములందున్
బ్రమితమగు విషమసీస, క్రమ మెఱుఁగఁగవలయుఁ జతురకవిజనములకున్.

గీ. హగణనగణంబు లేదు గుర్వంతమగుచు, విస్తరిల్లిన నుత్సాహవృత్తమయ్యె
దీనితుద గీతియొకఁడు సంధింప విషమ, సీస మిత్తెఱఁగెఱుఁగుట[4] చెలువుమతికి.

ఉత్సాహము. ఓసరించుఁ[5]బజ్జలజ్జ లుజ్జగించు రాజులన్
వేసరించు గర్వపర్వవేషభూషితారులన్
వాసవానుకార వీరవర్య విశ్వభూప నీ
భాసురాసిధేనుకానుభావ మాహవంబులన్,

## విషమసీసపద్యలక్షణము.

గీ. వడి దనర్పఁ బ్రాసవైభవం బలరార, నిట్ల గణనియూఢి నెసకమెసఁగఁ
గీర్తితాతిమధురగీతియుఁ బైఁగల్గ, నదియ విషమసీస[6]మండ్రు కృతుల.

## సమసీసపద్యలక్షణము.

గీ. వెలయుసమసీసములుపంచవిధములయ్యె, నరయనవకలిసీసాహ్వయంబుఁ బ్రాస
సీస మక్కలిప్రాససీసాఖ్యసీస,మువడిసీస మక్కలివడిసీసమును ననంగ.

క. తనపాదంబులు నాలుగు, మొనసిన పైగీతిపాదములు రెండును గా
నినుమూఁడై సీసమునకు, జను నడుగులు వ్రాలు వళ్లు సరి యిన్నిటికిన్.

## అవకలి సీసము.

క. అలవడిసీసము పాదము, నలుతునుకలు చేసి మూఁట నలనామగణం
బుల రెంటిరెంటి నిడి యు, వ్వలితునుక నహంబులిడఁగవలయు న్వరుసన్.

---

1. క-చ-ట-గీదులు, 2. ట-కవుల, 3. ట-లో నీపద్యములేదు, 4. ట-చెల్లుఁగవికి, 5. చ-ట-బజ్జ, 6. ట-మనఁగఁబరఁగు.

సీ. సామంబుచేఁ దుల్యభూమీశ్వరులు దనతోడిమిత్రతకు నఱ్ఱాడుచుండ
[1]దానంబుచే నతిమానమానవనాథు లేర్పడ నక్కఱఁ దీర్పుచుండ
భేదంబుచేత దుర్మ్మదమహీశు లందంద[2]సంక్షిప్తత నొందుచుండ
దండంబుచేత నుద్దండమాండలికు లాజ్ఞాచక్ర మౌదల నోఁచియుండ
శశ్వదనురక్తిఁ జాళుక్యవిశ్వవిభుఁడు, వాలి వసుమతి[3]లీలమై నేలుననుచుఁ
జెప్ప నవకలిసేన మిట్లొప్పసంద్రుఁడు, పూని కావ్యకళావేదు లైనకవులు.

### ప్రాససీసము.

క. సీసమునకు నాలుగడుగులఁ, బ్రాసము లిడి మొదలి సర్వపదఖండములన్
భాసురముగ వళ్లలవడఁ, జేసిన నది కృతులఁ బ్రాససీసంబయ్యెన్.

సీ. చక్రవాళాచల చంద్రకాంతములకు సంతతార్ద్రిత్వంబు జరపి జరపి
చక్రీశలోకసంచరదురుసంతమసంబుల వడిఁ బాఱఁ జదిపి చదిపి
శక్రేభశంకరశంకరాచలశశిచారుదీధితులపైఁ జాఁగిచాఁగి
చక్రస్తనీకుచసాంద్రచందనరసచర్చలపైఁ గేలి సలిపి సలిపి
విక్రమప్రతాపవిశ్రుతమూర్తి యై, విశ్వభూమివిభునివిశదకీర్తి
ప్రక్రమప్రసక్తిఁ బ్రసరించు నని చెప్పఁ, బ్రాససీస మనఁగఁ బరఁగు నెందు.

### అక్కిలి ప్రాససీసము.

క. తుదిగీతి నాలుగడుగులు, వదలక ప్రాసంబు నిలిపి[4]వళ్లింపారం
గదిరినఁ గదురక[5]యున్న, న్నది యక్కిలిప్రాససీస మనఁగాఁ బరఁగున్.

సీ. క్రమయుక్తి విద్యల కందువ లెఱుఁగుచుఁ గవులనే ర్పారసి గారవించి
సమరసంక్రీడనక్షమసుభటాటోపసంచారములకు నుత్సాహ[6]మూఁది
నమితాహితక్షమానాథులరాజ్యంబు నానాఁటి కొనర నున్నతము చేసి
ప్రముదితారాతుల భంజించి వేలుపుంబడఁతుల కింపారుపతులఁ జేసి
విమలకీర్తుల దిక్కులు విప్పనేర్చు, శమితవిమతుండు విశ్వేశచక్రవర్తి
సముచితంబుగ నని చాల సన్నుతింప, నమరు నక్కిలిప్రాససీసాహ్వయంబు.

---

1. ట-దానంబుచేత సన్మానితావనిపతుల్ చెలిమికై పలుమాఱుఁ గొలుచుచుండ, 2. చ-ట-సంక్షీణత, 3. చ-నీతిమై, 4. ట-వళ్లిప్పాటన్, 5. చ-యున్నను నది, ట-యుండిన నది, 6. ట-మొసఁగి,

—✻ వడిసీసము. ✻—

క. [1]ఏపాదమునకు నేవడి, యాపాదింపంగఁబడియె నది ఖండములం
బ్రాపింపఁ జెప్పఁగ వళ్లని, హూపితసీసంబు నాఁగ నూఢికినెక్కున్.

సీ. గ్రహదంష్ట్రి సోఁకని గ్రహరాజు ప్రియవచఃకథనంబు నేర్చినకల్పభూజ
మలరుఁదూపులు కేల నంటనికందర్పుఁ డమ్మఁచే నింకనియంబురాశి
కన్నులు పెక్కులు గల్గనియింద్రుండు కఱకేది వంగనికనకనగము
తనువెత్తి క్రాలెడుధర్మదేవత నూపుఁ దాల్చినరాజవిద్యావిభూతి
నయవిదుండు రాజనారాయణుఁడు విశ్వనాథుఁ డనుచు వర్ణనములు సేయ
వరుస నిట్లు కృతుల వళిసీస[2]మన నొప్పు, వసుధ వైభవాలవాల మగుచు.

—✻ అకిఁలివడిసీసము. ✻—

గీ. సీసఖండంబు వళ్లిట్లు [3]చెప్పి గీతి
ఖండవళి రెంటి కొక్కఁడుగా నొనర్ప
నదియ యక్కిలివడిసీస[4]మండ్రు కృతుల
లక్ష్యములు చూచి యెఱుఁగుఁ డీలాగు లెల్ల.

క. సీసములకు గీతులకుం, బ్రాసములును వళ్లుఁ గలయఁబడి కవితల ను
ద్భాసిల్లఁ దఱచు నియమ, వ్యాసక్తియుఁ గలుగుఁ [5]జెప్పవలసినచోటన్.

—✻ గీతిభేదములు. ✻—

గీ. ప్రవళినాఁ బ్రసన్న[6]పదినాఁగ గీతులు, సీస[7]ములను రెండు చెందుఁ దుదల
నాటవెలఁది యనఁగఁ దేటగీతి యనంగ, వానిపేళ్లు వేఱ వలయుఁ దెలియ.

ఆటవెలఁది :—

మూఁడునగణహగణములు రెండునలనామ, కములుసూర్యగణవంచకంబుఁగూర్ప
నాటవెలఁది యడుగు లంబు[8]నిధులపట్ల, వ్రాలు వళ్లుఁ జెంది వఱలెనేని.

గీ. నగణ మొక్కండుమఱినలనామకములు, రెండునగణంబులునుదుద రెండు[9]నాలు
గడుగులును దేటగీతికి నర్ధవిరతి, వలయు వళ్లైన వ్రాలైన వరుస నిలుప.

---

1. ట-పాదమునకు నేవడి యా, పాదింపఁబడిరెు నదియ పదఖండములన్, ఆదులను జెప్పఁగావడి, రూఢితసీసంబు నాఁగ రూఢంబయ్యెన్. 2. ట-మేపారు, 3. ట-చెప్ప, 4. ఙ-మనఁగ, 5. ట-చే యవలసిన, 6. టఁవడి, 7. ట-మునకు, 8. అంబుధి నిధిపట్ల-మాతృక, 9. నాల్గునడుగులు చు

మేలనగీతి :—

[1]నలము రెండునగణములును గలసి ప్రాస మెఱయుఁ
జెలువు దోఁప నెత్తుగీతి వెలయుఁ గృతులయందు
నోలి నగణమొండె హగణమొండె నేడుచేసి
నాలుగడుగులందు నిలిపి నళువ్రదోఁప విరతి
వాలి పంచమస్థ యగుచు వచ్చెనేని యొప్పు
మేలనాభిధాన మైన మేలుగీతి కృతుల.

తరువోజ :—

నల నామకంబులునగణాంతములుగ నాలుగంఘ్రులయందు నాలుగుఁగూర్చి
వళులు మూఁడెడలను వరుసతో నిల్ప వలయు మూఁడవగణవర్ణంబు మొదల
నిలుపంగ నివ్విధి నిర్మించి విశ్వనృపతికి నిచ్చిన నింపుసొంపారుఁ
దలకొని తగఁ[2]బ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపుదనరుఁ దర్వోజ.

—※ ఇంద్రాదిగణలక్షణము. ※—

గీ. ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల, నైనగణము లినసురాధిపేందు
గణము లక్షరోపకరణంబు లవి యాది, లఘుగణంబు మొదల లఘువునిలుప.

| సూర్యగణములు. | ఇంద్రగణములు. | చంద్రగణములు. (1) | చంద్రగణములు. (2) |
|---|---|---|---|
| U I | I I I I | U I U U | I I U U I |
| I I I | I I I U | I I I U U | U I U I |
| | I I U I | U U I U | I I I U I |
| | U I I | I I U I U | U U I I |
| | U I U | U I I U | I I U I I |
| | U U I | I I I I U | U I I I |
| | | U U U I | I I I I I |

—※[3]అక్షరలక్షణము. ※—

వ. ఇత్తెఱంగున రవీంద్రచంద్రాఖ్యగణంబులలోన సప్తగణకల్పనీయంబై మహా
క్షరంబు, షడ్గణకల్పనీయం బై మధ్యాక్షరంబును, బంచగణకల్పనీయం బై
మధురాక్షరంబును, జతుర్గణకల్పనీయంబై యంతరాక్షరంబును, ద్రిగణకల్ప

---

1. ట-నలము రెండు నగణములఁ గలసి ప్రాసంబు। చెలువుమై యెత్తుగీతివెలయు సత్కృతులయందు। నోలినగణమొండె నేడు నాలుగడుగులందు నిలిపి। వళులుదోఁప విరతివాలి, 2. చ-ట-యవడ్లంపెడుచోట, 3. అక్కరమున కక్షరమని వాడెను.

నీయం౧శై యల్పాక్షరంబునా నక్షరవృత్తజాతంబులు పంచవిధంబులం బరం గు నందు.

మహాక్షరం బెట్టిదనిన :—

[1]వారిజాప్తుండు పంచేంద్రగణములు వనజారియును గూడి వెలయుచుండ
నారయ రెండవనాలవచోట్ల నర్కుండయునను దనర్చుచుండ
గోరి యవ్వడి పంచమగణమునం గూడి మొదల నిలుపంగనగు
సారమై ప్రాసవడి సప్తగణములు సాగ మహాక్షర మతిశయిల్లు.

మధ్యాక్షరం బెట్లనిన :—

[2]వరుసతో దేవేంద్రసూర్యవజ్రిరవుల......
విరచించి నాలవపట్టు విశ్రాంతి సదనంబుచేసి
తరబడిం దప్పక చెప్పం దగునంద్రు మధ్యాక్షరంబు
కరవాలభైరవు పెంపు గణపట్కమున నుతియింప.

మధురాక్షరం బెట్లనిన :—

తరణివాసవత్రితయంబు ధవళభానుయుతి నొంద
నిరతి విశ్రాంతి నాలవనెలవున నింపుమీఱ
సరసమధురార్థములం జెప్పం జను మధురాక్షరంబు
వరుసం బంచగణములను వాలి కృతులవెలయు.

[3]అంతరాక్షర లక్షణంబెట్లనిన :—

కమలమిత్రుండుసురరాజగణయుగంబు,కమలశత్రునితోం జెంది కందళింప
నమరుం బ్రాసవళ్లు నర్థంబునతిశయిల్ల, నమల మగునంతరాక్షర మబ్ధిసంఖ్య.

అల్పాక్షరంబెట్లనిన :—

సుమనఃపతియుగము సోముండును, నెమకంగం బ్రాసవళ్లు నిండి మీఱ.
గమనీయవిభవంబు గాంచు నెప్డు,రమణీయ మల్పాక్షరము కృతుల.

షట్పది :—

సురపతు లిరువురు సురపతు లిద్దఱు, సురపయుగమ్ముతో సోముండును
బరువడిం బెనంగొన నరుదుగషట్పది, సరిం బ్రాసములు దనరారంగను.

---

1. టలోవారకపంచేంద్రగణములు వనజారియును గడిది వెలయుచుండు। నాలవ రెండవయా ఆవచోట్ల నర్కుండైననుదనర్చుంగోరి యొప్పటిపంచమగణమునంగూడి మొదలనిలుపు।సారమైవళి సప్త గణములు......2. ఈప్రథమపాదము లుప్తముగా నున్నది. లక్ష్యమునుబట్టి ౨ ఇంద్రగణములు ౧ సూర్యగణము మరల ౨ ఇంద్రగణములు ౧ సూర్యగణము నుండవలయునని తెలియవచ్చుచున్నది. 3. ఇది గీతపద్యమునకు సరిపడును.

చౌపది :—

భసగానలములపై నిగరంబు, నైనఁగఁగ మూఁడవయెడ విరమంబుం
బొసఁగినఁ జౌపదిఁ బొలుచు రసంబుం, గసవరముగఁ దగుఁగద ప్రాసంబుల్.

త్రిపది :—

త్రిపదికి నొకయంఘ్రి నింద్రులు నలువురు
ద్వ్యపతు లిద్దఱు సూర్యు లిర్వు రౌల ద్వ్యపతిద్వయార్కులు నొల.

ద్విపద - మంజరి :—

శక్రత్రయంబును సవిత్రుండుఁ బాద, విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని, వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి.

—* షట్ప్రత్యయములు. *—

గీ. నచ్చుప్రస్తారసంఖ్యాననష్టములును, నొలనుద్దిష్టలగకరణాధ్వములును
ననఁగషట్ప్రత్యయములిందుఁ దనరువాని, నెఱుఁగ నేర్చుట ఛందంబు నెఱుఁగు నేర్పు.

ప్రస్తారము :—

క. గురుపంక్తి నిలిపి మొదటను, గురువునకుం గ్రిందలఘువుఁగొని[1] దానిపయిన్
సరిచేసి పిఱుఁద గురులిడి, పరువఁగ లఘ్వంతమైనఁ బ్రస్తార మగున్.

సంఖ్యానము :—

క. గురుపంక్తి మొదల రెండిడి, వరుసను రెట్టింపఁ దుదకు వచ్చిన సంఖ్యా
పరిమాణము తచ్ఛందో, విరచితవృత్తములుగా వివేకింపఁదగున్.

నష్టము :—

గీ. అరసి వృత్తసంఖ్య నర్ధించుచో సరి, యైన లఘువు విషమ మైన గురువు
గొనుచు బేసి నొకఁడుగూడి యర్ధముసేయు, నవధి నష్టవృత్త మబ్బునంద్రు.

ఉద్దిష్టము :—

క. వలసినవృత్తగణాలిమొదల నొకటఁడు నిలిపి తుదకుఁ దగ రెట్టింపన్
గలలఘువుల[2] పై లెక్కలు, నొలయఁగ మఱియొకఁడుగూడ నుద్దిష్టమగున్.

లగకరణము :—

క. ఎక్కువ యొకఁడుగ వృత్తపు, టక్కరముల దొంతిపేర్చి యటమీఁదటికై
యొక్కొక్కఁడ విడిచి యెన్నిన, లెక్కలు గురులఘువిమిశ్రలిఖితగణంబుల్.

---

1. టంయని తుదితో | పిఱుఁద గురువు లిడి సరిగా......2. ట-తుదిలెక్కల,

క. [1]ఆలెక్క లన్ని యెన్నిన, లోలత లఘువులును గురువు లును గలిగెడు వృ
త్తాలి నవి గలయఁ గూడిన, నోలిందద్వృత్తసంఖ్యయును నొనఁగూడున్.

అధ్వప్రక్రియ :—

క. వృత్తసంఖ్యనిమువు వెడలుపు రెట్టించి, వానినొక్కఁడొకఁడు వసున నెన్న
నెన్ని యయ్యె నన్ని యొసఁగు నంగుళు లవి, ప్రస్తరింప నిడుపుపరఁగు విప్ప.

శా. అందం బై శ్రుతిమూల మై విలసదుద్యత్సర్వలోకాశ్రయా
నందం బై సమవృత్త మై వివిధవర్ణశ్రావ్య మై సద్రస
స్యందం బై బహువిశ్రమం బగు భవచ్చారిత్రముంబోలె నీ
ఛందశ్శాస్త్రము పర్వె నుర్వరను విశ్వక్షోణిపాలాగ్రణీ.

శా. కావ్యాలంకృతికల్పనక్షమ[2]కళాకల్యాణ కల్యాణపూ
ర్ణవ్యాపారసమృద్ధ[3]యుద్ధవినమద్రాజన్య జన్యస్థల
[4]క్రవ్యాదావళిగీయమానవిజయప్రారంభ రంభాదిరం
తవ్యస్త్రీసుఖవృత్తిసుందరసపత్నస్తోత్రపాత్రోదయా.

క. నిఘ్నాఖిలశోభన వృత్రఘ్నమహత్తరవిభూతి రంజితజంఘా
దఘ్నారినవ్యజయని, ర్విఘ్నోదయసదయవినుత విశ్వావసనిధీ.

మాలిని. స్తుతహిమకరజూటా చూర్ణితద్విట్కిరీటా
ప్రతతగుణపరీణా పంచధారాధురీణా
సితకరకులదీపా స్నిగ్ధబద్ధప్రతాపా
[5]సతతలసదభిఖ్యా సర్వలోకాశ్రయాఖ్యా.

గద్యము :—

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధ
బుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయవిరచితం బైన కావ్యా
లంకారచూడామణి యనునలంకారశాస్త్రంబునందు
ఛందోగణజన్మశుభాశుభనిరూపణవివిధవళిప్రాస
ప్రపంచలక్షణ సమవృత్తజాతికల్పన షట్ప్ర
త్యయదర్శనాదిసముద్దేశంబునం
దష్టమోల్లాసము.

---

1. ట-ఆలెక్క లెన్నియన్నియు, 2. ట-రమా, 3. నిత్యవినమద్రాజన్య-(మూలము), 4. ట-క్ర
వ్యాద్దంపతి, 5. ట-వితతసమరశౌర్యా విశ్వభూపాలవర్యా.

శ్రీరస్తు.

# కావ్యాలంకారచూడామణి.

## నవమోల్లాసము.

### వ్యాకరణము.

క. శ్రీవిశ్వేశ్వర విజయ, శ్రీవిశ్రమ[1]హర్మ్యబాహుశిఖర [2]బుధోక్తి
శ్రీవిశ్వగవ్యారిస్తుత, శ్రీవిభ్రమదాలయప్రసిద్ధవిభూతీ.

క. భవదనుమతి సూరిసుఖ,[3]ప్రవణం బయినట్టి యంధ్రబంధురరుచిమ
[4]త్కవితాస్పద మగుపలుకుల, వివరింతుం దెలియఁ బెక్కువిధములు జగతిన్.

క. యుక్తివిశేషము కబ్బం, బుక్తివిశేషంబు [5]గాదు యోగ్యనకైనన్
యుక్తివిశేషము[6]సాధ్యం, బుక్తి[7]విశేషం బసాధ్య మూహింపంగన్.

మ. విలసద్భావరసాద్యలంకృతులచే[8]విప్పాటి గీర్వాణభా
షల కబ్బంబుల కెన్నిమంచితనము ల్సంధిల్లు నాచంద మై
వళియుం బ్రాసము నంత కగ్గలములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచుం జెవిఁబెట్టలేమి యుడుపం దేఁగల్గునే మం దిలన్.

క. ధరశ్రీపర్వతకాళే, శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం, బరుదారఁ ద్రిలింగదేశ మనఁజనుఁ గృతులన్.

గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ, దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశ[9]మును నండ్రుకొందఱు, బ్బాసపంచగతులఁబరఁగుచుండు.

గీ. తెలుఁగుదేశభాష తెలియఁ బొమ్మనఁబోక, తెలియవలయు మించు తేటపడఁగఁ
దొడవు గాక పసిఁడిఁ దొడిగిన నొప్పునే, కనక మింత నెంత కలిగనేని.

గీ. విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు
లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ

---

1. ట-హర్మ్యబహుళ, 2. ట-గుణోక్త, 3. ట-ప్రవణప్రదమైన, 4. ట-కవితాపద, 5. ట-గాదయోగ్యనకైనన్, 6. ట-హృద్యం, 7. ట-విశేషములసాధ్య, 8. ట-వీడ్వాడి, 9. ట-మనియండ్రు.

నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము కాన
వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ.

క. స్వరములు నచ్చులు ననఁగా, నరయ నకారాదిసంజ్ఞ [1]నయ్యక్కరముల్
దిరముగ హల్వ్యంజనములు, వరుసఁ గకారాదిపంచ[2]వర్గాక్షరముల్.

క. యరలవ లంతస్థలు నా,నురవగు శషసహలు [3]హొలుచు నూష్మ లనంగాఁ
బరువడిఁ బ్రయోగములయెడ, విరచింపుదుఁ దెలియవలయు వీనిఁ దెఱంగుల్,

క. భువిలోఁ దత్సమమును ద,ద్భవమును [4]సహజాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యము నాఁ బం,చవిధములై తెలుఁగుఁబలుకుజాతము పరఁగున్.

—* తత్సమలక్షణము. *—

గీ. [5]పరఁగ సంస్కృతంబుపైఁ దెనుఁగువిభక్తులునుపఁబడి పొసంగియుండెనేని
తత్సమంబు నాఁగఁ దగునంద్రు సుకవులు, తద్విహీనకావ్యతతియు లేదు.

చ. పరమవినీతిమంతు లగు పార్థివకోటికి విశ్వమేదినీ
వరుదెన నాగ్రహంబుఁ జిరమై రము సత్యవిహీనవృత్తమున్
బిరుదమదంబుఁ గైతవము[6]భేదవిధానము దుర్ణయంబు మ
త్సరమును వర్జనీయ మనఁ దత్సమమై చను నంధ్రభాషనున్.

క. వదలక సిద్ధాక్షరములఁ, బొదివినవర్ణములఁ దూలిపోఁబలుకఁగ న
ర్థదమై ప్రాకృతనిభ మగు, [7]నది తద్భవపదము నాఁగ నభినుత మయ్యెన్.

సీ. యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు చంద్రముఁ డనుపేరు చందమామ
యోధులు జోదులు యోగులు జోగులు భేదంబు బిందంబు పృథివి పుడమి
విష్ణుండు వెన్నుండు వెజ్జు నా వైద్యుండు పుస్తంబు పొత్తంబు ప్రోడ ప్రౌఢ
కుబ్జుండు గుజ్జుండు కుక్క కుక్కుర మగు శయ్యయు సజ్జ నా జాది జాతి
యనెడు పల్కులు తద్భవాహ్వయము లంద్రు, వీనినిన్నిటి నెఱిఁగి వివేకబుద్ధిఁ
గబ్బములు[8]చెప్పుకవులచక్కదము మెచ్చు,విపులవిద్యుండుచాళుక్యవిశ్వవిభుఁడు.

—* దేశ్యలక్షణము. *—

క. శ్రేయము లై బహుదేశా, నేయము లై చక్కఁదనము నెఱదనములు నై
యాయానెలవులఁ [9]జెవులకుఁ, దీయము లగుపలుకు లెల్ల దేశ్యము లరయన్.

---

1. ట-లయ్యెఁదలంపన్, 2. ట-వర్గాఖ్యంబుల్, 3. ట-చూడ, 4. ట-దేశీయమైన బాస యు గ్రామ్యం, బవి కేవలాంధ్రమున, 5. ట-ప్రకట, 6. ట-భేదవితానము, 7. ట-నదియేతద్భవము, 8. ట-చెప్పుచుండు చక్కదము, 9. ట-కుంగడు.

సీ. వాలాయ మూలంబు వంగడ [1]మంగడ సోలంబు బొకులు సోయగంబు
విన్నన్ను వెన్ను వాకిరి వంత వాగెంబు డెందంబు డిప్పాడి డిల్లపాటు
నెమ్మోము నెత్తమ్మి నెలఁత క్రొన్నెల కొమ్మ లావడి యొయ్యార మూరజంబు
పొక్కుడు నెవ్వఁగు పొచ్చెంబు మచ్చిగ యక్కజం బచ్చెరు వక్కు నిక్కు
వెలఁది చిగు రల్లి వేనలి వేనవేలు, నాఁగఁ జనుశబ్దములు [2]దేశినామకములు
వీనఁ జెప్పినకవితల [3]వినుచు మెచ్చుఁ, జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి.

—* అచ్చతెలుఁగు లక్షణము. *—

క. ఈమూఁడు తెఱంగులలో, నేమిటనున్ దొరలకున్న నెల్లజనులకున్
[4]లో మిగులఁ దేటపడియెడు, నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందున్.

చ. ఎనుములు గుఱ్ఱము ల్మొదవు లెడ్లు బండులు [5]పండు లుప్పు ప
ప్పునుములు కొల్లు లాముదము లాకులుఁ బోఁకలు నేయి నూనె యే
పునఁ బెనుపొందు విశ్వవిభుప్రోల నవం [6]దగ విన్నవారికిన్
మనమునఁ [7]దేటగాఁ దెలియుమాటల యచ్చతెనుంగు నాఁ జనున్.

—* గ్రామ్యలక్షణము. *—

క. ఈసడములు గోరడములు, గాసరబీసరలు నైనకట్టిఁడిపలుకుల్
భాసిల్లు గ్రామ్యములు నా, హాసోక్తులఁ దెగడుచోట నవియును నొప్పున్.

సీ. ఊసలు వేసలు వేసాలు దోసాలు దోసలు వేదాలు గాసడాలు
[9]బొందలు గుద్దలు బొక్కలు గుండలు గంతలు మొదలైనకారకములు
దాని గొంచారమ్మి దీని గొంటూ బోకు [10]మేనూను నీవూను యేగవలయు
పాడేము నూనేము పైలురా గాసేము వాసేవు నేసేవు లేసిరాకు
మనెడు క్రియలును మొదలైనయట్టిగ్రామ్య,
శబ్దములు శబ్దములుగాఁగఁ జనవుమెఱసి
కవుల మనుకొను నయ్యారఁగవుల[11]కైవు
వినిన నగకున్నె చాళుక్య విశ్వవిభుఁడు.

---

1. ట-మేలంబు, 2. ట-దేశ్య, 3. ట-వినిన, 4. ట-బో, 5. ట-నడ్లును, 6. ట-గడు, 7. ట-తెల్లఁగా, 8. ట-గాసడబడసడములైన, 9. ట-బొందులుగుందలు, 10. ట-యేము నీవూగూడ యేగవలయు, 11. ట-నెపుడు.

## —※ తత్సమశబ్దపరిజ్ఞానము. ※—

గీ. [1]వెలయుసంస్కృతంబు తెలిఁగించుతెఱఁగు సం
ధులు విభక్తిచయ విధులు సమాస
తద్ధితములుఁ గ్రియలు తగుభంగి నెఱిఁగింతు
నమరశాస్త్రసరణి ననుసరింప.

## —※ అజంతప్రకరణము. ※—

క. [2]నిము పుమపవలయు సంస్కృత, మెడపక లింగములు మూఁట నేకాక్షరముల్
విడిచి యజంతాదుల కీ,నడక యవశ్యప్రయోజనము తెనుఁగునకున్.

క. బిందువిసర్గంబులు గడ,నందిన[3]పొల్లులను [4]దక్కి యంధ్రవిభక్తుల్
పొందుగ సంస్కృతపదముల, ముందటిదెస నిలుప నందముగఁ దెనుఁగయ్యెన్.

క. స్థావరతిర్యక్పదములు, దేవమనుష్యాదికములుఁ దెనిఁగించునెడన్
వావిరి నజంతములతుదఁ, గావించు ముకారమును డుకారము నునికిన్.

గీ. దానకల్పకుజము దర్పోగ్రసింహమ్ము, రజనికరుఁడు కాంతి విజయుఁ డాజిఁ
దనర విశ్వనాథుఁ [5]డన నకారాంతశ,బ్దములఁ దెనుఁగుపఱుచు భంగులయ్యె.

క. రవి యరితిమిరాపహతిం, బవి పరగిరివిహతి రసవిభావప్రతిభం
గవి విశ్వేశ్వరుఁ డనఁగా, భువినీద్వయమునకు నిదియపో తెనిఁగింపన్.

గీ. ఇల నుకారాంతపదములఁ దెలుఁగుసేయఁ,గడ వుకారంబునుండుడుకారముండు
రాజనారాయణుఁడు నృపప్రభు వనంగ, విశ్వనాథుండునృపులకువిభుఁ డనంగ.

క. మనుకటుపటుశబ్దాదుల, నొనరింప డుకార మెపుడు[6]నుండదు కవితం
[7]దెనిఁగించి చెప్పుచోటం, దనరు వుకారంబ యర్థదాయక మగుచున్.

గీ. మనువు ధర్మశాస్త్రమతమున మిక్కిలి, కటువు బిరుదవినుతి కర్ణములకుఁ
జాలఁ బటువు ధరణి సంగీతసాహిత్య, [8]సరణి విశ్వనాథచక్రవర్తి.

క. వెలయు ఋకారాంతపదా,దులఁ దెనుఁగుగఁ జేయుచోటఁ దుదినిడుపులు గు
జ్జులు సేయందగు నృపులకుఁ, జళుక్యపతి కర్త భర్త సంహర్త యనన్.

---

1. ట-తెలియ, 2. ట-లో నీపద్యము లేదు. 3. ట-పొల్లులుస, 4. ట-బుచ్చి, 5. ట-డనఁగా నకారాంత, పదము, 6. ట-నొప్పనికతనం, 7. ట-దెనిఁగించుచోటఁ గవితం, 8. ట-విద్యలను జళుక్యవిశ్వవిభుఁడు.

క. స్త్రీలింగంబుల నిడుపులు, వాలాయము నడుపఁ దెనుఁగువచనము లగు నం
దాలోల స్త్రీ హ్రీ శ్రీ ధీ లనులపితములు దక్కఁ ద్రిక్కినవెల్లన్.

క. స్త్రీలకు మదనుఁడు విజయ, శ్రీలకు రఘురాముఁ డెపుడు హ్రీలకు సుధితా
వాలము నిజపాలితభూ, ధీలకుఁ దగుపదము రాజదేవేంద్రుఁ డిలన్.

క. [1]శ్రీవిష్ణువర్ధనాఖ్య, త్సూవరుభూవిరవెపుడును మాకు ననంగా
భావగు నేకాక్షరశ, బ్దావళి యప్పిఱుఁద నొకరుఁ డంటకయున్నన్.

క. వనితా యనుచో వనితయు, జననీ యని పలుకుచోట జననియును వధూ
యనుచోట వధువు తెనుఁగున, జనునాయీయూలుతుదలఁజనుపలుకులకున్.

క. ఐకారాంతము లోకా, రౌకారాంతములుఁ దెనుఁగు లైనప్పుడు పూ
ర్వాకృతితోడనయుండును, నోకారాంతంబుపై బహుత్వము నొందున్.

క. రై వరఁగును నదుగోవున, గోవులు విదుకంగ గ్లౌనికులన్నృపతులు ధ
ర్మావిష్కృతిఁ బడయుదు రనఁ, గా వెలయుఁ గవిప్రయోగగతిఁ దెలియంగన్.

వ. ఇది యజంతంబులు తెనిఁగించుతెఱం గింక హలంతవిధియు నెఱిఁగింతు.

—✻ హలంతప్రకరణము. ✻—

క. భూభుగ్విరాడ్పదంబులు, శోభితముగఁ దెనుఁగుపఱుచుచోఁ దుదపొల్లల్
ప్రాభవమతివర్ణములగు, భూభుజులు విరాజు లనఁగఁ బొలుపై యునికిన్

క. బలవన్మతిమత్పదముల, తలనున్ననకార మెడలుఁ దగఁ దెనుఁగగుచో
బలవంతుఁడు మతిమంతుఁడు, చళుక్యపతి యనఁగ సర్వశాస్త్రములందున్.

గీ. ద్విట్పదంబు వేదవిత్పదంబును దిక్పదమునుబూర్వవర్ణతను భజించు
విద్విషుండునాఁగ వేదవిదుండనఁ, దూర్పుదిశ యనంగ నేర్పరింప.

క. చేరు నకారాంతముల డు, కారముఁ దెనిఁగించుచోటఁ గతినాత్ముఁడనన్
దారుణకర్ముఁడనంగను, మేరుమహాధన్వుఁడన నమృతధాముఁ డనన్.

గీ. [2]వలసినపుడు శర్మవర్మశబ్దంబులు, పైడుకార మెక్కఁ బాసిపోవు
రామశర్ముఁ డనఁగఁ గామువర్ముఁడనంగ, వసుధ శర్మ యనఁగ వర్మ యనఁగ.

—✻ సంధిపరిచ్ఛేదము. ✻—

వ. ఇది సంస్కృతపదంబుల కాంధ్రీకరణం బింక [3]నజంతహలంతసంధు లనంగ
రెండు దెఱంగు లయ్యె నందు నజంతసంధి యెట్టి దనిన.

---

1. ఈపద్య మితర ప్రతులలోఁ గనఁబడదు, 2. ట-పలయునవుడు, 3. ట-నజంతసంధి హలంత.

గీ. [1]ఆదిశబ్దాంతవర్ణంబు సంత్యశబ్ద,పూర్వవర్ణంబుతోఁ గూడఁ [2]బొత్తుచేత
సంధియగుఁగారకక్రియాసంగతములు, పెక్కురూపంబు లటుగానిపింతుఁదెలియ.

గీ. [3]తెలుఁగుఁబలుకులు వెలిగాఁగదివిజభాష, లమరఁదెనిఁగించినప్పుడు నచ్చుతోడి
వ్యక్తులై యుండునయ కాని వానితోడి, వర్ణవర్ణైకభావంబు వలనుగాదు.

క. అచ్చుతుదియచ్చు పట్టున, వచ్చి యకారంబు నిలుచు వలసినయెడఁ దా
నచ్చును యితోవేత్వంబులఁ,జొచ్చు ప్రచితార్థ[4]వాదసూచకమగుచున్.

క. వేయిచ్చుట యీవులయెడఁ,జేయుడుపమియరులయెలమి సిదుముటయిలయుం
బాయక యేలుట యేచుట, యీయధిపతి కొనరు నాఁగ నివి లక్ష్యంబుల్.

క. పోయితి వపుడప్పుడునీ, వీయుని కేతెంచి తేయు మేయు మనంగాఁ
బాయక యేయేయనఁగా,నీయుభయముఁ జెల్లుఁగ్రియలనిడ నొక్కొకచోన్.

గీ. ఒనర సంబుద్ధి[5]నోతండ యనఁగనోతఁ, డనఁగఁ బూనిన పీని కనర్థమగున
యర్థమిమ్మిమ్ముకొమ్మమ్మునెడుచోట, న్వాఁడు చెప్పఁడుఁ దెనుఁగునకుచితమరయ.

గీ. అటనుకారాంతషష్ఠిపై నచ్చు మొదల, నొనరఁ బొల్లనకారంబయుండవలయుఁ
బోతునూరేతునాలునాఁబోలుఁగాని, నగియుఁబోతూరు నేతాలునాఁగజనదు

గీ. అచ్చికారాంతషష్ఠిపై నడఁగుఁబొడము, సింటి దింటిది యనఁజెల్లు నెల్లకడల
నర్థిదర్థిదియననొప్పు నంధ్రకవితఁ, గవులయనుమతి నిదియును గానవలయు.

క. అచ్చులపై హల్లుండిన, నచ్చుండినఁ దద్ద్వితీయ కపుడు నకారం
బచ్చుడిగి హల్లులుండిన, మచ్చికమైఁ[6]బోవు వచ్చు మఱియొక్కొకచోన్.

[7]క. భువి నైనికెగంటిని కెగు,రువునను నంధునకు బిరుదనూరునకారం
బివి అంతంబులపైనిం, దవిలిన బహువచనయుక్తిఁ దనరకయున్నన్.

క.

ంటికి సంధినకారం, బుంట యనస్వార్థమందురు ట్టాంతములన్.

క. నిడుపున జకారభావము, వడసియు హ్రస్వమున నెల్లపట్టున నుత్వం
బడరు నకారపుఁ బొల్లకు, నిడఁ దగుఁ బూర్వప్రయోగ మెఱిఁగి కవీంద్రుల్.

క. నేను బచరింతు నీవలెఁ, గానము విశ్వావనీశు కడనును పేనిం
దానాకును నభిమత మగు, నానగుఁ గా దేను నేను గా నేకోక్తిన్.

---

1. ట-ఆద్య, 2. ట-బొందుసేఁత, 3. ట-లో నీపద్యము లేదు, 4. ట-పాద, 5. ట-నేయుచో నెత్తఁడనఁగ। నాతఁడనఁగను నూఁదిననర్థమగున, 6. ట-నుండుఁబోవు మఱియొకఁడై నన్, 7. ఈ క్రింది నాలుగుపద్యములును క-లోమాత్రమున్నవి. దిద్దవలనుపడలేదు.

గీ. అచ్చు పరమైనపట్టునఁ బ్రాణిపదము, కర్మమగుచోటఁ దక్కఁ నుకారయుక్తి
వాడుకొనరు చకారభావమున దాని, ననుచరింపుదురు కవిత్రయానుమతిని.

క. రిపునోర్చె రిపునినోర్చెను, రిపునాజి జయించె నుగ్ర రిపుని జయించెన్
నిపుణతఁ జళుక్యవిశ్వా,ధిపుఁ డనఁగాఁ దెనుఁగుసంధి తెఱఁ గొప్పారున్.

గీ. తద్ద్వితీయవిభక్తిప్రాంతలఁ జరింపు, కద్దిగల సున్నసోఁకునఁ గచటతపలు
గజడదబలగునూఁదుటగలుగుఁగవుల, యనుమతంబున నొక్కొకయవసరమున.

గీ. జడులఁగరుణించుఁజతురులఁజాలఁబ్రోచు,[1]వాజిపదకాయనంబునవశముసేయు
[2]భటులఁదనియించుఁబ్రజలకుఁబాడినడపు, శస్తవినయుండుచాళుక్యచక్రవర్తి.

క. అలఁతులఁ దుదహల్లులకును, నలవడవామమున నుండి యచ్చోటులచేఁ
బలుమఱుఁ దేలుచు నూఁదుచు, విలసిల్లుట గలుగులక్ష్యవిధినెఱుఁగఁదగున్.

క. తనుఁబొగడుఁదన్నుఁబొగడును, జనుఁడుజనుండనఁగఁదెనుఁగుజాడలుగలుగున్
మనవాఁడు వీఁడునాఁగాఁ, జను నిడుపులు వలవ దూఁద సరళతకొఱకున్.

క. మొల్లమ్ముగ నెల్లెడలను, హల్లులపై నిడుపు లగుచు నాయీయేయో
లుల్లసితాకృతి నిలుపం, జెల్లుం బ్రశ్నానునయవిశేషములందున్.

క. రారా నాగారీ ము, న్నీ రే కర్ణాదిదాత లిట్టివదాన్యో
దారత విన మందఱు నట, పోరో విశ్వేశువేఁడ బుధులనొనెపుడున్.

క. రుచిరముగఁ[4]బిలుచుచోటను, బ్రచురంబుగఁ బ్రథమపొంతఁబడియుండెడున
క్కచటతపంబుల పట్లను, బ్రచుదించుం గసడదవలు పరిపాటి మెయిన్.

గీ. విశ్వవిభుఁడు గడిది వీరుండు సతురుండు, దక్కుఁద్రిక్కులేని చొక్కులాఁడు
దత్త్వవిదుఁడు వరవిదారణశీలుండు, ననఁగఁ దెనుఁగు సంధియలగునిట్లు.

క. డులు రునులను నీవర్ణత,తులు మొదలుగఁ గొన్నిగొన్నితుదహల్లులతోఁ
గలయునెడఁ గూడు[5]విడుచుం, దెలుఁగునకగుసంధి దీనిఁదెలియఁగవలయున్.

గీ. వేడ్క వేడుకవ్రేల్మిడివ్రేలుమిడియు, మూర్మలసెమాఱుమలసెనుమాన్పుమాను
పుముపిరోధముసంక్రాంతిఁ బొల్చునిట్టి,సంధిలక్షణమెంతయుఁ జనునెఱుంగ.

క. ఇది సంధిక్రమమరయఁగఁ, దదుచితసంధానవిధులు తఱచెఱుఁగుఁ డిలన్
విదితవిభక్తులగతిఁ జెప్పెదఁ దెలియన్వలయుఁ బూర్వబుధకృతసరణిన్.

---

1. ట-వాజిదవకాయానంబున (?) 2. ట-బంట్లు, 3. ట-నొప్పున్, 4. ట-బలుకు, 5 ట-విచ్చున్.

## —* విభక్తిప్రకరణము. *—

వ. ప్రథమయు ద్వితీయయుఁ దృతీయయుఁ జతుర్థియుఁ బంచమియు షష్ఠియు సప్తమియు సంబోధనంబును నన నెనిమిది తెఱంగుల విభజింపం గా[1]రణంబు గాన విభక్తు లనం బరఁగుఁ దత్ప్రకారం బెట్టి దనిన.

క. తెలుఁగుం బ్రాకృతభంగిన, బలియుటచే నేకవచన బహువచనపదం
బులకాని ద్వివచనంబులు, గలుగవు తత్క్రియలఁ గారకంబులయందున్.

క. ముడులు తుదఁగలుగుశబ్దము, లడరం బ్రథమావిభక్తు లవి కర్తలగుం
గడు నొసఁగు నిష్టములు ధరఁ, బొడమినకల్పకము విశ్వభూవిభుఁడనఁగన్.

క. నునివర్ణంబులు తుదినొం, దిన కర్మపుఁ బదము ద్వితీయయనంగాఁ
జనుఁ జాళుక్యధరిత్రీ, పుని విశ్వేశ్వరుని సిరులు వొందుననంగన్.

క. చేత ననుపలుకు తుదలఁ బ్ర, తీతంబగు నేనియది తృతీయయగుం బ్ర
ఖ్యాతంబుగ విశ్వేశ్వరు, చేతం బ్రభవిల్లు నెల్లసిద్ధు లనంగన్.

క. పలుకులతుదఁ గై శబ్దం, బలవడ నిలిచినఁ జతుర్థియగు విశ్వమహీ
లలనకై యలఘునకై, చెలువారం గృతులు కవులు చెప్పుదు రనఁగన్.

క. పదముతుదవలననని యెడు, పద ముండినఁ బంచమీవిభక్తియ పుష్ప
ప్రదరుఁ డగువిశ్వభూవర, మదనువలనఁ దొలఁగు సతులమానంబనఁగన్.

క. అమరి కుశబ్దముపాదాం, తమునం దున్నేని షష్ఠితప్పదు విద్యా
సముదయము విశ్వవసుధా, రమణునకుం[2]బోలుచు నిలనిరంతరమునన్.

క. పలుకుతుద నందునను న, ప్పలుకుండిన సప్తమీవిభక్తియగున్ని
శ్చలితచతుర్దశవిద్యా, విలసనములు పొలుచు విశ్వవిభునందనినన్.

గీ. ప్రథమగావించు ముడులను బాయఁబెట్టి, కట్టెదురఁబల్కు సంబుద్ధి కడుఁదనర్చు
విక్రమాటోపచాళుక్య విశ్వభూప, పటుగుణావాల గండగోపాల యనిన.

క. కోరి ముకారముమీఁదను, కారముపట్టునను దగ లుకారమునిడఁ బెం
పారున్ బహువచనంబులు, హారము లంగములు విబుధు లమరు లనంగన్.

క. కడల ముకారడుకారము, లుడుపఁగఁబడు నచ్చ తెనుఁగుటుక్తులయందుం
గడ గడలు గొడుగు గొడుగులు, బడుగు బడుగు లేకవచనబహువచనములన్.

క. చింతింపఁగ [3]నివ్విధినివహ, లంతంబులు చెల్లునిలఁ గ్రియావంతులు శ్రీ
మంతులు ధీమంతులు గుణ, వంతులు భూభుజులు వైరివధవిదులనఁగన్.

---

1. ట-గారణమగుట. 2. ట-దగునిరంతరంబుం బ్రీతిన్. 3. ట-నివిభునివిహ.

క. ధర బాలుమీఁదిడుత్వము, పరువడి రుత్వంబు నొందు బహువచనము, బా
లురు భూపాలురు కరుణా, పరలోలురనంగఁ దగు నుదాహరణంబుల్. (?)

గీ. వాఁడు వీఁడను నవి బహువచనములను, వారు వారలు వాండ్రును వీరు వీండ్రు
వీరలును నాఁగ నెందును విస్తరిల్లు, గాఁడునకు గారు గాండ్రును గలుగు నండ్రు.

గీ. కొఱను నెఱను మ్రాను కొలనను నివియెల్ల, బహువచోనియుక్తిఁ బరఁగుచోట
వెలయుఁ దత్పదములఁ గులు జనియించుఁ బై, వరుస నచ్చతెనుఁగు వచనములకు.

క. కొఱఁకులు నెఱఁకులు మ్రాఁకులు, జిఱుఁగొలఁకులు నయ్యెఁ బేను జేనును మీనుం
గొఱపేలుఁ జేలు మీలన, నురువగు నిలనచ్చతెనుఁగు లూహింపంగన్.

క. పల్లు విల్లిల్లు నాఁ జను పలుకులెల్ల, బండ్లు విండ్లిండ్లు నాఁ జను బహుతనొందువ
బాడుఁ గుండేలు గోరను పలుకులెల్లఁ, బాళ్లుఁ గుండేళ్లు గోళ్లు నాఁ బసుధరిత్రి.

గీ. వరుస నేయి చేయి వాయను పలుకులు, తుదలఁ బెక్కుఁ జెప్పఁ దులు జనించుఁ
బ్రీతి నేతులనఁగఁ జేతులు వాతులు, నాఁగఁ జెల్లు నెల్లనాట నండ్రు. [ఱాలు

గీ. వేయి ఱాయి దోయనియెడి వీని బహుత, నోలిఁ దుదలు త్వ మొనఁగూడు వేలు
దోలు నాడుత్వమబ్బు నెద్దునకు వరికి, నెడ్లు వడ్లును నాఁ జను నెఱుఁగవలయు.

క. కేలేకవచన మరయఁగఁ, బాలును దెమ్మెరలు సహజబహువచనంబుల్
మూలాఖ్యమున్న గాఁ బే, రోఁకలోఁబడునిట్లు ధాన్యకులములకెల్లన్.

గీ. కొఱ్ఱ లాళ్లు వడ్లు గోదుమ లనుములు, కొల్లు లనెడు వీని కెల్ల నిట్లు
ప్రకటితంబులయ్యె బహువచనంబులు, నేకవచననియతి యెపుడు లేదు. [లగు

గీ. ప్రాణిభేదములు వెలిగాఁగఁ బ్రథమలైన, నరయ నొక్కొక్కచో ద్వితీయార్థము
రాజలంకారములు ప్రూనె రాచకొడుకు, వస్త్రములు దాల్చె నన నెందు వఱలెఁ గాన

క. ఒనరఁ దృతీయయుఁ బంచమియును సప్తమియును దలంప నుచితనిజైకా
ర్థనియతిఁ జెల్లుం దెలియఁగఁ, దనరిరి విభక్త్యర్థవేదు లైనకవీంద్రుల్.

గీ. విశ్వవిభుని చేత విలసిల్లు సిరి కర, వాలభైరవాంకు వలనఁ గలుగు
భూరిసిద్ధి రాజనారాయణునియందుఁ, బొడముఁ గవుల కతివిభూతియనఁగ.

క. పోక చతుర్థీషష్ఠులు, నేకార్థమునందుఁ బలుక నిత్తురు విశ్వ
క్ష్మాకాంతునకుం గృతు లరి, భీకరునకు [1]నిత్తు) గవులు పృథునీతులనన్.

వ. మఱియు నంధ్రభాషావిభక్తులకుం గల నామాంతరంబు లెఱింగింతు, స్థావర
తిర్యఙ్మనుష్యపదవ్యక్తియగు ప్రథమావిభక్తికిం గ్రమంబున ముకారంబును డుకా

1. ట-నిత్తురర్థిఁ బ్రియగీతులనన్.

రంబును, ద్వితీయకు నుకారనికారంబులును, దృతీయకుఁ జేత తోడ యనునవి యుఁ, జతుర్థికిం గై కొఱకు[1]కనునవియుఁ, బంచమికి వలన పట్టి యుండి కంటె యనునవియును షష్ఠికిం గి కుకారంబులను యొక్క లోపల యనుపదమ్ములును, సప్తమికి నందు న యనుపదంబులు నయ్యేఁ దత్స్రీకారంబునకు విభక్తినిరూప ణంబు[2]లలవరింతు.

క. ద్రుమమేచె ద్రుమముఁజూచెను, ద్రుమమ్ముచేసొప్పె నరుగుద్రుమమునకై యా ద్రుమమువలన ఫలమబ్బెను, ద్రుమమున కెనలేదు పుర్వు ద్రుమమందొప్పెన్.

వ. ఇది యేకవచనవిధి.

క. ద్రుమములుద్రుమములఁ గదిసెను, ద్రుమములచేనీడగలిగె ద్రుమములకై గం ధమమరె ద్రుమములవలనన్, ద్రుమములకలరారెఁదాను ద్రుమములయందున్.

వ. ఇట్లు తిర్యక్పదంబులకు యోజించునది.

క. తనయుఁడు తనయునిగనియెను, దనయునిచేఁ దనయుకొఱకుఁ దయునివలనం దనయునకు ధనముదొరకెను, దనయునియం దెల్లమంచితనములు గలుగున్

క. తనయులు తనయులఁ బడసిరి, తనయులచేఁ దనయులకయి దనయులవలనం దనయులకు మేలుగలిగెను, దనయులయం దనఁగ నివి యుదాహరణంబుల్.

క. కవి యొప్పుఁ గవి భజింతురు, కవిచేఁ గృతులొదవు సిరియుఁగవియుఁగవులకై కవివలనఁ గల్గుఁగీర్తులు, కవితతికిం బేరువెలయుఁ గవివరునందున్.

క. కవులు నుతింతురు కవులం, గవులచేతఁ (?) గవులకొఱకుఁ గవులవలనఁ ద త్కవులకుఁ బ్రసిద్ధి యలవడుఁ, గవులందుంగాక కావ్యకల్పన గలదే.

క. గురుఁ డధికుఁడు గురుఁ దలఁపుము, గురుచేతం దెలిసి భక్తికొఱకు గురునకై గురువలన మేలు చేకుఱు, గురునకు సరిలేదు విద్య గురునందుండున్.

క. గురువులు గురులను గొల్తురు, గురువులచే గురులకొఱకు గురువులవలనన్ [4]గురులకు భక్తి దనర్చును, గురువులయందుండు సకలగుణములు నెపుడున్.

వ. ఇత్తెఱంగున నను క్తపదంబులయం దొడఁగూర్చునది.

క. స్థావరతిర్యక్పదములు, వోవిడిచి తృతీయ మొదలు పురుషాఖ్యలపైఁ బై వర్ణములో నుత్వము, నావల నిత్వము విభక్తులైదును జెందున్.

క. సుతుచేత సుతునిచేతను, సుతుకొఱకును సుతునికొఱకు సుతువలనం ద త్సుతునివలన సుతుకొదవును సుతునికొదవు సుతునియందుసుతునందనఁగన్

1. ట-కనునవియు. 2. ట-అనధరింపుము, 3. ట-గోరు, 4. ట-గురువులకు భక్తి దనరును.

గీ. పరఁగఁ గూఁతురుశబ్దంబుపై రుకార
మొక్కపలుకున పై[1]నైన నుండుఁ బాయుఁ
బెకుఁ పలుకులపైనైనఁ దక్కిపోవుఁ
[2]గూఁతురుగఁ బొందెఁ గూఁతుగాఁ గోరె ననఁగ.

క. కూఁతులచేఁ గూఁతురిచేఁ, గూఁతులకై కూఁతుకొఱకుఁ గూతులవలనం
గూఁతులకుఁ దగవు లొసఁగెను, గూఁతులయందుండుఁ బ్రీతిగుణవంతులకున్.

క. ఓయాదిపదంబులతుదఁ, బాయని నిడు పొడిపి తగవిభక్తు లునుప ము
న్నే యనువునఁ బుంలింగని, కాయమునకుఁ జెప్పి రట్ల కవివరులోలిన్.

గీ. కడ డుకారమున్న నోడులెల్ల సంబుద్ధి, హ్రస్వమైన దీర్ఘమైన నగును
వీరవరుఁడ సమరశూరుఁడా యనఁగ మా, నినియనంగ మానినీయనంగ.

క. డులు బహువచనంబులయెడఁ, దొలఁగు స్సంబోధనమున దుర్జనులారా
బలిభోజన[3]విధులారా, ఖలులారా మిమ్ము జముఁడు గావఁ డనంగన్.

గీ. బనర యుష్మదస్మదుక్తుల కేకవ,చనబహువచనములు సంభవించు
మెఱియు నీవు నేను మీరు మేమ నెడునా, దేశములు ధరిత్రిఁ దెలియవలయు.

క. నియతుఁడవు నీవు నిన్నును, నియమింతురు శుభము లొలయు నీచే నీకై
జయమగు నీవలన దయో,దయమున సిరి నీకు శుభము దగు నీయందున్.

క. [4]మీ రనఘులు మిముఁ గొలుతురు, నేమమువిూచేత నుతులు చెలువగుమీకై
హేమ మొదవు మీవలనను, శ్రీ మీకలరారి యుల్లసిలు మీయందున్.

క: నేరమ్యుఁడ ననుఁ దలఁతురు, నారులు నాచేత నెగడె నాకై ప్రియమహా
ధారణి నావలనం బెం,పారెను నాకొసఁగుఁ బ్రియము లవి నాయందున్

క. మేమెఱుఁగము మము మఱచి రె,భామలు మాచేత బ్రదుకఁబడి మాకై ము
న్నేమీరు మావలనవల, దా మక్కువసేయ మాకుఁదగ మాయందున్.

## —✻ సమాసప్రకరణము. ✻—

క. మొదలిపదాంతవిభక్తిని, వదలుచుఁ [5]దుదిపదము మొదలివర్ణముతోడం
గదిసిన నదికినశబ్దముఁ, [6]జదువులను సమాస మనఁగఁ జనునండ్రు బుధుల్.

---

1. ట-బైనుండు మొరయుఁబాయు, 2. ట-కూఁతుఁబడసెను గూఁతురుఁగోరె, 3. ట-మతు లారా, 4. ప్రాసభంగము, 5. ట-కడ. 6. ట-జదువ్పదురు సమాసమనుచు శబ్దజ్ఞులిలన్.

వ. అది తత్పురుషంబును గర్మధారయంబును బహువ్రీహియు నన మూఁడు తెలుంగులం బ్రవర్తిల్లు, నంధ్రభాషాప్రయోగంబుల నందుఁ దత్పురుషంబులకు నొక్క తెఱం గెఱింగింతు.

క. రాచిలుక[1]లు ఱరజాజులు, రాచకొడుకు లంపగములు రాయంచలునా
రాచినయట్టిసమాసము, లేచుం దత్పురుష మన ననేకం బగుచున్.

క. వెలిదమ్మి కమ్మఁ[2]దూపులు, వలకే లెడకాలు నీలవర్ణము నవపా
టలరుచులచే సమాసము, లలవడియెం గర్మధారయములు దెనుఁగునన్.

గీ. పూవుఁబోఁడి తలిరుఁబోఁడి పూవిల్తుండు, వాలుఁగంటి వాతవాఁడి మించు
మొలక మచ్చెకంటి [3]ముక్కంటి యనబహు, వ్రీహి పెక్కువిధుల విస్తరిల్లు.

వ. మఱియు వీనికి సాధారణలక్షణంబు లొక కొన్ని యెఱింగింతు.

గీ. గుణిగుణంబు చెప్పఁ గొఱలు విశేషణ, పదముపై నికార మొదవుఁ బాయు
నాతికెల్లనాఁడు నల్లనికనుఁగవ, నల్లకన్నుఁగవయనంగ వరుస.

క. విదితవిశేషపదాంతము, గదిసి పుకారంబు నిలుచుఁ గడహల్లున్నం
బదపడి యచ్చుండినఁ బుటు, లొదవు ముకారంబుఁ ద్రోచి యోలిం గృతులన్.

క. గూఢపుమంత్రంబులు నతి,గాఢపుఁగర్మములు సోయఁగపుటాటలు నా
రూఢపుటాలాపంబులు, ప్రౌఢములగు నీసమాసఘటితులయందున్.

క. ఇలఁ బల్లు మల్లు విల్లును, హలాదులను నదుకుచోట నడఁగును జడ్డల్
పలువరుసయు ములుమోదుగు, విలుకాఁడు ననంగ నెంచు విశ్రుతమగుటన్.

గీ. వెన్ను కన్ను చన్ను నియెడు వీనిజడ్డ, లుమపుటొప్పు సమాసనియోజనములఁ
దనర వెనుగాఁడికనుదోయిచను మొలకలు, నాసమాసంబులొప్పునానావిధముల.

క. ఆదట నా నీ తనయను, చో దుత్వము గలుగు షష్ఠి చూపెడునెడలన్
నాదు కళాసంపదయును, నీదు వివేకంబుఁ దనదు నిపుణతయు ననన్.

క. నా నీ తన యనుపలుకుల,తో నదుకుదు కార మపుడు దొలఁగినఁ దొలఁగుం
బూని సమాసము సంస్కృత,మైనను షష్ఠ్యర్థ హేతువై సత్కృతులన్.

మ. తనసత్యవ్రత కౌశలంబుఁ దన విద్యాతంత్రనిర్మాణముం
దనవిశ్రాణనకీర్తనంబుఁ దనసత్స్తుత్యసంతానముల్
తన తేజోమహిమోదయంబుఁ దనయుద్యత్కీర్తివిస్ఫూర్తియుం
దనరం జేర్చెఁ జళుక్యవిశ్వనృపమందారంబు నా నెల్లెడన్.

---

1. లడవిజాదులు, 2. ట-బువ్వలు, 3. ట-యొలనాఁగ.

క. క్షీరార్ణవకూఁతురు సం,సారార్ణవయోడ శుభ మొసఁగు మీఁకనఁగా
వైరిపదం బగుఁ దెనుఁగున,గూరని సంస్కృతముఁ దెనుఁగుఁగూర్పుటచేతన్.

గీ. అరయ నానీలు వాల్లుతో సమకుచోట,నొనర నుగ్గును నిడుపయియున్ననుండు
గవ్రులయనుమతి నిది కృతిఁ గానవలయుఁ, జాలనర్ణంబుగదిసిన జడ్డయగును.

[1]క. ఆకరి యక్కరి యనఁగా, నాకర మక్కరము నాఁగ నక్కీకసకం
బాకీకసకం బన భా,షాకరము సమానముల కుదాహరణంబుల్.

గీ. సంస్కృతము లయ్యుఁ దెనుఁగులై చాఁగుఁ గొన్ని
శబ్దములు వానిచందంబుఁ జను నెఱుంగఁ
బనసపండును గుండలోపలనసంగఁ, గందదుంపలు నాజీరకజ్జియనఁగ.

క. సుమతి నికారోకారాం,తముపై సంస్కృతపదంబు తగుఁ గూర్పఁగ వేఁ
డిమరీచులు వాఁడిశరం, బమరుమనుష్యుండుఁ బేర్చునశ్వంబనఁగన్.

క. తగుఁగూర్ప నికారాంతం, బగుసంస్కృతపదముమీఁద నచ్చ తెనుఁగున
న్నిగుడారు దంతికొమ్ములు, జగమెఱుఁగు నరాతిపోరు చందంబనఁగన్.

గీ. అత్తమామ నాఁగ నాలుమగం డనఁ, గొడుకు[2]గోడలనఁగఁ గొఱను జేలు
నాఁగ రాత్రిపగలునాఁగ నిట్టి సమాస,ములునుగలుగుఁగవులు దెలియవలయు.

## —* తద్ధితప్రకరణము. *—

క. అరి యిఁడి కాఁ డాఁడరయన, ధరలో నొకకొన్ని చెల్లుఁ దద్ధితపదముల్
పరువడి వాని నెఱుంగుట, పరమపరిజ్ఞానమంధ్రభాషాకవితన్.

సీ. నూఁడరి [3]ముండరి తూఁడరి కల్లరి కాలరి ప్రేలరి కట్టుఁ డనఁగ
నుప్పిఁడి ప్రాయిఁడి చప్పిడి గ్రేసిడి తన్నిడి చిక్కిడి దాతయనఁగ
నీటుకాఁ డెడకాఁడు పోటుకాఁ డుదురులాఁ డించులాఁ డెప్పుడు నీతఁడనఁగఁ
దక్కులాఁ డెక్కువ నిక్కులాఁ డదరులాఁ డెపుడు దురాత్మకుం డీతఁడనఁగఁ
దనరు దబ్బఱ చిందఱందఱయనంగఁ, బరఁగు పలుకులు తద్ధితపదములయ్యుఁ
దెనుఁగునను వీనిచందంబుఁ దెలియుకవుల, నాదృతులఁ జేయురాజనారాయణుండు.

## —* క్రియాప్రకరణము. *—

గీ. అరయవాక్యకదంబోత్తమాంగమునకు, నమితదృష్టులుజగతిఁ గ్రియాపదములు
వాని తెఱఁగులు కవులకు వలయుఁ దెలియఁ,గడఁగి కాలత్రయప్రసంగములవలన.

1. ట-లో నీపద్యములేదు, 2 ట-కూఁతురనఁగ, 3. ట-ముద్దరి.

క. ధరఁ బ్రథమమధ్యమోత్తమ, పురుషాఖ్యలఁ గ్రియలు మూఁడు పొలుచుం గాల
స్ఫురణలును వర్తమానాం, తరభూతభవిష్యదర్థతలఁ ద్రివిధంబుల్.

గీ. ప్రథమపురుషాఖ్య యన్యార్థఫణితిఁ జెప్పు, నగ్రసంస్థితుఁ జెప్పు మధ్యమపురుషము
దగిలి యుత్తమపురుషంబు తన్నుఁ జెప్పు, నేకబహువచనంబుల నెల్లకడల.

గీ. అగుచునున్నకర్తయగు వర్తమానంబు, భూత మనఁగ నయినపూర్వకృతము
కడఁగి యంతమీఁదఁ గానున్నయదియ భ, విష్యదర్థమనఁగ విస్తరిల్లు.

క. ఉచితవిధి విధియు నాశీ, ర్వచనము నను క్రియలు రెండుఁ బ్రథనొక్కటియై
ప్రచురించుం బురుషత్రయ, వచనంబుల వీని తెఱఁగు వలయుం దెలియన్.

క. తెలుఁగు క్రియాపదములకును, దలకొను ధాతువులు జనపదవ్యవహారో
క్తులు కాన వానిఁ బేర్కొన, వలదు ప్రయోగములఁ దెలియవలయుఁ దెలుపుకున్.

వ. ప్రథమపురుషంబునకు వర్తమానార్థంబునందు నేకవచనబహువచనంబులందు
నెడినెదరులును మధ్యమపురుషంబున కెదవెదరులును నుత్తమపురుషంబున
కెదనెదములును గ్రమంబున నాదేశంబులయ్యెఁ దన్నిరూపణంబు లెఱింగింతు.

క. అరిగెడి నరిగెద రనఁగా, నరిగెద వరిగెద రనంగ నధిపతిపురికై
యరిగెద నరిగెద మనఁగా, బరువడి నిది వర్తమానఫణితార్థమగున్.

వ. ప్రథమపురుషంబునకు భూతార్థంబునందు నేకవచనబహువచనంబుల నెన్ని
రులును మధ్యమపురుషంబునకు తివితిరులు నుత్తమపురుషంబునకు తినితిము
లును నాదేశంబులగుఁ దన్నిరూపణంబు లెట్లనిన.

క. చేసెం జేసి రనంగాఁ, [1]జేసితి చేసితిరి మీరు సిరిమా కనఁగాఁ
జేసితిఁ జేసితి మనఁగా, భాసురభూతార్థకథనభజన మ్మయ్యెన్.

వ. ప్రథమపురుషంబునకు భవిష్యదర్థంబునందు నేకవచనబహువచనంబులకు ను
దురులును మధ్యమపురుషంబునకు వుదువురులును నుత్తమపురుషంబునకు దు
నుదుములు వరుసనాదేశంబులయ్యెఁ దన్నిదర్శనం బెట్టిదనిన :—

క. చేయుం జేయుదు రనఁగాఁ, జేయుదు చేయుదురు మీరు చిత్తంబలరం
జేయుదుఁ జేయుదు మనఁగా, నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పున్.

క. మొదలం జెప్పిన యది తుద, యది యాదేశంబు విధికి నవ్వచనములం
బొదలి ప్రథమమధ్యమలకుఁ, దుద నుత్తమపురుషమునకుఁ దొంటట్లయగున్.

---

1. ట-చేసితి వేమాఱు మీరు చేసితిరనఁగా.

క. చేయునది బుధుఁడు ధర్మము, సేయునది బుధులు విశేషసిద్ధక్రియలం
జేయునది నీవు దర్పము, సేయునది తపంబు మీరు శివునకు ననినన్.

గీ. ఉనుదురులకు మీఁద నొగిఁ గాఁతయున్న నా, శీర్వచనమునకును జెల్లునదియు
శివము చేయుఁగాత శివుఁడు శోభనముచే, యుదురుగాత మీకుఁ ద్రిదశులనఁగ.

క. కారయిత సేయుకృతి నల, రారు ణిజంతంబు దాని కాదేశంబుల్
ధారిణి నింపును నించును, సారముగా నేకవచనసరణికి నయ్యెన్.

క. తుదబహువచనమునకు నిం, పుదురును నింతురును నయ్యెఁ బుడమియెడలనిం
చుదురును గలుగుఁ బ్రయోగా, స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్.

సీ. శ్రీవిశ్వభూపతి చేయించుఁ గ్రతువులు సేవింపుదురు తదాశ్రితులు సురలఁ
బండంగ నింద్రుండు పరఁగించు వానలు హాలికులు పరగింతురర్థచయము
నొసఁగించు ధరశ్రీల నేపారు తద్వృత్తి వరభటు లెఱిఁగింపుదురు జయంబు
వెలయించు కీర్తి యవ్విధి నెలయింపుదు రర్థులెల్లెడఁ బ్రతాపాతిశయము
ననెడు పల్కుల చేతణిజర్థములకు, నేకవచనబహువచనపాకమెఱుఁగ
వలయు నవి పెక్కువిధముల వసుధఁ దెలియ, నిఖిలభాషావివేకులై నెగడు కవులు.

క. మహితస్థావరతిర్య, గ్మహిళాదిక్రియల వర్తమానార్థమున
న్విహితమగు నెడుడుకారము, సహజంబుగ నేకవచనసంజ్ఞలచోటన్.

క. పండును భూజము తరువులు, పండెడు రాచిలుక యొప్పఁ బలికెడుఁ జిలుకల్
గండాడెడు సతిపతిపైఁ, బండెడుఁ బెక్కింట సతులు వండెడు ననఁగన్.

క. నిగుడదు భూజము సింగము, బెగడదు విటు వారవనిత పిలువ దనెడుచోఁ
దగుభూతార్థంబున నదు, లగు నాదేశంబు క్రియల నయ్యైయెడలన్.

గీ. ఒవర నింపు నించు ననియెడు వీనిపై, నుటతలొందె నేని నొక్కచోటఁ
బరఁగుఁ *గారకాఖ్యపదములై తెనుఁగున, వాని తెఱఁగులెఱుఁగవలయు బుధులు.

క. కోపింపుట కోపించుట, కాపించుట పసుల నొప్పఁగాయించుట నా
నేపారు నిట్టిపలుకులు, లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగఁదగున్.

గీ. తెలుఁగుఁబలుకులు వునరుక్తిఁ బలుకుచోట, గదిసి రెండవపదమున మొదలివ్రాఁత
దనరు గిత్వంబు ప్రాసంబు దప్పకుండ, వర్ణములు దీర్ఘహ్రస్వప్రవర్తులగుచు.

క. పులిగిలి యనఁ గరిగిరి యన, నలిగిలియన నోడగేడ యనఁగా బరఁగున్
నలులుగిలులనఁగ బలవం, తులు మఱి గిలవంతు లనఁగ మదసరియగుచున్.

---

* కారకమునకుఁ గృతంతమను నభిప్రాయము.

క. స్మరధరచరవరపదములు, పరఁగఁ గ్రియాపదమునొందుపట్టులనెల్ల
స్వరుసరకారములోపలఁ, బొరినిత్యమడంగఁ గాక పొడమినఁ బొడముల్.

క. స్మరియించె సంస్మరించెను, ధరియించె ధరించెఁ బూవుదండఁ జరించెం
జరియించె వల్లభునిసతి, వరియించె వరించె నాఁగ వలనై యునికిన్.

క. ఇది తెనుఁగున కెల్లను జన, పదవిదితం బైన తెఱఁగుపట్టించుకయి
ల్లిదముగఁ జెప్పితి నంతయు, మదినెఱుఁగుం డరసి బుద్ధిమంతు లితరముల్.

మ. లలితన్యోన్యముఖావలోకనము లీలం జేయఁగా లేని యా
విలసత్కావ్యకళాచతుష్టయము లుర్విం బర్వనేకస్థలిం
గలిగించెం బదవాక్య వేదియు నలంకారజ్ఞుఁడున్ భూవరో
జ్జ్వలవిద్యావిభవోన్నతుండు నగువిశ్వక్ష్మావిభుం డిమ్ములన్.

మ. [1]కవివాత్సల్యకళాచరిష్ణుఁడు జగత్కల్యాణవర్ధిష్ణుఁ డు
త్సవసంపుష్టసుపర్వగర్వుఁడు జయశ్లాఘాప్తగంధర్వుఁ డా
ర్జవశీలాదివిశుద్ధవృత్తుఁడు విరాజద్విక్రమాయత్తుఁ డ
చ్ఛవిశాలామలకీర్తిపూరుఁడు సుతేజస్స్ఫారుఁ డెల్లప్పుడున్.

క. శ్రీమచ్ఛళుక్యవిశ్వ, క్ష్మామండలవిభుఁడు సకలసంగ్రామజయ
శ్రీమంతుఁడు సంతతనత, సామంతుఁడు కామినీవసంతుఁడు లీలన్.

[2]తరళ. బిరుదమిత్రుఁడు భిన్నశత్రుఁ డుపేంద్రపుత్రుఁడు యామినీ
శ్వరకులేశుఁడు మానవేశుఁడు వాహినీశుఁడు విక్రమ
స్ఫురణరాముఁడు సూత్నకాముఁడు పూర్ణసోముఁడు కీర్తులం
బరఁగుచుండెడు మాసుధాకరభానుతారకవిశ్రుతిన్.

గద్య. ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయపిరచితం బైనకావ్యాలం
కారచూడామణి యనునలంకారశాస్త్రంబునందు సంధి భాషావిశేష
సంధిసమాసదేశీయప్రయోగక్రియానిరూపణలక్షణ
సముద్దేశంబులంగల నవమోల్లాసము.

---

1. ట-కవిశాశిల్ప, 2. ట-లో లేదు.

## —* లేఖకునివిన్నపము. *—

(ఈపద్యములు—క. ప్రతినివ్రాసిన లేఖకునివి.)

గీ. లక్షణంబులు లక్ష్యము ల్గలుగునవియు,కాని యున్నవి వాడుకోఁగా వటంచు
బెదరు వలవదు లోకంబు భిన్నరుచిక,మనుచుఁజెప్పుట తత్త్వార్థమగునో కాదొ.

క. పునరుక్త యథార్థంబులు, ఘనులొద్దన్ వ్రాఁతవ్రతుల ఘర్షాఘర్షం
గనుఁగొని కవిత్రయమతం, బను గాఁగ లవునని మెచ్చన్

క. ఈకవిత నారికేళపుఁ, బాకము తనబోటికుబుచప్రాజ్ఞుల కెల్లన్
జోకఁగఁ జేయుచు ద్రాక్షా,పాకం బొనరించి మేలుబంతై వెలయున్.

క. చతురతవెలయఁగ నేత,త్కృతిఁ గృతివరులరసిచూచి కీర్తనసేయన్
శితికంఠభక్తివిలస,న్మతి వెణుతురుపల్లి విశ్వనాథుఁడు వ్రాసెన్.

క. ఖలులు తమమార్గములు నే,ర్పులుగా నొకకొన్నిగుదులు గ్రుచ్చినవానిం
దోలఁగించి వ్రాసెనని యు,ర్మిలి మెచ్చం డన్యధాకరింపకుఁ డార్యుల్.

# కృష్ణదేవరాయలనిధనకాలము.

ఇదివఱకుఁ జరిత్రకారు లందఱును కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వఱకు రాజ్యముచేసె ననియు, ౧౫౩౦లోఁ గీర్తిశేషుఁ డయ్యెన నియు వ్రాయుచున్నారు. కాని యిందునుగుఱించిన శాసనాదులను మఱల నెక్కుడు శ్రద్ధతో శోధింపవలయు నని నా తాత్పర్యము. రాయలవారు ౧౫౩౦ లోఁగాక ౧౫౨౫-౨౬ లోఁ గీర్తిశేషుఁ డయ్యెనేమో యని నాకుఁ బ్రబల సంశయము కలుగుచున్నది. ఇందుకుఁ గల హేతువులను గొన్నిటి నిచ్చటఁ జర్చించెదను.

కృష్ణదేవరాయలు శా. శ. ౧౪౪౭ సరి యయిన క్రీ. శ. ౧౫౨౫-వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యె నని చెప్పునట్టి యీ క్రింది చాటుపద్యము తెనుఁగు దేశమందుఁ బరంపరగా వచ్చుచున్నది.

ఉ. బోరన యాచకప్రతతి భూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశకాబ్దము లద్రియుగాబ్ధి సోములం
దారణవత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీరవి వాసరంబున నృసింహునికృష్ణుఁడు చేరె స్వర్గముక్
ద్వారక నున్నకృష్ణుఁ డవతారసమాప్తము నొందుకై వడిన్*.

ఈ చాటువునుబట్టి చూడఁగాఁ గృష్ణరాయఁడు తారణసంవత్సర మగునట్టి శా. శ.† ౧౪౪౭-వ యేఁట జ్యేష్ఠశుద్ధ షష్ఠి ఆదివారమునాఁడు కీర్తిశేషుఁ డయ్యెనని కానవచ్చుచున్నది. దీని కనుకూలముగఁ జెన్నపట్టణమందలి ఓరియెంటల్ లైబ్రరీలో నున్న 'లోకల్ రికార్డ్సు' యొక్క ౧౮-వ సంపుటములోని ౪౦౭-వ పుటలో రామరాజుచే నీయఁబడిన యీకాలు కలదు :—

---

* ఆంధ్రకవులచరిత్రము, ౨-వ భాగము.

† ఇది గతాబ్దము కాదు. జరుగుచున్న సంవత్సరపు సంఖ్య యని నా తాత్పర్యము.

“ చింతరాజుపల్లె పాళెం వెంకటపతిరాయనివద్ద నున్న కాగితపు కౌలుకు నకలు ”—

“ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౮ అగు నేటి వ్యయనామ సంవత్సర వైశాఖశు ౧౫ శ్రీమద్రాజాధిరాజ రాజకంఠీరవ రాజకందర్ప మహారాజాధిరాజపరమేశ్వర రాజప్రతాప మహారాజశ్రీ రామరాజయ్యగారు విజయనగరసింహాసనమున పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను గురుగింజకూట నమలనేని కుమార పెద్దబుచ్చినాయనివారికి వ్రాయించి యిచ్చిన కౌలునిరూపం—మహారాజశ్రీ కృష్ణరాయలయ్యగారికిన్ని తగిగొండ తిమ్మానాయనికుమార రామానాయనికిన్ని విరోధం సంభవించినప్పుడు మీరు వారిలో కలసిరి అని సంశయించి మీకు నడుస్తు వున్న గ్రామాదులు సరిజప్తీ చేయించిరి గనుక కోటకొండ పెద్దవోజుళరాజు విప్పెంటకుమార జంగమరెడ్డి కడప గోపాలబుద్ధారెడ్డి వోగినప్లి పెద్దరెడ్డి వీరబల్లె యరమాచిరెడ్డి గెండికోట బాగ సాని పెద్దమల్లపరెడ్డి యీ మొదలయిన దేశస్థులున్ను మహారాజశ్రీ రాయలవారి ముద్రకర్త వుదయగిరి మలహరిశంకరపంతులు కొమారుడు ఆనందగోపాలపంతులవారు మాతో విన్నపంచేసిరి. గనుక చిత్తగించి మీకు నడుస్తువున్న గ్రామాదులు విప్పెంటలోకి చెల్లె ఆగ్రామాదులున్ను విప్పెంట ౧—పొంకమాళ్ల ౧—విరుపల్లె ౧—సోమనగరం పెద్దవీడు ౧—గెండికోట ౧ చింతరాజుపాళెం ౧—మలసేనిపట్టం ౧, యీ పద్దాలుగు గ్రామములున్ను మొఖా చెన్నూరుపర్గణే శిద్ధవటంతాలూకు యెనభైనాలుగు గ్రామాదులు కావల నిర్ణయం కామ్రగుంటకుల్ ౨ మడకకుగ్ ౨ మగ్గానకిర్ ౨ వర్తకులయిండ్లకుర్ ౨ మడి అనిని—ఆధాన్యం చెన్నూరుతాలూకు ౧౮ గ్రామాదులు శిద్ధవటం తాలూకు వర అనిన్ని గ్రామానకు..............................మడి సూర్యకొమారుని కనమరుసుము చేరి కట్టనరుసుము—దొంగలసానిరుసం—తిరుపతిఖాట రుసం—పరపల్లె ఐంగిమాళ్ల వీటి రుసుములు వొక్కల పెరికెకుర్ ౦౹౦ రసవుగాణకునగకుగ్ ౦౹౦వసాౢలనగకుర్ ౦౹౨ తిరుపతి పరుషకు స్వామికి వెర జనం ౧కి నెబులు ౧ భూసామ్కుర్ ౦ ర = యీ చొప్పున నడిపించుక మాకవులు నమ్మి సుఖానవుడమని వ్రాయించి యిచ్చినకవులు నిరుపం.”

ఈకౌలుబట్టిచూడ శా. శ. ౧౪౪౮ వ్యయనామసంవత్సరము వైశాఖమాసమునందు విజయనగరమున రామరాజు ప్రభుత్వము చేయుచున్నట్టును, అదివఱకే కృష్ణరాయలు కీర్తిశేషుఁడైనట్టును గానవచ్చుచున్నది. ఈకౌలు పై చాటువునకు సహకారిగనే యున్నది.

కృష్ణరాయలు తారణనామసంవత్సరముననే కీర్తిశేషుఁడై యుండవచ్చునను టకు మఱికొన్ని శాసనములు కానవచ్చుచున్నవి.

1. తారణనామసంవత్సర మార్గశిర శు, ౨ నఁటకుఁ గృష్ణరాయనికుమారుఁడైనతిరుమలరాయఁడు రాజ్యము చేయుచున్నట్టొకకన్నడశాసనముకలదు.[1] ఇది ముఖ్యముగఁ జూడఁదగినది గనుక దాని నిచ్చట నిచ్చుచున్నాఁడను.

1. Epi. Carnatica Vol. IX p. 75, District Bangalore, Taluq Magadi. Inscription No. 82.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్ష ౧౪౫౧ నెయ విరోధి సంవత్సరద మార్గశిరశుద్ధ ౫ శని స్వస్తి శ్రీమాన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరగజబలప్రతాప గజపతి అశ్వపతి ఖాడ శ్రీకృష్ణదేవమహారాయరు ఉదరాష్టచంద్ర శ్రీతిరుమలదేవమహారాయరు కాందలు శ్రీమాన్ మహానాయకాచార్య చతుస్సముద్రాధీశ్వర తిమ్మన్న దండనాయకర దేశవలు స్వస్తిశ్రీ అభినవకాంచీనపాక ఉరవన్ నరవరాజ కేసర ఉత్తమసంధి నర్ఘ్యన్న దివసదకె శ్రీకృష్ణదేవమహారాయరిగె గంగోదక సేవితిరప్ప......కోనపనాయకరు, తిరుమల దేవమహారాయరిగు తిమన్న దన్నాయకరిగు స్మర్తవాగబెకు ఎందుమాడయున హల్లిగె త్రితినామద నాయక పురనకోనపనాయకరు వరదరాజదేవరిగె సమర్పిసిదరు తావుమాడిద సేవ అచంద్రార్కస్థాయిగాగి నడయబెకెందు మాడిద సేవె..................."

ఈశాసనము వ్రాయుటకుముందే కృష్ణరాయలు మృతినొందెననియు, ఆతని కుమారుఁడగుతిరుమల రాజ్యము చేయుచుండెననియు మన మూహింపవచ్చును. ఇది మంత్రి యైనసాళ్వ తిమ్మరుసు రాజ్యమందుఁ జేయఁబడినదానము. కృష్ణదేవమహారాయలకుఁ గోనపనాయకుఁడనువాఁడు గంగోదకము సేవింపఁజేసె ననియు నిందుఁ జెప్పఁబడియున్నది. చరమావస్థయందు గొంతులో గంగఁబోయునాచారము హిందూదేశమం దంతటను గలదు. కావునఁ గోనపనాయకుఁడు రాయలచరమదశయం దాతనిసేవ చేసి ధన్యుఁ డయ్యెనని మనము తలంపవచ్చును. పైచాటుపద్యమునందలి మరణతిథియె నిజమైనయెడల ఈశాసనము రాయలమరణానంతరమున ఆఱునెలలలో వేయఁబడినది యగును.

2. శా. శ. ౧౪౫౨-లో నచ్యుతరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు నెల్లూరుమండలమునందు నొకశాసనము కలదు.[1] దాని నిచ్చట వలయునంత భాగముమాత్ర మిచ్చుచున్నాఁడను :—

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శ. ౧౪౫౨ అగునెటి (పార్థివసంవత్సరఫాల్గుణ) శు. ౧౫ బుధవారమున (శ్రీమన్మహామండలేశ్వర.....) అచ్యుతదేవమహారాయలువారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై ఏలుచుండ, వుదయగిరిపట్నంబున శ్రీమన్మహామండలేశ్వర (శ్రీ) రాజు చినతిరుమలరాజులవారి కార్యకర్తలైన తిమ్మరాజులవారి కార్యకర్తలైన తిమ్మరాజు నందయ్యగారు వేదాద్రి శ్రీనరసింహదేవుని దివ్యశ్రీపాదపద్మంబులకు సాష్టాంగదండప్రణామంబులు సమర్పించి యిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లన్నను..................."

ఈశాసనమునుబట్టి చూడ శా. శ. ౧౪౫౨-లో అచ్యుతదేవరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు, అనఁగా కృష్ణరాయలు కీర్తిశేషుఁడైనట్లు కానవచ్చుచున్నది.

---

1. Butterworth and Venugopala Chetty: Nellore Inscriptions, Vol. II, p. 803. Nellore Taluq, Inscription No. 34-A.

3. శా. శ. ౧౪౪౬-లోఁ గృష్ణరాయనికుమారుఁ డైనతిరుమల దేవరాయలు దానము చేసినట్లున్నది[1].

4. శా. శ. ౧౪౫౦ (క్రీ. శ. ౧౫౨౮), ౧౪౫౧ (క్రీ. శ. ౧౫౨౯) సంవత్సరములలో నచ్యుతరాయలశాసనములు కానవచ్చుచున్నవి[2].

వీనినన్నిటిని బట్టి చూడఁగాఁ గృష్ణరాయలు శా. శ. ౧౪౪౬-లోనో ౧౪౪౭-లోనో మృతి నొందినట్లును, అప్పటినుండియు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకు విజయనగరరాజ్యమును ఆక్రమించుకొనవలయునని అతనికుమారుఁ డైనతిరుమలరాయలును, అల్లుఁడైనరామరాయలును, తమ్ముఁడైన అచ్యుతరాయలు ప్రయత్నించుచుండినట్లును [3]ఎవరికి వీలయినప్పుడు వారు శాసనములు వేయించుట, కొల్లిచ్చుట మొదలయిన పనులు చేయుచుండినట్లును, ఈకాలమునందు నెవరి యధికారమును స్థిరపడనట్లును దోఁచుచున్నది.

ఈయూహల కన్నిటికి వ్యతిరేకముగఁ గృష్ణరాయనిశాసనములు పెక్కులు శా. శ. ౧౪౫౨ వఱకును గలవు! కావుననే సువెల్ మొదలయిన తద్జ్ఞులు కృష్ణరాయలు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకును జీవించియుండె నని వ్రాసియున్నారు. కాని వారు, నేను బైని జూపిన కౌలునుగాని, శాసనములనుగాని జర్చించి సమన్వయించుటకు యత్నించియుండలేదు. ఇఁకమీఁదఁ జరిత్ర వ్రాయువారు వీని నన్నిటిని సమన్వయింపవలసియున్నది. వీని నన్నిటిని నొకవిధముగా సమన్వయింప వచ్చునేమో! ౧౪౪౬-లోనే రాయలు మృతినొంది యుండవచ్చును. తరువాత ౧౪౫౨ వఱకును అచ్యుతరామరాజాదులు కలహపడుచు రాజ్యమరాజకముగా నున్నకాలమందుఁ గొందఱు నాయకులు తటస్థులుగ నుండి, వీరివైపుఁ జేరక వారివైపుఁ జేరక యుండవచ్చును. అట్టివారు శాసనాదులు వ్రాయవలసివచ్చినప్పుడు ఆశాసనములలో, నప్పుడు రాజ్యమునకై పోరాడుచున్నవారిలో నెవ్వరిపేరు చేర్చుటకును చెల్లక, అంతకుఁ బూర్వము నిశ్చయముగఁ బ్రభుత్వము చేసిన కృష్ణరాయలపేరే వ్రాయించియుందురు. ఇది యొకయూహ. ఈయూహ ననుసరించి శా. ౧౪౪౬ తరువాతి రాయలశాసనము

---

1. 139 of 1896 Epigraphical Collections.
2. Sewell; Antiquities, Vol. I, pp. 93; 182; 322.
3. Ep. Carn. Vol. IX, Ma. 82.

లన్నియు బహుసూక్ష్మదృష్టితో శోధింపఁబడవలెను. ఆపని యవకాశానుసార ముగ నేను జేయుచునే యున్నాను. కాని యితరులును చేయుదురుగాక.

ఈవ్యాసము వ్రాయుటలో నాయుద్దేశము పైనుదాహరించిన కౌలును వెలిబుచ్చి, దానినిబట్టి రాయలనిధనకాలము నిశ్చయించుటకు వీలుండునేమో యోజింపుఁడని యీవిషయమున శ్రద్ధగలవారిని బురికొల్పుటయే, కాని, యిద మిత్థమని నిశ్చయించుటకుఁ గాదు. పైనుదాహరించిన కౌలు నూత్రేండ్లక్రింద చింతరాజుపల్లె పాళెం వెంకటపతిరాయనియొద్ద నుండెను. ఈగ్రామము దత్త మండలములలోని కడపజిల్లాలోనిది. వెంకటపతిరాయునివంశజు లెవరయిన నున్న యెడల వారు, ఈకౌలు కాగితముయొక్క అసలు తమయొద్ద నున్నయెడల దానికి సరియైన నకలువ్రాసి నాకుఁ బంపుదురుగాక. లేక పత్రికలలో నైనఁ బ్రక టింతురుగాక. ఇంకను నిందున గురించి వారియొద్ద నెట్టికాగితపత్రము లున్నను వెలిపుచ్చి కృష్ణరాయల కాలనిర్ణయమునకును నాకాలమందలి యితరవిషయ ముల నెఱుఁగుటకును గొప్పసాధనములఁ దెలుంగుదేశజులకు నొసంగి వారికృత జ్ఞతకుఁ బాత్రు లగుదురుగాక. చరిత్రవిషయమై శ్రద్ధగల దత్తమండలములలోని శోధకులు కొందఱిందునుగుఱించి శ్రద్ధ వహించి, నూతనము లైనకాగితపత్ర ములను గనుఁగొనుటకు యత్నించెదరని నమ్ముచున్నాను.

శాసనములను శోధించెడువా రందఱును గృష్ణరాయనిశాసనములు శా. శ. ౧౪౫౧ తరువాతివి శోధించునపుడు నేను రాయలనిధనకాలమును గుఱించి పైని వ్రాసినవిషయములను జ్ఞాపక ముంచుకొందు రని నమ్ము చున్నాఁడను.

కే. వి. లక్ష్మణరావు.

శ్రీరస్తు.

# జక్కనవిక్రమార్కచరిత్ర విషయానుక్రమణిక

## ప్రవేశకము.

అనుక్రమణికలార్యులకు నూతనములు గావు. వేదాదిపూర్వగ్రంథముల కనుక్రమణిక లున్నవిషయ మెల్ల రెఱింగినదియే.

నేను గాలేజిలోఁ జదువుచుండినపుడు మాయుపాధ్యాయు లొక్కరు "జ్ఞాన మనఁగా నేమి" యనుప్రశ్నమునకు "గ్రంథములు నిండుగా నుండు నిక్కాలమున నేయేవిషయము లెచ్చటెచ్చట నుండునో దాని నెఱుఁగుటయే జ్ఞాన" మని బదులు చెప్పుచుండెడివారు. దేశచరిత్రవిషయమును బూర్వనాగరకతాద్యంశములను గ్రంథములనుండి తెలిసికొనఁ బ్రయత్నించు ప్రతిజ్ఞానోత్సాహియు నీయనుక్రమణిక లనేకముఖ్యగ్రంథములకు లేవే యని చింతింపవలసియున్నది. కావున నేపూర్వగ్రంథమునకైనను ననుక్రమణిక వ్రాసినవారు చదువరుల మెప్పును విశేషముగఁ గోరవలసినపని లేదు.

ఆంధ్రకావ్యములలోఁ జారిత్రికగ్రంథములు పెక్కులు లేవు. ప్రతికావ్యమును గొంతవఱకుఁ గవియొక్కచరిత్రమును గృతిభర్తయొక్కచరిత్రమును గొన్నిసందర్భములలో స్పష్టీకరించును. మఱికొన్నిసందర్భములలో సూచించును. ఈసూచనలవలన నెంతెంత యెఱుఁగనగునో దాని నంతను శ్రీయుతులు రావుబహదరు వీరేశలింగము పంతులుగారు, గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు, మదరాసు శాసనాధికారు లగురావుసాహెబ్ కృష్ణశాస్త్రిలుగారు, జయంతి రామయ్యపంతులుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారును నింక నితరమహాశయులును వెలిదీసి తమతమవ్యాసములలోను గ్రంథములలోను గ్రోడీకరించి విమర్శించి యుపయోగించుచున్నారు. అట్లుండ నిపు డీయనుక్రమణిక వ్రాయుటలో నాముఖ్యోద్దేశ మెద్దియన "భారతవర్షచరిత్రములోఁ బున్నమనాఁటిరాత్రి యాకసమునఁ బూర్ణచంద్రుఁడువలె రాజిల్లు మహాశూరుఁడును, మహాతేజస్వియు, సుజ్ఞానమూర్తియు,ననుపమౌదా

ర్యాది సకలసద్గుణశాలియు, నగువిక్రమార్కునిగూర్చి డాదాపుగా నైదువం దలయేడ్ల క్రిందట వెలసిన జక్కనమహాకవి యేయేకథల విని, చదివి నమ్మియుండె నదియు, నాతనికాలపు దేశస్థితివిషయమై యాకవియొక్క యభిప్రాయములును, నప్పటి నాగరికతనుగూర్చి యాతఁ డేమిచెప్పఁ గలిగినదియు నెఱుంగుటయే.

కథలను బుక్కిటిపురాణ మని, చరిత్రమునకుఁ బనికిరా వని త్రోసివే యుట పాశ్చాత్యవిమర్శకులయొక్కయుఁ జారిత్రికాన్వేషకులయొక్కయు నుపా ధ్యాయతవలన మనలోఁ గొందఱకుఁ జాల నలవడియున్నది. వాస్తవమే. కాలము జరుగు కొలఁదిని గథలు పెరూపతఁ జెందును. సత్య మసత్య మగును. అయినను మఱి వేఱాధారములును సూచనములును లేని సందర్భములలోఁ గథలను వివే కముతో విమర్శించి యందలిసత్యమును గ్రహించుట న్యాయ్యము నుపయో గము నగునది. శాసనములు దొరక లేదనుకారణమున నమ్మనలదని నిశ్చయించి కొనినచోఁ బ్రతిదేశముయొక్కచరిత్రమందును మిగుల నుత్తమమై శూరభాస్వర మైనభాగము తుంగలలోఁ ద్రొక్కవలసినదిగఁ గానఁబడును. ఇది యెట్లుగాడ లెక్క లేనికథలును, బారము లేనిభక్తిగౌరవములును, రూపముఁ దాల్చి జీవించి యశముఁబొందని స్వప్నదృష్టపురుషులగుఱించి పుట్టుననుట యుక్తిసహము గాదు. వారివిషయమున మనము కాలనిర్ణయము చేయలేకుండుటకుఁ గారణము సామగ్రీ సంపత్తి లేకయుండుటయే కాని వారు పూర్వము లేకుండుట కాదు. కావునఁ దిథి వారనక్షత్రయుక్తకాలముతో దొరకకున్నను గాలము నపారప్రాముఖ్యమువలనను దైర్ఘ్యమువలనను దెలియకపోయినను గావ్యవిదితులైనట్టియుఁ గథాగతులై నట్టియు మహాపురుషులయొక్కయు నట్టివారి మహాకార్యములయొక్కయు విష యముల నిరసింపఁజాలము. ఈకారణమునఁ జరిత్రకారులు వీని నుపేక్షించినను వానిస్మరణమున మగ్నమైనట్టిలోకము త్రోసివేయఁబోదు. ఐతిహ్యమును వివేక ముతో విమర్శించి యెంతవఱ కంగీకరింపవచ్చునో యంతవఱ కంగీకరించి సం దర్భసమర్థనము చేసి వ్రాసిననే చరిత్ర సత్యమైనదియు నుపయోగకారియును నగును. పురుషులఁ గూర్చియే కాక యాదర్శములఁ గుఱించియు, నాచారములఁ గూర్చియు, సంఘస్థితింగూర్చియుఁ జరిత్రకారులు వ్రాయఁ బ్రయత్నింపవలయును. భగవత్స్వరూపు లగు శ్రీవివేకానందులు "భగవద్గీత నెవరు రచించిన నేమి? ఎప్పుడు రచించిన నేమి? మహోన్నత మగుతత్త్వ మం దిమిడి యున్నది. దాని నుపయోగించికొందము. విలువ లేనిలాభము నొందుదము" అని యొకకాల

వాదికి బదులు చెప్పిరి, అట్లే మహాపురుషు లేదినమున జనించియుండిన నేమి ? యే దినమున మృతినొందిన నేమి ? సంఘము కాలమువలె నిష్పారమై గంగవలె నిరంతరమై ప్రవహించుచుండ దానిచరిత్రమును, దానిఁ జెందియుండిన భక్తిశ్రద్ధలును, స్మరణాచారములును, నిదర్శనములు గాని వారికాలములు తిథివారనక్షత్రములతో దొరకుట కాని దొరకకుంటగాని నిదర్శనములుగాని, స్థాపకములుగాని కావు.

చారిత్రికులారా ! భగవద్గీత యెట్లు లోకసంగ్రహము నుద్దేశించి శ్రీకృష్ణునివలన ఘోషింపఁబడినదో యట్లే మనచరిత్రములును సంఘసంగ్రహము నుద్దేశించి వ్రాయఁబడవలయును. అట్లు వ్రాయుటలోఁ బాల వివేకవంతులయి నిష్పక్షపాతముగ విమర్శించి ముందు వెనుక లాలోచించి వ్రాయవలయును ? ఇట్టి ప్రయత్నముల కనుక్రమణిక లత్యావశ్యకములు.

సి. ఆర్. కృష్ణమాచార్యులు.

(అకారాద్యనుక్రమణిక ముందుపత్రికలలో వెలువడును — ప. అ.)

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

ప్రసిద్ధులగు ఆళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె భిన్న. ౫ ఆశ్వాసములు. ౨౮ పుటలు. సవిమర్శమైన ౧౮ పుటలపీఠిక. వెల రు. ౧-౮-౦.

## (2) జైమిని భారతము (ఆంధ్రవచనము.)

రెండువందల సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగువిజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుండు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయకునిచే రచింపఁబడినది. భాష సలక్షణము. శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౦-౧౪-౦.

1917-18 సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము

## (3) కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవి విరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదము లచ్చటచ్చటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రు. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఎ., బి.ఎల్. గారిచేరచింపఁబడిన సవిమర్శపీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౦-౪-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టీ. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Guru. 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల రు. ౦-౩-౦.

# చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవిప్రణీతము.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము కార్వేటినగరసంస్థానమునం దుద్భవిల్లినది. ఇంతవఱ కిట్టి భాషాంతరగ్రంథము భోజచంపువునకు లేదు, కావుననే యన్నివిధముల ముఖ్యమైనది. కవితాచమత్కృతులెల్ల నీగ్రంథమందే కాననగును. ఎనిమిది యాశ్వాసములు. 148 పుటలు రాయలుసైజు, 16 పుటల పీఠిక. ఇంగ్లీషు క్యాలికో బైండు. ముద్రింపఁబడినవి స్వల్పప్రతులు అయినను వెల రు. 1 0-0 మాత్రమే భాషాభిమానులు శీఘ్రముగా నొక్కొక్కప్రతిని తెప్పించుకొనుట మంచిది

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 2/7 వాలస రోడ్డు, పుదుపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రకటింపఁబడియెను.

# విషయసూచిక.

శ్రీరస్తు.

# సర్వేశ్వరశతకము.

*(ఈమూలపాఠము ప్రథమప్రతిలోనిది. రెండుమూఁడు ప్రతులలోని పాఠభేదములు క్రిందఁ జూపఁబడుచున్నవి.)

శా. [1]శ్రీకంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీపాదదివ్యప్రభా
నీకోత్సారితదేవతానిటలదుర్నిత్యక్షరధ్వాంతుఁ జి
త్ప్రాకామ్యాంగు నపాంగమాత్రరచితబ్రహ్మాండసంఘాతుఁ జం
ద్రాకల్పుం బ్రణుతింతు నిన్ను మది [2]నాహ్లాదింతు సర్వేశ్వరా. 1

మ. ఒకమాటీసకలంబు నీమహిమగా [3]నూహించుచు న్వేండి యొ
క్కొకమాఱెద్దియు నీవు గా వనుచు నే యుక్తిం [4]బ్రశంసింప నే
రక వేదంబులు చిక్కువడ్డవనినం బ్రవ్యక్తమై [5]యుండు భా
వకుఁడై నీనిజ [6]మిట్టిదట్టిదన నెవ్వం డోపు సర్వేశ్వరా. 2

శా. జ్ఞానాతీతుఁడవై ననీమహిమఁ బ్రజ్ఞం బూని తర్కించు ట
జ్ఞానాంగం బగు నైననుం దమయథాశక్తిం బ్రశంసించి ది
వ్యానందస్థితిఁ బొందువారిఁ గని భక్త్యావృత్తి నిన్నెట్టివాఁ
డైనం బ్రస్తుతిసేయుచుండుఁ దనచేనైనంత సర్వేశ్వరా. 3

మ. అమితాంభోజభవాండభాండనిలయం బై యుండు నీయంతరం
గము పట్టెంతయొ దాని కింక బహిరంగం బెట్టిదో సూక్ష్మత
త్త్వము దానంతకు మీఁద నేమివిధమో[7]తా నిట్టిదీ పెంపు మా
ర్గము నీకై [8]నచింత్యమె ట్లొరుఁ డెఱుంగంజాలు సర్వేశ్వరా. 4

---

* ప్రథమప్రతి గురజాల దుర్గరాజు శేషగిరిరావుగా రిచ్చినది. ‡రెండవప్రతి కాశిలోనున్న కొవ్వలి జగన్నాథముగారు పంపినది. మూఁడవది యచ్చుప్రతి.

1. రెండవప్రతిలోఁ నీపద్యమునకుమీఁద

ఉ. చిత్తము ప్రాణ మాయువును జేర్చి త్రికూటపుదారిఁ దూఱుచు
న్మత్తిలియున్న కుండలిని మట్టుగదల్చి పెగల్చినంతట
త్యుత్తమ మండలత్రయము లొందును నిత్యము వెల్గు మేల్ బళీ
హత్తి నిషిద్ధలింగగురుఁ డంచు భజించినుతించి కొల్చెదన్. అనుపద్యమొక్కటిగలదు.

2. నాహ్లాదించి. 3. నూహించి వర్ణించి వే ఱొకమాఱెంతయు. 4. ప్రవర్తింప. 5. యుందు, 6. తత్త్వమిట్టిదన. 7. తర్కింపనీ పెంపుమా. 8. నశక్య.

మ. ఇన విఘ్నేశ్వరమాతృకాద్రుహిణ బ్రాహ్మీస్కంద దుర్గారమా
వనితాధీశ్వర భైరవుల్ బలసి భాస్వద్భక్తిసంయుక్తి నీ
కనిశంబుం బరివారభృత్యనికరంబై [1]యున్న నిన్నింకఁ గొ
ల్వనివా రెవ్వ రజాండభాండములలో వర్ణింప సర్వేశ్వరా. 5

శా. ఏపారంగ నజాండభాండనికరం బేరూపులోఁ బుట్టియు
ద్దీపించు న్మఱి రూపులెల్ల సమసుప్తిం బొంది యేరూపులో
[2]లోపింపం గలయంగ నంతటికిఁ దా లోనై విజృంభించి యే
రూపం బవ్యయమై వెలుంగు నది నీరూపంబు సర్వేశ్వరా. 6

మ. జలజాతప్రభవాండబుద్బుదము లశ్రాంతంబునుం బుట్టుచుం
గలయం బ్రాఁగుచునుండు నీపృథులలింగస్ఫారగర్భాబ్ధిలో
పలఁ దద్బుద్బుదగర్భవాసులు [3]హరిబ్రహ్మాదిదేవాలియుం
గలదే వారికి నీమహత్త్వ మెఱుఁగంగాశక్తి సర్వేశ్వరా. 7

మ. భవదున్మేషవిజృంభణంబు [4]వివరింపంగా సరోజాతసం
భవుజన్మంబు భవన్నిమేష మమితబ్రహ్మాండకల్పాంతభై
రవసంక్షోభిత మన్నఁ దక్కిన భవత్ప్రారంభభూరిక్రియా
నివహం బెవ్వరు నేర్తు రిట్టి దని వర్ణింపంగ సర్వేశ్వరా. 8

మ. పవనుండై హిమధాముఁడై యనలుఁడై పానీయమై యాత్మయై
రవియై యంబరమై మహీవలయమై రమ్యాష్టమూర్తిక్రియన్
భువనాండంబులు రక్షణాంగములుగాఁ బుట్టించు నత్యద్భుతో
త్సవలీలావిభవంబు[5]తోడ భవదాజ్ఞాశక్తి సర్వేశ్వరా. 9

మ జలజాతప్రభవాండభాండములు దుశ్చారిత్రులం బాత్రులం
జెలువై యుండ యథాప్రమాణములుగా శిక్షింప రక్షింప ని
శ్చలలీలం బ్రభవించు రాజు భవదాజ్ఞాశక్తిఁగా కింతవ
ట్టెలమిం జేకొని నిర్వహింప మఱి గాఁ డెవ్వండు సర్వేశ్వరా. 10

శా. జ్ఞానజ్యోతి విజృంభమాణముగ నోజన్ విష్ణుదేవాది దే
వానీకాత్మదశావలిం దవిలి [6]నీ వారంగ వారింగథా

---

1. భైరన్న. 2. లోపించుం. 3. హరిబ్రహ్మాదులందేమియుం. 4. ప్రకటింపంగా
5. తోఁప. 6. నీవారంగ వారించుచున్.

జ్ఞానప్రౌఢులఁ జేయుటల్ వెలయఁగా సర్వజ్ఞశబ్దంబు దా
నీనామాంకముగా [1]విధించె నిగమానీకంబు సర్వేశ్వరా. 11

మ. సురల న్మర్త్యసమంబుగా మనుజులన్ శోభిల్ల బృందారకో
త్కరముంగా ఘను నల్పు నల్పుని ఘనుంగాఁ బుణ్యపాపాలిచేఁ
దిరుగన్ద్రిప్పుచు నీమహామహిమ ప్రీతిం బద్మజాండంబులం
దరయన్ జీవుల నింద్రజాలములుగా నాడించు సర్వేశ్వరా. 12

మ. ఘనుఁడై యేచి దశాననుండు బలిమిం గైలాసశైలేంద్ర మె
త్తిన సద్దానవనాథుఁ ద్రొక్క నతఁ డర్థి న్మ్రొక్కినం గాచి [2]ప్రా
క్తనశౌర్యాధికుఁ జేసె దుష్టు నణఁపం[3]గా శిష్టు రక్షింప రం
జనతో నెప్పుడు[4]వేచియుండు భవదాజ్ఞాశక్తి సర్వేశ్వరా. 13

మ. తమకం బెత్తిన నాత్మజం గను మదాంధవ్యాప్తి నేకాంతప
క్షమునం దెవ్వరుఁ గానకుండఁ గవయంగాఁ బోయి నీబాణపా[5]
తమునం బద్మభవుండు ద్రెళ్లె ననినం దాఁ దప్పివర్తింప లో
కమునం దెవ్వరి కింక నిన్ను[6]నెఱుఁగంగా వచ్చు సర్వేశ్వరా. 14

మ. పలుజన్మంబులఁ గూడఁబడ్డ భవకుంభద్ఘోరదుష్కర్మరా
సులు పైఁగూలి సమస్తజీవులు వెసన్[7] శోకించుచు న్బద్ధదు
ర్బలులై చిక్కినఁ దద్భవాపహరణార్థంబొప్పఁ బద్మోద్భవ
ప్రళయం బొక్కొకమాటు సేయుదు [8]తుదిన్ భావింప సర్వేశ్వరా. 15

మ. సుమహాత్పద్మభవాండపంక్తుల లయక్షోభప్రతాపంబుతో
నిమిషార్థంబునఁ[9]గ్రాఁచి పెంపెసఁగు నీనేత్రానలజ్యోతి క
య్యమమీనాంకజలంధరత్రిపురదైత్యాలి[10]న్విజృంభించి భ
స్మముగాఁ జేయుట నిశ్చయింప నిదిదా శౌర్యంబె సర్వేశ్వరా. 16

మ. అతిదక్షుం డగుదక్షుఁ డీజగములో యాగంబు సల్లక్షణ
స్థితిగాఁ జేయుచునుండి మిమ్ము మదినుద్దేశింపమిం జేసి తా
హతుఁ డయ్యెం దుది[11]నెట్టికార్యములుఁ బొందై యుండునే కర్తస
స్మృతితోఁ జేయని దుర్మదుండు మనునే భావింప సర్వేశ్వరా. 17

---

1. విధించు. 2 ప్రార్థన. 3. దాస్పష్టిరక్షింప. 4. నేర్చియుండు. 5. ఘాతము(అ). 6. మొఱఁగంగా. 7. మహాశోకించు, శోషించు(అ). 8. మదిన్. 9. గాల్చి (అ). 10. న్విగుర్వించి. 11. నట్లకార్యములు పొల్లైయుండవే కర్తృసుస్మృతిగా.

మ. జగతీచక్రము పాదఘట్టన నదృశ్యంబై ప్రవర్తింపఁగా
గగనం బంతయు బాహుమండల సమగ్రవ్యాప్తులం దప్పఁబతఁ
బుగఘూర్ణిల్ల నజాంత్యవేళల సముద్భూతాంగహారావళుల్
నెగడం బొంగి నటింతు తాండవమహానృత్యంబు సర్వేశ్వరా. 18

మ. [1]అమరేంద్రాబ్జభవాళి కెన్నఁ దుది నీవాదిం బ్రసాదించి స
ర్గము సిద్ధించుచు నుండుఁగాని సురమాత్రుంగోరిననీవ్వారికా
ర్యము సిద్ధింప దనేకమార్గములఁ బ్రారంభించిరే నిశ్చయా
ర్థముగా నీవ సమస్తకర్త వగుటం దరిఁ౯ంప సర్వేశ్వరా. 19

మ. అమరంగా స్ఫుటభక్తినాటకము భావాంగక్రియాంగాభిర
మ్యముగాఁ జూపినమెచ్చి[2]మీరలు పురేయన్నంతకున్ యోనిగే
హములన్ రూపులు వన్నుకొంచును నటుండై వచ్చి సంసారరం
గములోనం బహురూపమాడు వెలయంగా జీవి సర్వేశ్వరా. 20

శా. శ్రీవత్సాంకు రమావిశేషతయు వాక్ఛ్రీనాథుచాతుర్యముల్
దేవాధీశ్వరు[3]వైభవాతిశయముం దిగ్మాంశు తేజంబు శ్రీ
దేవీనందనురూపవిభ్రమము చింతింపంగ నీభక్తిస
ద్భావాత్మం డగుపుణ్యమూర్తికిఁ దృణప్రాయంబు సర్వేశ్వరా. 21

మ. ఇల సద్భక్తులపాదధూళిపటలం బేమర్త్యఫాలంబునం
[4]జిలికె న్వాఁ డపవర్గనాథుఁ డనిరున్ సిద్ధంబుగా వానిని
ర్మలహస్తార్పితభూతిఁ బ్రీతి నొసలారంబూయు విశ్వాసికిన్
ఫలమూహించి [5]విధింప నెవ్వరికిఁ జెప్పనవచ్చు సర్వేశ్వరా. 22

మ. పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రిపానీయముల్
తలమీఁదం [6]జిలికించుకోఁ దగును దీర్ఘంబాడ భారంబు త
త్ఫల మత్యల్పము భక్తపాదయుగళాంభస్స్పర్శ నిర్భారనై
యలరున్ శాశ్వతభుక్తి ముక్తి ఫలదంబై యుండు సర్వేశ్వరా. 23

---

1. అమరేంద్రాబ్జభవాలికైన మదినీవారం బ్రసాదింప స
ర్గము సిద్ధించుచునుండు దానుచితమాత్మంగోరి నీవీని కా
ర్యము సిద్ధింప.

2. నీవిలబతే. 3. వైభవోన్నతిశయిం (అ). 4. చిలుకన్. 5. విధించిరొ. 6. జిలికించు
కొన్న శుచి.

మ. రమణిం భక్తసమగ్రదర్శనము తీర్థశ్రేణి, తద్గోష్ఠి తీ
ర్థము, తద్దివ్యదయావలోకనము తీర్థం బెన్నఁగా నిట్టిజం
గమతీర్థాంబుధి నోలలాడక వివేకభ్రష్టులై పోయి లో
కమునం దీర్థములంచు నేఱులు సొఱంగా నేల సర్వేశ్వరా. 24

మ. కమనీయం బగుసర్వతీర్థములు లింగం బున్నచో మూర్తిమం
తములై యొప్పుచునుండు [1]లింగమును దాత్పర్యంబుగా భక్తగా
త్రములం దెప్పుడు నుండుఁగాన మహిలోఁ దత్త్వార్థమూహింపఁ దీ
ర్థములం దెల్లను దివ్యతీర్థము భవద్భక్తుండు సర్వేశ్వరా. 25

మ. ధరణిం దీర్థము లాడుకంటె ముదమంద న్సర్వయజ్ఞంబులం
బరఁగం జేయుటకంటె సువ్రతము లొప్పం వేదశాస్త్రోక్తత
త్పరుఁడై యాదటఁ జల్పుకంటె మది నుత్సాహించి నీభక్తిమ
త్పురుషశ్రేష్ఠులఁ బూజసేయుట మహాపుణ్యంబు సర్వేశ్వరా. 26

మ. భవదీయామలతత్త్వనిర్ణయకళాప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠీ సుఖవార్ధిలోనఁ గడు వేడ్కం దేలినంగాక యీ
భువినేతీర్థజలంబులం గడిగినం బోనేర్చునే ఘోరదు
ర్భవ[2]సంఘాతదురాత్మతామసమహాపంకంబు సర్వేశ్వరా. 27

మ. ధరణిం బ్రాక్తనభక్తనిర్మితమహాస్థానంబులై యొప్పు శ్రీ
గిరిముఖ్యం బగు దివ్యతీర్థములు భక్తింజూచిరే వారిదు
స్తరదోషంబులు వాయునన్న మఱిసాక్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగఁ బాయదే నరులపాపంబెల్ల సర్వేశ్వరా. 28

మ. కని సద్భక్తుల కంతనంతఁ గడు వేడ్కం హృత్ప్రణామంబు సే
సినమాత్రం జెడు సర్వదోషములు [3]తచ్ఛ్రీపాదముల్మట్టి మ్రొ
క్కిన సర్వాంగసమగ్రశుద్ధియగు భక్తిం వారికిం బ్రీతిచే
సినఁ దద్దివ్యదయావలోకనఘనశ్రీఁ బొందు సర్వేశ్వరా. 29

---

1. లింగమునఁ దాత్పర్యంబుగా భక్తగాత్రమునందెప్పుడునుండు, అని ప్రథమప్రతిలోని పాఠము. ఈ 25-వ పద్యమునకుమీఁద రెండవప్రతిలో "భక్తిమాహాత్మ్య" మను శీర్షిక కలదు. 2. సంఘా(గా)కలితాత్మతామస. 3. ఇది మొదలు ప్రథమపుస్తకములోఁ బద్యము కడవఱకు లేదు. దీనికి మాఱు పైపద్యములోని "భక్తింజూచిరేవారి" యిత్యాది పూరింపఁబడినది.

మ. జలజాతప్రభవాచ్యుతాదులు [1]మదిం జర్చించి చర్చించి నీ
కలరూపారయలేక చిక్కులఁ బడంగా నిన్నుహస్తార్పితా
మలకవ్యాప్తికిఁ దెచ్చి యేర్పఱిచి సంబంధించి చేకొన్నభ
క్తులశౌర్యం బుపమింప నెవ్వఁడు సమర్థుం డింక సర్వేశ్వరా. 30

మ. అమరన్ భక్తగణాత్మమధ్యమము లింగావాస మాలింగమ
ధ్యము పద్మప్రభవాండభాండనిలయం బై యుండుటన్ భక్తత్మ
ప్తి మహాలింగము తృప్తియై మహిమ నుద్దీపించుఁ దల్లింగతృ
ప్తిమహత్త్వంబున నీసమస్తమును దృప్తింజెందు సర్వేశ్వరా. 31

మ. [2]అనురాగంబున నిన్నుఁజూచుఁ దలపోయుం జొక్కుఁ గాంక్షించు వ
ర్ణనసేయుం దమకించు సిగ్గు విరియుం బ్రార్థించు శోషించు నం
తను నీధ్యానముదాల్చుఁ దన్ను మఱచుం దానీదశావస్థలం
దనరంగా మది నిన్ను డక్కఁగొను సద్భక్తుండు సర్వేశ్వరా. 32

మ. ఎలమిన్ భక్తుఁడు వక్రుఁడై నడిచెనే నేపారఁగా దానికిం
గలుషింపం గలహింపఁ గింకిరిపడంగా దెట్టిచో నైనని
ర్మలగంగాపృథులప్రవాహామరయం [3]బ్రస్ఫూర్తిమై నెన్నివం
కలుగాఁ బాఱిన దాని నొండు పలుకంగాఁ జన్నె సర్వేశ్వరా. 33

మ. సికతాధామము నీకుఁ జేసి తమలోఁ జెన్నొంది క్రీడించు బా
లకులిం ద్రాధికు లన్న నీగుడు లతిశ్లాఘ్యేష్టకాష్ఠాదుల
సుకుమారంబుగ నెత్తి భూతలములో శోభిల్లువంశప్రదీ
పకు సౌభాగ్యముమాన మెవ్వరికిఁ జెప్పన్వచ్చు సర్వేశ్వరా. 34

మ. భవదభ్యర్చనవేళలన్ భవుల సంపద్భ్రాంతులఁ దీనమా
నవులన్ విద్విషులన్ [4]భవాతురుల సన్మానించుటల్ సౌఖ్యము
ఖ్యవిహారేచ్ఛలు నీమహత్త్వములు నిత్యానంద మూహించుచో
భువినీభక్తుల కాత్మలోనవరసంబు ల్వుట్టు సర్వేశ్వరా. 35

మ. కరుణం జేకొని రేని [5]శారవపదగ్రస్తాత్ము దేవేంద్రుఁగాఁ
బరఁగంజేయుదు రాత్మలోనలిగిరేఁ బర్జన్యునే రౌరవో

---

1. మొగిం (అ). 2. ఈ 32వ పద్యమునకు రెండవప్రతిలో "దశావస్థలు" అను శీర్షిక కలదు. 3. బ్రస్ఫూర్తితో నెన్నివంకలు. 4. భవాతురుల సన్మానించుటల్ సంఘసౌఖ్యవిహారేచ్ఛలు నీ మహామహిమ. 5. నున్నద (అ).

త్కరపంకప్రవిలీనకీటకముఁగాఁ గల్పింతు రన్నట్టిచో
హర! నీభక్తులశక్తి యెట్లు గుణిసేయన్వచ్చు సర్వేశ్వరా. 36

మ. రమణీయక్షితిపాలుఁ [1]డింద్రునిచతుర్గ్రాసక్రమాయుష్యుఁ డా
యమరేంద్రుం డజునాడికాద్వయమువాఁ[2]డా బ్రహ్మ విష్ణున్నిమే
షమువాఁ డంచును వీరి నెల్ల నగు నీసాలోక్యసామీప్యస
త్తమరాజ్యస్థితిపట్టభద్రుఁ డగుసద్భక్తుండు సర్వేశ్వరా. 37

మ. [3]ప్రకటింపంగ సమస్తపాతకములం బాపంగ నీపూజయం
దొకపుష్పాంశము చాలు నన్న మహిలో నూహింపఁగా నీపదా
ర్చకు లేమార్గమునందు శుద్ధులు మదిం జర్చించి తద్దుర్గుణ
ప్రకరం బెన్నెడివాఁడు లోకములలోఁ బాపిష్ఠి సర్వేశ్వరా, 38

మ. తమ తేజంబుఁ దృణీకరించుచు సముద్యత్తేజులై మీఁదిలో
కములం దెల్లఁ జరించు నీయచలభక్తశ్రేణులం జూచి నె
య్యమునం దారును దద్విధంబునను మిమ్మర్చింపనూహించిమ
ర్త్యమునం బుట్టఁగ వాంఛసేయుదు రమర్త్యశ్రేణి సర్వేశ్వరా. 39

మ. అమరన్ భక్తులకెల్ల నీవ హృదయంబై యుండుట న్వారి సౌ
ఖ్యము నీసౌఖ్యము వారికూర్మియు సమగ్రం బై ననీకూర్మి త
త్త్వము భావింపఁగ వారికోపము భవత్ప్రఖ్యాతరౌద్రప్రభా
వము దా వారలవాక్యనిర్ణయము నీవాక్యంబు సర్వేశ్వరా. 40

మ. అవనిం బెన్నిధి భాగ్యహీనునకుఁ బ్రత్యక్షంబు[4]గా కప్పు డొం
డవ భాండాకృతిఁ దాల్చి మాటువడి మాయావృత్తి నున్నట్లు కా
భవదీయప్రతిబింబమూర్తి యగు సద్భక్తుండు సంసారదు
ర్వ్యవయసాయాత్ముల కెల్లఁ గేవలనరుండై తోఁచు సర్వేశ్వరా. 41

మ. క్షితిపై శ్వేతమునీంద్రుఁ జంపనలుకం గీనాశుఁ డేతెంచి నీ
యతికోపోజ్జ్వలనాహుతి న్బడిసెఁ దథ్యం బేకనిష్ఠానమ
న్వితులం జేకొని భక్తవత్సలుఁడవై నీ వెప్పుడు న్గావఁగాఁ
బ్రతిపక్షావలి కెట్లు వారిదెసఁ జేరన్వచ్చు సర్వేశ్వరా. 42

---

1. రింద్రునిచతుర్గ్రాసక్రమాయుష్యులా. 2. డా బ్రహ్మాయుష్మన్నిమే. 3. ఈపద్యము నకుఁ బూజామాహాత్మ్య మని రెండుప్రతులలోఁ బేరుకలదు 4, గాకుంట దొంతర.

శా. కింకం దన్నునదల్చి చక్రమునఁ దాఁగృష్ణుం డని న్సైచినం
బొంకం బొప్పఁగ దానిఁ [1]దుత్తుఱుముగాఁ జోఁదట్టి యుప్పొంగె ని
శ్శంకాత్ముండు దధీచి శాశ్వతులు నీసద్భక్తు లూహింపఁగా
సంకల్పప్రభవప్రతాపవనభాస్వద్దావ సర్వేశ్వరా. 43

శా. ఘటదుగ్ధంబులు వేఱుగాక వెలయంగా నొతతోఁడంటిన
న్నటదుగ్ధాంబుధి వేసనే జగములో నల్పుండు మున్నంగతిం
జటులాత్ముం డగుఁగాక యెయ్యెడల నీ సద్భక్తుఁ డేకార్యము
త్కటమై తాఁకిన నన్యచిత్తుఁ డగునే తర్కింప సర్వేశ్వరా. 44

మ. సతి వేడ్కం దన ప్రాణవల్లభునితో సంయోగ[2]మాసించుఁగా
కతనిం బ్రార్థనసేసి సొమ్ముగొనిపో నర్థాడునే తజ్ఞుఁడి
క్షితి నీభక్తియ వేఁడుఁగాక మఱి నీశ్రీపాదము ల్గొల్చి ను
చ్చితకామ్యార్థము [3]లొంద వేఁడుకొనునే చింతింప సర్వేశ్వరా. 45

మ. భ్రమరధ్యానము దాల్చి కీటకము సద్భావాదిసంయుక్తిఁ దా
భ్రమరంబై ఖగవీథి[4]నాడుననిన న్భావించి నిన్నాత్మ నె
య్యముతో ధ్యానము సేయుమర్త్యుఁడును నీయట్లే పరవ్యోమత
త్త్వమునం [5]దవ్యయలీల నుండఁడే టరుదే తర్కింప సర్వేశ్వరా. 46

మ. అమరశ్రేణులకు న్సుధామయకళౌఘాత్మీయసారంబు ర
మ్యముగాఁ [6]గ్రోలఁగనిచ్చి తా నొకకళామాత్రాంగుఁడై యున్నచం
ద్రమునింజూచి [7]జనమ్ము ప్రెమ్మొక్కు [8]క్రియ నారన్ భక్తపూజావిధి
క్రమభారాకృశుఁ జూచి మ్రొక్కుదురు లోకంబెల్ల సర్వేశ్వరా. 47

మ. చెదరం బాఱు దశప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునం
గుదియం బట్టి చరింపకుండ శశి నర్కుం గట్టి భాస్వన్మన
స్సదనస్థానమునందు నిన్నెలమి సంస్థాప్యంబు గాఁ జేసి తా
హృదయానందరసాబ్ధిఁ దేలు శివయోగీంద్రుండు సర్వేశ్వరా. 48

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహావిస్పష్టమై యాత్మలో
పల భావించిన నీస్వరూపమె మహాప్రవ్యక్తమై దృష్టులం
దలఁపం జేకొని యున్న నీయచలితధ్యానంబునం జేసి తాఁ
గలనైన న్శివయోగి[9]తన్ను జగముం గానండు సర్వేశ్వరా. 49

---

1. తుత్తుమురు (అ) 2. మర్థించు. 3. నొందు. 4. నాడుగతి సంభావించి. 5. దద్వయ. 6. జేకుఱనిచ్చి, 7. జగమ్ము. 8. గతి (అ). 9. తానె జగముంగా నుండు.

మ. భవదాకారము గాంచు నీస్తవకదంబశ్లేషసద్వాక్యముల్
చెవులార న్వినఁ నిన్నె చెప్ప మది దుశ్శీలేంద్రియాటోపదు
ర్వ్యవసాయాత్ములఁ గాంచుచోఁ వినెడిచో వర్ణించుచోఁ జీఁకునుం
జెవిటిన్మూఁగయునై చరించు మహి నీశీలుండు సర్వేశ్వరా. 50

మ. [1]అతిలాలిత్యముగా నహర్నిశము నిన్నర్చింపఁగావచ్చు సు
వ్రతుఁడై యుండఁగవచ్చు నెల్లకళలం బ్రౌఢుండు గావచ్చు వా
క్పతి గానైనను వచ్చుఁగాని మదినీభక్తుండుగారాదు సు
స్థితిగా నీదయలేనిమానవునకుం జింతింప సర్వేశ్వరా. 51

మ. [2]భవికిన్ భక్తి మహత్త్వ మంకురితమై పాటిల్ల భక్తుండు బాం
ధవమాత్రుండగు భక్తి పుష్పితముగాఁ దద్భక్తుఁ డాత్మేశుఁడై
సవిశేషస్థితిఁ దోఁచు భక్తిసఫలోత్సాహంబునుం బొందఁగా
[3]నవికల్పక్రియ నంత భక్తుఁడును నీవైయుండు సర్వేశ్వరా. **52**

మ. సుముఖుండై శివయోగి మోదము మదిన్ శోభిల్లఁజేకొన్న భి
క్షము విప్రోత్తమకోటిభోజనసదృక్షం బన్న సౌభాగ్యయో
గమునం దారయ నమ్మహామహుఁడు వేడ్కంగోరి యారోగిణం[4]
బమరం జేసినపుణ్య మెట్లు గుఱిసేయన్వచ్చు సర్వేశ్వరా. **53**

శా. ఎచ్చో నీపదభక్తుఁడుండు మది నింపెక్కం బ్రయత్నంబుతో
నచ్చో నీవనిశంబు నుండుదు త్వదీయధ్యానచిన్మూర్తులై
యచ్చోనన్మునులెల్ల నుండుదురు మంత్రాంగాఱరాయుక్తులై
యచ్చోఁ దీర్థములెల్లనుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా. **54**

శా. సత్యంబెప్పుఁడు దప్పఁడే మహిదురాచారుండు గాఁడేని యా
చిత్యం బేమఱఁడేని దుర్జనులగోష్ఠిం బొందఁడే భక్తసాం
గత్యం బాదటఁ బాయఁడేని మదనగ్రస్తుండుగాఁడేని నీ
భృత్యుం డాతఁడు మూఁడులోకములలోఁ[5]బెంపొంద సర్వేశ్వరా. 55

శా. [6]పెంపం దల్లియగున్ రుజాపటల[7]దుష్పీడావిధిక్షోభ వా
రింపన్ వైద్యుఁ డగుం గుమార్గవిధులం గ్రీడింపఁ బోకుండ శి

---

1. ఈ 51-వ పద్యమునకు రెండవప్రతిలో మొదటిపాదముమాత్రమే యున్నది. 2. దీనికి రెండవప్రతిలో "భక్తులకుభవసంగమంబు గలుగుట" యను శీర్షిక గలదు. 3. నవికల్పస్థితిసంత భక్తుఁడగు. 4. ఆరోగిణము = భోజనము. 5. మొదటిప్రతిలో "రూపింప" అని తప్పుగానున్నది. పద్యములోని పాఠము రెండవప్రతిలోనిది. 6. దీనికి భక్తిమాహాత్మ్యమని రెండవప్రతిలో శీర్షిక. 7. దుష్పీడావధిక్షోభమాఱింపన్.

క్షింపన్ బల్లిదుఁడైన తండ్రియగుచున్ శ్రీమంతుఁగా నెంతయున్
సంపద్వృద్ధి[1]యొసంగ దాతయగు నీసద్భక్తి సర్వేశ్వరా. 56

మ. ఉరుసంసారగజేంద్రదర్పదళనవ్యాఘ్రప్రతాపోగ్రకే
సరి, దుష్ప్రాపశరీరబంధవిపు[2]లత్స్మాజవ్రజచ్ఛేదవి
స్ఫురితక్రూరకుఠారధార, దురితప్రోద్భూతజీమూతదు
స్తరసంఘాతవిఘాతమారుతము నీసద్భక్తి సర్వేశ్వరా. 57

మ. అరివీరప్రకరంబు భీకరతరంబై తాఁకుచో సింహసిం
ధురశార్దూలమృగోరగాది భయము ల్దోతెంచుచో ఘోరదు
స్తరసంసారవికారవేదనలు మీఁదం బర్వుచో వజ్రపం
జరమై చేకొని తన్ను నెత్తుకొను నీసద్భక్తి సర్వేశ్వరా. 58

మ. కమలాప్తుం డుదయింపఁగా ననలనక్షత్రక్షపాధీశ తే
జము లెల్లం బెడఁబాసిపోవుగతి నీసద్భక్తిభావంబు చి
త్తములోనం బ్రభవింపఁగా నితరమంత్రధ్యాన తద్దేవతా
క్రమమాయాపటలంబు లన్నియును వీఁకం గ్రాఁగు సర్వేశ్వరా. 59

మ. చటులప్రాయగుణేంద్రియాత్ములకు వాంఛావృత్తి నీభక్తి సం
స్ఫుటమై యుండదు భక్తితత్పరులకుం బొల్పొందఁగాఁ జిత్తము
తటుటదుష్టేంద్రియవర్గతామసపరిగ్రస్తంబుగా డెట్లు చీ
[3]కటికిం దిగ్మమరీచికిం గలదె సాంగత్యంబు సర్వేశ్వరా. 60

మ. బలవంతుండును దుర్బలుండును మహాప్రౌఢుండు మూఢుండు నుం
గులజుండుం గులహీనజాతుఁడు ఘనక్రూరుండు శాంతాత్మని
శ్చలచిత్తుండును నొకటరూప మది నీసద్భక్తిచిత్తంబులో
పల వర్తించిన మీఁద నేవిధమునన్ భావింప సర్వేశ్వరా. 61

శా. కామోద్రేకవిజృంభణంబును సమగ్రక్రోధమున్ లోభమున్
వ్యామోహంబు మదంబు మత్సరము దీవ్రంబైన పంచేంద్రియో
ద్దామాక్షేపము[‡]గ్రాఁచి పెంపెసఁగు తత్త్వజ్ఞానికిం గాక తా
సామాన్యాత్ములకేల నూలుకొను నీసద్భక్తి సర్వేశ్వరా. 62

---

1. యొనర్చ. 2. త్మాజచ్ఛిదానర్గళ. 3. "చీఁకటికిం గల్గునె దిగ్మరోచికిని" అని మొదటి పుస్తకము. ‡ టోపమణంచ (అ).

మ. ఊయపత్రంబులు వచ్చునంతకు నిరుద్యోగంబున న్వృత్తికో
టరమధ్యంబున నుండుపక్షిగతి నిష్ఠం గోరి నీభక్తివి
స్తరమాత్మం బ్రభవించునంతకును దత్సంసారకారాగృహాం
తరగేహంబున[1]నుండి జీవుఁ డతిచింతంబొందు సర్వేశ్వరా. 63

శా. లింగారాధన జంగమార్చనములోలిన్ భక్తికంగంబు ప్రా
ణాంగవ్యాప్తియునై స్ఫురించు నిది తత్త్వార్థం బగుంగాన నా
యంగాభ్యర్చన జంగమాహితకరుండై చేసినం దాశివ[2]
శృంగారం బగు వానిభక్తి మదిఁ జర్చింపంగ సర్వేశ్వరా. 64

మ. *అరయంగర్మవిధానదానవిధివద్ధ్యానోత్తమజ్ఞానముల్
వరుసం బేర్కొన నాల్గుయోగములు తత్త్వం బెందు నీభక్తి వి
స్తరబాహ్యక్రియలెల్లఁ బొల్లులగుటం దద్భక్తియోగంబు తాఁ
బరఁగం దక్కినమూఁడుయోగములకుం బ్రాణంబు సర్వేశ్వరా. 65

మ. అమరంగా ధన మిచ్చి కాతురు[3]మహీయఃప్రీతిఁ బ్రాణంబుఁ, బ్రా
ణము నర్థంబును నిచ్చి కాతు, రభిమానంబు న్విశేషించి మా
నముఁ బ్రాణంబు ధనంబు నిచ్చి కడుసన్మానంబుగా నుత్తమో
త్తమచారిత్రులు భక్తిఁగాతురు ప్రమోదం బంది సర్వేశ్వరా. 66

మ. [4]అనుబంధేంద్రియ భూతవర్గము యమాద్యష్టాంగ[5]మంత్రోరుసా
ధన[6]ముచ్చాటనసేసి పాపి గురుసద్వాక్యప్రకాశోత్తమాం
జనదృష్టిం బరికించి యేర్పఱచి వాంఛంగోరి సాధించి చే
కొను చిన్మూర్తికిఁ గాని భక్తివిధి గీలొక్కదెందు సర్వేశ్వరా. 67

మ. కనకంబందు ఘనీభవించిన కళంకం బెల్ల[7]సువ్యక్తిగా
ననలాస్యంబునఁ గానిపోనిగతి జీవాత్మం బ్రవేశించి చే
కొని వర్తించిన దుర్మలత్రయపరిక్షోభంబు నీభక్తిచే
తను బాపంబడుఁ గాని[8]యొండొకటిచేతం బోదు సర్వేశ్వరా. 68

మ. అమరంగా గురుమంత్రకార్ముకమునం దాత్మాస్త్ర మష్టాంగయో
గమహాముష్టివివేకి యేయుటయుఁ దత్కాండం బజాండాదిత

---

1. నుండు జీవుఁ డతివంతంబొందె. 2. శివశృంగారము—గణముచెడినది *ధరణింగర్మవిధాన భక్తివిభవ. 3. మహోద్యత్ప్రీతి. 4. అనుబద్ధేంద్రియ. 5. యోగానుసా. 6. ముచ్చాటన మొందఁ జేసి. 7. తెల్లంబుగా. 8. వేఱొకటి.

త్త్వములెల్లనప్పుడి[1]నుచ్చిపాఱి భవదుద్యత్సూక్ష్మకైవల్యల
క్ష్యము నత్యద్భుతశక్తితోడఁ గమియంగానాటు సర్వేశ్వరా. 69

మ. [2]తనరం గాయవహిత్రమందు హృదయస్తంభాభిసంస్థానమై
చను నీధ్యానపటంబు నూల్కొలిపి భాస్వద్భక్తివాతాహతి
[3]న్వినుతజ్ఞానపథంబు చేకొని సముద్వేగంబుమై జీవుఁడీ
ఘనసంసారమహార్ణవంబుఁ గడవంగాఁ బాఱు సర్వేశ్వరా. 70

మ. అకలంకస్థిరభక్తి[4]మునొన్నగయ నిన్నశ్రాంతముం జూచి పా
యకపూజించి మహామహుండు భవదభ్యర్చ్యుండగుంగాక దా
సకలేచ్ఛావిషయంబులం బొగయుచుం జాపల్యతం జేయు నీ
బకవేషార్చన నిన్ను నెట్లు సొగయింపం జాలు సర్వేశ్వరా. 71

మ. సమదోత్సాహసుఖాభిలాషలును నీసంసారమాయావినో
దములు న్స్వర్గఫలాపవర్గఫలచిత్తభ్రాంతులుం బూజ్యరా
జ్యమహాశాంతులు నెన్నిచూడ నివి నీసద్భక్తికత్యంతరా
యములై మాటికి మాటి కడ్డుపడుఁ [5]గార్యశ్రేణి సర్వేశ్వరా. 72

శా. మోహధ్వాంతములో మునింగిన మహామూఢుం డతిభ్రష్టుఁడై
సోహంబంచుఁ దొడంగి నీకుఁ గడు దూరాత్ముండగుంగాని దు
ష్టాహంకారగుణంబుమాని మదిసొంపారంగ[6]సద్భక్తి దా
సోహం బన్న భవత్పదార్చకుఁడు నీవై యుండు సర్వేశ్వరా. 73

శా. చావం బుట్టుచుఁ బుట్టఁ జచ్చుచు మహాచండాలసంసారపా
రావారంబునఁ గూలి తాఁ జెడుటకుం బ్రవ్యక్తిగా నాత్మలో
నేవం బొందక యేను నీవనుట తానేజ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టి కుతర్కముం గలదె చింతింపంగ సర్వేశ్వరా. 74

మ రసికుండై భవదంఘ్రిపద్మయుగ మారాధించుచో దుర్మద
వ్యసనాటోపము చిక్కులం బొరలుచు న్వర్తించుచున్నట్టి పా
లసుపూజావిభవం బదొప్పునె భువిన్ లక్షింప నారంభముం
గసవుం బెంచిన చేనుఁ[7]బోలుఁ దలఁపంగా మీఁద సర్వేశ్వరా. 75

---

1. గ్రుచ్చి. 2. తనరంగాయవహిత్రమందు హృదయస్తంభాతిసంధానమై. అచ్చుప్రతిలోఁగూడ నిట్లె. వహిత్రము = తెప్ప. 3. ఒనరన్ జ్ఞానపుటంబు వెల్గునఁ దమోవ్యోగంబుఁ బోఁజీవుఁ. 4. సైసాగసి నిమ్మశ్రాంతమున్. తోనారసి (అ). 5. కామ్యశ్రేణి. 6. నీభక్తి. 7. బోలెఁ దలఁపంగా నెందు.

మ. అమితోత్సాహమునంది నీకుఁ దనసర్వార్థంబులుంగూర్చి నే
మముతో నిచ్చుటకంటె శౌర్యగుణసామర్థ్యంబునుం[1]బొంది ప్రా
ణము నీకిచ్చుటకంటె దుస్తరభవోన్మాదంబు[2]మర్దించి చి
త్తము నీకిచ్చుట పెక్కుభంగుల మహౌదార్యంబు సర్వేశ్వరా. 76

మ. ఘనవైరిప్రకరంబు[3]ధాటిననిలోఁ ఖండించుకంటెన్ మృగేం
ద్రుని జేపట్టుటకంటె[4]వారినిధిలోఁ దోఁగాడుకంటెన్ మహా
శనిఁదావ్రేయుటకంటె ఘోరభోరదుశ్చారిత్రవారించి రం
జనతోఁ జిత్తము శిక్షసేయుట మహాశౌర్యంబు సర్వేశ్వరా. 77

మ. అమితామోద నవప్రసూనముల నిన్నర్పించుచోఁ గద్యప
ద్యము లూహించి నుతించుచో వివిధ[5]తవ్రాతముల్పాడుచో
నమృతాహారము లిచ్చుచో నిపుణుఁడై యాటాడుచో[6]నందుఁ జి
త్తము సద్భక్తియె నీవు చేకొనుపదార్థంబెల్ల సర్వేశ్వరా. 78

మ. కడుఁ జిత్రంబుగఁ జేయఁగా నొఱ సురంగంబయ్యెనే ఖడ్గమం
దిడకున్నం; [7]జెడురూపదేమికొఱ దానిం బెక్కుపాటింపఁగా
[8]నొడలెబ్బంగులనోపునే నియతితో నూహించి నిన్నాత్మలో
నిడకున్నం [9]జనురూపు నేమికొఱ తా నీక్షింప సర్వేశ్వరా. 79

మ. జ్వరసంతాపవిశోషితాంగుఁడు సుధాసంకాశదివ్యాన్నపా
నరసశ్రేణి భుజింపరోయుగతి నున్మాదేంద్రియధ్వాంతదు
స్తరసంసారమదప్రమత్తుఁడు మహాసౌఖ్యోత్సవంబైన మీ
చరణారాధనయందు బుద్ధిఁ జొనుపం జాలండు సర్వేశ్వరా. 80

మ. కలయం గాష్ఠయుగంబుఁ గూర్చి తరువంగాఁ బుట్టి తత్సాధనం
బుల రెంటిన్ దహియించు వహ్నిగతిఁదాఁ బొల్పొందఁ గాయంబుసం
ధిల సత్కర్మముతో మథింపఁగ భవచ్చిద్భక్తి సద్వహ్ని యు
జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ దత్త్వం బెన్న సర్వేశ్వరా. 81

మ. స్థిరబుద్ధిం దనసొమ్ము భక్తవరసుక్షేత్రంబులన్ బీజమై
పరఁగంగా వెదపెట్టి మీఁద ఘనసంపన్నుండగుంగాక దా

---

1. జెంది. 2. వారించి 3 దాఁకియు. 4. దిగ్గజముతోఁ ద్రోపాడుంకటెన్. 5. ఛవ్య
6. జిత్రములీరమణన్ భక్తిరియు నీవుచేకొని సదారక్షింతు సర్వేశ్వరా. 7. జెడ నాటదేమి మెరదా నేకట్లపాటింపఁగా. 8. నొడతేభంగుల నొప్పునేని. 9. జడరూపదేమిగొఱ (అచ్చు).

సరిషడ్వర్గముపాలుసేసి భవమాయాగ్రస్తుఁడై యిచ్చనె
వ్వరి వేఁడం జనువాఁడొకో విషయదుర్వ్యాపారి సర్వేశ్వరా. 82

శా. కాయం బన్నది వారిబుద్బుదసదృక్షం బందు రూపింప లేఁ
బ్రాయం బన్నది శారదాంబుదతటి[1]త్ప్రఖ్యంబగుం దత్సుఖ
శ్రేయం బన్నది మాయ యి ట్లెఱిఁగియున్ శిక్షింప నీధ్యానసం
స్థాయీభావనఁ జెందఁ డేమిటికయో సంసారి సర్వేశ్వరా. 83

మ. భవదీయస్థిరభక్తి లబ్ధయు భవద్భక్తైకగోష్ఠీమహో
త్సవలీలావిభవంబు నీయనుదినధ్యానానుమోదంబులో
నివి నిత్యస్థితులారయంగ విధి దేవేంద్రాది భూతాఖిలో
త్సవభోగస్థితులెల్ల [2]మిథ్య లవి తత్త్వం బెన్న సర్వేశ్వరా. 84

మ. తనయుక్తి న్భవదంఘ్రి[3]సేవగలసద్భక్తుండు పాపంబుచే
సినఁ బుణ్యంబగు భక్తిహీనుఁడు శ్రుతుల్చేపట్టి పుణ్యంబుచే
సినఁ బాపంబగు దీని కింతటికిఁ జర్చింపంగఁ జండేశ్వరుం
డును దక్షుండును సాక్షులెన్న నగరాట్కోదండ సర్వేశ్వరా. 85

శా. ప్రారంభించి చకోరపోతము మహీయజ్యోత్స్నయం దుత్సవ
శ్రీరంజిల్లుచు వేడ్క నుండుగతి నాచిత్తంబు నీదివ్యశృం
గారధ్యానమునం దహర్నిశముఁ జొక్కంజేయవే దేవశ్రీ
గౌరీలోచననర్తకీనటనరంగస్థాన సర్వేశ్వరా. 86

మ. [4]తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హరమీపాదపయోజ[5]పూజితములై యత్యద్భుతం బవ్విగుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌఁ గర్పూరమౌ హారమౌఁ
దరుణీరత్నములౌఁ బటీరతరులౌఁ దథ్యంబు సర్వేశ్వరా. 87

మ. [6]ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బ్రా

---

1. త్ప్రాయంబుగా(అ) 2. దుస్థితులు సత్యంబెన్న. 3 పంకరుహ. 4. ఈపద్యము ప్రథమమంద న్నమయ్యగారు చెప్పినది యని మొదటి ప్రతిలో నున్నది. 5. పూజనముచే. 6. ఈపద్యముంగూర్చి ప్రథమప్రతిలో నీరీతినున్నది. "ఈశతకపద్యములు తాటియాకున కొకపద్యముచొప్పున వ్రాసి శ్రీసత్రశాల సమీపస్థానమునఁ గృష్ణానది సన్నిధిని గంగదాపునఁ గూర్చుండి గండక త్తెర కంఠమున ధరించి యొక్కొక్క తాటియాకును గృష్ణలో వేసి యెదురు నడిచివచ్చిన యాకును సూత్రమునఁ గుచ్చు

యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచోఁ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా. 88

శా. ఆనందంబును బొందినప్పుడును సత్యాశ్చర్యకార్యార్థభా
వానీకంబులు దోఁచునప్పుడును రోగాపాయదుఃఖాతుర
గ్లానిం బొంది చరించునప్పుడును సత్కార్యంబున న్నీవు నా
ధ్యానంబం దుదయింపుమయ్య దివిజేంద్రస్తుత్య సర్వేశ్వరా. 89

శా. నానాశాస్త్రసముచ్చయాగమపురాణప్రౌఢులై తత్త్వవి
జ్ఞానధ్యానసమాధివిద్యలతివిస్పష్టంబుగా నేర్చి రే
దానన్నేర్పరులెల్ల నేరరు భవత్సద్భక్తి విద్యాసమా
ధానప్రస్ఫుటశక్తి నీకరుణచేతంగాని సర్వేశ్వరా. 90

మ. ప్రకటింపంగ మదీయచిత్త మదిరా పంచేంద్రియోద్వృత్తమై
ప్రకటప్రాప్తిని సోలుఁగాని మఱి నీపాదాబ్జసంసేవనం
బొకవేళైనభజింప నొల్లదు నిజం బూహింపఁగా నట్ల యూఁ
గకు దుర్గంధముగాక సహ్యమగునే కస్తూరి సర్వేశ్వరా. 91

మ. మలినాంగుం డగుటేమికష్టము మనోమార్గంబు నీభక్తిని
ర్మలసౌభాగ్యనిధానదీపశిఖయై రంజిల్లదే భూషణో
జ్జ్వలదేహుం డగుటేమి తేజము మనోవ్యావృత్తి దుర్మోహసం
[1]చలదుష్కర్మగతిం జెడందగునె దా జీవుండు సర్వేశ్వరా. 92

మ. ఇల[2]నాచిత్తము యోగసాధనలయం దీఁదాడఁగాఁ గొంతని
శ్చలతం జేరఁగవచ్చు ; లేక తనవాంఛావృత్తిఁ బోనిచ్చినం

---

చుచుండఁగాఁ బైనివ్రాసినపద్యము కామ్యార్థముగా రచింపఁబడినదని కృష్ణలోఁ బోవుచుఁ దిరిగి రానందునఁ దనతల నుత్తరించుకొన నుద్యోగించుసమయమున నాతాటియాకుమీఁదిపద్యము తుడిచి మోక్షార్థముగాఁ దాజాపద్యము వ్రాసియున్న తాటియాకును నొక పసుల కాపరి చిన్నవాఁడు అన్నమయ్యంగారి తావునకువచ్చి నాకుఁ "దాటియాకు దొరకినది దీనిమీఁద నేమోవ్రాసియున్నది చూచుకొ"మ్మని యొకతాటియాకును జేతికిచ్చి యాచిన్నవాఁ డదృశ్యుం డయ్యె నంతటఁ బద్యమును జూచి యిది యీశ్వరుఁడు చేసిన మాయ యని సంతోషించినాఁ డని పెద్దలవలనఁ దెలియఁబడుచున్నది.

1. చలదుష్పంకముఁ బొంది పీడఁబడఁగా జర్చింప సర్వేశ్వరా. కలితాటోపము మీఁదఁ భీడితునిగాఁ గాఱింపఁ(అచ్చు). 2. ఇలలోఁ జిత్తము.

బొలుపై నిదెసఁ జెర దట్టిదకటా బోధించినంగాక క
వలసంబోధన నేల నిల్చు బుజువై [1]వర్తిప సర్వేశ్వరా. 93

మ. ఉదకం బింకిన లావుమాలి కడు మై యుష్ణింపఁగా రొంపిలోఁ
గదలంజాలని మీను వానగురియం గ్రమ్మెక్కి పెన్నీటిలోఁ
బొదలం గన్నవిధంబునన్ భవముతోఁ [2]బోరాడుమర్త్యుండు దా
హృదయాబ్జంబున నిన్నుఁ [3]గొల్వఁగనునే యింపొంద సర్వేశ్వరా. 94

మ. భవదీయార్చనసేయుచోఁ బ్రథమపుష్పం బెన్న సత్యంబు రెం
డవపుష్పంబు దయాగుణం[4]బును విశిష్టం బేకవిష్ఠానమో
త్సవసంపత్తి తృతీయపుష్పమది భాస్వద్భక్తి సంయుక్తియో
గవిధానం బవి లేనిపూజలు[5]మదింగైకోవు సర్వేశ్వరా. 95

మ. అమరేంద్రాద్రిశరాసనంబు, హరి దివ్యాస్త్రంబు, భూమండలం
బమరంగా రథ, మర్కచంద్రులు తదీయాంగంబులై యొప్పఁ జి
త్రము నీకుం బురలక్ష్య మేయునెడ నుద్యద్భాతి నేయల్పకా
ర్యములం[6]దైనను దామహోఘనము నీయత్నంబు సర్వేశ్వరా. 96

మ. దివిజేంద్రత్వముఁ బద్మజత్వము జగత్స్రష్టృస్థిరానర్గళో
త్సవరూపంబగు కేశవత్వమును నీసద్భక్తి సంవృద్ధిలో
లవమాత్రస్థితు లెన్న భక్తిజనితోల్లాసావనోద్యత్సుఖా
ర్ణవసౌభాగ్యముమాన మెవ్వరికి నెన్నవచ్చు సర్వేశ్వరా. 97

మ. పరమార్థంబుగ నామనంబున భవద్భక్తిప్రభావంబు వి
స్తరమై పుట్టదు పుట్టినం బ్రబల దంతం గొంతవర్ధిల్లనే
విరసంబై యటమీఁదఁ జిక్కువడు భావింపంగ నెట్లన్న న
స్థిరుఁడంగాన జడుండఁగాన బకవేషింగాన సర్వేశ్వరా. 98

శా. శ్రీకంఠాయ నమోనమో నతసురజ్యేష్ఠాయ రుద్రాయ లిం
గాకారాయ నమోనమో విగతసంసారాయ [7]శాంతాయ చం
ద్రాకల్పాయ నమోనమో దురితసంహారాయ తే యంచు ని
న్నాకాంక్షం బ్రణుతించు మానవుఁడు నీవై యుండు సర్వేశ్వరా. 99

---

1. వర్తిల్లి. 2. బోర్లాడు. 3. నిల్పనగు నిర్భీకుండు (అ). 4. బతివిశిష్టం. 5. మహిం. 6. దైనసదా. 7. దివ్యాయ (అ).

మ. భువనోత్పత్తి విధించుచో నజుఁడవై పొల్పొందఁగా దాని ను
త్సవలీలం బ్రభవించుచో మృడుఁడవై సర్వంబుఁ గల్పాంతభై
రవసంక్షోభ నటించుచో హరుఁడవై త్రైగుణ్యశక్తిం దుదిన్
శివనామాంకముఁ దాల్చు నీమహిమ దాఁ జిత్రంబు సర్వేశ్వరా. 100

మ. [1]జలధు ల్మేరల నాక్రమించి సముదంచద్భంగి నుప్పొంగినన్
జలజాతప్రియశీతభానులు యథాసంచారము ల్దప్పినం
గులశైలంబులు పాదుపెల్లగిలి దిక్కూలంబునం గూలినం
[2]దలఁకం డుబ్బఁడు చొప్పఁదప్పఁడు భవద్భక్తుండు సర్వేశ్వరా. 101

శా. శూలస్థాపితుఁ డైనమానవునకున్ శూలంబు దుర్వారవా
త్యాలిం గంపము[3]నొందకుండిన సుఖంబై తోఁచు మాడ్కిన్ భవా
భీలజ్వాలలఁ గ్రాఁగుమానవునకున్ బింబాధరాహారవ
స్త్రాలంకారము లించుకించుక[4]సుఖంబై తోఁచు సర్వేశ్వరా. 102

శా. *ఆకాశానలచంద్రసూర్యపవమానాత్మాంబువిశ్వంభరా
ప్రాకామ్యాంచితమూర్తి భేదముల నీబ్రహ్మాండనానాఘటా
నీకప్రాకటజీవభావవిలసన్నిర్మాణకర్మాద్భుతా
స్తోకశ్రీకరమూర్తియై వెలుఁగు నీస్థూలంబు సర్వేశ్వరా. 103

మ. అతివాగ్జాలమునై యజాండనిలయంబై యాదిమధ్యాంతవ
ర్జితరూపాధికనిష్కలంకపదమై సిద్ధాంత మధ్యాత్మసం
యుతమై కోటిరవిప్రకాశయుతమై యోంకారమంత్రాదిసం
స్తుతమై [5]యేచి యచింత్యమై నిగుడు నీసూక్ష్మంబు సర్వేశ్వరా. 104

మ. అజుఁడై సృష్టి[6]యొనర్చు రాజసముచే నందంబుగాఁ దానధో
క్షజుఁడై వర్ధిలఁజేయు సాత్త్వికము సంప్రవ్యక్తిగా గోపతి
[7]ధ్వజుఁడై సంహృతిసేయుఁ దామసమునం, దత్సర్వముం[8]గూడఁగా
నిజవిస్ఫూర్తి వెలుంగుఁ దుర్యమగుచున్ నీయాజ్ఞ సర్వేశ్వరా. 105

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంతశాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌందర్యాంబికాసంగమా

---

1. రెండవప్రతిలోఁ జరణములు క్రిందు మీఁదైనవి. 2 తలఁగండెన్నఁడు. 3. నొందకిం చుక. 4. సుఖంబై యుండు. * ఈపద్యమునకు "శివస్థూలసూక్ష్మశరీరములు" అను శీర్షికకలదు. 5. మించి యచింత్యమై నెగడు (అ). 6. నొనర్చు. 7. ధ్వజుఁడౌచున్ మృతిసేయు, 8. జూడఁగా నిజమూహింప నజాండభాండములలో (అ).

ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
[1]రికిం దాశక్యమె నీనిజంబెఱిఁగి వర్ణింపంగ సర్వేశ్వరా. 106

మ. భవదుఃఖార్ణవయానపాత్రము పరబ్రహ్మంబు యోగీంద్రహృ
ద్భవనప్రస్ఫురితప్రదీపము నఘధ్వాంతార్కబింబం బతి
శ్రవణానందకరంబు నమ్మునిగణస్వాధ్యాయ[2]పాఠంబు మీ
శివనామాంకము భక్తపుంగవసదాసేవ్యంబు సర్వేశ్వరా. 107

మ. అణిమాద్యష్టగుణప్రసిద్ధులు [3]త్రికాలారాధ్యు లుద్యద్వచో
మణికోటిప్రతిమప్రభాపటలు లున్మాదేంద్రియధ్వాంతభీ
షణదైత్యేంద్రవినాశకారణమహాశౌర్యాన్వితు ల్లోకర
క్షణదక్షుల్ వినుతింప నీప్రమథసంఘాతంబు సర్వేశ్వరా. 108

మ. సకలాధీశ్వరులై గణాధిపతులై సర్వజ్ఞులై నిత్యులై
యకలంకాత్మకులై మహామహిములై యంభోజగర్భాండర
క్షకులై యుండుదు రెల్లవారును భవత్సద్భక్తి నానాగణా
ధికలీలావిధి నంతరంగమ్ముల వర్తింపంగ సర్వేశ్వరా. 109

మ. *అమరేంద్రాబ్జభవాచ్యుతాదులకు నీయాజ్ఞాప్రభావంబలం
ఘ్యము నీకున్ భవదీయభక్తమహదాజ్ఞాపంబు నుద్యత్ప్రభా
వము లోకంబులలో నలంఘ్యమగుట న్వర్ణింపఁగా నీమహా
త్త్వముకంటెం గడుఁజెల్లు భక్తులమహత్త్వం బెన్న సర్వేశ్వరా. 110

మ. శివసాహిత్యుల [4]సత్కరస్థలము కాశీక్షేత్ర మాహాస్తదే
[5]శవిశాలోన్నతశాఖ లారయఁగఁ బంచక్రోశ మాపాణిసం
భవశోభాన్వితచిత్రరేఖలు మహాభాగీరథీతీర్థముల్
శివలింగం బలవిశ్వనాథుఁ డరయన్ సిద్ధంబు సర్వేశ్వరా. 111

మ. వరుసం బైకొని వచ్చుకర్మములు[6]మున్వారించి మాయామల
[7]జ్వరముల్గూల్చి యపారఘోరతరసంసారాబ్ధిలంఘించి భీ
[8]కరసూత్రాత్మాంగవిచిత్రకంచుకము వీఁకంబుచ్చిపోవైచి తాఁ
[9]బరమవ్యోమము [10]సొచ్చునీయచలసద్భక్తుండు సర్వేశ్వరా. 112

---

1. రికిశక్యంబగు నీనిజంబరసి. 2. సారంబు. ఈపద్యమునకు రెండవప్రతిలో మంత్రమాహా త్మ్యమనిశీర్షిక. 3. త్రిలోకారాధ్యులు. *ఈపద్యము రెండుమూఁడు ప్రతులలో లేదు. 4. దాక ర—సాహిత్యులసత్కర (అ). 5. శవిశేషోన్నతిఁ బొల్చునంగుళులు(అ). 6. దావారించి. 7. జ్వర ముంగాల్చి. 8. కరసూత్రాంగము పట్టుకంచుకము. 9. బరమధ్యానముదాల్చు (అ). 10. చొప్పునసం డును భవద్భక్తుండు.

మ. పరమార్థంబగు [1]తత్త్వమార్గమున నీపాదాబ్జసద్భక్తుఁ డో
కర్కరుఁడుం దక్కఁ సరోజజాద్యమరసంఘాతంబులో నెల్లఁ దా
నెరయం[2]గాఁ జిక్కొనంగఁజాలరు మహానిర్భీతుఁడుర్క్ లేఁ డతి
స్ఫురణం గాలుఁడు దన్ను [3]వేచి వడిఁ గొంపోనుండ సర్వేశ్వరా. 113

మ. [4]తనచారిత్రమె సన్నుతించు గురుభక్తశ్రేణి వర్ణింపఁగాఁ
దనచిత్తంబు భవత్పదస్మరణచేతన్నిన్ను మెప్పింపఁగా
ననుకూలస్ఫుట[5]నిశ్చలత్వమున రా నభ్యంతరంగస్థితి
న్వినుతిం బొందినతజ్ఞుఁ డీజగములో నీమెచ్చు సర్వేశ్వరా. 114

మ. క్షితి నత్యుగ్ర[6]తపంబునందు జఠరాగ్నిం[7]గాలఁగానేల మి
మ్మతిభక్తిస్థితిఁ[8]బూజసేయు మహనీయత్వంబు తాఁజాలదే
[9]ప్రతిపక్షాలినడంప రోగభయదుర్వారంబు వారింప స
ద్భృతసౌఖ్యంబులు వెంప దివ్యసుఖముం బొందింప సర్వేశ్వరా. 115

మ. శివవాక్యస్ఫురితాక్షరద్వయసకృజ్జిహ్వా[10]ప్రదేశాత్ముఁ డీ
భవదుఃఖాంబుధి[11]దాఁటఁజూచుతఱిఁ దత్పంచాక్షరీమంత్ర ము
త్సవలీలంగడు[12]శుద్ధుఁడై జపము వాంఛంజేయు భాస్వద్గుణా
ర్ణవు సౌభాగ్యముమాన మెవ్వరికి నెన్నన్వచ్చు సర్వేశ్వరా. 116

శా. ఏదేశంబున నేదిశాముఖమునం దేయూర నేవాడ మీ
పాదాభ్యర్చనసేయు నిర్మలుఁడు సద్భక్తుం డొకం డుండె నా
యాదేశంబును నాదిశాముఖమును న్నాయూరు నావాడ గం
గాదిస్నాననదీప్రవాహఫలదం బై [13]యొప్పు సర్వేశ్వరా. 117

మ. జనరంజిత్తము శుద్ధిలేనినరుఁ డుద్యోగంబునంగోరి చే
సినపూజావిభవంబు సువ్రతములుర్ శీలంబులు న్మంత్రసా
ధనముల్ తీర్థములుం దపంబులును మీఁదం జెట్టవాఁ డభ్యసిం
చిన శస్త్రాస్త్రకళానిభంబులగుఁ జర్చింపంగ సర్వేశ్వరా. 118

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహంకారంబుఁ జిత్తంబు నా
యమలాంతఃకరణంబు నక్షరచతుష్కావాప్తిఁగావించి వం

---

1. తత్త్వధూరయఁగ. 2. గాచికొనంగఁజాలి నిలుప న్నేదేవుఁడున్లేఁడతి. 3. చేరి. 4. తన చారిత్రము తత్త్వవేత్తలగు 5. నిష్కళంకబహిరంగాభ్యం. 6. తపంబుచేసి. 7. గ్రాఁగఁగానేల. 8. బూజసేయ నియతుండై యుండఁగాఁ. 9. ప్రతిపక్షావలినొంప. 10. ప్రదేశాత్ముఁడై. 11. దాఁటునన్న మతి 12. సిద్ధుఁడై. 13. యుండు.

చమవర్ణంబుగ నాత్మఁగూర్చి కడువాంఛన్ యోగి పంచాక్షరీ
సుమహామంత్రముతోడ [1]నైక్యపదవిన్ శోభిల్లు సర్వేశ్వరా. 119

మ. భవదీయాననపంచకంబువలనం బంచాక్షరీమంత్రము
ద్భవమై తత్పదవర్ణపద్ధతుల శుంభత్పంచభూతంబులు
ద్భవనంబై యఖిలంబుఁ బుట్టెను లసత్పంచాక్షరీమంత్రమీ
భువనాండంబులఁ దల్లియై సఫలతం బొందించు సర్వేశ్వరా. 120

మ. పటుశాస్త్రాగమదృష్టి నివ్విధమునన్ భావించి వీక్షించి యు
ద్భటవృత్తిన్ భవదీయ[2]భక్తినికర బ్రహ్మాండమండైన నా[3]
దట లోఁగాచుకొనంగవచ్చు విదితోద్దండప్రతాపోత్కట
స్ఫుటకోపానలమూర్తియై యముఁడు కొంపోకుండ సర్వేశ్వరా. 121

మ. [4]కలవారై మతిమంతులై రసికులై గంభీరులై ధీరులై
లలనామన్మథులై సముజ్జ్వలవచోలాలిత్యులై నిత్యులై
బలవిభ్రాజితులై యశోభరితులై భాసిల్లుభాగ్యోదయుల్
తొలిజన్మంబుల మిమ్ముఁ గొల్చినమహాత్ముల్ వారు సర్వేశ్వరా. 122

మ. ఖలులై యాచకులై విరుద్ధవికటాకారాంగులై పంగులై
బలహీనాతురులై రుజాపటలతాపచ్ఛన్నులై ఖిన్నులై
చలనాందోళితచిత్తులై మలినులై జాత్యంధులై మందులై
[5]తొలిజన్మంబున మిమ్ముఁ గొల్వని దురాత్ముల్ వారు సర్వేశ్వరా. 123

శా. [6]ఏయేవేళల నేవయస్సున నరుం డేభూమి నేయూరిలో
నేయేకర్మము నాచరించు నశుభం బేని న్శుభం బేని దా
నాయావేళల నావయస్సున నరుం డాభూమి నాయూరిలో
నాయాకర్మములెల్లఁ దాఁగుడుచుఁ దథ్యంబింత సర్వేశ్వరా. 124

శా. ఆడం బోయినచోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
గూడం బెట్టి శివాలయం బనుచుఁ [7]బేర్కొన్నంతటం జేసి వా
రాడంబోయి సురాంగనాకలితదివ్యారామ[8]చింతామణి
క్రీడాశైలవిహారు లౌదురు మిముం గీర్తింప సర్వేశ్వరా. 125

---

1. నైక్యము మదిన్. 2. భీతినికర. 3. నంతట. 4. ఈ పద్యమచ్చు ప్రతిలోఁ గనఁబడదు. 5. యిలజన్మించు దురాత్ము లేమిడనివారీక్షింప సర్వేశ్వరా. యిలజన్మించెదరాత్మమిమ్మిడక తారక్షింప సర్వేశ్వరా (అ) 6. ఈ పద్యము నొకవ్రాతప్రతిలోమాత్రము గలదు. 7. బేర్కొన్నంత మాత్రాన. 8. చంద్రోపల క్రీడాగేహ (అ).

మ. తమలింగంబునకంటె జంగమము సౌందర్యంబుగాఁ గొల్చు టు
త్తమభక్తస్థితి లింగజంగమలసత్సామ్యంబుగాఁ జేత మ
ధ్యమభక్తస్థితి లింగపూజ నధికుండై [1]జంగమోపాసనా
క్షముఁడై యుండుట భక్తియందును గనిష్ఠత్వంబు సర్వేశ్వరా. 126

శా. [2]శాకాబ్దంబులు వార్ధిషట్క పురజిత్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగాఁగ మహిలోఁ శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁ జెప్పె శుభకృత్పత్యక్తవర్షంబునన్
శ్రీకారాధనవంతుఁడై వసుధలోఁ జెన్నొంద సర్వేశ్వరా. 127

మ. అభిరమ్యంబుగ [4]దూదికొండ మహనీయారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్యవసంతసంజనితసద్భావప్రసూనావళి
న్విభవం బొప్పఁగఁ గూర్చి యొంతయు లసద్విఖ్యాతి సంపత్సుఖ
ప్రభవం బైన భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా. 128

శా. ధాత్రి న్భక్తజనానురంజనముగాఁ దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచితశబ్దబంధురముగా సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాన్వితముగా శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా. 129

శా. బాలుం డాడెడు ముద్దుమాట లుపమింపం దండ్రికిం బ్రౌఢభా
షాలాపంబులకంటె నింపయినయ ట్లస్మత్స్వభావంబునం
దాలోకించి రచించినట్టి యిది యింపారంగ నీకు న్మహా
లాలిత్యస్తుతికంటె నావినుతి యత్యాశ్లాఘ్యంబు సర్వేశ్వరా. 130

మ. పరమార్థంబుగఁ దత్త్వము న్నెఱుఁగ నొప్పం దీర్చి డెందంబు నీ
కరుణాస్థానముఁ జేర్పలేక తనవంకం బోవఁగా నిచ్చి రే
నరకాబ్ధింబడవైచుఁ దత్క్షణములో నంగానఁ దత్త్వక్షమం
బరయం జిత్తము [5]శూకలాశ్వము విధంబై యుండు సర్వేశ్వరా. 131

మ. [6]భవదంఘ్రిద్వితయార్చనంబును భవత్ప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠీవిభవంబులు న్విగుల సూక్ష్మధ్యానయోగంబు నా

---

1. జంగమోపాస్తిన (అ). 2. శా॥ శ॥ ౧౧౫౫. 3 సంవత్సర శ్రీకాలంబునఁ గాలంగాఁగ మదిఁ దర్కింపంగ సర్వేశ్వరా (మూల). ఈ 127 పద్యములే మొదటి ప్రతిలో నున్నవి. 4. దూదికొండయను గ్రామము కర్నూలుజిల్లా పత్తికొండ తాలూకాలోఁ బత్తికొండకు సమీపమున నున్నది 5. శూకలాశ్వము = శిక్షింపఁబడని గుఱ్ఱము. 6. ఈపద్యమచ్చు ప్రతిలోఁ లేదు.

నివి సంపూర్ణసుఖంబు లెన్న మఱి దేవేంద్రాదిభోగంబు లు
త్సవసంబంధములెల్ల నుస్థిరతులు తథ్యం బెన్న సర్వేశ్వరా. 132

మ. సమయోద్దిష్టసహస్రపంకరుహపూజాపూరణార్థంబు నే
త్రము విష్ణుండు సుభక్తి యేర్పడ భవత్పాదంబు లర్పించి చ
క్రముఁ దాఁ గైకొని దైత్యకోటి ననిలో ఖండించెఁ దా నీపద
క్షమతానేవ సమస్తదేవతలకు న్సత్త్వంబు సర్వేశ్వరా. 133

మ. అమర న్వేదపురాణశాస్త్రములు మున్నాకాంక్షఁ దత్త్వ[1]ప్రభే
దము రూపింపఁగ నేర వన్న మఱి యాతత్త్వంబు లెట్లన్న ను
త్తమసంతోషమెకోరుచున్న నరుఁ డుత్సాహించి నీభక్తస
త్తమపూజారతి నేర్పునే నతఁడు తత్త్వజ్ఞుండు సర్వేశ్వరా. 134

మ. అమితోద్యద్భవదీయతత్త్వము [2]మహీయస్తోత్రవాణీవిలా
సములై యొప్పు సమస్తవేదములు శాస్త్రశ్రేణియుఁ దివ్యవి
భ్రమనాదంబులు నెన్నిచూడ నివి నీపంచాక్షరీమంత్ర భా
వములై యుండు సమస్తలక్షణముల న్వర్ణింప సర్వేశ్వరా. 135

శా. సంకీర్ణాకలితాక్షరత్రయము భాస్వన్నాదబిందు క్రమా
లంకారద్వి[3]తయంబుతోఁ గలసి లీలన్ దివ్యయోగీంద్రహృ
త్పంకోద్భూతము[4]లందు రూఢమగుచుం బంచాక్షరీమంత్ర మ
య్యోంకారాత్మక మా లసన్నిగమం బూహింప సర్వేశ్వరా. 136

మ. అమలజ్ఞానవిభాసభాసురత నయ్యష్టాంగపూజావిధి
క్రమయోగంబుల నిన్ను నెల్లపుడు జోకం గొల్వఁ[5]గా నేల ని
శ్చయము నీభక్తులగోష్ఠి చాలుఁ గడువీఁకన్ ఘోరసంసారదుః
ఖము లెల్లం బెడవాప నిన్ను వెలయంగాఁ జూప సర్వేశ్వరా. 137

మ. [6]జయశక్తి న్రవిచంద్రతారకముగాఁ జల్పెన్ యథావాక్యలా
న్వయ సంజాతుఁడు నన్నమార్యుఁ డవని న్వర్ణించి నీసత్కథా
క్రియ సంబోధన నీదుభక్తిని మహానిర్ణీతవిశ్రాంతిగా
భయవిభ్రాంతులు లేక యీశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా. 138

---

1. ప్రబోధము (అ). 2. తదీయస్తోత్రవాణీసముద్రము లై యొప్పు సమస్తశాస్త్రములు పూర్ణశ్రేణులన్ దివ్యవి। భ్రమవాదంబులు నిశ్చయింప నవి శ్రీపంచాక్షరీమంత్ర భా। స్యములై యొప్పు సమస్తలక్షణములం జర్చింప-(అ). 3. త్రితయంబులో (అ). 4. నందు గూఢమగుఁ దత్పంచాక్షరీమంత్ర మ। య్యోంకారాక్షరమంత్రము సన్నిగమం బూహించి (అ). 5. సద్భక్తి (అ). 6. ఈ పద్య మచ్చుప్రతి లోలేదు.

# గ్రంథస్వీకారము.

## వారంగల్ ఒంటిమిట్ట వివాదము.

ఈవ్యాస మీనడుమఁ బరిషత్పత్రికాముఖమున జరగిన బమ్మెర పోతనామాత్యనివాసవిషయకవివాదమునకు సంబంధించినది. బెజవాడలో న్యాయవాదిగ నున్న బ్ర॥ పెద్దిభట్ల వీరయ్య, బి.ఏ.బి.ఎల్., గారిచే రచింపఁబడినది. తా మీవాదములో దిగుటకుఁ గారణము వీరయ్యగా రిట్లుపన్యసించిరి.

"నైజాము రాష్ట్రమువారికిని కడపవారికిని అభిప్రాయము లభిమానపూరితములు గానోపును గాని రామయ్యపంతులు, శ్రీరామమూర్తిపంతులు వంటివారి కిరుపక్షములయెడ సమానాభిమానమే యని దలంచగలను. రామయ్యపంతులుగారి వాదబల మెట్లుండినను వారియభిప్రాయ మాగ్రహరాహిత్యమనుటలో సందియములేదు. ఆంధ్రవాల్మీకియన్నను తమరామాయణగ్రంథము నొంటిమిట్ట పోతనస్థలమను దృఢనమ్మకముతో నచ్చట ప్రచురించియుండుటయు పిమ్మట కొంతకాలము గతించి తమ అభిప్రాయమునకు భంగము కలుగుటయు జూడ వార్ధక్యమున నున్న వీరి యాగ్రహము రెచ్చి యనవసరముగ తమకంటె భిన్నాభిప్రాయములు గలిగిన రామయ్యపంతులు రావుబహదరు వీరేశలింగము పంతులుగారు మొదలగు వారిని విచ్చలవిడిగ దూషించుటకు బ్రారంభించి తమవ్యాసముల నెల్ల నిందావాక్యములతోను పరిహాసోక్తులతోను నింపియున్నారు. ఈవయోవృద్ధు లట్టి కృద్ధులుగానిచో నేనీవ్యాస రచనకుఁ బూనుకొని యుండెడివాడను గాను. వారివ్యాసములు నాకు కర్ణకఠోరముగ నుండుటయు నందలి పర్యవసానము నాఅభిప్రాయమునకు వ్యతిరేకముగనుండుటయు నేను కవులకయ్యములో బ్రవేశింప శక్తిజాలనివాడ నైనను నేనీరచనకు బ్రేరింపబడినాడను."

పోతన బమ్మెరనివాసియనియు భాగవతము వారంగలులో వ్రాయఁబడిన దనియు నిర్ణయించి యాసిద్ధాంతమున కాధారముగా, నిదివఱలోఁ జెప్పఁబడిన విషయములు కాక మఱికొన్ని నూతనాంశముల నుదాహరించిరి. ఈ క్రొత్త విషయములం గుఱించి వారు వ్రాసినమాటలు కొన్ని యీక్రిందఁ బొందు పఱిచెదము.

"1350 సంవత్సరం ప్రాంతమున దేశముయొక్క చరిత్రమును భూగోళవైఖరిని కవులతోను వారినివాసస్థలములతో సంబంధించినంతవరకు బోల్చిచూచినయెడల మన వాది ప్రతివాదులవాదములను సులభముగ గ్రహించుటకు వీలుగలదు.

ఆకాలమున దక్షిణహిందూస్థానమును పాలించిన వివిధసంఘములు జాతులు వారిమతపద్ధతులు వారిదేశమునందలినెమ్మది వారి విద్యావైభమును పరిశీలించినయెడల శాస్త్రములను కళలను

ఎంతవరకు ప్రోత్సాహపరుచుటకు వారికవకాశముగలదో విశదముకాగలదు. మధురప్రధానపట్టణముగ పాలించిన పాండ్యులును కాంచీపురము ప్రధానపట్టణముగ పాలించిన చోడులును కల్యాణము ప్రధానపట్టణముగపాలించిన పశ్చిమచాళుక్యులును రాజమహేంద్రవరమును ప్రధానపట్టణముగ పరిపాలించిన తూర్పుచాళుక్యులును 1000 సంవత్సరమునాటికి దక్షిణహిందూదేశమును పరిపాలించిన ప్రభుత్వసంఘములలో ప్రధానమైనవారు. తరువాత పాండ్యులు నెల్లూరివరకు దాడిసలిపిరి. చోడులు రాజమహేంద్రవరమువరకు బోవలిగిరి. పశ్చిమచాళుక్యులు నదేవిధముగబోయిరి. కాని వీరిదండయాత్రలు దీర్ఘకాలమునిలవక కొలదికాలములలో సంతరించినవి. 12వ శతాబ్దమునాటికి చోడులు వెలనాటిచోడులు మొదలగు నామముల వ్యవహరింపబడి పరస్పరవైవాహికసంబంధ బాంధవ్యములవల్ల చాళుక్యులతో సమ్మేళనము జెందిరి. తర్వాత తెలుగుచోడులలోనుంచి కమ్మవారు రెడ్లు వెలమవారు క్షత్రియులు బయలుదేరి గోదావరి పెన్నానదులమధ్య ప్రదేశములోని వివిధ భాగములను స్వతంత్రముగను పశ్చిమచాళుక్యుల సామంత ప్రభుత్వమునకు లోబడియును పరిపాలింపదొడంగిరి. తుదకు కాకతీయాంధ్రులు ఏకశిలానగరమని ప్రసిద్ధిజెందిన వోరంగలు ముఖ్యపట్టణముగ రాజ్యమును స్థాపించి కాంచీపురమువరకుగల ప్రదేశమును జయించిరి. కాంచీపురమునందలి చోడులు కొంతవరకు కాళహస్తిలోని బాణులవల్లను దక్షిణమునుంచి పల్లవులవల్లను తొందరలుగలిగింపబడుచుండిరి. అదేవిధముగా కాకతీయులకు కాళింగులును, బస్తరురాజ్యములోని నాగులును తొందరల గలిగించుచుండిరి. చోడులు తమపూర్వులు కాలచుర్యులనియు వారిలోనొక్కరగు కరికాలచోడుడు కావేరిమీద సుప్రసిద్ధమైన ఆనకట్టను గట్టించెననియు దెలియజేయుచున్నారు. కోసలప్రాంతము అనగా కర్ణాటరాష్ట్రమునుంచివచ్చిన హైహాయు లనుతెగవారు పల్నాడున ప్రవేశించిరి. రాష్ట్రకూటులనువారు 500 మొదలు 1000 వరకు వోరంగల్ ప్రదేశములోనున్నవారు. దక్షిణమున భల్లాణులు కల్యాణములోని కర్ణాటులకు 1100 సంవత్సరమువరకు తొందర గలిగించుచుండిరి. కర్నాటిచోడులు 1162 వరకు సప్తర్షిప్రాంతదేశము నాక్రమించుకొనియుండిరి. చాళుక్యులలో నొకతెగవారగు యాదవులు దక్షిణఆర్కాడు చెంగల్పట్టు చిత్తూరుమండలములలో 1250 వరకు నుండిరి. కాంచీపురమున చోడులప్రభ 1290 తో నశుగంటినది. పశ్చిమ చాళుక్యులు 1120లో వేగిదేశమును జయించి తిరిగి 1182లో తమదేశము చేరిరి. 400 మొదలు 1050 వరకు సామాన్యముగ వోరంగల్ ప్రదేశమంతయు వారి స్వాధీనములోనే యున్నది. ఇంద్రావతీనదికి దక్షిణమున నాగులప్రభ 1030 మొదలు 1325 వరకు సాగినది. ఒకప్పుడు వారు వేంగిదేశమునకు వచ్చియుండిరి. 1243 మొదలు 1276 మధ్యకాలమున పల్లవులు కర్నూలువరకును ద్రాక్షారామమువరకును దండయాత్రలు సలిపిరి. ఆకాలమున కమ్మవారికి ముఖ్యపట్టణములు కొణిదెవ, కంభం మెట్టు ; రెడ్లకు కొండ వీడును, వెలమవారికి పిఠాపురం, వెంకటగిరియును, క్షత్రియులకు గుడిమెట్టయును ముఖ్యపట్టణములుగ నుండెను

పూర్వకాలమున దక్షిణహిందూదేశ మనేకనాడులుగను, సీమలుగను విభజింపబడినది. ఆనాడులను పరిపాలించిన జాతులవారలెల్లను సీమలను పాలించుటకు తమకు లోబడినవారిని నియమించుచుండిరి. మిక్కిలి దక్షిణమునవున్న అరవదేశములోని నాడులు అనగా పాగూరునాడు, తొండనాడు, సోనాడు, పాండినాడు, వలనాడు, ఐనాడు, తుయ్యినాడు, పుదుప్పాకనాడు, వెంగలనాడు, తడిగనాడు, మొదలగు నాడులవివరమును వదిలి కేవల మాంధ్రనాడుల వివరమును పరిశీలించవగును. మొదట కడపజిల్లాలో ప్రారంభించి మైసూరురాష్ట్రములో చాలవరకు వ్యాపించిన ములి

కినాడు గలదు. పిమ్మట చెంగల్పట్టు ఉత్తర ఆర్కాడుజిల్లాలలోచేరిన మండనాడును, దత్తమండల ములలోని సకిలినాడు ఏరువనాడును గలవు. తర్వాత కడప మండలమునుంచి యుత్తరమున పొత్తపి నాడును పెన్నానది వెంబడి పూగినాడును గలవు. కర్నూలుజిల్లాలో రేనాడు మానాడులును గుంటూరు జిల్లాకు పశ్చిమమున పల్నాడును గలవు. ప్రాక్నాటని వాడుకజెందు పాకనాడు నెల్లూరు నుంచి కృష్ణవరకు సముద్రతీర ప్రాంతమునకు వర్తించుచున్నది. కృష్ణాగోదావరులమధ్య వేగినాడున్నది. గుంటూరుజిల్లాలో కొణిదెనప్రాంతమున ప్రారంభించి కమ్మనాడు కమ్మమెట్టువరకు వ్యాపించియుండెను. తెలుగునాడునకు రాజమహేంద్రవరము ముఖ్యపట్టణము. అరువేలనాడనిపిలువబడు వెలనాటికి నెల్లూరు ముఖ్యపట్టణముగ నుండెను. కన్నడదేశమున కోసలనాడనియు, బస్తరురాజ్యమున వడ్డెనాడనియు గలవు. కోనసీమ పేరూరునాడులో చేరినది. కొండవీటిసీమ, అద్దంకి, పొదిలిసీమలును కమ్మనాటిలో చేరినవి. కొన్నిచోట్ల నాడులే రాష్ట్రము లనబడుచున్నవి. నైజాంరాజ్యమున నతవాటిరాష్ట్రము, సబ్బినాటి రాష్ట్రము లనియున్నవి. ఈ రెండును వారంగల్ దేశములో జేరినవి. నతవాటిసీమనే శ్రీనాథవాటి సీమ యని పిలిచెదరు. కడపమండలములోని పొత్తపినాటిలో జేరినదే మనయొంటిమిట్ట. ఏకశిలా నగరమనబడు వారంగలు నతవాటిరాష్ట్రములోనిదై యున్నది. నల్లగొండసీమలోని పానగల్లు మొదలు కడపమండలములోని ఏల్లూరువరకు గల రాష్ట్రమును మార్జవాటిరాష్ట్రమందురు. కళ్యాణమునకు సమీపముననున్న కన్నడదేశమును కుంతలదేశమనుచున్నారు. ఇప్పుడు మనము 1000 మొదలు 1400 వరకు పొత్తపి నతవాటి ప్రదేశములను పరిపాలించిన రాజుల చరిత్రను తెలిసికొనిన వారినాగరికతయెట్టిదో, కవిత్వములో వారికెట్టి ప్రవేశముగలదో, కవులకు సాహిత్యమునకు వారెట్టి ప్రోత్సాహముసంగిరో విశదము కాగలదు.

1000 వ సంవత్సరమునాటివరకు కడపమండలములో నుత్తరభాగము నిర్జనభూమిగ విశేషముగ దేవాలయములుగాని అగ్రహారములు గాని లేనిస్థితిలో నుండిన సంగతిని ముఖ్యముగ జ్ఞాపకముంచుకొనవలెను. ఆప్రదేశము దండకారణ్యభాగమై శ్రీశైలము మహానంది ప్రదేశములకాగ్నేయముగ నుండినది. 15 వ శతాబ్దము పిమ్మట పెన్నకు దక్షిణమున గొప్ప కవీశ్వరులుండుటకును 1450 తర్వాత పెన్నవదికి నుత్తరమున పేరుగల కవీశ్వరులు లేకుండుటకు గల కారణములనికమీదవివరించెదను. గనుక ఒక కవీశ్వరునిగురించి మనము ఆలోచన చేయునెడ అతని నివాసస్థలముయొక్క నాగరికత యెట్టిదో, అతనితోడి కవులెవ్వరో, వారి స్థితిగతులెట్టివో, చరిత్రప్రకారము వారికి భాషాభివృద్ధికిగల సాధన సంపత్తి యనుకూల ప్రతికూలము లెట్టివో, దేశ కాలపాత్రలంబట్టినిర్ధారణజేయుట మనకు ప్రథమవిధియై యున్నది.

చరిత్రవల్ల జనులలో చలనమెప్పుడును రాజుయొక్క ముఖ్యపట్టముపైపునకే యనిస్థిరపడుచున్నది. రాచవీటు లెప్పుడును విద్యానిలయములుగను, కళాస్థానములుగనుండును. సంగీతసాహిత్యము లెక్కాలముననను రాజపోషణవల్లనే యభివృద్ధికి రాగలిగినవి. ఇందుకు నిదర్శనముగ కులోత్తుంగ రాజరాజుల కాలమున రాజమహేంద్రవరమును, అనవేమ, అనపోతలకాలమున కొండవీడును, మనుమసిద్ధి కాలమున నెల్లూరును, గణపతి, రుద్రమ, ప్రతాపరుద్రులకాలమున వారంగలును కవులకును సాహిత్యమునకు గలిగించిన యాదరణను పరిశీలింపనగును. ఇదిగాక దేశనాగరికతలో మధ్యమకాలము కవిత్వనైపుణి కనువైనదై యూహకెక్కువ అవకాశమునిచ్చును. పైకన

పరచిన ముఖ్యపట్టణము లుచ్ఛ్రితియందుండ పేదలును, విద్వాంసులు నట్టిపట్టణములను జేరియుం డుట సహజమై యున్నది. ఆ కాలమునందలి కవులెచ్చటజన్మించినను, వారియొక్క కాలమును రాజులయొక్క ముఖ్యపట్టణముల వద్దనే గడపినట్టుల గన్పట్టుచున్నది పైజెర్కొనబడిన రాజు లే కాలమునబాలించిరో దెలిసికొనిన వారికి మతమునుగురించి, కవిత్వమును గురించి గల యభిమాన మును దెలిసికొనగలము. శ్రీనాథుడు రాజమహేంద్రవరము, కొండవీడుల కాలముగడిపినను, అనేక రాజస్థానములను జూచియున్నవాడు. పోతనమాత్రము ఒంటిమిట్టవాడైన కావలెను, వార్రంగలు వాడైన కావలెను గాని ఆయనకు దేశాటనము విధించుట కాధారములు లేవు. 1000 మొదలు 1400 లోగా పొత్తపినాటిని పాలించిన యుత్తమరాజులెవ్వరును లేరు. ఆకాలమున కవుల కయ్యెడ ప్రోత్సాహము గలిగినదనుటకు దగిననిదర్శనము లేదు. ఈ ఒంటిమిట్ట విజయనగర రాజ్యము ధ్వంసమైన చాలకాలమునకు మల్లిరాజులపాలనకు లోబడి కొంతప్రాశస్త్యము వహించి నది. అప్పుడు ఒంటిమిట్టలో కొందరు కవులు బయలుదేరిరి. 1320 లో వార్రంగల్ రాజ్యము మహమ్మదీయులు నిర్మూలముచేయ అచ్చటి కోశాగారులైన హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగర ప్రాంతమునకుం జని రాజ్యస్థాపనగావించిరి. వారు కవులను విద్వాంసులను ప్రోత్సాహ పరచిరి. అప్పుడే విద్యారణ్యులవారు సాయనమాధవాచార్యులవారు భాష్య గ్రంథములను వ్రాసిరి. రాజావలంబనమైన మతము ననుసరించి గ్రంథములు వ్రాయబడుచుండెను.

700 సంవత్సరము వరకు జైనులును, బౌద్ధులును జనులమనస్సుల నాకర్షించుచుండ శ్రీశంక రాచార్యులవారు వారి సిద్ధాంతములను ఖండించిరి. వెంటనే 1000 సంవత్సరమునాటికి బసవేశ్వ రుని శైవసిద్ధాంతములును శ్రీరామానుజాచార్యులవారి వైష్ణవ సిద్ధాంతములును బయలుదేరినవి. వీరి వెంట నడిపి మధ్వాచార్యులవారు ద్వైతమత సిద్ధాంతమును ప్రతిపాదించిరి. ఈమతకర్తలంద రును రాజులను తమ వశముజేసికొని తమ మతములను దేశమున విస్తరిల్లజేసిరి. ఈమతకర్తలే వేద ములకు మహాభాష్యములను రచియించియున్నవారు. మధ్వాచార్యులవారి పిమ్మట మూడుశతాబ్దముల లోను భాష్యకర్తలుండిరి. 1000 మొదలు 1400 వరకుగల తెనుగు గ్రంథము లనేకములు సంస్కృత మునందలి మతగ్రంథముల భాషాంతరీకరణములో వానిననుసరించి వ్రాయబడినవో యైయున్నవి. అందు వల్ల 1000 మొదలు 1400 లోగా అనేకపురాణములను సుప్రసిద్ధాంధ్రకవులు పద్య కావ్యములుగ రచి యించుట సంభవించినది. ఆకవీశ్వరులందరు పెన్నకును గోదావరికిని మధ్యనున్నవారలైయుండిరి. ఇప్పుడు మన పోతన శ్రీనాథుడు కొన్ని పురాణములను భాషాంతరీకరణము జేసినవారలే. శ్రీనాథు డేరాజునకో మంత్రికో కృతినిచ్చి గ్రంథములువ్రాయ పోతనామాత్యుడు ప్రాపంచిక సౌఖ్యముల నాశింపక రాజాదరణను తృణీకరించి భాగవతమును శ్రీరాములవారి కంకితముజేసిన మహానుభావుడు. ఇటులనే తనవార్ధక్యమున నెర్రాప్రగడ నారసింహపురాణమును అహోబలస్వామి కంకితముజేసెను. ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రను ద్రాక్షారామ భీమేశ్వరున కంకితముజేసెను. అప్పటి కాలమున రాజులు మతావేశముచేత అన్యమతసహనము లేనివారై మతాంతరులను బెక్కువిధముల బాధించు చుండిరి. కవులన్ననో రాజుమతిగని రాజుమతమున కనుకూలముగ గావ్యముల వ్రాయుచు ఆరాజు లను వారిమతములను అనేకవిధముల బొగడుచు జీవయాత్రలు సలుపుచుండెడివారు. కాని పోతనా మాత్యుడిట్టి దూషణభూషణముల లక్ష్యముజేయక తనబుద్ధికి తోచినరీతిని మతసహనము గలిగి గ్రంథ రచనజేసిన మహనీయుడు. ఇట్టిలోకాగ్రగణ్యుని మావాడుమావాడని వార్రంగలువారును, కడప

వారును వాదమునకుదిగినారు. ఇట్టిసమస్యను నిర్ధారణజేయుట జనసామాన్యమునకు, ముఖ్యముగ నాంధ్రులకు నవసరమైయున్నది.

పదియవ శతాబ్దము వరకు నాంధ్రభాషలోని లిపికి స్థైర్యము కుదిరి యుండలేదు. ఈభాషలో నాగరకర్ణాట మిశ్రమము గలదు. కర్నాటమును పరిపాలించిన పశ్చిమచాళుక్యులు చాలకాలము తూర్పు చాళుక్యులకును చోడులకును సామంత ప్రభువులుగ నుండిరి. పదియవ శతాబ్దమునకు బూర్వపుశాసనములను దెలిసికొనుట మనకుచాల కష్టముగానుండును. పదియవశతాబ్దానంతరము లిపిలో నక్షరములందు స్థిరమైన మార్పులు గలిగినవి. వ్రాతసౌకర్య మేర్పడినంతగనే తెనుగుకవిత్వము నందభివృద్ధిగన్పడుటకు ప్రారంభ మయ్యెను. పెన్నానదికి నుత్తరభాగమునయున్న ప్రదేశములలో నాకాలపునాగరికత యెట్టులుండినను పొత్తపినాటిలో నక్కాలంబున మాత్రమప్పుడే గ్రామము లేర్పడి యరణ్యములు జనపదములుగా మారుస్థితిలోనుండి నాగరికతను నోచుకొనియుండలేదు దత్తమండలములందు మధ్యమనాగరికత కాలము విజయనగర సామ్రాజ్యకాల మని నిశ్చయింప నగును. పెన్నకు నుత్తరమున నంతకు రెండు శతాబ్దములకు పూర్వమే యట్టినాగరికత గలదు. 1000 మొదలు 1400 వరకు పెన్నకు నుత్తర భాగమున గల విశేషశాసనములంబట్టియు పెన్నకు దక్షిణమున దేవాలయములు అగ్రహారములు దత్తమండలములలో నాకాలమున లేనందునను 1300 నాటికి కడప మండలమనాగరికత స్థితిలో నున్నదనుటలో సందియములేదు. కడపమండలములో ప్రస్తుత మనవివాదములోచేరిన పోతనామాత్యుడు భాగవతము దక్క మఱియొక్క కవీశ్వరునిపేరు గాని గ్రంథముపేరు గాని 1000 మొదలు 1400 మధ్యకాలమున నుండినటులలేనందున నక్కాలంబున నచటపేరెన్నికగన్న రాజులు పరిపాలించలేదనియు నందువల్ల నచటకు గవులాకర్షింపబడుటగాని యట కవిత్వంబభివృద్ధిగాంచుటకుగాని జరుగలేదని యననచ్చును. ఇంతకును కడపప్రాంత మాకాలములో ననాగరికత దశయందే యున్నది. చారిత్రక దృష్టాంతములవల్ల 1000 మొదలు 1400 మధ్య జనుల చలన పథము దక్షిణమునుండి యుత్తరమునకే యుండినటుల స్పష్టపడుచున్నది. ఇందుకుభిన్నముగ 15, 16 శతాబ్దములలో విజయనగర సామ్రాజ్యమేర్పడినపిమ్మట అనేకమంది కవులు దక్షిణమునకు బోయినటుల గలదు. ఆమహాసామ్రాజ్యమత్యంతవైభవములో నున్నకాలమందు దన్నివైపులనుండి కవుల నాకర్షింపగలిగెను. తెనాలి రామలింగము మొదలగు కవులు ప్రాక్కాటినివాసులైనను విజయనగరము జేరుటకుగల కారణంబు మనకు దెలియును. మఱియొక విచిత్రము గనుడు. కొండవీడు వారంగలు రాజ్యములంతరించిన పిమ్మట పెన్నకునుత్తరమున ప్రసిద్ధకవుల నామములు వినబడకుండుటయు 1450_1600 వరకు గల సుప్రసిద్ధకవులందరు విజయనగర ప్రాంతమునందే యున్నవారని స్థిరపడుటయు జూడ 1450 సంవత్సరమునకు బూర్వము సుప్రసిద్ధకవు లందరును కొండవీడు వారంగలు నెల్లూరు రాజమహేంద్రవరము ప్రాంతములలోనుండినటుల నిశ్చయింపనగును. అనంతామాత్య కవియొక్క తండ్రి కృష్ణాజిల్లా శ్రీకాకుళములో నుండినటులను అతనితాత నెల్లూరిలోనుండినటులను తెలియుచున్నది. ఇందువలన కవులచలన పథమును నిర్ధారణజేయనగును.

ఒక దేశముయొక్క మధ్యమనాగరికతకాల మెందుకు కవిత్వాభివృద్ధికి సహకారియగుచున్నదో ప్రస్తుతము చర్చించుట యనవసరము. కాని ఐరోపాఖండములోని యాంగ్లదేశమునందేమి యితరదేశములందేమి యిట్టిస్థితేగలదు. హోమరు వర్జిలు షేక్సుపియరు మొదలగు పాశ్చాత్య కవీంద్రు లట్టిస్థితియందుగ నుండిరి. ఈ శతాబ్దమున షేక్సుపియరు పోతన తిక్కనలవంటి కవీశ్వ

రులు గలుగుట దుస్సాధ్యము. నాగరికత హెచ్చినకొలది కల్పనాశక్తి నశించుట సహజము. నేబూనిన వాదములో సాధ్యమైనంతవరకు యుక్తిలేని పురాణగాథలను చాటుపద్యములను చర్చకు దెచ్చుటలేదు. అట్టివి విశ్వసనీయములుగావు. ఒకప్పుడు వానిలో గొంతనిజము గనబడవచ్చును. కాని సాధారణముగా నట్టిగాథలు కల్లలకు పుట్టినిండ్లుగా నుండును. ఇప్పుడు మనము దక్షిణహిందూదేశముయొక్క పటమును చిత్రించినయెడల 1000 మొదలు 1400 వరకుగల తెనుగుకవుల జన్మస్థానములును వారికవిత్వనిలయములును పెన్నకు నుత్తరముగను వారంగల్ గోదావరులకు దక్షిణముగను దగ్గిర దగ్గిర ప్రదేశములందు ముఖ్యకవులందఱుండినట్లు మనకు గోచరముకాగలదు. ఒంటిమిట్ట మాత్రము నొంటరిగ దూరమున విసిరివేసినట్లుండును. ఆకాలంబున పొత్తపినాటిలో కవులులేరనిగాని కవిత్వమున కాదరణలేదనిగాని నిర్ధారణజేయుట కొంతకష్టసాధ్యమైనను ఇదివరకు దెలియజేయబడిన సంగతులవల్లనే పొత్తపినాటిస్థితి విశదపడినది. కవుల పేర్లలోగాని వారిపూర్వుల పేర్లలోగాని గల పోలికలును కవిత్వములందుగల అన్యోన్యసంబంధములును కవులు సమకాలీనులై యొండొరులకవిత్వమును జూచియుండుట కవకాశము గలిగిన వారని దోచినప్పుడు వారు నివసించినతావు లొకదానికొకటి దగ్గిరనుండుననియు నెవ్విధముగ జూచిన నొకరు పెన్నకు దక్షిణమున నుండి రెండవవారు గోదావరి తీరమునుండుట యసంభవమని నొక్కివక్కాణింపనగును.”

* * * * *

“పై రెండు పక్షములవారి వాదములను పరిశీలించుటకు పూర్వము 1000 మొదలు 1400 వరకు దత్తమండలములయొక్క చారిత్రకస్థితి యెట్టిదో కనుగొనుటకు బ్రయత్నించుచున్నాను. పిమ్మట అయ్యలరాజు రామభద్రకవిని గురించి వివరించెదను. ఒంటిమిట్టగ్రామము పొత్తపినాడునకు జెందినదని విశదపరచియున్నాను. 1100 సంవత్సరములో కులోత్తుంగ చోడుని కాలమువరకు దత్తమండలములు దండకారణ్య భాగములై నిర్మానుష్యముగ నుండెను. పొత్తపినాటికి కొంతకాలము నందలూరు ముఖ్యపట్టణముగ నుండెను. మొట్టమొదట ఆకాలమున అరవలైన పల్లవులు దత్తమండలములను పాలించిరి. వారి రాజులలో నొక్కరగు నందివర్మరాజు 1102 లో ప్రొద్దుటూరులో రాజ్యము జేసెను. ఆయన రాజ్యము ఉత్తరమున పూగినాటివరకు వ్యాపించియుండెను. సిద్ధనదేవ యమరాజు 1182 వరకును అభిదేవ మలిదేవ 1218 వరకును ఇమ్మడిదేవ 1268 వరకును మహారాజసింహ 1279 వరకును పాలించిరి. అంతట పల్లవుల ప్రభ యంతరించి చాళుక్యులు రాజ్యమునకు వచ్చిరి. తుదకు కాకతీయాంధ్రులు రాజ్యముజేసిరి. సిద్ధవటము పొత్తపినాడుల గంగయదేవ మహారాజు గణపతిదేవరాజు కాలమున పరిపాలించెను. అతడు కాయస్థుడు. ప్రతాపరుద్రుడు పొత్తపినాటిని జయించి 1313 లో దానిని ములికినాటిని గండికోటసీమను గొంకారెడ్డియొక్క ప్రభుత్వమునకు లోబరిచెను. పుష్పగిరి మఠాధిపతులైన శివయోగీంద్రులను గణపతిదేవ మహారాజు గురువుగా జేకొనెను. గంగయసాహిణి కడపకు సమీపమునున్న వల్లూరు ముఖ్యపట్టణముగ జేసికొనెను. 1247 సంవత్సరమువరకు గంగయసాహిణి తిక్కరాజునకు లోబడియుండి పిమ్మట గణపతిదేవునకు లోబడెను. చిట్టివేల్ సంస్థానాధీశులైన మట్లిరాజులు కృష్ణదేవరాయులకు పిమ్మట ప్రాముఖ్యత జెంది యభివృద్ధికి వచ్చిరి. పదునాలుగవ శతాబ్దాంతమున వారంగలు రాజ్యధ్వంసమైన తర్వాత హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగరమునకు జేరి యచ్చట రాజ్యమును స్థాపించిరి.

1300 కు పూర్వము దత్తమండలములను బాలించిన పల్లవులు గాని మఱియితరులుగాని తగినంత సావకాశము నెమ్మదిగలిగి సాహిత్యాభివృద్ధికి సహకారులుగ నుండుటకుగాని యక్కాలంబున నచ్చట కవులుండినటులగాని గ్రంథములు రచియింప బడినటులగాని యెట్టినిదర్శనములు గానబడుటలేదు. హరిహరరాయలు వచ్చినప్పుడు ఆయన కవులను విద్వాంసుల ప్రోత్సాహపరచి యాదరించెను. శ్రీవిద్యారణ్యస్వాములవారు ఆయనకు మంత్రియు సుప్రసిద్ధుడైన భాష్యకర్తయునై యుండెను. శ్రీశాయన మాధవాచార్యులవారు వేదభాష్యమును బుక్కరాయలుకంకితము చేసెను. బుక్కరాయలు తెనుంగు కవిత్వమును పెన్నకు దక్షిణమున ప్రోత్సాహపరచిన వారిలో ప్రథములని జెప్పవచ్చును. 1360 ప్రాంతమునయున్న నాచన సోమనకవిని బుక్కరాయలే యాదరించెను. పొత్తపినాటికి ప్రథమకవియనందగిన అయ్యలరాజు రామభద్రుని గూర్చి వేఱుగవివరింపనగును. ఆయన సహితము 1600 ప్రాంతమున జీవించియుండెను. భాగవతమును ద్విపదకావ్యముగ రచించిన తరిగొండ వెంగమాంబ ఇటీవల 1840 లో నుండిన విదుషీమణి. అటువలెనే కకుత్స్థవిజయమును రచించిన నుట్లి అనంత భూపాలుడేమి, రామరాజ భూషణుడు, భట్టుమూర్తి, పెద్దన, వేమన, చౌడప్ప, జగన్నాథ, మల్లినాథ మొదలగు దత్తమండల కవిశ్రేష్ఠులు 15 వ శతాబ్దము తర్వాతనుండిన వారని గమనించవలసియున్నది."

* * * * *

"ఇక అయ్యలరాజు రామభద్రకవినిగురించి యించుకవిచారింపనగును. ఈకవి 1600 సంవత్సర ప్రాంతమున పొత్తపినాటిలో నొంటి మిట్టలో నుండినవాడు. అనగా పోతనకు 200 సంవత్సరముల తర్వాత నున్నవాడు. ఈకవి చరిత్రలో కొన్నిచిత్రములు మనకు దోచగలవు. ఒంటిమిట్టనివాసి యగుటయేగాక యీకవి కౌండిన్యసగోత్రోద్భవుండు. ఒంటిమిట్టలోగల దేవుని వీరరాఘవస్వామి యని యిక్కవి వర్ణించియున్నాడు. రామాభ్యుదయమునకు పూర్వము ఒంటిమిట్టరఘువీర శతకమను గ్రంథమొకటి యచ్చట ప్రచురింపబడియుండెను. ఈకవి యింటిపేరు అయ్యలరాజువారు. అయ్యలరాజు అనునది యొకమనుజునిపేరు. ఆ అయ్యలరాజు ఉత్తరమునుంచి దక్షిణమునకు వచ్చినవాడా లేక దత్తమండల నివాసియా యనునంశము ముందుగా నాలోచనచేయదగియున్నది. హరిహరరాయలు కాలమునుంచి ముఖ్యముగ కృష్ణదేవరాయలు కాలములో అనేకమందికవులు ఉత్తరము నుండి దక్షిణమునకు వచ్చియుండిరి. వారిలో తెనాలి రామలింగం పింగళిసూరన మొదలగు కవివరేణ్యులు గలరు. ఇప్పుడు మడికి సింగన తండ్రిపేరు అయ్యలమంత్రి అని తెలియునుగదా. పోతన పూర్వీకులలో నయ్యలు ప్రగ్గడ గలడు. భాస్కరాచార్యుని శిష్యుడైన అయ్యలభట్టారకుడు రామాయణము నాంధ్రీకరించెను. 1350లో వేదగిరినాయునింగారివద్ద అయ్యలార్యుడను కవియుండినటుల తెలియుచున్నది. అట్టి అయ్యలరాజులలో నొక్కడు దక్షిణాపథంబున కరిగియుండవచ్చును. రామభద్రకవి తన గురువు పరవస్తు ముమ్మిడి వరదాచార్యులు అని వ్రాసియున్నాడు. ఇంతకు పూర్వము ముమ్మిడియనుపదము గోదావరియందెక్కువ వ్యాప్తిగలిగినదని విశదపరిచియుంటిని. ఇంతియేకాక పరవస్తు అనుపదముకూడ గోదావరిజిల్లాలో సామాన్యమైన వాడుకలోనున్నది. రామభద్రకవి పూర్వులలో తిప్పయ యనువారు గలరు. అయ్యలమంత్రి పూర్వీకులలో తిప్పయయుండినట్లిదివరకు తెలియపరచి యున్నాను. అయ్యలమంత్రి గోత్రము వేరు. శ్రీనాథుని దౌహిత్రసంతతివారు శ్రీనాథ అను యింటిపేరును గలిగియుండిరిగదా. పైసంగతుల వల్ల రామభద్రకవి పూర్వీకులుత్తరమునుండి దక్షిణమునకు వచ్చినట్లూహించుట కవకాశము గలుగుచున్నది. ఈకవియో ఆయనతండ్రియో అటుల వచ్చియుండవచ్చును. ఇటీవలికవులలో నొక్కరగు శ్రీప్తుకృష్ణమూర్తి గోదావరివాస్తవ్యుడై కాళహస్తికిబోయి యచ్చట 19వ శతాబ్దంబున గ్రంథరచన జేసియుండెను."

ఈక్రింది యెనిమిది గ్రంథములును బందరు నోబిల్ కాలేజీ ఆంధ్రపండితు లగు బ్ర. శ్రీ. కోరాడ రామచంద్ర శాస్త్రిగారిచే రచింపఁబడినవి. వారికుమారు లగు మ-రా-రా-శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిచేఁ బంపఁబడినవి వలయువారు శ్రీరామకృష్ణయ్యగారికి వ్రాసి తెప్పించుకొనవలయును.

(1) **ఘనవృత్తము**:—ఇది సంస్కృతకావ్యము, ౨౦౦ సర్గములు, కాళిదాసకృతమే ఘుసందేశమున నంత్యమగు "శ్రుత్వావార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి" యనుశ్లోకము, బీజముగాఁగొని యుత్తరకథగా నిదికల్పింపఁబడినది. ఈగ్రంథములన్నిటియందును శైలినారికేళపాకము. పండితులకుఁ దక్క సామాన్యులకు బోధపడదు కల్పనములును గవిత్వమును రసవంతముగానే యున్నవి. ఈఘనవృత్తకథనే రామచంద్రశాస్త్రిగారి గురువుగారగు కృష్ణమూర్తిశాస్త్రిగారు కూడ యక్షోల్లాస మనుపేరున నొకగ్రంథముగా రచించిరఁట. ఘనవృత్తమున కాంధ్రపద్యములను బ్ర. శ్రీ. మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు రచించినారు. అవియు దీనియందుఁ గలవు, గ్రంథము వెల రు. ౧-౮-౦.

(2) **కుమారోదయము**:—ఇది తొమ్మిదియుల్లాసముల సంస్కృత చంపూప్రబంధము. కథ కుమారసంభవములోనిది. పూర్వభాగము 9 ఉల్లాసములు. ఉత్తరభాగము మాకుఁ బంపఁబడలేదు. దీనిలోఁ గథ కామదహనానంతరము విలపించుచున్న రతిని సమాశ్వాసపఱుచుటతో ముగిసినది. వెల ౧-౦-౦.

(3) **దేవీవిజయము**:—ఇదియు సంస్కృతచంపువే. శ్రీదేవీసప్తశతిలోని కథలన్నియు నొకటిగాఁ జేర్చి యిది రచింపఁబడిన దని తోఁచుచున్నది. దీనియందు భాగములకు చరితము లని పేరుంపఁబడినది. ఇందు మూఁడుచరితములు గలవు. వెల ౦ ౮-౦.

(4) **శృంగారసుధార్ణవము**:—సంస్కృతభాణము, ఇది రూపకభేదములలో నొకటి. దీనియందును బై గ్రంథములందునుగూడ శబ్దాలంకారము లగునసుప్రాసయమకాదు లతిమాత్రముగా నుపయోగింపఁబడినవి. వెల ౦-౮-౦.

(5) **ఉపమావళీ**:—దీనియందుపమాలంకారములుగల ౩౬౦ ఆర్యావృత్తములున్నవి. రెండుభాగములు. మొదటిదానియందు "తారుణ్యోత్తపవిభాతి తనుశోభా" యనుమకుటముగల శ్లోకములున్నవి. ఈవాక్యార్థమునకే యన్నిశ్లోకములందు నుపమానములు చూపఁబడినవి. ద్వితీయార్థమునందు "కృత్యకృత్యవలగ్నా మయి తరుణి మన్మః" అనుమకుటమునఁ దానియుపమానములు నున్నవి. చిన్నపుస్తకము, చమత్కారము గానే యున్నది.

(6) **మంజరీమధుకరీయము**:—ఇది నాటిక, నాలుగంకములు, ఆంధ్రభాషలో రచింపఁబడినది. అంకములు నాలుగైనను గ్రంథము 237 పుటలు పట్టినది. కథ స్వకపోలకల్పితము. ఇదియుఁ బైవానివలెఁ బండితైకవేద్యమే, వెల ౧-౮-౦.

(7) **రథాంగదూతము**:—ఇది యాంధ్రవచనకావ్యము, ఇం దిద్దఱు దంపతుల వనవిహారము వియోగమును మరలసంయోగమును వర్ణింపఁబడినవి. శృంగారరసము ప్రధానముగా నున్నది. లోకాచారము లక్కడక్కడ నసుగుణములుగఁ జొన్పంబడి యింపుగా నున్నది. శైలి సంస్కృతగ్రంథములకుఁ దీసిపోదు. వెల ౦-౪-౦.

(8) **ఉన్మత్తరాఘవము**:—ఇది సంస్కృతమున భాస్కరకవిచే రచింపఁబడిన ప్రేక్షణికంబునకు నాంధ్రీకరణంబు. ఒకకాలమున సీతారాములు వనవిహారము సల్పుచుండ దుర్వాసునిచే శపింపఁబడిన యడవిలోఁ బూలఁగోసి సీత లేఁడియగుటయు రాముఁడు సీతావియోగమున విలపించుటయుఁ బిదప శాపవిముక్త యగుసీతం దోడ్కొనివచ్చి యగస్తి రామున కాదేవి నిచ్చుటయు నిందలి కథ. వెల ౦-౫-౦.

—అజితప్రతాపవృత్తము.—

సజసాగణావలిఁ బ్రసన్నసభా, గ్రగజరపంక్తి నభిరామరూపమై
యజితప్రతాపచెలువారుఁగృతి, న్విజయవిక్రమణ విశ్వభూవరా.

గీ. [1]వలయుఛందంబుపాదంబుఁ దొలుత నిలిపి
యోలఛందంబుపాదంబు నోల నిలిపి
యోలి నెడవెట్టి యీగతి నొనరఁ జెప్ప
వెసఁ బరస్థానసమకార్ధవృత్త మయ్యె.

—అందు మనోహరవృత్తము.[2]—

చాళుక్యనృపాల తజావములం, గలయన్ససాపరికల్పితమై
మేలొప్పఁగఁ జెప్పిన మేదినిలో, విలసిల్లు మనోహరవృత్త మనన్.

—కోమలవృత్తము.—

సలలితరీతి నజాయగణంబుల్, చళుక్యభూప జభసజస్థగస్థితిఁ
[3]మలయుచు నర్థసమర్థత చేత, న్వెలుంగఁ గోమల మనువృత్తమొప్పగున్

క. ఏకచ్ఛందోవృత్తా, నీకంబులు రెండు రెండు నిలుపుదు గిష్ట
శ్లోకార్థంబుల నోలి వి, వేకులు స్వస్థానవిషమవృత్తంబులకున్.

అదు, అంగజాస్త్రమనువృత్తము.

దానబలేంద్రోదారభమంబుల్, ఘూని సగాప్తిం బొంపిరివోవన్
జానార న్మసజంబు గస్థితం, బై నీడంజను నంగజాస్త్రమై.

—వారాంగియనువృత్తము.—

చళుక్యవంశా జతజల్గగంబుల్, చెలంగి యర్థంబునఁ జెందిరీతిం
గ్రాలంగఁ దాయత్తజగానియుక్తిన్, మేలయ్యె వారాంగి సమీహితాఖ్యన్.

—నదీప్రఘోష మనువృత్తము—

భారరములొ్మగిఁ బ్రాగుపేతంబులై, చరించుచుండంజతజస్థరేఫలం
బరత్రిపాదంబులఁ బర్వనొప్పగం, దిరంబుగామూఁటనదీప్రఘోషమై.

క. అందముగ నుపక్రాంత, చ్ఛందఃపాదంబులోల సాగెడునికట
చ్ఛందఃపాదంబులతో, నందఁ బరస్థానవిషమ మనువృత్తమగున్

---

1. ట-తొలుతఛందంబు. 2. ట-లో నీవృత్తములేదు. 3 ట-లోనీయుత్తరార్థము రెండు పాదములు లేవు.

అందు శ్రీరమణమనువృత్తము.

ఆరభమవ్యాయత్తసగవ్యా, పారము నాదినుపాదము నెందం
జారుభభాగగసంగతిచేతన్, శ్రీరమణం బనిచెప్పిరి మూఁటన్.

—శరభక్రీడావృత్తము.—

చతుర్వర్ణాధారాయమనసరగవ్యాప్తినాద్య
ద్వితీయాంత్యాంఘ్రిప్రస్తుతగతి నతిస్పష్టమైనన్
ఖ్యాతాసక్తిన్ మభనయయ తృతీయాంఘ్రినొప్పన్
బ్రతిప్రేమోత్పత్తిం బరఁగి శరభక్రీడ యయ్యెన్.

— సర్వపరస్థానవిషమవృత్తంబులలో వీణారచనయనువృత్తము. —

చాణక్యనయజ్ఞాతయసస్థసగంబుల్, వీణారచనకొందు భువిం దనసావంబుల్
శ్రేణీందజనస్థితభసనేవిత నియతిన్, రాణాలనెలవై భస నజరంబు లోలిగన్.

క. ఛందః ప్రస్తారక్రమ, సంధృష్టంబైన వృత్తసంఘములో నొ
ప్పందము లగుపాదంబులఁ, బొందింపఁగ విషమవృత్తపుంజములడరున్.

ఇది వివిధవిషమవృత్తలక్షణము.

క. మాత్రాగణరచనలకుం, బాత్రములై నెగడి యంధ్రభాషాకవితా
మిత్రములై రసభావా, మత్రములౌ జాతులెఱుఁగ మంచిది కృతులన్.

క. అందును గందంబులు నా,నందంబులు భజసనలగగాఖ్యలచే వా
నిం దగునెఱుఁగం బ్రాసము,ముందుగనిడిమూఁడు నైదు మూఁడునైదున్.

క. అదిమవర్ణమువళి నిడు, పైదొరకినఁ గుఱుచయైన నట్టుల తత్త
త్పాదాదుల నిలుపందగు, గాదిలిగాఁ జెప్పఁదలఁచు కందంబులకున్.

క. నిడుదలగు పాదములకును, వడి నాలవగణము మొదల వలయు నిలుప న
క్కడలను గురువును మూఁడవ,యెడ నలజలలోన నొకటి నిడ బెడఁగడరున్.

క. ఇందుపురబాణనగముల, కందువ జగణంబు నిలుపఁగాఁ గా దెపుడుం
[1]గందములకు నార్యానుల, [2]చందం బధికంబు వానిఁ జనుఁ దెలియంగన్.

క. కందము నర్ధంబులతుద, నందినగురు వుడుపఁ బథ్య యగు నాఱవచోఁ
జెందిన జగణము[3]లత్వముఁ,బొందిన నది యార్యయనఁగఁబొనఁగుంగృతులన్.

క. క్రమమునఁ బథ్యార్యార్ధము, లమరంగా పీడుపడిన నది గాథాభే
దము[4]గాఁగం బరఁగు ప్రపం,చము తెనుఁగునఁజెప్పరంద్రు చతురులుకృతులన్.

---

1. ట-గందములను, 2. ట-చందములధికములు, 3. ట-లర్ధము, 4. చ-నాఁగ,

## సీసపద్యలక్షణము.

క. భావరసాలంకార, ప్రావిర్భూతాంధ్రకావ్యఫణితులకును ర
మ్యావాలము లగుసీసగ, ణావళిలక్షణము తెలుఁగనగుఁ జతురులకున్.

క. నలనగసలభరతగణం,బులు నసహంబులును ననఁగఁ బొలుపగు సీసం
బులు [1]గీతులు వానఁగదా, యలవడుఁపఁగవలయుఁ[2]గృతులకందంబరయన్.

క. [3]ఒకగురువు రెండులఘువులు, నకలంకత సమము కాన హానములు దమలో
నొకఁడొకఁడు వీడుపడుచున్, వికటింపక చెల్లు నొకట వృత్తము తక్కన్.

క. అమరంగ విషమసీసము, సమసీసము లనఁగ రెండుచందములందున్
భ్రమితమగు విషమసీస, క్రమ మెఱుఁగఁగవలయుఁ జతురకవిజనములకున్.

గీ. హగణనగణంబు లేదు గుర్వంతమగుచు, విస్తరిల్లిన నుత్సాహవృత్త మయ్యె
దీనితుద గీతియొకఁడు సంధింప విషమ, సీస మిత్తెఱఁగెఱుఁగుట[4]చెలువుమతికి.

ఉత్సాహము. ఓసరించుఁ[5]బజ్జలజ్జ లుజ్జగించు రాజులన్
వేసరించు గర్వపర్వవేషభూమిపాలురన్
వాసవానుకార వీరవర్య విశ్వభూప నీ
భాసురాసిధేనుకానుభావ మాహవంబులన్,

## విషమసీసపద్యలక్షణము.

గీ. వడి దనర్చుఁ బ్రాసవైభవం బలరార, నిట్లు గణనిరూఢి నెసకమెసఁగఁ
గీర్తితాతిమధురగీతియుఁ బైఁగల్గ, నదియ విషమసీస[6]మంద్రు కృతుల.

## సమసీసపద్యలక్షణము.

గీ. వెలయుసమసీసములుపంచవిధములయ్యె, నరయనవకలిసీసాహ్వయంబుఁబ్రాస
సీస మక్కలిప్రాససీసాఖ్యసీస,మువడిసీస మక్కలివడిసీసమును ననంగ.

క. తనపాదంబులు నాలుగు, మొనసిన పైగీతిపాదములు రెండును గా
నినుమూఁడై సీసమునకు, జను నడుగులు ప్రాలువళ్లు సరి యిన్నిటికిన్.

## అవకలి సీసము.

క. అలవడిసీసము పాదము, నలుతునుకలు చేసి మూఁట నలనామగణం
బుల రెంటిరెంటి నిడి యు, వ్వలితునుక నహంబులిడఁగవలయు న్వరుసన్.

---

1. క-చ-ట-గీదులు, 2. ట-కవుల, 3. ట-లో సీపద్యములేదు, 4. ట-చెల్లుఁగవికి, 5. చ-ట-బజ్జ, 6. ట-మనఁగఁబరఁగు.

సీ. సామంబుచేఁ దుల్యభూమీశ్వరులు దనతోడిమిత్రతకు నఱ్ఱాడుచుండ
[1]దానంబుచే నతిమానమానవనాథు లేర్పడ నక్కఱఁ దీర్చుచుండ
భేదంబుచేత దుర్మోదమహీశు లందంద[2]సంక్షిప్తత నొందుచుండ
దండంబుచేత నుద్దండమాండలికు లాజ్ఞాచక్ర మాదల మోచియుండ
శశ్వదనురక్తిఁ జాళుక్యవిశ్వవిభుఁడు, వాలి వసుమతి[3]లీలమై నేలుననుచుఁ
జెప్ప నవకలిసీస మిట్లొప్పుసండ్రు, పూని కావ్యకళావేదు లైనకవులు.

### ప్రాససీసము.

క. సీసమునకు నాలుగడుగులఁ, బ్రాసము లిడి మొదలి సర్వపదఖండములన్
భాసురముగ వళ్లలవడఁ, జేసిన నది కృతులఁ బ్రాససీసంబయ్యెన్.

సీ. చక్రవాళాచల చంద్రకాంతములకు సంతతార్ద్రత్వంబు జరపి జరపి
చక్రీశలోకసంచరదురుసంతమసంబుల వడిఁ బాఱఁ జదిపి చదిపి
శక్రేభశంకరశంకరాచలశశిచారుదీధితులపైఁ జాఁగిచాఁగి
చక్రస్తనీకుచసాంద్రచందనరసచర్చలపైఁ గేలి సలిపి సలిపి
విక్రమప్రతాపవిశ్రుతమూర్తి యై, విశ్వభూమివిభునివిశదకీర్తి
ప్రక్రమప్రసక్తిఁ బ్రసరించు నని చెప్పఁ, బ్రాససీస మనఁగఁ బరఁగు నెందు.

### అక్కిలి ప్రాససీసము.

క. తుదిగీతి నాలుగడుగులు, వదలక ప్రాసంబు నిలిపి[4]వళ్లింపారం
గదిరినఁ గదురక[5]యున్న, న్నది యక్కిలిప్రాససీస మనఁగాఁ బరఁగున్.

సీ. క్రమయుక్తి విద్యల కందువ లెఱుఁగుచుఁ గవులనే ర్పారసి గారవించి
సమరసంక్రీడనక్షమసుభటాటోపసంచారములకు నుత్సాహ[6]మూఁది
నమితాహితక్ష్మానాథులరాజ్యంబు నానాఁటి కొనర నున్నతము చేసి
ప్రముదితారాతుల భంజించి వేలుపుంబడఁతుల కింపారుపతులఁ జేసి
విమలకీర్తుల దిక్కులు విప్పనేర్చు, శమితవిమతుండు విశ్వేశచక్రవర్తి
సముచితంబుగ నని చాల సన్నుతింప, నమరు నక్కిలిప్రాససీసాహ్వయంబు.

---

1. ట-దానంబుచేత సన్మానితావనిపతుల్ చెలిమికై పలుమాఱుఁ గొలుచుచుండ, 2. చ-ట-సంక్షీణత, 3. చ-నీతిమై, 4. ట-వళ్లిప్పాటన్, 5. చ-యున్నను నది, ట-యుండిన నది, 6. ట-మొసఁగి,

### —✱ వడిసీసము. ✱—

క. [1]ఏపాదమునకు నేవడి, యాపాదింపంగఁబడియె నది ఖండములం
బ్రాపింపఁ జెప్పఁగ వళిని, రూపితసీసంబు నాఁగ రూఢికినెక్కున్.

సీ. గ్రహదంష్ట్రి పోఁకనిగ్రహరాజు ప్రియవచఃకథనంబు నేర్చినకల్పభూజ
మలరుఁదూపులు కేల నంటనికందర్పుఁ డమ్మచే నింకనియంబురాశి
కన్నులు పెక్కులు గల్గనియింద్రుండు కఱకేడి వంగనికనకనగము
తనువెత్తి క్రాలెడుధర్మదేవత రూపుఁ దాల్చినరాజవిద్యావిభూతి
నయవిదుండు రాజనారాయణుఁడు విశ్వనాథుఁ డనుచు వర్ణనములుసేయ
వరుస నిట్లు కృతుల వళిసీస[2]మన నొప్పు, వసుధ వైభవాలవాల మగుచు.

### —✱ అక్కిలివడిసీసము. ✱—

గీ. సీసఖండంబు వళ్లిట్లు [3]చెప్పి గీతి
ఖండవళి రెంటి కొక్కఁడుఁగా నొనర్ప
నదియ యక్కిలివడిసీస[4]మంద్రు కృతుల
లక్ష్యములు చూచి యెఱుఁగుఁ డీలాగు లెల్ల.

క. సీసములకు గీతులకుం, బ్రాసములును వళ్లుఁ గలయఁబడి కవితల ను
ద్భాసిల్లఁ దఱచు నియమ, వ్యాసక్తియుఁ గలుగుఁ [5]జెప్పవలసినచోటన్.

### —✱ గీతిభేదములు. ✱—

గీ. ప్రవళినాఁ బ్రసన్న[6]పదినాఁగ గీతులు, సీస[7]ములను రెండు చెందుఁ దుదల
నాటవెలఁది యనఁగఁ దేటగీతి యనంగ, వాని పేళ్లు వేఱ వలయుఁ దెలియ.

**ఆటవెలఁది :—**

మూఁడునగణహగణములు రెండునలనామ, కములుహగణపంచకంబుఁగూర్ప
నాటవెలఁది యడుగు లంబు[8]నిధులపట్ల, ప్రాలు వళ్లుఁ జెంది వఱలెనేని.

గీ. నగణమొక్కండుమఱినలనామకములు, రెండునగణంబులునుదుద రెండు[9]నాలు
గడుగులును దేటగీతికి నబ్ధివిరతి, వలయు వళ్లైన ప్రాసైన వరుస నిలుప.

---

1. ట-పాదమునకు నేవడి యా, పాదింపఁబడియె నదియ పదఖండములన్, ఆదులను జెప్పఁగావడి, రూఢితసీసంబు నాఁగ రూఢంబయ్యెన్. 2. ట-మేపారు, 3. ట-చెప్ప, 4. ట-మనఁగ, 5. ట-చేయవలసిన, 6. టావడి, 7. ట-మునకు, 8. ఆంబుధి నిధిపట్ల-మాతృక, 9 నాల్గునడుగులును

మేలనగీతి :—

[1]గలము రెండునగణములును గలసి ప్రాస మెఱయుఁ
జెలువు దోఁప నెత్తుగీతి వెలయుఁ గృతులయందు
నోలి నగణమొండె హగణమొండె నేడుచేసి
నాలుగడుగులందు నిలిపి వళులుదోఁప విరతి
వాలి పంచమస్థ యగుచు వచ్చెనేని యొప్పు
మేలనాభిధాన మైన మేలుగీతి కృతుల.

తరువోజ :—

నల నామకంబులునగణాంతములుగ నాలుగంఘ్రులయందు నాలుగుఁగూర్చి
వళులు మూఁడెడలను వరుసతో నిల్ప వలయు మూఁడవగణవర్ణంబు మొదల
నిలుపంగ నివ్విధి నిర్మించి విశ్వనృపతికి నిచ్చిన నింపుసొంపారుఁ
దలకొని తగఁ[2]బ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపుదనరుఁ దరోజ.

—✻ ఇంద్రాదిగణలక్షణము. ✻—

గీ. ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల, నైనగణము లినసురాధిపేందు
గణము లక్షరోపకరణంబు లవి యాది, లఘుగణంబు మొదల లఘువునిలుప.

| సూర్యగణములు. | ఇంద్రగణములు. | చంద్రగణములు. | |
|---|---|---|---|
| U I | I I I I | U I U U | I I U U I |
| I I I | I I I U | I I I U U | U I U I |
| | I I U I | U U I U | I I I U I |
| | U I I | I I U I U | U U I I |
| | U I U | U I I U | I I U I I |
| | U U I | I I I I U | U I I I |
| | | U U U I | I I I I I |

—✻ [3]అక్షరలక్షణము. ✻—

వ. ఇత్తెఱంగున రవీంద్రచంద్రాఖ్యగణంబులలోన సప్తగణకల్పనీయంబై మహా
క్షరంబు, షడ్గణకల్పనీయం బై మధ్యాక్షరంబును, బంచగణకల్పనీయం బై
మధురాక్షరంబును, జతుర్గణకల్పనీయంబై యంతరాక్షరంబును, ద్రిగణకల్ప

---

1. ట-నలము రెండు నగణములఁ గలసి ప్రాసంబు। చెలువుమై యెత్తుగీతివెలయు సత్కృతు లయందు। నోలినగణమొండె నేడు నాలుగడుగులందు నిలిపి। వళ్లులుదోఁప విరతివాలి, 2. చ-ట- యనల్లంపెడుచోట, 3. అక్కరమున కక్షరమని వాడెను.

నీయంబై యల్పాక్షరంబునా నక్షరవృత్తజాతంబులు పంచవిధంబులం బరఁగు నందు.

మహాక్షరం బెట్టిదనిన :—

[1]వారిజాప్తుండు పంచేంద్రగణములు వనజారియును గూడి వెలయుచుండ
నారయ రెండవనాలవచోట్ల నర్కుండయిననుం దనర్చుచుండ
గోరి యవ్వడి పంచమగణమునఁ గూడి మొదల నిలుపంగనగు
సారమై ప్రాసవడి సప్తగణములు సాగ మహాక్షర మతిశయిల్లు.

మధ్యాక్షరం బెట్లనిన :—

[2]వరుసతో దేవేంద్రసూర్యవజ్రిరవుల......
విరచించి నాలవపట్టు విశ్రాంతి సదనంబుచేసి
తరబడిఁ దప్పక చెప్పఁ దగునంద్రు మధ్యాక్షరంబు
కరవాలభైరవుపెంపు గణషట్కమున నుతియింప.

మధురాక్షరం బెట్లనిన :—

తరణివాసవత్రితయంబు ధవళభానుయుతి నొండ
నిరతి విశ్రాంతి నాలవనెలవున నింపుమీఱ
సరసమధురార్థములఁ జెప్పఁ జను మధురాక్షరంబు
వరుసఁ బంచగణములను వాలి కృతులవెలయు.

[3]అంతరాక్షర లక్షణంబెట్లనిన :—

కమలమిత్రుండుసురరాజగణయుగంబు,కమలశత్రునితోఁజెంది కందళింప
నమరుఁ బ్రావళ్లు నర్థంబునతిశయిల్ల, నమల మగునంతరాక్షర మబ్ధిసంఖ్య.

అల్పాక్షరంబెట్లనిన :—

సుమనఃపతియుగము సోముండును, నెమకంగఁ బ్రావళ్లు నిండి మీఱ.
గమనీయవిభవంబు గాంచు నెప్డు,రమణీయ మల్పాక్షరము కృతుల.

షట్పది :—

సురపతు లిరువురు సురపతు లిద్దఱు, సురపయుగమ్ముతో సోముండును
బరువడిఁ బెనఁగొన నరుదుగషట్పది, సరిఁ బ్రాసములు దనరారంగను.

---

1. టలోంవారకపంచేంద్రగణములు వనజారియును గడిది వెలయుచుండు। నాఅవ రెండవయా అవచోట్ల నర్కుండైననుదనర్చంగోరి యొప్పటిపంచమగణమునంగూడి మొదలనిలుపు। సారమైవళి సప్త గణములు......2. ఈప్రథమపాదము లుప్తముగా నున్నది. లక్ష్యమునుబట్టి ౨ ఇంద్రగణములు ౧ సూర్యగణము మరల ౨ ఇంద్రగణములు ౧ సూర్యగణము నుండవలయునని తెలియవచ్చుచున్నది. 3. ఇది గీతపద్యమునకు సరిపడును.

చౌపది :—

భసగానలములపై నిగరంబు, స్నిసఁగఁగ మూఁడవయెడ విరమంబుం
బొసఁగినఁ జౌపదిఁ బొలుచు రసంబుం, గసవరముగఁ దగుఁగద ప్రాసంబుల్.

త్రిపది :—

త్రిపదికి నొకయంఘ్రి నింద్రులు నలువురు
ద్యుపతు లిద్దఱు సూర్యు లిర్వు రౌల ద్యుపతిద్వయార్కులు నొల.

ద్విపది - మంజరి :—

శక్రత్రయంబును సవిత్రుండుఁ బాద, విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని, వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి.

—✻ షట్ప్రత్యయములు. ✻—

గీ. నచ్చుప్రస్తారసంఖ్యానష్టములును, నొలనుద్దిష్టలగకరణాఖ్యములును
ననఁగషట్ప్రత్యయములిందుఁదనరువాని, నెఱుఁగ నేర్పుట ఛందంబు నెఱుఁగు నేర్పు.

ప్రస్తారము :—

క. గురుపంక్తి నిలిపి మొదటను, గురువునకుం గ్రిందలఘువుఁగొని[1] దానిపయిన్
సరిచేసి పిఱుఁద గురులిడి, పరువడి లఘ్వంతమైనఁ బ్రస్తార మగున్.

సంఖ్యానము :—

క. గురుపంక్తి మొదల రెండిడి, వరుసను రెట్టింపఁ దుదకు వచ్చిన సంఖ్యా
పరిమాణము తచ్ఛందో, విరచితవృత్తములుగా వివేకింపఁదగున్.

నష్టము :—

గీ. అరసి వృత్తసంఖ్య నర్ధించుచో సరి, యైన లఘువు విషమ మైన గురువు
గొనుచు బేసి నొకఁడుగూడి యర్ధముసేయు, నవధి నష్టవృత్త మబ్బునంద్రు.

ఉద్దిష్టము :—

క. వలసినవృత్తగణాలి మొదల నొకటఁడు నిలిపి తుదకుఁ దగ రెట్టింపన్
గలలఘువుల[2] పై లెకలు, నొలయఁగ మఱియొకఁడుగూడ నుద్దిష్టమగున్.

లగకరణము :—

క. ఎక్కువ యొకఁడుగ వృత్తపు, టక్కరముల దొంతిపేర్చి యటమీఁదటికై
యొకొకఁడ విడిచి యెన్నిన, లెక్కలు గురులఘువిమిశ్రలిఖితగణంబుల్.

---

1. ట-యని తుదితో | పిఱుఁద గురువు లిడి సరిగా......2.ట-తుదిలెక్కల,

క. [1]ఆలెక్కలన్ని యెన్నిన, లోలత లఘువులును గురువు లును గలిగెడు వృ
త్తాలి నవి గలయఁ గూడిన, నోలిం దద్వృత్తసంఖ్యయును నొనఁగూడున్,

అధ్వప్రక్రియ :—

క. వృత్తసంఖ్యనిడుపు వెడలుపు రెట్టించి, వానినొక్కఁడొకఁడు వదన నెన్న
నెన్ని యయ్యె నన్ని యొనఁగు నంగుళు లవి, ప్రస్తరింప నిడుపు పరఁగు విప్ప.

శా. అందం బై శ్రుతిమూల మై విలసదుద్యత్సర్వలోకాశ్రయా
నందం బై సమవృత్త మై వివిధవర్ణశ్రావ్య మై సద్రస
స్యందం బై బహువిశ్రమం బయి భవచ్చారిత్రముంబోలె నీ
ఛందశ్శాస్త్రము పర్వె నుర్వరను విశ్వక్షోణిపాలాగ్రణీ.

శా. కావ్యాలంకృతికల్పనక్షమ[2]కళాకల్యాణ కల్యాణపూ
ర్ణవ్యాపారసమృద్ధ[3]యుద్ధవినమద్రాజన్య జన్యస్థల
[4]క్రవ్యాదావళిగీయమానవిజయప్రారంభ రంభాదిరం
తవ్య స్త్రీసుఖవృత్తిసుందరసపత్న స్తోత్రపాత్రోదయా.

క. నిఘ్నాఖిలశోభన వృత్రఘ్నమహత్తరవిభూతి రంజితజంఘా
దఘ్నారినవ్యజయుని, ర్విఘ్నోదయసదయవినుత విశ్వాసనిధీ.

మాలిని. స్తుతహిమకరజూటా చూర్ణితద్విట్కిరీటా
ప్రతతగుణపరీణా పంచధారాధురీణా
సితకరకులదీపా స్నిగ్ధబద్ధప్రతాపా
[5]సతతలసదభిఖ్యా సర్వలోకాశ్రయాఖ్యా.

గద్యము :—

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధ
బుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయవిరచితం బైన కావ్యా
లంకారచూడామణి యనునలంకారశాస్త్రంబునందు
ఛందోగణజన్మశుభాశుభనిరూపణవివిధవళిప్రాస
ప్రపంచలక్షణ సమవృత్తజాతికల్పన షట్ప్ర
త్యయదర్శనాదిసముద్దేశంబునం
దష్టమోల్లాసము.

---

1. ట-ఆలెక్కలెన్ని యన్నియు, 2. ట-రమా, 3. నిత్యవినమద్రాజన్య-(మూలము), 4. ట-క్ర
వ్యాద్దంపతి, 5. ట-నిశితసమరశౌర్యా విశ్వభూపాలవర్యా.

శ్రీరస్తు.

# కావ్యాలంకారచూడామణి.

## నవమోల్లాసము.

### వ్యాకరణము.

క. శ్రీవిశ్వేశ్వర విజయ, శ్రీవిశ్రమ[1]హర్మ్యబాహుశిఖర [2]బుధోక్తీ
శ్రీవిశ్వగహ్వరీస్తుత, శ్రీవిభ[?]మదాలయప్రసిద్ధవిభూతీ.

క. భవదనుమతి సూరిసుఖ,[3]ప్రవణం బయినట్టి యంధ్రబంధురరుచిమ
[4]త్కవితాస్పద మగుపలుకుల, వివరింతుం దెలియఁ బెక్కువిధములు జగతిన్.

క. యుక్తివిశేషము కబ్బం, బుక్తివిశేషంబు [5]గాదు యోగ్యం బైనన్
యుక్తివిశేషము[6]సాధ్యం, బుక్తి[7]విశేషం బసాధ్య మూహింపంగన్.

మ. విలసద్భావరసాద్యలంకృతుల చే[8]విప్పారి గీర్వాణభా
షల కబ్బంబుల కెన్నిమంచితనము ల్సంధిల్లు నాచందమై
వలియుం బ్రాసము నంత కగ్గలము లై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁ గంచుం జెవిఁబెట్టలేమి యుచుపం దేఁగల్గునే మం దిలన్.

క. ధరశ్రీపర్వతకాళే, శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం, బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్.

గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ, దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశ[9]మును నం[?]ధు కొందఱు, బ్బాసపంచగతులఁ బరఁగుచుండు.

గీ. తెలుఁగు దేశభాష తెలియఁ బొమ్మనఁ బోక, తెలియవలయు మించు తేటపడఁగఁ
దొడవు గాక పసిఁడిఁ దొడిగిన నొప్పునే, కనక మింట నెంత కలిగనేని.

గీ. విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు
లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ

1. ట-హర్మ్యబహుళ, 2. ట-గుణోక్త, 3. ట-ప్రవణప్రదమైన, 4. ట-కవితాపద, 5. ట-గాదయోగ్యనకైనన్, 6. ట-హృద్యం, 7. ట-విశేషములసాధ్య, 8. ట-వీడ్వాడి, 9. ట-మనియంద్రు.

నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము కాన
వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ.

క. స్వరములు నచ్చులు ననఁగా, నరయ నకారాదిసంజ్ఞ [1]నయ్యక్కరముల్
దిరముగ హల్వ్యంజనములు, వరుసఁ గకారాదిపంచ[2]వర్గాక్షరముల్.

క. యరలవ లంతస్థలు నా,నురవగు శషసహలు [3]పొలుచు నూష్మ లనంగాఁ
బరువడిఁ బ్రయోగములయెడ, విరచింపుదుఁ దెలియవలయు వీని తెఱంగుల్.

క. భువిలోఁ దత్సమమును ద,ద్భవమును [4]సహజాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యము నాఁ బం,చవిధములై తెలుఁగుఁబలుకుజాతము పరఁగున్.

—* తత్సమలక్షణము. *—

గీ. [5]పరఁగ సంస్కృతంబుపైఁ దెనుంగువిభక్తు,లునుపఁబడి పొసంగియుండెనేని
తత్సమంబు నాఁగఁ దగునంద్రు సుకవులు, తద్విహీనకావ్యతతియు లేదు.

చ. పరమవినీతిమంతు లగుపార్థివకోటికి విశ్వమేదినీ
వరు దెస నాగ్రహంబుఁ జిరవైరము సత్యవిహీనవృత్తమున్
బిరుదమదంబుఁ గైతవము[6]భేదవిధానము దుర్ణయంబు మ
త్సరమును వర్జనీయ మనఁ దత్సమమై చను నంధ్రభాషకున్.

క. వదలక సిద్ధాక్షరములఁ, బొదివినవర్ణములఁ దూలిపోఁబలుకఁగ న
ర్థదమై ప్రాకృతనిభ మగు, [7]నది తద్భవపదము నాఁగ నభినుత మయ్యెన్.

సీ. యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు చంద్రముఁ డనుపేరు చందమామ
యోధులు జోదులు యోగులు జోగులు భేదంబు బిందంబు పృథివి పుడమి
విష్ణుండు వెన్నుండు వెజ్జు నా వైద్యుండు పుస్తంబు పొత్తంబు ప్రోడ ప్రౌఢ
కుబ్జుండు గుజ్జుండు కుక్క కుక్కుర మగు శయ్యయు సజ్జ నా జాది జాతి
యనెడు పల్కులు తద్భవాహ్వయము లంద్రు, వీనినిన్నిటి నెఱిఁగి వివేకబుద్ధిఁ
గబ్బములు[8]చెప్పుకవులచక్కదము మెచ్చు,విపులవిద్యుండుచాళుక్యవిశ్వవిభుఁడు.

—* దేశ్యలక్షణము. *—

క. శ్రేయము లై బహుదేశా, నేయము లై చక్కఁదనము నెఱదనములు నై
యాయానెలవులఁ [9]జెవులకుఁ, దీయము లగుపలుకు లెల్ల దేశ్యము లరయన్.

---

1. ట-లయ్యేఁదలంపన్, 2. ట-వర్గాఖ్యంబుల్, 3. ట-చూడ, 4. ట-దేశీయమైన బాష యు గ్రామ్యం, బవి కేవలాంధ్రమున, 5. ట-ప్రకట, 6. ట-భేదవితానము, 7. ట-నదియేతద్భవము, 8. ట-చెప్పుచుండు చక్కదము, 9. ట-కుంగడు.

సీ. వాలాయ మూలంబు వంగడ [1]మంగడ సోలంబు చొకుఁగాలు సోయగంబు
విన్నన్ను వెన్ను వావిరి వంత వాగెంబు డెందంబు డిప్పాడి డిల్లపాటు
నెమ్మోము నెత్తమ్మి నెలఁత క్రొన్నెల కొమ్మ లావడి యొయ్యార మారజంబు
పొక్కుడు నెవ్వఁగు పొచ్చెంబు మచ్చిగ యక్కజం బచ్చెరు వక్కు నిక్కు
వెలఁది చిగు రెల్లి వేనలి వేనవేలు, నాఁగఁ జనుశబ్దములు [2]దేశినామకములు
వీనఁ జెప్పినకవితల [3]వినుచు మెచ్చుఁ, జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి.

—* అచ్చతెలుఁగు లక్షణము. *—

క. ఈమూఁడు తెఱుంగులలో, నేమిటనున్ దొరలకున్న నెల్లజనులకున్
[4]లో మిగులఁ దేటపడియెడు, నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందున్.

చ. ఎనుములు గుఱ్ఱము ల్మొదవు లెడ్డులు బండులు [5]పండు లుప్పు ప
ప్పనుములు కొల్లు లాముదము లాకులుఁ బోఁకలు నేయి నూనె యే
పునఁ జెనుపొందు విశ్వవిభుప్రోల నసం [6]దగ విన్నవారికిన్
మనమునఁ [7]దేటగాఁ దెలియుమాటల యచ్చతెనుంగు నాఁ జనున్.

—* గ్రామ్యలక్షణము. *—

క. ఈసడములు గోరడములు,గా[8]సరబీసరలు నైనకట్టిఁడిపలుకుల్
భాసిల్లు గ్రామ్యములు నా,హాసోక్తులఁ దెగడుచోట నవియును నొప్పున్.

సీ. ఊసలు వేసలు వేసాలు దోసాలు దోసలు వేదాలు గాసడాలు
[9]బొందలు గుద్దలు బొక్కలు గుండలు గంతలు మొదలైనకారకములు
దాని గొంచారమ్మి దీని గొంటూ బోకు [10]మేనూనునీవూను యేగవలయు
పాడేము నూనేను పైలురా గానేము వానేవు నేనేవు లేసిరాకు
మనెడు క్రియలును మొదలైనయట్టిగ్రామ్య,
శబ్దములు శబ్దములుగాఁగఁ జనవుమెఱసి
కవుల మనుకొను నయ్యారఁగవుల[11]కై పు
వినిన నగకున్నె చాళుక్య విశ్వవిభుఁడు.

---

1. ట-మేలంబు, 2. ట-దేశ్య, 3. ట-వినిన, 4. ట-బో, 5. ట-పడ్లును, 6. ట-గడు, 7. ట-తెల్లఁగా, 8. ట-గాసడబడసడీములైన, 9. ట-బొందులుగుందలు, 10. ట-యేము నీవూగూడ యేగవలయు, 11. ట-నెపుడు.

## —* తత్సమశబ్దపరిజ్ఞానము. *—

గీ. [1]వెలయుసంస్కృతంబు తెలిఁగించుతెఱఁగు సం
ధులు విభక్తిచయ విధులు సమాస
తద్ధితములుఁ గ్రియలు తగుభంగి నెఱిఁగింతు
నమరశాస్త్రసరణి ననుసరింప.

## —* అజంతప్రకరణము. *—

క. [2]నిదు పుంపవలయు సంస్కృత, మెడపక లింగములు మూఁట నేకాక్షరముల్
విడిచి యజంతాదుల కీ,నడక యవశ్యప్రయోజనము తెనుఁగునకున్.

క. బిందువిసర్గంబులు గడ,నందిన [3]పొల్లులను [4]దక్కి యంధ్రవిభక్తుల్
పొందుగ సంస్కృతపదముల, ముందటి దెస నిలుప నందముగఁ దెనుఁగయ్యెన్.

క. స్థావరతిర్యక్పదములు, దేవమనుష్యాదికములుఁ దెనిఁగించు నెడన్
వావిరి నజంతములతుదఁ, గావించు ముకారమును డుకారము నునికిన్.

గీ. దానకల్పకుజము దర్పోగ్రసింహమ్ము, రజనికరుఁడు కాంతి విజయుఁ డాజిఁ
దనర విశ్వనాథుఁ [5]డన నకారాంతశ,బ్దములఁ దెనుఁగుపఱుచు భంగులయ్యె.

క. రవి యరితిమిరాపహతిం, బవి పరగిరివిహతి రసవిభావప్రతిభం
గవి విశ్వేశ్వరుఁ డనఁగా, భువినీద్వయమునకు నిదియపో తెనిఁగింపన్.

గీ. ఇల నుకారాంతపదములఁ దెలుఁగు సేయఁ,గడ వుకారంబునుండుడుకారముండు
రాజనారాయణుఁడు నృపప్రభు వనంగ, విశ్వనాథుండు నృపులకు విభుఁ డనంగ.

క. మనుకటుపటుశబ్దాదుల, నొనరింప డుకార మెపుడు [6]నుండదు కవితం
[7]దెనిఁగించి చెప్పుచోటం, దనరు వుకారంబ యర్థదాయక మగుచున్.

గీ. మనువు ధర్మశాస్త్రమతమున మిక్కిలి, కటువు బిరుదవినుతి కర్ణములకుఁ
జాలఁ బటువు ధరణి సంగీతసాహిత్య, [8]సరణి విశ్వనాథచక్రవర్తి.

క. వెలయు ఋకారాంతపదా,దులఁ దెనుఁగుగఁ జేయుచోటఁ దుదినిడుపులు గు
జ్జులు సేయందగు నృపులకుఁ, జలుక్యపతి కర్త భర్త సంహర్త యనన్.

---

1. ట-తెలియ, 2. ట-లో నీపద్యము లేదు. 3. ట-పొల్లులను, 4. ట-బుచ్చి, 5. ట-డనఁగా వకారాంత, పదము, 6. ట-నొప్పనికతనం, 7. ట-దెనిఁగించుచోటఁ గవితం, 8. ట-విద్యలను జళుక్యవిశ్వవిభుఁడు.

క. స్త్రీలింగంబుల నిడుపులు, వాలాయము సడుపఁ దెనుఁగువచనము లగు నం
దాలోల స్త్రీహ్రీశ్రీ,ధీ లనులవితములు దక్కఁ ద్రిక్కనవెల్లన్.

క. స్త్రీలకు మదనుఁడు విజయ, శ్రీలకు రఘురాముఁ డెపుడు హ్రీలకు సుధితా
వాలము నిజపాలితభూ, ధీలకుఁ దగుపదము రాజదేవేంద్రుఁ డిలన్.

క. [1]శ్రీవిష్ణువర్ధనాఖ్య, త్వ్మావరుభూవిరవెపుడును మాకు ననంగా
భావగు నేకాక్షరశ,బ్దావళి యప్పిఁటుఁద నొకరుఁ డంటకయున్నన్.

క. వనితా యనుచో వనితయు, జననీ యని పలుకుచోట జననియును వధూ
యనుచోట వధువు తెనుఁగున, జనునాయీాయూలుతుదలఁజనుపలుకులకున్.

క. ఐకారాంతము లోకా,రౌకారాంతములుఁ దెనుఁగు లైనప్పుడు పూ
ర్వాకృతితోడనయుండును, నోకారాంతంబుపై బహుత్వము నొందున్.

క. రై వరఁగును నడుగోవున, గోవులు విసుకంగ గ్లౌనికులన్నృపతులు ధ
ర్మావిష్కృతిఁ బడయుదు రనఁ,గా వెలయుఁ గవిప్రయోగగతిఁదెలియంగన్.

వ. ఇది యజంతంబులు తెనిఁగించు తెఱం గింక హలంతవిధియు నెఱిఁగింతు.

—✻ హలంతప్రకరణము. ✻—

క. భూభుగ్విరాడ్పదంబులు, శోభితముగఁ దెనుఁగుపఱుచుచోఁ దుదపొల్లల్
ప్రాభవమతివర్ణములగు, భూభుజులు విరాజు లనఁగఁ బొలుపై యునికిన్

క. బలవన్మతిమత్పదముల, తలనున్ననకార మెడలుఁ దగఁ దెనుఁగగుచో
బలవంతుఁడు మతిమంతుఁడు, చక్రవర్తి యనఁగ సర్వశాస్త్రములందున్.

గీ. ద్విట్పదంబు వేదవిత్పదంబును దిక్ప,దమునుబూర్వవర్ణతను భజించు
విద్విషుండునాఁగ వేదవిదుండనఁ, దూర్పుదిశ యనంగ నేర్పరింప.

క. చేరు నకారాంతముల డు,కారముఁ దెనిఁగించుచోటఁ గఠినాత్ముఁడనన్
దారుణకర్ముఁడనంగను, మేరుమహాధన్వుఁడన నమృతధాముఁ డనన్.

గీ. [2]వలసినపుడు శర్మవర్మశబ్దంబుల, పైడుకార మెక్కఁ బాసిపోవు
రామశర్ముఁ డనఁగఁ గామవర్ముఁడనంగ, వసుధ శర్మ యనఁగ వర్మ యనఁగ.

—✻ సంధిపరిచ్ఛేదము. ✻—

వ. ఇది సంస్కృతపదంబుల కాంధ్రీకరణం బింకొనజంతహలంతసంధు లనంగ
రెండు దెఱంగు లయ్యె నందు నజంతసంధి యెట్టి దనిన.

---

1. ఈపద్య మితర ప్రతులలోఁ గనఁబడదు, 2. ట-పలయునపుడు, 3. ట-నజంతసంధి హలంత.

గీ. [1]ఆదిశబ్దాంతవర్ణంబు నంత్యశబ్ద, పూర్వవర్ణంబుతోఁ గూడఁ [2]బొత్తుచేత
సంధియగుఁ గారకక్రియాసంగతములు, పెక్కురూపంబు లఁగానిపింతుఁ దెలియ.

గీ. [3]తెలుఁగుఁబలుకులు వెలిగాఁగ దివిజభాష, లమరఁ దెనిఁగించినప్పుడు నచ్చుతోడి
వ్యక్తులై యుండునయకాని వానితోడి, వర్ణవర్ణైకభావంబు వలనుగాదు.

క. అచ్చుతుదియచ్చు పట్టున, వచ్చి యకారంబు నిలుచు వలసినయెడఁ దా
నచ్చయి యిత్వోత్వంబులఁ, జొచ్చు ప్రచితార్థ[4]వాదసూచకమగుచున్.

క. వేయిచ్చుట యీవులయెడఁ, జేయుడుపమియగులయెలమి సిదుముటయిలయుం
బాయక యేలుట యేచుట: యీయధిపతి కొనరు నాఁగ నివి లక్ష్యంబుల్.

క. పోయితి వపుడప్పుడునీ, వీఱుని కేతెంచి తేయు మేయు మనంగాఁ
బాయక యేయేయనఁగా, నీయుభయముఁ జెల్లుఁ గ్రియలనిడ నొక్కొకచోన్.

గీ. ఒనర సంబుద్ధి[5]నోతండ యనఁగనోతఁ, డనఁగఁ బూసిన వీని కనర్థమగున
యర్థమిమ్ముకొమ్మనెడుచోట, నూఁదు చెప్పఁడు దెనుఁగునకుచితమరయ.

గీ. అటనుకారాంతషష్ఠిపై నచ్చుమొదల, నెనరఁ బొల్లనకారంబయుండవలయుఁ
బోతునూరేతునాలునాఁబోలుఁగాని, నగియుఁబోతూరు నేతాలునాఁగజనదు

గీ. అచ్చికారాంతషష్ఠిపై నడఁగుఁబొడము, నింటి దింటిది యనఁజెల్లు నెల్లకడల
నర్థిదర్థిదియనవొప్పు నంధ్రకవితఁ, గవులయనుమతి నిదియును గానవలయు.

క. అచ్చులపై హల్లుండిన, నచ్చుండినఁ దద్ద్వితీయ కపుడు నకారం
బచ్చుడిగి హల్లులుండిన, మచ్చికమైఁ [6]బోవు వచ్చు మఱియొక్కొకచోన్.

[7]క. భువి నైనికెగంటెనికెగు, రువునకు సంధునకు బిరుదదూరునకారం
బివి అంతంబులపైనిం, దవిలిన బహువచనయుక్తిఁ దనరక యున్నన్.

క.

ంటికి సంధినకారం, బుంట యసన్మార్గమందురు భ్రాంతములన్.

క. నిడుపున జకారభావము, వడసియు హ్రస్వమున నెల్లపట్టున నుత్వం
బడరు నకారపుఁ బొల్లకు, నిడఁ దగుఁ బూర్వప్రయోగ మెఱిఁగి కవీంద్రుల్.

క. నేను బచరింతు నీవలెఁ, గానము విశ్వావసీశు కడనును పేనిం
దానాకును నభిమత మగు, నానగుఁ గా దేను నేను గా నేకోక్తిన్.

---

1. ట-ఆద్య, 2. ట-బొందుసేఁత, 3. ట-లో నీపద్యము లేదు, 4. ట-పాద, 5. ట-సేయుచో నొత్తఁడనఁగ। నాతఁడనఁగను నూఁదిననర్థమగున, 6. ట-నుండుఁబోవు మఱియొక్కఁడైనన్, 7. ఈ క్రింది నాలుగుపద్యములును క-లో మాత్రమున్నవి. దిద్దవలనుపడలేదు.

గీ. అచ్చు పరమైనపట్టునఁ బ్రాణిపదము, కర్మమగుచోటఁ దక్కనుకారయుక్తి
వాడుకొనరు చకారభావమున దాని, ననుచరింపుదురు కవిత్రయానుమతిని.

క. రిపునోర్చె రిపునినోర్చెను, రిపునాజి జయించె నుగ్ర రిపుని జయించెన్
నిపుణతఁ జళుక్యవిశ్వా, ధిపుఁ డనఁగాఁ దెనుఁగుసంధి తెఱఁ గొప్పారున్.

గీ. తద్ద్వితీయవిభక్తిపొంతలఁ జరింప, కద్దిగల సున్నసోఁకునఁ గచటతపలు
గజడదబలగునూఁదుటగలుగుఁగవుల, యనుమతంబున నొక్కొకయవసరమున.

గీ. జడులఁగరుణించుఁజతురులఁజాలఁబ్రోచు, [1]వాజిపదకాయనంబునవశము సేయు
[2]భటులఁదనియించుఁబ్రజలకుఁబాడినడపు, శస్త్రవినయుండుచాళుక్యచక్రవర్తి.

క. అలఁతులఁ దుదహల్లులకును, నలవడవామమున నుండి యచ్చోట్టులచేఁ
బలుమఱుఁ దేలుచు నూఁదుచు, విలసిల్లుట గలుగులక్ష్యవిధినెఱుఁగఁదగున్.

క. తనుఁబొగడుఁదన్నుఁబొగడును, జనుఁడుజనుండనఁగఁ దెనుఁగుజాడలుగలుగున్
మనవాఁడు వీఁడునాఁగాఁ, జను నిడుపులు వలవ దూఁద సరళతకొఱకున్.

క. మొల్లమ్ముగ నెల్లెడలను, హల్లులపై నిడుపు లగుచు నాయీయేయో
లుల్లసితాకృతి నిలుపం, జెల్లుం బ్రశ్నానునయవిశేషములందున్.

క. రారా నాగారీ ము, న్నీరే కర్ణాదిదాత లిట్టివదాన్యో
దారత విన మందఱు నట, యోరో విశ్వేశు వేఁడ బుధులనెపుడున్.

క. రుచిరముగఁ [4]బిలుచుచోటను, బ్రచురంబుగఁ బ్రథమపొంతఁబడియుండెడున
క్కచటతపంబుల పట్లను, బ్రచురించుం గసడదవలు పరిపాటి మెయిన్.

గీ. విశ్వవిభుఁడు గడిది వీరుండు సతురుండు, డక్కుఁద్రిక్కు లేని చొక్కులాఁడు
దత్త్వవిదుఁడు వరవిదారణశీలుండు, ననఁగఁ దెనుఁగు సంధియులగునిట్లు.

క. డులు రునులను నీవర్ణత,తులు మొదలుగఁ గొన్నిగొన్నితుదహల్లులతోఁ
గలయునెడఁ గూడు [5]విడుచుం, దెలుఁగునకగుసంధి దీనిఁదెలియఁగవలయున్.

గీ. వేడ్క వేడుకవ్రేల్మిడిప్రేలుమిడియు, మూర్మ్మలసెమాఱుమలసెనుమాన్పుమాను
పుముపిరోధముసంక్రాంతిఁ బొల్చునిట్టి,సంధిలక్షణమెంతయుఁ జనునెఱుంగ.

క. ఇది సంధిక్రమమరయఁగ, దదుచితసంధానవిధులు తఱచెఱుఁగుఁ డిలన్
విదితవిభక్తులగతిఁ జెప్పెదఁ దెలియన్వలయుఁ బూర్వబుధకృతసరణిన్.

---

1. ట-వాజిదనకాయనంబున (?) 2. ట-బంట్ల, 3. ట-నొప్పున్, 4. ఒ-బలుకు, 5. ట-విచ్చున్.

## —*విభక్తిప్రకరణము.*—

వ. ప్రథమయు ద్వితీయయుఁ దృతీయయుఁ జతుర్థియుఁ బంచమియు షష్ఠియు సప్తమియు సంబోధనంబును నన నెనిమిది తెఱంగుల విభజింపం గా[1]రణంబు గాన విభక్తు లనం బరఁగుఁ దత్ప్రకారం బెట్టి దనిన.

క. తెలుఁగుం బ్రాకృతభంగిన, బలియుటచే నేకవచన బహువచనపదం
బులకాని ద్వివచనంబులు, గలుగవు తత్క్రియలఁగారకంబులయందున్.

క. ముడులు తుదఁగలుగుశబ్దము, లడఁగుం బ్రథమావిభక్తు లవి కర్తలగుం
గడు నొసఁగు నిష్టములు ధరఁ, బొడమిన కల్పకము విశ్వభూవిభుఁడనఁగన్.

క. నునివర్ణంబులు తుదినొం, దిన కర్మపుఁబదము దా ద్వితీయయనంగాఁ
జనుఁ జాళుక్యధరిత్రీ, పుని విశ్వేశ్వరుని సిరులు వొందుననంగన్.

క. చేత ననుపలుకు తుదలఁ బ్ర, తీతంబగు నేనియది తృతీయయగుం బ్ర
ఖ్యాతంబుగ విశ్వేశ్వరు, చేతం బ్రభవిల్లు నెల్లసిద్ధు లనంగన్.

క. పలుకులతుదఁ గై శబ్దం, బలవడ నిలిచినఁ జతుర్థియగు విశ్వమహీ
లలనుకై యలఘునకై, చెలువారం గృతులు కవులు చెప్పుదు రనఁగన్.

క. పదముతుదవలననని యెడు, పద ముండినఁ బంచమీవిభక్తియ పుష్ప
ప్రదరుఁ డగువిశ్వభూవర, మదనువలనఁ దొలఁగు సతులమానంబనఁగన్.

క. అమరి కుశబ్దముపాదాం, తమునం దున్నేని షష్ఠితప్పదు విద్యా
సముదయము విశ్వవసుధా, రమణునకుం[2]బొలుచు నిలనిరంతరమునన్.

క. పలుకుతుద నందునను న, ప్పలుకుండిన సప్తమీవిభక్తియగున్ని
శ్చలితచతుర్దశవిద్యా, విలసనములు పొలుచు విశ్వవిభునందనినన్.

గీ. ప్రథమగావించు ముడులను బాయఁబెట్టి, కట్టెదురఁబల్క సంబుద్ధి కడుఁదనర్చు
విక్రమాటోపచాళుక్య విశ్వభూప, పటుగుణావాల గండగోపాల యనిన.

క. కోరి ముకారముమీఁదను, కారముపట్టునను దగ లుకారమునిడఁ బెం
పారున్ బహువచనంబులు, హారము లంగములు విబుధు లమరు లనంగన్.

క. కడల ముకారడుకారము, లుడుపఁగఁబడు నచ్చ తెనుఁగుటుక్తులయందుం
గడ గడలు గొడుగు గొడుగులు, బసుగు బసుగు లేకవచనబహువచనములన్.

క. చింతింపఁగ [3]నివ్విధినివహా, లంతంబులు చెల్లునిలఁ గ్రియావంతులు శ్రీ
మంతులు ధీమంతులు గుణ, వంతులు భూభుజులు వైరివధవిదులనఁగన్.

---

1. ట-గారణమగుట. 2. ట-దగునిరంతరంబుం బ్రీతిన్. 3. ట-నివిభువివిహా.

క. ధర బాలుని డుత్వము, పరువడి రుత్వంబు నొందు బహువచనము, బా
లురు భూపాలురు కరుణా, దరలోలురనంగఁ దగు నుదాహరణంబుల్. (?)

గీ. వాఁడు వీఁడను నవి బహువచనములను, వారు వారలు వాండ్రును వీరు వీండ్రు
వీరలును నాఁగ నెందును విస్తరిల్లు, గాఁడునకు గారు గాండ్రును గలుగు నండ్రు.

గీ. కొఱను నెఱను మ్రాను కొలనను నివి యెల్ల, బహువచోనియుక్తిఁ బరఁగుచోట
వెలయుఁ దత్పదములఁ గులు జనియించుఁ బై, వరుస నచ్చతెనుఁగు వచనములకు.

క. కొఱఁకులు నెఱఁకులు మ్రాఁకులు, జిఱుఁగొలఁకులు నయ్యెఁ బేను జేనును మీనుం
గొఱపేలుఁ జేలు మీలన, నురువగు నిలనచ్చతెనుఁగు లూహింపంగన్.

క. పల్లు విల్లిల్లు నాఁ జను పలుకులెల్ల, బండ్లు విండ్లిండ్లు నాఁ జను బహుతనొందు వ
బాడుఁ గుండేలు గోరను పలుకులెల్లఁ, బాళ్లుఁ గుండేళ్లు గోళ్లు నాఁ బరఁగు ధరిత్రి.

గీ. వరుస నేయి చేయి వాయను పలుకులు, తుదలఁ బెక్కుఁ జెప్పఁ దులు జనించుఁ
బ్రీతి నేతులనఁగఁ జేతులు వాతులు, నాఁగఁ జెల్లు నెల్లనాట నండ్రు. [ఱాలు

గీ. వేయి ఱాయి దోయని యెడి వీని బహుత, నొలిఁ దుదలుత్వ మొనఁగూడు వేలు
దోలు నాడుత్వము బ్బునెద్దునకు వరికి, నెడ్లు వడ్లును నాఁ జను నెఱుఁగవలయు.

క. కేలేకవచన మరయఁగఁ, గాలును దెమ్మెరలు సహజబహువచనంబుల్
మూలాఖ్యమున్నగాఁ బే, ర్కొలోఁ బడునిట్లు ధాన్యకులముల కెల్లన్.

గీ. కొఱ్ఱ లాళ్లు వడ్లు గోదుమ లనుములు, కొల్లు లనెడు వీని కెల్ల నిట్లు
ప్రకటితంబు లయ్యె బహువచనంబులు, నేకవచననియతి యెప్పుడు లేదు. [లగు

గీ. ప్రాణిపదములు వెలిగాఁగఁ బ్రథమ లైన, నరయ నొక్కొక్కచో ద్వితీయార్థము
రాజలంకారములు పూనె రాచకొడుకు, వస్త్రములు దాల్చె నన నెందు వఱలెఁ గాన

క. ఒనరఁ దృతీయయుఁ బంచమి, యును సప్తమియును దలంప నుచితనిజైకా
ర్థనియతిఁ జెల్లుం దెలియఁగఁ, ననిరి విభక్త్యర్థవేదు లైనకవీంద్రుల్.

గీ. విశ్వవిభుని చేత విలసిల్లు సిరి కర, వాలభైరవాంకువలనఁ గలుగు
భూరిసిద్ధి రాజనారాయణుని యందుఁ, బొడముఁ గవుల కతివిభూతి యనఁగ.

క. పోక చతుర్థీషష్ఠులు, నేకార్థము నందుఁ బలుక నిత్తురు విశ్వ
క్ష్మాకాంతునకుం గృతు లరి, భీకరునకు [1]నిత్తుఁ గవులు పృథునీతులనన్.

వ. మఱియు నంధ్రభాషావిభక్తులకుం గల నామాంతరంబు లెఱింగింతు, స్థావర
తిర్యఙ్మనుష్యపదవ్యక్తియగు ప్రథమావిభక్తికిం గ్రమంబున ముకారంబును డుకా

---

1. ట-నిత్తురుర్విఁ బ్రియగీతులనన్.

రంబును, ద్వితీయకు నుకారనికారంబులును, దృతీయకుఁ జేత తోడ యనునవి యుఁ, జతుర్థికిం గై కొఱ[1]కనునవియుఁ, బంచమికి వలన పట్టి యుండి కంటె యనునవియును షష్ఠికిం గి కుకారంబులును యొక్క లోపల యనుపదములును, సప్తమికి నందు న యనుపదంబులు నయ్యెఁ దత్ప్రకారంబునకు విభక్తినిరూపణంబు[2]లలవరింతు.

క. ద్రుమమేచె ద్రుమముఁజూచెను, ద్రుమమ్ముచేనొప్పె నరుగు ద్రుమమునకై యా
ద్రుమమువలన ఫలమబ్బెను, ద్రుమమున కెనలేదు పువ్వు ద్రుమమందొప్పున్.

వ. ఇది యేకవచనవిధి.

క. ద్రుమములు ద్రుమములఁ గదిసెను, ద్రుమములచేనీడగలిగె ద్రుమములకై గం
ధమమరె ద్రుమములవలనన్, ద్రుమములకలరారెఁ దానుద్రుమములయందున్.

వ. ఇట్లు తిర్యక్పదంబులకు యోజించునది.

క. తనయుఁడు తనయునిగనియెను, దనయునిచేఁ దనయుకొఱకుఁ దయునివలనం
దనయునకు ధనముదొరకెను, దనయునియం దెల్లమంచితనములు గలుగున్

క. తనయులు తనయులఁబడసిరి, తనయులచేఁ దనయులకయి దనయులవలనం
దనయులకు మేలుగలిగెను, దనయులయం దనఁగ నివి యుదాహరణంబుల్.

క. కవి యొప్పఁ గవి భజింతురు, కవిచేఁ గృతులొదవు సిరియుఁగవియుఁగవులకై
కవివలనఁ గల్గుఁగీర్తులు, కవితతికిం బేరువెలయుఁ గవివరునందున్.

క. కవులు నుతింతురు కవులం, గవులచేతఁ (?) గవులకొఱకుఁ గవులవలనఁ ద
త్కవులకుఁ బ్రసిద్ధి యలవడుఁ, గవులందుంగాక కావ్యకల్పన గలదే.

క. గురుఁ డధికుఁడు గురుఁ దలఁపుము, గురుచేతం దెలిసి భక్తి[3]కొఱలు గురునకై
గురువలన మేలు చేకుఱు, గురునకు సరిలేదు విద్య గురునం దుండున్.

క. గురువులు గురులను గొల్తురు, గురువులచే గురులకొఱకు గురువులవలనన్
[4]గురులకు భక్తి దనర్చును, గురువులయందుండు సకలగుణములు నెపుడున్.

వ. ఇత్తెఱంగున ననుక్తపదంబులయం దొడఁగూర్చునది.

క. స్థావరతిర్యక్పదములు, వోవిడిచి తృతీయ మొదలు పురుషాఖ్యలపైఁ
బై వర్ణములో నుత్వము, నావల నిత్వము విభక్తులైదును జెందున్.

క. సుతుచేత సుతునిచేతను, సుతుకొఱకును సుతునికొఱకు సుతువలనం ద
త్సుతునివలన సుతుకొదవును సుతునికొదవు సుతునియందు సుతునందనఁగన్

---

1. ట-కనునివియు. 2. ట-అవధరింపుము, 3. ట-గోరు, 4. ట-గురువులకు భక్తి దనరును.

పరఁగఁ గూఁతురుశబ్దంబుపై రుకార
మొక్కపలుకునపై[1]నైన నుండుఁ బాయుఁ
బెక్కుపలుకులపైనైనఁ దక్కిపోవుఁ
[2]గూఁతురుగఁ బొందెఁ గూఁతుగాఁ గోరె ననఁగ.

కూఁతులచేఁ గూఁతురిచేఁ, గూఁతులకై గూఁతుకొఱకుఁ గూఁతులవలనం
గూఁతులకుఁ దగవు లొసఁగెను, గూఁతులయందుం బ్రీతిగుణవంతులకున్.

ఓయాదిపదంబులతుదఁ, బాయని నిడు పుడిపి తగ విభక్తులు నుపమ
మ్మే యనువునఁ బుంలింగని, కాయమునకుఁ జెప్పి రట్లు కవివరులోలిన్.

కడ డుకారమున్న నొడులెల్ల సంబుద్ధి, హ్రస్వమైన దీర్ఘమైన నగును
వీరవరుఁడ సమరశూరుఁడా యనఁగ మా, నినియనంగ మానినీయనంగ.

డులు బహువచనంబులయెడఁ, దొలఁగు స్సంబోధనమున దుర్జనులారా
బలిభోజన[3]విధులారా, ఖలులారా మిమ్ము జముఁడు గావఁ డనంగన్.

గీ. ఒనర యుష్మదస్మదుక్తుల కేకవ,చనబహువచనములు సంభవించు
మఱియు నీవు నేను మీరు మేమ నెడునా, దేశములు ధరిత్రిఁ దెలియవలయు.

క. నియతుఁడవు నీవు నిన్నును, నియమింతురు శుభము లొలయు నీచే నీకై
జయమగు నీవలన దయో,దయమున సిరి నీకు శుభము దగు నీయందున్.

క. [4]మీ రనఘులు మిముఁ గొలుతురు, నేమము మీచేత నుతులు చెలువగు మీకై
హేమము మొదవు మీవలనను, శ్రీ మీకొలరారి యుల్లసిలు మీయందున్.

క. నేరమ్యుఁడ నను దలఁతురు, నారులు నాచేత నెగడె నాకై ప్రియమా
ధారణి నావలనం బెం,పారెను నాకొసఁగుఁ బ్రియము లవి నాయందున్.

క. మేమెఱుఁగము మము మఱచిరె, భామలు మాచేత బ్రదుకఁబడి మాకై ము
న్నే మీరు మావలనవల, దా మక్కువసేయ మాకుఁదగ మాయందున్.

## —※ సమాసప్రకరణము. ※—

క. మొదలిపదాంతవిభక్తిని, వదలుచుఁ [5]దుదిపదము మొదలివర్ణముతోడం
గదిసిన నదికినశబ్దము, [6]జనువులను సమాస మనఁగఁ జనునంద్రు బుధుల్.

---

1. ట-బైనుండు మొరయుఁబాయు, 2. ట-కూఁతుఁబడసెను గూఁతురుఁగోర, 3. ట-మతులారా, 4. ప్రాసభంగము, 5. ట-కడ. 6. ట-జదువుదురు సమాసమనుచు శబ్దజ్ఞులిలన్.

వ. అది తత్పురుషంబును గర్మధారయంబును బహువ్రీహియు నన మూఁడు తెఱంగులం బ్రవర్తిల్లు, నంధ్రభాషాప్రయోగంబుల నందుఁ దత్పురుషంబులకు నొక్క తెఱం గెఱింగింతు.

క. రాచిలుక[1]లు విరజాజులు, రాచకొడుకు లంపగములు రాయంచలు నా
రాచినయట్టిసమాసము, లేచుం దత్పురుష మన ననేకం బగుచున్.

క. వెలిదమ్మి కమ్మఁ[2]దూపులు, వలకే లెడకాలు నీలవర్ణము నవపా
టలరుచులచే సమాసము, లలవడియెం గర్మధారయములు దెనుఁగునన్.

గీ. పూవుఁబోఁడి తలిరుఁబోఁడి పూవిల్తుండు, వాలుఁగంటి వాతవాఁడి మించు
మొలక మచ్చెకంటి [3]ముక్కంటి యనబహు, వ్రీహి పెక్కువిధుల విస్తరిల్లు.

వ. మఱియు వీనికి సాధారణలక్షణంబు లొక కొన్ని యెఱింగింతు.

సీ. గుణిగుణంబుచెప్పఁ గొఱలువిశేషణ, పదముపై నికార మొదవుఁ బాయు
నాతికెల్లనాఁడు నల్లనికనుఁగవ, నల్లకన్నుఁగవయనంగ వరుస.

క. విదితవిశేషపదాంతము, గదిసి పుకారంబు నిలుచుఁ గడహల్లున్నం
బదపడి యచ్చుండినఁ బుటు, లొదవు ముకారంబుఁ ద్రోచి యోలింగృతులన్.

క. గూఢపుమంత్రంబులు నతి,గాఢపుఁగర్మములు సోయఁగపుటాటలు నా
రూఢపుటాలాపంబులు, ప్రౌఢములగు నీసమాసఫణితులయందున్.

క. ఇలఁ బల్లు మల్లు విల్లును, హలాదులను నదుకుచోట నడఁగును జడ్డల్
పలువరుసయు ములుమోదుగు, విలుకాఁడు ననంగ నెంను విశ్రుతముగుటన్.

గీ. వెన్ను కన్ను చన్ననియెడు వీనిజడ్డ, లుడుపుటొప్పు సమాసనియోజనములఁ
దనరవెనుగాఁడికనుదోయిచనుమొలకలు,నాసమాసంబులొప్పునానావిధముల.

క. ఆదట నా నీ తనయను, చో దుత్వము గలుగు షష్ఠి చూపెడునెడలన్
నాదు కళాసంపదయును, నీదువివేకంబుఁ దనదు నిపుణతయు ననన్.

క. నా నీ తన యనుపలుకుల,తో నదుకుదుకార మవుడు దొలఁగినఁ దొలఁగుం
బూని సమాసము సంస్కృత,మైనను షష్ఠ్యర్థహేతువై సత్కృతులన్.

మ. తనసత్యవ్రత కౌశలంబుఁ దన విద్యాతంత్రనిర్మాణముం
దనవిశ్రాణనకీర్తనంబుఁ దనసత్ప్రస్తుత్యసంతానముల్
తన తేజోమహిమోదయంబుఁ దనయుద్యత్కీర్తివిస్ఫూర్తియుం
దనరం బేర్చుఁ జళుక్యవిశ్వనృపమందారంబు నా నెల్లెడన్.

---

1. లడవిజాదులు, 2. ట-బువ్వులు, 3. ట-యొలనాఁగ.

క. క్షీరార్ణవకూఁతురు సం, సారార్ణవయోడ శుభమొసఁగు మీఁకనఁగా
వైరిపదం బగుఁ దెనుఁగున, గూరని సంస్కృతముఁ దెనుఁగుఁగూర్పుటచేతన్.

గీ. అరయ నానీలు హాల్లుతో నమకుచోట, నొనర నుగ్గును నిడుపయియున్ననుండు
గవులయనుమతి నిది కృతిఁ గానవలయుఁ, జాలవర్ణంబుగదిసిన జడ్డయగును.

[1]క. ఆకరి యక్కరి యనఁగా, నాకర మక్కరము నాఁగ నక్కీకసకం
బాకీకసకం బన భా, షాకరము సమాసముల కుదాహరణంబుల్.

గీ. సంస్కృతము లయ్యుఁ దెనుఁగులై చాఁగుఁ గొన్ని
శబ్దములు వానిచందంబుఁ జను నెఱుంగఁ
బనసపండును గుండలోపలనసంగఁ, గందదుంపలు నాజీరకఱ్ఱయనఁగ.

క. సుమతి నికారోకారాం, తముపై సంస్కృతపదంబు తగుఁ గూర్పఁగ వేఁ
డిమరీచులు వాఁడిశరం, బమరుమనుష్యుండుఁ బేర్చునశ్వంబనఁగన్.

క. తగుఁగూర్ప నికారాంతం, బగుసంస్కృతపదముమీఁద నచ్చతెనుఁగున
న్నిగుడారు దంతికొమ్ములు, జగమెఱుఁగు నరాతిపోరు చందంబనఁగన్.

గీ. అత్తమామ నాఁగ నాలుమగం డనఁ, గొడుకు[2]గోడలనఁగఁ గొఱనుజేలు
నాఁగరాత్రిపగలునాఁగ నిట్టి సమాస, ములునుగలుగుఁగవులు దెలియవలయు.

## —✻ తద్ధితప్రకరణము. ✻—

క. అరి యిఁడి కాఁ డాఁడరయన, ధరలో నొకకొన్ని చెల్లుఁ దద్ధితపదముల్
పరువడి వాని నెఱుంగుట, పరమపరిజ్ఞానమంధ్రభాషాకవితన్.

సీ. సూఁడరి [3]ముండరి తూఁడరి కల్లరి కాలరి ప్రేలరి కష్టుఁ డనఁగ
నుప్పిఁడి ప్రాయిఁడి చప్పిడి గ్రేసిడి తన్నిడి చిక్కిడి దాతయనఁగ
నీటుకాఁ డెడకాఁడు పోటుకాఁ డుదురులాఁ డించులాఁ డెప్పుడు నీతఁడనఁగఁ
దక్కులాఁ డెక్కువ నిక్కులాఁ డదరులాఁ డెపుడు దురాత్మకుం డీతఁడనఁగఁ
దనరు దబ్బఱ చిందఱందఱయనంగఁ, బరఁగు పలుకులు తద్ధితపదములయ్యెఁ
దెనుఁగుననువీనిచందంబుఁ దెలియుకవుల, నాదృతులఁ జేయురాజనారాయణుండు.

## —✻ క్రియాప్రకరణము. ✻—

గీ. అరయవాక్యకదంబోత్తమాంగమునకు, నమితదృష్టులు జగతిఁ గ్రియాపదములు
వాని తెలుఁగులు కవులకు వలయుఁ దెలియఁ, గడఁగి కాలత్రయప్రసంగములవలన.

---

1. ట-లో నీపద్యములేదు, 2 ట-కూఁతురనఁగ, 3. ,-ముద్దరి.

క. ధరఁ బ్రథమమధ్యమోత్తమ, పురుషాఖ్యలఁ గ్రియలు మూఁడు పొలుచుం గాల
స్ఫురణలును వర్తమానం, తరభూతభవిష్యదర్థతలఁ ద్రివిధంబుల్.

గీ. ప్రథమపురుషాఖ్యయన్యార్థభణితిఁ జెప్పు, నగ్రసంస్థితుఁ జెప్పు మధ్యమపురుషము
దగిలి యుత్తమపురుషంబు తన్నుఁ జెప్పు, నేకబహువచనంబుల నెల్లకడల.

గీ. అగుచునున్నకర్తయగు వర్తమానంబు, భూత మనఁగ నయినపూర్వకృతము
కడఁగి యంతిమీఁదఁ గానున్నయదియభ, విష్యదర్థ మనఁగ విస్తరిల్లు.

క. ఉచితవిధి విధియు నాశీ, ర్వచనము నను క్రియలు రెండుఁ బ్రథ నొక్కటియై
ప్రచరించుం బురుషత్రయ, వచనంబుల వీని తెలుఁగు వలయుం దెలియన్.

క. తెలుఁగు క్రియాపదములకును, దలకొను ధాతువులు జనపదవ్యవహారో
క్తులు కాన వానిఁ బేర్కొన, వలదు ప్రయోగములఁ దెలియవలయుఁ దెలుపుదున్.

వ. ప్రథమపురుషంబునకు వర్తమానార్థంబునందు నేకవచనబహువచనంబులందు నెడినెదరులును మధ్యమపురుషంబున కెదవెదరులును, నుత్తమపురుషంబున కెదనెదములును గ్రమంబున నాదేశంబులయ్యెఁ దన్నిరూపణంబు లెఱింగింతు.

క. అరిగెడి నరిగెద రనఁగా, నరిగెద వరిగెద రనంగ నధిపతిపురికై
యరిగెద నరిగెద మనఁగాఁ, బరువడి నిదివర్తమానభణితార్థమగున్.

వ. ప్రథమపురుషంబునకు భూతార్థంబునందు నేకవచనబహువచనంబుల నెన్నిరులును మధ్యమపురుషంబునకు తివితిరులు నుత్తమపురుషంబునకు తినితిములును నాదేశంబులగుఁ దన్నిరూపణంబు లెట్లనిన.

క. చేసెం జేసి రనంగాఁ, [1]జేసితి చేసితిరి మీరు సిరిమా కనఁగాఁ
జేసితిఁ జేసితి మనఁగా, భాసురభూతార్థకథనభజన మ్మయ్యెన్.

వ. ప్రథమపురుషంబునకు భవిష్యదర్థంబునందు నేకవచనబహువచనంబులకు నుదురులును మధ్యమపురుషంబునకు వుదువురులును నుత్తమపురుషంబునకు దునుదుములు వరుసనాదేశంబులయ్యెఁ దన్నిదర్శనం బెట్టిదనిన:—

క. చేయుం జేయుదు రనఁగాఁ, జేయుదు చేయుదురు మీరు చిత్తంబలరం
జేయుదుఁ జేయుదు మనఁగా, నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పున్.

క. మొదలం జెప్పిన యది తుద, యది యాదేశంబు విధికి నవ్వచనములం
బొదలి ప్రథమమధ్యమలకుఁ, దుద నుత్తమపురుషమునకుఁ దొంటట్లయగున్.

---

1. ట-చేసితి వేమాఱు మీరు చేసితిరనఁగా.

క. చేయునది బుధుఁడు ధర్మము, సేయునది బుధులు విశేషసిద్ధక్రియలం
జేయునది నీవు దర్పము, సేయునది తపంబు మీరు శివునకు ననినన్.

గీ. ఉనుదుగులకుమీఁద నొగిఁ గాఁతయున్న నా, శీర్వచనమునకును జెల్లునదియు
శివము చేయుఁగాత శివుఁడు శోభనముచే,యుదుగుగాత మీకుఁ ద్రిదశులనఁగ.

క. కారయిత సేయుకృతి నల,రారు ణిజంతంబు దాని కాదేశంబుల్
ధారిణి నింపును నించును, సారముగా నేకవచనసరణికి నయ్యెన్.

క. తుదబహువచనమునను నింపుదురును నింతురును నయ్యెఁ బుడమియెడలనిం
చుదురును గలుగుఁబ్రయోగా,న్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్.

సీ. శ్రీవిశ్వభూపతి చేయించుఁ గ్రతువులు సేవింపుదురు తదాశ్రితులు సురలఁ
బండంగ నింద్రుండు పరఁగించువానలు హాలికులు పరగింతురర్థచయము
నెసఁగించుధరశ్రీలనేపారుతద్వృత్తి వరభటు లెఱఁగింపుదురు జయంబు
వెలయింపుకీర్తి యవ్విధినెలయింపుదు రర్థులెల్లెడఁ బ్రతాపాతిశయము
ననెడు పల్కులచేతణిజర్థములకు, నేకవచనబహువచనపాకమెఱుఁగ
వలయు నవి పెక్కువిధముల వసుధఁ దెలియ,నిఖిలభాషావిశేషులై నెగడుకవులు.

క. మహితస్థావరతిర్య, జ్మహిళాదిక్రియలవర్తమానార్థమున
న్విహితమగు నెడుడుకారము, సహజంబుగ నేకవచనంజ్ఞలచోటన్.

క. పండును భూజము తరువులు, పండెడు రాచిలుక యొప్పఁ బలికెడుఁ జిలుకల్
గండాడెడు సతిపతిపైఁ, బండెడుఁ బెక్కింట సతులు వండెను ననఁగన్.

క. నిగుడదు భూజము సింగము, బెగడదు విటు వారవనిత పిలువ దనెడుచోఁ
దగుభూతార్థంబున నదు,లగు నాదేశంబు క్రియల నయ్యైయెడలన్.

గీ. ఒవర నింపు నించు ననియెడు వీనిపై, నుటతలొందె నేని నొక్కచోటఁ
బరఁగుఁ*గారకాఖ్యపదములై తెనుఁగున,వాని తెఱఁగు లెఱుఁగవలయుబుధులు.

క. కోపింపుట కోపించుట, కాపించుట పనుల నొప్పఁగాయించుట నా
నేపారు నిట్టిపలుకులు, లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగఁదగున్.

గీ. తెలుఁగుఁబలుకులువునరుక్తిఁబలుకుచోట, గదిసి రెండవపదమున మొదలివ్రాఁత
దనరు గిత్వంబు ప్రాసంబు దప్పకుండ, వర్ణములు దీర్ఘహ్రస్వప్రవర్తులగుచు.

క. పులిగిలి యనఁ గరిగిరి యన, నలిగిలియన నోడగీడ యనఁగా బరఁగున్
నలులుగిలులనఁగ బలవం,తులు మఱి గిలవంతు లనఁగఁ దుదసరియగుచున్.

---

* కారకమునకుఁ గృతంతమను నభిప్రాయము.

క. స్మరధరచరవరపదములు, పరఁగఁ గ్రియాపదమునొందుపట్టుల నెల్ల
స్వరుసరకారములోపలఁ, బొరినిత్వమడంగుఁ గాక పొడమినఁ బొడముఁ.

క. స్మరియించె సంస్మరించెను, ధరియించె ధరించెఁ బూవుఁదండఁ జరించెం
జరియించె వల్లభునిసతి, వరియించె వరించె నాఁగ వలనై యునికిన్.

క. ఇది తెనుఁగున కెల్లను జన, పదవిదితం బైన తెలుఁగుపట్టించుకయె
ల్లిదముగఁ జెప్పితి నంతయు, మదినెఱుఁగుం డరసి బుద్ధిమంతు లితరముల్.

మ. లలితన్యోన్యముఖావలోకనము లీలం జేయఁగా లేని యా
విలసత్కావ్యకళాచతుష్టయము లుర్విం బర్వ నేకస్థలిం
గలిగించెం బదవాక్య వేదియు నలంకారజ్ఞుఁడుఁ భూవరో
జ్జ్వలవిద్యావిభవోన్నతుండు నగువిశ్వక్ష్మావిభుం డిమ్ములన్.

మ. [1]కవివాత్సల్యకళాచరిష్ణుఁడు జగత్కల్యాణవర్ధిష్ణుఁ డు
త్సవసంపుష్టసుపర్వగర్వుఁడు జయశ్లాఘాప్తగంధర్వుఁ డా
ర్జవశీలాదివిశుద్ధవృత్తుఁడు విరాజద్విక్రమాయత్తుఁ డ
చ్ఛవిశాలామలకీర్తిపూరుఁడు సుతేజస్స్ఫారుఁ డెల్లప్పుడున్.

క. శ్రీమచ్ఛళుక్యవిశ్వ, క్ష్మామండలవిభుఁడు సకలసంగ్రామజయ
శ్రీమంతుఁడు సంతతనత, సామంతుఁడు కామినీవసంతుఁడు లీలన్.

[2]తరళ. బిరుదమిత్రుఁడు భిన్నశత్రుఁ డుపేంద్రపుత్రుఁడు యామినీ
శ్వరకులేశుఁడు మానవేశుఁడు వాహినీశుఁడు విక్రమ
స్ఫురణరాముఁడు నూత్నకాముఁడు పూర్ణసోముఁడు కీర్తులం
బరఁగుచుండెడు మాసుధాకరభానుతారకవిశ్రుతిన్.

గద్య. ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయవిరచితం బైన కావ్యాలం
కారచూడామణి యనునలంకారశాస్త్రంబునందు సంధిభాషావిశేష
సంధిసమాసదేశీయప్రయోగక్రియానిరూపణలక్షణ
సముద్దేశంబులంగల నవమోల్లాసము.

---

1. టీ-కవివాత్సల్య, 2. టీ-లో లేదు.

## —* లేఖకునివిన్నపము. *—

(ఈపద్యములు—క. ప్రతినివ్రాసిన లేఖకునివి.)

గీ. లక్షణంబులు లక్ష్యము ల్గలుగునవియు, కాని యున్నవి వాడుకోఁగా వలంచు
బెదరు వలవదు లోకంబు భిన్నరుచిక, మనుచుఁజెప్పుట తత్త్వార్థమగునొ కాదొ.

క. పునరుక్త యథార్థంబులు, ఘనులొద్దన్ వ్రాఁతప్రతుల ఘూర్ణాఘూర్ణం
గనుఁగొని కవిత్రయమతం, బను గాఁగ లవునని మెచ్చన్

క. ఈకవిత నారికేళపుఁ, బాకము తనబోటికులుచప్రాజ్ఞులకెల్లన్
జోకఁగఁ జేయుచు ద్రాక్షా, పాకం బొనరించి మేలుబంతై వెలయున్.

క. చతురతవెలయఁగ నేతత్కృతిఁ గృతివరులరసిచూచి కీర్తననేయన్
శితికంఠభక్తివిలసన్మతి వెణుతురుపల్లి విశ్వనాథుఁడు వ్రాసెన్.

క. ఖిలులు తమమార్గములు నే, ర్పులుగా నొకకొన్నిగుణాలు గ్రుచ్చినవానిం
దొలఁగించి వ్రాసెనని య, ల్కొలి మెచ్చం డన్యథాకరింపకుఁ డార్యుల్.

# కృష్ణదేవరాయలనిధనకాలము.

ఇదివఱకుఁ జరిత్రకారు లందఱును కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వఱకు రాజ్యముచేసె ననియు, ౧౫౩౦లోఁ గీర్తిశేషుఁ డయ్యెనని యు వ్రాయుచున్నారు. కాని యిందునుగుఱించిన శాసనాదులను మఱల నెక్కుడు శ్రద్ధతో శోధింపవలయు నని నా తాత్పర్యము. రాయలవారు ౧౫౩౦ లోఁగాక ౧౫౨౪-౨౫ లోఁ గీర్తిశేషుఁ డయ్యెనేమో యని నాకుఁ బ్రబల సంశయము కలుగుచున్నది. ఇందుకుఁ గల హేతువులను గొన్నిటి నిచ్చటఁ జర్చించెదను.

కృష్ణదేవరాయలు శా. శ. ౧౪౪౭ సరి యయిన క్రీ. శ. ౧౫౨౫-వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యె నని చెప్పునట్టి యీ క్రింది చాటుపద్యము తెనుఁగు దేశమందుఁ బరంపరగా వచ్చుచున్నది.

ఉ. బోరన యాచకప్రతతి భూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశకాబ్దము లద్రియుగాబ్ధి సోములం
దారణవత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీరవివాసరంబున నృసింహునికృష్ణుఁడు చేరె స్వర్గముక్
ద్వారక నున్నకృష్ణుఁ డవతారసమాప్తము నొందుకైవడిన్*.

ఈ చాటువునుబట్టి చూడఁగాఁ గృష్ణరాయఁడు తారణసంవత్సర మగు నట్టి శా. శ.† ౧౪౪౭-వ యేఁట జ్యేష్ఠశుద్ధ షష్ఠి ఆదివారమునాఁడు కీర్తిశేషుఁ డయ్యెనని కానవచ్చుచున్నది. దీని కనుకూలముగఁ జెన్నపట్టణమందలి ఓరియెంటల్ లైబ్రరీలో నున్న 'లోకల్‌రికార్డ్సు' యొక్క ౧౮-వ సంపుటము లోని ౪౦౭-వ పుటలో రామరాజుచే నీయఁబడిన యీకాలు కలదు:—

* ఆంధ్రకవులచరిత్రము, ౨-వ భాగము.

† ఇది గతాబ్దము కాదు. జరుగుచున్న సంవత్సరపు సంఖ్య యని నా తాత్పర్యము.

"చింతరాజుపల్లె పాళెం వెంకటపతిరాయునివద్ద నున్న కాగితపు కౌలును నకలు"—

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౮ అగు నేటి వ్యయ నామ సంవత్సర వైశాఖశు౧౫లు శ్రీమద్రాజాధిరాజ రాజకంఠీరవ రాజకందర్ప మహారాజాధిరాజపరమేశ్వర రాజపూజితులగు మహారాజశ్రీ రామరాజయ్యగారు విజయనగరి సింహాసనమున పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను గురుగింజకూట నమలనేని కుమార పెద్దబుచ్చినాయనివారికి వ్రాయించి యిచ్చిన కౌలునిరూపం—మహారాజశ్రీ కృష్ణరాయలయ్యగారికిన్ని తంగోండ తిమ్మానాయనికుమార రామానాయనికిన్ని విరోధం సంభవించినప్పుడు మీరు వారిలో కలసిరి అని సంశయించి మీకు నడుస్తు వున్న గ్రామాదులు నశరజప్తీ చేయించిరి గనుక కోటకొండ పెద్దనోజులశరాజు విప్పపెంటకుమార జంగమరెడ్డి కడప గోపాలబుద్ధారెడ్డి వోగినుల్ల పెద్దరెడ్డి వీరబల్లె యరమాచిరెడ్డి గెండికోట భాగసాని పెద్దవల్లపరెడ్డి యీ మొదలయిన దేశస్థులున్ను మహారాజశ్రీ రాయలవారి ముద్రకర్త వుదయగిరి మలహారిశంకరపంతులు కొమారుడు అనందగోపాలపంతులవారు మాతో విన్నపంచేసిరి. గనుక చిత్తగించి మీకు నడుస్తువున్న గ్రామాదులు విప్పపెంటలోకి చెల్లె ఆరు గ్రామాదులున్ను విప్పపెంట ౧—పాంశమాళ్ల ౧—విరువల్లె ౧—సోమవరం పెద్దవీడు ౧—గెండికోట ౧ చింతరాజుపాళెం ౧—మలనేనిపట్టం ౧, యీ పద్ధాలుగు గ్రామములున్ను మొఖా చెన్నూరుపర్గణె శిద్ధవటంతాలూకు యెనభైనాలుగు గ్రామాదులు కావల నిర్ణయం కామ్రగుంటకుల్ ౨ మడకకుర్ ౨ మగ్గానకిర్ ౨ వర్తకులయిండ్లకుర్ ౨ మడి అనిని—ఆధాన్యం చెన్నూరుతాలూకు ౧౪ గ్రామాదులు శిద్ధవటం తాలూకు ౭౪ అనిన్ని గ్రామానకు.........................మడి సూర్యకొమారుని కనమరుసుము చేరి కట్టనరుసుము—దొంగలసానిరుసం—తిరుపతిభాట రుసం—పరపల్లె వంగిమాళ్ల వీటి గుసుములు వొక్కల పెరికెకుర్ ౦।౦ రసపుగానకునగకుర్ ౦।౦ సాళీలనగకుర్ ౦।౨ తిరుపతి పరుషకు స్వారికి నెల జనం ౧కి నెబులు ౧ భూసామ్యగ౦ ౪ = యీచొప్పున నడిపించుకొని మాకవులు నంమ్మి సుఖానవుడమని వ్రాయించి యిచ్చినకవులు నిరుపం."

ఈకౌలునుబట్టిచూడ శా. శ. ౧౪౪౮ వ్యయనామసంవత్సరము వైశాఖ మాసమునందు విజయనగరమున రామరాజు ప్రభుత్వము చేయుచున్నట్లును, అదివఱకే కృష్ణరాయలు కీర్తిశేషుఁడైనట్లును గానవచ్చుచున్నది. ఈకౌలు పైచాటువునకు సహకారిగనే యున్నది.

కృష్ణరాయలు తారణనామసంవత్సరముననే కీర్తిశేషుఁడై యుండవచ్చు ననుటకు మఱికొన్ని శాసనములు కానవచ్చుచున్నవి.

1. తారణనామసంవత్సర మార్గశిర శు, ౨ వఱకుఁ గృష్ణరాయనికుమారుఁడైనతిరుమలరాయఁడు రాజ్యము చేయుచున్నట్లొకకన్నడశాసనముకలదు.[1] ఇది ముఖ్యముగఁ జూడఁదగినది గనుక దాని నిచ్చట నిచ్చుచున్నాఁడను.

---

1. Epi. Carnatica Vol. IX p. 75, District Bangalore, Taluq Magadi, Inscription No. 82.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్ష ౧౪౪౬ నెయ తారణసంవత్సరద మార్గశిరశుద్ధ ౧ శని స్వస్తి శ్రీమాన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరభుజబలప్రతాప గజపతి అశ్వపతి భాడ శ్రీకృష్ణదేవమహారాయ ఉదరాబ్ధిచంద్ర శ్రీతిరుమలదేవమహారాయర కాలదలు శ్రీమాన్ మహాసేన సాళువచతుస్సముద్రాధీశ్వర తిమ్మన్న దండనాయకర దేశదలు స్వస్తిశ్రీ అభినవకాంచీసమకాలు ఊరవర్ వరదరాజ దేవర ఉత్తమసంధి వధ్యాన్నదినసరకె శ్రీకృష్ణదేవమహారాయరిగె గంగోదక సేవితిరప్ప......కోనపనాయకరు, తిరుమల దేవమహారాయరిగు తిమన్న దన్నాయకరిగు ధర్మవాగబెకు ఎందుమారయన హళ్లిగె ప్రతినామదోనాయక పురనుకోనపనాయకరు వరదరాజదేవరిగె సమర్పిసిదరు తావుమాడిద సెా ఆచంద్రార్కస్థాయిగాగి నడయబెకెంను మాడిద సేవె.................."

ఈశాసనము ప్రాయునఁబాసెఁ గృష్ణరాయలు మృతినొందెననియు, అతని కుమారుఁడగు తిప్పప్ప రాజ్యము చేయుచుండెననియు మన మూహింపవచ్చును. ఇది మంత్రియైనసాళ్వ తిమ్మరసు రాజ్యమందుఁ జేయఁబడినదానము. కృష్ణదేవమహారాయలకుఁ గోనపనాయకుఁ డనువాఁడు గంగోదకము సేవింపఁజేసె ననియు నిందుఁ జెప్పఁబడియున్నది. చరమావస్థయందు గొంతులో గంగఁబోయునాచారము హిందూదేశమం దంతటను గలదు. కావునఁ గోనపనాయకుఁడు రాయలచరమదశయం దాతనిసేవ చేసి ధన్యుఁ డయ్యెనని మనము తలంపవచ్చును. పైచాటుపద్యమునందలి మరణతిథియె నిజమైనయెడల ఈశాసనము రాయలమరణానంతరమున ఆఱునెలలలో వేయఁబడినది యగును.

2. శా. శ. ౧౪౪౭-లో నచ్యుతరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు నెల్లూరుమండలమునందు నొకశాసనము కలదు.[1] దాని నిచ్చట వలయునంత భాగముమాత్ర మిచ్చుచున్నాఁడను :—

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శ. ౧౪౪౭ అగునెటి (పార్థివసంవత్సరఫాల్గుణ) శు. ౧౫ బు మున (శ్రీమన్మహామండలేశ్వర......) అచ్యుతదేవమహారాయలువారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై ఏలుచుండ, వుదయగిరిపట్నంబున శ్రీమన్మహామండలేశ్వర (శ్రీ) రాజు చినతిరుమలరాజులవారి కార్యకర్తలైన తిమ్మరాజులవారి కార్యకర్తలైన తిమ్మరాజు నందయ్యగారు వేదాద్రి శ్రీనరసింహదేవుని దివ్యశ్రీపాదపద్మంబులకు సాష్టాంగదండప్రణామంబులు సమర్పించి యిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లన్నను.................."

ఈశాసనమునుబట్టి చూడ శా. శ. ౧౪౪౭-లో అచ్యుతదేవరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు, అనఁగా కృష్ణరాయలు కీర్తిశేషుఁడైనట్లు కానవచ్చుచున్నది.

---

1. Butterworth and Venugopala Chetty: Nellore Inscriptions, Vol. II, p. 803. Nellore Taluq, Inscription No. 34-A.

3. శా. శ. ౧౪౪౬-లోఁ గృష్ణరాయనికుమారుఁ డైనతిరుమలదేవరాయలు దానము చేసినట్లున్నది[1].

4. శా. శ. ౧౪౫౦ (క్రీ. శ. ౧౫౨౮), ౧౪౫౧ (క్రీ. శ. ౧౫౨౯) సంవత్సరములలో నచ్యుతరాయలశాసనములు కానవచ్చుచున్నవి[2]?

వీని నన్నిటిని బట్టి చూడఁగాఁ గృష్ణరాయలు శా. శ. ౧౪౪౬-లోనో ౧౪౪౭-లోనో మృతి నొందినట్లును, అప్పటినుండియు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకు విజయనగరరాజ్యమును ఆక్రమించుకొనవలయునని అతనికుమారుఁ డైనతిరుమలరాయలును, అల్లుఁ డైనరామరాయలును, తమ్ముఁ డైన అచ్యుతరాయలు ప్రయత్నించుచుండినట్లును [3]ఎవరికి వీలయినప్పుడు వారు శాసనములు వేయించుట, కొల్లిచ్చుట మొదలయిన పనులు చేయుచుండినట్లును, ఈకాలమునందు నెవరి యధికారమును స్థిరపడనట్లును దోఁచుచున్నది.

ఈయూహల కన్నిటికి వ్యతిరేకముగఁ గృష్ణరాయనిశాసనములు పెక్కులు శా. శ. ౧౪౫౨ వఱకును గలవు! కావుననే సువెల్ మొదలయిన తద్జ్ఞులు కృష్ణరాయలు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకును జీవించియుండె నని వ్రాసియున్నారు. కాని వారు, నేను పైని జూపిన కాలమునుగాని, శాసనములనుగాని జర్చించి సమన్వయించుటకు యత్నించియుండలేదు. ఇఁకమీఁదఁ జరిత్ర వ్రాయువారు వీని నన్నిఁటిని సమన్వయింపవలసియున్నది. వీని నన్నిటిని నొకవిధముగా సమన్వయింప నచ్చునేమో! ౧౪౪౬-లోనే రాయలు మృతినొందియుండవచ్చును. తరువాత ౧౪౫౨ వఱకును అచ్యుతరామరాజాదులు కలహపడుచు రాజ్యమరాజకముగా నున్నకాలమందుఁ గొందఱు నాయకులు తటస్థులుగ నుండి, వీరిపైపుఁ జేరక వారిపైపుఁ జేరక యుండవచ్చును. అట్టివారు శాసనాదులు వ్రాయవలసివచ్చినప్పుడు ఆశాసనములలో, నప్పుడు రాజ్యము నకై పోరాడుచున్నవారిలో నెవ్వరిపేరు చేర్చుటకును చెల్లక, అంతకుఁ బూర్వము నిశ్చయముగఁ బ్రభుత్వము చేసిన కృష్ణరాయలపేరే వ్రాయించియుందురు. ఇది యొకయూహ. ఈయూహ ననుసరించి శా. ౧౪౪౬ తరువాతి రాయలశాసనము

---

1. 139 of 1896 Epigraphical Collections.
2. Sewell; Antiquities, Vol. I. pp. 93; 182; 322.
3. Ep. Carn. Vol. IX, Ma. 82.

లన్నియు బహుసూక్ష్మదృష్టితో శోధింపఁబడవలెను. అవసి యవకాశానుసార ముగ నేను జేయుచునే యున్నాను. కాని యితరులును చేయుదురుగాక.

ఈవ్యాసము వ్రాయుటలో నాయుద్దేశము పైనుదాహరించిన కౌలును వెలిబుచ్చి, దానినిబట్టి రాయలనిధనకాలము నిశ్చయించుటకు వీలుండునేమో యోజింపుఁడని యావిషయమున శ్రద్ధగలవారిని బురికొల్పుటయే, కాని, యిది యిత్థమని నిశ్చయించుటకుఁ గాదు. పైనుదాహరించిన కౌలు నూజేండ్లక్రింద చింతరాజుపల్లె పాళెం వెంకటపతిరాయనియొద్ద నుండెను. ఈగ్రామము దత్త మండలములలోని కడపజిల్లాలోనిది. వెంకటపతిరాయునివంశజు లెవరయిన నున్న యెడల వారు, ఈకౌలు కాగితముయొక్క అసలు తమయొద్ద నున్నయెడల దానికి సరియైన నకలువ్రాసి నాకుఁ బంపుదురుగాక. లేక పత్రికలలో నైనఁ బ్రక టింతురుగాక. ఇంకను నిందున గురించి వారియొద్ద నెట్టికాగితపత్రము లున్నను వెలిపుచ్చి కృష్ణరాయుల కాలనిర్ణయమునకును నా కాలమందలి యితరవిషయ ముల నెఱుఁగుటకును గ్రొత్తసాధనములఁ దెలుంగుదేశజులకు నొసంగి వారికృత జ్ఞతకుఁ బాత్రు లగుదురుగాక. చరిత్రవిషయమై శ్రద్ధగల దత్తమండలములలోని శోధకులు కొంద ఱిందునుగుఱించి శ్రద్ధ వహించి, నూతనము లైనకాగితపత్ర ములను గనుఁగొనుటకు యత్నించెదరని నమ్ముచున్నాను.

శాసనములను శోధించెడువా రందఱును కృష్ణరాయనిశాసనములు శా. శ. ౧౪౫౨ తరువాతివి శోధించునపుడు నేను రాయలనిధనకాలమును గుఱించి పైని వ్రాసినవిషయములను జ్ఞాపక ముంచుకొందు రని నమ్ము చున్నాఁడను.

కే. వి. లక్ష్మణరావు.

శ్రీరస్తు.

# జక్కనవిక్రమార్కచరిత్ర విషయానుక్రమణిక

## ప్రవేశకము.

అనుక్రమణిక లార్యులకు నూతనములు గావు. వేదాదిపూర్వగ్రంథముల కనుక్రమణిక లున్నవిషయ మెల్ల రెఱింగినదియే.

నేను గాలేజిలోఁ జదువుచుండినపుడు మాయుపాధ్యాయు లొక్కరు "జ్ఞాన మనఁగా నేమి" యనుప్రశ్నమునకు "గ్రంథములు నెందుగా నుండు నిక్కాలమున నేయేవిషయము లెచ్చటెచ్చట నుండునో దాని నెఱుంగుటయే జ్ఞాన" మని బదులు చెప్పుచుండెడివారు. దేశచరిత్రవిషయమును బూర్వనాగరకతాద్యంశములను గ్రంథములనుండి తెలిసికొనఁ బ్రయత్నించు ప్రతిజ్ఞానోత్సాహియు నీయనుక్రమణిక లనేకముఖ్యగ్రంథములకు లేవే యని చింతింపవలసి యున్నది. కావున నేపూర్వగ్రంథమునకైనను ననుక్రమణిక వ్రాసినవారు చదువరుల మెప్పును విశేషముగఁ గోరవలసినపని లేదు.

ఆంధ్రకావ్యములలోఁ జారిత్రికగ్రంథములు పెక్కులు లేవు. ప్రతికావ్యమును గొంతవఱకుఁ గవియొక్కచరిత్రమును గృతిభర్తయొక్కచరిత్రమును గొన్నిసందర్భములలో స్పష్టీకరించును. మఱికొన్నిసందర్భములలో సూచించును. ఈసూచనలవలన నెంతెంత యెఱుఁగనగునో దాని నంతను శ్రీయుతులు రావుబహదరు వీరేశలింగము పంతులుగారు, గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు, మదరాసు శాసనాధికారు లగురావుసాహెబ్ కృష్ణశాస్త్రిలుగారు, జయంతి రామయ్యపంతులుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారును నింక నితరమహాశయులును వెలిదీసి తమతమవ్యాసములలోను గ్రంథములలోను క్రోడీకరించి విమర్శించి యుపయోగించుచున్నారు. అట్లుండ నిపు డీయనుక్రమణిక వ్రాయుటలో నాముఖ్యోద్దేశ మెద్దియన "భారతవర్షచరిత్రములోఁ బున్నమనాఁటిరాత్రి యాకసమునఁ బూర్ణచంద్రుఁడువలె రాజిల్లు మహాశూరుఁడును, మహాతేజస్వియు, సుజ్ఞానమూర్తియు, ననుపమౌదా

ర్యాది సకలసద్గుణశాలియు, నగువిక్రమార్కునిగూర్చి దాదాపుగా నైదువం
దలయేండ్ల క్రిందట వెలసిన జక్కనమహాకవి యేయేకథల విని, చదివి నమ్మియుండె
నదియు, నాతనికాలపు దేశస్థితివిషయమై యీకవియొక్క యభిప్రాయములును,
నప్పటి నాగరికతనుగూర్చి యీతఁ డేమిచెప్పఁ గలిగినదియు నెఱుంగుటయే.

కథలను బుక్కిటిపురాణ మని, చరిత్రమునకుఁ బనికిరా వని త్రోసివే
యుట పాశ్చాత్యవిమర్శకులయొక్కయుఁ జారిత్రికాన్వేషకులయొక్కయు నుపా
ధ్యాయతవలన మనలోఁ గొందఱకుఁ జాల నలవడియున్నది. వాస్తవమే. కాలము
జరగు కొలఁదిని గథలు విరూపతఁ జెందును. సత్య మసత్య మగును. అయినను
మఱి వేఱాధారములును సూచనములును లేని సందర్భములలోఁ గథలను వివే
కముతో విమర్శించి యందలిసత్యమును గ్రహించుట న్యాయ్యము నుపయో
గము నగునది. శాసనములు దొరక లేదనుకారణమున నమ్మనలదని నిశ్చయించి
కొనినచోఁ బ్రతిదేశముయొక్కచరిత్రమందును మిగుల నుత్తమమై శూరభాస్వర
మైనభాగము తుంగలలోఁ ద్రొక్కవలసినదిగఁ గానఁబడును. ఇది యట్లుండ
లెక్క లేనికథలును, బారము లేనిభక్తిగౌరవములును, రూపముఁ దాల్చి జీవించి
యశముఁబొందని స్వప్నదృష్టపురుషులగుఱించి పుట్టుననుట యుక్తిసహము గాదు.
వారివిషయమున మనము కాలనిర్ణయము చేయలేకుండుటకుఁ గారణము సామగ్రీ
సంపత్తి లేకయుండుటయే కాని వారు పూర్వము లేకుండుట కాదు. కావునఁ దిథి
వారనక్షత్రయుక్తకాలముతో దొరకకున్నను గాలము నపారప్రాముఖ్యమువలనను
దైర్ఘ్యమువలనను దెలియకపోయినను గావ్యవిదితులైనట్టియుఁ గథాగతులై
నట్టియు మహాపురుషులయొక్కయు నట్టివారి మహాకార్యములయొక్కయు విష
యముల నిరసింపఁజాలము. ఈకారణమునఁ జరిత్రకారులు వీని నుపేక్షించినను
వానిస్మరణమున మగ్నమైనట్టిలోకము త్రోసివేయఁబోదు. ఐతిహ్యమును వివేక
ముతో విమర్శించి యెంతవఱ కంగీకరింపవచ్చునో యంతవఱ కంగీకరించి సం
దర్భసమర్థనము చేసి వ్రాసిననే చరిత్ర సత్యమైనదియు నుపయోగకారియును
నగును. పురుషులఁ గూర్చియే కాక యాదర్శములఁ గుఱించియు, నాచారములఁ
గూర్చియు, సంఘస్థితిఁగూర్చియుఁ జరిత్రకారులు వ్రాయఁ బ్రయత్నింపవలయును.
భగవత్స్వరూపు లగు శ్రీవివేకానందులు “భగవద్గీత నెవరు రచించిన నేమి ?
ఎప్పుడు రచించిన నేమి ? మహోన్నత మగుతత్త్వ మం దిమిడి యున్నది. దాని
నుపయోగించికొందము. విలువ లేనిలాభము నొందుదము.” అని యొకకాల

వాదికి బదులు చెప్పిరి, అట్లేమహాపురుషు లేదినమున జనించియుండిన నేమి? యే దినమున మృతినొందిన నేమి? సంఘము కాలమువలె నిష్పారమై గంగవలె నిరంతరమై ప్రవహించుచుండ దానిచరిత్రమును, దానిఁ జెందియుండిన భక్తిశ్రద్ధలును, స్మరణాచారములును, నిదర్శనములు గాని వారికాలములు తిథివారనక్షత్రములతో దొరకుట కాని దొరకకుంటగాని నిదర్శనములుగాని, స్థాపకములుగాని కావు.

చారిత్రికులారా! భగవద్గీత యెట్లు లోకసంగ్రహము నుద్దేశించి శ్రీకృష్ణునివలన ఘోషింపఁబడినదో యట్లే మనచరిత్రములును సం[illegible]గ్రహము నుద్దేశించి వ్రాయఁబడవలయును. అట్లు వ్రాయుటలోఁ జా[illegible]లయి నిష్పక్షపాతముగ విమర్శించి ముందు వెనుక లాలోచించి [illegible] ఏ? ఇట్టి ప్రయత్నముల కనుక్రమణిక లత్యావశ్యకములు.

సి. ఆర్. కృష్ణమాచా[illegible]

(అకారాద్యనుక్రమణిక ముందుపత్రికలలో వెలువడును—ప. అ.)

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ చిన్నమనుమఁడగు చెదలువాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁదగినది. వైజయంతీవిలాసముకంటె మిన్న. ౪ ఆశ్వాసములు. ౩౮ పుటలు. సవిమర్శమైన ౧౮ పుటలపీఠిక. వెల రు. ౧-౮-౦.

## (2) జైమినిభారతము (ఆంధ్రవచనము.)

రెండువం . సంవత్సరములక్రిందట మధురాపురాధీశ్వరుం డగు విజయరంగ చొక్కనాథుని యాస్థానకవి రాజసమందు నయిన సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకునిచే రచింపఁబడినది. [illegible] శైలి మనోహరము. ధార యనర్గళము. అందఱును ముఖ్యముగాఁ జదువ [illegible] ౨. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు. ౦-౧౨-౦.

సం॥ ఇంటరుమీడియేటుపరీక్షకుఁ బఠనీయగ్రంథము

## (3) క [illegible] శ్రయ[illegible]ు.

వేములవాడ భీమకవివిరచిత మగుఛందశ్శాస్త్రము. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో మిక్కిలి పురాతనము. అనేకలిఖితపుస్తక పరిశోధనపూర్వకముగా మూలపాఠము నిర్ణయింపఁబడినది. పాఠభేదములు పుటలయడుగునఁ జూపఁబడినవి. సంస్కృతకర్ణాటాంధ్రచ్ఛందస్సుల భేదాభేదము లచ్చటచ్చటఁ బ్రదర్శింపఁబడినవి. కవినిర్ణయము కాలనిర్ణయము, ఛందస్స్వరూపము మొదలగువిషయము లనేకములుగల విపులమయినపీఠికయు, విషయసూచికయు ననుక్రమణికయుఁ గలవు. విద్యార్థులకును బండితులకును గూడ నుపయోగకరము. వెల రు. ౦-౧౦-౦.

## (4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులు బి.ఏ., బి.ఎల్. గారిచే రచింపఁబడిన సవిమర్శ పీఠికాపూర్వకముగాఁ బ్రకటింపఁబడినది. ఈశాసన మాంధ్రపద్యాత్మకము. నన్నయభట్టారకుని కాలముకంటె ముందుఁ బుట్టినది. ఆంధ్రభాషాస్వరూపము తెలియఁగోరువారల కత్యంతోపయోగకరము. 1917-1918 సంవత్సరములు బి.ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. వెల రు. ౦-౮-౦.

## (5) నీతిసీసపద్యశతకము.

తాళ్లపాక పెదతిరుమలయ్య విరచితము. శ్రీవేంకటేశ్వరుల కంకితము. వెల రు. ౦-౨-౦.

## (6) జ్యోతిశ్శాస్త్రసారము.

వచనము. శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులు బి.ఏ. ఎల్.టీ. గారిచే రచింపఁబడినది. ఖగోళవిషయముఁ దెలిసికొనఁ గోరువారి కిది యత్యంతోపకారకము. వెల రు. ౦-౮-౦.

## (7) A Defence of Literary Telugu, by J. Ramayya Pantulu Guru. 0-8-0.

## (8) జ్ఞానప్రసూనాంబికాశతకము.

శ్రీకాళహస్తీశ్వరుని దేవియగు జ్ఞానప్రసూనాంబను స్తుతించుచు శిష్టు సర్వశాస్త్రి రచియించిన భక్తిరసప్రధానమైన పద్యశతకము. అనర్గళకవితాధార గలది. వెల రు. ౦-౨-౦.

# చంపూరామాయణము.

---

## ఋగ్వేదికవి వేంకటాచలపతికవిప్రణీతము.

భోజరాజకృతసంస్కృతరామాయణచంపువునకుఁ బ్రథమాంధ్రీకరణము. కార్వేటినగరసంస్థానమునం దుద్భవిల్లినది. ఇంతవఱకీ భాషాంతరగ్రంథము భోజచంపువునకు లేదు, కావునసే యన్ని విధముల ముఖ్యమైనది. కవితావైచిత్ర్యాతిశయ మీగ్రంథమందే కానవచ్చును. ఎనిమిది యాశ్వాసములు 148 పుటలు రాయలుసైజు, 16 పుటల పీఠిక. ఇంగ్లీషు క్యాలికో బైండు. ముద్రింపఁబడినవి స్వల్పప్రతులు అయినను వెల రు. 1 0-0 మాత్రమే భాషాభిమానులు శీఘ్రముగా నొక్కొక్కప్రతిని దెప్పించుకొనుట మంచిది

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

శ్రీనివాస వరదాచారి [illegible] ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 27 [illegible]
[illegible] ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రకటింపఁబడినది.